ANDHRA UNIVERSITY SERIES No 68

# ఆంధ్ర
# యక్షగాన వాఙ్మయ చరిత్ర

సర్ రఘుపతి వెంకటరత్నం
పరిశోధన పదకాంకితము


**డాక్టర్ యస్వీ జోగారావు**
ఎమ్. ఏ., పిహెచ్. డి.






ఆంధ్ర విశ్వకళా పరిషత్ప్రకాశితము
1961




[ వెల : రూ. ౧౦

ఈ గ్రంథము

రెండు భాగముల సంపుటి

ప్రథమ భాగము

# యక్షగానము

ఉత్పత్తి: విచారము : పరిణామ చరిత్ర

(పుటలు 1 – 371)

ద్వితీయ భాగము

# యక్షగాన

కవులు : కావ్యములు

(పుటలు 1 – 502)



ప్రథమ ముద్రణ
1000 ప్రతులు
మే, 1961

సరస్వతి పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము
ఆంధ్రప్రదేశ్

కృ తి భ ర్త



కీ. శే. డాక్టర్ శ్రీ వాసిరెడ్డి శ్రీకృష్ణగారు

# కృతి సమర్పణము

శ్రీకృష్ణార్పితమైన దీ కృతియు మా శ్రీనాథ క్రీడాభిరా
మా కల్యాణ కథాధ్వనీన కవితామ్నాయాంగనాకేకర
న్యాకూత ప్రియమై భళా బహుకళా భామాకలాపమ్ము నై
నా కష్టార్జిత మూర్జితం బయిన దీనాడీ నిధానప్రధన్.

చూచిన చూపులో రాచవాడి పసందు
        ఆర్ద్ర తేజస్విత సవసుశింప
పలికిన పలుకులో ప్రాడ్వివాక ప్రతి
        భార్జవ ప్రాగల్భ్య మచ్చుపడగ
నవ్విన నవ్వులో నవవసంత లతాంత
        సత్స్వాంత సౌరభాఢ్యములు దోప
తలచిన తలపులో సలుచు సరస్వతీ
        చతురాస్య దివ్యదీధితులు ప్రబల

ఆంధ్ర విశ్వవిద్యాలయోద్యాన శత స
సంత వాసరాయిత నకేశర దపార
వైభవ దశా బుభు ప్రభువై వెలుంగ
నెవ్వడా వాసిరెడ్డి శ్రీకృష్ణవిభుడు

కృతివిభుడు మదభ్యర్హిత గా
కృతివిధుడు మహామహుడు సుకృతి సూనృత సు
వ్రతు డలరుగాత! నేనును
కృతజ్ఞతాంజలి నిడి కృతకృత్యుడ నైతిన్.

కృతికర్త

## Foreword by the Chairman of the Adjudication Board.

డాక్టర్ పి. వి. రాజమన్నారు
కేంద్ర సంగీత నాటక పరిషదధ్యక్షులు
మదరాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి

బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమున యక్షగానమునకు ప్రశంసనీయమైన స్థానము గలదు. ఒకప్పుడు ఈ కళారూపమునకు గౌరవము కొంత లోపించినను ఇటీవల దాని విలువను పండితులు, రసికులు గ్రహించినారు నిస్సందేహముగ.

డాక్టర్ నేలటూరి వెంకట రమణయ్యగారు, శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు మొదలైన విద్వాంసులు యక్షగాన చరిత్ర-ఉత్పత్తి - లక్షణములు - అంగములను గురించి కృషిచేసినారనుటయే ఇందుకు తార్కాణము.

యక్షగానము సంగీతము - సాహిత్యము అను ఇద్దరు తల్లుల ముద్దులబిడ్డ. ప్రదర్శనమున నృత్యాలంకృత. యక్షగానములలో భావాశ్రయమైన ప్రౌఢ సాహిత్య రీతులు గలవు. మనోరంజకమైన ఛందోభేదము లున్నవి. రాగతాళయుతములైన గీతము లున్నవి. లయాన్వితమైన గద్యము గలదు.

"యావదాంధ్ర వాఙ్మయమునను బహుముఖ వైవిధ్యము వైశిష్ట్యమును గలిగి విశాల సాహిత్యశాఖగా విలసిల్లిన ప్రక్రియ యక్షగాన మొక్కటియే" అని నిరూపించుటకు శ్రీ జోగారావుగారు ఈ యుత్కృష్ట గ్రంథమును రచించినారు. ఇందుకు వీరు చేసిన కృషి

జరిపిన పరిశోధన, ప్రకటించిన ఉత్సాహము, సంపాదించిన పాండిత్యము, ఉపయోగించిన విమర్శకౌశలము అసమానము శ్లాఘనీయము.

ఈ గ్రంధరాజమును ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారి "పిహెచ్.డి" పట్ట పరీక్ష సందర్భమున చదువ గలిగితిని. నా ఉద్యోగ జీవితములో అప్పుడప్పుడు సరియైన తీర్పు చెప్పుట కష్టసాధ్యముగ కనిపించెడిది. కాని ఈ గ్రంధవిషయమున తీర్పు చెప్పుట అతి సులభమైనది.

యక్షగాన వాఙ్మయమునుగూర్చి ఇంత సమగ్రమైన పరిశోధన - ఇంత సక్రమమైన సమన్వయము - ఇంత విపులమైన విచారణ మరి యే గ్రంధమునను కానరాదు.

ఉత్పత్తి - చరిత్ర - పరిణామము - లక్షణములు - అంగములు - ఇవియవి అన నేల అన్ని అంశములును వర్ణింపబడి యున్నవి.

ప్రత్యేకముగా కొనియాడ దగినవి ఈ గ్రంథము నందలి అనుబంధములు. కేవలము ఆంధ్ర దేశమునందే గాక ఇతర దేశములలో యక్షగాన పరిణామ పరిశీలనము - లభ్యాలభ్య యక్షగానముల సూచిక - ఉపజీవ్య విమర్శక వ్యాస పరిచయము మొదలైనవి అనుబంధములలో చేర్చినారు.

ఇట్టి అమూల్యకృతిని ఆంధ్రమాతకు సమర్పించి ధన్యులైనారు డాక్టర్ యస్వీ జోగారావు గారు.

10 - 4 - 1961

*Introduction by the Director of Studies:*

ఆచార్య విద్వాన్ శ్రీ గంటి జోగిసోమయాజి
ఆంధ్ర శాఖాధ్యక్షులు
ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, వాల్తేరు

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ఆంధ్రుల భాగ్యవశమున అభివృద్ధినందిన విజ్ఞానిక వ్యవసాయ క్షేత్రము. ఈ మహాక్షేత్రమున ఆంధ్రభాషా వాఙ్మయశాఖ ఒకతోట. ఆ తోటలో నాటిన బీజము లనేకము లభివృద్ధినొంది వృక్షములై గ్రంథరూపమైన స్వాదుఫలములను విద్యార్థి శోధనోపయోగమైన సాంద్రచ్ఛాయలను కల్పించుచున్నవి. అట్టి రసాలములలో ప్రకృతవ్యాసకర్త యొకడు. ఈ తోటను ఇతర భాగములతోపాటు పెంచిన క్షేత్రప్రభువుల కోవలో ముమ్మారు లెక్కింపదగినవారు శ్రీ వాసిరెడ్డి శ్రీకృష్ణగారు. ఈ వ్యాసకర్త స్వశక్తివలన ఉత్పాదించిన విచారణ విషయ రూపములైన సుమములను స్వసిద్ధాంత ఫలములను శ్రీ వాసిరెడ్డి వారికి కృతిగా సమర్పించుట మిక్కిలి యుచితము.

ప్రకృత వ్యాసకర్త తెలుగుభాషను కేవల జీవనోపాధిగా మాత్రమేకాక స్వాభావికమైన ఆదరోత్సాహములచే పఠించి అందు ఉత్తమ గ్రంథరచనము సేయుట సంతోషపూర్వకమైన ధర్మముగా పరిగణించుట చేతనే యిది బయల్వెడలినది. ఆంధ్రవాఙ్మయ విషయమున పరిశోధకులు తమ స్వాభావిక ప్రతిభచే వెలయింప వలసిన ప్రదేశము లనేకము గలవు. అట్టివానిలో యక్షగాన శాఖ యొకటి. పైగా వ్యాకరణాద్యనేక శాస్త్రనిష్ణాతులయి గొప్పపండితులైన వారికి యక్షగాన సరణి యందాదరము నధికముగా లేదు. ఇట్టి సందర్భములో ఈతడు తన పిహెచ్. డి. పరీక్షకు పరిశోధన విషయముగా ఈ వాఙ్మయశాఖ నెన్నుకొనుట నా ప్రోద్బలమువలన జరిగినది. ఇందీతడు కృతకృత్యుడైనాడు. ఈగ్రంథము యక్షగాన విషయమున అన్నిభాగములను ఊచముట్టుగా పరిశోధించి, విమర్శించి యున్నది. ఆంధ్ర వాఙ్మయము నందలి అనేక శాఖలలోని స్వరూప స్వభావములను దనలో సంగ్రహించి సమన్వయ పఱచుకొన్నది యక్షగానము అను నీతని సిద్ధాంతము యక్షగానముయొక్క ఉత్తమత్వము ప్రస్ఫుటించుచున్నది. ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో 1957-58 సం॥లో సమర్పింపబడిన పిహెచ్. డి. థీసిస్సులలో ప్రథమబహుమతినంది సువర్ణపదకమును రచయితకు చేకూర్చిన యీవ్యాసము ప్రాశస్త్యము స్పష్టమగుచున్నది. ఇందలి పరిశ్రమనుగూర్చి పరీక్షాధికారులు వెలకట్టి మేల్తరముగా వాకొనియున్నారు గావున మాతోటలోనిపండ్లను మేము వర్ణించుకొనరాదని ఆవిషయమును విడిచివేయుచున్నాము.

తెలుగునుగూర్చి యిట్టి గ్రంథమును చిరంజీవి జోగారావు వ్రాయుట, దానిని విశ్వకళా పరిషత్తువారు ప్రచురించుట, విశ్వకళా పరిషత్తు అభివృద్ధియే తమ జీవితాదర్శముగా పని చేయుచున్న శ్రీకృష్ణగారికిది అంకితముచేయుట అను వీని సంపుటికంటె ఉచితతర రచన యుండదనుటలో అతిశయోక్తి లేదు.

6-9-1960



డాక్టర్ యస్వీ జోగారావు

# ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర

## ప్ర రో చ న

యక్షగానము బృహదాంధ్ర సారస్వత శాఖలలో నొకటి. మన వాఙ్మయ వ్యక్తిత్వమును నిరూపించు నట్టి ప్రక్రియ అది. దాని నామోత్పత్తియే చిత్రమైనది. మఱియుఁ జిత్రమైనది దాని పరిణామ చరిత్ర. విపుల కాలావధిలో నొక విశిష్ట వాఙ్మయ ప్రక్రియ యెన్ని వాలకములు వేయఁగలదో అన్ని వాలకములును వేసినది యక్షగానము. ఒక్క యాంధ్ర దేశముననే కాక ఇటు తెలంగాణములో, అటు తమిళనాడు నడిబొడ్డగు తంజావూరు ప్రాంతమున, కన్నడ దేశపు టొడికట్టగు మైసూరు ప్రాంతమునను జారిత్రకాది కారణములచే దెలుఁగు భాష వ్యవహరింపఁబడిన పలుతావుల నాయా భాషలలోనే కాక తెలుఁగునను వెలసినవి యక్షగానము లనేకము.

తెనుఁగున యక్షగానము లిప్పుడైదువందలకుఁ బైఁగా లభించుచున్నవి. అందముద్రితములు, తాళపత్ర కాళరాత్రి గడువక అసూర్యంపశ్యలై కీటకవిటాధముల దంతక్షతముల కగ్గమై పడియున్న వాని పాలే యధికము. అవియు నొక్కచో లేవు. దూరదూర ప్రదేశములందు నెలకొనియున్న వివిధ గ్రంథాలయములలో విప్రకీర్ణముగ నున్నవి తంజావూరు సరస్వతీ మహాలు, ఆంధ్ర విశ్వకళా పరిషద్గ్రంథాలయము (ఇందు తం. స. మ. తెలుఁగు గ్రంథముల ప్రతికలు గలవు), మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము, కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు, అడయారు దివ్యజ్ఞాన సమాజ గ్రంథాలయము, తిరుపతి వేంకటేశ్వర ప్రాచ్యభాషా పరిశోధనాలయము, రాజమండ్రి ఆంధ్రేతిహాస పరిశోధకమండలి గ్రంథాలయములందముద్రిత యక్షగానములు గలవు. ముద్రితములం దిటీవలి వనఁగా 19 వ శతాబ్ది ఉత్తరార్ధము,

20 వ శతాబ్ది పూర్వార్ధము నందును వెలసినవే యెక్కువ. అవియైన వట్టి గుజిలీప్రతులు, దేశమంతయు దేవినఁగాని యొక్కచో లభించునవి కావు. ఆయూర నాయూర బాట ప్రక్కల నాపూటకు ఠికాణాలేని దుకాణములలో నప్పు డప్పుడు కొన్ని కంటఁబడుచుండును. కొన్ని మదరాసు 'రిజిష్ట్రారు ఆఫ్ బుక్సు' వారి కార్యాలయము నందును, రాజమండ్రి గౌతమీ గ్రంథాలయము, బాలభక్తపుస్తక భాండాగారము మొదలగు గ్రంథాలయములందును భద్రపఱుపఁబడి యున్నవి. ముద్రితాముద్రితములు గొన్ని శ్రీయుతులు డా. నేలటూరి వెంకటరమణయ్యగారు, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు, నేదునూరి గంగాధరంగారు, డా. శ్రీపాద గోపాల కృష్ణమూర్తిగారు, పందిరి మల్లికార్జునరావుగారు మొదలగువారిచే సేకరింపఁబడినవి. నేను నెట్టెటో ముద్రిత యక్షగానములు రమారమి రెండువందలు సంపాదింపఁగల్గితిని. గ్రంథాలయములకుఁ జేరని అముద్రిత గ్రంథములను గొన్నిటిని సేకరించి ప్రతులు తయారు చేయించుకొంటిని. కడమవి - పైఁ బేర్కొనఁబడిన గ్రంథాలయములకుఁబోయి తత్తదధికారుల యనుగ్రహమునఁ జదువుకొనఁగల్గితిని. పేర్కొనఁబడిన పెద్దలు తమ కడఁగల గ్రంథములను దయతోఁ జదువ నొసంగిరి. వారెల్లరకుఁ గృతజ్ఞుఁడను. ఇట్లు విషయ సేకరణ బహుళ వ్యయము, దీర్ఘకాల ప్రయాసములతోఁ గూడిన దైనను నా కా కష్టము గన్పడకుండఁ దగిన గడువు, పరిశోధన వేతనము ననుగ్రహించిన ఆంధ్ర విశ్వకళా పరిషదధికారులకును, భారత కేంద్ర ప్రభుత్వము వారికిని మిక్కిలి కృతజ్ఞుఁడను.

నన్నీ యమూల్య విషయముపైఁ బరిశోధన మొనర్పఁ బ్రోత్సహించి, తమ బహుముఖ వైదుష్యముతో నాకీ యుద్యమమున బాసటయై నిల్చి నన్నొక వాఙ్మయ పరిశోధకునిగాఁ దీర్చిదిద్దిన మత్పరిశోధన పర్యవేక్షకులు, మద్గురుదేవులు, ఆంధ్ర విశ్వకళా పరిషదాంధ్ర

భాషాశాఖాధ్యక్షుల్యులునైన 'భాషాచరిత్రచతురానన' ఆచార్య విద్వాన్ శ్రీ గంటి జోగిసోమయాజిగారికి నా కృతజ్ఞతా పురస్సర ప్రాంజలి.

ఈ యక్షగాన వాఙ్మయము గూర్చి యింతవఱకు సక్రమమైన సమగ్రమైన పరిశోధన జరిగియుండలేదు. నిన్న మొన్నటి దనుక యక్షగానము నెడ మన పండితుల కంత యాదర భావముండెడిది కాదు. ఇంత దనుక మన కవిచరిత్రకారులును యక్షగాన కవుల నుపేక్షిం చుచు వచ్చిరి. ప్రాచీన యక్షగానము లెన్నియో అముద్రితములుగ వివిధ గ్రంథాలయము లందు విప్రకీర్ణముగ నుండుటయు నందులకుఁ గారణమై యుండును. కాని యిటీవలనే శ్రీయుతులు పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు, కళాప్రపూర్ణ జయంతి రామయ్యపంతులు గారు అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరులు, వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, డా. గిడుగు వెంకటసీతాపతిగారు, మల్లంపల్లి సోమశేఖర శర్మగారు, చింతా దీక్షితులుగారు, ఆచార్య కోరాడ రామకృష్ణయ్య గారు, ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారు, డా. నేలటూరి వెంకట రమణయ్యగారు, ఆచార్య గంటి జోగిసోమయాజిగారు, ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు, డా. కె. వి. ఆర్. నరసింహముగారు, ఆచార్య రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు, ఆచార్య విస్సా అప్పారావు గారు, సురవరం ప్రతాపరెడ్డిగారు, డా. శ్రీపాద గోపాలకృష్ణ మూర్తి గారు, కొమ్మనమంచి జోగయ్యశర్మగారు, ముట్నూరి సంగమేశంగారు మొదలగు పెద్ద పెద్ద సుప్రసిద్ధ పండితులు యక్షగానము విలువ గుర్తించి లోకమున కెలుగెత్తి చాటినారు. అందు కొందఱు పెద్దలు (వేటూరి, జయంతి, మల్లంపల్లి, నేలటూరి, గంటివారు) యక్షగానములను బరిష్కరించి చక్కని పీఠికలతోఁ బ్రకటింపఁ బూని నారు. ఆ యా పెద్దల సలహాలును వ్రాఁతలే నా యీ పరిశోధన

కుదో్ద్బోధకములు నుపజీవ్యములు నైనవి. వా రెల్లరకు నా కృతజ్ఞతా ప్రణిపత్తి.

యక్షగాన వాఙ్మయ సర్వస్వము తయారుచేయవలె నను ప్రూని కతోఁ బనిచేసి తగిన సామగ్రిని పదిలపఱచికొంటిని. ఒక్కొక్క యక్షగానమునకు వివిధ గ్రంథాలయములందుఁగల ప్రత్యంతరములను గూడఁ బరిశీలించి యుంటిని. పత్రికా ముఖమున యక్షగానముల గుఱించి యనేక వ్యాసములను బ్రకటించితిని. య. గా. లలోని సంగీతము, భాష, హాస్యము, లోకరీతి, కవితారీతులు మొ॥ విషయముల గుఱించి ప్రత్యేకము గ్రంథములు వ్రాయవచ్చును. కాని ప్రకృత మిది యొక ప్రత్యేకప్రయోజనమునకుఁ బరిమితమైన గ్రంథమగుట చేతను, నిప్పటికే గ్రహించిన విషయము స్వభావమునుబట్టి గ్రంథము పెరిగిపోయినందునను నన్ని విషయములు నిందుఁ జేర్చుట కవకాశము లేకపోయినది; అయితే ముఖ్యవిషయ మెద్దియు విడువఁబడలేదు.

1952 లో పరిశోధన ప్రారంభించి ఈగ్రంథమును 1956 లో ఆంధ్రవిశ్వకళా పరిషత్తువారికి పిహెచ్. డి. పట్టపరీక్షార్థము 'థేసిస్' గా సమర్పించితిని. 1957 లో పట్టభద్రుడ నైతిని. అది 1957-58 సం॥ మా విశ్వకళా పరిషత్తు పిహెచ్. డి. థేసిస్సులలో ఉత్తమమైనదిగా నిర్ణయింపబడి సర్ రఘుపతి వెంకటరత్నం రిసెర్చి మెడల్ బహుమానమును పొందినది. అంతకుముందే డిగ్రీవచ్చినంతనే అది విశ్వకళా పరిషదధికారులచే ప్రచురణకై ఆమోదింపబడినది.* యూనివర్సిటీ గ్రాంట్సు కమిషన్‌వారు కొంత ధనమును విరాళముగా నొసంగిరి.

* ఈ సందర్భమున చెప్పదగిన దొక మాట గలదు. ఆంధ్రవిశ్వకళా పరిషత్తువారు తంజావూరు సరస్వతీమహాలు యక్షగాన సంచయములో గొన్నిటినేరి యిప్పటికి నైదు సంపుటములుగా ప్రకటించి యుండుట ముదావహమైన విషయము. పరిష్కర్త ఆచార్య శ్రీ సోమయాజి.

అది ఆ యుభయుల దయవలననే ఇంతలో నిట్లు రూపుగైకొన్నది. ఉదారులైన మా విశ్వకళా పరిషదధికారులకును, యు. జి. సి. వారికిని సర్వదా కృతజ్ఞుడను.

నా థేసిస్సు యొక్క పరీక్షకప్రవరలో ముగ్గురికి ముగ్గురును సమస్కంధులైన సాహిత్య సత్యవ్రతులు. బహువిషయనిష్ణాతులు ఉత్తమాధికారులు. ముగ్గురును నా పరిశోధన విషయము యక్షగానము నెడ విశేషాదరముగల వారగుట విశేషము. అందున గౌ. ప్రధాన న్యాయమూర్తి డాక్టర్ శ్రీ పి. వి. రాజమన్నారుగారు నాథేసిస్సునకు గూడ ప్రధాన న్యాయమూర్తి యగుట నాఅదృష్టము. ప్రౌఢసాహిత్య ప్రాడ్వివాక ప్రవరు లాయన. వారి తీర్పులు నిపుణములు, నిష్పాక్షికములు. చరిత్రచతురాస్యులు డా. నేలటూరి వెంకటరమణయ్యగారు యక్షగాన పరిశోధనకొక క్రమసమిద్ధ పద్ధతి ప్రతీకమగు మార్గమును జూపిన మహానుభావుడు* గురుకల్పులు, పుంభావసరస్వతులు శ్రీ అనంతకృష్ణశర్మగారు గీతిసాహితీ సమాహిత మహితస్వాంతులు. యక్షగాన మా ఉభయకళాభ్యుదయ విలసితము. ఆ మహనీయులు మువ్వురికిని నా సాధువాదములు.

ప్రముఖ విద్యావేత్తలు, విజ్ఞానమూర్తులు, నిత్యము పరిశోధనాభినివిష్టహృదయులు, ఆంధ్రభాషాభినులు, మదభివృద్ధి మార్గదర్శకులు, పరిషదభ్యుదయమే పరమధ్యేయముగా అచిరకాలమున అపూర్వము, అపారమునైన అభ్యున్నతి సాధించిన మహోదయులు ఆంధ్రవిశ్వకళాపరిషదుపాధ్యక్షులు నైన ఆచార్యశిరోమణి డాక్టర్

* వారు, మరికొందరు పండితులును అనాంధ్రపాఠకుల నిమిత్తము ఈ థేసిస్ ప్రథమభాగము నాంగ్లములోని కనువదించిన బాగుగనుండునని సలహా ఇచ్చినారు. కృతజ్ఞుడను. అటులనే చేయుదును.

శ్రీ వాసిరెడ్డి శ్రీకృష్ణ, B.A. (Oxon.), Ph.D., (Vienna) గారు కృతిపతు లగుట నా సుకృత విశేషము. ఆ సుకృతి కీకృతి కృతజ్ఞతా పురస్కారపురస్సరముగా అంకిత మొనర్చితిని.

దయతో దీనికి తొలిపలుకు వ్రాసియిచ్చిన శ్రీ రాజమన్నారు గారికి, పరిచయ పుణ్యాహవాచనముచేసిన శ్రీసోమయాజిగారికి, అభిప్రాయములు దయచేసిన శ్రీ అనంతకష్ణశర్మగారికి, శ్రీ వెంకట రమణయ్యగారికి, శ్రీ సోమశేఖరశర్మగారికి, శ్రీ నరసింహముగారికి

ఏతాదృగ్గ్రంథ నిర్మాణమునకు వలయునట్లు నాలో సాహిత్యాభిరుచియు, లాక్షణికదృష్టియు పెంపొందుటకు నా విద్యార్థిదశ వివిధావస్థలందు దోహదము చేసిన నా గురు పరంపర సర్వశ్రీ శిష్టా కలియుగము, శిష్టా సాంబశివరావు, కొడుకుల నరసింహము, వడ్లమాని సుబ్రహ్మణ్య ఘనపాఠి, కర్రి కామేశము, రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రి, అంగర సోమశేఖరరావు, ధవళ నారాయణరావు, ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులు, కాకర్ల వెంకట రామ నరిసింహము, దువ్వూరి వెంకటరమణశాస్త్రి, గంటి జోగిసోమయాజి మహోదయులకు

నాలోని రూపక కళాపిపాస కూపిరిపోసి దాని కుపాసనా రూపమిచ్చిన సుగృహీత నామధేయులు, సుప్రసిద్ధాంధ్రరంగస్థల నాటక ప్రయోక్త, సంగీతనాటక కళాదర్శప్రియంభావుకులు నగు శ్రీకూర్మా వేణుగోపాలస్వామిగారికి

మదభివృద్ధి మార్గదర్శకులు మహాభాగులు డా. కె. రంగ ధామరావు, డా. సి. మహాదేవన్ ఆచార్యవర్యులకు

ఆంధ్రసాహిత్య పరిషత్తునందును, ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందును పరిశోధనకాలమున నాకు శీఘ్రగ్రంథ

ప్రదానాదికమున తోడ్పడిన పండిత మిత్రులు శ్రీవఙ్కిపర్తి చలపతిరావు శ్రీమల్లంపల్లి శరభయ్యగారలకు

పరిశోధన గ్రంథములను ప్రచురించుటలోఁగల ప్రయాసమును గణింపక ఈ గ్రంథము నింత సుందరముగా ముద్రించిన సరస్వతీ పవర్ ప్రెస్ అధినేతలు సౌజన్యమూర్తి శ్రీ అడ్డేపల్లి నాగేశ్వరరావుగారికి, వారి పరివారమునకును

## నా న మ స్సు మ న స్సు లు

నా కడ వాఙ్మయ పరిశోధనవ్యాసంగము చేయుచున్న కోవిద కోరకములు రావూరి ప్రసన్న సత్యనారాయణ, బి. ఏ. (ఆనర్సు), పి. వి. రమణ, బి. ఏ. (ఆనర్సు) నాకీ గ్రంథ ముద్రణావసరమున సాయపడియున్నా రని తెలుపుటకు సంతసించుచున్నాను. వారికి నా మంగళాశాసనములు.

## గ్రం థ ర చ నా ప్ర ణా ళి క

ఇది రెండు భాగములు. రెండు భాగములు నీ సంపుటమునందే కలవు. (ప్ర. భా., పుటలు 1—371) ; ద్వి. భా. పుటలు 1—'02) ప్రథమ భాగమున యక్షగానోత్పత్తి విచారము, తత్పరిణామ చరిత్రమును వివరింపఁబడినవి. యక్షగానోత్పత్తివిషయమున సర్వపూర్వవాదములును సమీక్షింపఁబడినవి. ఈనాఁ డుపలభ్యమానమగు నాధార సామగ్రిని సందర్భోచితముగా సమన్వయించుటకుఁ బ్రయత్నము చేసితిని. పరిణామచరిత్ర ప్రకరణమున నుపలబ్ధమైన గ్రంథజాలములోఁ గాలము నూహించుట కనుగలవైన వాని పాతేటి దానిని బట్టి కాలక్రమమున

వివిధ ప్రదేశములలో యక్షగాన రచనా ప్రక్రియలో, ప్రయోగ ప్రక్రియలో నెట్టెట్టి మార్పులు వచ్చినవో ప్రత్యేకముగా సోదాహరణముగా నిరూపించుటకుఁ బ్రయత్నించితిని. ఈప్రకరణముననే యక్షగానపుఁ బరగతులు, లక్షణము, వైశిష్ట్యము, అనుబంధముగా య. గా. ఛందస్సులు, వివిధగేయ రచనలు, య. గా. శబ్దజాలము, సామెతలు మొదలగు ననేక విషయములఁ గూర్చిన సమీక్షయు, లక్ష్యములును గలవు. ద్వితీయ భాగమున ఆంధ్రదేశము, దక్షిణదేశము, * తెలంగాణము లందు వెలసిన యక్షగానములను బ్రత్యేకముగాఁ బ్రాదేశికముగా విభాగించి (యక్షగాన పరిణామ మొక్కొకచో నొక్కొక తీరున సాగినది. కనుక నీ విభాగమవసరము)† కవులపేర సాధ్యమైనంతవట్టు కాలక్రమానుసారముగా వింగడించితిని. (యక్షగాన పరిణామ క్రమమెఱుఁగుటకీ వింగడింపు మిక్కిలి యావశ్యకము). ఇందు యక్షగాన కవులచరిత్ర కావ్యసమీక్షయు సంగ్రహముగాఁ గలవు. ఈప్రకరణ రచనలో, గ్రంథాంతరముల నుండి విషయము గ్రహింపఁబడిన పట్టులనెల్ల నాకర సూచనలు గలవు. ఆకరసూచనలేని పట్లగల విషయము వక్ష్యమాణ గ్రంథస్థమైనదే. యక్షగాన కవుల కాలనిర్ణయ మొకటి పష్టాష్టకమైనది. నాకుపలబ్ధములగు నాధారములనెల్ల యథాశక్తి నుపయోగించితిని. కొన్ని యక్షగానముల కాలనిర్ణయ విషయమునఁ బ్రతివిలేఖన కాలము వినా గత్యంతరము లేకపోయినది. సంవత్సర మాసపక్ష తిథి వారములెల్లఁ

---

* మైసూరు మనకుఁ బశ్చిమమున నున్నను బ్రకరణ సౌలభ్యము కొఱకచటి య. గా. లను దక్షిణాంధ్ర య. గా. ప్రకరణమునఁ జేర్చియుంటిని. అది కాక మైసూరు య. గా. లపై తంజావూరి య. గా. ల ప్రభావము గలదు.

† ఈవిభాగమున నేవైనఁ బొరపొచ్చెము లుండవచ్చును. క్షంతవ్యుడను.

బేర్కొనఁబడిన ప్రతివిలేఖన కాలములను మాత్రము 'ఇండియన్ ఎఫి మెరసు'తో సంప్రతించి మన షష్టివత్సర చక్రనేమిక్రమమును దృష్టిలోఁ బెట్టుకొని యావృత్తులను బరిశీలింపఁగా నన్నియుఁ గుదిరిన క్రీస్తుశకపు తేదీ లేవో పేర్కొనఁబడినవి. (ఇందు సర్వత్ర క్రీస్తు శకమే పాటింప బడినది. శకాంతర ముద్దిష్టమైనచోట మాత్రము తత్సూచనయుండును). ఇట్లు కుదిరిన తేదీలవలనఁ గృతి రచనా కాలముయొక్క యుత్తరపు టవధి మాత్రమే తెలియనగును. అట్టిచోఁ గాలము రూఢిగాఁ దేలిన యక్షగానముల రచనా ప్రక్రియ దృష్టిలోనుంచుకొనఁబడి తేలని వాని కాలము గూర్చి వీలగు సూచన జేయఁబడినది. ఏవిధముగను గాలము, నొక్కొకచోఁ గర్తృత్వము నూహింప నలవి కాని యక్షగానములు అకారాది క్రమమున మాత్రము సమీక్షింపఁ బడినవి. కావ్యసమీక్ష అతిసంగ్రహముగా, రచనాప్రక్రియ మాత్రమే ముఖ్యోద్దేశముగాఁ జేయబడినది. గ్రంథవిస్తరభీతి నుదాహరణము లుజ్జగింపఁబడినవి. (కర్తృత్వకాలాదిక నిర్ణయముల కుపకరించినచోఁ దక్క). ఒకదాని రచనను బ్రశంసించుచు నొక యుదాహరణమిచ్చి వేరొక దానికి మానుట యొప్పదు. ప్రతి కృతికి నుదాహరణ మిచ్చుట యవసరమే కాని యట్లు చేసిన నిప్పటికే పెరిగిపోయిన గ్రంథ మిమ్మడిల్లును.

ఈ ద్వితీయ భాగాంతమున నేను బ్రకటించిన యక్షగాన విషయ సంబంధి వ్యాసములు, అలబ్ధ యక్షగానములు, ఈగ్రంథమున వాడఁ బడిన సంకేతములు, ఉపజీవ్య గ్రంథములు, వ్యాసములు, అకారాది క్రమ య. గా. కవినామ గ్రంథనామ సూచికలు మొదలగు విషయ ములను గూర్చిన పట్టిక లనుబంధములుగా నీయఁబడినవి.

(iii)

ఈ గ్రంథమునం బ్రసక్తి గల్గిన యక్షగాన కవులయు, కృతులయు సంఖ్యా వివరము :—

| | |
|---|---|
| ఆంధ్రప్రాంత కవులు : | 174+3 |
| దక్షిణదేశ కవులు : | 36 |
| తెలంగాణ కవులు : | 47 |
| | 260 |
| పరిశిష్టము వారు | 65 |
| అనుబంధముల వారు | 140 |
| | 465 |

| | |
|---|---|
| లబ్ధగ్రంథములు : | 542 |
| అలభ్యములు : | 260 |
| | 802 |

అందు :—

| | |
|---|---|
| పారిజాతములు : | 19 |
| భామకలాపములు : | 28 |
| గొల్లకలాపములు : | 14 |
| కొరవంజులు : | 21 |

యక్షగానమున కంతో యింతో సంబంధించిన విషయము గల గ్రంథములను, వ్యాసములను అనేకము పరిశీలించితిని. వానినుండి విషయము గ్రహింపఁ బడిన చోటుల నాకరము లధోజ్ఞాపికలలోనో ప్రక్కనే కుండలింపులలోనో ఉటంకింపబడినవి. ఆ ఉపజీవ్య గ్రంథ వ్యాసకర్త లందఱికి వందనములు.

లబ్ధమైన సామగ్రి నుండి క్రొత్తగాఁ గొన్నికొన్ని యూహాలు, నుపపాదనములును జేసియుంటిని. అవి ఖరాఖండీ నిర్ణయములు గావు. భావి పరిశోధకులకు మార్గదర్శకములు కాఁగలవను నాశకు భాజనము లని మాత్రము మనవి.

ఈ గ్రంథ రచనలో సౌలభ్యము కొఱకు అయితే, అంటే మొదలగు కొలఁది యలాక్షణిక ప్రయోగములను, అసలు తయారు బాణీ మొదలగు నన్యదేశ్య పదప్రయోగములను, అటనట విస్పష్టత కొఱకు విసంధులనుజేసి యుంటిని.

దోసగులు పొసఁగిన హసింతురుగాక పురోభాగులు
మన్నింతురుగాక మహాభాగులు !

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు
తెలుగుశాఖ – వాల్తేరు
2-10-1960

యస్వీ జోగారావు

# ఆంధ్ర
# యక్షగాన వాఙ్మయ చరిత్ర

## ప్రథమ భాగము

యక్షగానము

ఉత్పత్తి విచారము — పరిణామ చరిత్ర

రచన

డాక్టర్ యస్వీ జోగారావు

# విషయసూచిక

## ఉత్పత్తివిచారము

## ప రి ణా మ చ రి త్ర

# అనుబంధము

(ద్వితీయ భాగము విషయసూచిక)

---

# యక్షగానము

## ఉత్పత్తి విచారము

### ప్రస్తావన

నిచ్చలు పచ్చి బాలెంతరాలగు ప్రకృతి సవిత్రికి స్తనంధయుఁడైన ప్రాక్తన మానవుఁడా మాతృ హృదయ మాధుర్యము చూఱఁగొని కొట్టిన కేరింతయే మానవ జాతి గానకళాభ్యుపాసన శుషస్సంకల్పమైనది. తన కంఠము నుండి వెడలిన మధుర స్వరము లేవో తన కర్ణపుటములనే పడి మఱలఁ దనలోనే ప్రవేశించి మాఱెలుఁగిచ్చినట్లు దన నాడీతంత్రులలోఁ గలిగించిన కదలికయే యతని కరచరణముల నుండి బహిర్గమించి నృత్య కళా సరస్వతి కేటికోళ్ళెత్తినది. ఆటపాటల నప్పుడే ప్రవీణుఁడై నిరంతర వర్ధమానుఁ డగుచుండిన మానవుని యనుకరణ ప్రవణ శీలము, నందులో నంతర్భూతమై యున్న సృజన కళా కౌతూహలము బొమ్మలాటకు నాటక కళకును బురుడు వోసినవి. అతని సంతానమే ప్రపంచమున వివిధ ప్రదేశములలో శాఖోపశాఖలై విభిన్న కళాభిరుచులతో విరాజిల్లుచు వచ్చినది. ఒక్కొక జాతి యొక్క భాష సాహిత్య స్థితికి వచ్చిన తరువాత నందుఁ గొంతకాలమున కా యా జాతి యొక్క నిసర్గ గీతాభినయ కళాభిమాన ప్రత్యేకతలకును గాణాచియైన కావ్యజాలము వెలయఁ గలదు. జావా దేశము నందలి వాయంగ్ వోంగులు, జపానీయుల 'నో' రూపకములు, బర్మాదేశపు 'యాగన్', 'హానా', సింహళ దేశీయుల 'కోలమ్ నాటిమా', టిబెట్ ప్రభృతి దేశముల మిస్టరీలు, మన దేశమందలి యాత్రలు (బెంగాలు), కథకళి (మలయాళము), గంధర్వగానము, (నేపాలు) గంధర్వనృత్యము (మార్వారు),

యక్షగానము (ఆంధ్ర కర్ణాట తమిళ ప్రాంతములు) మొదలగునవి యట్లు వెలసినవే. ఒక్కొక దాని యుత్పత్తి కొక్కొక కారణముండ వచ్చును. కాని యన్నిటం దత్త్వతః ఏదో సమీచీనమైన సమానత గోచరించును. అది మానవ స్వభావ నిసర్గ మధురము లగు నభిరుచులను దత్తజ్జాతీయాశయములను సంప్రదాయములననుగల భావ బాంధవ్యము. కొన్ని కొన్నిట వస్తువులో, రచనా ప్రక్రియలో, ప్రదర్శన సంప్రదాయములలోఁగూడఁగొంత కొంత సామ్యము గోచరించిన గోచరింప వచ్చును. భిన్న దేశము లందు భిన్న కాలోత్పన్నము లైన కళా స్వరూపములందు సామ్యమున్న దనఁగా నది మానవ స్వభావము లోనే యున్న సమానతా ప్రతిపత్తియే గాని వేఱు కాదు. ఆ సమానతా ప్రతిపత్తినిబట్టి యా యా భిన్న దేశ కళా ప్రక్రియల కన్నిటికినిఁ బరస్పరానుకరణసంబంధము నూహించుట సమంజసము గాదు. ఏనాఁడో కొన్నిటి కట్టి సంబంధ మేర్పడి యుండినను నీనాఁడు నిజము నిక్కచ్చిగా నిరూపించుట కష్ట సాధ్యము.

ఆంధ్రతా ముద్రను భద్ర పఱచిన మన దేశి సాహిత్య ప్రక్రియలకెల్లఁ దల మానికము యక్ష గానము. అది ప్రాదుర్భవమున నేదో సాధారణ మత బీజక వినోద కాలక్షేపమై యుండిన దేమో కాని రానురానొక ప్రత్యేక సాహిత్య శాఖగా వర్ధిల్లుచు వచ్చినది. అట్లని యది వట్టి సాహిత్య ప్రక్రియ మాత్రమ కాదు. సంగీతాభినయ కళలకునుఁదానకమై దేశి సంస్కృతి కోశమై పరిఢవిల్లినది. యక్షగాన గ్రంథము లాంధ్రమునఁబరశ్శతముగ వెలసినవి. కధకళి కళా ప్రతిష్ఠలు గల మలయాళరాష్ట్రము వినా యావద్దక్షిణ భారత దేశ వ్యాప్తమైన కళాస్వరూపము యక్షగాన మని చెప్పనొప్పును.

---

# యక్షులు - గానము

ఆంధ్ర జాతీయ రూపక ప్రక్రియగా రూపొందిన యక్షగాన మున కా పేరెట్లు వచ్చినదో విచార్యము. యక్షగాన మనఁగా యక్షుల యొక్క పాట యని సామాన్యార్థము. మఱి యాంధ్రులకు యక్షులకు నేమి సంబంధమో దురూహము. ఈ నాఁడు మన కుప లబ్ధములగు యక్షగానములలోఁ బ్రాచీన కృతులందుఁ గూడ యక్ష గాథలు గాని, యక్ష పాత్రలు గాని, యక్ష స్తోత్రములు గాని, మఱి యెవ్విధమైన యక్ష సంబంధములు గాని కానరావు. కాని ప్రత్యక్ష ముగా యక్షులతోఁ గాకున్నను యక్షశబ్దవాచ్యులగు నెవరితో నైన నేనాఁడో ప్రగాఢమైన సంబంధ మేదో యుండి యుండకున్నచో నాపేరు పుట్టుట కవకాశమే యేర్పడి యుండదు. అది యే నాఁటి యక్ష గానమో యీ నాఁడు దాని యుత్పత్తి విచారణ కూహాగానమే శరణ్య మగుచున్నది. యక్షులగుఱించి ప్రాచీన హైందవ బౌద్ధ జైన సారస్వతములలో విషయము సమృద్ధిగాఁ గలదు.[1] యక్ష శబ్దము మొట్ట మొదటగా నొక విచిత్ర వస్తువను నర్థమున జైమినీయ బ్రాహ్మణమునఁ (III. 203—272) గన్పట్టుచున్నది. గృహ్య సూత్ర ములకు ముందు యక్షుల కొక విశిష్టమైన జాతీయతా ప్రతిపత్తి గాన రాదు. గృహ్య సూత్రములలో భూతాదులతో పాటు యక్షావాహ నము గూఁడ గాననగును. మానవ గృహ్యసూత్రమునందు (II–4) వారురోగ గ్రహావేశ శక్తులుగాఁ బేర్కొనఁబడిరి. శాంఖా యన గృహ్య సూత్రము నందు యక్షాధిపులలో నొక్కఁడగు మాణి భద్రుఁడు పేర్కొనఁ బడెను. బౌద్ధ సారస్వతమున "యక్షులు"

1. Vide., (a) 'The Yakshas' - Parts 1 & 2 By Dr. A. Coomaraswamy. (b) 'Yaksha worship in Early Jaina Literature'- By Dr. U. (P. Shah. J. O. I., M. S., University, Baroda, Vol. III-No.1)

(యక్షులు) నీతి ప్రవర్తకులుగను, రక్షక శక్తులుగను పేర్కొనఁబడిరి. (చూ. థేరాథేరి గాథ XIV). బౌద్ధశిల్పములను బరిశీలించి చూచినచో వానిలో యక్ష యక్షిణీద్వారపాలక ప్రతిమలు గాన నగును. వారికి నాగ గంధర్వ కిన్నరాదులతోడను సంబంధము గాన నగును. డాక్టరు ఆనంద కుమారస్వామిగారు సేకరించిన యాధారముల ప్రకారము వారు కామరూపులును, దయాళువులును, రక్షణచణులైన రణ శూరులు ననియుఁ దెలియు చున్నది. మోనియర్ విలియమ్సు తన సంస్కృతాంగ్ల నిఘంటువులో ఋగథర్వ వేద వాజసనేయ సంహి తాదుల యాధారమును బట్టి 'యక్షుఁ డనఁగా నప్రాకృత జీవి యనియు, భూతప్రేత పిశాచాదిగణములోఁ జేరు వాఁ డనియు నర్థము లిచ్చెను. మఱియు నితరాధారములను బట్టి కుబేరాను యాయులును బులస్త్య పులహ కశ్యపాది బ్రహ్మ పుత్రులును సదసచ్ఛక్తి సంపన్నులు నని యనేకార్థములను జూపి యుండెను. వాల్మీకి రామాయణమున (3. 11-94) యక్షత్వ మనునది యమరత్వముతో పాటొక దివ్య వరప్రసాదము వంటిదని చెప్పఁ బడినది. మహాభారతమున (6, 41. 4) రాజస గుణప్రధానులగు మానవులు యక్ష రాక్షసులను గొల్తురని చెప్పఁబడి యున్నది. అందలి యక్ష ప్రశ్నల ఘట్టమును బరామర్శిం చినచో యక్షులు ధర్మపరాయణులు లేక జిజ్ఞాసువులని తెలియు చున్నది. ఆ యితిహాసములలో వారు శైల జల వన దేవతలుగాఁ బేర్కొనఁబడిరి. ఆ బ్రాహ్మణ బౌద్ధ జైన సారస్వతము లందు మూఁడింటను వారు మహిమోపేతులైన దేవయోనులుగను, మాయా న్వితులైన రాక్షస కల్పులైన రాజస శక్తులుగను గూడఁ బేర్కొనఁ బడిరి. ఎన్ని రకములుగాఁ బేర్కొనఁ బడి యున్నను యక్షులకు దేవ యోనులలో గంధర్వ కిన్నరుల కున్నట్లుగా గాన కళా ప్రావీణ్య ప్రతిష్ఠ లా ప్రాచీన సారస్వతము లందుఁ బ్రసక్తములు కాలేదు. కొంత

ప్రాచీనములైన సంస్కృతకావ్యము లందుఁగొన్నిట నా విషయమున కొక్కించుక యాస్కారము గలదు. భట్టి కావ్యమున నొక సందర్భమున "యక్షా శ్చాపి పణాయంతి తద్విభూతిం గృహే గృహే" యను నొక వాక్యము గలదు. దీనిని బట్టి యక్షులు స్తోత్ర పాఠకులై యుండినట్లు తోఁచుచున్నది. కాళిదాసుని మేఘ సందేశమున

"యస్యాం యక్షాః సితమణి మయాన్యేత్య హర్మ్యస్థలాని
జ్యోతిశ్ఛాయా కుసుమ రచితా న్యుత్తమ స్త్రీసహాయాః
ఆసేవన్తే మధు రతి ఫలం కల్పవృక్ష ప్రసూతం
త్వద్గంభీర ధ్వనిషు శనకైః పుష్కరేష్వాహతేషు"

(II - 5)

అను శ్లోకమున యక్షుల నృత్యగీతి ప్రీతి సూచితమైనది. అందే —

"ఉత్సఙ్గే వా మలిన వసనే సౌమ్య నిక్షిప్య వీణాం
మద్గోత్రాఙ్కం విరచిత పదం గేయ ముద్గాతు కామా
తన్త్రీ మార్ద్రాం నయన సలిలైః సారయిత్వా కథంచి
ద్భూయో భూయః స్వయ మపి కృతాం మూర్ఛనా

(II-25) విస్మరన్తి"

అను శ్లోకమున యక్షిణి సంగీతసాధన యొకింత సూచింపఁబడినది. కాని యిట్టి సూచనలు యక్ష గాన ప్రతిష్ఠను నిరూపింప సమర్థములు గావు.

యక్షు లనువారు దేవయోనులే కాక మానవుల వలె భౌమ జీవులునై యుండెడి వారని తెలియుచున్నది. శ్రీ వి. ఆర్. ఆర్. దీక్షితారు తమ "రామాయణమున దక్షిణ హిందూదేశ" మను

వ్యాసమున[2] రాక్షసులకు ముందు సింహళదేశమున యక్షులు రాజ్యము సేయుచుండి రనియు, బలిచక్రవర్తిసేనాని యగు సుమాలి యక్షుల నోడించి రాక్షసరాజ్యము నచట స్థాపించెననియు నొకగాథ గలదని చెప్పుచు యక్షజాతి రాక్షసజాతియొక్క పాయ యనియు రాక్షసరాజ్య మంతరించుటతో యక్షులచట మఱల రాజ్యస్థాపన గావించినా రనియు, మహావంశ మను గ్రంథము ప్రకారము క్రీ. పూ. 5 వ శతాబ్ది నాఁటికి నచట యక్షుల రాచఱికము సాగుచుండెననియు వ్రాసి యున్నారు. యక్షులు అక్షస్ (Oxus) నదీ ప్రాంతమువారో లేక యచీ (Yuchı) అను మంగోలుజాతివారో లేక జక్షార్తస్ (Jaxartes) ప్రాంతమువారో యై యుందు రనియు గొన్ని యభిప్రాయములు గలవు.[3] ఆయా ప్రాంతముల వారందఱును యక్షులే యైనను వారితో మన సంబంధమున కుండఁగలయవకాశములు గాని, వారి జాతీయ గానకళాభిమానములు గాని యీనాఁడు యూహా కందనివి.

వాత్స్యాయనుని (క్రీ. పూ. 3 - 4 శ.) కామ సూత్ర గ్రంథమున (I - 4 - ४२) "యక్ష రాత్రి" యనున దొక క్రీడా విశేష ముగఁబరిగణింపఁబడినది. దానితో నీ యక్షగానమున కేమైన సంబంధ ముండకుండునా యని కొందఱు పండితు లనుమానపడిరి. అది యొక ద్యూతక్రీడ యని యశోధరుని జయమంగళ వ్యాఖ్యానమునఁజేర్కొనఁబడినది. ఆ పక్షమున యక్షగానమునకు దానితో సంబంధ ముండుట కవకాశము లేదు. కాని "జక్ఖరత్తి" యను దాని ప్రాకృత రూపమును గ్రహించి దీపావళి యను నర్థము చెప్పినాడు

2. A. I. O. C. Baroda Vol. (1933) Page 248.
3. చూ. కీ. శే. సురవరం ప్రతాపరెడ్డిగారి ఆంధ్రుల సాంఘిక చరిత్ర, పుట 195.

హేమ చంద్రుడు (క్రీ. శ. 1088-1172. చూ. అతని దేశినామ మాల III-43). నేపాళ దేశమున దీపావళి పండుగ కొక ప్రత్యేకత గలదనియు నా నిధినిక్షేపముల కధిదేవత యగు లక్ష్మీదేవి యొక్క యారాధనము ప్రధానముగా జరుగు ననియు, నాసందర్భ మున నచట జూదాల తిరునాళ్ళు వైభవోపేతముగా జరుగుననియుఁ దెలియుచున్నది.[4] ఆ పక్షమున నది నిధి రక్షకులును, లక్ష్మీపూజ కులు నగు యక్షులరాత్రి యగుటయే గాక, "అక్షరాత్రి" యు నగుచున్నది. యశోధర హేమచంద్రులిచ్చిన యర్థములు రెండును సమర్థనీయములే యైనను నవి యక్షగానోత్పత్తిని సమర్థింపలేవు. కాని కన్నడ దేశమున, ముఖ్యముగా దక్షిణ కనరా మండల మునఁగల ప్రతి యక్షగానమేళమువారును దమ ప్రథమప్రదర్శనమును దీపావళి నాఁడు తమ యిష్టదైవతముల యాలయములందుఁ బ్రదర్శించు సంప్రదాయము గలదనియు, మందర్తి, మర్ణకట్టె, కటీల్, ధర్మస్థల మొదలగునవి యట్టి యక్షగాన మేళములుగల దేవాయతనము లనియు శ్రీ ఎమ్. గోవింద రావు గారు కర్ణాటక యక్షగానమును గూర్చిన తమ యాంగ్ల వ్యాసమున నని యున్నారు.[5] ఈ సంప్రదాయమును గూర్చి ముళియ తిమ్మప్పయ్య యను నాయన (ఆధునికుఁడు), పార్తి సుబ్బన్న యను నొక ప్రసిద్ధ కన్నడ యక్షగాన కవియొక్క కావ్య ములను గూర్చిన విమర్శగ్రంథము నందు దీపావళి యనఁగా యక్ష రాత్రి యనియు, నా దినముననే యక్షరాజైన కుబేరుఁడు బలి చక్రవర్తి నుండి తన సంపదను దిరిగి పొందెననియు, యక్షులా రాత్రి యంతయు నుల్లాసముగా నాటపాటలతోఁ గడపి రనియు నొక గాథ

4. Vide., page 167 of 'The Land of the Gurkhas' By L. B. Northey.

5. A. O. R. University of Madras Vol.X. part II, 1952-53.

నుటంకించి, యీ కన్నడదేశ యక్షగాన ప్రదర్శన సంప్రదాయము తత్స్మారక చిహ్నమే యని వక్కాణించి యుండెను. దాని ప్రాచీనత నూహించుట కాధారము గానరాదు గాని యీ సంప్రదాయము గాదనరానిది. గానకళాభిమానము విషయమున యక్షుల ప్రత్యేకతను నిరూపించు ప్రాచీనాధారములు గన్పట్టవు గాని యీ సంప్రదాయ నిర్వచనమున కొక గాథ కుదిరియున్నది. నేటికిని గుజరాతు, మార్వారు, నేపాలు మొదలగు రాష్ట్రములందు దీపావళి పండుగ నిధి, నిధ్యధిదేవత యగు లక్ష్మి నుద్దేశించి జరుపఁబడుచుండుట యందుల కుపబలకముగా నున్నది. అట్టిచో యక్షరాత్రికిని యక్షగానమునకును సన్నిహిత సంబంధమున్నదనవలెను. కాని యక్షరాత్రి ప్రసక్తి మొదటఁగన్పట్టుట వాత్స్యాయన కామసూత్రము నందు. వాత్స్యాయనుఁడు క్రీ. పూ. 3 లేక 4 వ శతాబ్ది నాఁటి వాఁడు. అంత ప్రాచీనకాలమునఁ గన్నడదేశమునఁ గాని మఱి యెచ్చటను గాని యక్షగానముండిన జాడగానరాదు. సంస్కృత కావ్య వాఙ్మయమునఁగాని సంగీతశాస్త్రగ్రంథము లందుఁ గాని తత్ప్రసక్తి కానరాదు. సంగీతసుధ యను గ్రంథము[6] విషయ మిందుల కపవాదము. అందు - తంజావూరి రఘునాథనాయకుని (క్రీ. శ. 1600 – 1630) రచన యగు శ్రీ రుక్మిణీకృష్ణవివాహ యక్షగానము పేర్కొనఁబడినది; "యక్షౌఘ గీత మపి గాన శైలిమ్" అని యక్షగానము నిర్వచింపఁ బడినది; "యక్షాశ్చనాగాఅపి కిన్నరాశ్చ గాంధర్వ ముఖ్యాఅపి గాన లోలాః" అని గంధర్వాదులతో పాటు యక్షులును గానలోలు రని వక్కాణింపఁబడినది; ఆంజనేయ విరచితమని చెప్పఁబడు నొక ప్రాచీన సంగీతగ్రంథము నందు

6. Published in the Journal of The Music Academy, Madras., Vol I - 1930.

యక్షుల గానశైలి ప్రశంస గలదని యందు సూచింపఁబడినది. కాని యాంజనేయ విరచిత గ్రంథ మిప్పు డుపలబ్ధము గాదు. ఈసంగీతసుధ యంత ప్రాచీన గ్రంథము గాదు. అదియునుగాక యిది పైనుదాహరింపఁబడిన కన్నడదేశ యక్షగాన ప్రదర్శన సంప్రదాయమును గాని యక్ష రాత్రి సంబంధమునుగాని సమర్థింప లేదు.

కర్ణాటాంధ్రములు యక్షగానములకు ఫలభూములు. యక్షగానములు గానప్రధానములయ్యు నాట్యప్రయోజనోద్దిష్టములు నైనవి. ఆయా వాఙ్మయములందు యక్షుల గానాభినయ కళానుబంధముగూర్చి తఱచుగా ప్రసక్తి గలదు.

కర్ణాట వాఙ్మయములో తత్ప్రసక్తి గుఱించి శ్రీ ముట్నూరు సంగమేశంగారిట్లు వ్రాయుచున్నారు.* "కన్నడకవి అభినవ పంపడు (12 వ శతాబ్ది) వ్రాసిన మల్లినాథపురాణంలో (2. 12. ప 47) 'యక్షాందోళన' మనే నాట్యం ప్రస్తావించ బడింది. కన్నడ యక్షగాన నాట్యప్రదర్శనలలో "యక్షిణీ" వేషం ఈ అందోళికా నాట్యాన్ని నేటికి ప్రదర్శిస్తూన్నందున, గానంలో వలెనే నాట్యంలో కూడ యక్షులది ప్రత్యేక సంప్రదాయమే అని ఊహించవచ్చు.... యక్ష శబ్దానికి తెలుగు కన్నడ భాషలు రెండింటి లోనూ తద్భవంగా చెప్పబడిన "జక్క" శబ్దం నేటికీ ఒకానొక జాతి జనులకు నియతాభిధానంగా వినిపిస్తూంది ...... తెలుగు సాహిత్యంలో జక్కులపురంధ్రుల పాటలు ప్రస్తావించబడినట్లుగానే కన్నడసాహిత్యంలో "ఎక్కలగాణ" ల నాట్యగానాలు పలుతావుల ప్రస్తావించ

---

* చూ. "కన్నడ యక్షగానాలు" అను వారి వ్యాసము భారతి – ఫిబ్రవరి, 1956 (ఈ విషయము గూర్చి శ్రీ హాసణగి రామచంద్రభట్టుగారు రచించిన "యక్ష నాటకగళు" అను కన్నడగ్రంథము పుట 50–51 కూడఁ జూడఁ దగును)

ఒడ్డాయి. అగ్గళుడు (12 వ శతాబ్ది) వ్రాసిన చంద్రప్రభాపురాణం (ఆ. 7, ప 96) లో వన విహారంచేస్తూన్న నాయకుడు, మేళతాళాలతో నిమిత్తంలేకుండా దేశీయగీతాన్నొకదానిని ఒక "ఎక్కల గాణ" యింపుగా పాడుతూవుంటే విన్నాడని వర్ణించబడింది. అభినవపంపని మల్లినాథపురాణంలో (ఆ. 6, పద్యం 98) కమలామోదిమైన తుమ్మెదఝుంకారం కమలాలయమైన లక్ష్మిని కీర్తిస్తూ పాడే "ఎక్కల" గానంతో పోల్చి వర్ణించబడింది. రత్నాకరవర్ణి (16 వ శతాబ్ది) వ్రాసిన భరతేశవైభవంలో (చూ. ఆస్థాన సంధి. పద్యం 58) వెనుకపాటకులతోనూ, మేళతాళాలతోనూ 'ఎక్కడిగలు' నాట్య మాడినట్లు వర్ణించబడింది. ఆ యీ వ్రాతలవల్ల యీ ఎక్కలగాణలు తెలుగు జక్కులపాటకుల వలెనే జానపదగాయకులనీ, లక్ష్మిప్రశస్తినివర్ణించడమే వీరికికూడ కులాచారమనీ, నృత్యం కూడ వీరెరుగుదురనీ, అందులో హంగుదారుల ఆటోపం కూడ వీరి కవసరమే అనీ బోధపడుతూంది."

కన్నడనుడి యను నొక గ్రంథము నందు యక్షుల గీతాభినయకళాభినివేశము గూర్చి యొకగాథ గలదు. ఇంద్రసభలో నాట్య సంగీతవిద్యలందు మంతుకెక్కిన గంధర్వులకడ యక్షులొకప్పుడు భృత్యమాత్రులై యుండిరనియు, నది సహింపక వారు శుక్రాచార్యు నాశ్రయించి యావిద్యలభ్యసించి కృతార్థులైరనియు నాగాథ తెలియఁజేయుచున్నది.+ కాని కన్నడనుడి ప్రాచీనగ్రంథము గాదు. ఆ గాథకుఁ బ్రాచీనాధారము గన్పట్టుటలేదు.

ఆంధ్ర వాఙ్మయమున మొట్టమొదట యక్షాదినేపథ్యముల తోడి యాట పాటల ప్రసక్తి పాల్కురికి సోమనాథుని (క్రీ. శ.

---

+ చూ. శ్రీ ఎమ్. గోవిందరావు గారి వ్యాసము (Ibid)

1280-1340)* పండితారాధ్య చరిత్రలో బర్వత ప్రకరణమునఁ గన్పట్టును. అది శ్రీశైల యాత్ర శివరాత్రి జాగరణ సందర్భము. ఆవేళ నచటఁ జేరిన యాత్రికుల వినోదకాలక్షేపముల నేకము వర్ణింపఁ బడిన చోట —

"ఆదట గంధర్వ యక్ష విద్యాధ
రాదులై పాడెడు నాడెడు వారు (రి ?)
విధమునఁ బ్రచ్ఛన్న వేషముల్ దాల్చి
యధికోత్సవము దులుకాడ నట్లాడు"

వారును బ్రశంసింపఁ బడిరి.

తదుపరి క్రీ. శ. 1430 ప్రాంతమున రచితమైన శ్రీనాథుని భీమేశ్వరపురాణమున (ఆశ్వా. 3, పద్య 65) దక్షారామ ప్రశంస సందర్భమున —

"కీర్తింతు రెద్దానికీర్తి గంధర్వులు
గాంధర్వమున యక్షగాన సరణి"

అని యున్నది. యక్షగాన మను సమస్తపద మొక విశిష్టార్థమునఁ గనఁబడుటకిదే మొదలు.

"కీర్తయంతిస్మ మాహాత్మ్యం గంధార్వాస్త్రిదివౌకసః
గాంధర్వ విద్యానిపుణా గాంధర్వేణ గరీయసా"

అని సంస్కృత భీమేశ్వరపురాణము (అధ్యా 10 – శ్లో. 19). అమూలక మగు యక్షగాన శబ్ద మాంధ్ర భీమేశ్వరపురాణమున నుటం

---

* ఈ కవి కాలము గూర్చి యనేక మతములు గలవు. కాని ప్రామాణికులైన సుప్రసిద్ధ పరిశోధకులు డాక్టరు శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారితని కాలము క్రీ. శ. 1280–1340 అని తమ 'పాల్కురికి సోమనాథుఁడెప్పటి వాఁడు ?' అను గ్రంథమున (వావిళ్ళవారి ప్రచురణ, 1955) నిర్ణయించి యున్నారు.

కింపఁబడినదనఁగా శ్రీనాథునికాలమున యక్షగానమున కొక ప్రత్యేకతయుఁ బ్రచారము నేర్పడి యుండును. అసలు గానకళాప్రావీణ్యామునకు గంధర్వులది పెట్టినది పేరుగదా. వారి పేరనే గాంధర్వవేదము వెలసినది. అట్టి గంధర్వులు "యక్షగాన సరణిఁ" బాడిరనఁగా నది శ్రీనాథుని కాలము నాఁడొక ప్రత్యేక గాన శైలిగాఁ బరిగణింపఁబడుచుండెడి దని తోఁచును. క్రీడాభిరామమున (క్రీ. శ. 15 వ శతాబ్ది) నొక వ్యాజమున మాణిభద్రకులోద్వాహులైన యక్షకన్యల నృత్యప్రశంస గలదు (పద్య 137-138). పదునారవ శతాబ్ది ప్రబంధములలో - మనుచరిత్రమునఁ (II-19) బ్రవరుఁడు హిమవత్పర్వత ప్రాంతమున "గంధర్వ యక్షగాన ఘూర్ణితముగ నొక్కకోనఁ గనియె" నని యున్నది. పారిజాతాపహరణమున "యక్షగ్రామ వాస్తవ్యులు" "నిర్జరీ జనతా నృత్త సహాయలాలసు" లనియు, యక్షులు "మేళముగూడి పాడుచుందురు దిక్పాల సభల" ననియు నున్నది. (II-92-93). రామాభ్యుదయమునఁ (III-42) "...గరుడ గంధర్వ కిన్నర కింపురుష యక్షగానంబు లనూనంబులై బెరయ..." అని యున్నది. చిత్రభారతమునఁ జతుర్థుని యలకాపురీ సందర్శన సందర్భమునఁ (IV-80) గిన్నరులు పాట పాడుచుండఁగా "తాళసంఘ ప్రభేదంబుల గతులచే యక్షకామినులు నాట్యంబులాడ" దొడఁగి రనియు, సందే కృష్ణుఁ డర్జునునిపై దాడి వెడలిన సందర్భమున (VII-21) "మంగళమస్తు రమానాథ యని యక్ష వనితలు కన్నపర్వముగఁ బాడ" దొడఁగి రనియుఁ గలదు. కర్ణాటాంధ్ర వాఙ్మయము లందు యక్షుల గానాభినయ కళానుబంధములు కిట్లెన్నియో ప్రమాణములు గలవు. కాని యవి క్రీ. శ. 12 వ శతాబ్ది కంటెఁ బ్రాచీనములు గావు. అంతకంటెఁ బ్రాచీనములు ప్రబలములైన ప్రమాణములు గానరావు. కావునఁ గర్ణాటాంధ్రము లందు

యక్షగానమను పేర నొక ప్రత్యేక గాన శైలికిఁ బ్రచార మేర్పడిన తరువాతనే తన్నిమిత్తముగాఁ దత్తత్సాహిత్యములందు భంగ్యంతరముగను, నౌపచారికముగను యక్షుల గీతాభినయ కళానుబంధములకా ప్రసక్తి గల్గినదని తలంపవలసి యున్నది. అదియుఁగాక దేవయోనులైన యక్షుల వలన నాంధ్ర కర్ణాటములందు యక్షగానమేర్పడిన దనుట కంటె నెవరో భౌమజీవులైన యక్షుల వలన నేర్పడి యుండు ననుట సమంజసముగాఁ దోఁచును. యక్షజాతి ప్రతిష్ఠ హిందూ బౌద్ధ జైన మతగ్రంథములు మూఁడింటను నిటు సింహళము నుండి యటు నేపాళము వఱకును వ్యాపించినట్లు తెలియుచున్నది. కర్ణాటాంధ్ర దేశములకు నేపాళముకంటె సింహళము సన్నిహితమైనది. ప్రాచీన కాలమున సింహళమున యక్షుల రాచఱికము కొన్నినాళ్ళు కొనసాగిన విషయము పూర్వోక్తము. అచట నేఁటికిని యక్షారాధన ప్రధానముగా "వడ్డా" యను జాతి వారి యుత్సవ నృత్యములు జరుగుచుండు నని తెలియుచున్నది.7 ఆ యుత్సవములు మహా భీకరము లఁట. ఆ యక్షులెవరో నృత్యప్రియుల వలె నున్నారు. ఆటతోఁడిదే పాట: మత ప్రచారమునకు గీతాభినయ కళాత్మక ప్రక్రియలు గొప్ప సాధనములు. పూర్వ మెప్పుడో సింహళమునుండి యా యక్షులో యక్షారాధకులో మతప్రచారము నిమిత్తమో మఱెందులకో కర్ణాటాంధ్ర దేశములు బ్రవేశించిరేమో! యనునది యొక విచికిత్స. కర్ణాట దేశము నందలి యెక్కలగాణలు లేక యెక్కడిగలు, నాంధ్ర దేశమందలి జక్కులవారును వీరి సంతతి వారే

---

7. Vide., Dr. Manmohan Ghosh's paper on the Sinhalese dances and the Indian Natya Published in the Indo Asian Culture, Vol. I–No. 2; Oct, 1952.

( పాల్కురికి సోమనాథుని అనుభవసారమున 'వడ్డాచారములు' గర్హింపఁబడినవి ( 97వ పద్యము ) మఱి యవి యేమిటో యెఱుఁగరాదు ).

యగుదు రేమో! ఎక్క జక్క శబ్దములు యక్ష శబ్ద భవము లగుటను భాషాశాస్త్రము సమర్థింపఁ గలదు.[8] తొల్లి కర్ణాటాంధ్రములందు యక్షగానము వీరివల్లనే ప్రవర్తిల్లిన దేమో!

పూర్వకాలమున వివిధ దేశములందు వెలసిన నాట్య సంగీత ప్రక్రియ లనేకము మత ప్రచారము కొఱ కేర్పడియుండుట లేదా మత ప్రేరకములై యుండుట ప్రసిద్ధ విషయము. కాత్యాయనుని శ్రౌత సూత్రములలోఁ (21-3-11) బితృమేధకర్మకాండమున నొక విధమగు గీతాభినయ ప్రక్రియ యాచరణీయ మని సూచింపఁ బడినది. సింహళ దేశీయుల యుత్సవ నృత్యములలోఁ బితృదేవతా పూజాసంప్రదాయము పాటింపఁబడుచున్నది.[9] గ్రీసు దేశపు నాటకోత్పత్తికి మతసంబంధ ప్రతిపత్తియే మౌలికతత్త్వము. ఆనాఁటి గ్రీసు "ట్రాజెడీ" (విషాదాంత రూపకము) మొదట నొక మృతయోధుని సమాధికడ జరుపఁబడు నపరకర్మ కలాపముగా నవతరించినది.[10] అశోక చక్రవర్తి విగ్రహ ప్రదర్శనాదికము ద్వారమున బౌద్ధ మత ప్రచారము చేయించిన ట్లాతని నాగిర్నారువ శిలాశాసనము వలనఁ దెలియుచున్నది.[11] వంగదేశపు "యాత్రలు" మత విషయికము లైన యుత్సవములలో నూరేగింపుల సందర్భములలోఁ బ్రయోగింపఁ

8. ఈ విషయమును సుప్రసిద్ధ భాషాశాస్త్రవేత్తలును, భాషా చరిత్ర చతురానన బిరుదాంచితులును, ఆంధ్రభాషావికాస గ్రంథకర్తలు నగు ఆచార్య శ్రీ గంటి జోగిసోమయాజిగా రామోదించినారు.

9. Vide., Dr. Manmohan Ghosh's Paper, Ibid.

10. The Dramas and Dramatic Dances of Non-European Races By William Ridgeway.

11. ఈ విషయము నెత్తి చూపినవారు డాక్టరు శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు. చూ. వారి వ్యాసము - ఆంధ్రపత్రిక ఖర సంవత్సరాదిసంచిక.

బడునఁట[12] మార్వారు ప్రాంతమున వైశ్యజాతికిఁ జెందిన గంధర్వులను నొక తెగవా రదియొక వృత్తిగాఁ బ్రదర్శించు అంజనసుందరి, మేనాసుందరి యను నృత్య రూపకములం దా యితివృత్తములు ప్రసిద్ధ జైన గాధ లనియు, నా ప్రదర్శనములను జైను లెక్కువగా నాదరింతు రనియు, నా గంధర్వుల కది యొక వృత్తి యైనను నది మతబీజక మైనదనియుఁ దెలియుచున్నది.[13] ఇట గంధర్వ శబ్దోపయోగము గమనింపఁదగినది. ఈ గంధర్వులకును దేవయోనులైన గంధర్వులకును సంబంధములేదు. గానకళాప్రావీణ్య విషయమునఁ బురాణ ప్రసిద్ధులైన దేవయోని గంధర్వుల పేరే వైశ్యజాతి ప్రదర్శకులు తమ గానకళా వైదగ్ధ్యమునకు సూచకముగాఁ బెట్టుకొని యుందురు. లేక జనవ్యవహారమున వీరికా ప్రసిద్ధి గల్గి యుండును. ఇంతకన్నను జిత్రమైనది నేపాళ దేశపు గంధర్వగానము. ఇది వంగదేశపు యాత్రవలె నేపాళదేశము యొక్క దేశిసరణికిఁ జెందిన నర్తన (నాటక) మని పేర్కొనఁ బడినది.[14] ఇది మతబీజక మైనదో కాదో తెలియదు. కాని దీనికిని మన యక్షగానమునకును బేళ్ళలో నేదో యొక వింతసామ్యము గోచరించును. ఇఁక యక్షగానమునకేమైన మత సంబంధమున్నదేమో చూడవలసియున్నది. సింహాళదేశపు యక్షులచేఁగాని యక్షారాధకులచేఁగాని ప్రవర్తితమై యుండునెడల నది యంతయో యింతయో మత సంబంధియని చెప్పనొప్పును. లేదా మీఁదఁ జెప్పఁబడిన కర్ణాట దేశపుఁ బ్రదర్శన సంప్రదా

12. Vide The Indian Theatre-by Dr. R. K. Yajnik, Part I Chap. 3-A., Eastern India- Yatras.

13. Vide., Sangeet Nataka Akademi Bulletin No. 2-Oct, 1954 - For a note on the Dances of the Gandharvas.

14. Vide, U. R. S. Dabral's Introduction to Bhamaha's Prakrit-prakash, Benares Edition, 1920.

యమును గమనించినను నది మతబీజకమై యుండునని తోచును. కాక, పాల్కురికి సోమనాథుడు చెప్పినట్లు శివరాత్ర్యుత్సవ సందర్భమున శ్రీశైలాది క్షేత్రము లందు ప్రవర్తిత మగుచుండిన యక్ష వేషధారుల యాటపాటలతో యక్షగానమునకు సంబంధ ముండి యుండు నెడల నదియు మతసంబంధ స్ఫోరక మగుచున్నది. జక్కుల జాతి సంబంధము గూడ యక్షగానముయొక్క మతబీజకత్వమును స్థాపింపగలదు. అది యెట్లు స్థాపింపబడగలదో, యసలు యక్షగానమునకును జక్కులకుం గల సంబంధ మేమిటో విచారింపవలసి యున్నది.

# జక్కుల జాతి సంబంధము

యక్షగానముతో సంబంధము గలిగిన వారుగా నూహింపం దగిన యెక్కడిగలు లేక యెక్కలగాణలు నేడు కన్నడ దేశమున నెక్కడను గానరారు. కాని జక్కుల వారాంధ్ర దేశమున గుంటూరు, గోదావరి మొదలగు మండలములలో, తెనాలి, పెద్దాపురము మొదలగు ప్రాంతములలో గానవచ్చుచున్నారు. నేడు వీరు కళావంతుల తెగకు జెందినవారై యున్నారు. వీరి గురించి ఇ. థర్స్టన్ (E Thurston) వ్రాసిన 'Castes and Tribes of South India' అను గ్రంథము ద్వితీయభాగము, 438 వ పుటలో నిట్లున్నది:

"**Jakkula**–Described as an inferior caste of prostitutes, mostly of the Balija caste, and as wizards and a **dancing** and **theatrical** caste. At Tenali in the Kistna district, it was customary for each family to give up one girl for prostitution". etc etc.,

దీనినిబట్టి జక్కులవారికి నాట్యకళతో సంబంధ ముండినట్లు విశదమగు చున్నది. కళావంతు లనిపించుకొను వారియెడ నట్టి సంబంధము సహజము. వారి పేరులయు బిరుదుసార్థకము. మార్వారు గంధర్వుల సామ్యమున నీ జక్కులవారు తొల్లి మతప్రచార నిమిత్తమునమో లేక యది యొక ప్రధానవృత్తిగా నవలంబించియో యక్షగాన ప్రవర్తకులైన వారలు కాలక్రమమున గలిసి యేర్పడిన జాతియనియు, వారివృత్తికి సంబంధించిన యక్ష (జక్కు) శబ్దము తరువాత వారికి జాతివాచకముగా బరిణమించియుండుననియు నూహింపవచ్చును. వివిధజాతుల చరిత్రలు పరిశీలించి చూచిన నిట్టి పరిణామ మసహజముగాదు. అందులకు మార్వారు గంధర్వుల విషయమునే దృష్టాంతముగా గ్రహింపవచ్చును. మన 'ఎఱుకల' జాతియు నట్లేర్పడినదే గదా.

ఆంధ్రదేశమున జక్కులవారిప్రశస్తి చిరకాలానుగతముగ వినవచ్చుచున్నది. ఈనాఁడు రాయలసీమలోనున్న జక్కసానికుంట్ల (కర్నూలు జిల్లా, పత్తికొండ తాలూకా), జక్కులచెఱువు (గుత్తి తాలూకా), జక్కలచెఱువు (పెనుగొండ తా..), జక్కసముద్రము (హిందూపురం తా..), జక్కులాడికి (బళ్ళారి జిల్లా) మొదలగు గ్రామముల నామములు ప్రాచీనకాలమున నా యాప్రాంతములందలి జక్కులజాతి ప్రాచుర్యమును సూచించును. అందుఁ గొన్ని గ్రామము లొకప్పుడు వారి కినాములుగా నీయఁబడినట్లు స్థానికమైన ప్రతీతి గలదు. క్రీ. శ. తే. 9-7-1481 న జక్కుల కన్నాయి యను నామె తిరుమలదేవస్థానమున వేయించిన శాసన మొకటి కలదు.[15] అది క్రీ. శ. 15 వ శతాబ్ది నాఁటి జక్కులవారి ప్రాభవమును సూచించును.

ఇఁక నానాఁడు గానాభినయ కళాప్రదర్శనలందు వారికిఁగల పేరుప్రతిష్ఠ లెట్టివో యరయవలసియున్నది. పదునైదవ శతాబ్ద్యారంభమున వెలసిన క్రీడాభిరామమున (135 వ పద్యము) "జక్కుల పురంధ్రి" గానకళా కౌశలము విశేషముగఁ బ్రశంసింపఁబడినది. అందే యా వెంటనే (పద్య. 136 - 138) భంగ్యంతరమున 'అక్కలు' లేక "యక్షకన్యల" అనఁగా జక్కుల పడుచుల నృత్య ప్రదర్శనము గూడఁ బ్రసక్తమైనది. జక్కులరేకులను పదములు[16] జక్కిణి యను నృత్యవిశేషము వీరిపేరనే ప్రసిద్ధములై యుండును. క్రీ. శ. 1500 ప్రాంతమునఁ బ్రోలుగంటి చెన్నశౌరి యనునాతఁడు సౌభరిచరిత మను "జక్కులకథ" చెప్పినట్లు తెలియుచున్నది. అది జక్కులవారు

15. తిరుపతి దేవస్థాన శాసనములు, ద్వితీయ సంపుటము - నెం. 77.

16. చూ. తాళ్ళపాక చినతిరుమలయ్య (క్రీ. శ. 1480 - 1540) సంకీర్తన లక్షణము - 50 వ పద్యము.

17. హరిభట్టు నారసింహ పురాణము, అవతారిక - పద్య. 33.

చేయు గానరూప కథాఖ్యాన పక్కిక మూఁదలగా రచింపఁబడి యుండును. పురాణాదులలోఁ గానరాని యక్షుల గానకళాప్రశంస మనభీమఖండమునను బదునాఱవశతాబ్ది ప్రబంధములందును గన్పట్టు చున్నదనఁగా (ఈవిషయము పూర్వోక్తము) నది యీజక్కులవారి పాటలు వ్యాప్తికి వచ్చినతరువాత వానికే భంగ్యంతర సూచనయని గ్రహింపవచ్చును. చిత్రభారతమున "యక్షకామినుల నాట్యము", "యక్షవనితలపాట" యుఁ బ్రత్యేకముగ బేర్కొనఁబడిన వనగా నవియు నీజక్కులపురంధ్రుల యాటపాటలకే భంగ్యంతరసూచన లగు నేమో! 17 వ శతాబ్దినాటి పురుషోత్తమదీక్షితుని తంజాపురాన్న దాన మహానాటకమున[18] జక్కుల రంగసాని యను నామె సత్రములోఁ బదకేళిక పట్టినట్లుగలదు. ఈవిషయములెల్ల జక్కులజాతికి గీతాభినయ కళలతోఁగల సంబంధము నూహించుటకుఁ దోడ్పడుచున్నవి.

## జక్కిణి

ఇఁకజక్కిణి శబ్దవిచారము. జక్కులవారిగుఱించి మీఁదఁ బేర్కొనఁబడిన విషయములో స్త్రీ ప్రసక్తి ప్రాముఖ్యము గమనింపఁ దగినది. జాతిస్త్రీవివక్షయందు యక్షశబ్దము యక్షిణియగును. యక్షిణీ శబ్దవికృతియే జక్కిణి. అనఁగా నిట జక్కులపురంధ్రియని యౌపచారిక ముగా గ్రహింపనగును. జక్కిణుల నాట్యపద్ధతికి నాపేరేకల్గుట విశేషము. "ఝక్కిణీ" లాస్యము మతంగమహామున్యుపజ్ఞమై ప్రాదుర్భవించినదని యతని బృహద్దేశివలనఁ దెలియును.[19]

18. తం. స. మ. — కే. సం. 5-9.

19. బి టి. సి. సెం. 11536 (ఈవిషయమును తమసంస్కృత వాఙ్మయ చరిత్రలో నుటంకించిన శ్రీ ఎమ్. కృష్ణమాచార్యులవారి యభిప్రాయము ననుసరించి మతంగుని కాలము క్రీ. శ. 4 వ శతాబ్దిగా దోఁచును.)

ఒకప్పుడాంధ్ర దేశమున నిదిమిక్కిలి ప్రచారమునందుండి నట్లూహింప వీలగుచున్నది. పదునాఱు పదునేడవ శతాబ్దుల తెలుఁగు ప్రబంధములందు బలుతావుల నొకగొప్పనాట్య ప్రభేదముగా జక్కిణి ప్రశంస గన్పట్టుచున్నది.[20] రామాభ్యుదయమున "జక్కిణీ - వేషముల" ('మేళముల' అని పాఠాంతరము) ప్రసక్తిగలదు. తంజావు రాంధ్రనాయక రాజాస్థానమున జక్కిణినాట్యగోష్ఠి తఱచు జరుగుచుండినట్లు విజయరాఘవనాయకుని (క్రీ. శ. 1631 - 73) రఘునాథనాయకాభ్యుదయ ప్రహ్లాదచరిత్ర యక్షగానములవలనను, తదాస్థానకవియగు చెంగల్వ కాళకవి రాజగోపాలవిలాస ప్రబంధమువలనను నెఱుఁగనగును. జక్కుల రంగసాని పద కేళిక ప్రసక్తిగల తంజావురాన్నదాన నాటకముగూడ నతని యాస్థానమున వెలసినదే. ఆనాఁడు విజయరాఘవునాస్థానము యక్షగానమునకుఁ బట్టుకొమ్మ. జక్కిణికి నాట్యప్రభేద మాత్రముగనేకాక నాట్యోపయోగి గీతప్రబంధ విశేషముగను బ్రసిద్ధి యుండినట్లు తెలియనగును. వెన్నెలకంటి సూరన (క్రీ శ. 1500 - 1550) విష్ణుపురాణమున (7 - 277) గీతము దరువులతోపాటు జక్కిణి యొకవర్ణవిశేషముగాఁ బేర్కొనఁబడినది. రెండు యక్షగానప్రాయరచనలు - తంజావూరు మహారాష్ట్రప్రభువగు శహాజీ (క్రీ. శ. 1684 - 1712) త్యాగవినోద చిత్రప్రబంధము, మధుర విజయరంగ చొక్కనాథనాయకుని (క్రీ. శ. 1706 - 32) యాస్థానాశ్రితుఁడైన తిరుమలకవి చిత్రకూట మాహాత్మ్యమునను వానియందు జక్కిణీదరువు లుదాహరింపఁబడినవి. కూచిపూడి భాగవతుల సాంప్రదాయిక నాట్యావలంబనములలో జక్కిణీదరువొకటి

20. చూ. సూ. రా. నిఘంటువు ఇందుఁ బేర్కొనబడలేదు కాని చంద్రభాను చరిత్రము, ఉత్తరరామాయణము, పాంచాలీపరిణయము మొదలగు ప్రబంధములందును జక్కిణీప్రశంసగలదు.

యని తెలియుచున్నది.[21] వారి యక్షగాన ప్రదర్శనవిషయము ప్రసిద్ధము. ఇఁక నొక విశేషము - భామవేషకథ యను నొక యక్షగాన ప్రాయమైన కృతి గ్రంథకర్తచేఁ దద్రచనా ప్రక్రియాపరముగ జక్కిణి యని ద్వివారము పేర్కొనబడినది.[22] గ్రంథప్రారంభమున బ్రథమ పత్త్రమున దనకృతివిషయము నిట్లు ప్రస్తావించినాఁడు గ్రంథకర్త:- " జోకగ గీత వాద్యముల సొంపుగ నింపుగ వంచ జక్కిని ప్రాకటమైన నాట్యరసభావముల న్వినిపింతు వేడుకన్ ",

" సరసులు గాణలు సత్కవుల్ బుధులు
భరతజ్ఞులును మెచ్చ ప్రౌఢిమి నిచ్చ
నరసి లక్షణ లక్ష్యయంబుల రూఢి
కరుదంద గీత వాద్యాదుల జోక
సరవి తోడుత వంచ జక్కిణి నాట్య
మిరవంద వినుపింతు నెంతయ వేడ్క "

ప్రసిద్ధమైన పారిజాతకథ యిందలి యితివృత్తము. అనేక యక్షగానము లందు గన్పట్టు మెఱుకఘట్ట మిందునుగలదు. రచన యక్షగాన సామాన్యముగా దరువులు, ద్విపదలు, వచనము, పద్యములు గలిగి యున్నది. గ్రంథము యక్షగానమనుటలో సందేహింపఁ బనిలేదు. జక్కిణి యని వ్యవహరింపఁబడుట తగియున్నదనిపించును. పై విషయములను బట్టి చూచినచో నాట్యప్రభేదముగను, నాట్యోపయోగి యైన గీతప్రబంధ విశేషముగను బేరొందిన జక్కిణికిని, గీతాభినయో భయ ప్రయోజనాత్మకమైన యక్షగానమునకును నేదో చుట్టఱికముం

21. ఆచార్య శ్రీ విస్సా అప్పారావుగారి 'కూచిపూడి నాట్యసంప్రదాయం' అను వ్యాసము. సంస్కృతి - ఏప్రిల్, 55

22. ప్రా. లి. పు. భాం , డి. సం 1919.

డక పోదని యనిపించును. ఈ జక్కిణియు యక్షగానమును మన జక్కుల పురంధ్రుల యాటపాటలేమై యుండిన నుండవచ్చును.

వివిధజాతుల యుత్పత్తుల గుఱించి యైతిహ్యము లనేకము చిత్రచిత్రములుగా విశ్రుతము లగుచున్నవి. అట్లే యీ జక్కుల వారసలు యక్షస్వరూపులే యైనట్లొక గాథగలదు. క్రీడాభిరామమున "కామవల్లీ మహాలక్ష్మికై కటభారి, వలపు వాడుచువచ్చె జక్కుల పురంధ్రి" యనియున్నది. దానికిఁ గామెపల్లివారి వీథిభాగవతము లోని లక్ష్మీనారాయణుల ప్రణయఘట్టమును బాడుచు వచ్చినది జక్కులపురంధ్రి యని కొందఱ అపవ్యాఖ్యానము గావించిరి. ఆ కామ వల్లియే కామేశ్వరిపాట యను స్త్రీల పాట[23] లోని కామేశ్వరియని యా కామేశ్వరి కథను కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు క్రీడాభి రామపీఠికలో[24] వివరించియున్నారు.[25] ఈ కథలో మహాలక్ష్మి శాప వశమునఁ బార్వతికి సద్యోగర్భమున సప్తకన్యకలుగా నుద్భవించినదని యున్నది. అందొకతె పేరు "జక్కులమ్మ" యఁట. కామవల్లి కడగొట్టుది. ఒకనాడు —

"ఆ పార్వతీశ్వరుం డతి సంభ్రమమున
నిరవొప్ప యక్షుల నిద్దఱఁబిలిచి
మురువొప్ప జక్కులముద్రలు చేసి
ఉరుమలు మద్దెల లుపకరణములు

23. ఏలూరు మంజువాణీ ముద్రాశాలా ప్రచురణ:— "స్త్రీల పాటలు"

24. మదరాసు శృంగార గ్రంథమాల ప్రచురణ:— పుట 97—102.

25. ప్రా. లి. పు. భాం. డి. నం. 338—ఆదిలక్ష్మీవిలాసమను పద్యప్రబంధము, డి. 1045—కామేశ్వరీ చరిత్రమను ద్విపద (క్రీ. శ. 1600 ప్రాంతమున వేటూరి బావనామాత్య కృతము)— ఈ రెండింటి యందును కామవల్లి కథయే యుతివృత్తము.

కరమొప్పఁ దగినవి గావించి యిచ్చి
ముత్యాల రంగముల్ మున్నారు చేసి
అత్యంత ముదముతో నడిగిన వేళ
చిందముల్ బోనముల్ శృంగారములును
అందముల్ పరికెలు నానందములును
ఆ రీతి సంతసమందగా జేసి
సారెకు ముద్రల జక్కుల బిలిచి
రమణ మీ వంశ పారంపర్య మెల్ల
కమలాక్షిఁ గొలువుండు కామవల్లెమను
కామవల్లిని గొల్చు ఘనులెల్ల మున్నె
ప్రేమతో మిము జాల ప్రియము చేసెదరు"

అని యొక కట్టడిజేసినాఁడఁట. ఆ సప్తకన్యకలనే "అక్కలు" లేక "అక్క దేవత" లందురు. యక్షులు శివాజ్ఞచే వంశపారంపర్యము గామవల్లిని గొలువవలసినవారైరఁట. వారే జక్కులఁట! శివుఁడు వారికి వాద్యప్రదానముగావించె ననుట గమనింపఁ దగియున్నది. (క్రీడాభిరామమున జక్కుల పురంధ్రిపాటసందర్భమున నీ వాద్యములు గొన్నిటికిఁ బ్రసక్తిగల్గినది )కామేశ్వరి యిలువేలుపైనవారెల్లముందు వీరికే ప్రియముచేయుదురఁట. అది గాథయైనను నందు వారివిశ్వాసము ప్రతీయమానమగుచున్నది. శివాదేశ విషయము విశ్వసనీయము గాక పోయినను వారి కులాచారమునకు గ్రంథస్థనిదర్శనము గలదు. క్రీడాభిరామమునఁ గామవల్లి వలపు వాడుచు వచ్చిన జక్కులపురంధ్రి ప్రశంస వెంట "అక్కల" కొలుపు వర్ణింపఁబడినది. ఒక గృహస్థు సంతానార్థియై

వారి నారాధించినట్లును,[6] నా సందర్భమున అక్కలేడుగురును లేచి యాడిరనియు, నా యక్కలే "యక్షకన్య" లనియుఁ (అనఁగా నిట జక్కులపడుచు లనియు) జెప్పఁబడినది. (యక్షశబ్దమునకు—"జక్క", "ఎక్క" అను రూపాంతరములేగాక "అక్క" యను రూపవికృతియు నంగీకార్యమే యనియు, నది భాషాశాస్త్రసమ్మతమే యనియు ఆచార్య శ్రీ గంటి జోగిసోమయాజిగారనుచున్నారు.)

రాయలసీమలో రాయచోటి తాలూకాలో చిన్నమండెం గ్రామసమీపమున అక్కదేవతలకొండ యని యున్నదనియు, నక్కడ వారిగుర్తులుగా నొకయేడు బాళ్ళున్నవనియు, నేఁటట జనులు ముఖ్యముగా సంతానకాంక్షులైనవా రా దేవతలను గొలువఁబోవుదురనియుఁ గొండపై సంతర్పణము జేయుదురనియుఁ దెలియుచున్నది.[27] దీనినిబట్టి రాయలసీమలో నీకామేశ్వర్యారాధన మేసంప్రదాయముననే ప్రాచుర్యము నందినదో తెలియఁగలదు. అక్కలపాట యను ... స్త్రీల

---

26. పూర్వ మాంధ్రదేశమున సంతానకాంక్షులైన గృహస్థులు కొందఱు సుద్దులగొల్లలను గూడ నాశ్రయించుచుండినట్లు హంసవింశతి (తృ. ఆ. పద్య. 85-89) వలన నెఱుఁగనగును అనఁగా జక్కులపాటలు, గొల్లసుద్దులు మొదలగునవి జానపద వినోదోద్దిష్టములు మాత్రమే కాక మతబీజకము లనియుఁ దెలియనగును. పోలుగంటి చెన్నశౌరి చెప్పినాఁడన్న "జక్కులకథ" సౌభరిచరితము గూడ సంతాన ఫలప్రదవిశ్వాస ప్రతిపాదక మగుట విశేషము. సౌభరిచరితము విష్ణుపురాణము భాగవతములందుఁ గలదు. అందొక మీనరాజు సంతానసౌభాగ్యము జూచిన సౌభరిమహర్షి కి సంతానవ్యామోహము గల్గుటయు నందులకుగా నతఁడు మాంధాతృ రాజపుత్రికలను వివాహమాడి వారి యందధిక సంతానము గాంచుటయుఁ జెప్పఁబడినది. ప్రాయశః జక్కులవారు నాఁడీకథను సంతానవ్రతులైనవారియిండ్లఁ జెప్పుచుండెడివారేమో!

27. చూ. కడపజిల్లా గెజిటీరు, పుట 225.

పాట[28] వలనఁ గృష్ణాగోదావరీ మండలములలో స్త్రీవ్రత సంప్రదాయమునకుఁ గల "పరపతి" తేటతెల్లము కాఁగలదు. అందు బెజవాడ, ఏలూరు, రాజమహేంద్రవరము, కొవ్వూరు పురము లాదిలక్ష్మి కామేశ్వరి వెలసిన పుణ్యస్థలములుగాఁ బేర్కొనఁబడినవి. అందు జక్కులమ్మ ప్రశంసయుఁ దఱచు గన్పట్టును. "నేఁటికిఁ గూడ సర్వాంధ్ర దేశమునను బ్రాహ్మణాది వర్ణములవారికి కామేశ్వరి (అక్కలు) యిలువేల్పుగాఁగల యిండ్లలో వివాహాది శుభకార్యములు జరిగినతోడనే యక్కల కొల్పును జరుగును. ఆనాఁ డేడుగురు ముత్తైదువల కర్చనము జరుగును...ఉ| దేకజనకమైన గానఫణితిని కామేశ్వరిపాట వీరవాద్యములతో నా నాఁడు పాడుదురు" అని కీ. శే. వేటూరివారు సెలవిచ్చినారు.[29] అక్కల కొలుపుతో పాటి దేగదా జక్కులపాట. అందులకుఁ గ్రీడాభిరామమే ప్రమాణము. క్రీడాభిరాము కవిది "వినుకొండ" (గుంటూరుమండలము). అతఁడుటంకించిన జక్కులపాట-అక్కలయాట సన్నివేశమునకుఁ గథారంగ మోరుగల్లు (తెలంగాణము – క్రీడాభిరామమునకు మూలమైన ప్రేమాభిరామమునకుఁ గర్త రావిపాటి త్రిపురాంతకుఁడా ప్రాంతమువాఁడే. అతనికాలము క్రీ. శ. 1290-1330 ప్రాంతము). పై విషయములనుబట్టి యక్కలకొలుపు వ్రతసంప్రదాయమెట్లు చాలకాలమునుండి యాంధ్రప్రదేశమున వివిధప్రాంత పరివ్యాప్తమైనట్లు తెలియుచున్నదో యట్లే దానితో పాటే జక్కులపాటలకు నంతవ్యాప్తియు నుండఁబోలు నని యూహింపనగును. కీర్తిశేషులు ఏ. పి. కాంబేలు, సి. పి. బ్రౌనుదొరగారలు తమ యాంధ్రాంగ్ల నిఘంటువులందు జక్కులవారిఁ గామేశ్వరీ దేవతారాధకులుగనే

---

28. మంజువాణీము. శా. ప్రచురణ. ఏలూరు. తృతీయముద్రణ, 1921 'స్త్రీల పాటలు'– ద్వితీయభాగము–పుట 40-43

29. క్రీడాభిరామపీఠిక–పుట 96

పేర్కొని యుండిరి. అనఁగా వారికాలమునను (క్రీ. శ. 19 వ శతాబ్ది పూర్వార్ధము) గూడ జక్కులు కామేశ్వరినిఁ గొల్చుచునే యుండిరనుట నిశ్చయము. దేశమందుఁ బలుతావుల నాత్రేణసంప్రదాయము వ్యాప్తి గాంచుట జూడ జక్కులు "దేశద్రిమ్మరి" జాతివారుగాఁ గూడఁ గన్పట్టుచున్నారు "దేశద్రిమ్మరి" జాతులలోఁ బెక్కుచువృత్తులు మారుచుండుట సహజము. అందుచేతనే కానోపు నీనాఁడు వారికిని యక్షగానమునకును సంబంధము గానవచ్చుటలేదు. వారికిఁదమజాతీయ గానకళాభిమానము కంటె ముఖ్యమైనది కొలముదేవతయైన కామేశ్వరి కొలుపు. అదిమాత్రము వారువిడిచినట్లు గానరాదు. కాలక్రమమున వారు కామేశ్వరినే నమ్ముకొని "దేశద్రిమ్మరు"లై యూహార సంతానకాంక్షుల యిండ్లఁ బేరంటములు సేయుచు స్వీయజాతీయ గాన కళాభిమానములను వీడియుందురుగాక, కాని యాంధ్రమున యక్ష గానప్రాదుర్భావమునకు వీరియాటపాటలతోడి సంబంధమే యాంత రంగిక కారణమై యుండును.

యక్షగానమునకీ జక్కులవారి సంబంధము కారణముగా వారి కామేశ్వరికథ శివకేశవోభయ మాహాత్మ్య ప్రతిపాదకమును నొక విశిష్ట వ్రత సంప్రదాయమునకుఁ జెందినదియు నగుట చేతను, పాల్కురికి సోమన మాటలనుబట్టి యక్షగానము మొదట శ్రీశైలాది క్షేత్రములలో శివరాత్ర్యుత్సవాది సందర్భములలోఁ బ్రదర్శితమగు చుండెడి దని యూహింప నయితి యగుచుండుటచేతను నది హైందవ మతబీజకమనఁ జెల్లును. కన్నడదేశపు యక్షగాన ప్రదర్శన సంప్ర దాయమున దత్సంబంధి కాఁ దగు యక్షరాత్రి గాధ సైతఖరి జూచి నను నందు హైందవపురాణ విశ్వాసప్రతిపత్తి ప్రతీయమాన మగు చున్నది.

# పూర్వవాద సమన్వయము

ఆంధ్రమున యక్షగానోత్పత్తి గురించి విపశ్చిద్వరేణ్యులు కొందఱిదివఱకఁ గొంత విచారణ సల్పియుండిరి. భిన్నమతములుత్పన్నములైనవి కాని యందెవ్వరును జక్కులవారి సంబంధమును బూర్తిగా విసర్జించినవారు కారు. ఆ మత ప్రతిపాదనలలో ముఖ్యములైనవి మూఁడు. తత్తద్వాద ప్రతిపాదకులలో ముఖ్యులు ముగ్వురు. కీ. శే. పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు, కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, డాక్టరు శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు.

## 1. జక్కుల సంబంధము వాదము

యక్షగానోత్పత్తినిగూర్చిన విచారణలో ఆదినారాయణశాస్త్రిగారి వాదము ప్రాథమికము. ప్రాతః స్మరణీయము. యక్షగానమునకును జక్కులకును గల యనుబంధమును నిరూపించుటకుఁ బ్రయత్నించిన వారిలో వారే మొదటివారు.[30] ఆంధ్ర దేశమున విద్యావివేక ఘనులగు ప్రాచీన జాతుల వారిలో జక్కులు, బవినీడులు మున్నగువారు మిక్కిలి ప్రాచీనులనియు, నాంధ్రమునఁ బ్రాచీన కళాకౌశలమును వెలువరింపఁజాలిన స్మరణచిహ్నములేమైన వాఙ్మయరూపమున నున్నవని మనము తలంతుమేని యయ్యవి జక్కుల పాటలును, జక్కుల యాటలును, జక్కుల చిత్రకళా కౌశలములును మాత్రమే యగును గాని వేఱు కావనియు, జక్కులు తొలుత జాతీయ వీరనారీమణుల చరిత్రలనే గానము చేసెడివారనియు, నీనాఁటి పల్నాటి జక్కులకడ నందులకు సాక్ష్యము గలదనియు సెలవిచ్చినారు శాస్త్రి

30. చూ. "యక్షగానములు లేక జక్కుల పాటలు" అను వారివ్యాసము—ఆంధ్రపత్రిక దుర్మతి (1921) సంవత్సరాది సంచిక, పుటలు 121—126.

గారు. ఇది కొంతవట్టు యథార్థము కావచ్చును. కాని జక్కు-శబ్ద విచారము బార్చి వారు చేసిన ప్రతిపాదన సమర్థనీయముగాఁ దోఁపకున్నది. "యక్షులు అను పదమునకు మన పండితులు జక్కులు అనునది తద్భవ రూపమని వ్యవహరించు నాచారమున్నది. కాని జక్కులు అను మాట కేవలమును దేశ్యమని నా భావము. మనవారు దేశ్యశబ్దముల కనేకమునకు ఆర్యతా ప్రాకట్యమునకుఁ గాఁబోలు – సంస్కృత రూపములను గల్పించి వ్యత్యయముచేసి, సంస్కృత భావత్వమును అనుగ్రహించియున్నారు. ఈ వాడుక మన పండితులకుఁ గ్రొత్తకాదు. తెలుఁగు అను పదమునకు త్రిలింగాది రూపములు గల్పించుటలు మున్నగువానిఁ బరీక్షించినచో పైని చెప్పిన మనవారి వాడుకలోఁ గల యాథార్థ్యము తేలగలదు" అని వ్యాఖ్యానించి యున్నారు శాస్త్రిగారు. మన పండితులు దేశ్యశబ్దములు గొన్నింటికి సంస్కృత రూపములను గల్పించిన మాట వాస్తవమే కాని తద్భవ దేశ్యశబ్ద విచారమున సర్వదా యీ సూత్రము వర్తింపదు. అందును శాస్త్రిగారు చూపిన తెలుగు - త్రిలింగ శబ్దముల సామ్య మవిచార రమణీయము. అది యట్లుండ సామ్య మనునదొక విషయమును సమర్థించుటలో సమాధాన ప్రతిపత్తిసాధనమునకొక యుపాధికాఁగలదు. కాని యదియే యుపపత్తి కాఁజాలదు. ఇంతకును జక్కులపాటయే పండితుల గీర్వాణవశమున యక్షగానమైనదనికదా శాస్త్రిగారి వాదసారాంశము. అట్లైనచో జక్కులజాతియే ప్రాథమికమైన దనవలయును. మఱి యా జక్కులజాతి యెట్లేర్పడినదనున దొక యక్షప్రశ్నవలె మిగులును. యక్షులే జక్కులైనారనుటకు వారిజాతిమైతిహ్య ముండనే యున్నది. (పూర్వోక్తము). కాని జాతియుత్పత్తిని గూర్చిన చారిత్రకమైన విచారణలో నైతిహ్యములు సరియైన యుపపత్తులు కాఁజాలవు. గ్రంథశాసనాది ప్రమాణముల

వలన జక్క-యక్ష శబ్దములలో యక్షశబ్ద ప్రాచీనత్వము, భాషాశాస్త్ర ప్రమాణములచే జక్క- యక్ష శబ్దముల జన్యజనకసంబంధము నంగీకరించుట సమంజసమగును. అంతమాత్రమున జక్కులు దేవయోనులైన యక్షుల సంతతివారని చెప్పుటకాదు. భౌమజీవులైన యక్షులు పలుతావుల నుండినట్లు మీఁదఁ జెప్పఁబడినది. ఇట నొకవిశేషము నుటంకింపవలసి యున్నది: ప్రాచీనకాలమునఁ గర్ణాటదేశమునజైనము, నాంధ్రమున బౌద్ధము విశేషప్రచారమున నుండినట్లు చరిత్రవలన విశదమగుచున్నదికదా. జైనులందును, బౌద్ధులందును యక్షులను వారుండినట్లా యా వాఙ్మయములనుండి తెలియుచున్నది గదా. కన్నడదేశపు కెక్క-డిగలు, మన జక్కులును వారి సంతతివారైనను నైయుండవచ్చును. ఆయా దేశములందు జైన బౌద్ధముల ప్రాబల్యము క్షీణించిన తరువాత వారు హైందవమతావలంబులై యుందురు. లేదా జక్కులవారి విశ్వాసమును బట్టి దేవయోనులైన యక్షుల స్వరూపస్వభావాదులు పురాణాదులవలన విన్నంత కన్నంత వారి నాకర్షించి యుండును; వారు యక్షజాతిసంప్రదాయ విధేయులై యుందురు. లేక సింహళదేశపు వడ్డాజాతివారివలె యక్షారాధకులై యుందురు. లేక పాల్కురికి సోమనాథుఁడు చెప్పినట్లు శ్రీశైలాదిక్షేత్రములలో యాత్రికుల శివరాత్రి జాగరణాది సందర్భములందు గంధర్వ యక్షాది నేపథ్యములతో గాన కాలక్షేపములు చేయుచుండి, వివిధ దేవయోనులలో యక్షులు విశేషము విచిత్రమైన వారును, గామరూపులునని ప్రసిద్ధి కాఁబట్టి దాని కనుగుణముగ వారు వేయుచుండఁబోలునని యూహింపఁదగిన యా యక్ష వేషములు యాత్రికజనుల నెక్కువ యాకర్షింపఁగా బహు జనామోదమునకై తఱచు యక్ష వేషములనే వేయుచు గాన కాలక్షేపములను జేయుచు నదే ప్రధానవృత్తిగాఁ బరిణ

మెంప నట్టివారందఱు నొక జాతిగాఁ బరిగణింపఁబడి, వారివృత్తికి సంబంధించిన యక్షశబ్దమే వారికి జాతివాచకమై జనవ్యవహారమున రూఢమై నలుగుడువడి కాలక్రమమున జక్కుశబ్దముగా మారియుండును.

జక్కులజాతి యైతిహ్యము శివుఁడు యక్షులను పిలిచి జక్కుల ముద్రలు వైచి సంగీతోపకరణము లిచ్చి యొక నియోగము జేసినట్లు గలదు కదా. శివుఁడు సర్వలోకేశ్వరుఁడనుమాట యటుండ నతఁడు కుబేరసఖుఁడు, కుబేరుఁడు యక్షరాజుగావున నాయనను యక్షులు పని గల్గునపుడు శివాజ్ఞకు లోఁబడవలసినవారే యగుదురు. శ్రీశైలాదిశివక్షేత్రములందుఁ బ్రవర్తిల్లు వినోదకాలక్షేపములలో యక్ష నేపథ్యములకుఁ బ్రసక్తిగలదగుటచేఁ యక్షులకును శైవమునకును నేదో సంబంధముండినట్లు పొడగట్టును. పై విషయమును బేర్కొనిన పాల్కురికి సోమనాథుఁడు నాతని వాఙ్మయమును వర్ణించిన కాలము కన్నడ విషయమునుండి యాంధ్రమునకు వీరశైవము విజృంభించుచుండిన కాలము. అపుడా మతప్రచారార్థమో లేక శివసందర్శనాభిలాషులగుటనో ప్రసిద్ధములగు శ్రీశైలాది శివక్షేత్రములకుఁ గన్నడ దేశపు జక్కుల గాణలు వచ్చుచుండిరేమో! వారిలోఁ గొందఱు తెలుఁగు దేశమున స్థిరపడి నలువంకల వ్యాపించి, తెలుఁగువారిచే జక్కులవారని వ్యవహరింపఁబడుచు నుండిరేమొ! ఇవి యంతయు ఏ నాఁడాధారము లసలు మగుటంతిలో నూహ కుపాధి యున్నంతలో నొక నిశ్చితమైన సమస్యా యమున కనుగలము కాని వివిధ విచికిత్సల స్వరూప ప్రదర్శనము మాత్రమే కాని యన్వర్థసిద్ధాంత మెంతమాత్రమును గాదు. ఏమైన మునను బ్రాదుర్భావకాలమున యక్షగానమునకు యక్షశబ్ద వాచ్యు లెవరితోడనో యేదో ప్రగాఢమైన సంబంధముండియే యుండు నను టయు, జక్కుల గానకళాను బంధమును గాగన రానివి. ఆ యక్షశబ్ద

ణాచార్యులు జక్కులే రైయె యుందురనుట యిప్పటిమట్టునకు సమంజసము గనే కనిపించుచున్నది.

ఒకానొకప్పుడు సమానాంతరముగా జక్కులపాట యనునది జనసామాన్య వ్యవహారమునను,యక్షగానమనునది పండిత వ్యవహారము నను నుండియుండి కాలక్రమమునఁ బండితవ్యవహారమే రూఢమై యుండును. ఆదినారాయణశాస్త్రిగారి వాద మీ విధముగా సగము సమర్థింపఁబడుచున్నది.

## 2. కొరవంజె వాదము

ఇఁక రెండవ వాదము ద్రవిడదేశపు దృశ్యప్రబంధ విశేషమగు కొఱవంజి లేక కురవంజినుండి యక్షగాన ముత్పత్తియైనదనుట. ఈ వాదమునకు మొదటఁ బాదు కల్పించినవారు కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. వా రిందుగుఱించి తమ సుగ్రీవవిజయ[31] పీఠికలో నిట్లు సెలవిచ్చియున్నారు

"తెలుఁగునకు సాటి భాషలగు ద్రవిడ కర్ణాట భాషల పద్ధతులనుబట్టియుఁ దెలుఁగులో నిప్పుడుపలభ్యమానము లగుచున్న కొన్ని ప్రాచీన దృశ్యరచనముల తీరులనుబట్టియు, ద్రావిడ భాషాసామాన్యముగాఁ దొలుత వెలసిన నాటక రచనల స్వరూపము కొంత గుర్తింప వచ్చును.

"తొలుత ద్రావిడ భాషలలో వెలసిన దృశ్య రచనములు కురవంజు లనఁబడునవి. ఆంధ్ర కర్ణాట ద్రవిడ దేశముల యరణ్యములలో వసించు నాటవికులు, చెంచులు, కురవలు (కొఱ్ఱవ, కోయ) అనువారు. అందు కురవజాతివారి యంజె=అడుగు (నృత్య విశేషము) కురవంజె యనఁబడెను. చిందు, గంతు, గొండ్లి, అంజె, అంగ - ఇత్యా

31. కపిలేశ్వరపురం జమీందారుగారిప్రచురణ' 1939.

దులు నృత్యవిశేషములు. ఆంధ్రదేశమున బహుకాలమునుండి శివక్షేత్రములగు శ్రీశైలము, ఇంద్రకీలనగము (బెజవాడ కొండ) మొదలగు పర్వతములమీఁదను నృసింహక్షేత్రములగు వేదాద్రులు (పెక్కులున్నవి. మంగళాద్రి, సింహాద్రి, గరుడాద్రి, మాల్యాద్రి, వెంకటాద్రి ) మొదలగు పర్వతములమీఁదను వర్షోత్సవములు (యాత్రలు, జాత్రలు, జాతరలు) జరుగునప్పు డక్కడికి నాగరక ప్రజలు చేరుచుండువారు. వారి వినోదమునకై యక్కడి యాటవికులు, రాత్రులందు నృత్యవిశేషములు నెఱపి ధనార్జనము చేయుచుండువారు. అక్కడక్కడి కొరవ జాతులవారు చేయు నృత్యములు కొరవంజు లనఁబడెను. కొరవంజెయన్న పేరు తొలుత వారి నృత్యమునకును, పిదప నృత్య విశిష్టమైన వారి చిన్ని చిన్ని గేయరచనలకును, నాపై కురవజాతి వారికినిగూడఁ బేరైనది. కురవ జాతివారు తొలుత చేయు నృత్య విశేషము కాలక్రమమున నాయాపర్వతప్రదేశముల స్థల మాహాత్మ్య కథలతోను, శివ విష్ణులీలా కథలతోను మిళితములయి గేయ విశిష్ట నాట్యరూపములను బడసెను. అపుడు మాయాకిరాతార్జునీయము. నృసింహస్వామి చెంచీతను బెండ్లాడు స్థలమాహాత్మ్యకథలు (చెంచెతకథ) కురవంజులుగా వెలసెను. ఇట్లు వెలసిన యాదృశ్యరచనములు తొలుత నత్యల్పముగా గేయభాగములును విశేషముగా నృత్యమును గలవై యుండెను. అవి సింగి, సింగడు - అని యిద్దఱు పాత్రములు గలవై సంస్కృత వీధినాటకముల బోలియున్నవి....ఎంతో కాల మిట్లు కొండపట్టులందు సాఁగుచుఁ బెంపొందిన గేయనృత్య సందర్భములు నగరములకుఁగూడఁ గ్రమముగా వ్యాపించినవి. చెంచులు, కురవలు ... ఆటవికవస్తువులను నగరములకుఁ గొనివచ్చి అమ్ముచు నప్పుడప్పుడు తమ గేయ నృత్య విశేషములను నగరములందును, పల్లెలందును బ్రయోగించుటచే నవి నాగరిక దేశములందును వ్యాపించినవి.

" ఇట్లు నగరములందు నభిరుచి గొల్పిన యా గేయవిశిష్టనృత్య దృశ్యములు, జక్కులవారు (యక్షులు, కళావంతులు) తర్వాత నగరములందును బ్రయోగింపఁజొచ్చిరి. వీరి ప్రయోగములందు దృశ్యమయిన నృత్యాభినయసములతో పాటుగా నధికముగా గేయ వచన రూపమైన శ్రవ్యరచనముగూడఁ జేరెను. కురవంజులకంటె యక్షగానములు పర్యాప్తముగా శ్రవ్యములగు కవి రచనములు గలవి. వీరి రచనములతో బహువిధములగు పురాణకథలెల్లఁ జేరినవి. కురవంజులలోని సింగి, సింగఁడు పాత్రలు మాని రామ నల హరిశ్చంద్ర సీతా దమయంతీ చంద్రమత్యాది పాత్రలు వచ్చినవి. కాని వీనిలో నాటవిక రచనా సంస్కార సూచకముగా "ఎఱుకిలసాని" పాత్రము వెలసినది. కురవంజులలోని దేశి రచనలకంటె నత్యధికముగా వీనిలో దేశిచ్ఛందోబద్ధములగు గేయరచనలు ప్రబలినవి. రాజసభలలో, దేవోత్సవములలో, ఊరి జాత్రలలో యక్ష గంధర్వాది వేషములు ధరించి వేశ్యలు ప్రదర్శించునవి గావునను, నృత్యధర్మములకంటె గేయధర్మము లధికముగాఁగలవి కావునను నివి యక్షగానములనఁబడెను. కళావంతులలో నొక తెగకు నేఁడు జక్కులవారను పేరు గలదు. యక్షాది వేషముల ధరించి నృత్య గాన ప్రదర్శనములను గావించుటచేతనే వారికా పేరు వచ్చియుండును......యక్షగానము లిట్లు వెలసినను ప్రాచీనములయిన కురవంజి రచనములును యక్షగాన రచనా విధాన సంకలితములై ఈకాలమునఁగూడఁ గొన్ని సాగుచునే వచ్చినవి ... భిన్న పాత్ర వేష ధారణము లేక సింగి, సింగఁడు పాత్రలతో వెలసిన వీధి నాటకములనఁబడు కురవంజులు యక్షగాన రూపమునఁ బెంపొందినపుడు వేష భేదముగల పాత్రభేదములును బెంపొందెను. "

పై వాదము పిండితార్థము కురవంజినుండి యక్షగానము పెంపొందినదనుట. అసలు ప్రభాకరశాస్త్రిగారి వాదమున కుపాధి గల్పిం

చిన సందర్భము కొరవంజి పేరిటఁ గొన్ని యక్షగాన ప్రాయరచనలు తెనుఁగు కర్ణాటాంధ్ర భాషా నామాన్తరములుగాఁ గన్పట్టుటయే. అది యథార్థమే కాని యీ వాదమునకొక పూర్వపక్షముగలదు. మొదటివిషయము యక్షగానము పేరితోఁ దక్కఁ గొరవంజి పేరిటి దృశ్యరచనలు 17 శ. కు ముందునాఁటివి యే వాఙ్మయమునందును గన్పట్టుట లేదు. కాని కొఱవంజి పేరంతకు ముందే చాలకాలమునుండి వినవచ్చుచున్న మాట వాస్తవము. అయితే ప్రభాకరశాస్త్రిగారి వాదమెంతవఱకు సత్యసన్నిహితమో పరిశీలించుటకు ముందు ఈ వంజి చరిత్రమును, కొఱవంజి యక్షగానములసంబంధమును పర్యాలోచించుట ప్రసక్తము.

కొఱవంజి శబ్దమున కర్థమును దెలుపు కన్నడాంధ్ర నిఘంటువు లిట్లు పేర్కొన్నవి.

1. Kura – Vañci – Woman of the Kurava tribe; fortune teller. A Kind of dramatic poem.

   Vañci ( వంజి ) = Woman.

   (Madras University Tamil Lexicon)*

2. కొఱవంజ – ( కొఱవతి – కొఱవితి ) A female of the Koravas, who commonly is a fortune teller. ( కుఱువంజి, కఱత్తి ). ( F. Kittel's Kannada-English Dictionary )

3. a (కురవంజి) A gypsy. A gypsy dance; ( C. P. Brown's Telugu-English Dictionary )

---

* Ibid. Kuravan. n [T. Korava, K. Korava, M. Kuravan] Inhabitant of the hilly tract, of the desert tract, Kurava, a caste of fowlers, snake catchers, basket makers and fortune tellers. Kuravi. n. [K. Koravanji] a woman of Kurava caste.

Kuri. v. tr. To foretell, predict, forebode; n. Omen, presage.

b ( లేక ) కొఱవంజి — గొరవజాతిస్త్రీ, ఎఱుకుది ( సూర్యరాయాంధ్ర నిఘంటువు )

c — " కొరవంజి అను పాత్ర ప్రవేశము గల యక్షగాన రచనకు కొరవంజి అని పేరు " ( ఆంధ్ర వాఙ్మయసూచిక )

ఉపరి నిఘంటు ప్రతిపాదితార్థములను బట్టి కొఱవంజి శబ్దమునకుఁ గాలక్రమమున నెన్నియర్థములు కలిగినను గొఱవజాతిస్త్రీ యను నర్థము సమంజస మైనదిగను బ్రాచీనమైనదిగను గన్పట్టును. ఈ శబ్దస్వరూప మేభాషయందును ప్రభాకరశాస్త్రిగారు పేర్కొని నట్లు కొరవ + అంజె యనిగాని, లేక అంజ, అంజియ అనిగాని పేర్కొనఁబడలేదు. అన్నిట 'కొఱ - వంజి' యనియే పేర్కొనఁబడినది. " వంజి " యనునది తమిళభాషయం దొక స్త్రీ వాచక శబ్దమనుట స్పష్టము.

కొఱవ జాతి గుఱించి వారు దక్షిణ హిందూదేశ ద్వీపకల్ప మంతటను వ్యాపించియున్న యొక " దేశద్రిమ్మరి " తెగవారనియు, వారు భిన్న భాషా ప్రదేశములలోనుండుటచేత భిన్న భిన్న నామములతో ననఁగా నత్యంత దక్షిణమునఁ గొరవలనియు, నాంధ్రదేశమున నెఱుకలనియు వ్యవహరింపఁబడుచున్నా రనియు, భిన్న భాషలనగాఁ దమిళాంధ్ర కర్ణాటములను గలగాపులగముగా వాడుదురనియు, కొరవలు నెఱుకలు నొక్కకోవలోనివారు కనుకనే యిరువురకు నెఱుక చెప్పుట వృత్తియై యున్నదనియు, నిరువురును గొల్లాపురమ్మను గొల్తురనియుఁ దెలుగుఁదేశపు టెఱుకలవిషయమున వృత్తివాచకమైన శబ్దమే వారికి జాతి వాచకముగాఁ బరిణమించినదనియు థర్స్టన్

గారి దక్షిణ హిందూదేశపు కులములు తెగలను గూర్చిన యాంగ్ల గ్రంథమునఁ గలదు.

కాని పై గ్రంథమునఁ గొఱవ జాతి ప్రాచీనతనుగుఱించి గాని వారి యాటపాటలగుఱించిగాని చెప్పఁబడలేదు. ప్రాచీన తమిళ మహా కావ్యములలో నొకటియగు శిలప్పదిగారమున[32] 'కురవైకూత్తు'* అనఁగా కురవై అను నృత్యవిశేషమొకటి తఱచు పేర్కొనఁబడినది. అది ప్రాయికముగాఁ గురవలలేక కొరవల జాతీయ నృత్యవిశేషమై యుండునని పలువురు పండితుల తలంపు. అది బహుభంగులుగా నుండునని శిలప్పదిగారము వలననే తెలియుచున్నది. కాని రెండు రకములు మాత్రమే శి. గా. న. బేర్కొనఁబడినవి. ఒకటి విష్ణు (కృష్ణ) ప్రశంసాత్మకముగా గొల్లభామలు చేయునది, రెండవది మురుగన్ (సుబ్రహ్మణ్యస్వామి లేక కుమారస్వామి) ప్రశంసాత్మకముగా కొండజాతి కన్యలు (కొరవంజలు) చేయునది. రెండింటికిని బ్రక్రియలో నించుక భేదమున్నను నవి రాసక్రీడప్రక్రియకుఁ గొంత సన్నిహితముగా నుండును. తన్నిర్వాహకుల కవి పశుజాడ్య దుర్నిమిత్తాది భయాపహములను విశ్వాసము గలదు. ఈ రెంటికిని వరుసగా అచ్చియర్ కురవై, కున్రక్కురవై అని పేళ్లు. కడమ కురవైకూత్తు రకములలో కార్కురవై యనునది శీతకాలానుకూలమైన గీతనృత్యములుగలది; పిన్రెక్కురవై, మున్రెక్కురవై యనునవి రణజయసూచకముగా రథసన్నిధిని జరుగు

32. దీని రచనాకాలము గుఱించి భిన్నాభిప్రాయములుగలవు. క్రీ. శ. 2 వ శతాబ్దియని శ్రీ వి. ఆర్. ఆర్. దీక్షితారుగారి యభిప్రాయము. (చూ. వారి శి. గా. అనువాదము - అనుబంధము నం. 2).

* Kuravai. n. Dance in a circle prevalent among the women of Sylvan or hill tracts; Chorus of shrill Sound made by women by wagging the tongue, uttered on festive occaoasions (M. U. Tamil Lexicon).

నృత్యములు. ఇవిగాక కొఱ్ఱవై (దేవత?) గౌరవార్థము జరుపఁబడు కూత్తొకటి గలదఁట.[33] పై విషయములలో "కురవై" పేరును బట్టియు నా కూత్తురకములలో నొకటి (కున్రక్కురవై) కొండజాతి స్త్రీలచే సుబ్రహ్మణ్యస్వామి ప్రశంసాత్మకముగాఁ బ్రవర్తింపఁబడునది కాఁబట్టియు (కొరవలు సుబ్రహ్మణ్యారాధకులని థర్స్టన్ గ్రంథమునఁ గలదు. ఆయన భార్యయగు వల్లి తమ యింటి యాఁడుపడుచని వారి విశ్వాసము)* నది కొఱవంజులకు సంబంధించినదే కావచ్చునని తలంపనగును. అట్లైనఁ గొఱవజాతి యతిప్రాచీనమైన దనియు వారికి గొప్ప నృత్యకళాభిమాన ప్రతిష్ఠలు గలవనియుఁ జెప్పనగును. కురవలు ప్రాక్చారిత్రక కాలమునకుఁ జెందిన యొక కొండజాతి దేశద్రిమ్మరి తెగ వారని శ్రీ వి. ఆర్. ఆర్. దీక్షితారుగారి యభిప్రాయము.+ కాని కడమ కురవై కూత్తు రకములకును వారికిని సంబంధముండి నట్లూహింప నశక్యము. అట్టి సంబంధ ముండినట్లూహింప నవకాశము గల యా కున్రక్కురవై యైనను వారిజాతీయ వృత్తిసంప్రదాయముల కంత సన్నిహితముగా లేదు. అందుచే నింతకంటె బలవత్తరమగు నాధారము నన్వేషింప వలయును. మదరాసు విశ్వవిద్యాలయ తమిళ నిఘంటువు కురవై యనఁగా నటవీ గిరి ప్రదేశ జాతిస్త్రీలలోఁ బ్రాచుర్యము వహించిన యొక మండలనృత్యమని మాత్రము పేర్కొన్నది. ఇది యపర్యాప్త నిర్వచనము. వెణ్బామాలై అను తమిళ గ్రంథమున

33. పై విషయముల గురించి వివరములకు శ్రీ వి. ఆర్. రామచంద్ర దీక్షితారు గారి శిలప్పది కారాంగ్లానువాదము, పీఠిక, అధోజ్ఞాపికలు - పుటలు 49, 50, 59, 229, 231, 238, 275, 277, 2o0, 281, 288, 297, 302, 305 చూడఁ దగును.

* Ibid, పుటలు 281, 280.

+ పుట 288. అధోజ్ఞాపిక నం. 5.

(111 - 7) "కొఱ్ఱవంజి" యనుపేరు గన్పట్టుచున్నది. కాని యది యొక జయగీతము మాత్రము. (చూ. Tamil Lex.) ("అపరాజిత భూరి భుజా కృపాణధారాజల శాంతశాత్రవ ప్రతాప" డగు నొక రాజేంద్రుని ప్రశంస యందలి విషయముగును) కురవంజి యను పద తమిళదేశపు దొంబదియాటలు ప్రబంధములలో నొకటిగాఁ జేర్కొనఁబడెను.[34] కుఱత్తిప్పాట్టు[35(a)] :- పన్నిరుపాట్టియల్, ఇళక్కణ విళక్కై మొదలగు తమిళ లక్షణగ్రంథములందు కుఱత్తిప్పాట్టు (కుఱవసతిపాట) పేర్కొనఁబడినది. అది మొదట కుఱత్తి చెప్పు సోది(ఎఱుక)విషయముగా గల కురమ్ అను పద్యరూపమున నుండెడిదట. తదుపరి యది కురవసు కలంబక మను ప్రబంధమున నొక యంకముగాఁ జేర్పఁబడినదట. వీని పరిణామమే కురవంజి దృశ్య రచనమునకు దారితీసినది. ఇట్టి దృశ్య రచనములు క్రీ. శ. 17 వ శతాబ్దికి ముందు గానరావని తమిళ వాఙ్మయ పరిశోధకుల తలంపు.[35 (b)] నేఁటి మలయాళమున "కొఱత్తి యాట్టమ్" అను పేర నీదృశ్య రచనము ప్రయోగింపఁబడుచున్నది.[36]

---

34. మా. ప్రా. లి. పు. భాం. తమిళ గ్రంథముల వర్ణనాత్మక సూచిక రెండవభాగము, ఆర్. నం. 178 - ముత్తానందర్ కురవంజి గూర్చిన వాక్యము.

35 (a). KurattipPattu - a Poem in which a Kurava woman is represented as describing to a maiden her fortune in a love affair. (M. U. Tamil Lexicon).

35 (b) చూ. శ్రీ ఎస్. పార్థసారథి గారి "కురవంజి నాటకము" అను తమిళ వ్యాసము - అముద సురభి యను మదరాసు తమిళ మాసపత్రిక 1954 సం. డిశెంబరు సంచికలో ప్రకటితము.

36. Vide., 'The Music of the Nrtya Natakas of South India' - Thesis Submitted by Srimati K. Gomati for the M. Litt of the Madras University. (A Ms. copy of it is kept in that University Library)

కన్నడమునఁ గొరవంజి పేరనే కొన్ని రచనములిట్టివి వెలసినవి.[37] ప్రాకృత భాషలోను, మహారాష్ట్రభాషలోఁగూడ నొకొక్క కొరవంజి వెలసియుండుట విశేషము.[38] ఇందెద్దియు నంత ప్రాచీనమైనదికాదు. అన్నియుఁ బదునేఁడవ శతాబ్ది కిటీవలివే. ఇఁకఁ దెనుఁగునఁ గొరవంజికి గల ప్రసక్తి యెట్టిదో పరిశీలింపవలసి యున్నది. ఆంధ్ర వాఙ్మయమున మొట్టమొదటగా నెఱుకతపాత్ర ప్రవేశమునకు, నామె యెఱుకచెప్పు ఘట్టమునకును నొక భంగ్యంతర ప్రసక్తి బమ్మెర పోతనామాత్యుని కృతియని చెప్పఁబడు వీరభద్రవిజయము నందుఁ గన్పట్టును. కాని కొరవంజి శబ్దము ప్రప్రథమముగాఁ గన్పట్టుట అయ్యలరాజు రామభద్రకవి (16 వ శతాబ్ది) రామాభ్యుదయము నందు :-

అణునిభ మధ్య లాక్రియలు నాపరి భాషలు నొప్పఁజిందు జ
క్కిణి కొరవంజి మేళములఁ గేళికసల్పిరి దేవతా నటీ
మణులకు బొమ్మవెట్టుక్రియ మర్దళతాళ నినాదపద్ధతిన్
రణదురు రత్ననూపుర ఝణం ఝణముల్ మెఱయంబదాహతిన్.

(ఆశ్వా 2 - పద్య 131)

("మేళముల" అనుటకు "వేషముల" అనుపాఠాంతరము గలదు). జక్కిణితోపాటు కొరవంజియు నొకనాట్య ప్రభేదముగఁ బేర్కొనఁబడుట విశేషము. తంజావూరి విజయ రాఘవ నాయకుని

---

37. eg. 'Parvati Koravanji' By Venkayya G. O. M. L. Kannada Mss. D No. 1203.

38. (Ofcourse by accident) a. Prakrit Koravanji G O. M. L. Kannda Mss. D. No. 1128, Kanthirava Narasaraju Melana Natakagalu-- No. 4.

b. Marathi-- 'Devendra Kuravanji' by Serfoji II; Saraswati Mahal publication., Tanjore, 1950.

(క్రీ. శ. 1631 - 1673) రఘునాథనాయకాభ్యుదయము[39] ప్రహ్లాద చరిత్ర[40] లందును జక్కిణితోపాటు కొరవంజి నాట్య ప్రభేదముగనే పేర్కొనఁబడినది. ఆంధ్ర యక్షగానములలోఁ గొరవంజి వాలక మీ విజయరాఘవుని కాలమునుండియే కన్పట్టును. తదంకితములుగా వెలసిన యక్షగాన నాటకములలో+ (1) మన్నారుదాసవిలాసము. (2) విజయరాఘవచంద్రికావిహారము. (3) విజయరాఘవకల్యాణము నను వానిలో నెఱుకఘట్టము గలదు. అందు వి. రా. చం. వి., వి. రా. క. లం దెఱుకత కొరవంజిగాఁ బేర్కొనఁబడినది. ఆ రెండింట గొరవంజి వేషభాషలు వర్ణితములైన దరువుల పేరు "కొరవంజిదరువు" లని యుండుట గమనింపఁ దగినది. అప్పటిమట్టునకుఁ గానరాదు కాని యీ మలితరము నుండియే కొరవంజిశబ్దమే తాదృక్కావ్య వాచిగాఁ బ్రయుక్తమగుట గన్పట్టును. అనఁగా జక్కిణిశబ్దమునవలెఁ గొరవంజి శబ్దముగూడ మొదట నొకజాతి స్త్రీవాచకమై, ఆ జాతి స్త్రీ యాటపాట లాదికారణములుగా నొక నాట్య ప్రభేదమునకు నొక గీతప్రబంధ మునకును బిమ్మట నొకవిధమగు దృశ్య రచనమునకును బేరగుట గమనింపఁ దగినది. ఆ పరిణామ క్రమము సహజమైనదిగనే తోఁచును.

క్రీ. శ. 1684 - 1712 సం. ల నడుమఁ దంజావూరి నేలిన మహారాష్ట్ర ప్రభువగు శహాజీ యాస్థాన కవియైన దర్భా గిరిరాజకవి రచించిన రాజమోహాన కొరవంజియు,[41] క్రీ. శ. 1704 - 1713 సం. నడుమ

39. తం. స. మ. ప్రచురణ. నం. 3౬. 1951. పుట 21.

40. తం. స. మ. కే. నం. 541. అవతారిక.

+ (1) ఆం. సా. ప. ప్రచురణ, 1927. (2), (3)- త. స. మ., కే. నం. 603, 602.

41. తం. స. మ, కే. సం, 509 - 511, 570 - ఇందు కొరవంజి, ఎఱుకత, సింగి యను పదములు సమానార్థకముగాఁ బ్రయోగింపఁబడినవి,

మైసూరియొడయఁ డగు కంఠీరవ నరసరాజు రచించిన కొరవంజి కర్లెయుఁ[42] దెలుఁగు కొరవంజులలో మొట్టమొదటి తరమునకుఁ జెందినట్టివి. అవి కొరవంజి పాత్రకుఁ బ్రాధాన్యము గలవి. ముందు నాటి విజయరాఘవ చంద్రికా విహారాదు లందుఁ గొరవంజి పాత్రకుఁ బ్రసక్తి యున్నను నవి కొరవంజులని వ్యవహరింపఁ బడకపోవుటకుఁ గారణము అప్పటికిఁ గొరవంజికి దృశ్యకావ్య ప్రసిద్ధి లేకపోవుట కావచ్చును. లేక యా గ్రంథములందా పాత్రయుఁ గడమపాత్రలతో పాటొకటియై తగిన ప్రాధాన్యము దక్కియుండుటఁ గావచ్చును. అందుచేతనే కాఁబోలు గిరిరాజ కంఠీరవ రాజుల కృతులకుఁ బిదప నెఱుకత పాత్రతో నేతాదృగ్రచనము + లనేకము వెలసియున్నను గొన్ని మాత్రమే కొరవంజులని వ్యవహరింపఁబడినవి.

ఇఁక బ్రకృతము - అట్లు వెలసిన కొరవంజులకును యక్షగానములకును గల సంబంధము పరిశీలించుట కర్తవ్యము. ఆ రెండు ప్రక్రియలును దక్షిణ భారతదేశ ప్రముఖభాషలగు తమిళ కర్ణాటాంధ్రములందు మూఁడింటను వెలసియుంట విశేషము. కొరవంజుల పేరఁ దమిళ కర్ణాటాంధ్ర ప్రాకృత మహారాష్ట్రములందు వ్యవహరింపఁ బడుచున్న దృశ్య రచనములన్నియుఁ గొరవంజి పాత్రవిశిష్టములు. అన్నిటను రచనాప్రక్రియ యచ్చుమచ్చు మన యక్షగాన రచనా ప్రక్రియా

42. ప్రా. లి పు భాం. కన్నడ గ్రంథములు - డి. నం. 1128. ఇందీతఁడు తమిళ కన్నడ ప్రాకృతములందు రచించిన కొరవంజులును గలవు.

+ అర్వాచీన ప్రబంధములందును గొన్నిట గొరవంజి పాత్రకుఁ బ్రసక్తి కన్పట్టును. ఉదా :- (1) శుకసప్తతి (I, 95 - 100) ; (2) దశావతార చరిత్రము, VII. 285 - 290 ఇందు జక్కిణిఫణంట కొరవంజి నృత్యవిశేషముగనుగూడ సూచింపఁ బడినది ) (3) వేంకటాచలమాహాత్మ్యము ( V. 6 - 32. ఇందెఱుక ఘట్టము సుదీర్ఘముగను సుందరముగను వర్ణితము).

సంవాదిగా నున్నది. కొన్ని కొరవంజులు యక్షగానము లనియే పేర్కొనఁబడినవి. ఉదా : పార్వతి కొరవంజి యను కన్నడ కొరవంజి గ్రంథారంభమున గ్రంథకర్త "కొరవంజి కబ్బె యక్షగానక్కె కథా ప్రారంభవ దెంతనె" యని వక్కాణించినాఁడు. సన్నిధిరాజు జగ్గకవి యను తెనుఁగుకవి తను రచించిన "ఎఱుకల కురవంజి" యను గ్రంథమును +"కురవంజి యక్షగానమహాప్రబంధంబు" అని యవతారికలోను గ్రంథాంతగద్యయందును బేర్కొనియున్నాఁడు. అనఁగాఁ గొరవంజియు యక్షగానమును రచనా ప్రక్రియలో నభిన్నము లనియును, గొరవంజి పాత్ర ప్రధానములైన యక్షగాన రచనలకే కొరవంజి మరియొక పేరుమాత్రమనియు గ్రహింపనగును. ప్రదర్శన ప్రక్రియలోఁగూడ యక్షగానము, కొరవంజి - రెండును నృత్య కళాత్మకము లగుట వాని సంబంధమును జక్కిణి కొరవంజి నృత్యములు పూర్వప్రబంధములందు జంటగా పేర్కొనఁబడి యుండిన విషయముగూడ సమర్థింపఁ గల దేమో ! కాని కొరవంజినుండియే యక్షగాన ముత్పన్నమైన దనుటకుఁ బ్రబల ప్రతిబంధకములు కొన్ని గలవు. మొట్టమొదటి సంగతి కొరవంజి శబ్దము యక్షగాన నామోత్పత్తిని సమర్థింపలేదు. పోనీ కొరవంజులే ప్రాచీనములు, వానిని జక్కులవారు ప్రయోగింప మొదలిడిన నాఁటి నుండియే వానికి యక్షగానమను వ్యవహారము గల్గియుండు నన్నచో నందులకు సమాధానము కొరవంజిపేరిట యక్షగాన ప్రాయమైన దృశ్య రచనము క్రీ. శ. 17 వ శతాబ్దికి ముందు వెలసిన జాడ గానరాదు. పదునేడవ శతాబ్దికి ముందు వెలసిన యక్షగానములు మాత్రము నేఁ డుపలబ్ధము లగుచున్నవి. కొరవంజులన్నిట కొరవంజి పాత్ర కాన వచ్చుచున్నట్లు యక్షగానము లన్నిట నాపాత్ర గానరాదు. ప్రాచీన యక్షగానములందా పాత్రకుఁ బ్రాముఖ్యముండి యదికాల

+ ప్రా. లి. పు. భాం. , డి. సం. 1852.

క్రమమున దిగజారి యుండవచ్చునన్నచోఁ బదునేడవ శతాబ్దికి ముందు నాఁటి యక్షగానము లుపలబ్ధమగుచున్నవి కదా, యందొక్కదాని యందును నాపాత్రప్రసక్తి కానరాకుండుటేల యను ప్రశ్న వచ్చును. అదికాక 17 శ. నుండియే యక్షగానములందా పాత్రకుఁ బ్రాముఖ్య మతిశయించినట్లు తోఁచును. అందుచేతను నీనాఁ డుపలబ్ధము లగుచున్న కొరవంజి దృశ్యరచనలకంటెఁ బ్రాచీనములైన యక్ష గానములు గన్పట్టుచుండుటచేతను యక్షగానమునుండి కొరవంజి పుట్టినదనుట యెంత సమంజస మగునో, కొరవంజినుండి యక్షగానము ప్రాదుర్భవించిన దనుటయు నంత సమంజసమే యగును. అనగా నారెంటికిని బరస్పరజన్యజనక భావసంబంధము లేదనుటయే కాని సంబంధ మసలే లేదనుట పొసగదు గదా. అది యెట్టిదో పైని వివరింపఁ బడినది. మఱి యా సంబంధ మేర్పడుటకుఁ గారణ మేమై యుండునను ప్రశ్న వెన్నంటివచ్చును. క్రీ. శ. 16 - 17 శతాబ్దుల నడుమనొక నూఱేండ్ల పైచిలు కాంధ్రనాయక రాజులు దక్షిణదేశమును బరిపా లించుట తటస్థించినది. అందు దమిళనాఁడు నడిబొడ్డగు తంజావూరున విజయరాఘవ నాయకుని కాలమున నాంధ్ర యక్షగాన వాఙ్మయ మభ్యుచ్ఛ్రియ మందినది. చమత్కార జనకత యొక ముఖ్య ప్రయో జనమై యానాఁడు యక్షగాన మొకచాటు కావ్యముగాఁ బరిగణింపఁ బడినది. ఆ కవులకుఁ దాత్కాలిక విషయములు నందు వైవిధ్యము నుపాదేయము లైనవి. సమకాలిక జాతీయజీవన ప్రతిబింబన మా యక్షగానముల కొక జీవలక్షణముగాఁ దోఁచును. విజయ రాఘవా స్థానమున వెలసిన యక్షగానములలో నాఁటి వివిధ రాజాస్థానో ద్యోగులు, పండితులు, కవులు, పురోహితులు, ముత్తైదువలు, గొల్లలు, చెంచులు జక్కులసాని మొదలగువారి పాత్రలు వేషభాషా విశేష ములు జాతివార్తాచమత్కార చారువులుగాఁ జిత్రింపఁబడినవి. అట్టిచో

నట్టి యక్షగానములందు కొరవంజియు నొకపాత్ర యగుటలో వింత లేదు. కొరవంజు లెంత గిరికానన వాసినులైనను దఱచు పురములు జొచ్చి ప్రియకాంక్షులైన పురంధ్రుల కెఱుక చెప్పుట వారిముఖ్యవృత్తి. వారి యాటవికమైన వాలకము పలుయాసలబాస, "కురి" చెప్పు నపుడొక కూనరాగముతో నెఱుకదేవుళ్ళ నేకరువు పెట్టునొడుపు మొదలగు విషయములు జాతివార్తా చమత్కార ప్రియులైన నాఁటి యక్షగాన కవుల నాకర్షించి యుండును. లేక కొరవంజి యప్పటికే తొంబదియాఱు తమిళ ప్రబంధములలో నొకటిగా, బరిగణింపఁ బడుచుండినచో నా తంజావూరి తెలుఁగు కవులు తమ యక్షగాన రచనలలో దానిపోకడను గ్రహించిరేమో! తమిళదేశమున నాంధ్ర రాజుల కాలమున నట్టిది సంభావ్యముగదా + అంతియకాక భరత విద్యా ప్రియంభావుకులగు నాయకరాజులు బహువిధ దేశీయ నృత్య గీత ప్రబంధ విశేషములయెడ నత్యంతాదరము జూపినట్లు వారి వాఙ్మయము సాక్ష్యమిచ్చుచున్నది. ++ అందు జక్కిణి, కొరవంజు లకుఁ గూడ వారి యాదరము లభించినది. మన వాఙ్మయమున నా రెండును దఱచొకదానివెంట నొకటి జంటగాఁ జేర్కొనఁబడుటఁ జూడ నారెండింటికి నేదో సాదృశ్య ముండినట్లు తోఁచును. కాని యాంధ్ర ద్రవిడ దేశములం దవి సమానాంతరముగాఁ బరస్పరాను

---

+ విజయరాఘవ రచిత రఘునాథాభ్యుదయాదులందు దొంబడి యాఱు తమిళ ప్రబంధములలో నొకటియగు "ఉలా" ప్రబంధపు పోకడగలదు. చూ. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి పీఠిక,

++ చూ విజయరాఘవుని ప్రహ్లాదచరిత్ర, చెంగల్వ కాళకవి రాజగోపాల విలాసముల యవతారికలు. (రా. గో. వి. నఁగూడ జక్కిణితో పాటు కొరము, కొరవంజి దృశ్యరచనకు మూలమైనది, నాట్యబంధముగాఁ జేర్కొనఁబడినది. 1 - 23)

బంధ నిరపేక్షముగనే వర్ధిల్లుచు వచ్చియుండును గాని వానికతి ప్రాచీనమైన సంబంధ ముండిన చొప్పు గానరాదు. ఏమైన సంబంధ మేర్పడి యుండిన నది నాయకరాజుల కొలువులోనే యేర్పడి యుండె నేమో! ఒకవేళఁ గొరవంజి యక్షగాన ప్రాయమైన దృశ్యాత్మక సాహిత్య ప్రక్రియగా వెలయుటకు నాయకరాజుల కృషియే మూల కారణ మగునేమో! అసలు యక్షగానము తమిళుల కాంధ్రులు పెట్టిన భిక్షగనే తోఁచును. + ఇదినిజమైనను గాకపోయినను వేటూరి వారి వాదము నిలువఁజాలదను విషయము మీఁద నిరూపింపఁబడినది. అసలు వారి కురవంజివాదము. యక్షగానము మాట యటుండ సంస్కృత నాటకోత్పత్తి విషయము దాఁక నరసాగినది. "దేశిరచన లలో నుండి సింగి, సింగఁడు, కోణంగి, దరువు అనునవి నటీనటులుగను విదూషకుండుగను ధ్రువగను సంస్కృత నాటకములఁ జేరెనేమో యని కూడ యోజింపఁదగినట్లున్నది." అని యనియున్నారాయన. * అట్లే "కురవంజులలోని సింగి, సింగఁడు పాత్రలు మారి రామ నల హరిశ్చంద్ర సీతా దమయంతీ చంద్ర మత్యాదిపాత్రలు వచ్చినవి." అని యక్షగాన విషయమున ననియున్నారు. కాని యట్లు సింగి, సింగఁడు పాత్రములకు మాఱుగా రామ నలాదిపురాణ ప్రసిద్ధములగు

+ తంజావూరు నాంధ్రనాయక రాజుల పాలించిన కాలమున నిట్టిది సంభావ్యముగదా, నాయక రాజులకు ముందు నాఁటి యక్షగానములు తమిళమున లేవు. తెనుఁగు య. గా. లనే కొన్నిటిని తమిళకవులు "తర్జుమా" చేసికొని యుండుట విశేషము ఉదా.- రాజగోపాలన్ అను కవి రచించిన "సుక్కిరీవ విజయం" అను తమిళ యక్షగానము. (ప్రా. లి. పు. భాం. డి. నం. 509 - 511) మన కందుకూరి రుద్రకవి సుగ్రీవ విజయమున కనువాద ప్రాయమైనది. (తమిళయక్ష గానములందైన నన్నిటను గొరవంజి పాత్ర లేదు. అందులకు నీ సుక్కిరీవ విజయమే తార్కాణ)

* సుగ్రీవ విజయ పీఠిక పుటలు 6 - 7.

పాత్రములు యక్షగానములందుఁ బ్రవేశించెననుట " సబబు " కాదు. పురాణపాత్రలకును సింగి సింగఁడు పాత్రలకును నేకత్ర ప్రసక్తిగల యక్షగానము లనేకము గలవు.[43] ఎటుజూచినను వేటూరివారి వాదము నిలుచునట్లు లేదు. కాని వారా వాద సందర్భమున యక్ష గానము గుఱించి చెప్పిన యితర విషయము లనేక మమూల్యము లైనవి. అవశ్యము గ్రాహ్యములును. వారును యక్షగానమునకు జక్కులవారితోఁ గల సంబంధము గుర్తించియుండుట గమనింపఁదగినది.

వేటూరి వారి కొరవంజి - యక్షగాన సంబంధ వాదమును బ్రతిపాదించిన దినములలోనే మఱికొంత మంది పండితులు నట్టి యభిప్రాయములనే వెలిబుచ్చిరి. శ్రీ చింతా దీక్షితులుగారు "కొన్ని యక్షగానాలలో కొరవంజి పాత్ర వుంటుంది. అట్టి యక్షగానాలకు కొరవంజులని పేరు ......... తెలుగు యక్షగానాలు ప్రశస్తమైన వాఙ్మయ శాఖ అనిన్నీ, ద్రావిడ వాఙ్మయంతో సంబంధం కలవి అనిన్నీ వెల్లడి అవుతోంది." అని వ్రాసియున్నారు.[44] నిన్న మొన్నటి దనుక జాలమంది పెద్దలీ వాదమునే యామోదించుచు వచ్చిరి. ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారు "రూపకావిర్భావములో మొదటిదశ కురవంజులు వెడలుట ...... కురవంజులు అటవికుల మూలమున పట్టణములకు ప్రాకి నగరకవులు కురవంజుల వంటి రచనలు చేయసాగిరి. వీనిని ప్రదర్శించువారు జక్కులు గనుక నివి యక్షగానములను పేరుదాల్చెను." అని వేటూరివారి వాదము

43. తరిగొండ వెంగమాంబ శివవిలాసము, కొరిమెల్ల కురవంజి (ప్రా. లి. పు. భాం. ఆర్ నెం. 978)

44. చూ. వారి "కొరవంజి" అను వ్యాసము - ఆంధ్రపత్రిక ప్రమాది సంవత్సరాది సంచిక

నామోదించిరి. వీరును యక్షగాన నామోత్పత్తి విషయమున జక్కుల జాతిసంబంధము నవశ్యము నంగీకరించిన వారే.[45]

మొట్టమొదటగా నీకొరవంజి - యక్షగాన జన్యజనక సంబంధ వాదము పాదు నగల్చి "కొరవంజినుండి యక్షగాన ముత్పత్తి యాయెనని చెప్పుట సరికాదు" దని నిరూపించి,[46] యక్షగానోత్పత్త్యభ్యుదయములఁ గూర్చిన పరిశోధనలో విశేషకృషి సల్పి పూర్వ పరిశోధకులకంటె నెక్కుడు విశేషములుదెల్పి భావిపరిశోధకులకు మార్గదర్శకులైనవారు డాక్టరు శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు. యక్షగానోత్పత్తి విషయమై వారి యభిప్రాయము లెట్టివో తెలిసి కొనుట యవశ్య కర్తవ్యము.

## -: (3) బొమ్మలాట - యక్షగానము+ :-

బొమ్మలాటల పరిణామమే యక్షగానమని శ్రీ వెంకట రమణయ్యగారి యభిప్రాయము. "యక్షగానములు మతప్రచారము కొఱకు ప్రభవించినవిగాని వేడుక కొఱకుఁగాదు. మతబోధ కొఱకు మన ప్రాచీను లవలంబించిన మార్గములలోఁ బురాణేతిహాసాదులలోని గాథలను జన సామాన్యమునకుఁ గన్నుల గట్టునట్లు ప్రదర్శించి చూపుట యొకటి. బౌద్ధమత ప్రచారమునకు అశోక చక్రవర్తి యీ మార్గమును ననుసరించి నట్లాతని శాసనములవలనఁ దెలియుచున్నది. మత ప్రచారమునకు మిక్కిలి యనుకూలమైన సమయములు యాత్రలు, వీనిని మనము జాత్రలనియు దిరునాళ్ళనియు జెప్పుదుము. ఆసమ

45. చూ. వారి "ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము" – పుటలు 208–210.

46. చూ. వారి "యక్షగానము. తంజావూరు" అను వ్యాసము _ ఆంధ్ర పత్రిక ఖర సంవత్సరాది సంచిక. (1951 – 52).

+ ఈవిషయమై యిదివఱకొక వ్యాసము ప్రకటించి యుంటిని. చూ. భారతి ఆగస్టు, 1955.

యములందు కూడ వేలకొలది జనులను వినోదపెట్టుచు దన్మూలమున ధర్మబోధన సేయుట కొఱకీ ప్రదర్శనము లేర్పడినవి. ఇట్టి ప్రదర్శనము లాద్యమున కొయ్యబొమ్మల మూలముననుదోలుబొమ్మల మూలము నను సాగెడివి. సూత్రధారుడు - అనగా బొమ్మలకుగట్టిన దారములను ధరించువాడు - కథను గేయముగ బాడుచు దదనుగుణముగ దారము లను లాగి బొమ్మల నాడించువాడు. ఇట్టి బొమ్మలాటలు శివరాత్రి మహోత్సవ సమయమున శ్రీశైలమునందు ప్రదర్శించు వారని పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రమున గలదు.

భారతాది కథల చీర మఱుగుల
నారంగ బొమ్మల నాడించు వారు
కడు నద్భుతంబుగ గంబ సూత్రంబు
లడరంగ బొమ్మల నాడించువారు

ఇందొకటి తోలుబొమ్మలాట. మఱియొకటి కొయ్యబొమ్మలాట. ఈ బొమ్మలాటల పరిణామమే మన యక్షగానము. కాలక్రమమున బొమ్మలకు బదులు మనుజులే ప్రదర్శించిన నెక్కుడు ప్రయోజన కరమగునను నభిప్రాయము గల్గినది. కథలయందలి పాత్రల కర్హమైన వేషములను ధరించి నర్తకులు ప్రదర్శింప గడంగిరి. తొలుదొల్త బొమ్మలాట సంప్రదాయము ననుసరించి మూకనాట్యముగ బ్రారంభ మైనది. సూత్రధారుడును నతని తోడివారును గేయరూపమైన కథను బాడుచుండగా నుచితవేషధారులైన నర్తకులు తదనుగుణముగ నభినయము సేయుచు నాట్యము సల్పెడివారు. కేరళదేశమున నేటికిని వాడుక యందుండు కథకళి దీనికిం దార్కాణ. నర్తకులు మూక నాట్యముతోం జిరకాలము తృప్తినంది యుండలేదు. కొయ్య, తోలు బొమ్మలవలె సూత్రధారుని పాట కనుగుణముగ నాడుట వారికి

నచ్చలేదు. రెండుకార్యములను దామే నిర్వహించిన స్వారస్య మితోధికముగ నుండునని యెంచి తామే పాడుచు తదనుగుణముగ నభినయము సేయుచు నటింపఁ గడఁగిరి. అంతట మూకనాట్యము యక్షగానముగ బరిణామ మందినది." 47

వెంకట రమణయగారి వాదమును బరిశీలించుటకు ముందు సంగ్రహముగా బొమ్మలాట చరిత్రమును, దానికి యక్షగానముతోఁ గల సంబంధమును బరామర్శించుట లెస్స.

అతిప్రాచీన కాలమునుండియు మనదేశమునందు బొమ్మలాట యొక ప్రసిద్ధజానపద వినోద కాలక్షేపముగా నొక నిసర్గమనోజ్ఞ కళా స్వరూపముగాఁ బరిఢవిల్లుచు వచ్చినది. అసలు వెంకటరమణయ్యగారు సూచించిన పరిణామక్రమ ప్రకార మదేరూపకోప స్థితికి దారి తీసిన దనవచ్చు. + బొమ్మలాటకు బ్రహ్మవంటివాఁడు సూత్రధారి. సూత్రధారి శబ్దము తరువాత తరువాత నౌపచారికముగా రూపక ప్రస్తావనల కెక్కినను బొమ్మలాటకుఁ గుదిరినంతగా రూపకమునకుఁ గుదురదు. సూత్రముపట్టుకొనినఁగాని బొమ్మల యాటయేలేదు. అందుచేత నే యీ మాట పుట్టియుండును. బొమ్మలాటకుఁ గానుపు లయినవని యూహింపఁదగిన రూపకములందును గొన్నిటనున్న సూత్రధారుని వాలకమాస్మృతిచిహ్నమని చెప్పవచ్చును. అశోకుని శాసనములలో విగ్రహ ప్రదర్శన సూచన యున్నదనగా, భరతనాట్య శాస్త్రములో సూత్రధారప్రసక్తి యున్నదనఁగా గ్రీస్తుపూర్వము రెండు మూడు శతాబ్దుల

47. చూ. వెంకటరమణయ్య గారి "మధుర తంజావూరు నాయక రాజుల నాటి ఆంధ్రవాఙ్మయచరిత్ర" అనుగ్రంథము – అయిదవ ప్రకరణము.

+ శ్రీ ఎ. బి. కీతుపండితుని వాదమునకు చూ. అతని 'Sanskrit Drama' అనుగ్రంథము, పుట 52–57. ఈ విషయమింకను విచార్యము.

నాఁటికే బొమ్మలాట ప్రదర్శనములు మన దేశమున వ్యాప్తి నందినవని యూహింపనగును. సంస్కృత మహాభారతమునఁగల (XIICCXCV-5) రూపోప జీవన మను విషయమును గుఱించి నీలకంఠ పండితుఁ డిట్లు వ్యాఖ్యానించినాఁడు :— "రూపోపజీవనం జాల మండపికేతి దాక్షిణాత్యేషు ప్రసిద్ధమ్, యత్రసూక్ష్మవస్త్రం వ్యవధాయ చర్మమయై రాకారైః రాజా మాత్యాదీనాం చర్యాం ప్రదర్శ్యతే" అని.[48] అనఁగా రూపోప జీవన మనునది జాలమండపిక యనుపేర దక్షిణదేశమునఁ బ్రసిద్ధమైనది. అందు పలుచని బట్టపైఁ జర్మ పుత్రికల ద్వారమున రాజామాత్యాదులు చర్యలు ప్రదర్శింపబడును — అని యర్థము. ఇచట రూపోపజీవన మను మాట గమనింపఁదగిది. రూపారోపము వలన నేర్పడు రూపక కళావిర్భూతికిఁ గారణభూతమై యుండు ననఁదగిన బొమ్మలాట కాపేరెంతయుఁ దగియున్నది. దీనినిబట్టి బొమ్మలాట ప్రాచీనత యింకను వెనుకకుఁ బోవును. క్రీ. శ. 10 శతాబ్దినాఁటి కివి దేశాంతరములకుఁ గూడ వ్యాపించినవి. జావాలో వీనిని వాయంగ్ క్లిటిక్ (కొయ్యబొమ్మలాట). వాయంగ్ పూర్వ (తోలుబొమ్మలాట) అనియు నందురు. అందు మన రామాయణ మహాభారతగాథలే ప్రదర్శింపఁబడుచుఁ బ్రజాదరము బొందుచుండుట విశేషము.[49] ఆగాథలు "లాకన్లు" అను రచనావిశేషము ద్వారమున నాఖ్యాతము

48. ఈవిషయ మిచట డా. ఎమ్. కృష్ణమాచారి 'History of Classical Sanskrit Literature' అను గ్రంథము (Item No. 170) నుండి గ్రహింపఁబడినది.

49. చూ. శ్రీ మల్లంపల్లి సోమ శేఖరశర్మగారి "వాయంగ్ ఆటలు — జావా ద్వీపవాసుల వినోదములు" అను వ్యాసము – ఆంధ్రపత్రిక ప్రమాది సంవత్సరాది సంచిక.

లగుచుండును.[50] దక్షిణచైనా దేశమున ఫుకీన్ రాష్ట్రమునఁ దోలు బొమ్మలాటల చరిత్రను సంగ్ వంశ రాజుల కాలము (క్రీ. శ. 960–1279) నుండియుఁ గనుగొనవచ్చును. బౌద్ధగాథలు, జానపద గాథలు నితివృత్తములుగా నత్యంత మనోహరమైన సంగీతము కథా వాహికముగాఁ గల నాటక రచనలా బొమ్మలాటల కుపయుక్తము లగుచుండెనని తెలియుచున్నది.[51] క్రమక్రమముగా బొమ్మలాట ప్రపంచవ్యాప్తమైన ప్రతిష్ఠ గడించినది. ఆంధ్ర దేశము నందును బొమ్మలాటలు చాలకాలమునుండి ప్రచారము నందుండిన ట్లూహింప నగును. చాలకాలమునుండి మన వాఙ్మయమున బొమ్మలాటలప్రసక్తి తఱచుగనే కన్పించును. పాల్కురికి సోమనాథుఁడు భారతాది కథలు మన బొమ్మలాట ప్రదర్శన వస్తువులని వ్రాక్రుచ్చినాఁడు.

ప్రతి బొమ్మలాట ప్రదర్శనమునకును నేదో యొక కథావలం బన ముండును. అయితే ఆ కథాఖ్యానమున కుపయుక్తమైన రచనా ప్రక్రియ యెట్టిది యనునదిపుడు పరిశీలనార్హమైన విషయము. బొమ్మల నాడించుచుఁ దెరవెనుకనుండి పద్యములలో, పదములలో దరువులలో నాయాపాత్రల ప్రవేశ ప్రసంగాదులతోఁ గథ నడుపుచు నడుమ సంధి వచనములతో నప్రదృశ్య కథాను సంధానము చేయవలయును. అందులకు సాహిత్యము నాశ్రయింపవలెను. బొమ్మలాటలలోఁ గేవల గద్య రక్తిగట్టదు. అందుచేతనే యేదేశములోనైనను బొమ్మలాట ప్రదర్శనకు వెనుక గేయభాగాధికమై యాపకోపయుక్తమైన రచనయే ప్రయోగింపఁబడుట పరిపాటి. పాశ్చాత్యదేశములలో సాధారణ

50. "The Mahabharata and the Wayarng in Java" By Dr.B. R. Chatterjee – 'India and Java' (Greater India Society Bulletin No. 5. Part I, PP. 48–50)

51. Vide., PP. 15 of 'Folk Arts of New China' – The Foreign Languages Press Publication, Peking, 1954.

ముగా "ఓపెరా" లను గేయనాటికల నుపయోగింతురు. వాని యుపయోగమును గూర్చి యొక గ్రంథము[52] లో నిట్లు వివరింపఁ బడినది.

"Musical plays and operas if speciallv arranged, can be given by puppets. One advantage of opera on the puppet stage is that the conventional gestures of the Singers are well within the capacity of the puppet but besides there is the possible influence any production might have towards increasing interest in the opera".

అనఁగా గేయనాటికల నొక ప్రత్యేకదృష్టితో రచించినచో వానిని బొమ్మలతోఁ బ్రదర్శింపవచ్చును. అట్లు ప్రదర్శించుటలోఁ గేవల గేయనాటక ప్రదర్శకులు సాంప్రదాయికముగాఁ జూపవలసిన యభినయాంశముల నాబొమ్మలే యాడుకొనఁ గలవు. జావాది ద్వీప వాసుల లాకన్లు మొదలైన విట్టివే. సంస్కృతమునఁ గూడఁ జర్మ పుత్రికా ప్రదర్శనముల కుద్దిష్టములైనవి ఛాయానాటకము లనుపేర నొకతరగతి నాటకములు గలవు.[53] ఆపే రాంగ్లమునందలి "షేడోప్లే" (Shadow play) అను దానికి సమానార్థకముగాఁ గుదిరియున్నది. తోలుబొమ్మల నాటలోఁ దెరకు వెనుకను, దివ్వెకు ముందు నుంచెదరు. ప్రేక్షకులకుఁ గనఁబడునని వాని ఛాయలు మాత్రమే. అందులకే ఆపేరు. కొయ్యబొమ్మలాటలో తెర మఱుగుండదు. కాని వానికిఁగూడ ఛాయానాటక గ్రంథములు పనికిరాకపోవు.

బొమ్మలాటకుఁ బాశ్చాత్యదేశములలో "ఓపెరా" లు. జావాది ద్వీపములలో లాకన్లు మొ॥, మన దేశములో సంస్కృతమున

52. The puppet Book Editered by L. V. Wall; Faber and Faber publication., PP 187-188.

53. డా. ఎమ్. కృష్ణమాచార్యులు వారి సంస్కృతవాఙ్మయచరిత్ర గ్రంథము నందుఁ గొన్ని ఛాయానాటకము లుదాహరింపఁబడినవి. చూ. నం. 770-72, 775.

ఛాయానాటకములు మొదలైన వానివలెఁ గన్నడాంధ్రములు యక్ష గానములకుఁ గాణాచు లగుటచే నాయారాష్ట్రములందు యక్షగానములు నుపయోగపడుచున్నవి.

మైసూరు రాష్ట్రమున "చక్కలద గొంబె", "సూత్రద గొంబె" అను పేళ్ల వ్యవహరింపఁబడుచున్న తోలు – కొయ్యబొమ్మలాటలకు వెనుకపాటగా యక్షగానములే ఉపయోగింపఁబడుచున్నవి.[54]

ఆంధ్రదేశమున నీనాఁ డక్కడక్కడ మిగిలియున్న బొమ్మలాట వారి ప్రదర్శనములు చూచినచో వార లాయాప్రాంతపు యక్షగాన కవుల రచనలను వినియోగించుకొనుచున్నట్లు తెలియును. అసలు కొందఱు యక్షగానకవులే బొమ్మలాటలను దృష్టిలో పెట్టుకొని రచించినట్లును తెలియనగును.

క్రీ. శ. 1850 ప్రాంతమున గంజాముజిల్లా గుజ్జువాడ నివాసి మరింగంటి భట్టరురామానుజాచార్యులు రచించిన శ్రీరామనాటకము 'బొమ్మలాట రామాయణము' (ప్రా. లి. పు. భాం., ఆర్. నం. 966) గాఁ బ్రసిద్ధిపొందినది. ఇందలి లక్ష్మణమూర్ఛ కథాభాగము బొమ్మలాటలలో నెక్కువ ప్రచారము గాంచినది. ఇది 1908లో ఎద్దన పూడి సంజీవయ్య అండు సన్ వారిచే మదరాసు మురహరి ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి ప్రకటింపఁబడినది. తద్గ్రంథసంపాదకు లగు యర్లంకి వేంకటేశ్వర్లు నాయుడుగా "రిది చర్మపు విగ్రహము లతో నాట్యము చేయుచుండ డ్రామాకు అనుకూలంబగునట్లు పరిష్క-

54. Vide (a) 'Bhagavata Plays in Mysore' by Sri L. Narasimhachar – Chap. x, item II The Eighth All India Oriental Conference Volume, Mysore, 1935. (b) 'Yakshagana and other Plays Of Mysore' by Sri S. Srinivasachar – March of India, Vol. IV – No. 6.

రించి" నట్లు దాని యుపోద్ఘాతమున నున్నది. క్రీ. శ. 1855-1915 ప్రాంతమున గుంటూరుజిల్లా నర్సారావుపేట తాలూకా విప్రులపల్లె అగ్రహారము వాస్తవ్యులు చతుర్వేదుల వెంకట నరసింహయ్యగారు తమ ద్రౌపదీవస్త్రాపహరణము, సీమంతినీ పరిణయము, రాధాకృష్ణ సంవాదము మొదలగు యక్షగానములను బొమ్మలాటవారిచే నాడించెడివారట. 19 వ శతాబ్ది చివర వీణె సుబ్బరాజు, గాజుల పెంట్లూరి శేషగిరిరాజు అనువారు రచించిన సంతవేలూరు కుశలవుల నాటకము "ఆరు రాత్రిళ్లు నాటకమునకును బొమ్మలాటకును ఉపయోగముగా రచింపబడి" నట్లు గ్రంథ ముఖపత్రముపైఁ గలదు. (ఒక ప్రచురణ:- వెష్టు వార్డు అండుకో, మదరాసు, 1931). క్రీ. శ. 1893 లో పర్లాకిమిడి కడనున్న పాతపట్నము వాస్తవ్యుఁడు కోట వెంకటప్పయ్యశాస్త్రి యను నాయన బాణాసుర నాటకమను యక్షగానమును రచించి (ఇది 1894 లో మదరాసు ఇండియన్ లా ప్రెస్సులో ముద్రితమైనది) దానికిఁ బీఠిక తానే వ్రాయుచు నందు "ఈగేయ ప్రబంధము చర్మవిగ్రహాదులచే నాడించుటకు, వేషముల ధరించి నాటక మాడుటకును అనుకూలముగ నుండునటుల రచింపుఁడని నా మిత్రులనేక కొందరు ప్రోత్సాహపరచినందున నేనందుల కియ్యకొంటి" నని వ్రాసెను. ఇందు లొట్టికిష్టడు, రత్నాలు, పోలిగాఁడు నను పాత్రలు, నా పాత్రల హాస్యప్రసంగములు నచ్చు మచ్చు బొమ్మలాటలలోని జుట్టుపోలిగాఁడు, బంగారక్క, గంధోళిగాళ్ల పాత్రలు, ప్రసంగములవలెనే యున్నవి. అసలు వారల సంబంధము, సందర్భము నట్టివే. కొన్ని బొమ్మలాటలలో కేతిగాఁడొక సాంప్రదాయిక హాస్యపాత్ర. కేతినాయని పాలకము చాల యక్షగానములలోఁ గూడఁ (ముఖ్యముగా తంజావూరు కృతులలో) గన్పట్టును. కొన్ని యచ్చయిన యక్షగానములలో నందలి పాత్రల

బొమ్మలుగూడ నచ్చుకొఁబడి యున్నవి. పరిశీలించినచో జాలమట్టు నకు బొమ్మలాట వాలకములే గుర్తునకు వచ్చును. బొమ్మలాటవారు తమ ప్రదర్శనములలోఁ దఱచు అమరశ్లోకముల నేకరువు పెట్టుదురు. అమరశ్లోకము లుదాహరింపఁబడిన యక్షగానము లనేకము గలవు.

ఉదా :— జిల్లెళ్లమూడి వెంకటరామదాసామాత్యుని జాంబవతీ కల్యాణము (ఆం. సా. ప. ప్రతి నం. 3066) మొ॥ అట్టివి కొన్ని బొమ్మలాటలకు నుద్దిష్టములైనవే యని చెప్పవచ్చును.

ఇవి కాక బొమ్మలాటవారివే కొన్నిరచనలు గలవు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున బొమ్మలాట హాస్యనాటక మను నొక తాళపత్ర గ్రంథము గలదు. (ప్రతి నం. ఆర్. 1394). గ్రంథములోఁ బలుతడవ లిది దక్షిణ సింహాసనాధీశ్వరుండు విజయసేతు రఘునాథభూపాలుని నాటకశాలకు సంబంధించినదిగాఁ బేర్కొనఁబడినది. ఇదియొక బొమ్మలాట ప్రదర్శనకుఁ ప్రస్తావన ప్రాయమైన రచన — అసలు బొమ్మలాట వారాడఁదలఁచు కొన్నది శ్రీకృష్ణవిలాసమఁట. కాని కేతిగాని పెళ్లి యీ ప్రస్తావన యందలి ప్రధాన విషయము. ఇందు ప్రదర్శన సూచనలు, హంగు వివరములును గలవు. ఆ ప్రదర్శన ప్రక్రియ కొంత వఱకు నాఁటి దక్షిణదేశీయ యక్షగాన ప్రదర్శనప్రక్రియా సంవాదిగా నున్నట్లు గ్రహింపవచ్చును. ఆ రచనా ధోరణియు నట్లేయున్నది. ఇది బొమ్మలాటవారి రచనగనే తోఁచును. బొమ్మలాట సంబయ్య యనుకవి (ఇతనికాలము క్రీ. శ. 1750 ప్రాంతమని కర్ణాటకవి చరితలోఁ గలదు. ఇతని తండ్రి సిద్ధయ బొమ్మలాట శాసనుడు. మోహనకవి బిరుదాంకితుఁడునని యితని గ్రంథములలోఁ గలదు) తెనుఁగున కిరాతార్జునీయము (ప్రా. లి. పు. భాం., డి. నం. 1849 — 1851). కన్నడమున కరిభ్ఘ

బంటన విజయము (డి. నం. 1169), సారంగధర చరిత్రము (డి. నం. 1212, 1220) అను యక్షగానములను రచించి యుండెను.

ఆంధ్రకవి తరంగిణిలో (సంపుటము 9-పుట 246) బొమ్మలాట వారిని గుఱించి శ్రీ చాగంటి శేషయ్యగారొక శాసనవిషయము నుటంకించిరి—"కడప మండలమండలి కమలాపురము తాలూకా చిడిపిరాల గ్రామమున చంద్రమయ్య యను నతఁడును (ఇతనిని బొమ్మలాట రయితు అని యందురు.) బొమ్మలాట యమృతకవి యను నతండును తెరనాటకము లాడుటకై పెదచిట్టయ్య యనునతని కిచ్చినట్లొక శాసన మున్నది." అని. దీనినిబట్టి యానాఁటి బొమ్మలాటవారి "స్తోమత" యు వారికిఁ దెరనాటకములందుఁ గల యభినివేశమును దేటతెల్లము లగుచున్నవి. తెరనాటకము లనఁగా యక్షగానప్రాయములైన ప్రదర్శనములై యుండునని యూహింపనగును. ఆబొమ్మలాట వారిలో మోహనకవి, అమృతకవి అను బిరుద నామములు, సంబయ్యవంటి యక్షగాన కర్తలు నుండుటజూడ వారు తమ బొమ్మలాటల కుపయుక్తములగునట్టి యక్షగాన ప్రాయములైన రచనలు చేసికొనుటకే కవిత్వము నవలంబించి నట్లు తోఁచును.

పై విషయములను బట్టి బొమ్మలాటకు యక్షగానమునకును నెంతటి సంబంధము గలదో తెలియనగును. సంబంధమే గాదు సాదృశ్యమును గలదు. సంబంధసాదృశ్యములలో నొకటియున్నచోట రెండవది యుండుటయు సహజముగదా. చాల యక్షగానములలో సూత్రధారుని ప్రసక్తి గలదు. సంస్కృతరూపకములలో స్థాపనతో సరివాని వాలకము. తెరమఱుఁగైనను బొమ్మలాటలోఁ జట్టచివరి వఱకును వాని యవసర ముండును. కొన్ని యక్షగానములందును (ముఖ్యముగా తంజావూరు కృతులందు) నట్టే కథనడుమఁగూడ సూత్ర

ధారప్రసంగములుండుట యొక విశేషము. ప్రదర్శనల కుద్దిష్టములైన యక్షగానములందును సంధి వచనములున్న విషయమును గమనింపఁ దగినది. దృశ్యప్రబంధమున సంధివచనము లనవసరము. పాత్రల ముఖ వైఖరీ చేష్టాదికమంతయు నందుఁ బ్రత్యక్షముగాఁ జూపవచ్చును. బొమ్మలాటలో నాయవకాశములేదు. కాని సన్నివేశ సందర్భములను గథాక్రమ పరిణతిని నిరూపించుటకు వాని సూచననైన చేయుట యవసరము. అందులకు సంధివచనముల నాశ్రయింపవలెను. అవి యక్షగానములందును నిలిచియుండుట యొక విశేషము. భిన్న స్థలములందు, భిన్నకాలములందుఁ బ్రవృత్తములైన వివిధ కథాసంఘటనములు సంస్కృతరూపకములలో నంక విభాగాదులవలన నిరూపింపఁబడును. బొమ్మలాటల కథాప్రవృత్తిలో నంకవిభాగాదులు లేవు. అట్లే యక్షగానమునను(అర్వాచీనయక్షగానములుకొన్ని యిందులకపవాదములు). ఇట్లు బొమ్మలాట - యక్షగానముల యొక్క నైసర్గిక స్వరూపమును బరిశీలించినచో నారెండింటికిని గాఢమైనయనుబంధము గలదనిపించును. అయితే అది యనుబంధము మాత్రమే; జన్య జనక భావసంబంధము గాదు. ఆ యనుబంధమెంత ప్రాచీనమైనదో తెలియదు. బొమ్మలాట కున్నంత ప్రాచీనత యక్షగానమునెడ నూహింపనలవిగాదు. ఆదినుండి వివిధప్రదేశములందుఁ బ్రవర్తిల్లుచు వచ్చిన బొమ్మలాటలకెల్ల యక్షగానములే యుపయోగపడుచు రాలేదు. యక్షగాన సదృశములైన రూపకప్రక్రియ లనేకము వివిధదేశములందుఁ గన్పట్టుచున్నవి. అవి యన్నియు బొమ్మలాట పరిణామఫలితములే యన వలనుపడదుగదా, బొమ్మలాట ప్రాక్తన మానవుని రూపక కళాసంకల్పమునకుఁ బ్రస్తావన వంటిదైనఁ గావచ్చునే గాని యక్షగానాది సర్వరూపక ప్రభేద ప్రాదుర్భావమునకును సద్యః కారణము గాఁజాలదు. అందుచే శ్రీ వెంకటరమణయ్యగారనినట్లు బొమ్మలాట పరిణామమే యక్షగాన మనఁ జెల్లదు

గాని బొమ్మలాటలతోడి యనుబంధమును యక్షగానముయొక్క పరిణామచరిత్రలో, దానిబహుముఖప్రయోగానుకూలరీతులలో నొక ముఖ్యమైన యంతస్తుగా గ్రహింపనగును.

యక్షగానము—బొమ్మలాట జన్యజనక సంబంధవాదము యక్షగాన శబ్దోత్పత్తిని సమర్థింపలేదు. అయితే వెంకటరమణయ్యగారీవిషయమై చూపుపెట్టనివారుకారు. వారు తమ వ్యాసమున "ఆంధ్ర దేశమున బౌద్ధయుగమున యక్షజాతివారు కొందఱు వసించుచుండిరనియు యక్షగానమునకు వీరితో నెద్దియో సంబంధ ముండి యుండుననియు దోచుచున్న" దనిరి. ఇది యొక యూహ. వారు జక్కులజాతి సంబంధము ప్రబలమైన సాక్ష్యము లేక యంగీకరింపఁదగిన విషయము గాదనియు ననియున్నారు. యక్షగానమునకు జక్కులతో సంబంధముండి యుండుననుకొనుటయు నొక యూహయే. కాని మొదటియూహాకంటె రెండవదానిలోనున్న సామంజస్యము, సంభావ్యతయు మీఁదఁ బరిశీలింపఁబడినవి.

## ఇతర వాదములు - అభిప్రాయములు

యక్షగానోత్పత్తి గుఱించి ప్రధానవాదములను బరిశీలించుట యైనది. ఇంకను బరిగణింపఁదగిన వాదములు నభిప్రాయములును మఱికొన్ని మిగిలియున్నవి.

### 1. మార్గ – దేశివాదము

మిగిలియున్న వాదములో నిది యొకటి ప్రబలమైనది. యక్షగానము దేశిసరణికిఁ జెందిన నాటకమని శ్రీయుతులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, కోరాడ రామకృష్ణయ్యగారు, పింగళి లక్ష్మీకాంతముగారు, చింతా దీక్షితులుగారు,

ఎండమూరి వెంకటరమణగారు మొదలగు పలువురు పండితుల దృఢ విశ్వాసము. డా. ఆర్. కె. యాజ్ఞిక్, డా. వి. రాఘవన్, డా. నేల టూరి వెంకటరమణయ్యగారు మొదలగు పండితులు కొంద రిది సంస్కృత రూపకములనుండి యుత్పన్నమైనదని అనఁగా మార్గ ప్రక్రియ గలదని యభిప్రాయపడినారు.

యక్షగానము గానప్రధానమైనది. ప్రదర్శనమున నృత్తనృత్యా త్మకమైనది. రూపకోపయుక్తమైన రచనగాఁ బరిణమించిన దగుట సాహిత్యప్రక్రియయునై యున్నది. ఒక్కొక యంతస్తునందది మార్గ దేశి పద్ధతులలో నే యంతరువున కెంతవఱకుఁ జెందునో చూడవలెను.

ఈమార్గదేశి విభాగము మొట్టమొదట సంగీతవిషయమునఁ బాటింపఁబడినట్లు తెలియుచున్నది. సంగీతతత్త్వము ప్రప్రథమముగా "అనాహత" మనియు, "ఆహత" మనియు అనఁగా ప్రకృతి జన్యము, మనుష్యోపజ్ఞము నని ద్విధా విభజింపఁ బడినిది. అందాహ తము పునః ద్వివిధము :- వైదికము (సామగానము మొ...)—ఇదియే మార్గసంగీతము. అవైదికము, వివిధ దేశోత్పన్నమైనది— ఇదియే దేశి. కర్ణాటక హిందూస్తానీత్యాది సంగీతము లిట్టివే.

" దేశేదేశే ప్రవృత్తోఽసౌ ధ్వనిర్దేశీతి సంజ్ఞితః,
అబలాబాలగోపాలైః క్షితిపాలై ర్నిజేచ్ఛయా
గీయతే సానురాగేణ స్వదేశే దేశి రుచ్యతే."

అని మతంగుని బృహద్దేశి. ఆ పక్షమున యక్షగానము నందలి గాన మంతయు దేశియే.

---

* ఈ విషయమై ఆ యా పండితుల యభిప్రాయములు ప్రకటింపఁబడిన వ్యాసము లీగ్రంథము చివర నొక పట్టికలోఁ జేర్కొనఁబడినవి.

కాలక్రమమున నీమార్గదేశి విభేదము వాద్య సంగీత నృత్త నృత్య ప్రక్రియలందును పాటింపఁ బడినట్లు జాయపనాయకుని నృత్త రత్నావళి, శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరము, రఘునాథ నాయకుని సంగీత సుధ మొదలగు గ్రంథముల నుండి యెఱుఁగనగును. జాయప నాయకుఁడు జక్కిణి నొక దేశి నృత్తముగాఁ బేర్కొని నాఁడు[55] జక్కిణికి యక్ష గానమునకు నేదో సంబంధ ముండి యుండునని మీఁద నూహింపఁ బడినది. "జక్కిణి కత్రి యనునవి నాట్యముతోఁ గూడిన రూపకముల వంటివి. వీని పరిణామమే యక్షగానము" అని శ్రీమల్లంపల్లి సోమశేఖర శర్మగారని యున్నారు.[56] ఒక వేళ జక్కిణి—యక్షగానముల సంబంధము బదరీ బాదరాయణ సంబంధము వంటిదే యని యను కొన్నను జక్కుల పురంధ్రి యాట పాటల సంబంధము కారణముగా యక్షగానమును ప్రాథమికావస్థలో దేశి యన వచ్చును.

ఇఁకఁ గవితా పరముగ నీ మార్గదేశి భేదమును బ్రతిపాదించిన మనకవులలో నన్నెచోడుఁడు మొట్టమొదటి వాఁడుగాఁ గన్పట్టు చున్నాఁడు. అతఁడు మార్గకవిత దేశములో ముందుగా వెలసి ప్రచారములో నుండఁగాఁ జాళుక్యప్రభువు లాంధ్రదేశమున దేశిని బుట్టించి తెనుఁగు నుద్ధరించి రని యున్నాఁడు.[57] అతఁడక్కడ బహుశా చాళుక్య రాజు రాజరాజ నరేంద్రాస్థానములో వెలసిన మన నన్నయ గారి యాంధ్ర మహాభారతమునే యుద్దేశించి యుండును. అనఁగా నతని

55. చూ. 1923 సం. ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచిక-పుట 328. ఇందు నృత్త రత్నావళి నుండి యుదాహరణములు కొన్ని గలవు.

56. చూ. వారి వ్యాసము "మధ్య యుగాంధ్ర దేశము—సంగీత నాట్య కళాభివృద్ధి."— ఆంధ్ర పత్రిక చిత్రభాను (1942—43) సంవత్సరాది సంచిక.

57. చూ. అతని కుమారసంభవము, 1—23.

యుద్దేశములో దేవ భాషలోఁ బుట్టిన దంతయు మార్గి, దేశభాషలలోఁ బుట్టిన దంతయు దేశి యని తోఁచును. ఆప్రకారము సంస్కృత వాఙ్మయ కోశమున లేని యక్షగాన ప్రక్రియ దేశి యగు నని నిస్సంకోచముగా వక్కాణింప వచ్చును. కాని రానురానా యభిప్రాయము మారినది. మన మీనాఁడు కవిత్రయ భారతమును, మన ప్రబంధములను దేశి సాహిత్యము గాఁబరిగణించుటలేదు. అది యంతయు మార్గ సాహిత్యమనియే మన యుద్దేశము. కొందఱు పండితులు మార్గదేశి విచక్షణ కొక మార్గము సూచించిరి-ఇతి వృత్తము, భాష, ఛందస్సు మొదలైన విషయములలో సంస్కృత సాహిత్య ప్రభావ పరామృష్టమైన దంతయు మార్గి, తద్భిన్నమైన దంతయు దేశియని.[58]

ఇతి వృత్తవిషయము జూచు కొన్నచో నీనాఁడు మనము దేశి వాఙ్మయకోశమును కొనుచున్న దానిలో ముక్కాలు మువ్వీసమున నితి వృత్తములు సంస్కృత పురాణములు, రామాయణ భారత భాగవతముల నుండి గ్రహింపబడినవే. పౌరాణిక మనఁగనే యది మార్గ వాఙ్మయ కోశములో గతార్థమగును. అసలు పౌరాణిక గాథలే క్రమక్రమముగా మన చంపూ ప్రబంధములలో, ద్విపద కావ్యములలో, యక్షగానములలో, పదములలో, జంగము కథలలో, హారికథలలో నింక ననేక ప్రక్రియలలో నితివృత్తములగుచు వచ్చినవి. ఇతి వృత్తములనుబట్టి యీప్రక్రియలన్నియును మార్గసాహిత్యమునకుఁ జెందుననుట కుదురదు. ఆయాప్రక్రియల ద్వారమున నాకథ లేతరగతి పాఠకులకు లేక శ్రోతల కుద్దేశింపఁబడినవో వారి యభిరుచులకు బోధ శాలితకు ననుగుణముగా వాని నందిచ్చు తీరులో నున్నది మార్గదేశి

58. చూ. ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారి రంగనాథరామాయణ పీఠిక.

ప్రక్రియలలో బాహిరముగాఁ గన్పట్టు పరస్పర విలక్షణత. ఉదాహరణకు :- ఒక యితివృత్తముగల ప్రబంధమును యక్షగానమును తీసికొని చూచినచో, అందులో నాయిక యేడ్చు సందర్భమనుకొందము, అక్కడ ప్రబంధకవి యానాయిక యేస్వరములో నేరాగములో నేస్థాయిలో నేడ్చినదో, "ఓహోహో, ఎంతచక్కగా నేడ్వఁగలదు!" అన్నట్లు చెప్పును. అదే యక్షగానకవి యైనచో శ్రోతలు "అయ్యో పాపం ఎంతలా ఏడ్చింది!" అనుకొన్నట్లు చెప్పును. అట్లే కడమ సందర్భములును.

ఇఁక భాష విషయము జూచినచో—మార్గసాహిత్య మెక్కువగాఁ బండితుల కుద్దేశింపఁబడినది. కాఁబట్టి యందలి భాష సంస్కృతశబ్ద ప్రచురమై లక్షణశుద్ధిగలిగి యాపదసంయోజనాపద్ధతియు నన్వయక్రమము మొదలగునవి గీర్వాణప్రభావమును సూచించుచుండును. ప్రబంధాదులలో గద్య పద్యములు జటిలపదజంఝూటముతో ననుప్రాసల యట్టహాసములతో సమాసముల సంరంభముతో నడుచును. ఆశైలీ ప్రాగల్భ్య మంబరచుంబి శిరస్సరఝ్ఝరీవేగము గలిగి యుండును. ఆప్రక్రియల గొప్పదన మెక్కువగా రచనాప్రౌఢినే యాశ్రయించి యుండును. యక్షగానాదులలో (పండితోపజ్ఞములు కొన్నింటఁ దక్క) నెక్కువగా దేశిశబ్దజాలము—అనఁగాఁ బ్రజల వాడుకభాష నుడికారము, జాతీయతయు నెక్కువగా నుండును. అవి యెక్కువగా జనబాహుళ్యమున కుద్దేశింపఁబడినవి కాఁబట్టి వానిలోని భాష యంత సలక్షణమైనది కాకపోయినను నందఱికిని బోధపడునట్లు జీవకళ యుట్టిపడుచు, గులకఱాలపై నలవోక దొరలిపోవు సెలయేటి తరగలవలె సరళమైన శైలి గలిగి యుండును. మఱి యొక ముఖ్యవిషయము — మార్గసాహిత్య మెక్కువగాఁ బఠనపాఠనములకు

మాత్రమే పనికివచ్చునట్టిది. దేశివాఙ్మయ మెక్కువగా గేయధర్మ విశిష్టమైనది. అందులకే చతుర్విధకవితారీతులలో నొకటైన మధుర కవిత క్రిందఁ జాల దేశిరచనలను బరిగణించినారు మన లాక్షణికులు. దేశి రచనలలో నా గేయధర్మసాధనలోఁ దఱచు లఘ్వలఘువుల లజ్జు గుజ్జులు చాల సంభవించును. ఆ లజ్జుగుజ్జులలో నొక్కొక్కపుడు శబ్దాల స్వరూపాలే మాఱిపోవుచుండును. అందుచేత పండితులు రచించిన యక్షగానాది కృతులలోఁగూడ వారు సహజముగాఁ గాలుజాఱిన సందర్భము లనేకము గలవు. ఇట్టిది దేశిరచనల విలక్షణత.

ఇక ఛందోవిషయము — యక్షగాన రచనాసామగ్రిలోని ప్రధానాంశముల వరుస :—

1. తాళప్రధానమైన 'రేకు' లేక 'దరువు'—దాని మూల ప్రకృతి రగడ.

2. ద్విపద.

3. ఏలలు, అర్ధచంద్రికలు, ధవళ శోభనములు మొ॥ గీత ప్రబంధములు.

4. వచనము.

5. పద్యములు - జాత్యుప జాతులు, వృత్తములు.

6. శ్లోకములు, చూర్ణికలు, దండకములు, అష్టకములు, మొ॥ వీని లక్షణము గూర్చి ముందు "యక్షగాన ప్రధానరచనాంగములు" అను ప్రకరణమునఁ గొంత విపులమైన విచారణ గలదు. ప్రకృత మొక్కొక దాని మార్గ లేక దేశి తత్త్వమును గూర్చి తగుమాత్రము పరిశీలనము గావింపఁ బడును.

ఇందు దరు వనునది బహు యక్షగాన సామాన్యమైనది.

అతి ప్రధానమైనది. దరువు సంస్కృత ధ్రువాశబ్దభవమని పండితుల తలంపు.[59] ప్రయోజన విషయముననను రెంటికిని గొంత సామ్యము గలదు. ధ్రువాగానము సంస్కృత నాటకము లందుఁ బ్రయోగింపఁబడు చుండుట పరిపాటి. దీని లక్షణ ప్రయోజనములఁ గూర్చిన వివరణము భరతుని నాట్యశాస్త్రమునఁ (32వ అధ్యాయము) గలదు. అంత మాత్రమున నీ విషయమునుబట్టి యక్షగానము మార్గియనుట గుదురదు. మన కుపలబ్ధములై నంతలోఁ బ్రాచీనము లని రూఢిగాఁ దెలియవచ్చిన రుద్రకవి సుగ్రీవ విజయాది యక్షగానములలో దరువను మాట కన్పట్టదు. అందు వానికి బదులు ఏక, జంపె, త్రిపుటాది తాళ ప్రధానములైన గేయ రచనలే కన్పట్టుచున్నవి. అవే యర్వాచీన యక్షగానములలో దరువులని వ్యవహృతములైనవి. ఆతాళములును నాట్య శాస్త్రములోఁ బేర్కొనఁ బడినవే. కాని సంస్కృతమునఁ జెప్పఁబడినంత మాత్రమున మన నాట్య సంగీత శాస్త్ర గ్రంథములందలి సర్వవిషయములను సంస్కృతమును దేవభాష యనుకొనునట్లెక్కడో దేవలోకమునుండి యవతరించిన వని తలంపరాదు. కొన్ని సంస్కృతవాఙ్మయమున సహజముగా నుద్భుద్ధమైనవి. కొన్ని యాయా దేశభాషా వాఙ్మయములలో సహజముగా నుత్పన్నమైనవియును. సంస్కృతము నందలి యా ధ్రువా ప్రయోజనము నియతము. యక్షగానము లందలి దరువులకట్టి నియతియున్నట్లు గానరాదు. అదికాక యాధ్రువారీతులకు గాని యా తాళములకు గాని నాట్యశాస్త్రమున నొక నిష్కృష్టమైన ఛందఃప్రక్రియ చెప్పఁబడలేదు. ఆంధ్రలాక్షణికులీ "తాళదరువు" లకు రగడయను ఛందమును

59. చూ. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి వ్యాసము ఆం.ప. చిత్రభాను షష్ఠి. సం. 1942–43.

ప్రాతిపదికగా గ్రహించి యే తాళమున కెట్టి రగడ ప్రభేదము సరిపోవుచున్నదో నిరూపించి యున్నారు.[60]

ఈ రగడ లక్షణము సంస్కృత లక్షణ గ్రంథము లందెందును గానరాదు. ఇది క్రీ. శ. 10 వ శతాబ్ది నాఁటికే కన్నడమున మిక్కిలి ప్రచారము గాంచినట్లు తోఁచును. ఆనాఁటి కన్నడకవి నాగవర్మ తన ఛందోంబుధి యందు (III. 254) గణనియమ విపర్యాసమున్నను మాత్రల సమానతయుఁ దాళ బద్ధతయు 'రఘటా బంధ' లక్షణము లని పేర్కొని యుండెను. ఆ రఘటా బంధమే మన రగడ యైనది. ఆ లక్షణము సరిపోవుచున్నది. ఆంధ్ర వాఙ్మయమునను దీనికి మిక్కిలి ప్రచార మేర్పడినది. మన శాసనములకుఁ బ్రబంధములకు నెక్కినది. దేశి రచనల నత్యంతము నాదరించిన శివ కవులచే నాదరింపఁ బడినది. అనేక నూత్నములైన దేశిరచనల కుపాధియైనది. సంస్కృత వృత్తములను గలిగి యున్నను గళికోత్కళికల రూపమున రగడను బ్రధానోపాధిగాఁ గలిగి యుండుటచేతనే కాఁబోలు "ఉదాహరణ" కావ్యము గూడ దేశి రచనగాఁ బరిగణింపఁ బడు చున్నది.[61] రగడ

60. చూ. లక్షణసారసంగ్రహము (II. 141)
అప్పకవీయము (IV. 303) రంగరాట్ఛందము.

61. రగడోదాహరణముల చరిత్రమునకు — చూ. శ్రీ కోరాడ రామకృష్ణయ్య గారి "దేశి" శ్రీ నిడుదవోలు వెంకటరావు గారి "ఉదాహరణ వాఙ్మయ చరిత్ర"

శ్రీ వెంకటరావు గారు రగడ ప్రతిపత్తిసామ్యమున "యక్షగానములకు ఉదాణహారములే మూలమని చెప్పనొప్పు" నని వక్కాణించిరి. ఆ రెండింటికిని రగడయే మౌలికమైన యుపాధి యగును. గాని రగడ ప్రాచుర్యము గల రచన లన్నిటికి నుదాహరణమే మూలమనుట సమంజసము కాఁజాలదు. జంగము కథల కుదాహరణములే మూలము లనఁగలమా? య. గా. లు ద్విపద ప్రచురములు నైనవి కావున ద్విపద కావ్యములు తన్మూలము లనఁ గలమా? అట సాదృశ్యమే గాని యుత్పత్తి సంబంధ మున్న దనరాదు.

ప్రాధాన్యము గల మఱియొక రచనాప్రక్రియ జంగము కథ. అదియు దేశి రచనగనే పరిగణింపఁబడుచున్నది.[62] కావున రగడను స్వచ్ఛమైన దేశి చ్ఛందముగనే గ్రహించుట లెస్స. అట్టిచో యక్షగానమునందలి దరువునకు శబ్దోత్పత్తియందును, రంగప్రయోజనము నందును సంస్కృతధ్రువతో సంబంధ ముండియుండునుగాక కాని దాని ఛందః ప్రక్రియయందు మాత్రమది స్వచ్ఛందమైన దేశిత్వమునే గలిగియున్నదని చెప్పనొప్పును.

దరువు తరువాత యక్షగానమునఁ బ్రధానమైనది ద్విపద. ప్రాయికముగా ద్విపదలేని యక్షగానమే లేదనవచ్చును. అది యక్షగానములలో నెన్ని యవతారము లెత్తినదో చెప్ప నలవి గాదు. ద్విపద దేశి చ్ఛందమనియే యనేకాంధ్ర విద్వాంసుల విశ్వాసము.[63] కాని సంస్కృత ప్రాకృతము లందది చాల కాలము నుండి ప్రచారమున నున్నది. ద్విపద, ద్విపది, ద్విపదిక, ద్విపథగ, ద్విపదీ ఖండము, దోహా (ప్రాకృతము) యను వివిధనామములతో ఋగ్వేదమనియు, గీత ప్రబంధమనియు, మాత్రావృత్తమనియు నిట్లు బహు భంగులుగా శతపథ బ్రాహ్మణము, భరతనాట్య శాస్త్రము, బృహద్దేశి, జనాశ్రయి, మానసోల్లాసము, సంగీత చూడామణి, సంగీత రత్నాకరము, భావ ప్రకాశము, సంగీతసుధాకరము, విక్రమోర్వశీయము, కాదంబరి (పూర్వభాగము) రత్నావళి మొదలగు గ్రంథము లందుఁ బేర్కొనఁ బడినది. కొన్నిట లక్షణము గూడ నిర్వచింపబడినది. జనాశ్రయ చ్ఛందస్సు, రత్నావళీ నాటకము మొదలగు గ్రంథములందు వరుసగా

62 చూ. డా. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారి "దేశిసారస్వతవిభూతి" యను వ్యాసము — కిన్నెర, 1955 సంక్రాంతి సంచిక.

63. చూ, కోరాడవారి దేశి, పింగళివారి రంగనాథరామాయణ పీఠిక,

ద్విపదీ, ద్విపదీ ఖండములకు లక్ష్యములును గలవు. ఆలక్ష్యలక్షణము లతోసరిపోల్చి చూడఁగా మనద్విపదకుఁ బూర్తిగా సరిపోయిన దొక్కటిలేదు. అసలా సంస్కృతగ్రంథము లందుఁ బేర్కొనఁబడిన లక్షణము లకే యన్నిటికి నొక యేకవాక్యత కుదురలేదు. కాఁగా నిఁక ద్విపద యనఁగా రెండేసి పాదములకొక్కొక లక్షణ ప్రక్రియ గల ఛంద స్సను సామాన్యార్థమునే గ్రహింప నగును. గాని నామసామ్య మాత్రమునఁ దెనుఁగు ద్విపదకును సంస్కృత ప్రాకృతచ్ఛందములైన ద్విపదాదులకును జన్యజనక సంబంధము నూహింప రాదు. పండితులీనాఁడు పాల్కురికి సోమనాథుని వంటి విద్వత్కవి రచించిన బసవపురాణము, పండితా రాధ్య చరిత్రములను రంగనాథరామాయణ ప్రభృతి ద్విపద కావ్యములను దేశి రచనలుగాఁ బరిగణించు చున్నారనఁగా ద్విపద దేశిచ్ఛంద మను నుద్దేశముతోనే కదా.

యక్ష గానము లందుఁ దఱచు ప్రయుక్తము లగుచు వచ్చిన యేలాది గీత ప్రబంధ విశేషములు కొన్ని రగడ ద్విపద వికార ములే. అం దనేక మచ్చుమగు దేశి రచన లనియే పెద్దల తలంపు. (చూ. కోరాడవారి దేశి). అందుల కేలాదులు కొన్ని మతంగుని బృహద్దేశి యందు పేర్కొనఁబడుటయు నొక తార్కాణ. మఱికొన్ని బృహద్దేశీతరము లగు సంస్కృత సంగీతశాస్త్ర గ్రంథము లందుఁ బేర్కొనఁ బడియున్నను సంస్కృతకావ్యవాఙ్మయమున వాని ప్రయోగము గానరాదు. ఆ శాస్త్రకారులకు తమ తమ రాష్ట్రములందు సమ కాలమునఁ బ్రచారమున నున్న సంగీతనాట్య ప్రబంధములను గ్రహించుట పరిపాటి. అట్టిచో వాని నెల్ల సంస్కృత గ్రంథఘటితము లైనంత మాత్రమున మన మీనాఁడు మార్గ ప్రక్రియలుగా గ్రహించుట సమంజసము గాదు.

యక్షగానములలోఁబద్యములు జాత్యుపజాతులే కాక సంస్కృత వృత్తములు, శ్లోకములు, చూర్ణికలు మొదలగునవి కొన్ని ప్రయుక్తము లైనవి. ఇవి యక్షగానముపై మార్గ ప్రక్రియాప్రభావమునే సూచించును గాని సహజమైన దాని దేశికళ నాచ్ఛాదింప లేవు. వచనము విషయమున నది యొక భాష గుత్తకొన్నది కాదనియు, యక్షగానములలోఁ బ్రయుక్తము లగు సంధి వచనములును సంభాషణ వచనములును దెనుఁగుదనమును బట్టియిచ్చునవి యనియును వానిని వామనాది సంస్కృతాలంకారికులు పేర్కొనిన వృత్తగంధి చూర్ణోత్కలికాది గద్యభేదములుగా బరిగణింప వలసిన యవసరము లేదనియుఁ జెప్పవచ్చును.

మార్గచ్ఛందస్సు లనఁగా నక్షరచ్ఛందస్సు లెక్కువగా నిసర్గగణ ఘటితములు. దేశి చ్ఛందస్సు లెక్కువగా మాత్రాగణ ఘటితములు. దేశి రచనలలో గీతి ధర్మప్రకృష్టములైన సందర్భములలో ననఁగా గేయములను సాగదీసి పాడునప్పుడు దీర్ఘప్లుత కాక్వాదిసందర్భములలో మాత్రలకాలము పొడిగింపఁబడును. అటువంటిచోటులందు లఘువనఁగా నొకమాత్ర, గురువనఁగా రెండుమాత్రలు, ప్లుతమనఁగా మూఁడు నన్న సామాన్యసూత్రములను బట్టుకొని వ్రాతలో గురుప్లుతము లొకవిధముగనే సూచింపఁబడును గదా యని యా సూత్రమును బట్టి యీమాత్రల నిర్ణయము చేయఁబూనుటతగదు. అట్టి దేశిరచనలకుఁగూడ లాక్షణికులు సంస్కృత సంప్రదాయాను సారముగా లక్షణ ప్రక్రియ నేర్పరించుటకుఁ బూనుకొన్నారు. అవి తమ నిసర్గగణములకు లొంగక పోఁగా నప్పు డింద్రగణములు, చంద్రగణము లనుచుఁ జాలియుఁ జాలని కొలబద్దలు పట్టుకొన్నారు. దానికిఁ దగిన సమాధానము చెప్పినారు యక్షగానకవులు. ద్విపదాదులలోనే కాకుండ సంస్కృతచ్ఛందస్సులవిషయమునఁగూడ దమ ధోరణి కనుగుణమైన

తూగును నడకనుమాత్రమే చూచుకొనుచు వానికిఁగూడ మాత్రల ప్రయోగముచేసి వైచినారు. ఒక్క ఉదాహరణ :— కోటపురి ధర్మాంగదచరిత్ర అను యక్షగానములోనిది "తంత్రము జేసి పాములకు తరుణుల జేసుట ధర్మమందురా" అని యొక యుత్పలమాల పాదము. క్రీగీతగల దుత్పల మాల లక్షణము ప్రకారము భగణ ముండవలసిన స్థానముగదా. కాని యిక్కడ నలముపడినది. ఇట్టివి కోకొల్లలు. ఇఁక ద్విపదలసంగతి చెప్పనక్కఱలేదు. కాని — "వినవమ్మ నా మనవి విశదంబుగాను" అన్నది వల్లాయపురి ఉషాపరిణయ మను య. గా. లోని యొక ద్విపద పాదము. ద్విపదకు మూఁడింద్ర గణములు నొక సూర్యగణము ననికదా లక్షణము. కాని పై పాదము లోని మొదటిగణ మింద్రగణమే కాని రెండవది కాదు. కాని రెండును బంచమాత్రాకములైనవే. తూగు సరిపోయినది. యక్షగాన కవికిఁ గావలసిన దదే. ఇదే దేశిరచనల విలక్షణత. ఆయాయి యుపపత్తు లనుబట్టి యిట్టిదేశి చ్ఛందస్సుల కనేకమున కాకరమైన యక్షగానము దేశి సాహిత్య ప్రక్రియ యనుటలో విప్రతిపత్తి యుండరాదు.

ఇఁక రూపకప్రక్రియ దృష్ట్యా యక్షగానమెంతవఱకు దేశియో పరిశీలింపవలసియున్నది. కొందఱు పండితులు యక్షగానమునకు వీధి నాటకమని పర్యాయ వ్యవహారమున్నదికదా, వీధి దశరూపక ప్రభేదముగదాయని యక్షగానముయొక్క దేశిత్వమును శంకింపఁ జూతురు. కాని భరతుని నాట్యశాస్త్రమున వీధి యను సంస్కృత రూపకలక్షణ మిట్లు చెప్పఁబడినది: —

"వీధీ స్యాదేకాంకా తథైకహార్యా ద్విహార్యావా
అథమోత్తమ మధ్యాభి ర్యుక్తా స్యాత్ప్రకృతిభి స్త్రిస్రుభిః"
— బరోడా ప్రతి అధ్యా. 18 – శ్లో. 212 – 213.

తద్వ్యాఖ్యాత యగు అభినవగుప్తుఁ డేకహార్య మనఁగా నాకాశ భాషితమనియు, ద్విహార్యమనఁగా నుక్తి ప్రత్యుక్తి వైచిత్రియనియు వివరించినాఁడు. అనఁగా వీధి యేకాంకము, నాకాశభాషితముగాని యుక్తిప్రత్యుక్తి వైచిత్రిగాని గలిగినదియు, నుత్తమ మధ్యమాధమ నాయకమైనదియునని భరత మతము. (ఈ సందర్భమున నభినవగుప్తుఁడు వివరించిన కోహలమతము నిట్టిదే) దశరూపకమున (3-62) వీథి కైశికీ వృత్తి, భాణమువలె సంధ్యంగములు నుద్ఘాత్యకాది వీథ్యంగములును గలిగి, శృంగార రసము సూచ్యమై రసాంతరము స్పృశింపఁబడి ప్రస్తావనయుక్తమై యేకపాత్ర ప్రయోజితమగునది యని చెప్పఁబడినది. వీథులలోని మార్గసంక్తులవలెఁ దీర్పబడిన వీథ్యంగములుగలదియని నిర్వచించినాఁడు తద్వ్యాఖ్యాత ధనికుఁడు. కావ్యాను శాసనమున నేకహార్యద్విహార్యము లనునవి పాత్రసంఖ్యగా బరిగణింపఁబడినవి. నాట్య దర్పణమున వీథియందు సర్వవిధనాయకు లును రసములు నుండవచ్చుననియు ముఖనిర్వహణ సంధులుండుననియు గలదు. భావ ప్రకాశమున వీథ్యంగములతోపాటు లాస్యాంగములు నిందు గ్రాహ్యము లనియున్నది. ప్రతాపరుద్రీయమున భాణమువలె సంధ్యంగములుండి, కైశికీవృత్తి, శృంగారపరిపూర్ణత, ఉద్ఘాత్యకాది వీథ్యంగములు గలిగియుండుట వీథీలక్షణముగాఁ జెప్పబడినది*. రత్నాపణకర్త పాత్రలొక్కటిగాని రెండుగానియుండి లాస్యాంగములు గలిగి సామాన్య లేక పరకీయయై కులపాలిక కానటువంటి నాయికను గలిగి యుండునని చెప్పెను. రసార్ణవ సుధాకరమునను నాయికవిషయ

* ఈ లక్షణమే తెనుఁగున చిత్రకవి పెద్దన లక్షణసారసంగ్రహమున ననూదితమైనది (III. 90). ప్రతాపరుద్రీయమున 'మొట్టమొదటగా వీధి కల్పితేతివృత్తము, ధీరోద్ధత నాయకము, శృంగార రససూచనామాత్ర సారము' ననియుఁ జెప్పబడినది. బహుధా ప్రసిద్ధేతివృత్తము, నాయకరస వైవిధ్యమును గల యక్షగానమున కీ లక్షణ మసలు పట్టదు.

మిట్లే చెప్పఁబడినది. దర్పణకారుఁడు నాట్యశాస్త్ర లక్షణమును గ్రహించుచు శృంగారరసప్రాధాన్యమును, నఖిలార్థ ప్రకృతుల ముఖ నిర్వహణసంధుల పాటింపునుగూర్చి చెప్పెను.

ఇట్లు వివిధ నాట్యశాస్త్ర గ్రంథములందుఁ జేర్కొనఁబడిన వీథి లక్షణమునందలి ముఖ్యాంశములు: ఏకాంకము, సంధి సంధ్యంగములు, ప్రస్తావన, ఒకటి రెండు పాత్రలకు మాత్రమే ప్రమేయము, ఆకాశ భాషితాదులు, కులీన కాని నాయిక, శృంగారప్రాధాన్యము. ఇవి యక్షగానమున కెట్లు సరిపోవునో చూతము. ప్రాయికముగా యక్షగానములం దంకవిభాగ ముండదు. (ప్రాయికముగా ననుటచేఁ గొద్ది యర్వాచీన యక్షగానములందు గలదు గాని యది యక్షగాన పరిణామ చరిత్రలో నొక యంతరువు ననఁగా మధ్య వచ్చిన మార్గ నాటక ప్రభావమును మాత్రమ సూచించును. ప్రాచీన యక్షగానములం దంకవిభాగము గానరాదు.) అట్లని యవి యేకాంకిక లని తలఁపరాదు. అంక మాసన్ననాయకముగాని ప్రత్యక్ష నేతృచరితముగానియై, బిందు వ్యాప్తిపురస్సరము, నేకైకదివస వృత్తము, బహుపాత్ర ప్రవేశార్హ మును గావలెనని మన యాలంకారికుల మతము. అట్టి నిష్కర్ష గల లక్షణము మన యక్షగానములకుఁ బట్టదు. యక్షగానేతి వృత్త ములలో నిబిడకథానిబంధనమే కానరాదు. ఒక దివసమునఁగా దొక జీవితకాలమున జరుగుకథ యంతయు రంగాంతర సూచన లేకుండ నొక్కచోటనే జరిగినట్లుండును. అర్థప్రకృతులకును గార్యావస్థలకును దగిన సమన్వయము గన్పింపదు. సంధి సంధ్యంగాదులు నందుఁ జిక్కగాఁ బాదుకొని యుండవు. సంస్కృతనాటకము లందు వలె సూత్రధారుఁడు నటీ పారిపార్శ్వక విదూషకులతో జరుపు ప్రస్తుతోప లక్షణీయమైన దృశ్యప్రబంధ వస్తు తత్కర్తృ ప్రశంసాదికము ప్రాచీన

యక్షగానములం దెందును గానరాదు. ఒకటి రెండు పాత్రలకు మాత్రమే ప్రమేయము నాకాశ భాషితములును గలట్టి యక్షగాన మొక్కటియు లేదు. అన్నియుఁ బాత్రబాహుళ్యము గలవి. ఆకాశ భాషితములు లేవు కాని సంధి వచనములు గలవు. ఉక్తి ప్రత్యుక్తి వైచిత్ర్యముగల యక్షగానము లనేక మున్నవి కాని యది రూపక సామాన్య ధర్మము. నాయిక విషయమున యక్షగానమున నెట్టి నియమమును లేదు. అట్లే రసవిషయమునను. శృంగారప్రధానములైన యక్షగానము లనేకము గలవు; కానివియుఁ గొన్ని గలవు. ఏవిధముగఁ జూచినను యక్షగానమునకు వీథీలక్షణము పట్టకున్నది. అసలు యక్షగానములకు వీథినాటకములను పేరున్నదన్న నక్కడ వీథి యనఁగా దశరూపక ప్రభేదమని కాదర్థము. 'వీథులలో నాడుటచే వీనికి వీథినాటకము లని పేరువచ్చెను.'[64] ఇందులకు సమానార్థకములుగాఁ గన్నడ తమిళ దేశము లందుఁగూడ "బయలాట", "తెరుక్కూత్తు" అను పేరులు గల జానపదరూపకములున్నవి.[65] అదియుఁ గాక యీ వీథి శబ్దమును దశరూపక ప్రభేదముగనే పండితు లెవరైనఁ బరిగణించినచో నాప్రక్క-నాటకశబ్ద ముండుట యసమంజసమే యగును. కాలక్రమమున నాటక శబ్ద మర్థ విపరిణతి నొంది రూపక సామాన్య వాచియైనది. కాని యసలదియు వీథివలెనే దశవిధరూపకములో నొకటిమాత్రమ. అట వీథి లక్షణము వేఱు, నాటక లక్షణము వేఱు. అట్టి భిన్నలక్షణములుగల యీ రెండింటిని బండితు లేనాఁడు నొక్కచో ముడిపెట్టరు. అది సామాన్యులే నాటక శబ్దము రూపక సామాన్యవాచియైన తరువాత వీథిలోనాడు రూపకమను నర్థమున వ్యవహరించుట కారంభించి

---

64. చూ. కీ. శే. జయంతి రామయ్య పంతులుగారి "ఆధునికాంధ్రవాఙ్మయ వికాసవైఖరి" అధ్యా. 2 — "యక్షగాననాటకములు"

65. Vide., Dr. V. Raghavan's paper on 'Yakshagana' — Triveni, Vol. 7 — No. 2.

యుందురు *. ఇంతకు నీవ్యవహారము యక్షగానమున కిటీవలఁ గలిగినది. ప్రాచీనకాలమున గలిగిన ట్లాధారములు గన్పట్టవు. అయినను వీథిశబ్ద భ్రాంతినివారణార్థ మింతదూరము వ్రాయ వలసివచ్చినది. కాని యసలు దశరూపకములలో దేని పోలికయు యక్షగానమునెడఁ గానరాదు. కాలక్రమమునఁ బ్రహసనప్రాయములైన యక్షగాన రచన లొండురెండు పుట్టకపోలేదు.• యక్షగాన చరిత్రలో వాని నపవాదములుగా గ్రహింపనగును.

యక్షగానమున కుపరూపకములతోఁ బోలికగలదని రాఘవన్‌గా రభిప్రాయపడినారు. యక్షగానము గేయ నృత్య విశిష్టమైనది. ఉపరూపకములకును గేయరూపకములనియు (చూ. కావ్యానుశాసనము) నృత్య ప్రకారములనియుఁ (చూ. భావప్రకాశము) బేళ్ళు గలవు. అనఁగా నారెంటికి నేదో సాధర్మ్యము గలదని తోఁచును. నాట్యదర్పణ భావప్రకాశాదులందు నిర్వచింపఁ బడిన కావ్య నర్తనకాద్యుప రూపకముల లక్షణములు (ద్విపద యుపయోగము, పదార్థాభినయము మొదలగునని) కొన్ని యక్షగానమునకుఁబట్టును. కాని ప్రత్యేకమే యొక యుపరూపక లక్షణమును బూర్తిగా నతివ్యా

*అయితే యిందుల కపవాదము గలదు. 1. మన క్రీడాభిరామము ప్రేమాభిరామ మను సంస్కృత నాటకమునకుఁ దెనుఁగుసేత యనియు, నది వీథియను దశరూపక ప్రభేదమనియుఁ దత్కృత్యవతరణికలోఁగలదు. గ్రంథాంత గద్యలో నది యేకాశ్వాస పరిమితమగు వీథినాటకమని పేర్కొనఁబడినది. అప్పటికే నాటక శబ్దమునకు రూపక సామాన్యవాచక వ్యవహారము వచ్చియుండును. ఇది నాఁడు ప్రగల్భితమైనట్లును గ్రంథమునఁగలదు. ఇది గద్య పద్య సమన్వితమైనది మాత్రమ. ప్రక్రియలో దీనికిని యక్షగానమునకును నెట్టిపోలికయుఁగానరాదు. 2. 'వీథియన్నాటకంబు' - లక్షణసారసంగ్రహము III 90. (దశరూపకలక్షణము)

ఉదా :— తంజాపురాన్నదాన మహానాటకము.

_ప్తియు నవ్యా_ప్తియులేకుండ యక్షగానమునకుఁ బట్టదు. అనఁగా నారెంటికిఁగొంత సాధర్మ్యమే తప్ప సంబంధములేదని చెప్పవలెను.

మార్గరూపకము లొకలక్షణ నిష్కర్షకు లొంగునట్టివి. అట్టి నిష్కర్ష కనుగలము కానివి యక్షగానాది దేశిరూపకములు. వానికి సాదృశ్యముకంటె భేదమే యధికము. అట్టి ప్రాచీన మార్గరూపకములకును మధ్య యుగ జనసామాన్యాను రంజకరూపకములకును సంబంధమునూహించుట దుస్సాధ్యమని పండితుల తలంపు.[66] సంబంధమనఁగా నిట జన్యజనక సంబంధమని భావము. అయితే కాలక్రమమున యక్షగానముపై మార్గరూపక ప్రభావము పడకపోలేదు. మార్గరూపక ప్రభావమే కాదు. బహుధా మార్గసాహిత్య సంప్రదాయ విధేయమైన మన ప్రబంధము ప్రభావముగూడ బాగుగనే పడినది. (అది ముందు నిరూపింపఁబడును) అనఁగా యక్షగాన ముత్పత్తిలోఁ దేశియుఁ బరిణామమున మార్గియు నైన దనవచ్చును. అసలు చరిత్రను దఱచి చూచినచో సంగీతనాట్యకళా విషయములందును సాహిత్యమునందును నీమార్గదేశి విభేదము సమానాంతరముగనే వచ్చుచున్నదనిపించును. "ఆరెంటికి నొక్కొక యెడ కొంచెముగా అన్యోన్య గుణసంక్రమణముండిన నుండును గాని జన్యజనక సంబంధము బొత్తుగాలే" దని యభియుక్తుల యభిప్రాయము.[67]

## 2. హరికథ - యక్షగానము

యక్ష గాన మన్నను హరి కథ యన్నను నొక్కటే యనికొందఱు పండితు లభిప్రాయ పడుట గలదు. ఇప్పటికిఁ దెలియ వచ్చినంత

66. Vide., R. W. Frazer's Literary History of India, P. 270.
67. చూ. ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతము గారి గౌతమ వ్యాసములు— "ఘన నాటకముల పూర్వ గాథ"

మట్టునకు శ్రీ బాగేపల్లి అనంతరామాచార్యులను వారా యభిప్రాయ మును మొదట వ్యక్తమొనర్చిన వారుగాఁ గన్పట్టుచున్నారు. ఆయన రాయలసీమ అనంతపురమండలము హిందూపుర వాస్తవ్యులఁట. 19వ శతాబ్ది యుత్తరార్థమున నుండిన వారఁట. ఆప్రాంతము నందు హరి కథోపన్యాసకులుగాఁ బ్రసిద్ధివడసిన వారఁట. వారు హరికథల నుపన్య సించుట కాక స్వయముగాఁ బలురచనలు గావించిరి. అందు గొన్ని:- 1. చంద్రహాస చరిత్రము. 2. కుచేలోపాఖ్యానము, 3. మూఁకున్నర వజ్రము, 4. అనసూయాచరిత్రము, 5. సావిత్రీ చరిత్రము, 6. సుభద్రా పరిణయము. 7. శశిరేఖా పరిణయము.[68] ఈ యేఁడింటను జివరి నాల్గును యక్షగానములుగాఁ బేర్కొనఁ బడినవి. కాని వానిలో నట్లు బేర్కొనఁ బడని వానిలోఁ గూడ రచనా ప్రక్రియ యొక్కఁ డొక్కఁ గనే నడచినది. అన్నిటను తోహరాలు, హిందూస్తానీ మట్లును గలవు. ఇవియన్నియు నాఖ్యాన శైలీ ప్రకృష్టములు. ఈ తోహరాల యునికి మొదలగు లక్షణము లన్నియు నాంధ్రమున హరికథలను పేరఁ బ్రచా రమున కెక్కిన రచనలలోనే యెక్కువగాఁ గన్పట్టును. అనంతరామా చార్యుల వారు తమ కృతుల నెక్కటిగా నాఖ్యానించు చుండెడి వారఁట. హరికథా ప్రయోగ లక్షణ మదేకదా. అనంత రామా చార్యుల వారి కృతులను హరికథ లనుటలో విప్రతిపత్తి యుండనక్కఱ లేదు. కాని వారే వానిని యక్షగానము లనియు వ్యవహరించి యున్నారు కదా. వారే కాదు వారికించుమించు సమకాలికులు (1864-

68. ఇవియన్నియు నముద్రితములు. వీని వ్రాఁత ప్రతులు శ్రీమాన్ రాళ్లపల్లి అనంత కృష్ణ శర్మ గారి కడ నున్నవి. వారే గ్రంథకర్తను గూర్చిన విషయమును నా యెఱుకకుఁ దెచ్చిరి. దయతో గ్రంథము లెల్లఁ జదువ నొసంగిరి. వారి కెంతయుఁ గృతజ్ఞుఁడను. ఇందలి శశిరేఖాపరిణయ రచనా కాలమును వ్యయ వైశాఖ శు. దశమి గురువారముగాఁ గవి పేర్కొనెను. అది క్రీ.శ. 13-5-1886 తేదికి సరిపోవు చున్నది.

1945 )నాంధ్ర దేశ హరికథోపన్యాసక చక్రవర్తులుగాఁ బ్రసిద్ధులు నైన శ్రీమదజ్జాడాది భట్ల నారాయణ దాసు గారు తమ ప్రహ్లాద చరిత్ర + మను హరికథ యవతారికలో హరికథ యన్నను యక్షగాన మన్ననునొకటేయను నభిప్రాయముతో నొకపద్యము రచించిరి. అది:-

సీ. ఘన శంఖమోయనఁ గంఠంబు పూరించి
మేలుగా శ్రుతిలోన మేళవించి
నియమము తప్పక నయఘనంబులఁ బెక్కు-
రాగభేదంబుల రక్తి సల్పి
బంతు లెగిర్చిన పగిదిఁ గాలజ్ఞతన్
జాతి మూర్ఛన లొప్ప స్వరముఁ బాడి
చక్కని నృత్యమున్ సర్వ రసాను కూ
లంబుగ నభినయనంబుఁ జేసి

గీ. స్వకృత మృదు యక్షగాన ప్రబంధ సరణి
వివిధ దేశంబులం బిన్న పెద్దలు గల
బలు సభల హరి భక్తి నుపన్యసింప
లేని సంగీత కవితాభిమాన మేల.

ఈ పద్యమునే హరికథ యను శీర్షిక క్రింద ఆంధ్రపత్రిక విరోధి కృత్సం వత్సరాది సంచికలోఁ గూడ (పుట 77 ) దాసు గారు ప్రకటించి యున్నారు. వారు తమ " అంబరీష చరిత్రము "* హరికథ యుపో ద్ఘాతములో - " ఈ యంబరీషోపాఖ్యానము దొట్టి మఱికొన్ని యక్ష గానములను వ్రాసి యుంటిని — నేఁ దెలిసిన మట్టు యక్షగానముల

+ మినర్వా ము. శా. ముద్రణ - విజయనగరము, 1899.

* సరస్వతీ బుక్ డిపో ప్రచురణ, బెజవాడ, 1929.

కుదాహరణముగ నిందుతోఁ బది వివరించినాఁడను" అని తన రచించిన హరికథల నన్నిటిని యక్షగానము లనియే వ్యవహరించినారు. పార్వతీ పరిణయ మను నొక హరికథను† రచించిన శ్రీ పసుమర్తి కృష్ణమూర్తి గారు తదాశ్వాసాంత గద్యలోఁ దమ కృతిని యక్షగాన ప్రబంధమనియే పేర్కొనిరి. ఆయన దాసు గారి శిష్యులే. తమ కృతిని గురువుగారికే యంకితమిచ్చిరి. ఊలపల్లి గంగరాజ కవి రామజనన హరికథ ††కు ముఖ బంధ మగు ప్రశంసలో శ్రీ కాశీభట్ట సుబ్బయశాస్త్రిగారు దానిని యక్షగాన ప్రబంధ మనిరి. హరి కథ యని గ్రంథ కర్త పేర్కొనెను. భమిడిమఱ్ఱి రామమూర్తి గారి సతీ సక్కుబాయి హరికథ ‡ పీఠికలో శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారిది యక్షగాన మనుచు నా ప్రక్కనే (కుండలీ కరణములలో) హరికథ యని పేర్కొనిరి.

గ్రంథకర్త హరికథయనియే వక్కాణించెను. శ్రీభక్తవిజయ మను నింకొక హరికథ+ కూడ యక్షగాన ప్రబంధముగనే పేర్కొనఁబడినది. తద్గ్రంథకర్తలు "శ్రీమత్సంపూర్ణ రామాయణ మహాభారత భాగవత శివపురాణాద్యనేక యక్షగాన ప్రబంధకర్తలును హరికథోపన్యాసకులునగు శ్రీ అయ్యగారి వీరభద్రరావుగారు." "యక్షగానాల శాఖకే చెందిన హరికథ" లని శ్రీ కొత్తభావయ్యచౌదరిగా రొకచో* ననిరి.

† ప్రచురణ వివరములు తెలియవు. రాజమండ్రి గౌతమీ గ్రంథాలయమున వీని ప్రతులు గలవు.

†† శ్రీ పతి ప్రెస్ కాకినాడ 1936.

‡ సరస్వతీ పవర్ ప్రెస్. ముద్రణ – రాజమండ్రి, 1943.

+ రాజమండ్రి గౌతమీగ్రంథాలయమున నొక ప్రతిగలదు.

* చూ. "యక్షగాన నాటకములు" అను వారివ్యాసము – ఆంధ్రమహిళ – ఆగష్టు, 1956. పుట 14.

ఇట్లు పలుపురుపండితులు, సామాన్యులుగాదు ధీమాన్యులు నైనవారు, స్వయముగా హరికథా గ్రంథరచన గావించినవారును నభి ప్రాయపడి రనఁగా నది కాదనలేము. వానిలో నేదో సాదృశ్యములేదన లేము. కాని రెండును బూర్తిగా వాని యుత్పత్తిపరిణామములనుబట్టి యభిన్నము లనలేము. జక్కులకథలు, జంగంకథలు, హరికథలు, బుఱ్ఱకథలు — ఇవియన్నియు గానరూపమునఁ గథాఖ్యానమే ప్రధా నాశయముగాఁ బ్రారంభింపఁబడినవి. కావునఁ దత్త్రద్రచనా ప్రక్రియ లలోఁ గొంత సాదృశ్యము గోచరించినను వానివాని ప్రయోగపక్కి కలు వేఱు. ప్రయోజనములు వేఱు. వాని పుట్టువు పొలఁకువలే వేఱు వేఱు.

హరికథ వేదకాలముననే బీజరూపమున నున్నట్లును, నైతి హాసికయుగమునఁ గుశలవుల రామాయణగానము మొదలగు సంద ర్భములందు దాని స్వరూపము విస్తరించినట్లును గొందఱితలంపు.[69] కాని యేదో కథ చెప్పుట, అది విష్ణుకథయగుట యనునట్లు గాక మన మిానాఁడనుకొనుచున్న విశిష్టలక్షణములు గలదిగా హరికథ రూపొంది ప్రచారముగాంచుట మధ్య యుగమున మహారాష్ట్రమున. 17 వ శతాబ్ది పూర్వార్థమున నుండిన ప్రసిద్ధ మహారాష్ట్ర భాగవతుఁడగు తుకారామ్ హరికథాకాలక్షేపములు చేయుచుండినట్టు తెలియుచున్నది.[70] హరి కథ యనఁగా నది మహారాష్ట్రులది యని ప్రతీతి. అది మహారాష్ట్ర మున "అభంగ్" అనియు, తమిళదేశమునఁ గాలక్షేపమనియు, నాంధ్రమున హరికథయనియు (హరికథాకాలక్షేప+ మనియు) వ్యవ

69. Vide., "Kalakshepam" By Sir M. S. Ramaswmi Aiyar,.
70. చూ. "తుకారామ్ చీ గాథా"— (నిర్ణయసాగర ముద్రణ, బొం బాయి, 1927) అభంగములు 4045 – 4049.

+ కాలక్షేపమనఁగా Pastime అని యర్థము.

హరింపఁ బడుచున్నది. దక్షిణదేశమునకు హరికథాకాలక్షేపము దిగి వచ్చుట 17 వ శతాబ్దిలో నటు కర్ణాటకము నిటు తంజాపురాంధ్ర నాయక రాజ్యమును మహారాష్ట్రుల కైవసమైన తరువాతనే యని తోఁచును. తంజావూరి నేలిన మహారాష్ట్రప్రభువు లంతకు ముందాంధ్ర నాయక రాజులు మిగుల నాదరించిన యక్షగానప్రక్రియ తమ హరికథా సంవాదిగా నుండుటచేతను, నంతకంటె మఱియొక మెట్టెక్కువగా రూపకప్రయోజనము గల్గియుండుటచేతను గాఁబోలు తాముసు దానిని నాయక రాజులకంటె నెక్కుడుగ నాదరించిరి. స్వయముగా నెన్నో యక్షగాన నాటకములను వెలయించిరి.+ కాని యాంధ్రమున వారైతమహరికథలను వెలయించిన జాడగానరాదు. కాని మహారాష్ట్రులకుఁ బుట్టినింటను బోరుగువారైన మధుర సౌరాష్ట్ర సభ వారు పిదప కాలమునఁ దెనుఁగునఁ గొన్ని హరికథలను వెలయింపఁ జేసిరి.[71] తత్రాపి మనవారును కాలక్షేపార్థము రూపప్రదర్శనావకాశము లేనియెడ నేకపాత్రాభినయమునకైనఁ బనికివచ్చుననియో, అన్యగీత ప్రబంధచ్ఛందస్సుల[71] కాకృష్టులగుటచేతనో నాఁటినుండి హరికథా రచనకు దొరకొనియుందురు. అసలు యక్షగానము హరికథగాఁ జెప్పఁబడు సంప్రదాయమొకటి కన్నడదేశమునఁగలదఁట. అయితే అది ప్రాచీనమైన సంప్రదాయముగాదు. ఈవిషయమై

+ చూ. ఇందలి ద్వితీయభాగము — ద్వితీయప్రకరణము.

71. ప్రా. లి. పు. భాం., ఆర్ నం. 1607, 1608. వీనిలో డోరాబ్యాక్, సౌపంగి, లావణి, కేకావళి, ఖడ్గా, ఛంద్ మొ. సౌరాష్ట్ర మహారాష్ట్ర గీతప్రభేదములుగలవు. ఆంధ్రదేశపు హరికథలందు డోరాలు, తోహరాలును దఱచు లావణి 19 వ శతాబ్ది కర్ణాటాంధ్ర యక్షగానములందును బ్రయుక్తమైనది.

(ఈమధుర సౌరాష్ట్రసభ హరికథలు, వానిలోని ఛందస్సులనుగూర్చి ప్రత్యేకమొక వ్యాసము 2-5-55 త్రిలిఙ్గలోఁ బ్రకటించి యుంటిని).

శ్రీ ముట్నూరి సంగమేశముగారు లేమనుచున్నారో చూతముగాక. "అసలు వేషరచనకూడా మానుకొని మద్దెల, జేగంట, హార్మోనియం శ్రుతి అనేవి సహాయంగా తీసుకొని ఒకాయన యక్షగానరచన గానంచేస్తూ ఉంటే, మరోనలుగురు వేర్వేరు పాత్రలను పంచి పుచ్చుకొని, సిలాసాగా నాటకీయపద్ధతిలో సంభాషణలు నెరపడం అనే మర్యాదకూడ దక్షిణ కన్నడ ప్రాంతంలో పాతిక ముప్ఫయేళ్ళనుండి బయల్దేరింది. దీనిని "తాళమద్దెల" అని పిలుస్తారు. ఇందులో ఆటగాని, అభినయంగాని, వేషంగాని ఏమీలేవు. ఒకరుచెప్పే హరికథ నలుగురు పంచుకో చెప్తూన్నట్లుంటుంది"[72] ఈసంప్రదాయము యక్షగానముపై హరికథల ప్రభావమునుమాత్రమే సూచించును. ఏదెట్లయినను మనకు యక్షగానరచన ప్రాచీనము. హరికథారచన యాధునికము. నేటి హరిదాసులు హరికథలను యక్షగాన ప్రబంధములని పేర్కొనినట్లు, ప్రాచీన యక్షగాన కర్తలెవ్వరును యక్షగానమును నది వైష్ణవేతివృత్తమగుచో నౌపచారికముగ హరికథ యనుటతప్ప (ఆ యనుటయుఁ గ్వాచిత్కము) ప్రక్రియ పరముగా హరికథ యని వ్యవహరింపలేదు. లాక్షణికులుగూడ వస్తు చ్ఛందోవైవిధ్యము విశేషముగఁ బ్రదర్శించి యుండుటచే యక్షగానమున కొక నిష్కృష్టలక్షణము నేర్పరింపలేక పోయిరి. ప్రక్రియగా నా వదులుతనమే మొదటఁ దాళప్రధానములైన రేకులతో ద్విపదలతోఁ గొలది గద్యపద్యములతోఁ బ్రాదుర్భవించిన యక్షగాన రచనమును వివిధ దేశిపద కవితా ప్రభేదములను, కర్ణాటక సంగీతమునకుఁ బ్రచారము గలిగిన దినములలో నాయా రాగ ప్రభేదములను, దక్షిణ దేశమున కౌత్తరాహులతో సంపర్కముకలిగిన రోజులలో నాహిందూస్తానీరాగములను మట్లను నిముడ్చు

72. చూ. సంగమేశంగారి "బయలాట" అనువ్యాసము — ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, 4-1-1956, పుట 64.

కొను నట్లు చేసి, రానురాను యక్షగాన మనఁగా ఛందో వైవిధ్య విశిష్ట గేయ ప్రబంధ సామాన్య వాచియా యని యనిపించు నంతగాఁ బరిణమింపఁ జేసి నేఁటికి హరికథలకుఁ గూడఁ బర్యాయ వాచకముగా నిలిపినది.* అసలు హరికథ ప్రయోగ విషయమున యక్షగాన ప్రారంభదశను సూచించు నన వచ్చును. రచనా ప్రక్రియలో నీనాఁటి ధోరణిని బట్టి రెండింటను నెట్టి ఛందస్సుల నైనఁ బాటలనైన నెట్టి కథలనైన నెలకొల్పవచ్చు ననవచ్చును. ఈనాఁడు యక్ష గానము లెట్లు యక్షులచే (జక్కులచే) గానము చేయఁ బడుట లేదో యట్లే హరికథ లన్నియు విష్ణు కథలు గావు. శివకథలు చివరికి శివాజీ గాంధీజీ కథలును హరికథల పేర "చలామణి" యగు చున్నవి. అనఁగా నీకఁ బ్రక్రియ కేగాని యా పేరునకుఁ బ్రాముఖ్యము పోయినదన్న మాట. కడమ ఛందస్సులమాట యెటులున్నను గధాఖ్యానమునకు యక్షగానములలో ద్విపద, హరికథలలో ఢోరాలు, తోహరాలు సంప్రదాయ సిద్ధముగా వాడఁబడుచున్నవి. నారాయణదాస ప్రభృతుల రచనలలో ఢోరా తోహరాలకు బదులు మంజరియను రచనా విశేషము గన్పట్టును. అది మన మంజరీ ద్విపద కాదు. ఢోరా వంటిదే. హరికథలలో మన ద్విపదలు, కందార్థాదులును జేరినవి. 19 వ శతాబ్ది యుత్తరార్ధము, తదుపరి యక్షగానములలో మాత్రము గొన్నిట ఢోరా తోహరాలును, మరికొన్నిట లావణి మొదలగు నన్యదేశ్య

---

* ఈ సందర్భమున గోదావరిమండల వాస్తవ్యులు, ప్రసిద్ధ హరికథోపన్యాసకులు, రచయితలునైన శ్రీ నల్లమిల్లి బసివిరెడ్డిగారి యభిప్రాయ మొకటి గమనింపదగియున్నది. చూ. ద్వి భా. పుట. 246. (అది యాయన స్వయముగ నాతో సెలవిచ్చినమాట. వీ రిటీవల తేదీ 8-12-59 న కీర్తిశేషులైరి.)

చ్ఛందస్సులును (సాధారణముగా హరికథలలో నుండునవి) చేరినవి.

పై విషయములనుబట్టి హరికథ— యక్షగానములకుఁ గల సాదృశ్యము, సంబంధము నెట్టివో గ్రహింపనగును. హరికథ నుండి యక్షగాన ముత్పత్తియైనదని యెవరైనన్నచో నది ముధావాద మగును. అదియుఁగాక యీవాదము యక్షగాన నామోత్పత్తిని సమర్థింపదుగదా. ఇఁక యక్షగానమే హరికథగాఁ బరిణమించిన దను వారును గొందఱు గలరు.[73] కాని యిదియు నవిచారమూలక మగు నభిప్రాయమే. రెండిటి యుత్పత్తి వేర్వేఱనియు, రెండును గొంత సదృశ ప్రక్రియలగుటచే వానికిఁజారిత్రక కారణములవలన సాన్నిహిత్య మేర్పడఁగాఁ గొంతకుఁగొంత సంబంధమును నేర్పడెనని తలంపవలసియున్నది. *

## 3. కథకళి – యక్షగానము

దక్షిణ భారతమునఁ బ్రధానములైన యాంధ్రకర్ణాట తమిళ మళయాళ రాష్ట్రములు నాల్గింటిలో మొదటి మూఁడింటను యక్షగాన మొక దేశి రూపక ప్రక్రియగా విలసిల్లినది. కాని మళయాళమున

---

* చూ. ఇందలి ద్వితీయ భాగము, మొదటి ప్రకరణము – ఆంధ్ర దేశ య. గా. కవులు వరగంటి శేషగిరి వెంకటరమణదాసులు, గోపాల రామదాస కవి, తిమ్మరాజు లక్ష్మణరావుల, అనంతరామాచార్య నారాయణదాస ప్రభృతుల కృతుల విషయము.

73. (1) కవిత్వవేది ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము – (వావిళ్ళ ప్రతి – 1951) పుట 145. య. గా. లే తోలుబొమ్మలాటలుగా మాఱినవనియు కవిత్వవేది యభిప్రాయము. చూ. పుట 246.

(2) Vide, Chap. 5 of 'Telugu Literature' By Prof. P. T. Raju. (P. E. N. Series No. 15.)

* య. గా. హరికథగూర్చి వేఱ యొక వ్యాసము ప్రకటించియుంటిని, చూ. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక,

దానికి ప్రశస్తి కలుగకుండుటకుఁ గారణము తత్సదృశమైన కథకళి యను గేయాత్మక నృత్యకళా విశిష్టమగు నొక రూపకప్రక్రియ కచటఁ బ్రచారమేర్పడుటయే. కథకళి మళయాళ రాష్ట్రపు గర్వకారణ మగు నొక జాతీయ రూపక ప్రక్రియగా వాసికెక్కినది. దానికిని యక్షగానమునకును గొంతపోలిక గలదు. అది కారణముగా నుత్ప త్తిలో నీరెండును నేకబీజకములై యుండునను నభిప్రాయము కొందఱు పండితులకుఁ గల్గినది.

యక్షగాన వాఙ్మయ పరిశోధకులలో దొలితరము వారిలో నొకరగు ఆచార్య శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారీ విషయమై యిట్లు సెలవిచ్చియున్నారు :— [74].

"This Veedhinataka in Telugu may be said to be only a counter part of the Malabar Kathakali, but with this difference, that while in the Telugu. Veedhinataka the actors speak and take to singing the songs whose meaning they also seek to interpret by means of gestures – i.e., by Abhinaya; the Kathakali actors enact the whole story by means of mute abhinaya leaving speeches and songs entirely to the troupe behind them, who supply the musical and other accompaniments necessary for the successful enactment of the drama. The dress, the make up, the method of performance, and all other paraphernalia required for the enactment seems to point towards the identity of their origin, though there may be some minor differences due to later independent developments.'

74. Vide P. 19 of 'Telugu Literature outside the Telugu Country' By K. R. K. (Madras University Telugu Series No. 9 (1941) Chap: Yakshagana and Desi.'

మీఁది వక్కాణలో శ్రీరామకృష్ణయ్యగారు కథకళి యక్షగానముల భేదసాదృశ్యములను జక్కఁగా విశదపఱచినారు. అయితే సాదృశ్యము వాని యుత్పత్తి సామ్యము వంక మొలుసూపుచుండఁ బోలు ననియు, భేదము పరస్పర నిరపేక్ష మగు వాని కాలాంతర పరిణామము కారణముగాఁ గలిగియుండ వచ్చుననియు ననియున్నారు. ఇది యొక యభిప్రాయముమాత్రము. ప్రబలవాదముగాదు. అయినను నిది ముందు ముందొక వాదముగాఁ బరిణమింపకుండుటకు దీని నిటఁ బరిశీలించుట కర్తవ్యము.

మన యక్షగానమునకును గథకళికిని గల సాదృశ్యము భరతఖండమున వివిధ రాష్ట్రములందు వెలసిన యాంతరగతి దేశిరూపకములన్నిటికి నించుమించుగా సరిపోవు నట్టిదే కాని విశేషముగాదు. కథకళిప్రత్యేకత మూకాభినయము. యక్షగాన ప్రాయములగు కన్నడదేశపు బయలాటలపై[75], మెలట్టూరు భాగవతమేళ నాటకములపైఁ[76] గథకళిప్రత్యేకతయొక్క ప్రభావము కొద్దిగానైనఁ గలదు (అందులకుఁ బ్రాదేశికముగా వానికున్న సన్నిహితత్వమే కారణము కావచ్చును. అదియు నిటీవలి పరిణామమే కావచ్చును.) కాని మన యక్షగానముపై దానిప్రభావ మే దశలోను (పాల్కురికి యక్ష నేపథ్యముల యాటపాటల ప్రస్తావనలోఁ గాని, క్రీడాభిరామ—జక్కుల పురంధ్రి గానాభినయ ప్రసంగమునఁ గాని) గానరాదు. ఇంతకును గథకళి యేమంతప్రాచీనమైనదికాదు. మలయాళ పండితులే యీ మాట నంగీకరించుచున్నారు.

---

75. చూ. శ్రీ ము. సంగమేశంగారి 'బయలాట' వ్యాసము – ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక, 4-1-56. పుట, 22-24.

76. చూ. ఈ విషయమై నా వ్యాసము – భారతి, సెప్టెంబరు, 1955.

కథకళి గురించి :- శ్రీ కె. ఆర్. పిషరోటీ గారేమను చున్నారో చూడుడు :-

'We shall not be far from the truth if we place this in the latter half of the 17th Century . It is quite probable that this new variety must have been devised somewhere in the Sixth decade of the 17th Century '[77]

మరికొందరు

'The Raja of Kottarakkara (1575-1650 A. D.) was the first composer and originator of the Kathakali '[78] అని యనుచున్నారు. వీరి యభిప్రాయము గణించినను కథకళి చరిత్ర క్రీ. శ. 16వ శతాబ్ది దాటిమీందికిఁబోదు. కథకళి పుట్టుటకు ముందే యాంధ్రమున యక్షగాన రచనకూడ ఆరంభమై సాగుచుండినది.

అనఁగా యక్షగానమునకును గధకళికి నుత్పత్తిసామ్య మూహించుట సమంజసముగాదుకదా. అదియుఁగాక కథకళి యక్షగాన నామోత్పత్తిని సమర్థింపలేదుకదా ; అయితే శ్రీ రామకృష్ణయ్యగారు యక్షగాన నామోత్పత్తి విషయమై చూపుపెట్టనివారుకారు. వారు తమ వ్యాసమున పండితారాధ్య చరిత్రమునందలి యక్ష వేషములతోడి యాటపాటల ప్రసక్తి, క్రీడాభిరామమునందలి జక్కుల పురంధ్రి పాట ప్రసక్తి యెత్తిచూపుచు వానిప్రాథమికానుబంధస్వరూపము నావిష్కరించుచు నా జక్కుల పురంధ్రి పాటయే జక్కులపాట యనియు నది

77, Vide 'South Indian Theatre' By K. R. Pisharoti - Chap. IX of 'The Theatre of the Hindus' published by Susil Gupta Ltd., Calcutta—12. 1955.

78. Vide (a) 'The Music of the Nrtyanatakas of South India' - Thesis submitted by Srimathi K. Gomathi for the M. Litt of the Madras University. (b) 'The Language of Kathakkali' By Sri Premakumar Thamma, pp. 15.

యక్షగానమను సంస్కృత శబ్దమునకుఁ దెనిఁగింపు కావచ్చుననియు వ్రాకుచ్చినారు.

## 4. ఇతర విషయములు

యక్షగానమునకన్య దేశీయ రూపక ప్రక్రియలలోఁ గొన్నిటితోఁ గొంత కొంత సాదృశ్యము గలదు. ఉదాహరణమునకు :- మనయక్షగాన ప్రదర్శనములలోని హాంగుదారుల వంత పాటకుల మేళమించు మించు ప్రాచీన గ్రీకునాటకములలోని "కోరస్" బృందగానముచేయు గాయకబృందమువంటిది. యక్షగానము గురించి వ్రాయుచు నొక రీ విషయము నిట్లు సూచించినారు గూడ * :-

"Its technique may roughly be compared to the Greek drama in its simplicity of expression and the importance of the element of chorus in it."

కాని యీ సాదృశ్యవిషయమునకుఁ గలిసివచ్చునుగదా యని వెనుకటి (అలెగ్జాండరు చంద్రగుప్తమౌర్యులనాఁటి) గ్రీకు భారతీయ సంబంధబాంధవ్యముల చారిత్రక విషయనుగూడ జోరుచేసి యెవరైన యక్షగాన మా యవనరూపక కళనుండియే యావిర్భవించిన దనిన చో ఆ యనుట ఫలితములేని ద్రావిడప్రాణాయామముపట్టుటయే యగును.

యక్షగానమువలె గానప్రాధాన్యము, హాంగు, పౌరాణికేతి వృత్తముల ప్రతిపత్తి, ప్రదర్శన నిరాడంబరత, జనసామాన్యానురంజకత్వము మొదలగు లక్షణములు గల వంగదేశపు యాత్ర [79] లకును,

* Vide "Yakshagana and other plays of Mysore" an article by Sri S. Srinivasachar, Published in The March of India Vol. IV - No. 6.

79. Vide, Chap. IV, item IV of "History of Bengali Language and Literature" by Sri Dinesh Chandra Sen.

యక్షగానములకును (పండితారాధ్య చరిత్రలోని శ్రీశైల క్షేత్రము నందలి శివరాత్రి వినోదములు పేర్కొనఁబడిన సందర్భమునుబట్టి) యాత్రాస్థలములే జనుఃస్థానములై యుండునని యూహింపఁ గల్గినచో నది యొక సాదృశ్యమే యగును గాని యుత్పత్తి దశలోఁ గాని పరిణామమునఁగాని వానికి సంబంధముగల దనుటకు సత్యసన్నిహితమైన యుపపత్తి మాత్రము గాఁ జాలదు.

ఇట్లే యక్షగానముతో నితివృత్తమునందో, రచనా ప్రణాళిక యందో, ప్రదర్శన సంప్రదాయమునందో యంతంత మాత్రము సాదృశ్యము గల యన్యదేశీయ రూపక ప్రక్రియ లనేకము గలవు. దానికిఁ గారణమించు మించవి యన్నియు నొక్క పాదునుండి మొలిచిన వగుటయే కావచ్చును. ఒక్క పాదనఁగాఁ గృతక ప్రవృత్తికిఁ బ్రసక్తి లేని నిసర్గమధుర నిరాడంబర స్నిగ్ధజన ముగ్ధభావ ప్రకృతుల కాటపట్టయిన జనపదము. — ఒక్కొక్కచో యక్షగానమునకును దాని పరిణామ దశలలో నన్యప్రక్రియలతో నాపాటి యీపాటి సంబంధము నేర్పడినదన్నచో నదియొక వింతగాదు. సదృశ ప్రక్రియలకుఁ బ్రాదేశికమైన సన్నిహితత్వ మేర్పడినచో సంబంధము నేర్పడుట సహజముగదా.

యక్షగానోత్పత్తి విషయమై పైనుదాహరింపఁబడినవాదములు సంబంధ సంవాదులు కొన్ని, సాదృశ్య సంవాదులు కొన్ని. కాని జక్కుల జాతిసంబంధ వాదమువలెఁ గడమవాదములు చక్కగాఁ బాదుకొనియుండలేదు. యక్షగాన నామోత్పత్తి నవి సమర్థింపలేవు.

ఇఁక యక్షగాన శబ్దార్థమును గూర్చి శ్రీ యమ్. గోవిందరావు గారు తమ వ్యాసమున [80] లడ్విగ్, గెల్డ్‌నర్ అను పాశ్చాత్య

80. Vide, Madras University Annals of Oriental Research Vol. X – Part II for his paper on the Yakshagana in Karnataka.

పండితు లిరువురు యక్షశబ్దమునకు "ఉత్సవము" (Festivity) అను నర్థము చెప్పినారనియు, నదికాని యంగీకార్యమగుచో యక్షగాన మనఁగా నొకయుత్సవ సమయమునఁజేయబడు సంగీతగోష్ఠియని చెప్ప వచ్చుననియు ననియున్నారు. యక్ష శబ్దమసలు ప్రత్యవసానార్థకమైన "జక్ష్" అను ధాతువువలన నేర్పడినట్లు తోఁచును. యక్షులు పుట్టఁ గనే బ్రహ్మదేవునిఁ దినుటకు యత్నించిరనియు, నతఁడు "మాంమా జక్షత" యని వారినిఁ బ్రార్థించెననియు, వారే నాఁటినుండి యక్ష శబ్ద వ్యవహృతులైరనియు భాగవతము తృతీయ స్కంధమునఁ (20 అధ్యా. - 21 శ్లో.) గలదు. యక్షశబ్దార్థమేదైనను నది యక్ష జాత్యుత్పత్తిని సమర్థించునుగాని యక్షగానోత్పత్తిని సమర్థింపదు. దానికి యక్షశబ్దార్థముతోఁగాక గానప్రియులైన యక్షశబ్దవాచ్యుల తోనే యేదో సంబంధముండి యుండుననుట లెస్స. ఈనాఁడాధారము లుపలబ్ధములైన యంతలో నా యక్షశబ్దవాచ్యులు మన జక్కులును, గన్నడదేశపు ఔక్కల గాణలునైయుందురని యూహించుటయు లెస్సయగును.

## యక్షగానము

### ప్రాచీనత – ప్రాథమికావస్థ

యక్షరాత్రి, బౌద్ధయక్షులు, జక్కిణి మొదలగు విషయముల తోడి సంబంధము నేదైన స్థిరపఱుపఁ గల్గినచో యక్షగాన చరిత్ర మతి చిరంతనమైనదని చెప్పవచ్చును. కాని యట్టిసంబంధమును స్థాపించు టకుఁదగిన యాధార సామగ్రీసౌలభ్యము కానరాని యీనాఁడది కడు కష్టసాధ్యము. ఆధారము లుపలబ్ధమానము లగుచున్నంతలో యక్ష గాన చరిత్ర మంతప్రాచీనమైనది కాదనియే చెప్పవలెను. కాని కన్నడ పండితులు కొందఱు తమ వాఙ్మయమున యక్షగానము కొంత ప్రాచీనమైనదనియే తలంచుచున్నారు:—

"Kannada Scholars are of the opinion that as early as the 9th Century A.D., this kind of composition could be traced. They suggest that "Chattana" "Nalpagarana" etc., mentioned in Kavirajamarga of Nripatunga (814–817 A.D.) are nothing but Yakshagana Works." [81] కాని కవి రాజమార్గమునఁ బేర్కొనఁ బడిన చత్తాణాదులకు లక్ష్యగ్రంథము లిపుడు కన్నడ వాఙ్మయమున లభించుటలేదు. "But unfortunately no composition of this kind has come down to us to verify their statements" అని యనియున్నారు గోవిందరావుగారు. అయితే కవిరాజమార్గమున వాని లక్షణ ముక్తమైనది. అది పరిశీలనార్హము.

" కందము మమళిన వృత్తము
మొందొందడె గొందు జాతి జాణెనె యె బెడం
గొంది వరిళ మరె పేఱ
ల్సుందర రూపిం బెడెండె గబ్బ మదక్కుం"

కవిరాజమార్గము. 1–34.

"కందళ్ళల వాగిరె
సుందర వృత్తం గళక్కరం చవు పది మ
త్తంగ్గితకె తివదిగ
ళందంబుత్తె సెయె పేళ్దా డదు చత్తాణం"

— కవిరాజ మార్గము. 1 – 35.

అనఁగా నొకకందము, పిదప నొకవృత్తము చొప్పున రచించుచు నొక్కొకయెడ జాతుల ననుసంధించినచో నది 'బె ద ం డె' కబ్బ మగును. పలు కంద పద్యములతో నందమైన వృత్తములను, అక్కర, చవుపది, గీతిక, తివది (త్రిపది) మొదలగు వాని నందముగా నను

81. Ibid., Mr. M. Govindarao's Paper, P. P. 3-4.

సంధించినచో నది చత్త్వాణ చంద మగును. పై రెండింటను గంద పద్యము ప్రాధాన్యము, వృత్తముల ప్రతిపత్తి, అక్కరాది జాతుల యక్కఱ విశదమగును. కాని నేఁ డుపలబ్ధము లగు కన్నడ యక్షగానములను[82] పరిశీలించినచోఁ గందములు నందందు వృత్తములును గలవు కాని అక్కరాది జాతులన్నియును లేవు. అక్కర లసలు లేవు. కడమవాని ప్రయోగ మతివిరళము. వానిలోఁ గవిరాజమార్గమునఁ జెప్పఁబడని రగడ వికారములగు తాళప్రధానములగు రేకులకును, ద్విపదలకే ప్రాధాన్యము. మఱియు వానిలో వచనములు, పదములు, అర్ధచంద్రికలు, షట్పదులు, ధవళశోభనములు మొదలగు రచనా విశేషములు గలవు. ఇవియుఁ గవిరాజ మార్గ బెదండె చత్త్వాణకావ్య లక్షణములందుఁ జేర్కొనఁ బడలేదు. పైఁ బేర్కొనఁబడిన కన్నడ యక్షగాన లక్షణములే తెలుఁగు యక్షగానములందును గన్పట్టును. చూడఁగా నా బెదండె చత్త్వాణము లేవో సామాన్యములైన నిర్వచన పద్యకావ్యములై యుండుననితోఁచును గాని యక్షగానము లనిపింపవు.

ఇఁకఁ గవిరాజ మార్గమునఁ బేర్కొనఁ బడినఁ నాళ్ పగరణాల విషయము: నాళ్ - నాడు అనఁగా దేశము, పగరణ - ప్రకరణ మనఁగా రూపకము. (అసలు ప్రకరణము ప్రసిద్ధ సంస్కృత దశ రూపక ప్రభేదము. మాలతీ మాధవ మృచ్ఛకటికాదు లట్టివి. కాని యా లక్షణ మిటఁ బ్రసక్తము కాలేదు. ప్రకరణశబ్ద మిట రూపక సామాన్యవాచిగాఁ బ్రయుక్తమైనట్లు తోఁచును.) అనఁగా దేశీయ మగు నొక రూపక విశేష మని యర్థము. ఇందుఁ గ్లిష్ట కల్పనాదులు దోషము లనియు, గ్రామ్యాశ్లీల భాషణములు హాస్యరస భాజనములు

82. చూ. — ప్రా. లి. పు. భాం., డి. నంబర్లు.: 413, 1168, 1169 1175. 1178, 1181. 1183, 1185, 1186. 1200, 1204, 1210 1212, 1220,

కాఁగలవు కాన నవి దోషము లనిపించుకొన వనియుఁ గవి రాజ మార్గమునఁ గలదు. (చూ. ఆ. 1 - ప. 66 - 68) ఈ లక్షణము యక్షగానముల కేగాదు సామాన్య జనామోదకము లగు దేశి రూపక ముల కన్నిటికినిఁ దగి యున్నది. అవి యక్షగానములే యని నిష్కర్షతోఁ జెప్పవలనుపడదు. ఇట్లే నృపతుంగునకు సుమారొక శతాబ్ది (పై చిలుకు) యర్వాచీనుఁడగు నాగవర్మ రచించిన కన్నడ కావ్యావలోకనములోఁ బేర్కొనఁ బడిన "పాడుగబ్బ" లు, "బాజనగబ్బ" లు ననునవి గేయ కావ్యములు, గేయాభినయానుకూల దృశ్య ప్రబంధము లనియుఁ దెలియు చున్నది.[83] కాని యివియు యక్షగానము లని నిష్కర్షతోఁ జెప్పవలనుపడదు. అయితే యివి యన్నియుఁ గన్నడదేశమున సంగీత నాట్యకళల కానాఁడుగల "పరపతి" నిఁ దెలియఁ జేయఁగలట్టివై నఁ గావచ్చును.

అసలు కన్నడమున యక్షగాన రచన మిగుల నర్వాచీన మైనది. ఆ విషయమును బలువురు కన్నడ పండితులే యంగీకరించి యున్నారు.[84] ప్రత్యేకముగ కన్నడ యక్షగాన వాఙ్మయముగుఱించి పరిశోధన చేయుచున్న శ్రీ ఎమ్. గోవిందరావుగారు దాని గురించి వ్రాయుచు "In a study of a good number of yakshagana works, I was not able to come accross a work earlier than the end of the 17th century" అని వక్కాణించియున్నారు. + తమిళమున యక్ష

83. చూ. కన్నడ కావ్యావలోకనము. సూత్ర. 245-249.

84. Vide., (1) A History of Kanarese Literature by Mr. E. P. Rice, p. 100. (2) History of Kannada literature by Sri R. Narasimhacharya, p-25. (3) "Turning points of Kannada literature", paper by Sri M. Mariappa Bhat - Ref: Madras University Annals of Oriental Research Vol. V - Part 2.
+ " " Vol. X - Part 2.

గాన రచన మఱియు నర్వాచీనమైనది. తెనుఁగుననే ప్రాచీనతమమైనది. ఈ సందర్భమున డాక్టరు శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారి వాక్యములు స్మరింపఁదగినవి :— "తెలుగు యక్షగానములు ప్రాచీనతమములు. తమిళ కన్నడ యక్షగానము లా దేశములందాంధ్రుల వ్యాపన మతిశయించిన పిమ్మటనే రచింపఁబడెను"[85] అయితే తెనుఁగు యక్షగాన రచన మెంతో ప్రాచీనముగాదు. క్రీ. శ. 16వ శతాబ్దికి ముందునాఁటి యక్షగానరచన తెనుఁగునఁ గానరాదు. క్రీ. శ. 15 వ. శతాబ్దికి ముందు యక్షగానరచన జరిగినట్లు తెలియవచ్చుటలేదు. కాని యక్షగాన మొకసాహిత్య ప్రక్రియగా నవతరించుటకుఁ బూర్వరంగముగాఁ గొంతచరిత్ర యుండకపోదు. 15వ శతాబ్ది పూర్వార్ధమున వెలసిన మనక్రీడాభిరామమున జక్కుల పురంధ్రుల పాటలును యక్షకన్యల యాటలును ప్రసక్తములైనవికదా. అసలు యక్షగానశబ్దమే యదియొక ప్రత్యేకమైన గానశైలియను నర్థమున నానాఁటి భీమ ఖండమునఁ బ్రయుక్తమైనదికదా[86]. పండితారాధ్య చరిత్రయందలి యక్షాది

85. చూ. వారి మధుర తంజావూరు నాయకరాజుల నాటి ఆంధ్ర వాఙ్మయ చరిత్ర, పుట 88.

86 ఆచార్య శ్రీ విస్సా అప్పారావుగారి "ఆంధ్రుల నాట్యకళ — కూచిపూడి కళావైభవము" అను వ్యాసమున (1954 సం. విజయవాడ శ్రీ కనకదుర్గా కళా సమితి తృతీయ వార్షికోత్సవ సంచికలోఁ బ్రమరితము) "కులోత్తుంగ చోళదేవుని శాసనములో నట్టువమేళములవారు యక్షగానముల నాడిరని యున్నది" అని వక్కాణించియున్నారు. చోళరాజులలో క్రీ. శ. 11-13 శతాబ్దుల నడుమ కులోత్తుంగ చోళదేవ నామధేయులు పలువురున్నారు. (చూ. స్యూయలు - దక్షిణ హిందూదేశ శాసనములు) కాని యందెవరి శాసనమునను యక్షగాన శబ్దము కానవచ్చుటలేదు. చోళరాజుల శాసనములలో రెండిట (154 ఆఫ్ 1892, 120 ఆఫ్ 1925) 'అరియకూత్తు' ప్రసక్తిగలదు. దానినే శ్రీ అప్పారావుగారు యక్షగానమనుకొనిరేమో ; ఇప్పటికి నే నెఱిఁగినంతలో యక్షగానశబ్దము గానవచ్చు గ్రంథములలో శ్రీనాథుని భీమఖండమే మొట్ట మొదటిగాఁ గనుపట్టుచున్నది.

నేపథ్యముల తోడి యాటపాటల ప్రసక్తిని బరిగణించినచో యక్ష గానము చరిత్ర మింకొక శతాబ్ది వెనుకకుఁబోవును. కన్నడవాఙ్మయ మునందలి "అగ్గళుని చంద్రప్రభా పురాణము", అభినవ పంపని మల్లినాథ పురాణములందలి "ఎక్కలగాణ" ల ప్రసక్తి నెత్తు కొన్నచో యక్షగానచరిత్ర క్రీ. శ. 12వ శతాబ్దిదాఁక నెగఁబ్రాకఁ గలదు. అంతకు మించినదంతయు నుపాధి సమగ్రముగాని యూహా గానమే.

ఇఁక యక్షగానముయొక్క ప్రాథమిక స్థితి యెట్టిదో యించుక పరిశీలింతము. క్రీ. శ. 12వ శతాబ్ది నాఁటి కన్నడ చంద్ర ప్రభా పురాణములో "వనవిహారం చేస్తూన్న నాయకుఁడు మేళ తాళాలతో నిమిత్తంలేకుండా దేశీయ గీతాన్నొకదానిని ఒక "ఎక్కల గాణ" యింపుగా పాడుతూ వుంటే విన్నాడని వర్ణించ బడింది"[87] దీనిని బట్టి మేళతాళములతో నిమిత్తములేని యెక్కల గాణల జాతీయ గీతాలాపము యక్ష గానోత్పత్తికిఁ బ్రాతి పదిక యైనదని తోఁచుచున్నది. ఆశతాబ్దిలోనే వెలసిన మల్లినాథపురాణములో "కమలామోదియైన తుమ్మెద ఝుంకారం కమలాలయయైన లక్ష్మిని కీర్తిస్తూ పాడే "ఎక్కల" గానంతో పోల్చి వర్ణించబడింది"[88] అనఁగా నా యెక్కలగానము లేక యక్షగానము దేవతా స్తుత్యా త్మకమైనదని తెలియుచున్నది. శ్రీనాథుని భీమఖండమునందలి దక్షా రామ ప్రశంస సందర్భమునఁగల "కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు, గాంధర్వమున యక్షగాన సరణి" అను వాక్యమును జూచినను నాఁడు యక్షగానము దైవస్తుత్యాత్మకమైన యొకప్రత్యేక గానశైలిగాఁ బరిఢ విల్లుచుండినదని స్ఫురింపఁజేయుచున్నది. మల్లినాథపురాణములోనే "యక్షాందోళన" మను నృత్యముగూడఁ బ్రసక్తమైనది. ఈయాం

87, 88. చూ. శ్రీ సంగమేశంగారి వ్యాసము - భారతి, ఫిబ్రవరి, 1956.

దోళికా ( ఆందోళన మన్నను ఆందోళికయన్నను నర్థమొక్కటే. చూ. - సూ. రా. ని. ) నృత్యముగూర్చి శ్రీ ముట్నూరి సంగమేశం గారిట్లు వ్రాయుచున్నారు :-[89] "కన్నడ యక్షగానాల్లో నటి వేషాన్ని యక్షిణీ వేషమనీ, స్త్రీవేషమనీ, మోహినీవేషమనీ పరిపరివిధాల పిలుస్తారు. ఈమె మొదటిసారి రంగస్థలానికి వచ్చినప్పుడు నడుమువరకు అట్టతో కట్టిన ఒకతొట్టెవంటి చౌకంలో నిల్చి నృత్తగతులు ప్రదర్శిస్తుంది. ఈ నృత్తాన్ని ఆందోళికా నృత్యమనీ, మంచెచప్పరనృత్యమనీ పిలుస్తారు." యక్షగానములలో యక్షిణీవేషము[90]తో నొక రాందోళికా నృత్యము నెఱపుట జూడ యక్ష గానమునకును యక్షాందోళనమునకు నేదో సంబంధ ముండియుండు ననిపించును. అనఁగా క్రీ. శ. 12 వ శతాబ్దినాఁటికే యక్షగానమునకు నృత్యకళా సాహచర్యమును గల్గినదన్నమాట. ఎక్కలగానము నీ యక్షాందోళనము ననునవి రెండును, ఆటతోడిదే పాట పాటతోడిదే యాట అనునట్లెవరో యక్షగాన వేషధారుల జాతీయ వృత్తివిద్యయొక్క కవలరూపులై యుండును. పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రలో యక్షాది నేపథ్యములతోపాటు పేర్కొనఁబడిన పాటయు, నాటయు, క్రీడాభిరామమునఁ బేర్కొనఁబడిన జక్కుల పురంధ్రి యక్షకన్యల యాటయు నీవిషయమును సమర్థింపఁగలవు. పండితారాధ్య చరిత్ర వక్కణలో యక్ష నేపథ్యసూచనయు, క్రీడాభిరామ జక్కుల పురంధ్రి పాటలోఁబాటుతో పాటుపకరణములు నామె గానముతోఁ గథాఖ్యానముచేసిన వైనము పేర్కొనబఁడుటయు, యక్షకన్యల నృత్యములో మతాశయ స్ఫురణమును విశేషములు.

---

89. చూ. శ్రీ సంగమేశంగారి వ్యాసము — భారతి, ఫిబ్రవరి, 1965.

90. ఈ యక్షిణి వేషము నృత్యమే జక్కిణియైయుండునా ?

యక్షగానముయొక్క ప్రాథమిక స్వరూపమా పేరే చాటుచున్నట్లు గానమైయుండుననుట నిర్వివాదము. అయితే పురాణచరిత్రప్రసిద్ధులైన యక్షజాతీయు లెవ్వరికిని గానకళా ప్రతిష్ఠ లున్నట్లు తగిన యాధారములు గానరానందున నెన్నఁడో యక్ష వేషధారణ మొక వృత్తిగా నవలంబించినవారని యూహింపఁ దగిన యెక్కలగాణాల, జక్కుల పురంధ్రుల గానకళాభిమానములే యక్షగానోత్పత్తికి బీజాక్షరప్రాయము లైనవనియు, నా గానము స్తుత్యాత్మకముగాఁ గథాఖ్యానోపయోగిగా నృత్యానుకూలముగా నుండెడి యొకప్రత్యేక శైలికిఁ జెందియుండుట యక్షగానముయొక్క ప్రాథమికావస్థయై యుండుననియుఁ జెప్పవచ్చును.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ స్థాపకులు శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు కూడ అప్పుడీ క్రింది సందేశాన్ని మన కందించారు.

"ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమము ప్రపంచమున కంతకును ఒరవడి బెట్టదగిన ఉన్నతాశయములతో పనిచేసినది. బాలకుల సహాయము లేకపోయినను విజృంభించినది. ప్రభుత్వనిరోధము ఎక్కువైన కొలదిని తేజోవంతమైనది. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు వెలవిచ్చినట్లు 'బూడిద నుండి నిప్పును పుట్టించినది'. అవసరమునుబట్టి దేశ గౌరవమునకై జెండా నెత్తినది.

"గ్రంథాలయవసంతోత్సవాల ప్రారంభముతో గ్రంథాలయ సంఘచరిత్రయందు దొక నూతనాధ్యాయము ప్రారంభమగు గాక!"

నేటి ప్రపంచం అనేక విషయాలలో వాయువేగ మనోవేగములతో ముందుకు సాగిపోతున్నది. ఇంకా కొన్ని సమస్యలు అపరిష్కృతంగా మిగిలియున్నప్పటికీ స్వరాజ్యసిద్ధికి పిమ్మట భారతదేశంకూడ పలుముఖాల వికాసానికి గట్టి ప్రయత్నాలను చేస్తూ ఉన్నది. గ్రంథాలయక్షేత్రంలో తొలి గ్రంథాలయ శాసనాన్ని మదరాసు, మలిశాసనాన్ని హైదరాబాదు చేసినవి. ఆంధ్రప్రదేశ్ అవతరణతో ఈ రెండు శాసనాలు మనకు సంక్రమించినవి. వీటిని ఏకీకృతం చేసి మన రాష్ట్ర ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయాల శాసనాన్ని రూపొందించినది.

ఇల్లలుకగానే పండుగకాదు. అట్లే శాసన మేర్పడినంత మాత్రంతో మనకు సంపూర్ణమైన గ్రంథాలయసేవ లభించు అవకాశములు కానరావు. 19వ శతాబ్దంలో ప్రారంభమై క్రమంగా పెరుగుతూ వచ్చిన మన గ్రంథాలయాల సంఖ్య

కవి రాజుల గంటములే కాదు రాజకవుల గంటములును యక్షగాన సరస్వతి కాశ్రయములైనవి. పలుకులముల పలుతరగతుల కవులకుఁ దద్రచనావకాశములు గలిగినట్లే జక్కులు, నెఱుకులు, నేనాదులు, గొల్లలు, బ్రాహ్మణులు మొదలగు పలు తెగలవారికిఁ దత్ప్రదర్శనావకాశములు గలిగినవి. మొదట గానరూప కథాఖ్యానముగ గ్రామసీమలఁ బామరగాత్ర మాత్రోపజీవిగా నుండిన యక్షగానము నాఁడు నాఁటికి వాడవాడల నాడఁబడుచుండిన వీధి నాటకపు వాటమెఱిఁగి రాచనగరి మొగసాలల కెగఁబ్రాకి రంగభోగము నవధరించుటతో మార్గరూపక ప్రభావము నభిసరించి నాటకనామకరణము చేయించుకొన్నది. కోటలోని రాజుగారికిని బేటలోని ప్రజలకును సమానముగా నాదరపాత్రమైనది. తెలుఁగు భాషకుఁ బలుకుబడిగల పలు తావుల వెలసినది యక్షగానము. పలుతరగతుల ప్రజాజీవితోదంత విశేషములను బ్రతిబింబించుకొన్నది. పలువిధముల కథల కాశ్రయమైనది. పాఠ్య గేయ నాట్యాత్మకములైన పెక్కు ప్రయోజనముల కిక్కువయై నిలిచినది. అదియొక సార్వజనీనమైన బహుముఖ ప్రయోజన సనాథమైన సాహిత్య ప్రక్రియగాఁ బరిణమించినది. ఈ పరిణామమంతయు నేఁడెనిమిది శతాబ్దుల చరిత్రగలది.

---

యక్షగానముయొక్క ప్రాచీనత యెంతయో, ప్రాథమిక స్థితి యెట్టిదో మీఁదఁ బరిశీలింపఁ బడినది. క్రీ. శ. 12వ శతాబ్దికి ముందు కాలము యక్షగాన చరిత్రలో నజ్ఞాత యుగము. అది యక్ష వేషధారణము వృత్తిగా నవలంబించియుండుటచే నేర్పడియుండదగు నని యూహింపఁదగిన ఎక్కలగాణల, జక్కులజాతుల ప్రాదుర్భవస్థితిగర్భితమైన కాలమైయుండునని యూహింపవచ్చును. అనఁగా వారిమూలమున వాసికెక్కియుండునని యూహింపఁదగిన యక్షగా

నము ప్రారంభ దశలోనే రూపారోపము గలదని చెప్పవలసివచ్చును. కాని యా రూపారోప మా జాతుల యుత్పత్తికేగాని యక్షగాన రూపక కళా పరిణతికి సద్యఃకారణమై యుండునని చెప్పలేము. ఆ యక్షరూపారోపము తోడి యాటపాటల ప్రసక్తి పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రలోఁ గలదనఁగా + నా సంప్రదాయము పదునాల్గవ శతాబ్ది దనుక వచ్చుచున్నట్లే చెప్పవచ్చును. కాని యందితివృత్తము మొదలగు విషయముల ప్రసక్తి కానరానందున నాఁటికది రూపక కళా సమగ్ర స్వరూపమును నిరూపించుకొన్నట్లు కాదు. సాహిత్య ప్రక్రియగానైన రూపొందినట్లుగానరాదు. అట్లే నైయుండినచో వీరశైవ మత ప్రవర్తకుఁడైన ద్విపద రగడోదాహరణాద్యనేక దేశి సాహిత్య ప్రక్రియల నతిప్రీతి నాదరించిన సోమన రగడద్విపదలకే ప్రాధాన్యము గల యక్షగానమునుగూడ నొక్కటైన రచించి దానినొక ప్రచార సాధనముగా వినియోగించుకొని యుండఁడా ? అసలు 15-16 శతాబ్దులకుముందు నాఁట యక్షగాన మొక సాహిత్య ప్రక్రియగాఁ గాని రూపక ప్రక్రియగాఁగాని రూపొందినట్లాధారములు గానరావు. అయితే యంతకుముందు మన యాంధ్రులకు మార్గ నాటకములవంటి నాటకములు (క్రీడాభిరామం వినా) లేకపో వచ్చునుగాక కాని యక్షగానము వలె దేశిసరణికిఁజెందిన నాటకములు కొన్ని లేకపోలేదు. మనవలెనే పూర్వకాలమునఁ దమిళులు కన్నడిగలు మొదలగు మఱికొందఱికి మార్గనాటకములవంటి నాటకములు లేనట్లు తెలియవచ్చుట యచ్చెరువు. కాని యాటవిక జాతులకే యాటపాటల యందాస్థయున్నట్లు తెలియుచుండ నాగరక జాతులకు నాటక కళాభిరుచియన్నది సహజముగదా. ఆ నాఁటి మన దేశినాటకములే వీధి నాటకములనుపేరఁ బ్రసిద్ధికెక్కినవి. అట వీధిలో నాడఁబడు నాటకము

+ "ఆదట గంధర్వ యక్ష విద్యాధరాద్యులై పాడెడు నాడెడువారు"

లని యర్థము. (వీథి యనఁగా నిట దశరూపక ప్రభేదముగాదు. నాటక శబ్ద మిట రూపక సామాన్య వాచి) ఇది కన్నడిగల "బయలాట", తమిళుల "తెరుక్కూత్తు" అను వానికి సమానార్థకమైనది. పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రలోనే[1] నాటకములు, బహురూపకములు, వెడ్డంగము, తోలుబొమ్మలాటలు మొదలగు రూపకప్రక్రియలనేకము పేర్కొనఁబడినవి. జవనికలు, పాత్రల యాహార్యకము, ప్రదర్శన ప్రరోచన, అభినయభంగులు, సంగీతవ్యూహంగు మొదలగు నాటకవృత్తాంతము వివరింపఁబడినది. త్రిపురవిజయము, కామదహనము, అర్ధనారీశ్వరము, అంధక గంధగజాసురవధము, దక్షాధ్వరధ్వంసము, క్షీరసాగరమథనము, సిరియాళ చరిత్ర[2] మొదలగు నాఁటి నాటకేతివృత్తములును పేర్కొనఁబడినవి. ఇందలి కథలు కొన్ని పిదపకాలమున యక్షగానవస్తువులైనవి. ఇవికాక క్రీడాభిరామమునఁ[3] బేర్కొనఁబడిన మాచల్దేవి చరిత నాటకము, విజయనగర ప్రభువు వీరనరసింహరాయల (క్రీ. శ. 1506-1509) కొలువులోఁ గూచిపూడి బ్రాహ్మణ భాగవతులు ప్రదర్శించినట్లు తెలియవచ్చిన[4] సంబెట గురవరాజు నాటకము, క్రీ. శ. 1514 నాఁటి కర్నూలు జిల్లా చెఱువు బెళగల్లు శిలాశాసనము[5] నందుఁ బేర్కొనఁబడిన తాయికొండ నాటకము మొదలగునవి

1. చూ. పర్వత ప్రకరణము., పుటలు 432-462.

2. బసవపురాణము. ఆ. 4.

3. 181 వ పద్యము.

4. Local Records., Vol. 56, p p 66 onwards.

5. A. R. E. 558 of 1915.

ఈ రెండిటి విషయము నెత్తిచూపిన వారు డాక్టరు శ్రీ నేలటూరి వెంకటరమణయ్య గారు. చూ. వారి 'యక్షగానము - తంజావూరు' అను వ్యాసము ఆంధ్రపత్రిక ఖర సంవత్సరాది సంచిక.

యక్షగానములుగా నీ నాఁడు కొందఱు పరిశోధకులచే భావింపఁబడు చున్నవి కాని యట్లుభావించుటకుఁ దగిన యాధారమేమియు లేదు. అవి వీధి-తెరనాటకములకు[6] కోవకుఁజెందినవి మాత్రమేయైయుండును.

పూర్వము బహుధా సంస్కృత సాహిత్య ప్రవణులైన మన కవులు సంస్కృతనాటకములవంటి నాటకములను దెనుగుఁన సృజింపరైరి సరికదా, ఆనాటకములనే నాటకములుగా నాంధ్రీకరింపలేదు. కొన్నిటిని బద్యప్రబంధములుగా మాత్రమే పరివర్తించిరి.[7] (క్రీడాభిరామ మొక్కటి యిందుల కపవాదము) ఆనాఁడు రాజాస్థానములందు సంస్కృత నాటకములు ప్రదర్శింపఁ బడుచుండెడి వనియు, జనస్థానములలో వీధినాటకములు, బహురూపములు మొదలగు తెరనాటకములును బ్రచారమందుండెననియు నూహింపవలసియున్నది. కాలక్రమమున వాని ప్రభావము యక్షగానముపైఁగూడ బడి యది యాకృష్టులైన శిష్టకవులు కొందఱు తద్రచన జేపట్టగనే రూపసికళ కొంత సంతరించుకొని యొక విశిష్టప్రక్రియగా రూపొంది రాజప్రజాసమోదములను సమపాళముగాఁ జూఱఁగొని వీథినాటకమనియుఁ బేరొంది దేశిసరణికిఁ జెందిన నాటకములకెల్లఁ బ్రతినిధిగా నిలిచినది. మనకు నాటకకృతులులేని లోటు తీర్చినది. దీనిప్రాభవము మూలముగనే మొన్న

6. తెరనాటకముల ప్రసక్తి పండితారాధ్యచరిత్ర పర్వత ప్రకరణమునఁ గలదు. అవి జంగాలచేఁ బ్రదర్శింపఁ బడుచుండెనట్లు వై. వెంకట నాథుని పంచతంత్రమునను (4 – 240), అ. నారాయణ కవి హంసవింశతి (3 – 29) యందును గలదు. నాఁడు జంగాలు జక్కులవలె గానాత్మకకథాఖ్యానములును జేసెడివారు. జంగం కథలు వారి పేరనే ప్రసిద్ధములైనవికదా.

7. ఒకఉదా. నందిమల్లయ్య, ఘంటసింగయల ప్రబోధ చంద్రోదయాంధ్రీకరణము.

మొన్నటి దనుకఁ గూడ మనకవులకు మార్గనాటకములవంటి నాటకములు రచింపవలసిన యావశ్యకత కన్పింపకపోయి యుండవచ్చును.

పాల్కురికి సోమనాథుని నాఁటికే యక్ష నేపథ్యములతోడి పాటగా నాటగా వెలిసియుండునని యూహింపఁ దగిన యక్షగానమున కాంధ్రమున నాప్రదర్శకులొక విశిష్టజాతిగా నేర్పడినపిదపఁ గొంత కాలమునకు యక్ష నేపథ్యములతోడి సంబంధము సడలి గానమునకే ప్రాధాన్యము హెచ్చి యుండును. పదునైదవ శతాబ్దిలో భీమ ఖండోదాహరణమును[8] బట్టి యది స్తోత్ర పాఠోప యోగియైన యొక ప్రత్యేక గాన శైలి యనియు, క్రీడాభిరామోదాహరణమును[9] బట్టి యది జక్కుల పురంధ్రిచే నెక్కటిగా శ్రుతి లయాత్మక వాద్యోప కరణ సహితముగా, రాగ తాళ మాన స్థాయి గమక

8. "కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు
గాంధర్వమున యక్ష గాన సరణి" (భీ. ఖ. 3 — 65.)

9. కోణాగ్ర సంఘర్ష ఘుమ ఘుమ ధ్వని తార
కంఠస్వరంబుతో గారవింప
మసిబొట్టు బోనాన నసలు కొల్పిన కన్ను
కొడుపుచే దాటించు నెడప దడప
శ్రుతికి నుత్కర్షంబుఁ జూపంగ వలయు చోఁ
జెవి త్రాడు బిగియించు జీవ గట్టి
గిలుకు గిలుకున మ్రోయు కింకిణీ గుచ్ఛంబు
తాళమానంబుతో మేళవింప
రాగమున నుండి లంఘించు రాగమునకు
నురుమ యూరుద్వయంబుపై నొత్తిగిల్లి
కామవల్లీ మహాలక్ష్మి కైటభారి
వలపు పాడుచు వచ్చె జక్కుల పురంధ్రి"

క్రీ. రా 135

నిహితముగాఁ గథాఖ్యాన పురస్సరముగాఁ బ్రయోగింపఁ బడు చుండెడిదనియు దెలియుచున్నది గదా. క్రీడాభిరామమున నా జక్కుల పురంధ్రి పాటతోపాటె అక్కల ('యక్ష కన్యల') యాటయు వర్ణితమై యుండుట (క్రీ. శా. 136 - 137) నాగానము నృత్యాను కూలమైనదనియుఁ దెలియ నగును. ఇంకను నానాఁటి వాని ప్రత్యే కత యెట్టిదనఁగా - క్రీ. శ. 1408 - 1503 సం. ల నడుమ నుండిన, సంకీర్తనాచార్యుఁడని ప్రఖ్యాతిగాంచిన తాళ్ళపాక అన్నమాచార్యుని పౌత్రుఁడైన చిన తిరుమలాచార్యుఁడు (1537 ప్రాంతము) సంకీర్తన లక్షణమను సంస్కృత గ్రంథమును స్వపితామహకృతమును స్వీయని వ్యాఖ్యాతమును (ఇది యలబ్ధము) దెనుఁగు జేయుచు[10] దరు వులు, జక్కుల రేకు లేలలు, చందమామ పదములు మొదలగు వానిని మొదటఁ జేర్కొనుచుఁ గొన్నిటి లక్షణములు నిర్వ చించి యక్షగాన పదములఁ గూర్చి యిట్లు వ్రాసెను :—

"యక్షగాన పదంబులు నవ్విధమున
సముచితానేకవిధ తాళ సంగతులను
సరసాలంక్రియా సవర్ణంబు లగుచు
నలరు నని హరి కీర్తనాచార్యుఁ డనియె"

సం. ల. 66 వ పద్యము.

అతఁడు దరువులు ఏలలు మొదలగు పదములకు లక్షణమును చెప్పి యుండెను. కాని వానితో పాటు మొదట జక్కుల రేకుల పేరెత్తు కొనియుఁ (చూ. 50 వ పద్యము) ప్రత్యేకముగా నా పేర లక్షణము చెప్పియుండ లేదు.

10. చూ. తాళ్ల పాక వారి కవి కుటుంబ కృతి సముచ్చయము - సం. 1 తిరుపతి దేవస్థానము ప్రచురణ, 1935. పైకవుల కాలములు, కృతి రచనఁ గూర్చిన వివరములు నీ సంపుటమునుండి తెలియ నగును.

అందుచేతను యక్షగాన పదముల నేలాదులతో పాటు మొదటఁ జేర్కొనక పోయినను నేలాలక్షణము వెంట వాని లక్షణమును జెప్పి యుండుటను జూడ జక్కుల రేకు లన్నను యక్షగాన పదము లన్నను నొక్కటే యని యూహింప వచ్చును. "యక్షగాన పదంబులు" అని బహు వచనము వాడఁ బడుటచే యక్షగానమనఁగా నేదో యొక్క గీతిచ్ఛందో ఘటితమైన దని కాక పలు విధములైన పదములతోఁ గూడిన దని తెలియ నగును. అవి తాళ బహుళములును, నవరసాలంకృతములు నైన వని స్పష్టముగాఁ జెప్పఁబడినది. పై విషయములనుబట్టి 15 వ శతాబ్దిలో యక్షగానము కథావలంబనము, సముచితానేక విధ తాళ సంగతములు, నవరసాలంక్రియా సవర్ణములు నగు పదములును గలిగి కావ్య రచనోపయుక్త స్వరూపమును కల్గి యున్న దని చెప్పనగును.

## యక్షగాన రచన – ప్రారంభదశ

రచనా ప్రక్రియనుబట్టి సాహిత్య మంతయు ముత్తెఱఁగులు- పద్యము, గద్యము, పదము లేక గేయము. ఆమూడింటి ప్రత్యేక ప్రయోగమువలనఁగాని సంకలనప్రయోగమువలనఁగాని బహువిధ సాహిత్యప్రక్రియలను సాధింపవచ్చును. తెలుఁగులోఁ బదునాఱవ శతాబ్ది చివరి దాఁక వెలసిన శిష్టవాఙ్మయ మెక్కువగాఁ బద్యగద్యోభయాత్మకమైన చంపూధోరణిలో సాగిన పురాణములు, ప్రబంధములు, పద్యకేవలముగా నడచిన శతకములే. కాని, యప్పటికే చాలకాలముగా నే పల్లెయెల్లలలోనో పలుకుచున్న గేయసరస్వతి శిష్టకవులచే నుపేక్షింపఁ బడినది. అయినను నిష్ట పడిన శిష్టకవులే కొందఱు పదపద్యములకు నడిమివాటముగా నడచు

నట్టి ప్రక్రియ నొకదానిని స్వీకరించిరి. అదేవ్విపద. అట్టి యటుపూర్వ పద్ధతికిఁ జెందిన కళికోత్కళికల రూపమున నవతరించిన పదకవితా ప్రభేదమగు రగడయుఁ గలిసి వచ్చిన "ఉదాహరణము" ను గూడ స్వీకరించిరి. ఆప్రక్రియ లన్నింటికి నేకవాక్యత సంఘటింపఁ గలట్టిది యక్షగానము. ఆరహస్యము గ్రహించియే కాఁబోలు కాలక్రమమున వైవిధ్యప్రవణులైన మనకవులు కొందఱు తద్రచన చేపట్టిరి.

మన కిప్పటికిఁ దెలిసి నంతలోఁ దెనుఁగున వెలసిన మొట్ట మొదటి యక్షగాన రచన క్రీ. శ. 15వ శతాబ్ది యుత్తరార్ధమున నుండిన ప్రోలుగంటి చెన్నశౌరి సౌభరి చరితమే. అది యైన నతఁడు రచించినట్లు తెలిసినదే[10] కాని గ్రంథము లభింపలేదు. అది జక్కుల కథ యని పేర్కొనఁ బడినది. అది తాళ్ళపాక చిన తిరుమలార్యుఁడు చెప్పిన యక్ష గాన లక్షణ మట్లు "నవరసాలంకృతముగ" నున్న దని పేర్కొనఁ బడుట గమనింపఁ దగినది. కవి దానిని జక్కుల కొఱకు వ్రాసెనో, జక్కుల వారి గాన రూప కథాఖ్యాన ఫక్కిక మూఁదలగా రచించి యుండుటచేత నా పేరు పెట్టియుండెనో, లేక యానాఁడు యక్షగాన సామాన్యముగా జక్కుల కథయను పర్యాయ వ్యవహార మున్నదో తెలియదు. సౌభరి చరితము భాగవత విష్ణు పురాణము లందుఁ గలదు. కాని దానికి యక్ష

---

10. హరి భట్టు నారసింహ పురాణావతారికలోఁ దత్కృతి యగు ప్రోలుగంటి రంగ మంత్రి వంశ ప్రశంసలో నతనికి వరుసకుఁ బినతండ్రి యగు నీ చెన్న మంత్రి ప్రశంసయు వచ్చినది. అందీతని కృతులు పేర్కొనఁ బడిన యొక సీసమున (పద్య. 33)

"సౌభరి చరితంబు జక్కుల కథ చెప్పె
లాలిత నవరసాలంకృతముగ"

అని యున్నది.

పాత్రలతోఁ గాని జక్కులకుల దేవత యగు కామేశ్వరితోఁ గాని సంబంధము లేదు.[11] మన కీ నాఁడుపలబ్ధములగు యక్షగానము లన్నియు నట్టివ. చెన్నశౌరి కృతి యక్షగానమని యూహించుటయే సమంజస మగును. పదునైదవ శతాబ్దినాఁటి యక్షగాన రచన తీరెట్టిదో చూత మన్న నా కృతి యాకృతి మాసి పోయినది. క్రీ. శ. 1500 సం. ప్రాంతము నాఁటి యక్షగాన మని యూహింపఁ దగిన మఱియొక గ్రంథము పేరు వినఁబడుచున్నది. క్రీ. శ. 1500 ప్రాంతము వాఁడగు వెల్లంకి తాతంభట్టు తన కవి చింతామణి[12] యను లక్షణ గ్రంథమున భాషాలక్షణాధికారమున "లక్ష్మీకళ్యాణములోని రేకు" లను పేర "నీరజోదరురాణి నీలవేణికిని" అను నుదాహరణమిచ్చెను. రేకులను రచనా విశేషము యక్షగానములందు మాత్రమే కన్పట్టును. యక్షగానపదములకు జక్కుల రేకులను పేరున్నట్లు సంకీర్తన లక్షణము నుండి గ్రహింప నగును గదా. అయితే తాతంభట్టు నుదాహరణము ద్విపద పాదము కాని యది జంపె గతి గలది. ఆ ప్రక్కనున్న రేకను మాట కాదనరానిది. ఇది చిత్ర కవి పెద్దన యక్షగానము లందుండు నని చెప్పిన "జంపెరేకు" లక్షణమునకు సన్నిహితముగా నున్నది. (చూ. ప్రక్కపుట) పై లక్ష్మీకల్యాణము యక్షగానమై యుండునని తలంప నగును. కాని యీ గ్రంథము గూడ లభింపలేదు. ఇది యత్కృతమను విషయముగూడఁ దెలిసినదికాదు. దీనినిబట్టి నాఁటి

---

11. ఒక దూరానీతమైన యూహ :— జక్కులు కామేశ్వరీ వ్రతసంప్రదాయ పరాయణులును, సంతాన కాంక్షులు నైన వారి యిండ్లఁ బేరంటములు సేయఁ బోవుదురని క్రీడాభిరామమున సూచింపఁ బడినది సౌభరి చరితము సంతాన కాంక్ష విషయమున కొక ప్రత్యేక ప్రత్తి పత్తిగలదని భాగవత విష్ణుపురాణములందుఁ గలదు. మఱి జక్కులు సంతాన కాంక్షుల యిండ్లలోఁ జెప్పుకథలలో నిదియు నొకటగునేమో;

12. తం. స. మ. కే. నం. 779_780.

యక్షగానములందు రేకనునది యొక రచనాంగమని యూహింప నగును. దాని స్వరూపమెట్టిదో యెఱుఁగుట కాంధ్రమున యక్షగాన లక్షణముగూర్చి చెప్పుటకుఁ గొంత ప్రయత్నము చేసినవారిలో మొదటివాఁడగు చిత్రకవి పెద్దన (16 వ శతాబ్ది పూర్వార్ధము) రచించిన లక్షణ సార సంగ్రహమును బలుకరింపవలెను. అతఁడు నవ విధ రగడల లక్షణమును జెప్పి వెనువెంట యక్షగానము గూర్చి యిట్లెత్తుకొనినాఁడు :-

"వృషభగతి త్రిపుడరే కంఘ్రియుగ మగుఁ
దుద నేడు లఘువులు తొలఁగఁ జేయ,
జంపె రేకునకు లక్షణము ద్విరద గతి
యగుఁ గొన నొక లఘువందు మాన,
రచ్చ రేకగును దురగ వల్గనము గతి,
మఱి యేకతాళియౌ మధురగతిని,
అటతాళమున మాత్ర లంఘ్రి కిర్వది నాల్గు
నాల్గిట విరతి పద్మాలు గింట
నిలుచు నర్ధంపు నర్ధ చంద్రికలు దీన
యక్షగానాది కృతులలో నార్యులిడిన *
రగడ భేదంబు లివి యౌను రమ్యచర్య
యవిత నిజదాస సముదాయ! యాంజనేయ"

—ల. సా. సం. II - 141.

ఇందుఁ బేర్కొనఁబడిన త్రిపుటాదులు సంగీతప్రపంచమున సూళాది తాళములుగాఁ బ్రసిద్ధములు మఱి "త్రిపుట రేకు", "జంపె

*చిత్రకవి పెద్దన నాఁటికే యక్షగానము అర్వాచీనగాఁ బరిగణింపఁబడిన దన్నమాట.

రేకు" అనఁగా నవి తత్తత్తాళ ప్రధానములగు గీతము లందేకైక లక్షణ సమన్వయముగల పాదములు లేక చరణములు లేక దళములను విభాగములవంటివై యుండును. అందలి యర్థము లర్ధచంద్రికలు. "యక్షగానాదికృతులలో నార్యులిడిన రగడభేదంబులివి" రగడభేదములుకాని రచనావిశేషము లింకనెన్ని గలవో యా నాఁటి యక్షగానములందని యెఱుఁగరాదు.

క్రీ. శ. 1450–1550 సంవత్సరముల నడుమ యక్షగాన లక్ష్య లక్షణములిట్లు లాక్షణిక పరిగణనమున కెక్కిన వనఁగా నాప్రాంతమున యక్షగాన రచన కొంత సాగెన దనియే చెప్పవచ్చును.

మనకిపు డుపలబ్ధమైన యంతలోఁ గవి కాలము తేలినంతలో క్రీ. శ. 16 వ శతాబ్ది యుత్తరార్ధమున నుండిన కందుకూరి రుద్రకవి సుగ్రీవవిజయమను యక్షగానమే ప్రాచీనతమ మైనదిగాఁ బండితులెల్లరిచేఁ బరిగణింపఁ బడుచున్నది. కాని చక్రపురి రాఘవాచార్యుఁడను నాతని కృతిగా నూహింపఁ దగిన విప్రనారాయణ చరిత్రమను యక్షగానము రుద్రకవి కృతి కొక్కించుక పూర్వమైనదిగాఁ దోచును. ఇది 16 వ శ. నడుమ రచింపఁబడి యుండును.[13] రచనా ప్రణాళికలో రెండింటను జక్కని సామ్యము గలదు.[14] రెండింటను త్రిపుట, జంపె మొదలగు తాళప్రధానములైన గేయ రచనలకును ద్విపదకును ప్రాధాన్యము; ఎడనెడ సంధి వచనములని పేర్కొనఁ బడలేదు కాని, సంధి ప్రయోజనాత్మకము లగు చిన్న చిన్న వచనములు, ఏలలు, అర్ధ చంద్రికలు మొ॥, అతి

13. దీని కర్తృత్వ కర్తృకాల విచారణ మీగ్రంథము ద్వితీయభాగమునఁ జేసియుంటిని. చూ. ఆం. దే. య. గా. పుట 2—9

14. Ibid.,

విరళముగాఁ బద్యములును బ్రయుక్తము లైనవి.[15] ఇవి పై చెప్పిన లన్నియు నిది వఱకు లక్షణ గ్రంథముల కెక్కినవే. ఇవి యక్ష గానములని గ్రంథ కర్తల చేఁ జెప్పఁబడినవి. సుగ్రీవ విజయము రచన గూర్చి ప్రస్తావించుచు "రచనా విధానమును బట్టి చూచిన యిది యారంభ రచన గాదని చెప్ప వలసి యున్నది. బహుకాలమునుండి వచ్చుచు పోయినను సంప్రదాయము చక్కఁగ నేర్పడినది" అని శ్రీ నేలటూరు వెంకట రమణయ్య గారు సెలవిచ్చినారు.[16]

ఆ యక్ష గానములా కవులచేఁ బ్రదర్శనోద్దిష్టము లైనవని చెప్పుట కాధారములు లేవు. కాని క్రీ. శ. 16 వ శతాబ్ది కన్నడ కవి యగు రత్నాకర వర్ణి రచించిన 'భరతేశ వైభవ' మను గ్రంథములో వెనుకపాటకుల తోడను, మేళతాళముల తోడను "ఎక్కడీ గలు" నాట్యమాడినట్లు వర్ణింపఁ బడినది.[17] యక్ష గానము లప్పుడు ప్రదర్శింపఁ బడుట యీనాఁటి పెద్దలును గొంత యంగీకరించు విషయమే. ఆ యెక్కడి గల నాట్యము ప్రాయికముగా యక్ష గానమే కాఁదగును. సుగ్రీవ విజయమును జూచినచో నది ప్రదర్శన సౌలభ్యము గల రచన యని యే తోఁచును. పాత్రల సంభాషణములు వచనమున లేవన్న మాట గాని యందు దాఖ్యాన శైలి కంటె సంవాద శైలికే ప్రాధాన్యము. సంభాషణ లెక్కువగా జంపె త్రిపుటాదులలో సాగినవి. నడుమ నక్కడక్కడ నున్న చిన్న చిన్న వచనములలోఁ గథానుసంధాన మే సూత్ర ధారుని వంటి ప్రదర్శన ప్రవర్తకుని వలననో

15. కాలము తేలని యక్ష గానముల ప్రాచీనత నూహించుటకు వీని రచనా ప్రక్రియా వివేచన తోడ్పడఁగలదు.

16. చూ. వారి "యక్ష గానము—తంజావూరు" అను వ్యాసము, ఆం. ప. ఖర సం. సం. పుట 27.

17. భ. వై., ఆస్థాన సంధి. 58 వ పద్యము.

కానిరు... ను నని యూహింప నగును. దీని శ్రవ్య దృశ్యోభయ ప్రయోజనముల గురించి కీ. శే. వేటూరి ప్రభాకర శాస్త్రి గారిట్లు సెలవిచ్చి యున్నారు. "ఈ రుద్ర కవి సుగ్రీవ విజయమును స్త్రీ వృద్ధ పామరాదులు పలువురు పాడు చుందురఁట; ఆయా పాత్రముల పాటలు తత్తద్వేష ధారులు వచ్చి పాడునట్లును నక్కన సంధి వచనాదులు ఒక్క రిద్దరు సూత్రధార ప్రాయులు పఠించు నట్లును ఈ సుగ్రీవ విజయము వీథి యాటగా నాడఁ బడు చుండెడిది"[18] శ్రీ వెంకట రమణయ్య గారును "పదునాఱవ శతాబ్దమున రాయ సామ్రాజ్య ప్రజలకు నాటక ప్రదర్శనము లందభిరుచి హెచ్చెనని యప్పటి వాఙ్మయము వలనఁ దెలియ వచ్చు చున్నది. సుప్రసిద్ధులైన కవులు యక్షగాన రచనకుఁ గడంగిరి. కందుకూరు రుద్రకవి సుగ్రీవ విజయమను దక్కని యక్షగాన ప్రబంధమును రచించి యాయూర నెలకొని యుండు జనార్దన దేవుని కంకిత మిచ్చెను. ఆ దేవుని వసంతోత్సవ సమయమునం దా నాటకము ప్రథమముగఁ బ్రదర్శింపఁ బడి యుండెననుటకు సందియము లేదు." అని వక్కాణించి నారు[19]. అనఁగా పదునాఱవ శతాబ్ది నాటికి యక్షగాన మాంధ్ర దేశమునఁ బండిత కవ్యుపజ్ఞమైన రచనగాఁ బరిఢవిల్లుటయ కాక రంగమున కెక్కి యుండు ననియుఁ గొంత నిశ్చయముగాఁ బలుక వచ్చును.

(క్రీ. శ. 17వ శతాబ్ది ప్రారంభమున మన యక్షగానము దక్షిదేశమునకు ప్రస్థానము గావించినది. తదుపరి తెలంగాణమును యక్షగాన రంగమైనది. ఆ దక్షిణాంధ్ర తెలంగాణ యక్షగాన చరిత్రములు తరువాతి ప్రకరణములందు సమీక్షింపఁబడును. ఇపుడాంధ్రదేశ + యక్షగాన చరిత్రసమీక్షయే కొనసాగింపఁబడును.)

---

18. చూ. సుగ్రీవ విజయము పీఠిక, పుట 17.

19. చూ. వారి వ్యాసము. ఆం. ప. ఖర సం.సం. పుట 21.

+ ఇట ఆంధ్రదేశమనఁగా రాయలసీమ + చాళుక్యసీమ, కళింగము (శేష ఉత్తర సర్కారులు) అని యుద్దిష్టము.

# ఆంధ్రప్రాంత యక్షగానములు

కందుకూరి రుద్రకవికిఁ బిదప సుమారొక శతాబ్దమునకు నాంధ్ర దేశమున యక్షగాన రచన యించుమించుగా సుగ్రీవవిజయత్రుణ్ణ మార్గముననే సాగుచువచ్చినది. అందందుఁ గొన్ని విశేషములుఁ బొడసూపక పోలేదు.

మనకుఁ గాలము తెలిసిన యక్షగానము లనేకములు గలవు. అట్టి వానిలో సుగ్రీవ విజయ రచనా ప్రక్రియా ననుసారములుగా నున్న వానినిఁ గొంత ప్రాచీనము లని చెప్పవచ్చును. దువ్వూరి యజ్ఞార్యకవి విరచితమైన గరుడాచల విలాసము యక్షగాన మొకటి యట్టిది. కీ. శే. పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు "ఈ కాలమున మనకు లభించుచున్న యక్షగానములలో నెల్ల మిక్కిలి ప్రాచీనములైనవి గరుడాచలము, సింహాచలము ననునవియే ... ... గరుడాచల సింహాచలములకంటెఁ బ్రాచీనములైన యక్షగానములు నిదితరములు లిప్పుడు గానరా" వనుచున్నారు.[20] కాని యందు సింహాచల విలాసమనునది యాశ్వాస విభాగాది విశేషములు గలది; అర్వాచీన రచనగాఁ దోఁచును. గరుడాచల విలాసము మాత్రము గాక సుగ్రీవ విజయరచనా ప్రక్రియా సంవాదిగా నున్నది. ఆదినారాయణశాస్త్రిగారు రుద్రకవి సుగ్రీవ విజయము నెఱిఁగియుండని యన్నమాటయే యది. కాని సుగ్రీవ విజయమే నేఁడు లభ్యములగు యక్షగానములలోఁ బ్రాచీనతమమైనదని పలువురు పండితుల యభిప్రాయము.[21] అది యథార్థము కావచ్చును కాకపోవచ్చును. కాని

20. చూ. వారి వ్యాసము. ఆం. ప. 12వ సం. సం. (1921).

21. చూ. శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారి ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము పుట 211. శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి దేశి పుట 79. శ్రీ నేలటూరి వెంకట రమణయ్యగారి వ్యాసము. ఆం. ప. ఖర సం. సం. పుట 27.

రుద్రకవి కాలము రూఢిగాఁ దేలినది. ఈ గరుడాచల య. గా. కర్త యంతకంటెను బ్రాచీనుఁ డనుటకు సూచికల యాధారమేమి యును గానరాదు. కాని యీ గరుడాచల యక్షగానమున కాంధ్ర దేశమున నెన్నోతరములఁ బడి వచ్చుచున్నట్లు తోఁచు ప్రదర్శన ప్రశస్తిఁ జూడ నది యెంతో ప్రాచీనమైనదిగనే యనిపించును. 16 వ శతాబ్ది యుత్తరార్ధమునందు బయల్వెడలినవని యూహింప నవకాశముగల క్రాంజ వెంకటాద్రి వాసంతికా పరిణయము, బాలపాపాంబ అక్క మహాదేవి చరిత్ర అను యక్షగానము లీ గరుడాచల విలాస సుగ్రీవ విజయ రచనలను బోలియున్నవి. అందు వాసంతికా పరిణయ మునందును గరుడాచల క్షేత్ర గాథయే యితివృత్తమగుట విశేషము. బాల పాపాంబ కృతిలో బసవేశ్వరుని సమకాలికయైన మహాశివ భక్తురాలగు అక్కమహాదేవి చరిత్రము వర్ణితమైనది. పదునారవ శతాబ్దినాఁటికే యక్షగాన రచనము కవయిత్రులనుగూడ నాకర్షించి యుండుట విశేషము. ఈనాఁటి కూహింపఁగల యంతలోఁ బాలపాబయే ప్రప్రథ మాంధ్ర యక్షగాన కవయిత్రిగాఁ గన్పించుచున్నది.

ఆపదునారవ శతాబ్ది యంత్యభాగమున వెలసినయక్షగానముల కెల్లఁ దలమానికము ఉత్తర రామాయణ కావ్యరచనా విశ్రుతుఁ డును ప్రళయ కావేరి (పులికాట్) పట్టణమున రాజకీయోద్యోగియు నైన[22] కంకంటి పాపరాజ ప్రధాని రచించిన విష్ణుమాయా విలాసము.

22 ఇతఁడు క్రీ. శ. 1790 ప్రాంతమువాఁడని కీ. శ. కందుకూరి వీరేశ లింగము పంతులుగారి తీర్మానము. (చూ. వారి ఆంధ్రకవులచరిత్ర) అందులకుఁ బ్రమాణము గానరాదు. ఈకవి క్రీ. శ. 1575–1632 సం. ల నడుమనుండినవాడని సప్రమాణముగ నిరూపించి యుంటిని. (చూ. ఇందలి ద్వితీయభాగము, ఆం దే. య. గా. కవులు పుట 12-17) నా నిరూపణము డా శ్రీ నేలటూరి వెంకటరమణయ్య గారిచే నామోదింపఁబడినది. (చూ. వి. మా. వి. య. గా. వావిళ్ళ ప్రతి వారికిపీఠిక, పుట 30–35.

ఇందును సుగ్రీవ విజయ రచనాప్రక్రియ సూత్రప్రాయముగనున్న దనియే చెప్పవచ్చును గాని యంతకంటె నదనముగా ఆది, మధ్య, రచ్చ, లఘుశేఖరతాళ ప్రధానములగు గేయములు, కొన్ని రాగ ప్రాధాన్యముగల పదములు, సంస్కృతముననొక చూర్ణికయు, రెండు శ్లోకములు, లయగ్రాహి, అష్టకము, నడలు, త్రిస్తబకము మొదలగు రచనా విశేషములుగలవు. ఇది ప్రదర్శనోపయోగియైన దనియే చెప్ప వచ్చును. పాపరాజు సమకాలికుఁడగు తేకుమళ్ళ రంగశాయి జానకీ పరిణయమను యక్షగానమును రచించియున్నట్లు తెలియుచున్నది మాత్రమ. క్రీ. శ. 1600 సం. ప్రాంతమున నెల్లూరు సమీపమున నుండిన దత్తాత్రేయ మఠమునకుఁ జెందిన పరమానందతీర్థయతి యను నతఁడు ముక్తికాంతా పరిణయమను నొక యక్షగాన ప్రాయమైన కృతిని రచించి దానిని "పదచాళిక" యని పేర్కొనియుండెను. పద చాళిక లేక పదకేళిక యనఁగా నొక పదమును బాడుచుఁ బదోద్దిష్ట మైన భావము నభినయ రూపమున నావిష్కరించుట. శబ్దరత్నాకర మునఁ బదచాళికకు "పెక్కణ" మను నృత్యవిశేషమని యర్థము చెప్పఁబడినది. పెక్కణము ప్రేంఖణ లేక ప్రేక్షణక శబ్దభవము. అది నృత్య విశేష మాత్రముగాక యుపరూపకములలో నొకటిగా సాహిత్యదర్పణ భావప్రకాశాదులందు నిర్వచింపఁబడినది. కాని దేని లక్షణమును ముక్తికాంతా పరిణయమునకుఁ బూర్తిగాఁ బట్టకున్నది. దీనిని గవి పాడుటకు మాత్రమే యుద్దేశించియున్నాఁడు. కాని పద చాళియని పేర్కొనియుండుట వలన నేకపాత్రాభినయమునకైనఁబనికి వచ్చునని తోఁచును + ఇందు నాలుగైదుచోటులనొక పాటిపొడవైన ద్విపదలు గలవు కాని గ్రంథమంతయునొక దరువు నొకవచనము

+ "అభినయంబుల కోపు లరుదైన తీరుపుల్ తెలియఁగాఁ బదచాళి విధమొకర్తు" వినిపించె నని పాపరాజు ఉత్తర రామాయణమునఁ గలదు, ఇందు జక్కిణి, కొర వంజాల ప్రసక్తియుఁ గలదు. చూ. VI 139.

చొప్పున నడచునని స్థూలముగాఁ జెప్పవచ్చును. ఇది యక్షగానప్రాయమైన రచనా ఫక్కికయే. సచ్చిదానంద పురాధీశ్వరుడు తనపుత్రి యగు మోక్ష కన్యకు స్వయం వరము చాటింపఁగా వివిధ మతాధిపతులు విచ్చేయుటయు, నొక్కక్కరినొక్కొక్క నెపమున నొప్పరికించి మోక్షకాంత సద్గురుఁడే దైవమని నమ్మిన వేదాంతమతస్థుఁడగు వివేక జీవేశ్వరుని వరియించుటయు నిందలి విషయము. ఇందలి విషయము కొంత వట్టు సాంకేతికముగా సాగినను పెండ్లి వేడుకలు మొదలగు సాధారణ విషయములును సరసముగా సరళ శైలిలో వర్ణితము లైనవి. చూడఁగాఁ బరమానంద యతి మత ప్రచారము కొఱకానాఁడు ప్రచారము నందుండిన యక్ష గానమును వినియోగించుకొనినట్లు తోఁచును.

పైని పేర్కొనఁ బడిన కవులలో చెన్న శౌరి, అహోబలకవి, వెంకటాద్రి కవులది రాయలసీమ. రుద్ర కవి, పాప రాజు, రంగశాయి, పరమానంద యతియు నెల్లూరు మండలము వారు. వారి కాలమునాఁటి కాంధ్ర దేశమున జన రంజక రూపక ప్రక్రియ లనేకము ప్రచారము నందుండిన వని తెలియుచున్నది గదా. పాల్కురికి సోమనాథుఁడట్టి ప్రక్రియల ననేకమును బేర్కొని నాఁడు. అందు బహురూపములు, వీధి నాటకముల పలుకుబడి చాల కాలము వఱకు సాగుచుండినట్లానాఁటి వాఙ్మయము నుండి యెఱుఁగ వచ్చును. రెడ్డి రాజులు, విజయనగర రాయ సమ్రాట్టుల కాలమున నాంధ్ర దేశమున భరత గాంధర్వ విద్యలకు విశేష వ్యాప్తి కలిగినది.[23] వెనుకటి మన జన రంజక నాటకములలో సిరియాల చరితము, మాచల దేవి చరితము,

23. చూ. శ్రీ మల్లంపల్లి సోమ శేఖరశర్మ గారి "మధ్య యుగాంధ్ర దేశము-సంగీత నాట్య కళాభివృద్ధి" అను వ్యాసము—ఆం. ప. చిత్రభాను సం సం., వారి History of Reddi Kingdoms, Part II, Chap. VII.

సంబెట గురవరాజు నాటకము, తాయికొండ నాటకము మొదలగు కొన్ని పేరులు వినఁబడుచున్నవి. ఆ నాటక ప్రదర్శకులలో దొర సముద్రపునటులు, తెరనాటకపు జంగాలు, కూచిపూడి బ్రాహ్మణభాగవతుల మేళమువారు మొదలగువారు ముఖ్యులు. ఆయా ప్రదర్శకులాడు నాయా నాటకములు జూచుటతో నొక క్రొత్త చైతన్య స్పర్శ కలిగి, మార్గసాహిత్య సంప్రదాయ ప్రవణులయ్యు మార్గరూపకములజోలికి మాత్రము పోక మడిగట్టుకొని కూర్చుండిన మన శిష్టకవులలోఁ గొందఱి మనముల నా జనరంజక రూపక రచనా సంకల్పము పొడసూపి యుండవచ్చును. వారికి రూపక రచన విషయమునఁ గ్రీడాభిరామమునందువలెఁ బ్రాఁబడిన కేవల చంపూ పద్ధతి నచ్చకపోయి యుండవచ్చును. దేశీయ గేయరచనలపై మోజు ప్రబలియుండును. ప్రత్యేక గాన శైలికిఁ బేర్వడసిన జక్కులవారు క్రీ. శ. 14-15 శతాబ్దులనాఁటికే ప్రేమాభిరామ కథారంగమగు ఓరుగల్లునుండి క్రీడాభిరామకవి నివాసమగు వినుకొండవఱకు వ్యాపించి యుండినట్లు క్రీడాభిరామమునుండి యూహింపవచ్చును. తదుపరి వారు రాయలసీమ, నెల్లూరు మండలాది ప్రాంతములకును వ్యాపించియుందురు. వారి గానశైలియే మనకవుల నాకర్షించియుండును. ఇఁకఁ గథలకు మనకుఁ గొదవలేదు. రామాయణ భారత భాగవతాది కథా భాండాగారము లుండనే యున్నవి. ఎవరికిఁ దోచిన కథ నాకవులు గ్రహించి రచన కుపక్రమించి యుందురు. ఇదియంతయు నొక చక్కని యూహాగానము. కాని మన యక్షగాన రచనోత్పత్తి విచికిత్సా విషయమునకు నొక సమన్వయమును బ్రతిపాదింపఁగల యదిగాఁ దోఁచును.

అయితే పదునాఱవ శతాబ్దియందు వెలసిన యక్షగానము లన్నియును యథాతథముగాఁ బ్రదర్శనార్హము లని చెప్ప వలను

పడదు. అందెద్దియు నా కవులచేఁ బ్రదర్శనోద్దిష్టమైనట్లు స్పష్టముగాఁ జెప్పఁబడలేదు. అవి నాఁడు ప్రదర్శితము లయ్యె ననుట కాధారము లంతకంటెను గానరావు. కాని మీఁదఁ బేర్కొనఁబడిన వానిలో సంవాదశైలీ ప్రాచుర్యము గలిగినవి యెక్కువ. ఆ సంవాదశైలి గీత ప్రచురమైనది. పాత్రల నడుమ సంభాషణలు "అనవుడు సుగ్రీవునితో రామచంద్రుం డేమనుచున్నాఁడు" — ఇత్యాది సంభాషణ పీఠికలు లేకుండఁ దిన్నగా సాగవు. అయినను నా సంవాదశైలీ ప్రచురము లైన యక్షగానము లైన నాఁడు ప్రదర్శింపఁ బడి యుండునని యూహింపవచ్చును. కాని యానాఁటి యక్షగాన ప్రదర్శనపుఁ దీరెట్టిదో తెలియవచ్చుటలేదు. 16 వ శతాబ్ది పూర్వార్ధమునందుండిన తాళ్ళపాక పెదతిరుమలాచార్యుని వైరాగ్య వచన మాలికా గీతాలలో నొకదాన[24] సాంగ భాషాంగ క్రియాంగాభిరమ్యమగు "బహురూప" ప్రదర్శన ప్రక్రియ స్వరూపము గొంత విశదమైనది. 16 వ శతాబ్ది యుత్తరార్ధమున నుండిన పింగళి సూరనార్యుని ప్రభావతీ ప్రద్యుమ్నమున భద్ర నట ప్రదర్శన వ్యాజమున గంగావతార మను

---

24. చూ. తాళ్లపాకము కవి కుటుంబ కృతి సముచ్చయము. సం. 1. తిరుపతి దేవస్థాన ప్రచురణ, (1935) పుట 108-109. వై. వ. మా. గీ నం. 30. ఈ బహురూపమొకటి ప్రాచీన కాలమున నాంధ్రదేశమున విశేష ప్రచారమునందుండిన యొక విశిష్టదేశిరూపక ప్రక్రియ. మన వాఙ్మయమున దీని ప్రశంస తఱచు కన్పట్టును. ఇది పెదతిరుమలయ్య చెప్పినట్లు చతుర్విధాభినయాత్మకమైనదగుటయే కాదు; ఇందు తెరవాడకమును గలదు (శృం. నైషధము. IV. 2); సూత్రధార ప్రసక్తియుఁ గలదు (పోతన భాగవతము X. ౧. 305) దీనిగుఱించి మఱికొన్ని వివరములకు—చూ. 'బహురూపము' అను నా వ్యాసము (ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక సం. 44—సం. 4).

నొక మార్గరూపకము ప్రదర్శన ప్రక్రియ వర్ణితమైనది.[25] వానిని బట్టి యానాఁడాంధ్రులు నేర్చిన నాట్యకళకుఁ జతుర్విధాభినయ, గీత వాద్య ప్రతిపత్తి చక్కఁగా నేర్పడియుండినట్లు విశదమగును. అది కొంత యానాఁటి మన వీధినాటక యక్షగాన ప్రదర్శనము లందును నవలంబింపఁబడి యుండునని యూహింపనగును. 16వ శతాబ్ది ప్రథమ పాదమున విద్యానగర వీరనరసింహ రాయల సముఖమునఁ గూచి పూడి భాగవతుల మేళము వేషములు వేసి కేళికపట్టినట్లును, నది వీధినాటక ప్రాయమైనదనియును దెలియనైనదిగదామీఁద. కాని దాని ప్రదర్శన ప్రక్రియ మాత్రము తేటపడలేదు. క్రీ. శ. 1530-1580 సం.ల నడుమ నుండిన రామరాజ భూషణుని వసుచరిత్రమున నాఁడాంధ్ర దేశమునఁ బ్రచారమునందుండిన తెర నాటకప్రక్రియలు కొన్ని భంగ్యంతరమున ననుసంధింపఁబడి యున్నవి :-

> "ఇటి సంధింపఁగ వేళయంచు వసురాజేంద్రుండు సీరంధ్రనీ
> రదవారప్రతి సీర వెల్వడిన తారా భర్త లీలన్ లతా
> చ్ఛద సంఛాదికఁ బాసి నిల్చె నెదుటన్ సారంగ రాగభ్రమ
> న్మద భృంగీరుతి వందిమాగధకథామాధుర్యముం దెల్పఁగన్"
>
> —వ. చ. ఆశ్వా 3—పద్య 45.

ఇది యక్షగానములందు రాజనాయకపాత్ర తెరవెడలివచ్చు సందర్భమునందలి :—

---

25. ప్ర. ప్ర. ఆశ్వా. 4. పద్య. 97-102. ఇందు ఏలా ప్రబంధ ప్రసక్తియుఁ గలదు. మార్గరూపకము లందిది యపూర్వము. నూరవ తన చూచిన యక్షగాన ప్రదర్శనములలో దాని మాధుర్యమును గుర్తించిన వాఁడగుట నట్లుటంకించి యుండె నేమో

"రాజు వెడలె రవి తేజము లడరఁగ
కుడి యెడమల డాల్ కత్తులు మెఱయఁగ"

అను ప్రావేశిక ధ్రువార్థ సంవాదిగా నున్నది.+

"హరి దంభోరుహలోచనల్ గగన రంగాభోగ రంగత్తమో
భర నేపథ్యము నొయ్య నొయ్య సడలింపన్ రాత్రి శైలూషికిన్
వరుసన్ మౌక్తిక పట్టమున్, నిటలమున్, వక్త్రంబునుందోఁచెనా
హరిణాంకాకృతి వొల్చు రేకయి, సగంబై, బింబమై తూర్పునన్"
వ. చ. ఆశ్వా 4 – పద్య 17.

ఇది చంద్రోదయ క్రమ క్రమోన్మేష వర్ణన సందర్భము. గగన మను రంగ స్థలమున రాత్రి యను నర్తకి నాట్యము ప్రవర్తింపఁ జేయ నున్నది. దిక్కాంతలు మెల మెల్ల జీకు వాలు తెరలను సడలించు చుండిరి. వరుసగా నర్తక యొక్క ముఖోపరి భాగమున నున్న ముత్యాల పట్టయు, నొసలు తదుపరి మొగ మంతయుఁ గాన వచ్చి నవి - అను నట్లుగాఁ జంద్రుడు మొదట రేఖా మాత్రముగాఁ బిదప సగము నాపైఁ బూర్ణబింబాకృతిని గనుపట్టె నని యర్థము. ఇది నాఁటి తెర నాటకములలో నాయికాపాత్ర (భామ వేషము) తెర వెడలు తీరునకు సూచన కావచ్చును. ఆ తెర తొలగించుతీరు ప్రక్క వాటుగాఁ గాక మీఁద నుండి క్రింది కగుట గమనింపఁ దగినది. (అట్లైననే కదా శైలూషి మౌక్తిక పట్టము, నిటలము, వక్త్రము నొకదాని తరువాత నొకటి తోఁచును). ఇది మన మెఱిఁగిన యక్ష

+ ప్రావేశిక ధ్రువను సారంగ రాగములోఁ బాడు సంప్రదాయమును గలదఁట. కొన్ని యం. గా. లలోఁ బాత్ర ప్రవేశపు దరువులకు సాఁరంగరాగ ముదాహరింప బడినది. 'సంగీత కళారహస్యనిధి' యగు రామరాజ భూషణుఁ డట సారంగ రాగ శబ్దమును సాభిప్రాయముగనే ప్రయోగించి యుండును.

గాన ప్రదర్శన సంప్రదాయమే. కూచిపూడి వారట్లే చేయుదురని పెద్దలెఱుఁగుదురు. (కథకళిలోను తెరను దొలఁగించు సంప్రదాయ మిదియే). వసు చరిత్రలో నింకను నచ్చటచ్చట నేలాది గీత ప్రబంధ ప్రసక్తియు, వాద్య ప్రసక్తియు వచ్చినది. ఆ యా సందర్భములను బట్టి నాఁటి యక్ష గాన ప్రదర్శన ఫక్కి కొంత కొంత యూహింపఁ గలదు.

నాఁడు ప్రదర్శనోపయుక్తములుగాని యక్షగాన రచనలును గొన్ని బయల్వెడలకపోలేదు. (నాఁడే కాదు యక్షగాన రూపక ప్రయోజనము బాగుగా రూపొందిన పిదప కాలమునఁగూడ నొక వంక శ్రవ్యప్రయోజన మాత్రములైన య. గా. లును బయల్వెడలు చుండినవి) అనఁగా ప్రాథమికమైన యక్షగానశ్రవ్య ధర్మమునకుఁ గూడ నొకచెంపఁ బలుకుబడి చెల్లుచునే యుండినదన్నమాట.

ఆనాఁటి యక్షగానములలో నాఖ్యాన సంవాదశైలీ భేద మునుబట్టి శ్రవ్యదృశ్యప్రయోజనభేదమే కాని రచనా ప్రక్రియలో నంతభేదము లేదు. యక్షగాన రచనాస్వరూపవివరించనులగు మన ప్రాచీన యక్షగాన కవులకుఁ బ్రాఁబడిన చంపూపద్ధతినచ్చియుండదను కొంటిమి. అనఁగా కేవలచంపూపద్ధతియని యభిప్రాయము. అనేక యక్షగానములందు గద్యపద్యములు గలవు. కాని గద్యపద్యోభయాత్మకమగు చంపూకావ్యములలో ద్విపదాదు లుండవు. ద్విపద కావ్యములలో గద్యపద్యముల కసలు ప్రసక్తియుండదు. అట్టి గద్య పద్యములు, ద్విపదయు నేకత్ర నొక్క యక్షగానము నందే కనిపించును. అవి కాక యసలుండ నేయున్నవి దాని మూలప్రకృతులగు "రేకులు" (అనఁగాఁ దాళప్రధానములు, రగడ వికారములునైన గేయరచనలు) తదర్ధచంద్రికలు, తక్కిన ఏలాది గీతప్రబంధచయము.

స్థూలముగాఁ జూచినచో రేకులు, ద్విపద, గద్యపద్యములు, కతిపయ గీత ప్రబంధములును యక్షగాన సామాన్యములైన ప్రధానరచనాంగములని చెప్పవచ్చును. పదునాఱవ శతాబ్దికృతులం దన్నిట (పరమానందయ్య పదచాళి యిందుల కొక్కింత యపవాదము) నీరచనాంగములు గలవు. కాని కాలక్రమమునఁ గవుల యభిరుచి స్వభావ విభేదములనుబట్టి య. గా. రచనా ప్రక్రియమాఱుచునువచ్చినది. రేకులు పిదప కాలమున దరువులనియు, బదములనియు వ్యవహరింపఁబడినవి. దాని రగడ ప్రకృతియుఁ దాళప్రాధాన్యమునుదగ్గి రాగప్రాధాన్యము హెచ్చినది. (కంకంటిపాపరాజు విష్ణుమాయా విలాసమునఁ గొన్నిపదములకు రాగము లుదాహరింపఁబడినవి. సుగ్రీవ విజయమునను గొన్ని ప్రతులలో మాత్రము కొన్నిచోట్ల రాగవ్యపదేశము గన్పట్టును. క్రీడాభిరామమున జక్కులపురంధ్రి రాగమునుండి రాగమునకు లంఘించెననిచెప్పఁబడుట చూడ జక్కుల రేకులకుఁ జాల కాలమునుండి రాగములతోడి సంబంధముండినట్లు తోఁచును. కాని ప్రాచీన యక్షగాన రచనలలోని రేకులందెల్లఁ దాళమునకే ప్రాధాన్యము. వానిగతి లయప్రకృష్టమైనది.) తొలుత సంధి వచనముల రూపమున నుండిన యక్షగానగద్య పాత్రల సంభాషణములకును, వర్ణనలకును వినియుక్తమైనది. సంస్కృతగద్య ప్రభేదమగు చూర్ణికకును య. గా. లందుఁ బ్రసక్తికల్గినది. పద్యములతోపాటు సం. శ్లోకములును య. గా. లందుఁ జేరినవి.

ఇఁక గీత ప్రబంధములవిషయము — లక్షణ దీపిక [26] యను నొక ప్రాచీనలక్షణ గ్రంథము నందు చతుర్విధ కవితా రీతుల పరిగణన ప్రకరణమున :—

---

26. ప్రా. లి. పు. భాం., డి. నం. 1329.

> "యక్షగానంబునన్ వెలయు పదంబులు దరువులు
> నేలలు, ధవళంబులు, మంగళ హారతులు, శోభనంబులు
> నుయ్యాల జోలలు జక్కుల రేకు పదంబులు చందమామ
> సుద్దులు అష్టకంబులు ఏకపద ద్విపద త్రిపద చతుష్పద
> షట్పదాష్టపదులు నివియాదిగా గల్గు నన్నియు లయ
> ప్రమాణంబుల నొప్పి మృదు మధుర వచన రచనల ప్రసి
> ద్ధంబైన యవి మధుర కవిత్వంబులు"

అని యున్నది. ఈ నాడు మనకుపలబ్ధములై కాలము తేలిన 16 శ. య. గా. లలోఁ దఱచు గన్పట్టు మధురకవితా రీతులు (రేకులు, ద్విపదలు గాక) - అర్ధ చంద్రికలు, ఏలలు, ధవళ శోభన ములు. సకృత్తుగా-జోలలు, సువ్వాలలు, ఆరతి పాటలు, అష్టక ములు, త్రిభంగులు, త్రిస్తబకలు, నడలు మొదలగునవియుఁ గన్ప ట్టును. ఇందుఁ గొన్నిటి పేళ్లు మాత్ర మా నాఁటికి వెలసిన యక్ష గానేతర కావ్య జాలము నందును, గొన్నిటి లక్షణము సంకీర్తన లక్ష ణము, లక్షణ సార సంగ్రహాది లక్షణ గ్రంథము లందును బ్రస క్తము లైనవి. అనఁగా నానాఁడు మన దేశము నందీ గీత ప్రబంధముల కెంత ప్రచార మేర్పడి యుండెనో, మధుర కవితా ముగ్ధ హృదయు లగు నాఁటి యక్షగాన కవులు వీని యెడల నెంత మోజు పడిరో, వీని వలన యక్షగాన స్వరూప మెంత విస్తృతి చెందినదో విశదము కాఁగ లదు. ఆర్వాచీన యుగము లందు దాని స్వరూప మింకను బహు ముఖములుగా విస్తృత మైనది. అది యెట్టిదో పరిశీలింతము.

16 శ. నాటికే యక్షగానము పండితకవుల గంటములకును, లాక్షణికుల పరిగణమునకును, ప్రదర్శనములకు నెక్కినది కదా, క్రీ. శ. 1600 ప్రాంతముల నది యటు తంజావూరికి వ్యాపించినది.

ఇటు - ఆంధ్రప్రాంతమునను యక్షగాన రచనయుఁ బ్రదర్శనయు జక్కఁగనే సాగుచుండినవని యూహింప నగును. కాని పదునేఁడవ శతాబ్దివని యూదిపలుకఁ దగిన య. గా. కృతులెక్కువ లభించుట లేదు. కాలము తేలని గ్రంథజాలము చాల యున్నదనఁగా నందేవి యా శతాబ్దివో తేల్చి చెప్పుట కష్టము. 17 శ. య. గా. లించు మించు 16 శ. వానివలెనే యుండియుండు ననుకొనుట తక్క నేఁడంతకంటె గత్యంతరము కన్పింపదు.

17 వ శతాబ్ది మధ్యమున నుండిన సుప్రసిద్ధాంధ్ర లాక్షణికుఁడైన కానూకురి అప్పకవి యక్షగాన లక్షణమును జెప్పియుండు టొక విశేషము. కాని యతఁడు చెప్పినాఁడన్నదే విశేషము గాని చెప్పిన దానిలో విశేషములేదు. అది మునుదునాఁటి చిత్రకవి పెద్దన పెట్టిన యొరవడిని బడివచ్చినదే.[27] పెద్దనకు సరిగా నొకశతాబ్ది తరువాతివాఁ డప్పకవి. కాని యతఁడట్లు పెద్దనచెప్పిన లక్షణమునే పునశ్చరణ

---

27. "తుద నేడు లఘువులు తొలఁగించి చదివినఁ
 త్రిపుటకు వృషభ గతి పద యుగము
లలిఁ గడపల నొక్క లఘువు మానిన జంపె
 మను ద్విరద గతి సమ పద యుగము.
గురుతగు రచ్చరేకుఁ దురగ వల్గ నా
 హ్వాయ, మేకతాళి యా మధుర గతికి, (యతి?)
నంఘ్రి కిర్వది నాలు గట తాళమున మాత్ర
 లోలి విశ్రాంతి పద్మాలు గింటఁ,
జెలియ నర్ధంబు నర్ధ చంద్రికలు వీన
 యక్షగాన ప్రబంధంబు లతుక వచ్చు
రగడ భేదంబు లివి యండ్రు రసఁ గ వీందు
 లలిత నిజ సేవక స్తోమ యబ్ధిధామ."
— అప్పకవీయము 4 - 303.

చేసినాఁడనఁగా నాశతాబ్ది శతాబ్ది యంత కాలమునను యక్షగాన రచనలలో "రేకుల" ప్రాధాన్యము సాగుచునే యుండిన దనుట స్పష్టము. అప్పకవి "అంబికావాద" మను నొకయక్షగానము గూడ రచించెనఁట ( చూ. అ. క. పీఠిక - 85 వ పద్యము). కాని యాలాక్షణిక కవి లక్ష్యలక్షణ సమన్వయముచేసి చూతమన్న నదినేఁ డలబ్ధము. కాని యీ సందర్భమువలన నప్పకవివంటి లాక్షణికుని దృష్టి నంత యాకర్షించిన దనఁగా యక్షగాన మానాఁడెంత యున్నత స్థితిలో నుండినదియు నూహింపనగును.

17 వ శతాబ్ది యందుండిన మఱి యిఱువురు లాక్షణికులు యక్షగానమును బేర్కొనిరి. వారు గణపవరపు వేంకటకవి, పొత్తపి వెంకట రమణ కవి యనువారు.[28] అందు గ. వేం. కవి లక్షణ శిరోమణి ప్రథమోల్లాసమున యక్షగాన లక్షణ మిట్లు చెప్పఁబడినది :-

"........యక్షగానంబునకును
పద్య గద్యంబులు బహువిధ తాళముల్
రేకులు గూర్ప వర్తిల్లు"

అనఁగా వేంకటకవి పూర్వ లాక్షణికులకంటె, యక్షగానమున రేకులే గాక పద్య గద్యములు నుండునని యొకమాట మాత్ర మెక్కువ చెప్పినట్లయినది. పొ. వేం. ర. కవి లక్షణ శిరోమణిలో యక్షగానము లక్షణము స్పష్టపడలేదు. యక్షగాన పదములు "సంగీత తాళ నిర్ణయమ్ము" గలవని మాత్రము తెలియనగును.

28. వీరు 17 వ శ. వారనుటకు చూ ఆం. సా. ప. పు. భాం., 3 భాగ - పుట 9. ఇరువురి లక్షణ గ్రంథములును లక్షణ శిరోమణి నామకములే. అందు గ. వేం. కవి ల. శి. ప్రతి — ఆం. సా. ప. నం. 31 (ఎ)

పొ. వేం. రం. కవి ల. శి. ప్రతి, — ఆం. సా. ప., నం. 1297, ప్రా. లి. పు. భాం., ఆర్, నం, 1257.

(ఆర్. 1257-పుట 117)., ఆం. సా. ప. సం. 1297 ప్రతిలో గ్రంథావతారికలో నొకపద్యము గలదు :-

"శతకము యక్షగానములు చాటువులున్ రచియింపలేక కా
మిత... మేరలే...మిక్కిలి మ్రొక్కక యింటనింటనే
శతకము యక్షగానములు చాటువు లోపిన మోపులాదిగా
కృతులవిమూలదాఁపఁగమరిన్గృతులే యెవరిచ్చు మెచ్చెదర్ "

ఇందు గ్రంథకర్తతాను శతక యక్షగానాది లఘుకృతులకును లక్షణమేర్పఱచు సంకల్పము గలవాఁడై లక్ష్యములు సేకరించుటకై యింటింటికిఁబోయి మిక్కిలి మ్రొక్కలతో నాయా గృహస్థుల నర్థించినట్లును వారు మోపులకొలఁది యట్టి గ్రంథము లింట మూల్గు చున్నను నీయక దాపఱికము చేయుచుండుటను సూచించినట్లు తోఁచును.

పై విషయములనుబట్టి పదునేడవ శతాబ్ది యందు య. గా. రచన బాగుగా సాగుచుండినట్లును, యక్షగాన మనిన లాక్షణికులకు నాస్థ కలిగినట్లును నెంచనగును. ఆ శతాబ్దియందే యుత్తరార్ధమున నాంధ్రదేశమున యక్షగానమున కొక గొప్ప ప్రక్రియానుబంధ మేర్పడినది. అది కూచిపూడివారి కలాపము. కూచిపూడి భాగవతు[29]

29. వారు భగవద్భక్తులై యుండుటను, భగవత్సంబంధులు, లేక శ్రీమద్భాగవత పురాణ గృహీతములైన కథలను బ్రదర్శించుచుంటను వారికి భాగవతులను వ్యవహార మేర్పడియుండును. కాని వారు వీర నరసింహ రాయల యొద్ద ప్రదర్శించిన సంబెటగురవ రాజు నాటకము భగవత్సంబంధి కాదు కదా. అట్లే మొదట భవగత్సంబంధు లగు వీధి నాటకములకు, యక్ష గానములకును సార్థక వాచకములైన వీధి భాగవతములు, ఆట భాగవతములు, భాగవతములు ననునవి తదుపరి సామాన్య వాచకములుగాఁ బరిణమించినవి. ప్రదర్శకుల విషయము నంతియ. కాని కలాపమును జేపట్టుటతో కూచిపూడి భాగవతులు సార్థకనాములైరి.

లప్పటికి సుమారు నూటడెబ్బదేండ్లకుఁ బూర్వమే ప్రసిద్ధులనియు, వారు మేళములుగా నేర్పడి దేశసంచారములు సేయుచు వీథి నాటకములను బ్రదర్శించు చుండినట్లును దెలియుచున్నది. (ఈ విషయము పూర్వోక్తము). ఆ కూచిపూడి భాగవతుల కులపతులలో సుప్రసిద్ధుఁడు సిద్ధేంద్ర యోగి. ఇతఁడే భామకలాప సృష్టి ప్రతిష్ఠా మహితుఁడు. తన నాయకత్వమున గోల్కొండనవాబు (క్రీ.శ. 1672-1685) తానాషా యెదుట నొక భాగవత ప్రదర్శనమిచ్చి యతనిని మెప్పించి యతనిచేఁ దమ మేళమువారికిఁ గూచిపూడి యగ్రహారము దాన శాసనము వేయించినవాఁడు.[30]

ఈతని భామకలాపముయొక్క ప్రదర్శనప్రక్రియ విశిష్టమైన దైనను రచనాప్రక్రియ యక్షగాన ప్రాయమైనదే. య. గా. రచనా ముఖ్యాంగములగు దరువులు, ద్విపదలు, గద్యపద్యములే యిందలి ముఖ్యాంగములును. ఆనాఁడు ప్రచారమున నుండిన యక్షగానములే యతని భామకలాప రచన కుద్బోధకములై యుండును. కాని ప్రదర్శన ప్రక్రియలోనది సామాన్య యక్షగానాదులవలెఁగాక భరత విద్యావిధి నిబద్ధమైనది. నృత్యప్రధానమైనది. నృత్యకళానుకూలముగా రసైక రమ్యముగాఁ బ్రదర్శించుటకుఁ దగినట్లు సంగ్రహమైన పాత్రసామగ్రి గలది. ఆత్మాశ్రయఫక్కికమైనది.

భామ కలాపమునందలి యితివృత్తము ప్రసిద్ధమగు పారిజాత కథ. సత్యా రుక్మిణుల సవతి కయ్యము ఘట్టమొకటి యిందలి కండ

30. ఇతనిగురించి, కలాపము గురించి వివరములకు చూ. (1) ఈ గ్రంథము ద్వితీయ భాగము — ఆం. దే. య. గా. కవి చరిత్ర ప్రకరణము — పుట 30 - 35.

(2) "The KALAPAM" a Paper By the Present Writer Published in TRIVENI, Silver Jubilee Number, 1955.

పట్టు. ఇందలి "మాధవి" యను సఖిపాత్ర యొకటి యీ కులపతి యపూర్వసృష్టి. అర్వాచీన యక్షగానములపై భామకలాపము ప్రభావము బాగుగాఁ బడినది. సిద్ధేంద్రుని తరువాత దానికి మానస పుత్రికలుగా భామకలాప కృతులనేకము వెలయుట కాక యీ "బాణీ"లోఁ బారిజాత కథేతి వృత్తములగు యక్షగానములును గోకొల్లలుగా వెలసినవి. వానియందును "మాధవి" పాత్ర యిరవుకొన్నది; సవతి కయ్యము ఘట్టము ప్రాచుర్యము వహించినది. భా. క. నందువలెఁ బాత్రల తెర ప్రసంగములు, స్వీయోదంత నివేదనము మొదలగు విశేషములును గొన్ని యక్షగానములందుఁ బ్రవేశించినది. సవతుల సందర్భ సాదృశ్యము సాకుగా య. గా. లందు శివపారిజాతములును, శివకేశవ పారిజాతములును దత్సదృశములును వెలసినవి. భామకలాపము ప్రాదుర్భవముతో, భరత విద్యాధురంధరులగు కూచిపూడి భాగవతులు తెలుగునేల నాల్గు చెఱగులఁ దిరుగుటతో నాంధ్ర దేశ యక్షగాన ప్రదర్శనములందు నూత్నశక మారంభమైనదని తలంప నగును. అంతవఱకు దఱచు తక్కువజాతి ప్రదర్శకుల హైతక్కలతో నలసగతిఁ బయనించు చుండిన యక్షగానము భామకలాపము భరతము పట్టినది. (అనఁగా నందలి భరత పద్ధతి ననుసరించి పురోగమించిన దని చెప్పనగును.) ఆంధ్ర దేశమున గ్రొత్తగాఁ గొన్ని య. గా. మేళములు మొలకెత్తి కూచిపూడికత్తు నెవరి యోపినకొలఁది వా రనుకరించి యుందురు.

సిద్ధేంద్ర యోగి భామ కలాపమే కాక గొల్ల కలాపము గూడ రచించె నందురు. గొల్ల కలాపము రెండు రకములుగా నున్నది. ఒక రకమున గొల్లభామ వేదాంతోపన్యాసము చేయుట, వేఱొక దానిలో గొల్లభామ సముద్ర మథన కథా కథనము, సుంకరి కొండఁడా మెతో

చేయి ముట్టు సరసమునకు దిగుట యను నవి ప్రధాన విషయములు. మొదటి తరగతికిఁ జెందినది సిద్ధేంద్రుని రచన కానచ్చును. కాని రెండవ తరగతికే వ్యాప్తిహెచ్చు. ఈ గొల్ల కలాపము రచనయు య. గా. ప్రక్రియకు భిన్నము కాదు.

18 వ శతాబ్ది నాఁటి యక్షగాన చరిత్రలో నిక్రింది విశేషములు గమనింపఁ దగును :-

(కడమ వివరములకు ద్వితీయ భాగమును జూడనది)

రాజ ప్రోత్సాహమునఁ గొన్ని య. గా. కృతులు నెలసినవి. ఉదా :- వర్ఘుల నరసింహ కవి దుష్యంత చరిత్రము, అకలంక శ్రీకృష్ణమార్యుని కృష్ణవిలాసము, నారాయణ కవి సుందర కాండము, నరకూరు నారాయణ కవి పారిజాత నాటకము.

యక్షగానము నాట్య పద్ధతికి గేయ పద్ధతికిఁ గూడ నుపయోగపడు చుండెడిది. ఉదా :- దళవాయి తిమ్మప్ప ప్రసన్న వేంకటేశ్వర విలాసమునఁ జాల దరువుల కడ ముందుగా నొక రాగము నొక తాళమును బేర్కొనఁ బడి పిదప "నాట్యపద్ధతిక" అని మఱియొక రాగ తాళముల జంట పేర్కొనఁ బడినది. గోగులపాటి కూర్మనాథకవి మృత్యుంజయ విలాసము "నాటక గేయ ప్రబంధ" మని పేర్కొనఁ బడినది. (అట్లు పేర్కొనఁబడినవి 19 శ. లోఁ గొన్ని గలవు. వానిపై మృ. వి. ప్రభావమును జూపట్టును)

కొన్ని య. గా. ల పరముగా నాటకశబ్దము వినవచ్చుచున్నది. ఉదా :- వర్ఘుల నరసింహ కవి దుష్యంత చరిత్రము నొకప్రతి విలేఖకుఁడు శకుంతలా నాటక మని పేర్కొనెను. కూర్మ నాథ కవియు, నరుకూరు నారాయణ కవియు స్వయముగా నా శబ్దమును వాడి

యుండిరి. నరుకూరు కవికృతి "ఆటభాగవత" మనియుఁ బేర్కొనఁ బడినది. దీనిపై భామకలాపము ప్రభావము బాగుగాఁ గలదు. అర్వాచీన పారిజాత య. గా. లపై దీని ప్రభావమును బడినది.

కొన్నిటఁ బాత్రలను సూత్రధారుఁడు పృచ్ఛించుట గలదు. ఉదా :- నరసింహ కవి దుష్యంత చరిత్రము, నక్కలపాటి సంజీవ కవి ఎఱుకల కథ. దుష్యంత చరిత్రలోఁ దెర ప్రసక్తియుఁ గలదు. ఇందును నరుకూరు కవి కృతి యందును బాత్రలు స్వీయోదంతమును సభ వారికి నివేదించుట, హాస్య గాని వాలకమును గలవు. కొన్నిట ప్రబంధ ప్రభావము బాగుగాఁ బడినది. ఉదా :- కూర్మనాథ నరుకూరు నారాయణ కవుల కృతులు మొ॥. తమిళ దేశపు "ఉలా" ప్రబంధపుఁ బోకడయు, తంజావూరు య. గా. నాటక ఫక్కియు దళవాయి తిమ్మప్ప కృతియందుఁ గన్పట్టును. (చూ. ద్వి. భా. - పుటలు 41 - 43 ; 257). మృత్యుంజయ విలాసమున నాశ్వాస విభాగ మొక విశేషము.

ఈ శతాబ్ది నడుమనే యొక రాయలసీమ బొమ్మలాటవారి కుటుంబమునకుఁ జెందిన య. గా. రచన మొకటి బయల్వెడలినది. అది బొమ్మలాట సాంబయ్య కిరాతార్జునీయము (ద్వి. భా. పుట 46-49). రచన రుద్రకవి సుగ్రీవ విజయము ఫక్కి నున్నది.

ఈ శతాబ్ది చిట్టచివర వెలసియుండునని యూహింపఁదగిన పురిజాల లక్ష్మీనారాయణకవి "పారిజాత యక్షగాన ప్రబంధము"న నొక ముఖ్యవిశేషము గలదు. అది ప్రబంధముద్ర, భామ కలాపము "బాణీ"యును గలది. ఆమాట యటుండ, నిం దాట భాగవతము లందుఁ బురుష నటులు స్త్రీ వేషములను ధరించుటగూర్చి సత్యభామకు సఖిపాత్రకు నడుమ నొకచర్చ జరిగినది. అది యనుచితమని

సఖి వాదము. హరి జగన్మోహినీవ్యవతారాది వృత్తాంతము లుదాహ రించి సత్యభామ దానిని బ్రత్యాఖ్యానము సేయును. ఈ సందర్భ మున గవి యుద్దేశము పురుషులు స్త్రీ పాత్రధారణము చేయునచ్చు ననియే. కాని తగినసందర్భము లేకున్నను నతఁడా విషయము నెత్తు కొని యట్లేల సమర్థింపవలసివచ్చినది యని ప్రశ్న. అనఁగా స్త్రీ పాత్రలను స్త్రీలే నిర్వహించుట యుక్తమను వాదము క్రొత్తగాఁ గవి సమకాలికులలో బయలుదేఱినదో, లేక యక్కడక్కడ వీధిభాగవత ములలో, దొలుత స్త్రీ పాత్రలు స్త్రీలే నిర్వహించుచుండ నీ కవి నాఁటికిఁ బురుషులు నందులకుఁ బూనుకొనుచుండఁగా నచ్చటచ్చట నాక్షేపణ బయలుదేరినదో! మునునాఁటి య. గా. లలో స్త్రీ పాత్రలు స్త్రీలే నిర్వహించుచుండిరనుటకు దగిన యాధారములు లేవు. కాని క్రీ. శ. 1514 నాఁటి చెఱువు బెళగల్లు శాసనమునందు "తాయికొండ నాటకము"న నట్టువ తిమ్మయ్య కొమార్తె "పాత్రి" గ నటించినట్లు పేర్కొనఁబడినది. ఈయొక్కవిషయమునుబట్టి నిర్ణయ ములు చేయఁదగదు. కొందఱు భాగోతుల బుచ్చిగాఁడును, పెండెల నాగియు, గంగియుఁ బేర్కొనఁబడిన చాటుపద్యమొకటి శ్రీనాథకృత మనియు, పెండెల నాగియు గంగియు భాగోతుల బుచ్చిగాని మేళము లోనివారై యుందురనియు నూహింతురు. కాని మొదటిసంగతి యా పద్యము 18 వ శతాబ్దినుండిన తురగా రామకవిది గాని శ్రీనాథునిది కాదు. రెండవసంగతి భాగోతుల బుచ్చిగానికి పెండెల నాగితోఁగాని గంగితోఁగాని యెట్టిసంబంధము నాపద్యమున సూచింపఁబడలేదు. మూఁడవది బుచ్చిగాఁడే యేదో యొక్కటే కొదువగాని యాడువేషము నకుమాత్రము జక్కఁగా గుదిరియుండువాఁడనియు నందు సూచింపఁ బడినది.[31] 18 వ శతాబ్దివాఁడే యగు కూచిమంచి జగ్గకవి చంద్ర

31. చూ. వేటూరి వారి క్రీడాభిరామ పీఠిక, పుట 68 – 69.

రేఖా విలాపమునందుఁ బలుతడవలు "భాగవతుల" (నటుల) ప్రశంస వచ్చినది. అందొకచో (1-85) నున్న, "ఆడు భాగవతుని జాడ గడ్డము మూతి, నున్నగా గొరిగించుకొన్నవాఁడు" అను మాటను బట్టి నాఁడు పురుషులు స్త్రీ వేషములు వేయుచుండెడివారని తెలియుచున్నది. కాని 19 వ శతాబ్ది యందు వీధినాటకములందు స్త్రీలును బాల్గొనినట్లు కొన్ని యాధారములు గలవు. (ముందు చెప్పఁబడును). అట్లు స్త్రీలు పాల్గొనుట లక్ష్మీనారాయణ కవి కాలమున నప్పుడే యింకను మొదలై యుండును. ల. నా. కవి కది యిష్టముకాకపోవుటచేత నట్టి చర్చకుఁ దన కృతిలోఁ బసక్తి గల్పించి యుండును.

18 శ. య. గా. లలో రచనలోఁ బ్రాచీన రీతులతోపాటు కొన్నికొన్నిటఁ గ్రొంగ్రొత్త విశేషములును గొన్ని చేరినవి. ఉదా:- దరువులలో సంకీర్తన లక్షణము (నిముషకవి రామయ్య జలక్రీడా విలాసము ఇది ప్రదర్శనోద్దిష్టమై యుండదు), హిందుస్తానీ రాగతాళ ప్రాచుర్యము, శారదపద్యము (అకలంక); రగడ, దండకము, చూర్ణిక, శ్లోకములు, గౌరీకల్యాణము (గోగులపాటి); రాగ యుక్తములగు ద్విపదలు, కన్నడభాషలో దరువులు (తిమ్మప్ప); కందార్థములు, గీతార్థములు (నరుకూరు).

18 శ. య. గా. చరిత్రలో నించు మించాంధ్ర దేశమునఁ గల ముఖ్యమండలముల కన్నిటికినిఁ దగిన ప్రాతినిధ్యము గలదు. పూర్వ శతాబ్దులకంటె బరిణతి యధికముగాఁ గనుపట్టినది.

19 వ శతాబ్ది ఆంధ్ర దేశయక్షగాన చరిత్రలోఁ జిత్ర చిత్ర నైక నైకవిధ పరిణామములకాలవాలమైన కాలము. వివిధప్రాంతము లందు యక్షగానములు కోకొల్లలుగా వెలసినవి. అందధిక భాగము

నాటకనామము నవధరించినవి. ప్రదర్శకుల మేళము లనేకము వెల సినవి. రంగస్థలమున యక్షగాన మొకవింతయాకారంగుతో రాణించినది.

ఆనాఁటి దాని పరిణామ చరిత్రలోఁ బ్రధానములైన యంశ స్ములు బహువిధప్రక్రియానుబంధములు. ఆంధ్రదేశమున యక్షగానము నకు నాటకనామము 18 శ. నుండి కన్పట్టును. అది వీథి నాటకముల తోడి యనుబంధమువలన వచ్చియుండును. ఆ యనుబంధ మెప్పటో గాఢముగా నేర్పడి పోయినది. ఇఁక నీ 19 శ. నఁ గ్రొత్తగా నేర్పడిన యనుబంధములు కొరవంజి, బొమ్మలాట, ఏకాంతసేవ, హరికథ, జంగం కథ, మార్గనాటకము, ఆధునిక నాటకము మొ॥ వానితోడివి.

## కొరవంజి - యక్షగానము

కొరవంజి యక్షగాన సంబంధము చరిత్ర పూర్వోక్తము (చూ. పుట 31—47). కొరవంజి రచనా ప్రక్రియా ప్రాణభూతమగు ఎఱుక ఘట్ట మాంధ్ర దేశ య. గా. లలో మొట్టమొదటగా 18 శ. లోఁ గన్పట్టినది. (చూ. నక్కలపాటి సంజీవకవి ఎఱుకలకథ, కూర్మ నాథకవి మృత్యుంజయ విలాసము). కాని యీయాంధ్రసీమయందు కొరవంజి పేరితో య. గా. రచన వెలయుటన్నది 19శ. పూ. భా. నందే మొదలైనది. ఉదా 1. సన్నిధిరాజు జగన్నాథకవి ఎఱుకల కురవంజి, 2. జందాళ నంజప్ప జ్ఞాన-కురవంజి రెండును య. గా. లనియుఁ బేర్కొనఁబడనవి. రెండును వేదాంత విషయ ప్రధానము లగుట గమనింపఁ దగినది. కురవంజులుగాఁ బేర్కొనబడకపోయినను నాఁడనేక- తెనుఁగు దేశ య. గా. లందెఱుకత పాత్రకుఁ బ్రసక్తికలదు. (చూ. తరిగొండ వెంగమాంబ శివనాటకాదులు, శివలెంక మల్లనా రాధ్యుని వీరభద్రవిజయము మొ॥.)

## బొమ్మలాట - యక్షగానము

బొమ్మలాటకు యక్షగానమునకునుగల సంబంధము, చరిత్రము గూడఁ బూర్వోక్తము. (చూ. పుట 47 - 58). మనుష్యులచే నాడఁ బడుటకే కాక బొమ్మలాట ప్రయోగమునకును గవులచే నుద్దిష్టము లైనట్లు స్పష్టపడిన య. గా. రచనలీ శతాబ్ది నడుమ నుండియే కాన వచ్చుచున్నవి. ఉదా:— 1. మరింగంటి భట్టరు రామానుజాచార్యుల శ్రీరామ నాటకము. 2. చతుర్వేదుల వెంకట నరసింహయ్యగారి ద్రౌపదీవస్త్రాప హరణాదులు. 3. కోట వెంకటప్పయ్య శాస్త్రి బాణాసురనాటకము మొ..

## ఏకాంత సేవ - యక్షగానము +

ఏకాంత సేవా ప్రబంధము లను పేర నొక "తరహా" యక్ష గాన ప్రాయ రచన లీ శతాబ్దమునఁ గన్పించును. అందు కొన్ని య. గా. లనియుఁ బేర్కొనఁ బడినవి. ఏకాంత సేవయనఁగా నిత్యార్చన సాగు దేవాయతనము లలో ముఖ్యముగా భోగ నిలయము లగు వైష్ణవాలయములో రాత్రి గుడి తలుపులు మూయుటకు ముం దర్చ కులు యథా విధి నుప చరించి అమ్మవారి, సామివారి యుత్సవ విగ్రహములను పానుపుపైఁ బవళింపు చేసి, గుడిచేటులు లాలి పాటలు పాడి ద్వారపాలన నిమిత్త మష్ట దిక్పాలకులకు 'బహు పరాకులు' చెప్పి వెడలి పోఁగా నిఁక నమ్మవారు స్వామివారికిఁ జేయు నదిగా నూహింపఁ దగిన పర్యంక సపర్య. మధుర భక్తి ముదితాత్ములగు కవివతంసులు కొందఱా సన్నివేశమును గ్రహించి దానికిఁ బూర్వ రంగముగా నింత కథాంగము (భామ కలాపము "బాణీ" లో) కల్పించి నాయకుని వివిధోపచారములకు వివిధ గీత ప్రభేదములను

+ ఈ విషయమై వివరములకు చూ. నా వ్యాసము – కృష్ణాపత్రిక 30-4-55.

బ్రయోగించి ఏకాంత సేవామకుటముతో ననేక గేయ ప్రబంధములను వెలయించిరి. అవి యక్ష గానముల వలె సంగీత సాహిత్యముల కాల వాలములు ; ఎట్టి రచనా విశేషము నైన నిట్టె యిముడ్చుకొనఁ గల ట్టివి. ఈ జాతి కృతి రచన యంత ప్రాచీన మైనదిగాఁ దోఁపదు. 19 శ. ప్రాంతము ననే యక్షగాన మొరవడిగా బయ ల్వెడలినట్లు తోఁచును. అందు కొన్ని యక్షగానము లని యాకవుల చేతనే వ్యవ హృతము లైనవి. నాటక నామకరణము చేయించు కొన్నవియుఁ గొన్ని లేకపోలేదు. ఉదా :- 1. మామిళ్లపల్లి వేంకటాచల కవి ఏకాంతసేవా నాటకము. (కవి చేతనే య. గా. అనియుఁ బేర్కొనఁ బడినది.) 2. అక్కెనప్రగడ హరి దాసు "శ్రీరామ నిత్యోత్సవ యక్షగానము." 3. కుందుర్తి ఆది నారాయణ శర్మ "ఏకాంతసేవా కథానామకంబగుయక్షగానము"

## హరికథ - యక్షగానము

హరికథకు యక్షగానమునకుఁగల యనుబంధముగూర్చి ముందే చెప్పఁబడినది. (చూ. పుట 74 - 82). ఆంధ్ర దేశమున హరికథలు వెలయుటయు, నందుఁ గొన్ని య. గా. లని వ్యవహరింపఁ బడుటయు నీ 19 శ. ఉత్తరార్థము నుండియే కాననగును. ఉదా :— 1. బాగేపల్లి అనంత రామాచార్యుల శశిరేఖా పరిణయాదులు, 2. ఆదిభట్ల నారాయణదాసు ప్రహ్లాదచరిత్రాదులు, 3. కోకా వెంకటరామాను జులు నాయుఁడు గజేంద్రాళ్వారు చరిత్ర మొ॥.

## జంగముకథ - యక్షగానము

19 శ. ఉ. భా. న యక్షగానములకు, జంగము కథలకు నొక విధమైన చిన్న సంబంధమేర్పడినది. అసలు య. గా.లకు జంగం కథ

లకు నొకసామ్యమును గలదు. జంగముకథలు గానరూపకథాఖ్యాన మున కుద్దిష్టములు. యక్షగానములు కాలక్రమమున రంగప్రదర్శనల కెక్కినవి కాని వాని ప్రాథమికస్థితి గానప్రధాన కథాఖ్యాన పద్ధతియే గదా. జంగము లెప్పుడు తెరనాటకము లాడుటలోఁ బ్రసిద్ధులేకాని జంగముకథ లనఁబడునవి హరికథ, బుఱ్ఱకథలవలె గాన రూప కథాఖ్యానకములు మాత్రము.[32] ఇందును య. గా. లందువలె దరువులు గద్యపద్యములు నుండును గాని ద్విపద, ఏలపదాది దేశి రచన లుండవు. ఇందు బ్రధానముగ విహితముగఁ బ్రచురముగ నుండునది రగడ; కథాఖ్యాన తంతు వాయమగు ప్రధాన రచనాంగమదే. ప్రాచీన య. గా. లందలి గేయలు రగడ వికారములే గాని య. గా. లందు రగడ యథాతథముగాఁ బ్రయోగింపఁబడిన సందర్భము లతి సకృత్తు. జంగము కథలు 19 శ. కి ముందు వెలసిన జాడ గానరాదు. వానిప్రాదుర్భావమునకు జక్కులకథలే (య. గా. లే) కారణము లైనవేమో! 19 శ. తురీయపాదమున జంగము కథా రచయితలుగాఁ బేర్వడసిన గాయకనాడ పెద్దయ, ధేనువకొండ వెంకయ్య వరుసగా నలచరిత్ర, విరాట పర్వములను జంగము కథలుగను, యక్షగానములు

32. చూ. పుసులూరి వేంకటసుబ్బరాయకవి ద్రౌపదీ వస్త్రాపహరణము. (గౌరి ముద్రాక్షరశాల, నూజవీడు, 1915. ప్రచురణకర్త్రి) పుసులూరి రామమ్మ. కవి భార్య)

"దరువులు, రగడలు, వచన గద్య పద్యముల సహితముగను ధర శివజంగము వారికి నిరతము ధర్మ జీవనముగ చేయగ బూనితి, జంగము లీ కథ చేకొని వర్ణించి శ్రీయుతముగ బల్ కంచు గుమ్మెటల్ చితారయు బూని సరస మైన సంగీత సత్కళా సంగతు లొప్పగను స్థిరముగ తాళ ప్రస్తారంబుల జేసి చెప్పునటుల" అని కవి వక్కాణ.

గను రచించి యుండుట విశేషము. రంగము కథలే యక్షగానములుగాఁ గొందరిచేఁ భ్రమింపఁ బడుట యింకొక విశేషము.[33]

## ప్రబంధము - యక్షగానము

ఆంధ్రప్రబంధ ప్రక్రియ 16 వ శ. పూర్వార్ధమున కే సమగ్రతను నందినది. ఆ శతాబ్ది ముఖాంగణముననే రంగవల్లికలు దీర్చినది మన యక్షగానము. ఒకపంక్తి యక్షగానము పలుకుబడి సాగుచుండిన యా దినములలో వెలసిన ప్రబంధములు కొన్ని (వసుచరిత్రాదులు) నాటకరీతుల వైపు వాటములు ప్రదర్శించినవి. కొన్ని యక్షగానములలో నప్పటికిఁ బ్రబంధ ముద్ర పడలేదు. రుద్రకవి ప్రభృతులు తమ కృతులను యక్షగాన ప్రబంధములనియుఁ జెప్పుకొనియున్నను నట ప్రబంధ శబ్దమును గావ్య సామాన్యవాచిగా మాత్రమే గ్రహింప నగును. విష్ణుమాయావిలాసాదులు య. గా. ప్రబంధములని పేర్కొనఁ బడకపోయినను నచట నచటఁ బ్రవచనలోఁ బ్రబంధ ధోరణి కొద్దిగా నైనను బొడసూపకపోలేదు. 17 శ. ఉ. భా. న వెలసిన భామకలాపముపై ముందునాఁటి ముక్కుతిమ్మనగారి పారిజాతాపహరణ ప్రబంధ ప్రభావ మగుపించినది. పిదప కాలమున భామకలాపము

33. చూ. (1) తుళ్లూరి మాధవరాయకవి సారంగధరకథ (ప్రా. లి. పు. భాం., ఆర్. నం 691. కెటలాగు కర్తలచే యక్షగాన మని పేర్కొనఁ బడినది. (ప్రా. లి. పు. భాం., త్రైవార్షిక గ్రంథ వివరణిక, - పుట 1729). (2) పుసులూరి సుబ్బరాయకవి "యక్షప్రశ్నలు" - మదరాసు సుబ్రహ్మణ్యవిలాస ము. శా., 1915. ప్రచురణకర్తలచే యక్షగానమని వ్యవహృతము. (3) 1900 ప్రాంతమున ధనకుధరం రామానుజాచార్యుల వారిచే రచింపఁబడిన బిల్హణీయము వారిచేతనే య. గా. గాఁ బేర్కొనఁబడి యుండుట మఱియు విశేషము. అట్లు కవిచే య. గా. గా వ్యవహృత మైనది గాన దీని చరిత్ర మిందు చేర్చుట యైనది. (చూ. ద్వి. భా., పుట 210-11).

"బాణీ"తో వెలసిన పారిజాత యక్షగానములపై దాని ప్రభావ మింకను నధికము. 18 శ.న య. గా. లపైఁ బ్రబంధము ప్రభావ మధికతరముగనే కన్పట్టును. 18 శ. చివర పూరన ప్రభావతీ ప్రద్యు మ్నము గోపాలుని సింగయచే య. గా. గాఁ బరివర్తింపఁబడినది. ఆనాఁటి మృత్యుంజయ విలాసమునందు రచనాప్రౌఢిలోఁ గథా ప్రణా ళికలో నాశ్వాస విభాగములో వర్ణనా ప్రాచుర్యములో శబ్దార్థాలం కార స్వారస్యములలో, శృంగార ప్రాధాన్యములోఁ బ్రబంధ ముద్ర ప్రస్ఫుటముగాఁ గానవచ్చును. 19 శ.న నట్టి య. గా. రచన లధిక ముగా వెలసినవి. ఉదా :- శివలెంక మల్లనారాధ్యుని వీరభద్ర విజ యము, వారణాసి అచ్యుతరామకవి దరువూరి అప్పలాచార్యులు నను జంట కవుల లక్ష్మీనారాయణ విలాసము మొ॥. ఈ రెండును మృత్యుం జయ విలాసమునకు మానస పుత్రికలు - ప్రాచీన రచనారీతి (తాళ ప్రధానములైన దరువులు) గలిగి, ఆశ్వాసవిభాగము గలిగి, ఆఖ్యాన శైలీ ప్రచురమై కేవలము శ్రవ్యధోరణి నున్న య.గా.లును 19 శ.న వెలసినవి. ఉదా :- కాట్రంబాక కేశవాచార్యుల రామానుజ విజ యము, పతివ్రతా మాహాత్మ్యము. 19 శ. తురీయపాదమున వెలసిన రఘునాయకం రామానుజ సూరి కన్యకా విజయ య గా. 8 ఆశ్వాస ములు గలది శ్రవ్యధోరణి నున్నది. య. గా. రచనలోఁ బ్రదర్శనలో నాటకపు వాట మధికమగుచుండిన 19 శ. ననే యిట్టి రచనలు వెల యుట జూడ యక్షగానము ప్రాథమిక తత్త్వమును నొకవంకఁ గొంత సంరక్షింపఁబడుచునే యుండినదని చెప్పవచ్చును. ఇట్లు య. గా. లు శ్రవ్య ప్రబంధధోరణి నుండుట మాత్రమే కాక పూర్వ ప్రబంధములు య.గా.లుగాఁ బరివర్తితములైన సందర్భములు గలవు. 19 శ.న ఉదా :- 1. వసు చరిత్ర - కొండమగుండ్ల శేషాచార్యుల వసురాజ విలాసము. 2. భాస్కరాచార్యుని కన్యకా పురాణము -

రామానుజ సూరి కన్యకావివాహము. 3. కందుకూరు రుద్రకవి నిరంకుశోపాఖ్యానము - పురాణం పిచ్చయ్యగారి కపటవేశ్యానాటకము. 4. కళాపూర్ణోదయము - కందాళ్ళ రామానుజాచార్యుని బొమ్మదూరు క. పూ. నాటకము (?, 4-20 శ.) ప్రారంభదశకుఁ జెందినవి.

## నాటకము - యక్షగానము

యక్షగానమునకుఁ బర్యాయముగా నాటకశబ్దము 19 శ. న నెక్కువగా వినవచ్చినది. నాటకి గేయప్రబంధమనియు, నాటకమనియు వ్యవహరింపఁబడుచు వచ్చినది యక్షగానము. అటు నాటకశబ్దము రూపకసామాన్యవాచియేయైనను, అది య. గా. నకు వీధినాటకము సాహచర్యమున సంక్రమించి యుండునని యూహింపఁదగియున్నను యక్షగానముపై మార్గనాటకప్రభావము, తత్రాపి ఆధునిక నాటకప్రభావమును గూడఁ జూడఁ గలము. య. గా. న సూత్రధార ప్రసక్తి సుమారొక శతాబ్దికి ముందే వఝల నరసింహకవి దుష్యంత చరిత్రాదులందున్నను నది మార్గనాటక ప్రభావ మనలేము. ఏలయన య. గా. లలో సూత్రధారుఁడు ప్రదర్శన మధ్యమునఁగూడఁ బాత్రలను బలుకరించుటయుఁ (అది దుష్యంత చరిత్ర య. గా. న విశదమైనది) గథానుసంధానము సేయుటయుఁ గాననగును. మార్గరూపకములలోఁ బ్రస్తావనతో సరి సూత్రధారుని వాలకము. మఱి కనుపింపఁడు నడుమ. య. గా. లలోవలె నతఁడు పాత్రలను బలుకరింపఁడు సరికదా పరిచయమైనఁ జేయఁడు. 19 శ. న సూత్రధారప్రసక్తిగల య. గా. లనేకము వెలసినవి. ఉదా:- 1. శీర్నాదు వెంకటరాయకవి లేపాక్షి శివనాటకము (19 శ. పూ. భా.) 2. మరింగంటి భట్టరు రామానుజాచార్యుని శ్రీరామనాటకము (19 శ. నడుమ) 3. బోడిచర్ల సుబ్బకవి మిట్టేమరి రామాయణము, 4. దూపాటి శేషాచార్యుల శాకుంతల

నాటకము, 5. కేసిరాజు వెంకటసుబ్బరాయకవి రామదాసు నాటకము, 6. త్వరకవి రామకృష్ణయ్యగారి వీరభద్రవిజయము. (3-6-19 శ., ఉ. భా.) 7. కాకరపర్తి నృసింహకవి సంగీత సారంగధర నాటకము (20. శ.) మొ...ఇందు 1 లో సూత్రధారుఁ డెఱుకల సానినిఁ బల్కరించును. 2 లో సూత్రధారి గ్రంధ ప్రస్తావన నడుపును. 3 లో సూత్రధారి మంత్రసానిని బలుకరించినాఁడు. 4 లో సూత్రధార ప్రవర్తితమైన ప్రస్తావన గలదు. అందీ నాటక ప్రయోగమును గూర్చిన తౌర్యత్రిక రూపారోపవిషయ ప్రసక్తియున్నది. 5 లో గ్రంధాంతమున ననుబంధముగా గ్రంధకర్తచే రచింపఁబడిన నాందీ ప్రస్తావనలుగలవు. 6. లో గ్రంథారంభమున సూత్రధారుఁడు కథోపోద్ఘాతము నుపన్యసించుట మాత్రము కాననగును. 7 లో నాందియు, సూత్రధార విదూషకులచేఁ బ్రవర్తితమైన ప్రస్తావనయుఁ గలవు. ఇట్టి నాందీప్రస్తావనలకుఁ బ్రసక్తిగల య.గా. లను జూచినచో య.గా. పై మార్గరూపక ప్రభావము పడినదని చెప్పకతప్పదు.

ఇఁక నాధునిక రంగస్థల నాటకము[34] తో యక్షగానము నకుఁ గల యనుబంధము విచారణీయము. కొందఱు విమర్శకులు "నేటి నాటకములకు మాతృకలైనవే నాటి యక్షగానములు" అని యనుచున్నారు.[35] కాని యిది ముధావాదము. యధార్థముగఁ గొన్ని యక్షగానములే యాధునిక రంగస్థల ప్రభావ పరామృష్టము

34. Well developed and regular Modern Stage - drama.

35. (a) గొాక్త్రిపాటి వెంకటసుబ్బయ్యగారి "మనజానపద వాఙ్మయ సమీక్ష" అను వ్యాసము. ఆంధ్రప్రభ-ఆంధ్ర రాష్ట్రావతరణ ప్రత్యేక సంచిక, తేది. 1-10-53, పుట 7.

(b) 'Yakshagana is the precursor of the Modern Drama in Telugu' - Telugu Literature (P. E. N. Series by P. T. Raju.)

లైనవని చెప్ప వలసియున్నది. ఈ రంగ స్థల నాటకరచన యన్నది యాంధ్రమున మిక్కిలి యాధునికము. 19 శ. ఉత్తరార్ధమున ధార్వాడ నాటకాల కంపెనీ వారు తెలుఁగు మాగాణముపై "డేరా" వేయుటతో నిటు కీ. శే. కందుకూరి వీరేశ లింగముపంతులు గారు నటు రాయల సీమలో కీ. శే. ఆంధ్రనాటకపితామహుఁడు ధర్మవరం కృష్ణమాచార్యులు గారు మొదలైన పండితులు కలములు నవరించుటతో నవతరించిన దాంధ్ర రంగస్థల నాటకము. సంస్కృత, పాశ్చాత్య నాటకముల కనువాదములును, ఆ ఉభయ ప్రక్రియా సమన్వితములగు స్వతంత్ర నాటకములును వెలసినవి మొదట. ఆ కాల మున రచింపఁబడిన యక్షగానములపై వాని ప్రభావ మెట్టిదో పరిశీలింతము. పూర్వోక్తమైన కేసిరాజు వెంకటసుబ్బారాయ కవిగారి రామదాసు నాటక మిందులకుఁ బ్రబలోదాహరణము. (వివరములకు చూ. - ద్వి. భా., ఆ పుట. 177 - 179). ఇం దిది మొదట 1888సం. న "యక్షగానముగా" రచింపఁ బడినట్లును బిదప 1899లో కవి యే "ఇప్పటి నాటకముల వలె" అనఁగా ధార్వాడ కంపెనీ నాటక ప్రదర్శనములను జూచి మన కవు లానాఁడు రచించు చుండిన నాటకముల వలె రచింపఁ బూనినట్లును కవిగారి పుత్రు లగు శ్రీ కేసిరాజు సత్యనారాయణ గారు 1927లో (రాజమండ్రి రాజన్ ప్రెస్సులో) ముద్రితమైన యా నాటకము పీఠికలో వ్రాసియున్నారు. మఱియు వారు "ఈ గ్రంథమూలమగు చిత్తుప్రతి యందు అంకరంగ విభజనముగాని పాత్రల ప్రవేశ నిష్క్రమణ సూచ నలు గాని లే" వని యన్నారు. నేఁటి ముద్రిత ప్రతినిఁజూడ నిందు నాటకారంభమున కట్టియం (చోపుదారు) వచ్చి తానిపా రాకను సూచిచుట, పాత్రలు తెరలోనుండియే ద్విపదలో స్వీయచరిత్ర చెప్పు కొనుట, వెంటనే పాత్రప్రవేశ సూచకమగు నొకదరువు, కటికవాఁడు

పాత్రను బలుకరించుట, ఎఱుకతపాత్ర యునికి మొ॥ విషయములు చూడ నది యంతయు నచ్చముగా యక్షగానపు "బాణీ" యనిపించును. కాని వాకోవాక్య పద్ధతిని వచనమునఁ బాత్రల సంభాషణలు అంక విభాగము అంకములు మఱల ననేక రంగములుగ విభక్తములగుట మొ॥ విషయములుండుట జూడ నిది యాధునిక నాటక ప్రభావమని తెలియ నగును. 20 శ. ప్రథమపాదమున కాకరపర్తి నృసింహకవి విరచితమైన సంగీతసారంగధర "నాటకము యక్షగాన శృంగాటకమ్ము" అని కవిచే పేరొ్కనఁ బడినది. ఇందును అంకరంగ విభాగము, సంధివచనములు లేకుండ ముఖాముఖిగా సరళశైలిలో వచన ప్రచురముగాఁ బాత్రల సంభాషణలు, స్వగతములు, నేపథ్య ప్రసంగములు, పాత్రలు సూటిగాఁ బ్రవేశించు పద్ధతి మొ॥ ఆధునిక నాటక ప్రభావమును సూచించు విషయములు గలవు. కవి యక్కడక్కడఁ బ్రసిద్ధరాగ తాళములలో దరువులను బ్రవేశపెట్టుటచేఁ గాఁబోలు పర్యాయమున దానిని యక్షగానమనియు వ్యవహరించినాఁడు. ఆ "యక్షగాన శృంగాటక" మనుమాట సార్థకము. ఇందును రామదాసు నాటక మందును నాందీప్రస్తావనలు మార్గప్రక్రియకుఁ జెందినవే యైనను, అంకము లనేకరంగములుగా విభాగింపఁ బడుటన్నది మాత్రము పాశ్చాత్య నాటక సంప్రదాయము. ఆధునిక నాటకములందు రెండు ప్రక్రియలును సమన్వయింపఁబడినవి. వాని ప్రభావము య. గా. లందును గనఁ బడుట విశేషము. ఈ వివరణమును బట్టి "నేటి నాటకములకు మాతృకలైనవే నాటి యక్షగానము" లనుట పొసగదనుట తెల్లము. యక్షగాన మాధునిక నాటకమునకుఁ బ్రాథమికస్వరూపమే యైయుండు నెడల నట్టి నాటకములకు విశేష ప్రచారముగల యీ దినములలో య. గా. రచన యంతరించి యుండవలసినది. కాని యీ 20 శ. యందును సన్నగిల్లి పోయినను సాగుచునే వచ్చినది య. గా. రచన.

ఇంత వ్రాసియు 19 శ. నాటి యక్షగాన పరిణామమును బూర్తిగాఁ జెప్పినట్లుకాదు. ఆనాఁటి దాని పరిణతి బహుముఖమైనది. ఐనను సందందుఁగల విశేషములుకొన్ని స్థాలీపులాకముగా స్పృశింపఁ బడును.

ఈ 19 శ. న :- భామకలాపము “భాణీ” ని రచింపఁబడిన య. గా. లు శ్రీనివాసకవి పారిజాతము, శేషము రంగాచార్యుల రతి మన్మథ విలాసము, శివకేశవ పారిజాతము మొదలగునవి. ఇందు శి. కే. పారిజాతము ప్రయోజన ద్వైవిధ్యము నేకత్ర సాధించినది. (చూ. ద్వి. భా. పు. 92-94).

పాడుటకు నాడుటకుఁ గూడ నుద్దిష్టములైన య. గా.లు శ్రీనివాసకవి పారిజాతము (ఇది నాటకమని పేర్కొనఁ బడినది), భారతి రామరాజు గొల్లకథ మొ॥. అందు రెండవదాని డి. సం. 1873 ప్రతి ముఖపత్రమున “ఆట భాగవతమందు గొల్లకథ – ఆట తాళం సారంగ రాగం వల్లనే యీ గొల్లకలాపం యావత్తు వినకరి చేస్తున్నారు. కొందరు ప్రత్యేకరాగములు పాడుతా”రని యున్నది. నిశ్చింత ఎంబారయ్యగారి ప్రహ్లాద విజయ య. గా. “బాలికల కత్యంతోపయుక్తమగునట్లు” రచింపఁబడినదఁట. అనఁగా నిది పాడుటకు మాత్రమె యుద్దిష్టమైనదిగాఁ దోఁచును. ఇట్లవే శ్రీరాజా మృత్యుంజయ నిశ్శంక బహద్దరుగారి “దశావతార లఘునాటక రూపక యక్షగానము”, పులహరి ఫిరోజికవి “సాత్రాజితీ నాటకం బను యక్షగానంబు”ను. ఇవి నాటకములని పేర్కొనఁబడియు శ్రవ్య ధోరణి నుండుట గమనింపఁదగినది. ఆశ్వాస విభాగముగల్గియు, గేయ ప్రబంధమని పేర్కొనఁబడియు “తగిన వేషంబులన్ ధరియించి సభల సొగసుగాఁ దెలుప” నుద్దిష్టమైనది పోడూరి వేంకటరాజు

సుకుమారీ పరిణయము. ఇందలి యాశ్వాస విభాగ మంక సంకాశమైనది.

విపుల కథాత్మకములై ప్రదర్శనోద్దిష్టములైన య. గా.లు కొన్నికొన్ని రాత్రుల ప్రదర్శనమునకుఁగాను విభాగింపఁబడినవి. ఉదా :- శీర్నాము వెంకటరాయకవి లేపాక్షి రామాయణము - "మూఁడు రాత్రుల కథ" 2. కొండూరి సీతారామ కవి సావిత్రీ నాటకము - మూఁడు రాత్రుల కథ. 3. మోక్షగుండము సుబ్బకవి సీతాకల్యాణము - రెండు రాత్రుల కథ. 4. యమ్మనూరి వెంకట సుబ్బకవి విరాటపర్వము, ద్రౌపదీ కల్యాణము - రెండురాత్రుల కథలు. 5. వీణె సుబ్బరాజు, గాజుల పెండ్యూరి శేషగిరిరాజుల (1900 ప్రాంతము) సంత వేలూరు కుశలవనాటకము "ఆరు రాత్రిళ్ళ నాటకమునకు బొమ్మలాటకును ఉపయోగముగా" రచింపఁబడినది.

పాత్రల "తెరద్విపదలు" (అనఁగాఁ బాత్రలు ప్రవేశించుటకు ముందు ప్రదర్శకముఖ్యునిచేఁ బ్రచ్ఛింపఁబడి తెరలో నుండియే స్వీయోదంతము సభవారి కెఱుకపడఁ జెప్పు ద్విపదలు) "తెర బయలు దేరే దరువులు" (ప్రావేశికధ్రువలు) ను జాల యక్షగానము లందుఁ గన్పట్టును. ఉదా :- శేషము రంగాచార్యుల రతిమన్మథ విలాసము, పోడూరి వెంకటరాజు సుకుమారీ పరిణయము, వేదాల తిరునారాయణాచార్యుల శకుంతలా, ప్రహ్లాదనాటకములు, మొ॥ వానిలోని పాత్రప్రవేశపు దరువులు సర్వసాధారణముగ హంగుదారులవలనఁ బఠింపఁబడును. కొన్నిటఁ బాత్రముఖముగను బ్రవర్తిత మగుట కాన నగును. ఉదా :- గుండు అద్వైతబ్రహ్మశాస్త్రి సత్యభామా పరిణయము. ఈ "తెర" ద్విపదల దరువుల పద్ధతి ప్రాచీన

య. గా. లందుఁ గన్పట్టును. భామ కలాపము బయల్వెడలిన నాఁటి నుండి కన్పట్టుచు 19 శ. నఁ బ్రాచుర్యము వహించినది.

సంధివచనములవలె సంధిద్విపదలు, సంధిదరువులునుగల య.గా. లును గలవు. ఉదా:- కుసుచేటి సుబ్బరాయకవి గౌరీ శంకర విలాసము, అద్వైత బ్రహ్మశాస్త్రి స. భా. పరిణయము మొదలగు 19 శ., ఉ. భా., య. గా. లలో వచన ఘటితములైన సంభాషణలు ప్రాచుర్యమువహించినవి. ఉదా:- కొదమగుండ్ల శేషాచార్యుల పురూరవశ్చక్రవర్తి విలాసము. కే. ప. జియ్యరయ్య నలనాటకము, కొండయ్య మైరావణచరిత్ర, కెళ్ళ కుప్పయ నలచరిత్ర మొ॥. కాని వీనిలో నొక వంక సంధివచనములును గలవు. సంధి వచన విరహితముగాఁ బాత్రల సంవాద వచనములు మాత్రమే కలిగినవియుఁ గొన్ని గలవు - సంగీత సారంగధర మొ॥.

కొన్ని య. గా. లందు కటికముపాత్ర (తంజాపూరు యక్షగానములలోఁ దఱచు గనుపట్టు చోపుదారుపాత్ర) కన్పట్టును. ఉదా:- వేదాల తిరునారాయణాచార్యుల య. గా.లు మొ॥ కొన్నిట వాఁడు హిందీలోఁ బ్రసంగించుట కాననగును. ఉదా:- జియ్యరయ్య నల నాటకము మొ॥ నాఁడే కొన్నిట హాస్యప్రసంగములును నెఱపును కాని కొన్నిట వేఱే విదూషక ప్రాయుఁడైన హాస్యగాని పాత్రయుఁగన్పట్టును. ఉదా:- బుక్కపట్టణం శఠగోపసూరి, కొన్నిట గ్రంథారంభమున గణపతి సరస్వతుల స్తుతులవెంట నాపాత్రలును రంగముపైఁ బ్రవేశించి నటులను దీవించుటయు, హాస్యగానితోఁ బ్రసంగించుటయుఁ గానగును. ఉదా:- బోడిచర్ల సుబ్బకవి రామాయణము, నగళ్ళపాటి సుబ్బదాస యామినీ పూర్ణచంద్రోదయము మొ॥. (ఈసంప్రదాయము కొన్ని తంజావూరు య. గా. లందును గాననగును.)

నూత్నేతి వృత్తములు గల యక్షగానాలును కొన్ని వెలసినవి. ఉదా:— 1. శేషము రంగాచార్యుని భావనారాయణ విలాసము (పొన్నూరు క్షేత్రమాహాత్మ్య గాధ) 2. కే. వెం. సుబ్బారాయ కవి రామ దాసు చరిత్రము 3. కశిమూల వీపూరి ఆచారి పోతులూరి వీర బ్రహ్మమునాటకము.

19 శ. య. గా. రచనలోఁ జిరప్రసిద్ధ దేశీయ మధురకవితా రీతుల ప్రాచుర్యము క్రమముగాఁ దగ్గుచు వచ్చినది. అర్ధపద్యములు (మొదట సగము పద్యము, పిదప సగము దరువు పోకడయుఁ గలవి) మాత్రము పలు రకములు (కంద గీత సీస ద్విపద వృత్తార్ధములు) ప్రాచుర్యము వహించినవి. దరువులలో హిందూస్తానీ బాణీరాగ తాళముల కధిక ప్రాచుర్యము గల్గినది. దరువుల చివర కవి తత్కృతీశ్వర నామాంకిత ముద్రలకును బ్రాచుర్యము గల్గినది.

19 శ., పూ. భా. న కంటె ఉ. భా. న య. గా. లెక్కువగా వెలసినవి. పూ. భా. య. గా. లలో నంతో యింతో పండితో పజ్ఞము లెక్కువ. ఉ. భా. న పండితులును సామాన్యులు నైన వారి కృతు లెక్కువ. అందుచే వానిలో లక్షణచ్యుతి బహుళముగాఁ జూపట్టును. కొన్నిటఁ గేవల వ్యావహారిక భాషయే ప్రయుక్త మైనది. ఉ. భా. య. గా. లలోఁ బరిణామ పరిణాహ మధికము. నాటకీయ తయు నాంధ్ర జాతీయ జీవనప్రతి బింబనము నధికము.

19 శ. నాఁటి య. గా. లలో య. గా. సామాన్య ప్రక్రియ కపవాద ప్రాయ మైన ప్రక్రియ గలవి. + మృత్యుంజయ నిశ్శంక బహద్దరు, రఘు నాయకం రామానుజ సూరి, ధనకుధరం రామానుజా

---

+ Irregular or exceptional types.

చార్యులు, కాకరపర్తి నృసింహాకవి మొదలగు వారి కృతులు. (పేళ్ళు పూర్వోక్తములు.)

19. శ., పండితులైన య. గా. కవులు కొందఱు శివలెంక మల్లనారాధ్యులు, తరిగొండ వెంగమాంబ, చెళ్ళపిళ్ళ నరసకవి, మరింగంటి భట్టరు రామానుజ సూరి, ఏల్పూరి వెంకట కవి, పోడూరి వెంకటరాజు, నాదెళ్ళ పురుషోత్తము, మృత్యుంజయ నిశ్శంక బహద్దరు, త్వరకవి రామ కృష్ణయ్య, పురాణం పిచ్చయ మొదలగు వారు.

19. శ. బహు యక్ష గాన గ్రంథ కర్తలైన వారు కొందఱు:- తరిగొండ వెంగమాంబ, శీర్నాదం వెంకట రాయ కవి (లేపాక్షి నాటకాలు), యమ్మనూరి వెంకట సుబ్బకవి (వేములపల్లె నాటకాలు), యాదవదాసు, ఎల్లనూరి నరసింహ కవి, త్వరకవి రామ కృష్ణయ, పురాణం పిచ్చయ మొదలగు వారు.

19 - 20 శ. య. గా. మేళములు కొన్ని :- లేపాక్షి, వేములపల్లె తాడిపత్రి మేళములు (రాయల సీమ), పడకండ్ల స్వామి రాయ కవి, త్వరకవి రామ కృష్ణయగారి మేళములు (నెల్లూరు మండలము), ఘట్టు దేశపు వారి మేళము, భాగవతుల రంగయ్య గారి మేళము మొ॥. ఇందు పడ కండ్ల వారి మేళమున స్త్రీలును పాల్గొని నట్లు స్వామి రాయ కవి లక్షణా పరిణయ య. గా. నుండి తెలియు చున్నది. ( చూ. ద్వి భా., పుట 180 - 81)

ఈ 20 వ శతాబ్ది యందును రంగస్థల నాటకములు, సినిమాల విజృంభణమునఁ బ్రజాభి రుచులు మారి యక్ష గాన ప్రదర్శన ప్రతిష్ఠ లడుగంటినవి కాని గ్రంథ రచన సన్నగిలినను సాగుచునే వచ్చినది. 1947 లో మాడ అప్పలస్వామి అను నతఁడు రామదాసు

నాటకమను " యక్షగానము " ను రచించి యుండెను. (చూ. ద్వి. భా. పుట 243; పుటలు 244 - 46 కూడ జూడుడు). 1950 ప్రాంతమునఁ బల్నాటిలోఁ గొందఱు య. గా. కవు లుండినట్లు తెలియు చున్నది. (చూ. ద్వి. భా. పుట 247). అయితే మెట్టటో యిప్పటి మట్టునకు య. గా. రచన కొంత సాగినది కాని యిఁకపై సాగఁగల సూచనలు కన్పించుట లేదు.

20 శ. య. గా. ల గుఱించి యిది వఱకే ప్రసక్తాను ప్రసక్తముగఁ గొంత వచ్చినది. 20 శ. య. గా. రచన చాల వఱకు 19 శ. య. గా. పద్ధతినే పోలి యున్నది. 20 శ. య. గా. లందును ప్రాఁత పద్ధతి య. గా. లు గలవు. ఉదా :- ముదుంబై అలమేల్మంగ తాయారమ్మ సుల్తానీ కల్యాణము, భామ కలాపము, గొల్ల కలాపములును గలవు. (చూ. ద్వి. భా. పుట 216 - 17, 236). బొమ్మలాటకుఁ గూడఁ బనికివచ్చు నట్టి య. గా. గలదు. ఉదా :- సంతవేలూరు కుశలవ నాటకము. (చూ. ద్వి. భా. పుట 239). " మూడు రాత్రుల కథ" గా విభక్తమైన య. గా. గలదు. ఉదా :- కొండముది బంగారయ్య వృత్రాసుర మహారాజు నాటకము (ద్వి. భా. పు 228). యక్షగానము లని పేర్కొనఁ బడిన హరి కథలును గలవు. ఉదా :- నందివాడ జగన్నాథకవి, పసుమర్తి కృష్ణమూర్తి, నల్లమిల్లి బసివిరెడ్డి మొదలగు వారి కృతులు. ( చూ. ద్వి. భా. పుటలు 135,209,244). ఆధునిక నాటక ప్రభావము స్పష్టపడిన య.గా.లును గలవు. ఉదా :- మండూరి సుబ్బరాయకవి సత్యభామా కల్యాణము - " యక్షగాన కంపెని డ్రామా " (చూ. ద్వి. భా., పుట 223), బళ్ల రామరాజు శ్రీకృష్ణ లీలలు (చూ. ద్వి భా., పుట 242). నూత్నేతివృత్తములు గల య. గా. లును వెలసినవి. ఉదా :- గైనేడి వెంకటస్వామి ఏసునాథ కథామృతము, గోనుగుంట వీరబ్రహ్మము శివరాఘనాటకము,

శ్రీరాజా వేంకటాద్ర్యప్పారావు బహద్దర్ (ఉయ్యూరు జమీందారులు) వారి కాకతి రుద్రాంబకథ. య.గా. ప్రక్రియ కపవాదప్రాయమైనదొకటి కలదు. 1871-1951 సం.ల నడుమ నుండిన పురాణం పిచ్చయగారనేక య. గా. ప్రాయ రచనలు చేసియుండిరి. ఆయన తన కృతులను య.గా. లనియు, నాటకములనియు, య. గా. నాటకము లనియు వ్యవహరించెను. అందు నాటకమని పేర్కొనఁబడినను "అర్జున చరిత్ర" మనునది యొక అపవాదప్రాయరచన. అది ఆఖ్యానశైలీ ప్రచురమైనది. అందు హరికథలందువలె దోరాలు, జంగం కథ లందువలె రగడలును గలవు. "ఈ గ్రంథము జంగములు, దాసరులు మొదలగువారు గుమ్మెటలు వాయించుచు వేషములతో నాడుచు గ్రామములలోఁ గథను జెప్పి సంపాదనచేసి జీవించుట కనువుగా నుండునట్లు వ్రాయఁబడిన"దఁట. (చూ. ద్వి. భా. పుట 215).

ఇట్లాంధ్రదేశమున నది పుట్టినప్పటినుండి యిప్పటివఱకుఁగల యక్షగాన చరిత్రను సమీక్షించినచో నది యెత్తని యవతారము లేదనిపించును. ఇతరమైన యే సంగీత ప్రక్రియ విషయమునఁగాని యే సాహిత్య ప్రక్రియ విషయమునఁ గాని యింతటి పరిణతి యసాధారణము. అందులకు య.గా. ప్రక్రియయొక్క విశాలత్వము, బహుముఖ ప్రయోజనావకాశములే కారణములు. ఐనను యక్షగాన మొక దృశ్య ప్రక్రియగాఁ బరిణతమై ప్రచారమున నున్ననాఁడును దాని ప్రాక్తనమైన శ్రవ్యధర్మముగూడ నిరుగుపొరుగుగాఁ బొడసూపుచు వచ్చియుండుట విశేషము.

ఆంధ్రదేశమునుండియే యక్షగాన మటు తంజాపురాది దక్షిణ ప్రాంతములకును నిటు తెలంగాణమునకును విస్తరించినది. ఆయా ప్రాంతములందు దాని పరిణతి కొంత విలక్షణముగా సాగినది. అందు చేత నా విషయము లిందుఁ బ్రత్యేక ప్రకరణములైనవి.

# దక్షిణాంధ్ర యక్షగానము

ఒకనాఁడు విజయనగరధ్వజముక్రింద విఱ్ఱవీఁగిన ఆంధ్రసామ్రాజ్యరమ తమిళనాడు నడిబొడ్డునకుఁ దరలిపోవలసి వచ్చినది. క్రీ. శ. 1550 ప్రాంతమున తంజాపుర మధురా మండలములలో రాయసమ్రాట్టుల సామంతులగు నాయకరాజుల యాజమాన్యమున ఆంధ్రప్రభుత నెలకొన్నది. క్రీ. శ. 1565 లో జరిగిన "రక్షసతంగిడి" యుద్ధానంతర దుష్ఫలితము కారణముగా, రాయసంస్థానము నాశ్రయించుకొనియుండిన కవులు, పండితులు, కళాకారులును దక్షిణ దేశమునకు వలసలుదీసి, ఆంధ్రనాయక రాజాస్థానముల నాశ్రయింపఁ జొచ్చిరి. నిలుకడ కలిగిన కొలఁదికాలమున కక్కడను గ్రమక్రమముగా నాంధ్ర సాహిత్య విహంగము రెక్కలల్లార్చినది. యక్షగాన కళాలక్ష్మి గజ్జె కట్టినది. సమ్రాట్టులనాటి వైభవము సామంతుల నాశ్రయించినను నినుమడించినదే కాని తగ్గలేదు.

ఆంధ్రవాఙ్మయ చరిత్రమున దక్షిణాంధ్రయుగము కాల పరిమితిని బట్టి సుదీర్ఘము, కవితాపరిణతిని బట్టి కడు విలక్షణము నైనది. వాఙ్మయ ప్రక్రియా వైవిధ్యము, కళావతుల కవితాకేళి, రసిక శేఖరులైన రాజకవుల పరంపర, శృంగార రసాధిదేవతా రంగస్థలములు, లలితకళా ఫలభూములునగు వారి యాస్థానములు నా యుగ విశిష్టతలు. అట్టి దాక్షిణాత్యాంధ్ర సాహిత్యవాహినీ తీరమునందుఁ దీర్థభూతము లైన ఘట్టములు తంజావూరు, మధుర, మైసూరు, పుదుక్కోట మొదలగు సంస్థానములు. అందు తంజావూరి దొక

---

+ దక్షిణాంధ్ర యక్షగానముగూర్చి సక్రమ పరిశోధన ప్రారంభించిన గౌరవము డా. శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారిది. చూ. వారి "య. గా. తంజావూరు" అను వ్యాసము — ఆం. ప. ఖర సం. సంచిక.

ప్రత్యేకత. ఆయుగ విశిష్టత లన్నియు దాని నాశ్రయించినవి. ఆయా సంస్థానములన్నిట యక్షగానము వెలసిన జాడ కన్పట్టుచున్నను "తన్మహనీయస్థితి మూలమై" నిలిచినది తంజావూరు.

## తంజావూరు నాయక రాజులు—యక్షగానము

తంజావూరఁ బ్రవేశము కల్గినంతనే యక్షగానమునకు రాచ ప్రాపు కల్గినది. తద్రచనకు రాజహస్తావలంబనమే లభించినది. తంజావూరు నాయకరాజుల కోవకు నాయకమణియు వాఙ్మయవిషయమున దక్షిణాంధ్ర యుగమున కుదయార్కుఁడునగు రఘునాథ రాయలు (రాజ్యకాలము క్రీ. శ. 1600—1631) విజయ విలాసాది మహాప్రబంధములకుఁ గృతిభర్తయగుటయ కాక స్వయముగాఁ బ్రౌఢకృతు లనేకము రచించినవాఁడు. అతనికృతులలో శ్రీరుక్మిణీకృష్ణవివాహమను పాటి రెండు యక్షగానములు నుండినట్లు తెలియవచ్చుట విశేషము. కాని నేఁడవి లభించుటలేదు. రఘునాథుఁడు సంగీత నాట్యవిద్యా విశారదుఁడనియు నతని కాలమున నాటకశాలలు గలవనియు, నందుఁ దాఁను గీతాభినయ ప్రయోగములగు చుండుననియు నతని యాస్థాన కవయిత్రి రామభద్రాంబ రచించిన రఘునాథాభ్యుదయము+ వలనఁ దెలియుచున్నది. (చూ. సర్గలు 11-12). అతఁడు "ప్రాంచితయక్షగాన సత్పదాద్య పద్య ద్విపద ప్రపంచన" మును "పరీక్షించు" చుండు వాఁడనియు నందు గలదు. (11 వ సర్గ—27 శ్లో). అనఁగా 16శ. ప్రథమ పాదముననే య. గా. నకు రాజాదరము బాగుగాఁ గలిగినట్లే.

తదుపరి రఘునాథుని పుత్రుఁడైన విజయరాఘవ నాయకుని రాజ్యకాలము (1633—1673) యక్షగాన చరిత్రలో నొక స్వర్ణయుగమే

+ సంస్కృత గ్రంథము. మదరాసు విశ్వవిద్యాలయముచేఁ బ్రచురితము.

యైనది. అతఁ డతిమాత్ర గీతిసాహితీప్రీతి గలవాఁడు. నాట్యవిద్యా విదగ్ధుఁడు. తన యభిరుచుల కెల్లఁ దగినది యక్షగాన ప్రక్రియ యొక్కటే యని గుర్తించినాడు. తద్రచన కాస్థాన కవులను (ఒకకవయిత్రినిగూడ) మిగులఁ బ్రోత్సహించినాఁడు. తాను స్వయముగా ననేక యక్షగానము లను రచించినాఁడు. వానినిఁ దన కొలువు నట్టువ మేళముల వారిచే దఱచు ప్రయోగింపఁజేసి వినోదించెడివాఁడు. య. గా. రచనలోఁ బ్రయోగములోఁ గ్రొంగ్రొత్తమార్పు లవధరించి య. గా. చరిత్రలో నొక నవశక చతురాననుఁడై నిలిచినాఁడు. అతని య. గా. కృతు లలో నేఁడు మనకు లభించునవి యైదుమాత్రము. 1. కాళీయమర్దనము 2. రఘునాథాభ్యుదయము, 3. విప్రనారాయణ చరిత్రము 4. పూతనాహరణము, 5. ప్రహ్లాదచరిత్రము ననునవి. ఇందు 1, 4, 5 ప్రసిద్ధ పౌరాణికేతి వృత్తములు. 3 వది ప్రసిద్ధుఁడగు తొండరడిప్పొడి యాళ్వారు చరిత్రము. అయితే ప్రాచీనమగు దానిని సమకాలికముగాఁ జిత్రించుట విశేషము. రెండవది విజయరాఘవుని తండ్రియగు రఘునాథుని చరిత్ర మేయగుట విశేషము. ఇందు రఘునాథుని సభావైభవము, దినచర్య, చిత్రరేఖ యను కాంతతో నతని శృంగార కలాపమును విష యములు.

ప్రహ్లాద చరిత్రమునఁ దప్పఁ బ్రతి గ్రంథారంభముననుశ “భోజ కన్యా ముఖాంభోజ రాజ మరాళ” ఇత్యాది యగు నిష్టదేవతాస్తుతి పరమగు సీసమొకటి గలదు. తదుపరి రఘునాథ నాయకాభ్యుదయ ద్విపద కావ్య ప్రారంభమునందలి “శ్రీ రాజగోపాల చిరకీర్తిజాల”, “కలశాంబు నిధి కన్య కల్యాణ ధన్య” అను ద్విపదలు పూతనా హరణమునఁ దక్కఁ గడమ యన్నిటనున్నవి. సామాన్యముగాఁ బ్రతి

కృతియందు నిష్టదేవతాస్తుతికిఁ బిదప నొక వచనమున విజయ రాఘవ సంబుద్ధులు కొన్ని, యా వెనుకనే "స్వామివారు పాలింపించిన గ్రంథరాజమును నటన పటిమ గనుపించ వినుపించెదము విని సభ ధరించుండ"యని సూచక ప్రరోచన కనిపించును. ఇది ప్రవర్తకులచేఁ బఠింపఁబడుట కుద్దేశింపఁబడినట్లు తోఁచును. ఇట్టిదే "కైవార"మని రఘునాథాభ్యుదయ విప్రనారాయణ చరిత్రములందుఁ బేర్కొనఁ బడినది. ఇది మార్గరూపకములందుఁ గల నాందీ ప్రస్తావనలకొక్కింత యెనవచ్చు ననవచ్చును. తొలినాఁటి తెలుఁగు య. గా. లగు సుగ్రీవ విజయ విష్ణుమాయా విలాసాదులం దిష్టదేవతా స్తుతి నెంత నర్ధచంద్రికలలోనో యొక జంపెలోనో షష్ఠ్యంతములు నా వెంట "అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన....... .. యక్షగానంబునకుం గథాక్రమం బెట్టిదనిన"అని యుండును. షష్ఠ్యంత సంప్రదాయము తొలుత సంస్కృతిఁగలదు. మన వాఙ్మయమునఁ దొలు దొల్తగా నిది నన్నెచోడుని కుమార సంభవమునఁ గన్పట్టును. (నన్నయగారి భారతమున లేదు) పిదప నాంధ్ర కవు లందరు ముఖ్య ముగాఁ బ్రబంధకవు లా సంప్రదాయమును గ్రహించిరి. య. గా. కవి యగు విజయరాఘవుని కది నచ్చక దాని స్థానమున సూచకోచిత మైన కైవారమును బ్రవేశపెట్టినాఁడు. విజయరాఘవుని ప్రతికృత్యంత మును గవిప్రశంసాత్మకమగు నొక వచనము, మూఁడింట నొక శుభాశంసనమును గలవు. అదే "భరతవాక్యము" గాఁ బూతనా హారణమునఁ బేర్కొనఁబడినది. ఆ కైవారము, భరత వాక్యము నను వానినిఁ గొంత మార్గ సంప్రదాయానుసారము కవి యుద్దేశ పురస్సర ముగనే వ్రాసియుండును. కొన్నిటి ప్రతులలో నా మాటలు లోపించి యుండవచ్చును. కా. మ., పూ. హ., ప్ర. చ. - మూఁడును నాటక చాటుకావ్యములని కంఠోక్తిగాఁ జెప్పఁబడినవి. రఘునాథాభ్యు

దయము ప్రబంధమనియుఁ బేరొకొనఁబడినది. అందులకుఁ దగినట్లు నాయిక విరహవేదన, చెలికత్తెల శిశిరోపచారములు, రతిరాజ పూజ, చంద్రాద్యుపాలంభములు, చిలుక రాయబారము మొదలగు ప్రబంధ ప్రక్రియ చొప్పింపఁబడినది. అంతియకాక నాయకుఁడు సపరివారముగా స్వారి వెడలఁగాఁ బౌరకాంతలతనిఁ జూచుటయు సందొకతె మోహ పరవశ యగుటయుఁ దదుపరి నాయకునితో నామె రాయబారము, సమాగమము మొదలగు విషయములతో నిది ఉలా ప్రబంధపుఁ బోకడ కలిగియున్నది.[37] తొంబదియారు విధములగు తమిళ పబంధములలో "ఉలా" యొకటి.[38] తంజాపుర ప్రభువగు విజయ రాఘవుఁడా తమిళ ప్రబంధ ప్రక్రియను గ్రహించుటలో వింతలేదు.

రచనాప్రక్రియను బట్టి యతని కృతులను సమీక్షించినచో నొక క్రమపరిణతి కన్పించును. అతని కృతు లంతకంతకు గేయధర్మ మును దగ్గించుకొని రూపకకళ నెక్కువ సంతరించు కొన్నవి. కొన్నిటఁ గథాను సంధాయకములగు సంధి వచనములు, కవి వచనములను పేర సంధి ప్రయోజనోద్దిష్టములే యైన పద్యములును గలవు కాని కొన్నిట వీని యక్కఱ లేకుండగనే పాత్రలు ముఖాముఖి సంభాషించుట గలదు. ఆసంభాషణలు వచన ప్రచురముగాఁ బాత్రోచిత భాషలో సాగియుండుట గమనింపఁ దగినవి. (వి. నా. చ., పూ. హ., ప్ర. చ.). విజయ రాఘవుఁడు కావించిన మార్పులలో నిది యొకటి దొడ్డది. య. గా. ప్రయోగ యోగ్యతను ద్విగుణీకృత మొనర్చినట్టిది. అతఁడు కొన్నిటగ్రంథ మధ్యమున రంగప్రయోగ సూచనలును జేసియుండుట మఱియొక గొప్పవిశేషము.

---

37. ఇది మొదట గుర్తించినవారు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు. చూ. వారి రఘునాథాభ్యుదయ పీఠిక.

38. "ఉలా" లక్షణము వైద్యనాథదేశికుని "ఇలక్కణవిళక్క పాట్టి యల్" అను తమిళ లక్షణ గ్రంథమునఁ గలదు. సూత. — 97 - 102.

ఉదా:—1. "అవురా యీరీతిఁ జెలిచేతనున్న మాధుని జేకొని యశోద చెక్కిలినొక్క యక్కునఁ జేర్చి ముద్దాడి యొక్క దరువు బాడుచుఁ జక్కనికోప్పులు రహి కెక్కనటించె నట యెటువలెను"

2. "పోత్తులలో బాలుని యశోద యెత్తుకొని యప్పుడు తత్తదిగతోమని తగు కనతాళంబు పోత్తులు నటియించెను"

3. "కొంత సేపు తాను సివమాడి యంతట నిల్చేది"

4. "ఇక్కడ విధూషకుండు హాస్యపు మాటలాడేది"

5. "ఈ దరువాడి తీరుచున్నే హిరణ్యకశిపుని కళేబరం త్రోసి వేసేది" మొ...

6. "ప్రహ్లాదోఽహమభివాదయే", "మ్రొక్కేను మ్రొక్కేనయ్యా యయ్యా" — "మా యింటిలో సరిపోయేని చెప్పి మ్రొక్కేది" మొ... ఇట్టి సూచనలనుబట్టి ప్రహ్లాదచరిత్రాదులు పండిత పామర సామాజికు లుభయులకు నుద్దిష్టములైన వని తోఁచును. ప్రహ్లాదచరిత్ర చివర పాత్రల పట్టిక యొకటి గలదు. అందులోఁ గోతియు నొకటగుట విశేషము. విజయరాఘవుని కృతులన్నియుఁ బ్రదర్శనోద్దిష్టములైనవనియే తోఁచును గాని కాళీయమర్దనము నందా ఘట్టము, రఘునాథాభ్యుదయమునఁ జిలుకరాయబారము, ప్రహ్లాద చరిత్రలోఁ బాములు కోతి మొదలగునవి యానాఁడెట్లు ప్రదర్శింపఁబడి యుండునా యనునదొక సందేహము.

విజయ రాఘవాస్థానమున కవుల యక్షగాన రచనా ప్రక్రియ వి. రా. కృతులను బోలి యుండును. అందు రంగాజమ్మ మన్నారు దాస విలాసము, కోనేటి దీక్షిత చంద్రుని విజయ రాఘవకల్యాణము, కామరుసు వెంకట పతి సోమయాజి విజయరాఘవ చంద్రికా విహా

గము + సను వానిలో విజయ రాఘవ నాయకుని వివాహ శృంగార విహారాదిగములే యితి వృత్తము లగుట విశేషము. ఈ మూఁడింట నెఱుకలసాని వాలకము, గద్దె ఘట్టములు నుండుటయు విశేషములే. అవే యించుక పిదపకాలమున తంజావూరిలోనే కొరవంజి పేర వెలసిన య. గా. ప్రాయ రచన కవతారికా ప్రాయము లైనట్టివి. మ. దా. వి. నాటకమున తమిళ కన్నడ ప్రాకృత భాషా ప్రసంగములు విశేషములు. పురుషోత్తమ దీక్షితుఁడను మఱియొక ఆస్థాన కవి రచించిన తంజాపురాన్న దాన నాటకము సాంఘికేతి వృత్త మగుట విశేషములలో విశేషము. నాఁటి నాయక రాజుల సత్రమున కతిథియై వచ్చిన వెఱ్ఱిబాగుల బాపఁడొకఁడు నట్టువకత్తెలతో వెట్టి శృంగార ప్రసంగములు నెఱపుట యిందలి యితివృత్తము. ఇంతటి వచన ప్రచురమైన య. గా. రచన మఱిలేదు. పాత్రోచిత భాషలో సూటియగు సంభాషణలతోఁ జక్కని నాటకపు వాటముతో సాగిన రచన మిది. విజయరాఘవుని పుత్రుఁడగు మన్నారు దేవుఁడు గూడ హేమాబ్జ నాయికా (లక్ష్మీదేవి) స్వయంవర మను నొక చక్కని నాటకము రచించినాఁడు. ఇది పై నాటకముల ఫక్కి నడచినదే. దీనితో విజయ రాఘవ పాత్రకుఁ బ్రసక్తి గల య. గా. లు నాలుగు. అవి యతని యెదుటఁ బ్రదర్శితము లగు చుండినట్లు తెల్లము. మఱి యాతని పాత్ర నెవ్వ రే విధముగ నభినయించెడి వారో! అది యెట్లతనికిఁ బ్రియము గొల్పినదో! ఇట్లు చారిత్రకములు, తాత్కా

---

+ ఇందలి నాయిక నాయని వారి 'బైటి నాటక శాల పడుచు'. రాచనగరి లోఁగిటను నాటకశాలలుగలవు. కాని బైటి నాటకశాల పడుచులతోఁగూడ నతఁడు మధుర బాంధవ్యములు నిర్వహించి యా విషయమును బాహాటముగా నిట్టి చాటు కృతులలోఁ జాటించుకొనినాఁడనిన నాయని వారి నాటక కళాభిరుచి యెంతటిదో మఱి! ఇది 'నాటకచాటు కావ్య' మని కవిచేఁ బేర్కొనఁబడినది,

లికములు నగు విషయము లితి వృత్తము లగుట య. గా. చరిత్రలో మిక్కిలి యపూర్వము. అందు సమకాలీన జాతీయ జీవిత విశేషము లకు విశేష ప్రసక్తి గల్గుట మిక్కిలి యపురూపము. ప్రదర్శన వేళ విసుగు జనింప కుండ వానికి జనరంజకత్వము సాధించుటకో యన హాస్య చతురాస్యులగు నాకవు లాంధ్ర వాఙ్మయమున నెందును నిదివఱకు లేనంత హాస్యము నీ య. గా. లలోఁ బ్రవేశపెట్టిరి. వాని రచ నలోఁ దాళ ప్రధాన దేశీయ మధురకవితా రచనలకుఁ బ్రాచుర్యము తగ్గినది. ఆ నాఁడు దక్షిణదేశమంతట నతివేల ప్రచారము గాంచు చుండిన కర్ణాటక సంగీత పద్ధతి మూఁదలగా దరువులును, పదములును వెలసినవి. ఆ కవుల శృంగార పదరచనకు క్షేత్రయ పదములే యొజ్జబంతులైనవి. వారు శృంగార పదములనే కాక గొల్లపదాలు, చెంచుపదాలు, కొరవంజి దరువులు, సాంగత్య పదము, లక్ష్మీ కల్యాణము మొదలగు రచనా విశేషములను గూడఁ దమ య. గా. లందుఁ జొప్పించిరి. విజయరాఘవాస్థానమున యక్ష గానము ప్రవర్తితమైన భంగి యెట్టిదో తదాస్థానియుగు చెంగల్వ కాళకవి తన రాజగోపాల విలాసావతారికలో నిట్లు వ్రాక్రుచ్చి యున్నాఁడు :

"యక్షగానంబు రావణహస్త ముఖముకు
దండె మీటులు చెంగులు తాళములును
జోల సువ్వాల ధవళంబు లేల లమర
కొండఱతివలు వినిపించి రందముగను"

—రా. గో. వి. 1-24.

అనఁగా నది కతిపయ గాయనీజన ప్రవర్తితమగు సంగీత గోష్ఠి భంగి నుండెడిదని తెలియనగును. కాని విజయరాఘవాదుల కృతులను జూచినచో నవి సర్వోపభోగ్యమైన దేశి సరణికిఁ జెందిన

రూపక ప్రక్రియాడంబరము గల్గియున్నవని విశదమగును. అన్నియు నాటకములని పేర్కొనఁబడినవి. కొన్ని మహానాటకములనియుఁ బేర్కొనఁబడినవి. (వి. రా. క., తం. పు. దా.) అది వట్టి మాట వరుస. చాటుకావ్యములుగాఁ బరిగణింపఁబడినవి.+ కాని యందొక్కటియు మచ్చునకైన, మాటవరుసకైన యక్షగానమని పేర్కొనఁ బడలేదు. వానిధోరణి జూడ నానాఁడు యక్షగానము, వీధినాటకము నేకమైపోయినట్లు తోఁచును. వాని కలయిక విజయరాఘవుని చేతి మీఁదుగనే జరిగినదా యని యూఁ దోఁపకపోదు. నాఁటినుండి దక్షిణ దేశమున య. గా. కంటె నాటక శబ్దమునకే ప్రచార మధికమైనది.

17 శ. నడుమ నాయక రాజాశ్రయమునఁ గాక, దక్షిణద్వారక (మన్నారుగుడి – తంజావూరు మండలము) క్షేత్రస్వామి కంకితముగా నొక య. గా. ప్రాయరచన వెలసినది. అది చల్ల సూరయకవి వివేక విజయమనునది. ఇది కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయమున కొక మానసపుత్రిక. సూరయ తనకృతిని 'నాటకముగ, కూటనాటకాకలన' రచించితి నని యున్నాఁడు.

## తంజావూరు మహారాష్ట్రులు - యక్షగానము

క్రీ. శ. 1673 ప్రాంతమున తంజావూరిలో ఆంధ్ర నాయక రాజ్య మస్తమించినది. తదుపరి మహారాష్ట్ర ప్రభుత నెలకొన్నది.

+ ఈ పరిగణన సమంజసమైనదిగనే తోఁచును. శతకోదాహరణములను, గద్య, రగడ, ద్విపద, మంజరిదండకములనుగూడ చాటుప్రబంధములుగ పరిగణించినారు మన లాక్షణికులు. (అనంతుని ఛందము III. 62, కావ్యాలంకార చూడామణి. IV. 40, లక్షణసారసంగ్రహము II 128-140, అప్పకవీయము I. 30) యక్షగానమునందు శతకములందువలె పద్యములు, ఉదాహరణమునందలి కళికోత్కళికలవలె రగడ వికృతులగు రేకులు, గద్యము, ద్విపద, మంజరి, దండకము మొదలగువాని కన్నిటికిని ప్రసక్తి గలదు గదా!

ఆ మహారాష్ట్ర ప్రభువులును ప్రేయంపడి నాయకరాజులవలెనే నుం భాషా వాఙ్మయముల నాదరించుట చరిత్రలో నొక యపూర్వసన్ని వేశము.[39] వారు యక్షగానము నెడనే యెక్కువ మక్కువ గల వార గుట యింకొక విశేషము. వారు య. గా. కవుల నాదరించుటయ కాదు స్వయముగ ననేక య. గా. ప్రాయరచనలు ప్రచరించిరి. అట్టి వారిలో ప్రాతః స్మరణీయుఁడు శహాజీ. రసికతలో, లలిత కళాలాల సలో, యక్షగాన లోలతలో నొక్కమాటలోఁ జెప్పవలెననినఁ దనివి తీరని విజయరాఘవునకు మఱలఁ దనువెత్తెనా యని యనిపించు నట్టి వాఁడు. అతని రాజ్యకాలము (1684-1712) కూడ య. గా. చరిత్రలో నొకముఖ్యమైన యధ్యాయము.

శహాజీ పరఁ దదంకితములుగాఁ గాక తెలుఁగున ఇరువది య. గా. ప్రాయ రచనలు కన్పట్టుచున్నవి. అందుఁ బదునారు నాటకములుగను, నాలుగు ప్రబంధములుగను గ్రంథకర్తచేఁ బేర్కొనఁ బడినవి. నాటకము లన్నియు "ఉదారవేష భాషాభూషితము" లని పేర్కొనఁ బడినవి. అవి సంవాదశైలీక వచన ప్రచురములుగను, ప్రబంధములు [40] నృత్యానుకూల గీతిబంధప్రకృష్టములుగను నున్నవి. అవి యన్నియు నాఁడు ప్రదర్శింపఁబడినట్లు వానిలోఁగల సూత్రధార వచనములును, గొన్ని ప్రయోగసూచనలును విశదమొనర్చుచున్నవి.

ఆ గ్రంథములు సాధారణముగా జయేత్యాది యగు నొక "తోడియం" దరువుతోఁ బ్రారంభ మగును. స్తుత్యాదికము పిదప

39. (వివరములకు) చూ. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి "తంజావూరి మహారాష్ట్ర భూపతులు — ఆంధ్ర సాహిత్యము" అను వ్యాసము — భారతి., డిసెంబరు, 1953 జనవరి '54.

40. ప్రత్యేకముగా నీ ప్రబంధములఁ గూర్చిన సోదాహరణమైన వివరణకు చూ. "శహాజీ ప్రబంధములు" అను నా వ్యాసము — భారతి. జూలై, 1956.

నొక సూత్రధార వచనమున గ్రంథనామము, కర్తృనామ నిర్దేశము నాపై నొక ద్విపదలోఁ గథాసంగ్రహము చెప్పఁబడుటయుఁ గలవు. కథా సంగ్రహ ద్విపద ప్రబంధములందు మాత్రము గానరాదు. ముందే వినాయకస్తుతి యున్నను గథాసంగ్రహద్విపదకుఁ బిదప నతని యాగమన ప్రసక్తి యుండును. అనఁగాఁ బ్రదర్శనవేళ నొకబాలుఁ డెవఁడో వినాయక నేపథ్యముతో రంగమునఁ బ్రవేశపెట్టఁబడి ప్రదర్శన ప్రవర్తకులైన భాగవతులపూజ నందుకొని పోవుచుండు టాచారమై యుండును. ఆపిమ్మట "ఆస్థాన గోష్ఠి" యను కటికవాని వాలకము ప్రవేశ ప్రసంగము లుండును. అంతటఁ గథారంభము. గ్రంథాంతమున సాధారణముగా నొక ద్విపదలోఁగాని గద్యలోఁ గాని కృతి సమర్పణ ముండును. ఇది యీనాటి కృతుల సామాన్య స్వరూపము. శహాజీ కృతులందు వస్తువైవిధ్య మనల్పము. ఒండు రెండు తక్క + నన్నియుఁ బౌరాణికేతి వృత్తములు. కాని సమకాలిక విషయ స్పర్శతో నాతఁడు తీర్చిన తీర్పు ప్రౌఁజవి గలది. చతుర శృంగార హాస్యప్రసంగము లందు కొల్లలు. కాని వానిలో ననౌచిత్య మధికము. అన్నియుఁ బ్రదర్శనోద్దిష్టములును దత్సౌలభ్యము గలవియు నైనను యథాతథముగఁ బ్రదర్శనయోగ్యములు గావు. అందుల కందలి యనౌచిత్యమే కారణము. అదియుఁగాక "నవ్యనాటక" మని పేర్కొనఁబడిన యతని "జలక్రీడల" లో మొలబోడి యాడువారి ప్రసంగములున్న ఘట్టము నాతఁడెట్లు ప్రదర్శింప నెంచెనో దురూహము.

---

+ అతని "సతీదాన శూరము" న నొక శ్రోత్రియ బ్రాహ్మణుడొక మాదిగ యిగనాలిపై యిరువురి ప్రలాపములు ప్రధాన విషయము. తక్కినవి సీత, ద్రౌపది మొ. వారి కళ్యాణ కథలు, శౌద్రుళ ప్రసిద్ధ కథలును—

యక్షగాన చరిత్రలో శహాజీ కృతులఁగూర్చి యెన్నదగిన విశేషములు:- అవతారికలోని కథా సంగ్రహ ద్విపద, వినాయక పాత్రప్రవేశము, "ఆస్థాన సంతోషి" యను కటికమువాని నొక సాంప్రదాయిక హాస్యపాత్రగా రూపొందించుట, గ్రంథమున నడుగడుగునను బాత్రప్రవేశ సూచకములును గథానుసంధాయకములునగు సూత్రధార ప్రసంగములు, నెడ నెడఁ బ్రదర్శన ప్రవర్తకులైన భాగవతులు పాత్రలను బలుకరించుట మొదలగునవి. అతని ప్రబంధ రచనయు నొకగొప్ప విశేషమే. అందు త్యాగ వినోదచిత్ర ప్రబంధనాటకమను నది యైదంకములుగా విభాగింపఁబడినది. తంజావూరు (య. గా.) నాటకములలో అంకవిభాగము గనుపట్టుట కిదే మొదలు. ఇది యచ్చముగా మార్గరూపకానుకరణము. ఇంకను నందందుఁ గల యవతారికల తీరుగూడ మార్గనాటక నాందీ ప్రస్తావన సందర్భములను దలఁపించును కాని యీ యనుకరణము విజయరాఘవుని కాలముననే వచ్చినది. తంజావూరు (య. గా.) నాటకములలో సూత్రధార ప్రసక్తికిని శహాజీ కృతులే మొదటివి. కాని వీనిలో మార్గనాటక పద్ధతికి విరుద్ధముగా సూత్రధారుఁడు గ్రంథమధ్యమునఁ బ్రసంగించుట కాననగును. శహాజీ కృతులలో వచన ప్రచురముగా నాఁటి తంజాపురాంధ్రభాషా వ్యవహార ధోరణిలోఁ బాత్రల సంభాషణలు చకచక సాగి నాటకీయత వెల్లివిరిసినది. (త్యాగ వినోదచిత్ర ప్రబంధమునఁ గేవల సంస్కృతము, మరాటీ భాషయుఁ బ్రచురముగా వాడబడుట విశేషము). నాయకరాజుల నాటి య. గా. నాటకములే మహారాష్ట్రులకు మార్గదర్శకములైనను వారు క్రొంగ్రొత్త మార్పులను గూడఁ దెచ్చిపెట్టినారు. అందులకు శహాజీ కృతులే మొదటి నిదర్శనములు.

శహాజీ యాస్థానమును వాసు జేసిన కవి, నివర్తి శేషాచలపతి, బాలకవి సుబ్బన, దర్భా గిరిరాజు మొదలగు ఆంధ్రకవు లలంకరించి యుండిరి. ఈ కవులందఱును శహాజీ ప్రోత్సాహమున య. గా. ప్రాయ రచనలు గావించినవారే. వారి కృతులలో విజయ రాఘవా స్థానకవి కృతులవలె నాశ్రయదాత యగు రాజుగారి శృంగార విహారాదిక కథా ప్రధానములైనవే యెక్కువ. అందందు విజయ రాఘవాదులు ప్రవేశపెట్టిన "ఉలా" ప్రబంధ పద్ధతియుఁ బాటింపఁ బడినది. రచనా ప్రక్రియలో వానికిని శహాజీ కృతులకును జక్కని సామ్యము గలదు. రెండు మూఁడిటఁ గల విశేషములు మాత్ర మిట నుంటకింపఁబడును. శహరాజాస్థానమున వెలసిన య. గా. ప్రాయ రచన లన్నింటిలో గిరిరాజ కవి కృతమైన శాహేంద్ర చరిత్ర మొక్కటి మాత్రము యక్షగాన మని కవిచేఁ బేర్కొనఁబడినది. తంజావూరిలో ముందటితరములనుండియే యేతాదృగ్రచనలకు యక్ష గానమను వ్యవహారము పోయి చాటుకావ్యములు నాటకములు నను వ్యవహారము స్థిరపడియుండ గిరిరాజు మఱల పూర్వ వ్యవహారమును స్మరించి యుండుట గమనింపఁదగినది. అందులకుఁ దగినట్లుగా గిరి రాజు పూర్వ యక్షగానములవలెనే తన యీ కృతిని తాళ ప్రధా నము లగు దరువుల నిండుదనముతో నిర్మించియుండుట విశేషము. (ఇందు 'ఉలా' ప్రబంధపు జాతగడయు నున్నది). ఇతని కృతులలో విశిష్టమైన దింకొకటి రాజమోహనకొరవంజి. ఇది యక్షగానప్రాయ మైన రచనయే. కొరవంజి* యనఁగా నెఱుకత-తత్పాత్రవిశిష్టమైనదీ రచన. కొరవంజి పాత్రకుఁ బ్రసక్తిగల యక్షగాన ప్రాయ రచనలువిజయ రాఘవుని తరముననే బయల్వెడలినవి కాని యీ పాత్రకుఁ బ్రాము

* కొరవంజి చరిత్ర పూర్వోక్తము. చూ. యక్షగానోత్పత్తి విచార ప్రకరణము — పుటలు 31 — 47.

ఖ్యముగలిగి ప్రత్యేకముగా నా పేరితో వ్యవహరింపఁబడిన గానిలో నీ రాజమోహన కొరవంజియే మొదటిదిగాఁ దోఁచును. కొరవంజు లలోఁ బ్రాయికముగా విప్రలంభ యైన నాయిక కామె ప్రియసమాగ మము గూర్చి కొరవంజి సోదె చెప్పుట ప్రధాన విషయముగా నుండును. అందు కొరవంజి వేషభాషలు, కులాచారములు, కొరవంజి తిరిగిన దేశములు, కొలిచిన దేవతలు మొదలగు విషయములు వర్ణితము లగును. గిరిరాజు కొరవంజి యీ లక్షణము లన్నియుఁ గలిగి యున్నది. + బాలకవి పుట్టన పంచ కన్యా పరిణయమున "ప్రసంగి" (ప్రదర్శన వేళ సంధి వచనములు, వర్ణనాత్మక ద్విపదలు పఠించు వాఁడు) కేతి నాయని (కటికము)తోఁ దాను "దశావతారా లాడే భాగవతుఁడ" ననును. కన్నడమున యక్షగానమునకు "దశావతారద-ఆట" అనియుఁ బేరు [41]. అది మొదట విష్ణువు యొక్క దశావతార కథ లితివృత్తముగాఁ గల య. గా. లకుఁ బేరై (ప్రాచుర్యము వలన) క్రమ క్రమముగా య. గా. సామాన్యవాచియు నైనట్లు తోఁచును. (అనఁగా కన్నడమున నప్పటికేఁ గొన్ని య. గా. లు వెలసినజాడ తోఁచును. శహాజీ ఆస్థానముననే తమిళమునఁగూడ గొన్ని య.గా. లు వెలసినవి. [42]. శహాజీ యనుజుఁడగు శరభోజి రాజ్యకాలమున (1712 - 28) నతఁడు నాయకుఁడుగా గిరిరాజు రచించిన లీలావతీ కల్యాణ మొక్కటే కానవచ్చుచున్నది. తదుపరి తంజాపుర ప్రభువైన

---

+ ఆ కాలమునను బిదప కాలమునను తమిళ కన్నడాది వివిధ భాషలలో నిట్టి కొరవంజు లనేకము వెలసినవి. అందందుఁ గొన్ని వేదాంత విషయికములు, దేవతలు కొరవంజులైనవి, యక్షగానములని పేర్కొనఁ బడినవియుఁ గలవు.

41. "Yakshagana In Karnataka"–Madras University A. O. R. VOl. X – Part II.

42. "Maratha Rajas of Tanjore" By K. R. Subrahmanyan., P. 29 – 30

తుళజరాజు (1728-36) స్వయముగ శివకామ సుందరీ పరిణయము, రాజరంజన విద్యా విలాసము సను రెండు య. గా. నాటకములను రచించెను. రెండిట నాంది, సూత్రధార పారిపార్శ్వకులచేఁ బ్రవర్తిత మైన ప్రస్తావన, వసంతర్తు కీర్తనమునుగలవు. సూచ్యార్థసూచనగాఁ బాత్రలను బ్రవేశపెట్టుటయుఁ గలదు. ఇది యంతయు నచ్చముగా మార్గ రూపక ప్రక్రియానుకరణము. శహాజీ కృతులందువలె నడుమను సూత్రధార వచనములు, భాగవతులు పాత్రలను బల్కరించు టయుఁ గలదు. కాని అంక విభాగాది విశేషములు లేవు. ఇతని రాజ రంజన విద్యా విలాసము సాంకేతిక వివేచన గల తాత్త్విక విషయ మిశ్రిన్మత్తముగాఁ గలది. (చల్ల సూరయ వివేకవిజయమును వలె దీనినిగూడ ప్రబోధచంద్రోదయమున కొక మానసపుత్రికగా గ్రహింపవచ్చును). 1736-37 సం. లలో తంజావూరు నేలిన రెండవ ఏకోజీ రచించిన విఘ్నేశ్వర పరిణయమున నాంది, పారిపార్శ్వకుఁడు లేని ప్రస్తావనయుఁ దఱచు సూత్రధార వచనములును గలవు. రెండవ తుళజరాజు (1765-87) చే సన్మానితుఁడైన ఆలూరి కుప్పనార్యుఁడు పార్థసారథి విజయ మను పేర భాగవత దశమస్కంధము నంతటిని "యక్షగాన ప్రబంధ" రూపమున రచించెను. మన యక్షగానము లందింతటి బృహద్గ్రంథము మఱి లేదు. ఇది ఆఖ్యాన వర్ణనాత్మక శైలీ ప్రచురముగా రచింపఁ బడినది. ఇది కేవల శ్రవ్యకావ్యమే. దీనినిబట్టి య. గా. రూపక ప్రతిష్ఠ స్థిరపడిన కాలమునందును బ్రదర్శనోద్దిష్టములుగాని య. గా. లును బయల్వె డలిన వని చెప్పవలెను. కుప్పనార్యుడీ కృతి రచనా కాలమునాఁటికి తంజాపురాస్థానమును బ్రవేశింపలేదేమో యనిపించును. 1787-98సం. నడుమనుండిన అమరసింహ భూపతి కంకితముగా మాతృభూతకవి రచించిన పారిజాతాపహరణ నాటక మెదంకములుగా విభాగింపఁబడి

నది. అందంతమాత్రమే పూర్వనాటకానుకరణము. తక్కినదంతయు యక్షగానపు "బాణీ" యే. ఇందు కొంత కన్నడ మహారాష్ట్రభాషా ప్రసంగము లుండుట విశేషము. తంజావూరి మహారాష్ట్ర ప్రభువులలోఁ జిట్టచివరి వాఁడగు శివాజీ (1833–55) కొలువున వెంకటకృష్ణాజెట్టి యను కవి శివపారిజాతమను నొక య. గా. రచన చేసియుండెను. శివాజీయే స్వయముగా అన్నపూర్ణా పరిణయమను నొక య. గా. నాటకమును రచించినాఁడు. దక్షిణాంధ్ర యక్షగాన రచనాప్రక్రియ పరిణామచరిత్రలో నిది తుది యంతస్తును సూచించును. ఇందు నాంది, సూత్రధార పారిపార్శ్వక ప్రవర్తితమైన ప్రస్తావన, వసంత ప్రసక్తి, అంక విభాగము (ద్విధా), చివర భరతవాక్యప్రాయమైన రంగనాథ కవీశ్వరుని (శివాజీ ఆస్థానకవి కాఁబోలు) యాశీర్వాదమును గలవు. ఈవిషయములు ముందునాఁటి తంజావూరు నాటకములలోకంటె నిందెక్కువగా మార్గనాటక ప్రభావమును బ్రస్ఫుట మొనర్చుచున్నవి. కాని తక్కిన తంజావూరి నాటకముల వలెనే యిందును సూత్రధార ప్రసంగములు గ్రంథ మధ్యమునఁ గన్పట్టును. ఇది మాత్రము మార్గ నాటకసంప్రదాయముకాదు. అందును నీగ్రంథమంతయు సూత్రధారుని ప్రలాపము వలెనున్నది కాని నాట్యకథాకలాప మిందంతగాలేదు. అయి నను నిది ప్రదర్శనోద్దిష్టమైనదే. ఏలన "రంగభూమియందు నటింపఁ జేస్తున్నాము" అని దీని యెత్తుగడ. ఇందును గ్రంథాదిని విఘ్నేశ్వర పాత్ర 'ప్రత్యేకంబుగా' ప్రవేశపెట్టఁబడినది. గ్రంథాంతమున నీ 'నాటకం వేషాల నావనీసు' (పట్టిక) యున్నది. "నగరిలో ఉండే భాగవత మేళం సబనీసు (నాయకుఁడు?) దగ్గర" ఈగ్రంథమూలప్రతి యుండినది. ఆ "నావనీసు" లో నిందువచ్చు పాత్రలు, ఆనాఁడది ప్రదర్శింపఁ బడి నప్పు డాయాపాత్రలు ధరించిన వారి పేళ్ళును గలవు. ఈ గ్రంథప్రతి "జయ" సం. నను, నావనీసు మన్మథ – ఆవణినెలయందును దయా

వైనవి. అవి శివాజీ రాజ్యకాలమున 1834-35 సం. అగుచున్నవి. అనఁగా నిది 1835 లోఁ బ్రదర్శింపఁబడియుండె ననుట నిశ్చయము. అంతేకాక యీమహారాష్ట్రప్రభువు లాంధ్రయక్షగాన కవులనేకాక భాగవత మేళములనుగూడఁ బోషించుచుండిరనియు, నాఁడు తంజావూరు రాజప్రజానురంజక నాటక ప్రదర్శనములతో నిత్యకల్యాణము పచ్చతోరణమునై విరాజిల్లుచుండెడి దనియుఁ దెలియనగును.

ఆ మహారాష్ట్ర ప్రభువుల కాలమున తంజావూరు మండలమున రాజాశ్రయము నపేక్షింపని పండిత కవులును కొందఱు య. గా. ప్రాయ రచనలు గొన్ని చేసియుండిరి. ఉదా :-(1) క్రీ. శ. 1700 ప్రాంతమున మెలట్టూరులో నుండిన శ్రీ నారాయణ తీర్థులు రచించిన పారిజాతాపహరణము. శహాజీప్రభృతుల కృతులందువలె నిందు కటికవాని పాత్రకుఁ బసక్తి గలదు. ఇది ప్రదర్శింపఁ బడి నట్లును వినికిడి. సుప్రసిద్ధమైన శ్రీకృష్ణలీలా తరంగిణివంటి గేయ ప్రబంధమును సంస్కృతమున రచించిన తీర్థపాదునివంటి శిష్టుఁ డిట్టి యక్షగానప్రాయరచన చేసియుండుట విశేషమే. అసలు "దేశ్యమైన యక్షగానాలను కొంత అనుకరించి నారాయణతీర్థులు కృష్ణలీలా తరంగిణి నిర్మించి" నాఁడని శ్రీ ఉమాకాంత విద్యాశేఖరు లని యున్నారు.[43] (2) మెరట్టూరు వెంకట రామశాస్త్రి (1800 ప్రాంతము) ప్రహ్లాదచరిత్ర, ఉషాపరిణయము మొ..... వీనిని మెలట్టూరు భాగవత మేళనాటకము లందురు. ఇటీవల పండితులచే నృత్యనాటకము లనియు వ్యవహృతము లగుచున్నవి. గ్రంథరచనా ప్రకియ శహాజీ ప్రభృతుల కృతిప్రక్రియనే చాలవఱకుఁ బోలియున్నది. కాని ప్రదర్శన ప్రక్రియలో కూచిపూడి భాగవతుల ప్రదర్శనముల వలె

43. చూ. వారి పల్నాటి వీరచరిత్ర ద్వితీయ భూమిక — పుట 38.

నృత్యప్రధానములై విశిష్ట శిష్టసంప్రదాయ పటిష్ఠములై యుండును. మలయాళ దేశపు కథకళిఫక్కియు నిందుఁ గొంత గలదు. ( ఈవిషయము స్థలాంతరమునఁ బ్రసక్తము ). ఇందుఁ గొన్ని యీనాఁడును తంజావూరు చుట్టుపట్ల మెలట్టూరు, శూలమంగళము, ఊత్తుక్కాడు మొదలగు నగ్రహారములలో దేవాలయ ప్రాంగణములలో బ్రాహ్మణ భాగవతులచే సంప్రదాయ బద్ధముగా నేటిటఁ బ్రదర్శింపఁబడుచున్నవి. (3) క్రీ. శ. 1759 - 1847 నడుమ తిరువయ్యార నుండిన ప్రసిద్ధ వాగ్గేయకారుఁడగు త్యాగరాజస్వామి నౌకాచరిత్రము ప్రహ్లాద భక్తి విజయము, సీతారామ విజయమునను య. గా. ప్రాయ రచనలు చేసి యుండెను. ఇందు మొదటిది ప్రదర్శన సౌలభ్యము లేనిది. రెండవది నాటకమని పేర్కొనఁబడి, యైదంకములుగా విభాగింపఁబడి మహారాష్ట్రుల తెలుఁగు నాటకములందలి మార్గఫక్కిని బ్రదర్శనోద్దిష్టమైనట్లు గన్పట్టుచున్నను దాని కథావిష్కరణము పెను విలక్షణమై ప్రదర్శనలో రక్తికట్టునదిగా లేదు. మూఁడవది మాత్రము ప్రదర్శన కెక్కినట్లు వినికలి.

## ఇతర ప్రాంతముల యక్షగానములు

17 శ., ఉ. భా. నుండి కన్నడ విషయమునను గొన్ని తెలుఁగు యక్షగానములు వెలయుట విశేషము. 1658 - 78 నడుమ మైసూరు మండలమున శివసముద్ర ప్రాంతమున కేలికయైన పెదకెంప రాయఁడు ( రెండవ హిరియ కెంప గౌడ ) గంగా గౌరీ విలాసమను య. గా. ను రచించెను. 1672 - 1704 నడుమ మైసూరి యొడయఁడగు చిక దేవ రాయని కంకితముగా, నతఁడే కథానాయకుఁడుగా చిక దేవ రాయవిలాస మను యక్షగానము వెలసినది. అది "ఉలా"

ప్రబంధ ప్రక్రియ గలిగి విజయరాఘవాంకితములైన తంజావూరి యక్షగానములకుఁ దలఁపించుచున్నది. చిక్కదేవరాయల తనయుఁడును, తదుపరి మైసూరి పరిపాలకుఁడు నగు కంఠీరవ నరసరాజు (1704 - 13) రసికతలోఁ గళాకుశలతలో శహాజీ విజయరాఘవుల కోవకుఁ జెందునట్టి వాఁడు. తెలుఁగు కన్నడ తమిళ ప్రాకృత భాషలలో "కొరవంజి" దృశ్య కావ్య రచనము గావించిన తొలితరము కవులలో నొకఁడుగా నెంచఁదగినవాఁడు. తెనుఁగున నొక కొరవంజి కాక మఱి యేఁడు య. గా. ప్రాయరచనలు గావించియున్నాఁడు. అందాఱు 'విలాస' శబ్దాంతములు. అందు వసంతోత్సవ విలాసము, విభక్తికాంతావిలాసము నను వానిలో నటీ సూత్రధారుల పూర్వరంగ ప్రస్తావనలు, అష్టదిక్పాలక విలాసమునందాఁ బాత్రల ప్రవేశ సూచనలు, యవనికాంతర నిర్గమన ప్రసక్తియుఁ గలవు. అన్నియుఁ బ్రదర్శనోద్దిష్టములే యనిపించును. కాని యన్నియు "పదచాళిక"+ల వంటివి. స్త్రీప్రాయములు, కైశికీ వృత్తి పేశలములు. అన్నిటను రాజ ప్రశంసలు, నాట్య సంగీత శృంగార ప్రసంగములే ప్రధాన విషయములుగాని యెందును నొక విస్తృతమైన కథ గాని, విశిష్టమైన సన్నివేశముగాని లేవు. అవి నాఁడు కంఠీరవరాయ సముఖమున నగరి నట్టువకత్తెలచేఁ బ్రయోగింపఁ బడినట్లు తోఁచును. ఆ యూహకుపాధి గలదు. నగరి బిరుదుపాత్రల ప్రసక్తి గలదు. కొన్ని యేకపాత్ర ప్రయోజన భాజనములుగాఁ గన్పట్టును. (ఉదా :- నాట్య

---

\+ "అభినయంబుల కోపు లరుదైన తీరుపుల్
తెలియఁగా "పదచాళి" విధ మొకర్తు ..."
— కంకంటి పాపరాజు ఉత్తర రామాయణము — VI. 139.

విద్యా విలాసము). ఇవి రచనలో య. గా. ప్రాయములైనవే కాని ప్రదర్శనలో నాటకాలికా ప్రాయము లనుటయు లెస్స.

మధురలో 1706-1732 నడుమ విజయరంగ చొక్కనాథ నాయకుని "సభార్హముగా" "నర్తనయోగ్యము" గా వెలసిన దొక్క యక్షగానము. అది తిరుమలకవి తిల్లగోవింద రాజ నాటకము లేక చిత్రకూటమహాత్మ్య మనునది. ఇది చిదంబర స్థల పురాణగాథ నితివృత్తముగాఁ గలది. ఇది నాల్గుదినముల "సంవిధానము" గా విభజింపఁబడినది. చతుర్దిన ప్రదర్శనోద్దిష్టమా యని పించును గాని గ్రంథ ప్రమాణ మల్పము. ప్రదర్శన కొక్క రాత్రి చాలు. ఆవిభాగము కథాకాలమునకే కాని ప్రదర్శన కాలమునకు సంబంధించినదైనట్లు తోఁపదు. ఆ సంవిధానవిభాగము నంక సంకాశ మైనదిగా గ్రహించుట లెస్స. ఇందు వచనమునఁ బాత్రల సంభాషణ లును, ఇదు "స్వామి వాక్యం" ఇత్యాదిగాఁ సంస్కృత వచనములును గలవు. సంధివచనములు ప్రసంగము లను పేర వ్యవహరింపఁ బడినవి. కథా సంవిధాన చతుర్థావిభాగము, గీతప్రవృత్తము, కైశికీ వృత్తి, స్త్రీ ప్రాయత్వము గలిగి యుండుటను దీని నాటికాలక్షణము (సంస్కృతము చూ. సాహిత్యదర్పణము) గొంత పట్టిన దనవచ్చును. అది "వగ కోపులనైపు లమర...ఇంచు బోణులు నటియించు" నట్టిదని కవియుప తారికలోఁ గైవారమునఁ జెప్పియున్నాడు.

1712 సం. ప్రాంతమున సేలమండలమున అన్నదానము వెంకటాంబ యను కవయిత్రి రామాయణ బాలకాండమును యక్ష గానముగా రచించినది. అది స్త్రీలు పాడుకొనుటకు మాత్రమే యుద్దే శింపఁ బడినట్టిది. 1767-70 ప్రాంతమున మైసూరు మండల మందలి శృంగేరి మఠమునకుఁ జెందిన య. గా. కృతి యొక్కటి కానవచ్చు

చున్నది. అది సిన్న బయలాచార్యుని గుడుగూచి చరిత్ర. 1769-89సం. నడుమ పుదుక్కోట కోటిరాయ రఘునాథ తొండమాన్ ఆస్థానమున నొక యక్షగానము వెలసినది. అది నుదురుపాటి వెంకన పార్వతీ కల్యాణము. ఇది ప్రదర్శనకెక్కినదని తెలియవచ్చుచున్నది. ఈపై మూఁడిటను రచన ఆంధ్ర దేశ య. గా. ప్రక్రియకు సన్నిహితముగా నున్నది. 19 శతాబ్ది నడుమఁగూడ దక్షిణ దేశమునఁ దెనుఁగు య. గా. రచన సాగుచు వచ్చినది. ఉదా:- 1. ఎల్లయకవి (సేలము. 1845 ప్రాంతము) చంద్రతారా విలాసము - ఆనాఁటి ఆంధ్ర దేశ య. గా. ఫక్కినున్నది రచన 2. మారుపెద్ది చెంగల్వరాయశాస్త్రి (చెంగల్పట్టు 1866 ప్రాంతము) సుందరేశ్వర విలాసము—ఆనాఁటి ఆంధ్ర దేశ య. గా, ధోరణియే యెక్కువ. 3. చల్ల నారాయణకవి(చెంగల్పట్టు—19శ. పూ. భా. కావచ్చు) పారిజాతము—భామకలాపము, ప్రబంధఫక్కికలు గలది. 4. నెడాదూరు వెంకటాచార్యుఁడు (తిరుచునాపల్లి—19శ., ఉ. భా. కావచ్చు) సమగ్ర రామనాటకము — పురాణ గోష్ఠికిఁ దగి యున్నది. (వివరములకు ద్వి. భా. చూడఁదగును).

## పర్యాలోకనము

స్థూలముగాఁ జూచినచో యక్షగాన పరిణామ చరిత్రలో దక్షిణాంధ్ర యుగమునఁ బొడకట్టు విశేషములు :-

యక్షగానము వీథినాటకముతో నేకమై, నాటక నామకరణము చేయించుకొని, మార్గనాటక ప్రభావము నభిసరించి క్రమపరిణతమై, సూటిగా వచన ప్రచురముగానున్న పాత్రల సంభాషణలతో, రంగ ప్రయోగ సూచనలతో నాటకీయత వెల్లివిరిసి యొక సమగ్ర రూపక ప్రక్రియగాఁ బరిఢవిల్లినది. (ఈయుగమునఁ గేవల శ్రవ్యధోరణిలో

సాగిన వొండు రెండు లేకపోలేదు. అవి అపవాదములు) రాజకవి లేఖినీ ముఖోదీరితమునై రాజసభాంగణ పురస్కారము గాంచినది. తాత్కాలికములగు రాజసంబంధేతి వృత్తములకు నాశ్రయ మైనది. అయ్యు సమకాలిక జాతీయజీవన ప్రతిబింబన మనేకధా సవదరించినది, సాహిత్యము లోకవృత్తప్రదర్శకమను నాభాణకమునకు సాక్షిభూత ముగా నిల్చినది. శృంగారహాస్యరసములను వెల్లిగొల్పినది. "ఆస్థాన సంతోషి" (Court-foll) అని క్రొత్తగా నొకహాస్య పాత్రను సాంప్ర దాయికముగా రూపొందించినది. క్రొత్తగా తమిళ "ఉలా" ప్రబంధపుఁ బోకడను, "కొరవంజి" దృశ్య రచనను మన వాఙ్మయమున కుఁ బరిచయము చేసినది. అందందు తమిళ కన్నడ ప్రాకృత మహారాష్ట్రాది పరభాషాపరిచయమును బ్రాసంగికముగాఁ బ్రదర్శించి నది. సంస్కృత కేవలములగు శ్లోకములు చూర్ణికలతోఁ గూడ రాణించినది. భాషాప్రయోగమునఁ బాత్రోచితముగా దక్షిణదేశపుఁ దెనుఁగువాడుక నుడికారపు దీరు ప్రకటించినది. ప్రసిద్ధకర్ణాటక రాగ తాళములలో దరువులు, పదములు, ద్విపదలు, జాత్యుపజాతి వృత్త ములు, సంధివచనములు, సంభాషణ వచనములును బ్రాయికముగా నానాఁటి యక్షగానము లన్నిటికిని సమానమే. అందు ప్రాచీనాంధ్ర యక్షగానము లందు మిగులఁ బ్రాముఖ్యము వహించిన రేకులకు నూటికిఁ దొంబదిపాళ్ళును, తదితర దేశీయ మధురకవితారీతులకు నూఁటి కేఁబదిపాళ్ళును వాడుకతగ్గినది. 1800 ప్రాంతమునుండి అర్ధపద్యము లకుఁ (కందార్ధములు, సీస, గీత ద్విపద, వృత్తార్ధములకు) గ్రమ క్రమ ముగాఁ బ్రాచుర్యము హెచ్చినది. అందందు మంజరి, (మంజరి ద్విపద కాదు), వెండిరేకు, వెన్నెల పదము, మయూరగతి రగడ, ప్రాసవచ నము మొదలగు రచనా విశేషములును బొడసూపక పోలేదు.

దక్షిణాంధ్రయుగమున యక్షగాన మతివేగ మధికపరిణతి నంది విస్మయావహమైన విస్తృతిఁబొంది సర్వోపభోగ్యమైన నాట్యసంగీత సాహిత్య సమాహార కళాస్వరూపముగా విరాజిల్లినది. కాని యట దాని మార్పులన్నిటఁ గ్రమోన్మిషితమైవచ్చిన ప్రధానమైన మార్పు మార్గనాటక ప్రభావముగదా. అందుచే యక్షగాన ముత్పత్తిలో దేశియైనను బరిణామమున మార్గియైనదని చెప్పవలసి యున్నది. *

---

* ఇటఁ జివరగా నొకమాట. ఈ దక్షిణాంధ్రవాఙ్మయమునకుఁ జెందిన రంగాజమ్మ మన్నారుదాస విలాస నాటకము ముఖపత్రముపై 'ప్రాకృతనాటకము – యక్షగానము' అని యున్నది. అందు ప్రాకృతభాషాప్రసంగములున్నవి (తమిళ కన్నడ ప్రసంగములతోపాటు) కాని గ్రంథము ప్రధానముగా తెలుఁగుది. పోనీ ప్రాకృతభాషానాటకపు బాణీలోఁగాని నడచినదా యనుకొందమన్నఁ బ్రత్యేక ముగాఁ బ్రాకృతమున నాటకములున్న జాడ గానరాదు. ఆ గ్రంథము పీఠికలో కీ. శే. జయంతి రామయ్యపంతులుగా రిట్లు వ్రాయుచ్చియున్నారు :

'సరస్వతీ సరస్వతీ మహాలులో 'ప్రాకృత తెలుఁగు లిపి నాటకాలు' అను శీర్షిక క్రింద 247 గ్రంథము లుదాహరింపఁబడినవి. (అన్నియు నిపు డుపలబ్ధములగుట లేదు) వీనిలోఁ బెక్కులు తెలుఁగునాటకములే. ... రఘునాథాభ్యుదయము, విజయ రాఘవచంద్రికా విహారము, విజయరాఘవ కళ్యాణము మొ॥ ... సంస్కృత నాటకములఁబోలిన పద్యగద్యాత్మికాంధ్రనాటకము లిటీవల వెలసినవి కాని పూర్వము తెలుఁగు నాటకము లన్నియు యక్షగానరూపములుగానే యున్నవి. ఈదేశమందుఁ బూర్వకాలమునఁ బ్రదర్శింపఁబడుచుండిన పారిజాతాపహరణ నాటకము, ప్రహ్లాదనాటకము మొదలైన వీథినాటకములిట్టివే. తంజావూరి నాటక ములు గూడ నీ రీతివే.'

# తెలంగాణము

## యక్షగానము

క్రీ. శ. 18వ శతాబ్ది ఉత్తరభాగమునుండి తెలంగాణమునందు యక్షగానరచన సాగుచుండినట్లు తెలియుచున్నది. 1780 ప్రాంతమున వెలసిన శేషాచలకవి ధర్మపురి రామాయణము, రాపాక శ్రీరామకవి అధ్యాత్మరామాయణమును ఇప్పటికిఁ దెలిసినంతలో తెలంగాణమున మొదటి య. గా. లు. అందు ధర్మపురి రామాయణ మాంధ్రదేశమునను విశేష ప్రసిద్ధిగాంచినది. ఇందు షట్కాండలును గలవు. రచన యెక్కువగా ద్రవ్యనారణిని సాగినది. కాని యిది ప్రదర్శనల కెక్కినట్లు వినికిడి. అయితే యథాతథముగా ప్రదర్శింపఁ బడినట్లు గానరాదు. ఆంధ్రదేశరామాయణ వీధినాటక పదర్శనములం దిందలి దరువులు తఱచు గ్రహింపఁబడుట కద్దు. 1800 సం. ప్రాంతమున వెలసిన వీరశైవ యక్షగానము లొక రెండు లభించుచున్నవి. అవి కానూరి వీరభద్రకవి బసవమహిమామృతవిలాసము, చెల్వూరు సన్యాసికవి బసవకల్యాణము ననునవి. రెండును గొంత ప్రదర్శనోచితములుగనే తోఁచును.

19 శ. పూర్వభాగమునఁ గొలది యక్షగానములు వెలసినట్లు తెలియుచున్నది. కాని గ్రంథములు లభించుటలేదు. ఉ. భా. న య. గా. కవులకుఁ గొంత ప్రోత్సాహము లభించినది. అప్పటి య. గా. లు బాగుగాఁ బ్రదర్శన కెక్కినట్లును తెలియుచున్నది. ఆత్మకూరు సంస్థానాధీశుఁడు ముక్కర సీతారామ భూపాలున (1851–1905) కాశ్రితుఁడైన రామదాసకవి తారాశశాంకము, భీమసేన విలాసము నను య. గా. లను రచించినాఁడు. రెండిట "సభాకైవారము" స్తూత్ర

ధారియించు పాత్రలను ననుకరించుటయుఁ గలవు. ఆకాలమున వెలసిన తిరుమనగరు పాపకవి కృతియందును నవికలవు. ఎడచర్ల దేశపాండ్యా పట్వారీల ప్రోత్సాహమున గోవర్ధనం వెంకట నరసింహాచార్యులను నాయన అజామిళోపాఖ్యానము నాంధ్ర దేశ య. గా. ఫక్కి-రచించెను. ఆయన యొక గొల్లకలాపమును గూడరచించియుండెను. తెలిసి నంతలో తెలంగాణమున వెలసిన గొల్లకలాప మది యొక్కటియే. అట్లే మచ్చునకొక్క- కురవంజియు వెలసినది. అది రూష్టానుపేట రత్నమ్మగారి శివకురవంజి. ఆనాటి య. గా. లలోఁ బాత్రలు తెర లోపల జదువు దరువులు, తెర వెడలు దరువులు (ప్రావేశిక ధ్రువలు) పాత్రలను హాస్యగాఁడో దౌవారికుఁడో పృచ్ఛించుట పాత్రలు స్వవిషయమును జెప్పుట, సంధివచనములు, వచనములోఁ బాత్రల సంభాషణలు, రంగప్రయోగ సూచనలు మొదలగు విషయ ములు తఱచు చూపట్టును. ఉదా:– 1. తాడిపర్తి లక్ష్మణదాసుని ప్రహ్లాద నాటకము, 2. శేషభట్టరు కృష్ణమాచార్యుని రంభా నల కూబర విలాసము, 3. గడ్డం రామదాసుని విప్రనారాయణ చరిత్రము ప్రభావతీ విలాసము, కాళీయమర్దనము, 4. గవురహరాజులక్ష్మీపతి రాయుని నలచక్రవర్తి చరిత్రము మొదలగునవి. కొన్ని య. గా. లలో రంభోర్వశుల నృత్యప్రసంగముతో గ్రంథారంభమగుట యొక విశేషము. ఉదా:– 1. పండరి విఠల రాయకవి గజగౌరీవ్రతము శ్రీరామ విజయము, 2. గ. లక్ష్మీపతి రాయుని నలచక్రవర్తి చరిత్రము, 3. లక్ష్మణకవి (మన్నె వారి కొండాపురము ప్రభువుల కొలువులో రాయభట్టు) మాంధాతచరిత్ర మొ॥ కొన్నిట "ఆస్థాన సంతోషి" పాత్ర గన్పట్టును. ఉదా :– గవండ్ల రాజలింగకవి హరిశ్చంద్ర చరిత్రము మొ॥ కొన్నిటఁ బాత్రల సంభాషణ వచనములు "ముచ్చట" లను పేర వ్యవహరింపఁబడినవి. ఉదా:– శే. కృష్ణమా

చార్యుని రంభా నలకూబర విలాసము, తిరునగరి వెంకటదాసు కపిల దేవహూతి చరిత్రము. ఇట్లు 19 శ. ఉత్తర భాగమున తెలంగాణమున యక్షగానము ప్రదర్శనోద్దిష్టమై తదనుగుణ రచనాస్పృష్టమై ఆధునిక యుగోన్ముఖముగా నతి త్వరితగతిని బురోగమించినది.

20 వ శతాబ్దిలో తెలంగాణమున యక్షగానముల సంఖ్య శతాధికమైనది. ఒక్క తెలంగాణములోనే యీ నాఁటికిని యక్షగానము సజీవమై నిలిచియున్నది. రచనతోపాటు ప్రదర్శనములును జోరుగా సాగినవి; సాగుచున్నవి. ఈ శతాబ్దమున తెలంగాణము యక్షగానము పలుపోకలు పోయినది. వింతవింత మార్పులను సంతరించుకొన్నది.

ఈ శతాబ్ది తెలంగాణ యక్షగాన కవులలో శ్రీ చెర్విరాల భాగయ గారిని (జీవత్కవి) జెప్పి మఱి యొకరిని చెప్పవలెను. ఈయన 34 (అక్షరముల ముప్పదినాల్గు) య. గా. లను రచించెను. ఆంధ్రమున నిన్ని య. గా. లను రచించినకవి మఱియొకడింతవఱకుఁ బుట్టలేదు. వారి యక్షగానములు లెక్కకెక్కువ యగుటయే కాక వస్తుతత్త్వములో రచనా ప్రక్రియలో నతిమాత్రవైవిధ్యమును బ్రదర్శించినవి. బహు ఫక్కికమగు నేఁటి తెలంగాణ యక్షగాన వాఙ్మయ మంతటికినిఁ దగిన ప్రాతినిధ్యము వహింపఁగలదు వీరికృతి సముచ్చయము. వీరి య. గా. కృతిసముచ్చయమును సమీక్షించుట నేఁటి తెలంగాణా యక్షగాన తత్త్వమును సమీక్షించుటయే యగును.

భాగయ్యగారు తమకృతుల నించుమించన్నిటిని యక్షగానములని వ్యవహరించినారు. కొన్నిట (ఉదా :- బభ్రువాహన చరిత్ర) భాగవతము, యక్షగానము, నాటకము అను పదములను బర్యాయ

వాచకములుగా ననఁగా సమానార్థకములుగా వాడినారు. అన్నియు నాటకీయతా ప్రకృష్టములు, కవిచేఁ బ్రదర్శనోద్దిష్టములు నైనవి. ఇందుఁ గొన్నిట గ్రంథారంభమున "గణపతి సరస్వతుల వేషము రాకడ", రంభోర్వశులరాకయుఁ గలవు. బహుకృతి సామాన్యముగాఁ బృచ్ఛకుని వాలకము (ఒక్కొకదాని యందు ద్వారకుఁడు, సేవకుఁడు, ప్రధాని, సూత్రధారుఁడు.– అని వివిధములుగా వ్యవహృతుఁడు) గన్పట్టును. పాత్రలు స్వీయోదంతములు చెప్పుటయుఁ గృతికర్తృ భర్తృ (ఒక్కొకచో గ్రంథ ప్రచురణ కర్తృ) ప్రశంసాత్మకముగాఁ బ్రవర్తితమైన ప్రస్తావనయుఁ గలవు. ఆప్రస్తావన తఱచు ప్రధాని, హాస్యగాఁడునను నిరువుర నడుమ హిందీభాషలో జరుగును. ఒకప్పుడు ద్రౌపది మొదలగు నాటకపాత్రల చేతనే ప్రవర్తితమగుట విశేషము. అతని "కృష్ణ గారడి" నాటకమున మార్గనాటకములందు వలె నాంది, నాంద్యంతమున నటీసూత్రధారులచే సలక్షణమైన ప్రస్తావనయుఁ గలవు.

భాగయగారి కృతులలో వస్తువైవిధ్య మొకటి గమనింపఁదగినది. ప్రసిద్ధపౌరాణికేతివృత్తములేగాక అల్లీరాణి కథ, నాగార్జునచరిత్రము (వీనిమూలములు వరుసగా - విచిత్రభారతము, మహాలింగపురాణము) మొదలగు అప్రసిద్ధ గాథలును గలవు. కృష్ణగారడి, మాయా సుభద్ర మొదలగు గ్రంథములందు పౌరాణికగాథలే కవిస్వకపోల కల్పనలతోఁ జిత్రములైన మార్పులందినవి. ఇవికాక ఆరెమరాటీలు, కాంభోజరాజు కథ, బాలనాగమ్మ కథ మొదలుగ పదరూపమునఁ బ్రచారముననున్న జానపద గాథలును గ్రహింపఁ బడినవి. ఆంధ్ర జాతీయవీరగాథలలో నొకటియు, గాథకా దచ్చపుఁ జరిత్రమైనట్టియు బొబ్బిలియుద్ధము వృత్తాంతము నితివృత్తముగాఁ గ్రహింపఁబడుట

విశేషము. (పెద బొబ్బిలి రాజుకథ యను పేర నొక పదము ప్రచారము లో నున్నది. దానినిట్లు పెంపొందజేసినదిది. క్రీ. శ. 1757 లో జరిగినది చరిత్ర ప్రసిద్ధమగు బొబ్బిలియుద్ధము). భాగయగారి కాంతామతి, భద్రసేన విలాసము మొదలగునవి కాశీమజిలీ, పంద్రెండుగురు రాజులకథల "బాణీ" ని నడచిన కిట్టుకథలు. అందుకొన్ని కని స్వకపోల కల్పితములే కావచ్చును. ఈకథలు వివిధరసములకాకరములు. అట్లే యందు పాత్రవైవిధ్యమును దఱచు. రాజమహిషీ మంత్రి పాత్రలెక్కువ. ఎఱుకలసాని, దొమ్మరిసాని, చాకలి, గొల్లరి, కోమటి, దొంగ మొదలగు వివిధ కులవృత్తులకు సంబంధించిన పాత్రలును గలవు. రాజపాత్రాదుల చిత్రణమునం దగిన సహజత్వము నుదాత్తతయుం గొఱవడినను నీచపాత్రలే నిసర్గ మనోజ్ఞముగాం జిత్రింపంబడినవి. ఆయాపాత్రల సంభాషణలలోని తెలంగాణా తెలుంగు వ్యవహారము నుడికారము గమనింపం దగినది.

ఈ కృతులన్నిట సామాన్యముగాం గనిపించు రచనా విశేషములు :- తాళప్రధానములైన దరువులు, ద్విపదలు, పద్యములు, వచనములు, కొన్నిట కందార్థములు, ఏలలు, తోహరాలు మొ॥. దరువులలోం బాత్రలు తెరవెడలు దరువులు గలవు. సంధివచనములే కాక సూటిగాం బాత్రల సంవాదాత్మకములైన వచనములును సమృద్ధిగా నున్నవి. కొన్నిగ్రంథాంతములందు కవిగద్య గలదు. రచన సామాన్యులైన సామాజికుల కుద్దేశింపంబడి సాగినది కావునమిక్కిలిసరళముగా నున్నది. ఇటీవలి తెలంగాణా యక్షగానముల రచనాధోరణి యంతయు నిట్టిదే. అల్పసంస్కారులైన కవులచేతిలో బడి య. గా. రచనాప్రౌఢి యంతకంతకు దిగజాఱిపోయినది. కాని యది సామాన్యజనానురంజకప్రదర్శనోద్దిష్టమై యుండుటం గొంత క్షంతవ్యము.

ఇట్లు నిటీవలి తెలంగాణా య.గా. లలో నేదోయొకవిశేషము గలవి కొన్నిమాత్రమిట్లు బేర్కొనబడుచున్నవి. మహమ్మదు అబ్దుల్లాయను నొక మహమ్మదీయకవి ( చె. భాగయ్యగారి శిష్యుడు ) హనుమద్రామ సంగ్రామమను నొక య. గా. ను రచించి యుండుటొక విశేషము. ఈతరమున అంబేద రాజవీరప్పయను నతడొక బహు యక్షగాన కర్త. అతని మల్లనచరిత్ర మొక జానపదగాథ యితివృత్త ముగా గలది. పట్లోరి వీరప్పయను నొక యాధునికకవి మన్మథసంహా రము, క్రోధాపురిరైతువిజయము నను రెండుగ్రంథములను రచించుచు నందు మొదటిదానిని యక్షగాన మనియు, వీధిభాగవత మనియుం బేర్కొనెను. రెండవ దానిని వీధినాటకమని పేర్కొనెను. రెండవ దానిలో గ్రంథనామమే సూచించుచున్నట్లితివృత్త మత్యంతాధునిక మైనది. క్రోధాపురిరైతగు కోటారెడ్డి కుటుంబము నొకజమీందారు, నొక షావుకారును దుదముట్టింప యత్నించి తుదకు వారే గతించి రైతుకే విజయములభించిన కథ యది. ఇది యొక విధముగా నాధునిక సామ్యవాద ప్రభావ ఫలితమనవచ్చును. ఇది వీధినాటక మని పేర్కొనబడినను, నిందు నటీసూత్రధారుల ప్రస్తావనయు, అంక రంగ విభాగము నుండుటయు విశేషము. ఇది సంస్కృత, పాశ్చాత్య నాటక సరణి. ఇతని రెండుగ్రంథములందును బాత్రలు ప్రవేశించు నపుడు స్వవిషయమును జెప్పుకొనుటయు, సంధివచనములు, ముద్ర లతో దరువులు, కందార్థములు మొదలగునవి కలవు. ఇది యక్ష గాన సరళి. ఇట్లేయక్షగాన ప్రక్రియ రవంతకలిగి ప్రాచ్య పాశ్చాత్య ప్రాచీనాధునాతన రంగస్థల వీధినాటకప్రక్రియ లను నుభయకూలముల నొరసి వఱదలై పాఱు త్రివేణివలె నొక విచిత్రరూపక ప్రక్రియ నేడు నాటకనామమున తెలంగాణా జనపదములలో “ చలామణీ ” యగు చున్నది. ఉదా :- 1. కథలాపురం గంగాధరకవి చిరుతొండ

నాటకము, శివకుమార నాటకము, 2. నాంకళ్ళపేట నరసధారి నాటకము, 3. వేముగంటి శ్రీనివాసకవి సత్యహరిశ్చంద్ర, 4. గాజుల స్వామిదాసు స్వారోచ్యుపాఖ్యానము. 5. ఈరబత్తిని నరసింహులు మదన విజయము, 6. బూర్గుపల్లి సోదరకవుల రచనలు ( చూ. ఇందలి తెలంగాణా య. గా. కవులు – నం. 32 - 33). ఈ కలగాపులగపుం బ్రక్రియలో యక్షగానపుం బాలునెన్నుట కష్టము, ఎన్నవలసినపనియు లేదనిపించును. అయితే యిదియంతయు యక్షగానము తెలంగాణ మునం బ్రవేశించిన యనతికాలములోనె నెంత పరిణతి నందినదియు సూచింపం గలదు. యక్షగానమునంటి ప్రక్రియ పరిణతి కంతకంటెం బరమావధి మఱి యుండంబోదు.

తెలంగాణాయక్షగానము లందెక్కువపాలు ప్రదర్శనోపయోగి. వానినిం బ్రదర్శించుట కూరూరం గొన్ని మేళములును వెలసినట్లు తెలియుచున్నది. ఇటీవలివానిలోం బ్రసిద్ధమైనది 'చిరుతల' నాట్య మండలి యొకటి.

# యక్షగాన ప్రయోగము

యక్షగాన రచనాప్రక్రియ పరిణామచరిత్రనుగూర్చిన ముందటి ప్రకరణమునఁ బ్రసక్తానుప్రసక్తముగ యక్షగాన ప్రయోగమును గూర్చియుఁ గొన్ని విశేషములు తెలుపఁబడినవి. ప్రయోగ సూచనలు, ప్రయోగానుకూల ప్రక్రియయుఁగల కొన్ని య. గా.ల యుదంతముదాహరింపఁ బడినది. ఈవిషయమై ద్వితీయభాగమున నేయే గ్రంథములందేయే విశేషములుగలవో తగుసూచన చేయఁబడినది. యక్షగానము మన దేశినాటకకోశమంతటికిని బ్రాతినిధ్యము వహించిన విశిష్ట ప్రక్రియ కావున దాని ప్రయోగఫక్కికనుగూర్చి ప్రత్యేకముగ నీప్రకరణమునకుఁ బ్రసక్తి గల్గినది.

యక్షగాన ప్రయోగము యొక్క ప్రాథమిక స్వరూపము గానరూప కథాఖ్యానమను విషయము పూర్వోక్తము. ఆ పద్ధతి యొకవంక నప్పటప్పట సాగుచునేవచ్చినదని యూహింపనవకాశముగలదు. ఇందుల కుపబలకముగా తంజావూరు విజయరాఘవనాయకాస్థాన కవియైన చెంగల్వకాళకవి తన రాజగోపాలవిలాసమున యక్షగానము నంగనా ప్రవర్తితమగు సంగీతగోష్ఠిగా సూచినవైనము, కన్నడ దేశమున నీనాఁడు యక్షగానము "తాళమద్దల" యను పేరితో హరికథవలె నాఖ్యానింపఁ బడుటయుఁ గలదను విషయము, మన హరిదాసులును దమ హరికథలను యక్షగానములని పేర్కొనిన విషయమును బూర్వోక్తములే. అదియొక పదకేళికగాఁ బ్రదర్శింపఁ బడుచుండినదనుట కాధారములును (పరమానందయతి, కంఠీరవ రాజుల రచనలు) బొమ్మలాటకు వెనుకపాటగా నుపయోగింపఁ బడుచుండిన (ఇందులకు 19 శతాబ్ది యక్షగానముల గుఱించియే తగిన యాధారము

గలదు) దను విషయమును బూర్వోక్తమే. అది యెప్పటినుండి యెట్లొకరూపక ప్రక్రియగాఁ బరిణమించినది? వివిధదశలలో వివిధ ప్రదేశములలో దానిప్రయోగము తీరెట్టిది యనువిషయము గొంత పూర్వోక్తమయ్యును బ్రత్యేకముగ నేకత్ర్రీకరణోచితముగ విపులీకృతమై యిటఁ బునశ్చరణ మొనర్పఁబడుచున్నది.

## ఆంధ్ర దేశము

క్రీ. శ. 16 వ శతాబ్దినుండి యాంధ్రదేశమున యక్షగాన రచన మెక్కువగా సాగుచుండినది. అప్పటికే దోరసముద్రపు నటులు, కూచిపూడి భాగవతులు, జంగాలు మొదలగువారు వివిధములగు వీధి నాటకములు, తెరనాటకములు నూహూరఁ బ్రదర్శించుటలోఁ బ్రసిద్ధులై యుండిరి. అట్లు దేశినాటకకళకు విశేషప్రచారముగల్గిన యా దినలలో వెలసిన యక్షగానములందును నాటకోచితమైన రచన సాగినది. అందుల కానాఁటి సుగ్రీవ విజయాదులే తార్కాణలు. సుగ్రీవవిజయ మానాఁడు ప్రదర్శితమై యుండుననియే డా. శ్రీ నేలటూరు వెంకట రమణయ్యగారు మొదలగు పండితుల తలంపు. "ఆయా పాత్రముల పాటల తత్తద్వేషధారులువచ్చి పాడునట్లును తక్కిన సంధివచనాదులు ఒక్కరిద్దఱు సూత్రధారప్రాయులు పఠించునట్లును నీసుగ్రీవ విజయము వీధియాటగా నాడబడుచుండెడి" దని క్రీ. శే. వేటూరివారి వక్కాణ.

17 వ శతాబ్ది ఉ. భా. న ఆంధ్ర దేశమున యక్షగానమునకు కూచిపూడివారి కలాపముతో సంపర్కము కల్గినది. ఆకలాప మాహాత్మ్యాశ్రయ భక్తికము, నృత్యప్రధానమునగు నొక యుపరూపక ప్రాయమైన దృశ్యప్రక్రియ*. నాఁటినుండి యట్టిప్రక్రియతో యక్ష

* Lyrical and operatic type of play,

గానములు ననేకము వెలసినవి. పారిజాతములను పేర వెలసిన వందులకుఁ బరమోదాహరణములు.

18 వ శతాబ్దియందాంధ్ర దేశ యక్షగానములు కొన్నిటిపై మార్గనాటక ప్రభావము గొంత పొడసూపినది. అది 19 వ శ., ఉ. భా. సఁ బ్రస్ఫుటపడినది. అది యట్లు చిక్కుపడనున్న కాలముననే దానిపై నాధునిక రంగస్థల నాటక ప్రభావముగూడఁ బడి యక్షగానమందు నాటకీయత యినుమడించినది.

ఆంధ్ర దేశమున యక్షగాన రంగ విషయమునఁ దగినయభివృద్ధి కన్పట్టదు. అప్పటికప్పు డేయూరి మొగనో యే కోవెల మొగిలివాకిటనో, యే సంపన్న గృహస్థు నింటిముంగిటనో తాటాతూటముగా నిర్మింపఁబడిన కమ్మలపందిరి క్రిందఁ గళ్ళాపుజల్లిన కటికనేలయే దాని రంగస్థలము. కేవల మారుబయటఁగాక పందిరిక్రిందఁ బదర్శింపబడుటయే దాని యభివృద్ధి. దాని చుట్టును జూపున కందుమేర నంతయుఁ బ్రేక్షకాగారమే. అటు నిటు చెరియొకరిచేత బట్టుకొనఁబడు నొక తెల్లని గుడ్డయే తెర. తెర కటు నిటు దివిటీలు పట్టబడును. తెరవెనుక వాంగుదారులు శ్రుతి, మద్దెల, తాళపుఁజిప్పలవారును, వంతపాటకులు నుందురు. తెర ముందొకఁ డతఁడే సూత్రధారుడై ప్రదర్శనారంభమునందు ప్రార్థనాదికము ప్రచరించుట, కథాసందర్భము వివరించుట, పాత్రప్రవేశము సూచించుట, పాత్రలను బృచ్ఛించుట, పాత్రలకు వంతపాటకులకు పాటల మొదటి ముక్కలందించుట, పాత్రల యభినయమున కనుకూలముగఁ దాళము వేయుట, నడుమ సంధివచనములను, వస్తుగత వర్ణనాత్మక ద్విపదలను జదువుట మొదలగు పనులొనర్చును. ఒక్కొకప్పుడు, హాస్యగాడని యొకఁడు వేఱ యుండి హాస్యప్రసంగములు నెఱపుటతోపాటు సూత్రధారునికి

సహాయకుండుగా నుండును. వంతపాటకులు పాత్రలతో పాటు పాడుదురు. భామకలాపము "భాగో" కు ప్రచారము గ్గలిగిన నాఁడును యక్షగాన సాధారణముగాఁ బాత్రలు తెరలోనుండియే తమ యుదంతము నామే (ప్రదర్శక ప్రముఖుని పృచ్ఛలపై) చెప్పుకొని (ఈపృచ్ఛ సామాన్య జనుల బోధశాలిన కనుగుణముగాఁ గల్పితము లగుచుండును.) గుగ్గిలము ప్రోక్షణతో భగ్గుమను దివిటీల నెలుఁగు చూపులకనులు మిఱుమిట్లు గొల్పఁగా, సూత్రధారుని వెంట వంతపాటకు లందుకొను ద్రుతగతి ప్రావేశికధ్రువతో, హాంగుదారుల తాళమృదంగాదుల హడావుడితో, తమ కాలిగజ్జెల గలగలలతో బయల్వెడలి యాయా మేళము సంప్రదాయమునట్టి సభాసమస్కారసూచకముగా సాభినయముగా సక్రమశిరస్కతయో, కరముకుళనమో, పుష్పాంజలి సమర్పణమో కావించి కథా ప్రవర్తనలోఁ బాల్గొనుట పరిపాటి. కూచిపూడివారి భామ వేష మొకంతకుఁగాని తెరబయల్పడదు. ఆసందర్భమున జడవర్ణన యొకటి మిగుల విశిష్టమైనది. అది యొక ప్రబంధమే. — "వేణీ ప్రబంధము". భామ వేషగాఁడట్లు తెరపై జడవైచుట భరతమునందుఁ దనకు సాటివారు లేరని పందెము చఱచుటయఁట! యక్షగానములలోఁ దెర ప్రక్కవాటుగాఁ గాక పైనుండి క్రిందునాటుగాఁ దొలఁగింపఁబడును. తెర తొలఁగుసంత హాంగుదారులును రంగముపైఁ బాత్రల పార్శ్వముల నుందురు. సాధారణముగా యక్షగాన ప్రదర్శనలలోఁ పాత్రనిష్క్రమణము మాత్రము ప్రత్యేకముగా సూచింపఁబడదు. తన ప్రయోజన భాగ (Portion) మైపోవునంత నా పాత్ర వెనుకకు జరిగి వంత పాటకుల నడుమ నిలబడును. అట్టిచో నా పాత్రలు వంతలో బాల్గొనుటయుఁగద్దు. ప్రదర్శన సుమారు జాము రాత్రికిఁ బ్రారంభమై తెల్లవారలు సాగును. తెల్లవారుసరికెట్లో ప్రదర్శనము తెమల్చుకొని మంగళముపాడి మేళమువారా వాలక

ములతోనే యూరి పెద్దల యింటింటి కేగి వారిలోగిళ్ళ మఱల నేదో పదాభినయము పట్టి యథోచిత సత్కారములంది పోవుదురు. ఆంధ్ర దేశయక్షగాన ప్రదర్శన నవి సామాన్య లక్షణములు. ఒక్కొకచో నాయాప్రదేశములందలి ప్రదర్శకుల కౌశలమును బట్టియు నవకాశము లను బట్టియు, నభిరుచి భేదమును బట్టియుఁ గొన్ని కొన్ని విశేష ములు, విపర్యాసములు నుండవచ్చును.

ఇక్కడ నాంధ్ర దేశ య. గా. ప్రదర్శనములందలి స్త్రీపాత్ర నిర్వహణముగూర్చి యొకమాట చెప్పవలసి యున్నది. 16 శ. మొదట తప్పదారి యొక్క తాయికొండనాటకమున మాత్రము స్త్రీపాత్ర నొక స్త్రీయే నిర్వహించినట్లు తెలియుచున్నది. కాని, 18 శ. చివరి దనుక స్త్రీపాత్రలను బురుషులే నిర్వహించుచుండినట్లు తెలియనగును. ఆ తాయికొండనాటకమైనను యక్షగానమని యూహింప నవకాశము గానరాదు. అది యొక వీథినాటకమై యుండును. పోని, నాఁటి వీథి నాటకములందైనను నన్నిట స్త్రీలు పాల్గొనుచుండిరా యనఁగా నట్లు గాదు. ఆనాఁడే కూచిపూడి భాగవతులు వీర నరసింహ రాయల యెదుటఁ బ్రదర్శించిన నాటకములలో పురుషుఁడే స్త్రీ పాత్ర ధరించి నట్లు స్పష్టముగాఁ గలదు. వారుగరితల కభినయవిద్య గఱపుదురు కాని గణికల నైనను దమ నాటకములలోఁ బాల్గొననీయరు - అది కూచిపూడి భాగవతుల ముఖ్య నమయములలో నొకటి. వారి "భామవేషగాఁడు" అను మాట యొకటి తెనుఁగు దేశమునఁ దఱచు వినిపించు చుండును. భామవేష మనఁగా భామాశిరోమణి యైన సత్యభామవేషము. ఆవేషమే పురుషులచే నిర్వహింపఁ బడి నప్పుడు కడమ స్త్రీవేషములమాట తడవం బనిలేదు. యక్షగానోప స్థితికి జక్కుల పురంధ్రుల యాటపాటలే కారణములైనను యక్ష

గానము కూచిపూడి భాగవతులు మొదలగు వీథినాటక ప్రదర్శకుల దృష్టి నాకర్షించి యొక యోగ్య ప్రక్రియగా [illegible] దానికి జక్కులజాతి తోడను సంబంధము పోయినట్లు తోచును. కూచిపూడివారి యాలంబము గ్రహించినట నాటి యాచారముప్ర దానిపై హత్తుకొని యుండెనేమొ. తదితర ప్రదర్శకులు నానార్థప్రాయ మగుచు వచ్చినది కొంతకాలము. 18 శ. నడుమ కూచిమంచి జగ్గకవి చంద్రరేఖా విలాపమున "ఆమభాగవతుని జాడ గడ్డము మూతి నున్నగా గొరిగించుకొన్న వాడవు" అని యన్నమాటను బట్టియు, నా కాలముననే తురగా రామకవి యొకచాటువులో భాగోతుల బుచ్చి గానిని స్త్రీపాత్రధారిగా బేర్కొనుటనుబట్టియు నప్పటికి బురుషులే స్త్రీపాత్ర ధారణము సేయుచుండినట్లు తెలియనగును. కాని 18 - 19 శతాబ్దుల సంధికాలమున వెలసినట్లూహింపదగిన పురిజాల లక్ష్మీ నారాయణకవి పారిజాత య. గా. న సఖిపాత్ర భాగవతములందుఁ బురుషులు స్త్రీవేష ధారణము సేయుటుచితము గాదని వాదించుటయు సత్యభామ ప్రత్యాఖ్యానము చేయుటయుఁ జూడ నాకవి కాలమున నక్కడక్కడ స్త్రీలును య. గా. ప్రదర్శనములందుఁ బాల్గొనుటకుఁ బూనుచుండిరనియో లేక స్త్రీ పాత్రలు స్త్రీలే నిర్వహించు టుచిత మను వాదము బయలుదేరియుండు ననియో యూహింపనగును. 19 శ. నుండి యటనట స్త్రీలును బ్రదర్శనములలోఁ బాల్గొనుచుండి రనుటకుఁ దగిన యాధారములు గన్పట్టుచున్నవి. విశాఖపట్టణము జిల్లా వృత్తాంత సంగ్రహము (పుట 130) లో "జనరంజక నాటకములు స్త్రీలు పురుషులు వేషములు వేసుకుని వినిక చేసెడివారు" అని యున్నది. 19 శ. ఉ. భా. న నెల్లూరు మండలము ఆత్మకూరు తాలూకా పడకండ్ల గ్రామకరణమగు పడకండ్ల స్వామిరాయకవి నట మేళములను తప్పించి నెలల తరబడి వారికి వాసగ్రాసములు గల్పించి, గణియములు

వస్త్రములు ప్రదర్శన శిక్షణయునిచ్చి తన రచించిన లక్షణా పరిణయాది యక్షగానములను ప్రదర్శింపఁ జేసెడి వాఁడనియు నామేళములో 'గోనుదిన్నె బుగ్గసాని' యను నామె కవి యాజ్ఞపై నాయిక వేషము గట్టినట్లును బుగ్గసాని (లక్షణ) మాటగా నాలక్షణా పరిణయ గ్రంథమునందే యున్నది. ఇట్టి సందర్భములనుబట్టి రానురాను యక్షగాన ప్రదర్శనములందుఁ గొన్నికొన్నిచోటుల వారికినిఁ బాల్గొనుట కవకాశము గల్గినదని చెప్పనగును.

ఇఁక నీ యక్షగాన ప్రదర్శన ప్రక్రియ యందలి మౌలికమైన తత్త్వముయొక్క లక్షణము లెట్టివనఁగా :—

1. ఇందు రూపారోపము (పాత్రానుకూల వేషధారణము) గలదు. కావున నిది రూపకసమాఖ్యకుఁ దగియున్నది. ("రూపారోపాద్రూపకమ్").

2. ఇందు రసాశ్రయమైన యితివృత్తము, చతుర్విధాభినయ (ఆంగిక వాచికాహార్య సాత్త్వికి, విశిష్టమైన యవస్థానుకృతియు గలవు కావున నిది నాట్యోపేతమైనది — ("అవస్థానుకృతి ర్నాట్యమ్", "చతుర్ధాభినయోపేతం నాట్యముక్తం మనీషిభిః" "నాట్యం రసాశ్రయమ్")

3. ఈ యక్షగాన నాట్యము నృత్తనృత్యానుప్రాణిత మైనదని యెఱిఁగిన పెద్దలెల్లరు చెప్పుదురు.[44] ('నృత్తం తాళ లయాశ్రయమ్, భావాశ్రయం నృత్యమ్'')*

---

44. ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతము గారి "గౌతమ వ్యాసములు" నుండి — 'మన నాటకముల పూర్వ గాథ' అను వ్యాసము.

* మీఁది కుండలీకరణములలోని ఆభాణకములు దశరూపకము, సంగీత దర్పణములనుండి గ్రహింపబడినవి.

ఇట్లు నృత్త నృత్య నాట్యాత్మకమై యక్షగానము పై నిటీవలి కాలమున మార్గరూపకము, ఆధునిక రంగస్థల నాటకములు ప్రభావము పడినను దాని ప్రాక్తనమైన ప్రదర్శన ఫక్కికయొక్క వ్యక్తిత్వము, నంతకంటెఁ బ్రాక్తనమైన దాని జీవలక్షణమగు గానకళా ప్రాముఖ్యమును సంరక్షింపఁ బడుచునే వచ్చినవి. నాటక నామ వ్యవహృతమైనను నీ యిరువదవ శతాబ్ది యందును యక్షగాన శబ్దము విస్మృతము గాలేదు. మార్గాధునిక నాటకములుయక్ష గానము వలె నృత్త నృత్య గాన ప్రధానములు గావు. నృత్తనృత్య ప్రాధాన్య సాదృశ్యము కారణముగా మన పండితులు కొందఱు యక్షగానము పాశ్చాత్య దేశము లందలి "ఓపెరా" వంటిదని యభిప్రాయ పడి యున్నారు.[45] కాని ఓపెరాలు గాన కేవలములైనవి. యక్షగానములు గాన ప్రధానములే కాని, గాన కేవలములు గావు. అందు గేయ ప్రయోజనమునకే కాక సాధారణ పఠనోద్దిష్టములైన గద్య పద్యములు నుండును. అది కాక యక్షగానములందుఁ బ్రయుక్తమగు నృత్తనృత్యముల తీరు వేఱు. అది కూచిపూడి భాగవతుల వంటి శిష్టుల చేతిలో నిబిడతర శాస్త్ర ప్రక్రియానికషాయితమైనది, విశిష్ట సంప్రదాయ చోదిత మైనదియును.

అసలు యక్షగాన నాట్యము భరతశాస్త్ర సంప్రదాయాను సారము నృత్తనృత్యాను ప్రాణిత మగుటకు, యక్షగానము వీథినాటకము నేకమగుటకును కూచిపూడి భాగవతులే కారకులై యుందురేమోయని కూడ ననిపించును. యక్షగానము రూపకప్రక్రియగా

45. చూ. కీ. శే. జయంతి రామయ్యపంతులు గారి ఆధుని కాంధ్ర – వాఙ్మయ వికాస శైఖరి — ద్వితీయాధ్యాయము ; కీ. శే. పానుగంటి వారి సాక్షి సం. 1 — అధ్యా. 18 ; Prof. P. Sambamoorthy's introduction to Nowka Charitra (Tyagaraja's Composition).

రూపొందిన నాఁటి కాంధ్ర దేశమున కూచిపూడి భాగవతులు భరత విద్యాధురంధరులుగా విశేష ప్రసిద్ధి గాంచినారు. దేశాటనము సేయుచు నాటకప్రదర్శనము లిచ్చుట వారివృత్తి. వారు రాజ సన్మానములు గూడఁ గాంచినవారు (ఈవిషయము పూర్వోక్తము). ఏ సుముహూర్తముననో యక్షగానము వారి దృష్టి నాకర్షించి యుండును. కోడనే వారు తమ వీథినాటక ప్రదర్శనానుభవమును, భరత విద్యా విదగ్ధతను బట్టి దాని నొక విశిష్ట రూపకప్రక్రియగాఁ దీర్చి దిద్దుటకుఁ గృషిచేసి యుందురు. ఈయూహ కుపాధి సిద్ధేంద్రయోగి భామ కలాపము సృష్టి. అది కాక యక్షగానములు ప్రదర్శించుట యందును వారు ప్రసిద్ధులు. వారు ప్రదర్శించువానిలోఁ బ్రసిద్ధములైనవి ప్రహ్లాద, ఉషాపరిణయము, శశిరేఖా పరిణయము, రామనాటకము, హరిశ్చంద్ర, నలచరిత్రములు మొదలగునవి. అందు కొన్ని నాటకములని వ్యవహరింపఁబడినను నవి యక్షగాన ప్రాయములైనవే. సాధారణముగా వారి ప్రదర్శనము లన్నియు నందుఁ బ్రత్యేకముగా వారి భామకలాపమును భరత విద్యానవద్య ప్రమాణ పటిష్ఠములైనవను సంగతి యాంధ్రలోకమంతయు నెఱింగినదే. వారి భామకలాప మేకాగ్రముగా నెనిమిది రాత్రుల ప్రదర్శన కుద్దిష్టమైన దఁట. కూచిపూవారి ప్రదర్శనము లన్నిట దీనికెక్కువ ప్రచారము. దీని "బాణీ" ని బట్టి యాంధ్ర దేశమున వివిధప్రదేశములలో నెన్నో భామ కలాపములు వెలసినవి. ఆ "బాణీ"తో యక్షగానములు ననేకము వెలసినవి. అయితే ఆదిని యక్షగాన రచనా ప్రక్రియయే భామకలాపమునకు మూఁదల. అనఁగా సిద్ధేంద్రునికి (17 శ. మధ్య కాలము) ముందే కూచిపూడివారు యక్షగాన ప్రదర్శనకుఁ బూనుకొని యుందురను నూహకుఁ గొంత యవకాశము గలదు. ( అప్పటికే యక్షగాన రచన బాగుగా సాగుచుండినది కదా. 16 శ. ఆరంభముననే వారు నాట్య కళా ప్రచారకులుగాఁ బ్రసిద్ధులుగదా ) రంగ విషయమునను, హంగు

విషయమునను కూచిపూడివారి ప్రత్యేకత యంత లేకపోయినను బహువిధాభరణములు, కిరీటములు, గజ్జెలు, కరాళములు (Masks నృసింహాది పాత్రలకు) గల వారి "సరంజాము" దొడ్డది. వారి ప్రదర్శన ప్రక్రియ సరేసరి. ఆంధ్రదేశ వివిధప్రాంత యక్షగాన ప్రదర్శకులకు వారి ప్రదర్శనపద్ధతులే యాదర్శప్రాయములైనను ఎరుకలు, గొల్లలు మొదలగు తక్కినతరగతి ప్రదర్శకులు బయలుదేఱుటవలనఁ గూచిపూడికత్తె సంగతి లఘువుబిగువులు వారి యెడ నంతగా కానరావు. కూచిపూడిభాగవతులు మేళములుగా నూరూర బర్యటించుచుండుటవలన నాయా యూళ్ళలోను గొన్ని మేళములు మొలిచినవి. వెనుకటి కూచిపూడిమేళములలోఁ బ్రసిద్ధములైనవి: సిద్ధేంద్రయోగి మేళము, భాగవతుల దశరథరామయ్యగారి మేళము. 18 శ. న భాగోతులబుచ్చిగాని మేళము, 19 శ. న రాయలసీమలో లేపాక్షి, వేములపల్లి, తాడిపత్రి మేళములు, 19 - 20 శ. ల సంధి కాలమున నెల్లూరుమండలమున పడకండ్ల స్వామిరాయకవి, త్వరకవి రామకృష్ణయగారల మేళములు, విశాఖమండలమున నరసింగపల్లి కళ్ళేపల్లి కందాళ చిందబరకవి మేళములు, పల్నాటిసీమ మేళములు మున్నగునవి కొన్ని ప్రసిద్ధికెక్కినవి. కాని యొకనాఁ డాంధ్రుల నాట్యకళా ప్రతిష్ఠల కధిష్ఠానమైన కూచిపూడిలోనే యీ నాఁడా భాగవతులకు గతులులేకుండఁ బోయినవనఁగా నిఁకఁ గడమయెడల యక్షగాన ప్రదర్శన మేస్థితిలో నున్నదో తడవంబనిలేదు.

---

ఈ ప్రకరణ రచన కాధారములు :— 1. కొన్ని యీ ప్రకరణమున నధోజ్ఞాపికలలోను, గొన్ని మందటి ప్రకరణములలోను, జేర్కొనఁబడినవి. 2. వివిధ యక్షగాన గ్రంథములందలి సూచనలు ( పూర్వ ప్రకరణోక్తము ) 3. నా యక్షగాన ప్రయోగ దర్శనానుభవము. 4. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి ఏకవీరయందలి భామకలాప ప్రసక్తి వేయి పడగలు — ప్రహ్లాద నాటక ప్రదర్శన వర్ణనోదంతము 5. శ్రీ ఊన్నవ లక్ష్మీనారాయణగారి మాలపల్లి — ప్రహ్లాద నాటక ప్రదర్శన వర్ణనోదంతము. 6. శ్రీ దివాకర్ల రామమూర్తిగారి "కూచిపూడి భాగవతులు" అను వ్యాసము — ( వ్యాసమాల యను సంపుటములోనిది. )

## దక్షిణదేశము

17 వ శతాబ్ది ప్రథమ పాదముననే తంజావూరిలో యక్షగాన మునకు రాజాశ్రయము లభించి రంగభోగము విస్తరిల్లినది. రఘునాథ విజయ రాఘవనాయకుల కాలమున నగరి పెత్తనముక్రింద నాటక శాలలు వెలసినజాడ దోఁచుచున్నది. ఆరాజులు స్వయముగ యక్ష గాన రచన గావించిరి. విజయరాఘవాస్థానమున దానికింకను ప్రోత్సాహముగల్గి యథి వీథినాటకము వైఖరితో రంగమున కెక్కి నది. విజయరాఘవుని పూతనాహరణము, ప్రహ్లాద చరిత్ర మొదలగు కృతులలో రంగప్రయోగసూచన లనేకము గలవు. (అవి ముందటి ప్రకరణమున నుదాహృతములు). ప్రహ్లాద చరిత్రమున "నాటక శాల" "విదూషక" ప్రశంసలు గలవు. ఇది (ఫలానా) "పాత్ర వాక్య" మని కలదు. చివర నిందలి పాత్రవివరములును గలవు. వీనినిబట్టి నాఁడు యక్షగానము రంగమున కెక్కెననుట విస్పష్టము. కాని యీ రంగరచన తీరెట్టిదియో తేటపడలేదు. భరత విద్యా ధురంధరులైన నాయకరాజుల నగరి నాటకశాల లందైన రంగ రచన భరతశాస్త్రోక్తముగ జరిగియుండునని యూహింపనగును. తదుపరి మహారాష్ట్రప్రభువులకాలమున తంజావూరిలో యక్ష గానముపై మార్గనాటక ప్రభావముగూడ బాగుగాఁ బడియుండుటచే (ఈ విషయము పూర్వోక్తము) నాఁడును యక్షగాన రంగము రాజాస్థానమునందైన శాస్త్రోక్తముగనే తీర్పఁబడి యుండుననుకోన వచ్చును. కాని యీ మహారాష్ట్రుల నాటక గ్రంథములలో సూత్ర ధారుఁడు, భాగవతులను బాత్రలను బలుకరించినట్లుండుట చూడ నా ప్రదర్శనతీరు కొంతవఱకాంధ్ర యక్షగానములను బోలిన దనియుఁ జెప్పనగును. అందు గణపతి సరస్వతుల స్తుతులతోపాటు

పాత్రప్రవేశములును జెప్పఁబడి యుండుట మహారాష్ట్ర దేశపు "లలిత" నాటకఫక్కి. + చివరి మహారాష్ట్ర ప్రభువగు శివాజీ కాలమునను భాగవతమేళము లుండినట్లు స్పష్టముగాఁ దెలియుచున్నది. (పూర్వోక్తము) ఆయా యాధారములవలన నాఁడు నాయక మహారాష్ట్ర రాజ్యాస్థానము లందు నాటకశాలలు, భాగవతమేళములు నుండినట్లును, భరతవిద్యా ప్రియంభావుకులగు నా ప్రభువుల ప్రోత్సాహమున యక్షగాన రంగరచన ప్రదర్శనభంగి గొంతమైన భరతశాస్త్రవిధానంబుగాఁ దీర్పఁబడి యుండుననియు నూహింపనగును.

17 – 18 శతాబ్దులలో తంజావూరిలోను, మధుర మైసూరు రాజాస్థానములందును యక్షగానప్రదర్శనలలో స్త్రీలును బాల్గొనుచుండి నట్లాధారములు గన్పట్టుచున్నవి. తంజావూరి రఘునాథుఁడు "రంగస్థలంబు రామాలంకృతంబుఁ జేసి" నాఁడు. (చూ. విజయవిలాసము అవతారిక). విజయరాఘవాస్థానమున యక్షగానమును [illegible] వినిపించుచుండెడి వారని చెంగల్వ కాళకవి చెప్పినాఁడు. (చూ. రాజగోపాలవిలాసము — అవతారిక) వినిపించుట యనగా సంగీత గోష్ఠి యనియే కాక ప్రదర్శించుటయనియు నూహింపుటకు [illegible] ముఁగలదు. విజయరాఘవాదుల యక్షగాననాటక ప్రరోచన సర్వసాధారణముగ "పరాకుస్వామివారు హావణించిన . . నాటకంబు నటనపటిమ గనుపించ వినిపించేము విన నవధరించుండ" అని యుండును. అందుచే కాళకవి వక్కాణలో నటనపటిమ గతార్థమైనదనియే భావింపనగును.

---

+ "లలిత" మహారాష్ట్రదేశపు జనరంజక రూపక ప్రక్రియలలో నొకటి. అందు దశావతార కథలకుఁ బ్రసక్తి గలదఁట. దానిపై తంజావూరి నాటక ప్రభావము పడినదఁట. (కన్నడమున య. గా. నకు 'దశావతారద — ఆట' అనియు వ్యవహారము గలదనువిషయము పూర్వోక్తము.) **Vide. Marathi Encyclopadia, 1925,, Vol. 16 – N. 46.**

అదియుఁగాక విజయరాఘవనాయకకృతమైన విజయరాఘవచంద్రికా విహార ముస నాయనివారి "పైటినాటకశాల పచుచు" నాయికయైనదనఁగా నిఁక నొక నట్టువకత్తె యీ వాలకమువేసి నాటకమునఁ బాల్గొనుట కభ్యంతరముండునా నాయనివారి కొలువులో! మైసూరి కంఠీరవ నరసరాజు కొలువునను దగుపఙ్క్తములఁగు యక్షగానప్రాయ రచనలు పదకేళికలవలె నట్టువరాండ్రచేఁ బ్రవర్తింపఁబడియుండునను నూహకుఁ గల సామంజస్య మిదివఱకే పరిశీలింపఁబడినది. మధుర విజయరంగ చొక్కనాథ "సభార్హముగా" వెలసిన తిరుమల కవి తిల్లగోవింద రాజ నాటకమును "ఉదుటు వగకోపులవైపు లమర......ఇంచు బోణులు నటించు" వారని యందే కలదు. ఆయా యాధారములను బట్టి నాఁడు దక్షిణదేశ రాజాస్థానములందు యక్షగాన ప్రదర్శనలలో స్త్రీలును బాల్గొనుచుండిరని చెప్పవచ్చును. ఇది 17–18 శతాబ్దుల ముచ్చట. కాని 19 శ. పూ. భా. న తంజావూరు శివాజీ నగరి భాగవతమేళము "సబనీసు" దగ్గరనుండిన శివాజీ అన్న పూర్ణాపరిణయ నాటకము "వేషాలనావనీసు" ను (తం. స. మ. నం. 622) గాని తం. స. మ. కే. సం. 799 "నాటకపాత్రలు" అను పట్టికలను గాని పరిశీలించినచో నొక్క యపవాదమైన లేకుండ నన్ని స్త్రీ పాత్రల యెదుటను బురుషనామములే కన్పట్టును. అనఁగా నానాఁడు పురుషులే స్త్రీ పాత్రలను ధరించుచుండిరనుట స్పష్టము. దీనికిఁ గారణము 18 శ. చివర తంజావూరికి మిక్కిలి సమీపముననున్న మెలట్టూరున వెలసిన భాగవతమేళ నాటకముల సంప్రదాయము కావచ్చును. అవి నాఁటి తంజావూరు రాజాస్థాన నాటకములవలె య. గా. ప్రాయములైనవే యయ్యు నొక గొప్ప విశిష్టసంప్రదాయ పటిష్ఠమైన ప్రక్రియ గలట్టివి. (ఇటఁ బ్రత్యేకముగా వాని యుదంతము గొంత వివరింప వలసి యున్నది.)

# మెలట్టూరు
## భాగవతమేళ నాటకములు

మెలట్టూరు భాగవతులకుఁ గులపతియైన వెంకటరామశాస్త్రి గుఱించియు, నతని కృతులఁ గుఱించియు స్థలాంతరమునఁ జెప్పనైనది. + ఆ కృతుల రచనాప్రక్రియ నాఁటి యక్షగాన సామాన్యమైనదని నిరూపింపఁ బడినది. ఇఁక ప్రదర్శన ప్రక్రియ - సంప్రదాయముల గుఱించి :-

ఇవి నృత్య ప్రధానములగుటచే నృత్య నాటకములనియు, భాగవతులైన నటులబృందముచేఁ బ్రదర్శితము లగును గావున భా. మే. నా. లనియు వ్యవహరింపఁ బడుచున్నవి. కూచిపూడివారివలె నీ భాగవతు లందఱును బ్రాహ్మణులే. ఈ నాటకములు మెలట్టూరు పురాధిష్ఠాన దైవతమగు వరదరాజ పెరుమాళ్ళు దేవాయతన బహిః ప్రాంగణమున నొక పెద్ద పందిరిలో - వైశాఖమున వసంతోత్సవ కాలమున నృసింహ జయంతినాఁడు ప్రహ్లాద నాటకముతోఁ బ్రారంభింపఁబడి (కూచిపూడివారికినిఁ బ్రహ్లాద నాటకమన్న మంచిపట్టు) వరుసగా నైదాఱు రాత్రులు నడుమ నొకనాఁటి విరామముతో సాగును.

✓ మెలట్టూరువారి వేషధారణలో వర్ణ వైశిష్ట్యము (Colour-Values) పాటింపఁ బడును. రాజవేషములు తంజావూరి రాజుల కనుకరణగా నుండును. రాక్షస వినాయక నృసింహ బ్రహ్మాది వేషములకుఁ గరాళము లుపయోగింతురు. (కూచిపూడివారును గరాళము

---

+ ద్వి. భా., పుట 335—39. చూ. ఈ మెలట్టూరు భా. మే. నా. ల గుఱించి నా వ్యాసము భారతి. సెప్టెంబరు, 1955.

లుపయోగింతురు.) వారి ముఖ్యమైన జంత్రపుహంగు మృదంగము తిత్తి, ముఖవీణ, సూత్రధారునిచేతి తాళముచిప్పలు.

నాటకము రాత్రి సుమారు పది గంటల కారంభింతురు. "సట్టువాంగం" (హంగు) జరుపు భాగవతు లిద్దరు, ముగ్గురుపాట గాండ్రు, జంతగాండ్రు, గ్రాంధికుఁడు లేక ప్రసంగి (అనఁగా సంధివచనాదులు చదివెడు వాఁడు) — వీరు హంగుదారులు. సర్వసిద్ధమై జంత్రగాండ్రు సరే యనఁగానే భాగవతులు పుండరీక ధ్యానశ్లోకములు పఠింతురు. ఆవెంటనే తైతైమను కొనుచు కోణంగి రంగమునకు వచ్చును. గ్రంథములోఁ జెప్పఁబడకపోయినను వానిరాక యొక యాచారము. సూత్రధారిచేఁ బృచ్ఛితుఁడై వసంతోత్సవకార్య క్రమము జరిపించుటకై సభవారి నెచ్చరింప వచ్చితిననును. వాలకము (హనుమంతునివలె) హాస్యగానివలె నున్నను సతఁడొక మహాభక్తునిక్రింద లెక్క. అటు పిమ్మట భాగవతులు "తోడై మంగళము" (తాళ్ళపాక చిన్నన్న కీర్తన పంచకము. ఇది తంజావూరు మహారాష్ట్రులనాఁటి య. గా. లందును గొన్నిటి ప్రతుల మొదటఁ గన్పట్టును.) అందు కొందరు ప్రతి కీర్తనకును ముందు జతి తరువాత శబ్దము, కౌస్తుభము (మాతు ప్రధానమైన శబ్దజతి వంటిది) పఠింపబడును. ఇక్కడ కిది యంతయు "మేళం కట్టుడల్" అనఁగాఁ బూర్వరంగ నిర్వాహణ.

తదుపరి గ్రాంథికుఁడువచ్చి "ఆదిద్విపద" అనఁగా గధాసంగ్రహ కవి విషయక ద్విపద (శహాజి ప్రభృతుల కృతులలో దీని యునికి తఱచు) నొక రాగమాలికలోఁ బఠించి, యొక వచనమున వినాయక పాత్ర ప్రవేశ సూచనచేసి యొక జతి చెప్పును. భాగవతులు ప్రావేశికీ ధ్రువను బఠింతురు. తదనుగుణముగా నృత్యము చేయుచు గణపతి వేషము వేసికొని యొక బాలుడు వచ్చును. రంగముపైఁ గొంతసేపు

కూర్చుండి "పండారకులయక్కుళులు" (పూజారులు) నాయక వారిచే పూజలందుకొని నృత్యము సేయుచు నిష్క్రమింతురు. (ఈ విధా యక పాత్ర ప్రవేశఘట్ట శహాజీ ప్రభృతుల కృతిసామాన్యము సమ యమే). అంతట బ్రసంగి జతియుక్తముగా నొకపదము పఠించి నాట కము వాని ప్రవేశము సూచించును. నాయక భాగవతులు నొకపద కనుగుణముగ నృత్యము సేయుచు బ్రవేశించును. (ఇక వారిక రా గారిరాక నెచ్చరించునవ్వానాశికతము. సూత్రధారుడేయ వరిప్రకారం మాత్రము రాజ పాత్రకు బ్రసక్తకేళికి కాపోలు వీని నాయకులు కని పింపదు. అందులో సుగనంజి పాత్ర (విశేషము) కటికము భాగవతు లచే బృచ్ఛితుడై కచచ్చిం పరిహాసిక నడచిపోవును. (శహాజీ ప్రభృతుల కృతులలో వీడొక సాంప్రదాయిక పాత్ర.) తరువాత కథా పాత్రలు యథాసంప్రదాయ క్రమముగా సూచక వర్ణనసహిత వంటనే ధ్రువానుగుణ నృత్యముతో బ్రవేశించి నాటకప్రవర్తనలో బాల్గొ నును. నాయికాపాత్ర ప్రవేశ విషయమున మాత్ర మొక విశేష ముండును. ప్రావేశిక ధ్రువతో బ్రవేశించిన నాయికాపాత్రధారి తన నర్తన కళా ప్రావీణ్యము ప్రదర్శింపవలెనుండు. (కూచిపూడి ప్రద ర్శనములందు నంతే.) అందులకొక "అల్లారిప్పు" (శుద్ధ నృత్తము అలరింపు?), "మెయ్" (తారస్థాయి షడ్జస్వరము, అది తాళములో తాళ జతి ప్రధానమైన సంగీత ప్రక్రియ), తిల్లాన, శౌక్కవర్ణము అభినయించి తీర్మానముచేయవలెను. నాటకమున సామాన్యముగా బ్రతిపాత్రకును భరతపద్ధతి (అభినయము) కరతలామలకముగావలె. అందును కూచిపూడి భామవేషగానికివలె నిందు నాయికాపాత్రధారి కెంతో యభ్యాసముండవలెను. ఈనాటకములో స్త్రీ పాత్రలు పురు షులచేతనే నిర్వహింపబడును. ఇది నియమము. (కూచిపూడివారు గూడ "తూ చా" తప్పకుండ నీ నియమము బాటింతురు.)

ప్రసంగి గ్రంథములోని సంధి వచనములనే కాదు వర్ణనాత్మకములైన ద్విపదలనుగూడఁ జదువును. సంవాదాత్మకములైన ద్విపదలు, పద్యములు మాత్రమే పాత్రధారులచేఁ బఠింపఁబడును. ఇవి నృత్య ప్రధానములైన నాటకములు గావునఁ బాత్రధారి ప్రతి దరువునకును నృత్యము పచరింప వలెను. అట్టిచో నా దరువులు కూడ వారే పఠించుట కష్టమైన పని. అందుచే నాటకమునందలి పాటలన్నియును బాత్రలవికూడ సూత్రధారుఁడే యెత్తుకొని వంగుదారులకు ముందుముక్కలందిచ్చి తాను జివరఁ దీర్మానము సేయును. వారి వంతల కనుగుణముగ నభినయము మాత్రమే పాత్రధారులు చేయవలసినది. ఈపట్టునమాత్ర మిది కథకళి ఫక్కి. (కథకళి కేవల మాంగికాభినయ ప్రధానమైనది. అందు వాచికము పూర్తిగాఁ బరిహరింపఁ బడును. తమిళ దేశమునకు సన్నిహితమైన మలయాళ దేశమున కథకళి కళా సారస్వత ప్రతిష్ఠ పరాకాష్ఠనందుటకుఁ గారణ భూతుఁడైన త్రయిమ్మణ తంపి మెలట్టూరు వెంకటరామ శాస్త్రి సమకాలికుఁడే.) ప్రసంగి పాత్రల నెప్పుడును బల్కరింపఁడు. సూత్రధారుఁడే ప్రతిపాత్రను బ్రవేశింపఁగనే తదుదంతముగూర్చి పృచ్ఛించును. అప్పుడప్పు డతఁడు కథను వాఖ్యానించుటయుఁ గూడ నుండును.

ఈ నాటకములందు వధాదు లప్రదృశ్యములన్న భరత సంప్రదాయములు పాటింపఁ బడును. హిరణ్యకశిపుఁడు నరసింహునితో (నృసింహ పాత్రధారి యాదినమంతయు నుపవసించును. ఇదియుఁ గూచిపూడివారి యాచారమే) వాదించి యతఁడు తన్ను పట్టవచ్చు సరికిఁ దెరలోనికిఁ బారిపోవును. అక్కడితో నా నాటక మైపోయినట్టే. నాటకము పూర్తియగుసరికి భళ్ళునఁ దెల్లవారును. భాగవతులు భూపాలరాగముతో నొక కీర్తన యెత్తుకొని గర్భాలయములోని

స్వామికిఁ బ్రదక్షిణ దీపారాధనము లొనర్చి పురవీధులలోనికి మేళముగాఁ బోయి యింటింటికడ యథోచితముగా సన్మానింపఁ బడుదురు.

పై లక్షణములను బరిశీలించినచో మెలట్టూరు భా. మే. నా. లలోఁ బ్రదర్శన సంప్రదాయమునఁ గూచిపూడివారి పోలికయుఁ బ్రదర్శన ప్రవర్తనలో (రచనా ప్రక్రియలోఁ గూడ) శహాజీ నాటకముల పోలికయు నెక్కువగా నున్నట్లు తోఁచును. కూచిపూడి భాగవతులు దేశదిమ్మరులు కాని మెలట్టూరు భాగవతు లూరువిడిచి తమ నాటకములను బ్రదర్శింపరు. కాని వెంకటరామశాస్త్రి నాటకములను మెలట్టూరు చుట్టుపట్లనున్న శూలమంగళము, ఊత్తుక్కాడు, శాలియ మంగళము, నల్లూరు, తేనప్పెరుమాళ్ నల్లూరు మొదలగు గ్రామములలోని బ్రాహ్మణ మేళములవారు గూడఁ బ్రదర్శించుటకుఁ బూనుకొనిరి. అందు శూలమంగళమువారు తమ ప్రదర్శనలలో కొఱవన్, కొఱత్తి (ఎఱుకఁడు, ఎఱుకత), కరకం (గ్రామదేవత ఘటము ధరించువాఁడు), కుడుకుడుప్పాండి (శకునపక్షి), కప్పల్, గంజిన్ (తురకవేషపు హాస్యగాండ్రు) మొదలగు పాత్రలను గొన్నిటిని జనరంజనార్థము సాంప్రదాయికముగా రూపొందించిరి. ఊత్తుక్కాడులో వెం. రా. శాస్త్రి నాటకములకు ముందు రాధాకృష్ణ విలాసము, పార్వతీ పరిణయము, భామకలాపము, గొల్లకలాపము అనునవి యాడుచుండెడివారఁట. నల్లూరు భాగవతుల నాట్యవిద్యకుఁ బ్రమాణ గ్రంథములు అభినయ దర్పణము, భావప్రకాశనము, రస మంజరి అని తెలియవచ్చినది. ఈ నాఁడేకోట భా. మే. నా. ప్రదర్శనములు సాగుచున్న దొక్క మెలట్టూరులో మాత్రమే.

ఆయా విశేషములనుబట్టి చూచిన దేశదిమ్మరులగు కూచిపూడి భాగవతు లెప్పుడైనఁ దమ తెలుఁగు ప్రభువులగు నాయక రాజుల

కాలమునన్నైస తంజాపురాది ప్రాంతముల సంచారము గావించిరా యనిపించును ; తెలుఁగు యక్షగానము దక్షిణదేశమునఁ బ్రవేశించి యెట్టివాలకము లెత్తినదో తేటపడును.

---

ఈ ప్రకరణ రచన కాధారములు :—

1. మేలట్టూరు భాగవతోత్తములు శ్రీ యమ్. స్వామినాథ భాగవతార్, బి. ఏ (మదరాసు), శ్రీ ఆర్. కల్యాణ రామయ్యర్, బి. ఏ., (మదరాసు) గారలు దయచేసిన విలువగల విపులమైన భోగట్టా, గ్రంథములు.

2. An article on the Subject by Dr. V. Raghavan–Journal of the Indian Society of Oriental Art– Coomara Swamy Commemoration Volume.

3. "The Music of the Nrtva Natakas Of South India" By Srimati K. Gomati (Thesis Submitted For M. Litt. of the Madras University)

## తెలంగాణము

తెలియవచ్చినంతలో తెలంగాణమున యక్షగానమునకు 18 శ. ఉత్తరార్ధముననే ప్రవేశము గల్గియున్నను దాని కచటఁ బ్రదర్శన ప్రచారము గల్గుట 19 శ. ఉత్తరార్ధము నుండియే. 19 శ., ఉ. భా. నను నీశతాబ్ది యందును నచట యక్షగానములు కుప్పలు తిప్పలుగా వెలసినవి. ఇంచుమించవియన్నియుఁ బ్రదర్శనోద్దిష్టములే యని యందలి పాత్ర ప్రావేశిక ధ్రువలు, తెరద్విపదలు, "వెడలె నరసింహా దేవుఁడు - పెడబొబ్బలిడుచు" అను దరువు "అంగున వుండేవారు (హంగుదారులు) చదువ వలసినది" (తాడిపర్తి లక్ష్మణదాసు ప్రహ్లాద నాటకము లోనిది) - ఇత్యాది రంగప్రయోగ సూచనలును నిరూపించు చున్నవి. 19 శ., ఉ. భా. నాఁటివి మార్గాధునిక రంగస్థల నాటకఫక్కి నెక్కువగా సాగినవి. ఈ నాఁటికిని యక్షగాన రచన, ప్రదర్శన తెలంగాణమున సజీవముగానిల్చియున్నది.

అయితే అది వీథి మార్గాభునికి నాటకములు వెలగాబ్బుగాడు ఫక్కిగా నున్నది. పూర్వము తెలంగాణములో వెలసిన మేళములగురించి యంతగాఁ దెలియవచ్చుటలేదు. డాక్టరు నేలటూరి వెంకట రమణయ్యగారొక మేళము గురించి యిట్లు తెలిపియున్నారు.[46]

"గోల్కొండ తానీషా మంత్రులైన యక్కన్న మాదనల* కొలువున నొక భాగవతమేళముండెనని మధుర వంగా పుంశ్చలీ విలాసమునఁ జెప్పఁబడియున్నది. కూచిపూడి భాగవత మేళమును బోలిన యక్కన మాదనలమేళము దేశాటనముజేయుచు నయా నచట నాటకప్రదర్శనముల గావించెడిదనియు నానగో[illegible] నాస నగరిలో నాటకము నాడినప్పుడు మేళగాండ్రలో జూపరి (సూపరి ?) యైన స్త్రీ వేషధారి యువకునిగాంచి యా రాణి వాని వలచి వానితో సాంగత్యము నెఱపెననియు నందొక యైతిహ్యము గలదు."
(గోల్కొండ తానీషా కొలువునఁ గూచిపూడి సిద్ధేంద్ర యోగి మేళము సన్మానింపఁబడినసంగతి గడచిన ప్రకరణమునఁ దెలుపఁ బడినది. అట్టిమేళమున కొకదాని యక్కన మాదనల (సాపు) నెలిగిన దేమో!) అది యక్షగాన మేళమే యైయుండునెడల తెలంగాణమున యక్షగానమునకుఁ జాలకాలముక్రిందటనే ప్రవేశముగల్గి యుండెనని చెప్పనగును. తెలంగాణములో నిటీవల వెలసిన మేళములలో చిరుతల నాట్యమండలి యొకటి కొంత పేర్వడసినది. ఏదోయొక విధముగ నటు మెలట్టూరునందువలె నిటు తెలంగాణమునను దెనుఁగు యక్షగాన మూపిరి నిలుపోపి యుండుటయే విశేషము.

---

46. చూ. వారి వ్యాసము — ఆం. ప. ఖు సం. సం.

* వీరు 17 వ శ. ఉత్తరార్ధమున నుండినవారు.

# యక్షగాన సాంప్రదాయిక పాత్రలు

రూపక ప్రవర్తనకుఁ బ్రాణస్థానము పాత్ర.
పాత్రయనఁగా రసపాకమున కాధారముగదా!

ఇఁక బహుళయక్షగాన సామాన్యముగా రూపొందిన సాంప్రదాయిక పాత్రలను గూర్చి కొంచెము చెప్పవలసి యున్నది. ప్రాయికముగాఁ బ్రతిదేశ జానపద రూపకము లందును నెవ్వియో కొన్ని సాంప్రదాయిక పాత్రలుండును. ఇతివృత్త మేదియైనను నా పాత్రలన్ని కథల తోడను బొత్తుకుదురుచుండును. ఆ సాంప్రదాయిక పాత్రల తత్త్వముఁ బరిశీలించినచో, సందుఁ జాలవఱకు హాస్యరస ప్రసక్తి కొఱకు నుద్దేశింపఁ బడినట్లుండును. రుచులలో నుప్పెట్టిదియో రసములందు హాస్యమట్టిది. అది సర్వజన మనఃపర్వమైనది. విద్వత్పారిషదుల నుద్దేశింపఁబడిన సంస్కృత నాటకములలోనే విదూషకునిపాత్ర గతానుగతికముగఁ గన్పించును. ప్రస్తుతజాతి నారంభించినది మొదలు తెల్లవారువఱకును జాగరము జేయించు మన జానపద ప్రదర్శనము లందు మధ్యకాలములోఁ బ్రేక్షకులు కుశలప్రసంగముఁ జేసికొనుటకుఁ గొంత విశ్రాంతికాల మవసరము. అందులకే యీపాత్రలు సృష్టింపఁ బడినవి. ఆపాత్రల వినోదప్రసాద మభినవ నాగరికులకు వెగటుగఁ దోఁపవచ్చును. కాని మనయక్షగానముల విషయమెత్తుకొనినచో నయ్యవి యీనాఁడు మనకెంత మోటుగఁ గన్పించినను నొకనాఁడు కోటలోని రాజులకును బేటలోని ప్రజలకును సమానమైన కాలక్షేపముగఁ బరిఢవిల్లినవి. గ్రంథరచనఁ గావించిన వారియందు గ్రామకరణములే కాక పండిత గ్రామణులును రాజకవులును గూడనుండిరి. మఱియొక మాట. ఆ ప్రదర్శనముల ప్రేక్షక సమాజమం దెక్కువ

పాలు ప్రజాసామాన్యము. వారికిఁ గావలసినది విజ్ఞానమే యైనను వారధికముగ నాకాంక్షించునది వినోదమే. తరములు గడచినను వారి వినోద కాంక్షయందును, గడమ యభిరుచుల యందును, అసలు వారి జీవిత ప్రవృత్తులందే వైజ్ఞానికమైన పరిణామ మొకప్పుడును రాదు. నాగరికులవలె వారు 'గతి రసికులు' గారు ('జానపదులకంటె నాగరులు వివేకులు' గదా !). కాఁబట్టియే తరములు గడచినను వారి యభిరుచులం దేదియో సమీచీనమైన సమానత్వము గోచరించును. వారి యూహాపోహములును నాశయములు నాదర్శములును సమయ బద్ధములు. అందువలననే వారభిలషించు ప్రదర్శనములలోఁ గొన్ని పాత్రలలో గూడ సాంప్రదాయికత్వము పొడసూపినది. ఆ పాత్రలు ప్రజాదరమును జూరఁగొని ప్రచారమునకు వచ్చినవి. అప్పటి రూపకకర్తలది గ్రహించి, సంప్రదాయవిధేయులై తామేకథ నారంభించినను నాపాత్రల కెటులనో ప్రసక్తిఁగల్పించుచు వచ్చిరి. తోలు బొమ్మల యాటలో బంగారక్క, జుట్టు పోలిగాఁడు, గంధోళిగాఁడు, చోడిగాఁడు, అల్లాటప్పయ్య మొదలగు వారు మొదట నిట్లు బయలు దేరినవారే. అటులనే యక్షగానము లందును దద్రూపాంతరములైన కలాపములు, కొరవంజులు మొదలగువాని యందును గొన్ని పాత్రలు హాస్యరస ప్రసిద్ధములై సాంప్రదాయికముగ రూపొందినవి. ఆపాత్రల హాస్యప్రవృత్తియందు సామాన్య జీవిత స్పర్శ యుండును. తత్పాత్రోచితమగు నాఁటి వ్యావహారికపు నుడికారము వాటము గూడఁ దెలియును. ఒక్కొక్కపాత్రను మెతుకు పట్టి చూతము :

1. మాధవి :- ఈతని పాత్ర కూచిపూడి కులపతుల యపూర్వ సృష్టి. ఈతఁడు పాత్ర యనినచోఁ బాత్ర కాఁడు. కాఁడనినచోఁ బ్రతి

భామాకలాపమందును విధిగా బ్రత్యక్షమగును. గొల్లకలాపములలోఁ గ్వాచిత్కముగఁగన్పించును. కాని సత్యాకృష్ణ సంబంధులగు పారిజాతాది కథాసందర్భము లితివృత్తముగాఁగల చాల యక్షగానములలోఁ గూడఁ దఱచుగనే కన్పించును. మాధవి సూత్రధారునివలెఁ గథాను సంధానము సేయును. విదూషకునివలె హాస్య ప్రసంగములు విని పించును. పాత్రలను ప్రేక్షకులకుఁ బరిచయము చేయును. స్వాయముగాఁ బలుకరించును. ఈతఁడచ్చుమచ్చు సింహళదేశపు నృత్య రూపకము "కోలం నాటిమా" లోని "తోరాతరు కథాకారయ"[47] వంటి వాఁడు. బర్మాదేశపు వీథినాటకము "నిభట్ కిన్" లోని "లూ-బయట్"[48] వంటి వాఁడు. యథార్థమున కితఁడు కథాగత పాత్ర కాఁడు. అట్లని కేవలము వెనుకనుండి హంగుచేయు నక్కాబత్తుఁడును గాఁడు. కథకుఁ గలిసివచ్చు పాత్ర. నాయికా నాయకు లిద్దఱికిని శృంగార సహాయకుఁడుగ వ్యవహరించును. వారిద్దఱికి మధ్య దౌత్యము గూడ నడపును. వారిని వెటకారముసేయుటకు "లైసెన్సు" ను గూడ సంపాదించిన వాఁడు. చెంగల్వరాయ పారిజాతాది యక్షగాన కృతులలో వారి ప్రసంగాలకు "పేరడీ" లు గూడఁ జేసినాఁడు. మాధవి వేషము వేయువాఁడు మగవాఁడే. ఆప్రదర్శక ముఖ్యుఁడెవఁడో వేయును. ఆవేషమున కొక నిర్దిష్టమైన యాహార్యక మేమియు లేదు. పైమీఁదఁ గండువా యుండినఁ జాలును. మామూలు పంచెకట్టు తోడఁ బ్రదర్శనలోనికి దిగిపోవచ్చును. నాయకునిఁ బలుకరించినపుడు మగధీరుని వలెనే కండువాను సవరించును. నాయికను బల్కరించు

47. Vide., Dr. Manmohan Ghosh's Paper On the Sinhalese Dances, Published in 'The Indo Asian Culture, Vol. I - NO. 2.

48. Vide., 'Burmese Drama' By Dr. Maung Htin Aung.

సరికి ఆ కంఠమునానే పమిటగ సవరించి సిగ్గుపడుచున్నట్లు బుగ్గమీఁద వ్రేలును, నడుముప్రక్కఁ గేలును బెట్టుకొని నడకయందును వగలుపోఁ గూడ 'ఆడారి' నాటము దెచ్చిపెట్టుకొనును. ఒయ్యార మొలుకఁ బోయును. అతఁడక్కలలో అక్క, బావలలో బావ. మాధవికే మాధవుఁడని కూడఁ బర్యాయ వ్యవహారమున్నది. మాధవ మాధవీ నామధేయములు కృష్ణునికిని నాతని సతులకును మాత్రమే వర్తించును. కాని యీ భామాకలాపము 'సీసరు బుడ్డికి' గూడ నా పేళ్ళనే పెట్టిరనిన నేదియో విశేషముండవలెను. అప్పుడప్పుడుఁ గలాపములో నాయికా నాయకులకుఁ బరస్పరముగాని, మనోవృత్తిలో నైనఁగాని మాటలాడుట కవకాశము గాని యౌచిత్యముగాని లేని సందర్భము గలుగును. కాని, పాత్రలు తమ మనస్స్వభావమును ప్రేక్షకుల యెదుటఁ బెట్టవలెను. అందులకు "స్వగతము" నాశ్రయింపవలెను. అసలే కలాప మాత్మాశ్రయశక్తిక మయిన రూపకము. అందునను నీ స్వగతము లుండినచోఁ బ్రేక్షకులకు విసువు హెచ్చ వచ్చును. అదియుఁ గాక కొందఱు స్వగతము లసహజమైన వందురు గదా. బహుశః ఆ స్వగతములఁ బరిహరించుటకే మాధవి పాత్ర ప్రకల్పితమైనదని యూహింప వచ్చును. ఎందువలన నన్నచో నొక మాధవుఁ డింకొక మాధవుని తోడను నొక మాధవి యింకొక మాధవితోడను మాటాడుట యనునది చాల విచిత్రముగనే కన్పించును. కాని, యట్లు మాటాడిరనినఁ బాత్రలు తమలోఁ దాము మాటాడి కొనినటులనే లెక్కయగును. కలాప ధర్మమునకుఁ గలిసివచ్చును. దాని యాత్మాశ్రయపు శక్తికి లోపముండదు. విసుగుఁ బుట్టింపక నాటకము చక్కగ నడచి పోవును. అందులకే కలాపములో మాధవి కథాగతమైన పాత్ర కాక పోయినను గథకుఁ గలిసివచ్చు పాత్ర యనుట.

2. సుంకరికొండడు :— గొల్లకలాపములలోఁ జూడవలెను వీని వాలకము. అన్నింటిలో వాని పేరు కొండడే. వీఁడు గుజరాతీ 'భావై'లో "రంగాళో"[49] వంటి వాఁడు. లాలా కన్నయ యను నాయన రచించిన "సుంకరి కొండని వేషము కథ" యను యక్షగాన నాటకములో వాని వాలక మిట్లు వర్ణింపఁ బడినది.

గడితపు చల్వ చల్లడము పైసబిగించి
తగ రాణ మెఱయఁగా దట్టి జుట్టి
పిక్కటి బిరుదుగా బిగియు చుంగురు గుంటి
చొక్కాయ పెక్కల నంటఁ దొడగి
జరికుసుంబారంగు శాలు పాగామీఁద
రవగల్కు కల్కి తురాయిఁ జెక్కి
గుభ గుభాళించు సౌరభము గుల్కెడి మేన
కమ్మి దుప్పటివేటుగా నమర్చి
కత్తి ఝుళిపించి వర కరాగ్రమున నుంచి
వాడి కొనగోళ్ల మీసంబు దీడి దీడి
దుండగీఁడౌచు సుంకరి కొండ డదుగొ
వచ్చెఁగాఁబోలు విసవమ్మ వారిజాక్షి.

వాని రాక పోకలు చెడ విసురుగా నుండును. ఏలపాట బాడు కొనుచు హేలగ నచ్చును. నచ్చి చల్లనమ్ము గొల్లభామను సుంకము గాని తత్పరిహారయముగఁ జుంబనము గాని యిమ్మనును.

ఆమె తప్పించుకొనుటకుఁ బ్రయత్నించును. ఇక నిద్దఱికిని వాగ్వివాదము. ఆ వాదము చాలసరదాగా నుండును. కాని మోటుగ నుండును. గొల్లభామ తన గయ్యాళియత్తగారినిఁ బిలచెదను జూచు

49. Vide., Sir R. K. Yajnik's the Theatre of the People.

కొమ్మని బెదరించును. అబ్బోబాఁడసాన్యాసం—"గుత్త లోఁగపను మీయత్తవూ" కనును. చివరకుఁ జేబుముట్టి సరసమునకుఁ గూడ దిగును. కొన్ని గొల్లకలాపములలో నా యత్తగారు రంగమున మీఁదికి వచ్చి సుంకరిని గద్దించి కోడలు పిలను దీసికొని పోవును. ఇన్ని డాబులు కొట్టిన సుంకరియు నామె రాఁగానే ఉడాయించును. కొన్నిట యందత్త రాకుండఁగనే సుంకరియే గొల్లభామను సరసముగనో బలాత్కారముగనో లాగుకొని పోవును. గొల్లభామలు గూడ సత్తచాటున హెచ్చించుకొనుటకు సుంకపు డబ్బులు కలిపి వచ్చునని యో, నిజముగ గుతూహలము పుట్టియో సుంకరి సరసమునకు నామోదించుటయుఁ గలదు. దీనినిఁ బట్టి నాఁటి సుంకరి గొల్లభామల యల్లరి చిల్లర ప్రవర్తన విశదమగును. గొల్ల కలాపమునకు నంతరార్థము మఱియొకటి గలదు. సుంకరి కృష్ణునిపాత్రకొక సంకేతము. గొల్లభామ గొల్లభామయే. అందువలన గొల్లకలాపము గోపికా కృష్ణుల ప్రణయ తత్త్వప్రతిపాదకమగుచున్నది. ఈయూహ కుపబలకముగా శ్రీనివాస దాసు రచించిన రంగపురి పారిజాతమను నొక యముద్రిత యక్షగాన మందును లాలా కన్నయ గ్రంథమందును శ్రీకృష్ణుఁడే సుంకరి వేషము ధరించినట్లు స్పష్టముగఁ గలదు.

3. కటికము :— కటిక, కట్టియము, కటీకీఁడు, కోలకేతఁడు, కేతి నాయుఁడు, ఆస్థాన సంతోషి, సంతోషుఁడు, బాగుదారు, చోపుదారు, బరాబరి యని వీనికిఁ జాలఁ బేళ్ళున్నవి. యక్షగానములందు రాజప్రసక్తివచ్చు కథ లెక్కువ. కటికము రాజోద్యోగి. రాజకథాప్రసక్తిగల యక్షగానములందెల్ల వీని యవతారము విధిగానుండును. రాజనినఁ గేవలము రాజే కానక్కఱలేదు. ఇంద్రుఁడును, శివుడును మొదలైన వారుగూడఁ గావచ్చును. రాజపాత్రకుఁ బ్రసక్తిలేని యక్షగానములలోఁ గూడ నక్కడక్కడ వీనియవతారము కన్పించును.

వాని పేళ్ళను బట్టి వాని పనులు విశదమగును. వాఁడు రాజుగారి వాకిలి కావలివాఁడు — వేత్రహస్తుఁడు. రాజుగారిరాకను సభవారికిఁ దెలియఁ జేయును. రాజుగారిముందు నడచుచుఁ ద్రోవకడ్డును దొలగించును. రాజుగారువచ్చి గద్దె నెక్కఁగనే కైవారములు, హెచ్చరికలును బరాకులును బల్కును. వీని పేళ్ళన్నిటిలో నెక్కువ యాకర్షించునది "ఆస్థాన సంతోషి" ('కోర్టుఫూల్') యనునది. కేవలము సంతోషుడను పేరును "బఫూన్" అను మాటకు సమానార్థకముగ గ్రహింపవచ్చును. దక్షిణాంధ్ర యక్షగానములలో వీనిపాత్ర బాగుగ రూపుగట్టినది. తరువాతఁ దరువాత నుత్తరాంధ్ర కృతులలోఁ గూడ వీని యునికి తెలుచు గనే కన్పించును. అసలు వాఁడు తంజావూరు నాయకరాజుల, మహా రాష్ట్ర భూపతుల కొలువులోఁ జాలఁ బ్రాముఖ్యము వహించిన "రాచ సైనాతీ". వానిదొక వెట్టిగొల్లని వాలకము. ఆరాజులు హాస్య చతు రాస్యులు. వానికి మిక్కిలి చనవునిచ్చిరి. వాఁడు తన సహజవికృతా కార చేష్టాభాషణాదుల వలనఁ గొంత నత్తియో చెవుడో నటించి కొంత హాస్యమును బ్రదర్శించెడివాఁడు. ఆ తంజావూరి రాజ కవులుఁ దదాస్థానాశ్రితులైన తక్కినకవులును దమ యక్షగాన కృతులలోఁ గటికముపాత్రను ముచ్చటదీరఁ జిత్రించు కొనినారు. శహాజీ యక్ష గానములలో వీనిపాత్ర యింకను విశిష్టముగాఁ జిత్రింపబడ్డది. అందు శివ సంబంధులగు కృతులలోఁ గుండోదర, కుంభోదర, చండికేశ్వరాది ప్రమథ శ్రేష్ఠులును మామూలు కటికేంద్రవలెనే వ్యవహరించిరి. కటిక మునకు వికటాంగుఁడనుపేరుగూడఁ బెట్టినాఁడు శహాజీ. వానివాలకము:-

దరువు. పట్టె నామమూను బెట్టి, బారికోల కేలపట్టి
దట్టిపైని దుప్పటి గట్టిగాఁ గట్టి
జుట్టునిండా పూలుసుట్టి మిట్టాపండ్ల నెగఁబెట్టి
యట్టా హాసముతో వికటాంగుఁడు వచ్చెన్.

చాల గ్రంథములందుఁ గటికము రాకతోఁ గథారంభ మగును. వాఁడు భాగవతులతో హాస్య ప్రసంగము లాడుటయుఁ గొన్ని గ్రంథములలోఁ గలదు. గ్రంథములో వాని హాస్యమున కెక్కువ యవకాశమిచ్చు పట్టు రాజదర్శనార్థుల రాక. వచ్చినవారినెల్ల నెక సక్కెము చేయుట వానిపని.

4. సింగి, సింగఁడు :- చెంచులు, ఎఱుకలు, కొరవలు అను గొండజాతులకుఁ జెందిన దంపతులు వీరు. తాము చెంచు హోబని, అనఁగా గరుడాద్రి నారసింహుని వారసులమని వారి విశ్వాసము. అందులకనియే యాపేర్లు. సింగనివృత్తి వేట, సింగికి సోదె + వృత్తి. సింగఁ డడవి కోనలఁ దిరిగి వేళ్ళు నెల్లంకుల సంపాదనము గూడఁ జేయును. సింగి దేశదిమ్మరియై సోదెతోఁ బాటుగ నావేళ్ళను నెల్లంకులను నమ్మును. వారి వేషభాషలందును గులాచారము లందును సగ మాటవికత్వమును సగము దేశదిమ్మరితనమును గన్పించును. చెంగల్వరాయ పారిజాత మను యక్షగానములోని యెఱుకల కథ వలన సింగి పచ్చలు గూడఁ బొడువఁగలదనియు, శకునములు సాముద్రికము గూడఁ జెప్పఁగలదనియుఁ దెలియుచున్నది. సన్నిధిరాజు జగ్గకవి జ్ఞాన - యెఱుకల కురవంజి మొదలగు గ్రంథములలోఁ గూచిపూడి గొల్లకలాపములో గొల్లభామవలె వేదాంతోపన్యాసములు గూడఁ జేయును. సింగనికిఁ జోడిగాఁడనియుఁ బేరు. ఆ పదము ప్రియుఁడను నర్థమునఁ గోవెల రామదాసు ప్రణయ కలహాకలాపము, కూర్మనాథకవి మృత్యుంజయ విలాసము మున్నగు యక్షగానములలో వాడఁబడినది. వాని సక్రమస్వరూపము "కోడెగాఁడ" యి యుండు

+ దీనికే ఎఱుక, గద్దె (గద్య — రాగవరుసలో సాగఁదీసిన వచనమే), కురి (అరవము — తెలుగు గురి!) అనియు నామాంతరములు.

నని యూహ. సింగికి ఎఱుక, కొరవజాతుల స్త్రీయను నర్థములో నెఱుకత, కొరవంజియనియుఁ గూడఁ బేళ్ళున్నవి. మొదటగా ఆమూఁడును సమానార్థములుగ గిరిరాజ కవిరాజ మోహన కొరవంజి యందు వాడఁబడినవి. చాల యక్షగానములలో సింగి, సింగని ప్రసంగము వచ్చును. కాని సింగిపాత్రకున్న ప్రసిద్ధి సింగనికి లేదు. ఆమె పాత్రకుఁ బ్రాధాన్యముగల కొన్ని గ్రంథముల కామె పేరే పెట్టఁబడినది. అవియే కొరవంజులు.

యక్షగానములకుఁ గొరవంజులకు పేరిలోనేకాని ప్రక్రియలో భేదములేదు. ( ఈవిషయమంతయుఁ బూర్వోక్తము ). కొరవంజులలో నెఱుకత పాత్ర తప్పక యుండును. యక్షగానములలో యాదృచ్ఛికము. అంతియే. కొరవంజులలో నేమి యక్షగానములలోనేమి సర్వ సాధారణముగ నెఱుకతపాత్ర ప్రవేశించు సందర్భము కథానాయిక తాను వలచిననానినిఁ గూర్చిన తలపోఁతలో నుండును. ఆతనిపొందు కుదురునా కుదరదా యని యనుమానపడుచుండును. అప్పుడువచ్చు నెఱుకత; వచ్చి తమ కులాచారము లుగ్గడించి, తన దేశాటన విశేషములు వివరించి, యెఱుకదేవతల పేరు లేకరువుపెట్టి సోదె మొదలిడును. ఆదైవముల పరంపరలో నెవరిపేరు తప్పినను దప్పవచ్చుఁగాని కొల్లాపురి లక్ష్మిపేరు తప్పదు. ఆమె వారి కుల దేవత. "కొల్లాపురమ్మను గొలుతుము మేము, ఎల్లవారికి నది యిలు వేలుపమ్మ" యని యెఱుకత యనును. ఆమె సోదె యంతమగు సరికి సింగఁడామెను వెదకికొనుచు వచ్చును. వాఁడామెసోదె చెప్పి సంపాదించిన సొమ్ములు నవియుఁ జూచి మఱియొకఁడెవఁడో యిచ్చి యుండునని యనుమానపడును. ఆమె సమాధానముఁ జెప్పికొన వలసి వచ్చును. అక్కడ వారి సంవాదము. ఆ ఘట్టమంతయు హాస్య రసోత్తరముగ నడచును. కొన్ని కొన్ని గ్రంథములలో లక్ష్మి

నారాయణాది దేవతలుగూడ సింగి, సింగని నేపథ్యమును స్వీకరించి నట్లు దెలియుచున్నది. ఉదాహరణమునకు దరిగొండ వెంకమాంబ-శివ విలాస యక్షగానము మొదలయినవి.

5. మంత్రసాని:- శ్రీకృష్ణ, ప్రద్యుమ్న, మార్కండేయ, ధర్మాంగదాది బాలపాత్రల జననాదికమునకు ప్రాధాన్యము గల గాథలను గ్రహించిన యక్షగాన గ్రంథకర్తలు కొందఱు మంత్రసాని పాత్రను బాగుగాఁ జిత్రించినారు. ఒక్క యుదాహరణ:- [illegible] లక్ష్మణకవి ధర్మాంగద నాటకములో దాసీ జనము రాణిగారికిఁ బ్రసవసమయమైనదని మంత్రసానిని రమ్మందురు. దాని [illegible] బెట్టుసరియు నప్పుడే వచ్చిపడును. దాని సమయమప్పుడే గదా! "అమావాస్య నాఁడు అట్లు పెట్టితిరే! పున్నమనాఁడు బూరెలు పెట్టరే!" అని యెత్తిపొడుపుమాట కారంభించును.

6. ఇతరములు:- ఇఁక నంతంతమాత్రముగఁ దోఁచుచు వచ్చు సంప్రదాయ హాస్య పాత్రలు కొన్ని యున్నవి. పురోహితులు, నట్టువలు మొదలగువారు. వారి ప్రసంగములు రంగాజమ్మ మన్నారుదాసవిలాసము లలోఁ గమ్మగ వర్ణింపఁబడినవి. కొన్ని యక్షగానములలో హాస్యగాఁ డని ప్రత్యేకముగ నొక పాత్ర కన్పించును. వాఁడు [illegible], [illegible] వలె వ్యవహరించును. తంజావూరి యక్షగానములలో విఘ్నేశ్వరుని స్తుతిమాత్రమే కాక విఘ్నేశ్వరుఁ డొక పాత్రగ, నాతని రాకగూడ సంప్రదాయ నిబద్ధముగ ముచ్చటింప బడినది. ఉత్తరాంధ్ర యక్షగాన కృతులలోఁ గొన్నిటియందు గంధర్వస్త్రీల రాకయని గ్రంథారంభము ననే కథకు సందర్భశుద్ధి లేకపోయినను రంభోర్వశ్యాదుల రాకలును వారి గానాభినయముల ప్రసక్తియుఁ జెప్పఁబడుటకలదు. సత్యభామా రుక్మిణులు, గంగాగౌరులు, జెంచులక్ష్మి—ఆదిలక్ష్ములును, మోహినీ సంధ్యావళులు మొదలగు నాయికల జంటలువచ్చు యక్షగానములలో

ననతికయ్యు నొకటి గతానుగతికముగ వచ్చుచున్న జనరంజకమగు విషయమైయుండి. భాగవతకలాపములలో దాని కొక ప్రత్యేకత గలదు.

తంజావూరు సరస్వతీ మహాలు నందముద్రిత గ్రంథసంచయములో 'నాటకపాత్రలు' అను నొక గ్రంథమున్నది. అందు నాడు ప్రసిద్ధములైన కెక్కిన రామాపండితాదుల నాటకము లిరువది మూడింటిలో వచ్చు వివిధపాత్రల, తత్పాత్రధారుల పేళ్ళు మాత్రము పట్టికలుగ నుదాహరింపబడినవి. అందు భిన్న భిన్నేతివృత్తములుగల గ్రంథములలో సామాన్యముగఁ గన్పించు పాత్రలు కొన్నియున్నవి. అవి విఘ్నేశ్వరుడు, ప్రమథగణములు, మాణియము, కురుక్కళు, పంచాంగబ్రాహ్మణుడు, బిక్కాజినాయకులు, మహాబ్రాహ్మణులు, సుఖిణి, బురద వేషము, కొరవంజివేషము, జోసి మొదలగునవి. ఈ పాత్రలలోఁ గొన్నింటి స్వరూప మీనాడు మనయూహ కందదు. మనకు దొరకిన యీనాటి యక్షగానములలో నైనఁ గన్పించునాయని వచ్చున వైనను గన్పింపవు. అందు మొదటి నాలుగైదు పాత్రలు నాటక ప్రారంభాంగ ప్రసన్నతన కుపయోగపడునవి. అందు మణియము, కురుక్కళు పరదేశపదములు. మణియ మనిన నూర దేవాలయాద్యధికారి; కురుక్కళనిన బ్రాహ్మణేతర లేక పురోహితుడను నని యర్థము. వారిద్దఱు నాయకపతి మూడను నాటకములలోఁ గన్పింతురు. బిక్కాజి నాయకుడు ముప్పదిమూడు నాటకములలోఁ గన్పించును. బిక్కాజి శబ్దమున కర్థము తెలియదు గాని కటికముచంటి పాత్ర యయియుండునేమో యని తోఁచును.[50]

50. ఒక నీచ రాజ్యస్థాపకుని పేరు "బిక్కాజి" యనియు, నతని జీవిత గాథ రాజస్థాన నృత్యరూపకమగు "భావై" యిది వృత్తములలో నొకటి యనియుఁ దెలియుచున్నది — Vide, Sangeet Natak Akadami Bulletin (Of the Govt. Of India) No. 2. Oct, 1954.

యక్షగానములు ప్రధానముగఁ బ్రజా సామాన్యపు వినోదమున కుద్దిష్టమైనవి. అందుచే వానిలోని సాంప్రదాయిక పాత్రలు గూడ హాస్య రసాశ్రయములుగ నుండును. ఒక్కొక్కప్పుడా పాత్రలు చేయు పరిహాస మెదుటి పాత్రల పాత్రతాపాత్రతలను గూడ లెక్కింపదు. అది శోచనీయమైన విషయము. అంతమాత్రముచే మనమా కావ్యరాశి నంతను నిరసింపఁ గూడదు. అందునను సాహిత్య జిజ్ఞాసువులు దెలిసికొనఁ దగిన విశేషము లా సాంప్రదాయిక పాత్రల ద్వారముననే వెలువడునవి యనేక మున్నవి.

ఇట్లు వివిధ ప్రదేశములలో వెలసిన యక్షగానము లందెన్ని పాత్రలు సాంప్రదాయికముగా రూపొందిన చూడఁగా యక్షగాన ప్రయోగమున కెంత ప్రచార ముండెడిదో, అదియెంత జనరంజకముగా యుండెడిదో తేటతెల్లము కాఁగలదు.

# సింహావలోకనము

యక్షగాన పరిణామ చరిత్ర ప్రకరణమున ఉపోద్ఘాతముగా యక్షగానోత్పత్తి పరిణామ స్వరూపమునుగూర్చి సింహావలోకనము సేయుట యైనది. ఇపుడీ ప్రకరణమున యక్షగానములందలి తరగతులు, యక్షగాన లక్షణ వైశిష్ట్యములను గూర్చిన సింహావలోకనము చేయఁబడు చున్నది.

## యక్షగానము తరగతులు

యక్షగానములను వాని ప్రయోజన ప్రాధాన్యమును బట్టి త్రిధా విభజింపవచ్చును. :-

1. శ్రవ్యములు. 2. దృశ్యములు. 3. ఉభయప్రయోజనాత్మకములు.

శ్రవ్యములుమరల ద్వివిధము :-

1. ప్రబంధములవలెఁ గేవల పఠనమునకు మాత్రము పనికి వచ్చునట్టివి. ఉదా :- లక్ష్మీనారాయణ విలాసము, కన్యకా విజయము, అన్నదానము వెంకటాంబ యక్షగాన రామాయణము, నిశ్చింత ఎంబారయ్య ప్రహ్లాద విజయము మొదలగునవి.

2. హరికథలవలె జంగం కథలవలె, లేక పురాణ గోష్ఠికిఁ దగినట్లు కథాఖ్యానమునకుఁ బనికివచ్చు నట్టివి. ఉదా :- బాగేపల్లి అనంతరామాచార్యులు, ధనకుధరం రామానుజాచార్యులు, నెడా దూరు వెంకటాచార్యులు మొ .. వారి కృతులు.

దృశ్యములను గూడ 1. వీధి నాటకము, 2. బొమ్మలాట, 3. మార్గ నాటకము, 4. ఆధునిక నాటకముల ఫక్కికలనుబట్టి చతుర్థా విభాగింప నగును. వరుసగా నొక్కొకదానికి ఉదా :- 1. తంజావూరు విజయ రాఘవాస్థాన కవుల కృతులు మొ॥. 2. కోట

వెంకటప్పయ బాణాసుర నాటకము మొ॥. 3. తుకోజీ, శివాజీ ప్రభృతుల కృతులు. కూచిపూడివారి కలాపము, మెలట్టూరు భాగవత మేళ నాటకములు నృత్య ప్రధానములగుట వాని యందుప రూపక ధర్మమును గర్భితమై యున్నదనవచ్చును. తంజాపురాన్న దాన నాటకాదులు కొద్ది దశరూపక ప్రభేదమగు ప్రహసన తత్త్వమును గొంత కలిగియున్నవి. 4. కేశిరాజు వెంకట సుబ్బయ గారి రామదాసు నాటకము మొ॥. ఇవికాక వీధి, మార్గ, ఆధునిక రంగస్థల నాటకముల పోకడలు మూఁటను గల కలగలుపు ప్రక్రియ గలవియుఁ గొన్ని గలవు. ఉదా :- పట్టోరి వీరప్ప క్రోధాపుర్వైగసు విజయము.

ఇక ఉభయ ప్రయోజనాత్మకముల కనఁగాఁ బాడుటకు నాడుటకు నుద్దేశింపఁ బడిన వానికి, ఉదా :- శ్రీనివాస కవి పారిజాతము, భారతి రామరాజు గొల్లకలాపము, గోగులపాటి మృత్యుంజయ విలాసము మొదలగునవి.

ఇఁక యక్షగానమును వివిధ ప్రక్రియాంతరములతో దానికిఁ గల యాంతరంగికానుబంధముల యంతరువులనుబట్టి కొన్ని తరగతు లుగా విభజింప వచ్చును.

1. వీధినాటకము, 2. బొమ్మలాట, 3. మార్గనాటకము, 4. ఆధునిక రంగస్థల నాటకము....

ఈనాల్గిటితోఁగల యనుబంధమునుబట్టి యేర్పడు తరగతులు మీఁద సోదాహరణముగాఁ జూపఁ బడినవి. మిగిలినవి :-

5. కలాపముతో - ఉదా :- పారిజాతములు, పురిజాల లక్ష్మీ నారాయణకవి పారిజాతము, శేషము రంగాచార్యుల శివకేశవ పారిజాతము మొ॥.

6. ప్రబంధముతో – ఉదా :- మృత్యుంజయ విలాసము మొ॥.

7. ఉలాప్రబంధముతో – ఉదా :- రఘునాథాభ్యుదయము మొ॥.

8. కొరవంజితో – ఉదా :- రాజమోహన కొరవంజి మొ॥.

9. ఏకాంతసేవతో – ఉదా :- మా. వెంకటాచలమయ్య ఏకాంతసేవ మొ॥.

10. పల్లకి సేవా ప్రబంధముతో – ఉదా :- శహాజీ శంకర విష్ణు పల్లకిసేవా ప్రబంధములు.

11. హరికథతో – ఉదా :- భాగేపల్లి అనంత రామాచార్యులు, ఆదిభట్ల నారాయణ దాసాదుల కృతులు మొ॥.

12. జంగం కథతో – ఉదా :- ధనకుధరం రామానుజాచార్యుల బిల్హణీయము.

ఇంక నితివృత్త నైవిధ్యమునుబట్టి యేర్పఱింపఁదగిన తరగతులు కొన్ని గలవు.

1. (అ) పౌరాణికములు :— రామాయణ భారత భాగవతాదుల నుండి గృహీతములైన కథలు గలవి. ఉదా :— (రామాయణ) సుగ్రీవవిజయము; (భారత) దుష్యంత చరిత్రము, సౌభరి చరితము (భాగవతము – విష్ణుపురాణము) మొ॥.

(ఆ) స్థలపురాణములు లేక క్షేత్రమాహాత్మ్యములు :— ఉదా :— చిత్రకూట (చిదంబర) మాహాత్మ్యము, గరుడాచల నీలాచల విలాసములు, భావనారాయణ (పొన్నూరు) విలాసము మొ॥.

2. (అ) చారిత్రకములు :— ఉదా :— కాకతి రుద్రాంబకథ. (ఉయ్యూరు శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారిది). రఘునాథాభ్యుదయము (తంజాపూరు విజయరాఘవనాయకకృతము) పెద బొబ్బిలి చరిత్ర (చెర్విరాల భాగయ కృతము) మొ॥.

(వెనుకటి సూచన్లేవి నాటక మిట్టిదే).

(ఆ) మహాపురుషుల చరిత్రలు :— ఉదా :— విప్రనారాయణ (తొండరడిప్పొడి) తిరుమంగై యాళ్వారుల చరిత్రలు, అక్కమహాదేవి, అండాళు చరిత్రలు, బసవేశ్వర భద్రాచలరామదాసు పుండరీక పోతులూరి వీరబ్రహ్మస్వామి శివరామయోగి కొల్హాపురి మల్లసుల చరిత్రలు, ఏసునాథ కథామృతము మొ॥.

3. తాత్కాలికేతి వృత్తములు :— ఉదా :—విజయరాఘవ కల్యాణ చంద్రికా విహారములు, మన్నారు దాసవిలాసము, శాహరాజ కల్యాణ విలాసాదులు — ఇవి యన్నియు తంజావూరికిఁ జెందినవి. ఇవి మన నాఁటికి చారిత్రకము లనిపింపవచ్చును, గాని యా కృతుల రచనా కాలమునాఁటి కా యితివృత్తములా కవులకు సమకాలికములే.

( వెనుకటి రాజ కళింగగంగు నాటకము, వీర నరసింహ రాయల కడ కూచిపూడి భాగవతులు ప్రదర్శించిన సంబెట గురవరాజు నాటకము తాత్కాలికేతి వృత్తాలే. )

4. సాంఘికేతి వృత్తములు:- ఉదా:- సంగాపు హాస్యగాన నాటకము (నాఁడు తంజావూరి సత్రములో "నడిమా" వేయుచుండ దేశ సోమరిపోతు తిండిపోతు బాపనయ్యలు కొందఱు సత్రముకడ నైతే తక్కులాడి డబ్బులు దండుకొన వచ్చిన నట్టువరాండ్రతో విరస ప్రసంగము లాడుట యిందలి ప్రధానేతి వృత్తము, అట్టివారినిఁ బరిహసించుటయే దీని పరమార్థము గావునఁ బరమార్థమున దీనిని సాంఘికేతివృత్త మనవచ్చును.) క్రోధాపురి రైతువిజయము మొదలగునవి నిస్సందేహముగా సాంఘికేతివృత్తములు.

5. జానపదగాథలు :- జన పదములఁ బదరూపమునఁ బ్రచారమున నున్న కథ లితివృత్తములైన యక్షగానములును గలవు. ఇట్టివి

తెలంగాణను వానిలో నెక్కువ. ఉదా :- చెర్విరాల భాగయగారి ఆరెమరాటీలచరిత్ర, బాలనాగమ్మచరిత్ర, కాంభోజరాజు చరిత్ర మొ॥

6. కల్యాణకథలు :- కన్నడ యక్షగానములందు "కళగవు" ల (కలహము ?) (యుద్ధములు - యుద్ధ కథలు) వలె మన య. గా. లందు కల్యాణ కథలెక్కువ. ఉదా :- శహాజీ, ద్రౌపదీ, శాంతా, సీతా కల్యాణాదులు.

7. తత్త్వ విషయికములు :- ఉదా : ముక్తికాంతా పరిణయము, వివేక విజయము, రాజరంజన విద్యా విలాసము మొ॥ సర్వ సాధారణ ముగ నిట్టివానిలోఁ బ్రబోధ చంద్రోదయమునందువలె నొక సాంకేతిక వివేచన యుండును. ఇట్టివి ప్రదర్శనము లందెట్లు రక్తికట్టునోమఱి !

8. ఇతరములు :- ఇంకను విలాసము - చరిత్ర - విజయము - అను పేళ్ళతో వ్యవహరింపఁబడు రకములు కొన్ని గలవు. తెలంగాణా య. గా. లలోఁ జిత్ర విచిత్రములైన యితివృత్తములు గలవికొన్ని యున్నవి. ఉదా :- కనకతార, కాంతామతి, భద్రసేన విలాసము, అల్లీరాణి చరిత్రము, కృష్ణగారడి, మాయాసుభద్ర, మాధవ చరితము మొ॥ (చూ. చెర్విరాల భాగయ కృతులు). ఇందుఁ గొన్నిటికథలు "కాశీ మజిలీ"ఫక్కిఁ జెందునట్టివి. కొన్ని పురాణ గాథా పరివర్తనములు, కొన్ని కవిస్వకపోలకల్పితములు. రస ప్రాధాన్యము, రచనాంగ ప్రాధాన్యము మొదలగు విషయములను బట్టియుఁ గొన్ని రకముల వింగడింపు చేయవచ్చును. (మన య. గా. లందు శృంగార హాస్యములకుఁ బ్రాముఖ్య మధికము). కాని యక్ష గాన ప్రక్రియా తత్త్వము యొక్క వైవిధ్యమును జూపుటకుఁ బై వింగడింపు చాలును.

# యక్షగాన లక్షణము

ఉపరి నిరూపితమైన రీతిగా నితివృత్త విషయమున, రచనా ప్రక్రియలో, ప్రయోజనములో బహుముఖమైన వైవిధ్యమును ప్రదర్శించిన యక్షగానము లక్షణమునకు నేర్పరించుట మిక్కిలి కష్టము. చిత్రకవి పెద్దన, కాకునూరి అప్పకవి మొదలగు లాక్షణికులు చెప్పిన లక్షణ మపర్యాప్తమైనది. కాని యచటఁ బ్రత్యేకముగ, సమగ్రముగ యక్షగాన లక్షణము చెప్పుట వారి పూనిక గాదు. రగడ లక్షణమును, రగడ ప్రభేద పరిగణనమును వారి లక్ష్యములు. నాఁటి యక్షగానము లలోఁ బ్రచారము నందుండిన జంపె రేకులు మొదలగు తాళప్రధాన రచనలు రగడ వికృతులని వారు గుర్తించిరి. అందే దేని, ఏకతాళ మే రగడ తరగతికిఁ జెందునో యా విషయమును గూడ నొసఁగాక ముగఁ బేర్కొనుటయే వారి యాశయమై యుండు ననిపించును. అంతియేకాని అప్పకవియంతటి లాక్షణికుఁడు, యక్షగాన లక్ష్య కర్తయునైనవాఁడు, సుగ్రీవ విజయాద్యనేక సుప్రసిద్ధ ప్రప్రథమాంధ్ర యక్షగానములు వెలసిన వెనుకఁ బుట్టినవాఁడు, తన ముందున్నట్టి యాంధ్ర వాఙ్మయము సమాలోడన చేసినవాఁడు, యక్షగానమునకు రేకన్నదే యేకైక రచనాప్రక్రియ యని యెంచి యుండుటచేతనే యనికాని లేక చేతఁగాక పూర్వుఁడగు చిత్రకవి పెద్దన చెప్పిన లక్షణము నట్లు పునశ్చరణ చేసినాఁడనిగాని యనరాదు. (వారు చెప్పిన యా యక్షగానపు రేకుల లక్షణము పూర్వోక్తము). ఈ విషయమునే మఱియొక విధముగఁ జెప్పవచ్చును. ఆ నాఁటికే చంపూదాహరణ ద్విపదాద్యనేక కావ్య రచనాంగములు గలిగి పాఠ్య గేయ నాట్యాదిక వివిధ ప్రయోజన సనాథమైన విపులప్రక్రియగా బహుముఖ పరిణతి కున్ముఖముగా సాగిపోవుచున్న యక్షగానమున కొక నిష్కర్షతో లక్షణము చెప్పుట యసమంజసమని వారు తలఁచి

యుండిన నుండవచ్చును. లేదా, ఆ యిరువురి కాలమునను యక్షగానమునం బ్రధాన రచనాంగము రేకే యుండుటవలన (కడమ యంగములగు ద్విపదాదుల లక్షణము నెట్లును వేఱ చెప్పనే చెప్పిరి) దానినిగూర్చి మాత్రమట్లు ప్రత్యేకముగాఁ జెప్పియుందురు.

అంత రచనా ప్రయోజన వైవిధ్యముగల యక్షగానమున కొక నిష్కర్షతో లక్షణ నిర్వచనము సేయఁ బూనుటన్నది యేనాఁడైనను గష్టసాధ్యమైన పనియే. ఎట్లు చెప్పినను నది యపర్యాప్తమే కావచ్చును. కాని యక్షగానము యొకస్థితికివచ్చి క్రమ క్రమముగా, శ్వరితగతి సంతరించుకున్న యీ నాఁటి గాని లక్షణ ప్రక్రియను నిర్వచింప వలసి వచ్చినచో వెనుకటి దాని బహుముఖమైన పరిణామ చరిత్రను, నిప్పు లక్ష్యకోశ పేశలమైన సామాన్య స్వరూపమును దృష్టిలో నుంచుకొని మఱి నిర్వచింప వలెను.

సాహిత్య ప్రక్రియా పరముగా, స్థూలముగా యక్షగానము నీనాఁడిట్లు నిర్వచింప వచ్చును.

**యక్షగానము** సం దితి నృత్తమెట్టిదైనఁ గానచ్చును. రచనా ప్రక్రియ శ్రవ్యము గాని, దృశ్యముగాని కావచ్చును. ఏప్రక్రియ యందైన గీతి ధర్మము విహితము. అందు రాగతాళములలో నొకదానికిఁ గాని రెండింటికిఁ గాని తగు ప్రాధాన్యముగల రచనా విశేషములు (రేకు, దరువు, పదము, కీర్తన మొ.) ద్విపద (మంజరియును), పద్యములు (జాత్యుపజాతి వృత్తములు, అర్ధపద్యములు, సం. శ్లోకములును), వచనము (సంగ్రప్రయోజనాత్మకముగాని సంవాదాత్మకముగాని, వర్ణనాత్మకమైనను గాఁదగును. చూర్ణికలు, విన్నపములు మొ॥) గద్యప్రభేదములు) నుండదగును. ఏలాది గీత ప్రబంధ విశేషముల ప్రయోగ మైచ్ఛికము.

---

# యక్షగానము వైశిష్ట్యము

మన సాహిత్య ప్రక్రియ లన్నిట యక్షగాన మంతటి విశిష్టత గల ప్రక్రియ మఱిలేదు. దాని యోగ్యతల నీక్రింది విధముగాఁ బరి గణింపవచ్చును.

1. అది సర్వోపభోగ్యమైన సమాహార కళాస్వరూపము:

అసలుగా మన పూర్వ మార్గవాఙ్మయ మంతయుఁ బండితోపజ్ఞ మైనది. దేశివాఙ్మయమెక్కువగాఁ బామరోపజ్ఞమైనది. ఆ మార్గ దేశి పండిత పామర వాఙ్మయప్రక్రియలకుఁ దత్త్వములకును సామరస్యము సాధించినది యక్షగానము. ఆ పండితు లెక్కువగా బ్రాహ్మణులు, నాగరికులు, రాజాస్థానాశ్రితులు; దేశికవు లెక్కువమంది యబ్రాహ్మణులు, జానపదులు, రాజాశ్రయము నపేక్షింపనివారు. యక్షగాన మన్నికులముల యన్నితరగతుల కవులకుఁ బ్రదర్శకులకు నాశ్రయ మిచ్చి కోటలోని రాజుగారిని పేటలోని ప్రజలకును సమానముగా నాదరపాత్రమైనది. మన పండితవాఙ్మయము నూటికి తొంబది తొమ్మిదిపాళ్ళు పాఠ్యప్రయోజ నాత్మకమైనది మాత్రమే. యక్షగానము పాఠ్య గేయ నాట్యాదిక బహుప్రయోజనముల కేక వాక్యత సంఘటించి మన తెనుఁగుజాతియొక్క చిరంతనమైన గానకళాభిరుచికి నాట్య కళాభి మానమునకును నిదానముగా నిల్పినది.

2. వివిధ ప్రక్రియానుబంధము:

ఈవిషయ ముపరి విపులముగా నిరూపితమైనది. ప్రబంధము, కలాపము, ఉలాప్రబంధము, కొరవంజి, వీధినాటకము, మార్గనాటకము బొమ్మలాట, జంగముకథ, హరికథ, ఆధునిక రంగస్థల నాటకము మొదలగు వివిధ ప్రయోజనాత్మకములై బయల్వెడలిన ప్రక్రియ

లతో యక్షగానమునకుఁగల సంబంధము సమగ్రముగా మన వాఙ్మయ పరిణామ చరిత్రను సమీక్షించుట కుపకరించును. ఇట్లిన్నిటితో సంబంధముగల సాహిత్య ప్రక్రియలు మిక్కిలి యరుదు.

3. బహువిధపద కవితా ప్రభేద సమీకరణ :—

యక్షగానము సాధించిన ప్రజనములలో నతిప్రధానములైనవాని లో నిది యొకటి. పాల్కురికి సోమనాథుఁడు మనప్రాచీన దేశీయపదవాఙ్మయరీతులను గొన్నిటిని పేర్కొనియున్నాఁడు - తుమ్మెద పదములు, ప్రభాతపదములు, వెన్నెల పదములు, వాలేశు పదములు, నివాళి పదములు మొ॥. అందులో జాలపదములు నేఁడు నామమాత్రావశిష్టములైనవి. అతని తరువాతఁ గొన్ని వెలసినవి. అవికూడ లక్షణమునకంత లొంగుబాటుకాని గుణము కలిగియుండుటవలన, మార్గసాహిత్య ప్రవణులు ప్రక్రియాసౌలభ్యపరాయణులు నైన మన లాక్షణికుల యుపేక్ష వలనను నీపాటికి నశింపవలసినదే కాని యెట్టి రచనా విశేషమునైనఁ గడుపులో నిముడ్చుకొనఁగల యక్షగానము ధర్మమా యని కొన్నికొన్ని సంరక్షింపఁబడుచు వచ్చినవి. అట్టివానిలో ముఖ్యములు :— ఏలలు, ధవళ శోభనములు, జోలలు, సువ్వాలలు, అల్లోనేరేళ్ళు, అనువులు, త్రిభంగులు, త్రిస్త్రంబకలు, వెన్నెలపదము మొ॥. + ఆంధ్రజాతీయసంగీత వాఙ్మయ చరిత్ర రచనకుఁ గొలకూనము యక్షగానము.

4. వస్తు వైవిధ్యము :— యక్షగానేతి వృత్తములలోఁ బౌరాణికములు స్థలపురాణగాథలు, చారిత్రకములు, తాత్కాలికములు, సాంఘికములు, జానపదగాథలు, కల్యాణకథలు, తత్త్వవిషయక

---

+ తంజావూరి య. గా. పదముల లతి విశిష్టమైనవి. వానిఁ గురించి చూ. అనుబంధము (2) (నా "తంజావూరు పద వాఙ్మయము" అను వ్యాసము — సంస్కృతి., జూలై, ఆగష్టు, 1956.)

ములు మొదలగు పలు తరగతులకుఁ జెందిన వెన్ని యోగలవు. ఇంతటి వస్తువైవిధ్యమును బ్రదర్శించినది మన పూర్వవాఙ్మయ ప్రక్రియలలో మఱి కానరాదు.

5. రస విషయిక వైశిష్ట్యము :-

మన పూర్వ ప్రబంధము లెక్కువగా శృంగార ప్రధానములు. యక్షగానములలో శృంగార ప్రధానము లనేకము గలవు. దక్షిణాంధ్ర యక్షగానములు చాల మట్టుక కట్టివే. ఆంధ్ర దేశ య. గా. లందును విష్ణుమాయా విలాసము, విప్రనారాయణ చరిత్రము, మృత్యుంజయ విలాసాదు లెన్నియో యట్టివి గలవు. యక్షగానములందు వీర కరుణాది రసములకును విశేష ప్రసక్తిగలదు. అందులకు సుగ్రీవ విజయాదులే తార్కాణము. వస్తువైవిధ్యము విశేషముగాఁగల యక్షగానము నైక రసాశ్రయమగుటలో వింతలేదు. అయితే హాస్యరస విషయమున యక్షగానమున కొక ప్రత్యేకత గలదు. హాస్యము సర్వజన మనఃపర్వమైనది. మన ప్రబంధములలో, అసలు యక్షగానము వినా పూర్వవాఙ్మయ మంతట నా రస ప్రసక్తి యతి విరళము. యక్షగానము తత్ప్రయోజనములలో జనరంజకత్వ మొకటి ప్రధానమైన దగుటచే సింగి, సింగఁడు, కటికము, సుంకరి కొండఁడు మొదలైన తన సాంప్రదాయిక పాత్రల ద్వారమున హాస్యమును బహుభంగులుగాఁ బ్రదర్శించుచు వచ్చినది. ప్రాయికముగా యక్షగానము లందంతో యింతో హాస్యరస స్పర్శ లేనిది యుండదన వచ్చును. హాస్య ప్రధానములైన య. గా. లలో తంజావూరి వానిదొక ప్రత్యేకత.

6. చంధో వైవిధ్యము :-

యక్షగానము లందనేక దేశి గీత ప్రభేదములతోపాటు గద్య పద్యములు, ద్విపద, రగడ వికృతులగు రేకులు మొదలగు బహు

విధచ్ఛందస్సులకును దగిన ప్రసక్తి యుండుటచే నందు మన పూర్వ వాఙ్మయ ప్రక్రియలగు చంపూ ప్రబంధ ద్విపదోదాహరణ శతకాదుల యొక్క ఛందః ఫక్కికలన్నియు నిమిడిపోయిన వనవచ్చును. తదుపరి ఆధునిక యుగోన్ముఖముగా వికసించుచున్న యక్షగాన ప్రక్రియలో హరికథలు మొదలగువాని యందలి తోహరాలు, డోరాలు, మంజరి, లావణి మొదలగు ఛందస్సులును నూత్నముగా వచ్చి చేరినవి. ఏనాటికైన నాంధ్ర చ్ఛందస్సంహితా సర్వస్వము తయారగు నవకాశమే తటస్థించినచో దాని కపురూపమైన సామగ్రిని జాల సరఫరా చేయఁగలదు యక్షగానము.

7. భాషా వైవిధ్యము :-

తెనుఁగున యక్షగానములు సాగర తీరాంధ్ర మండలములు (ఒరిస్సా సరిహద్దులలోఁగూడ ఉదా :- రాయగుడ భామకలాపము), రాయలసీమ, తెలంగాణము, దక్షిణ దేశమున తంజావూరు, మధుర, మైసూరు, పుదుకోట, తిరుచునాపల్లి, సేలము, చెంగల్పట్టు మదరాసు, మొదలగు వివిధ ప్రదేశములలో నెక్కడెక్కడ తెలుఁగు భాష వ్యవహరింపఁ బడినదో యక్కడెల్ల వెలసినవి. ఇది యొక భాషా వాఙ్మయ చరిత్రలో మిగుల నపూర్వమైన విషయము. అట్లు వివిధ ప్రాంతములలో వివిధ కాలములలో వివిధ కులముల వారిచే వ్యవహరింపఁబడిన భాషాఫక్కికల కాకరము లగుటచే నాయా యక్ష గానములందు మన కోశముల కెక్కని పదజాలము, ప్రయోగ విశేషములు, జాతీయములు మున్నగు విశేషము లెన్నెన్నియో కలవు. అందుచే భాషావిషయికమైన పరిశోధనలోఁ గూడ యక్షగానము

తన వైశిష్ట్యమును నిరూపించుకొనఁగలదు.+ ఈ బహుళాంధ్రలోక మయ ప్రపంచమున మన వాఙ్మయ ప్రక్రియ లన్నిఁటిలో యక్షగానమునదే ప్రధాన స్థానము.

8. లోకవృత్త ప్రదర్శనము :-

ఈ విషయమును సలస్పర్శముగాఁ బరామర్శించి సవిస్తరముగా నావిష్కరింపవలె నన్నచో నది యొక ప్రత్యేక గ్రంథమునకు సామగ్రి యగును. (అది యాంధ్రుల సమగ్ర సాంఘిక చరిత్ర కెంతయు దోహదము కాఁగలదు) అందుచే నిందలి ముఖ్య విషయములు మాత్ర మిట స్థాలీ పులాకముగా స్పృశింపఁ బడును.

ప్రజా సాహిత్య మనఁ బడు దాని కన్నిటికిని ప్రతినిధి యైనది యక్షగానము. సాహిత్యమును ప్రజా సన్నిహితము చేసి ప్రజా హృదయమును సాహిత్యములోఁ బ్రతిబింబింపఁ జేసిన ప్రక్రియ యదే. నానా స్థానములలో విద్వత్కవులు వెలయించిన వాఙ్మయములోఁ బాండిత్య ప్రకర్షకును గవితా చమత్కృతికిని గల ప్రాధాన్యము లోకవృత్త చిత్రణకు లేక పోయినది. అక్కడక్కడఁ గొన్ని ప్రబంధములలో లోకము పోకడ కొంత కనఁబడినను నది యసమగ్రముగా నొక్కొక్కపుడు కృతకముగను గూడ నుండును. య. గా. లకెక్కువగా గ్రామ సీమలే పుట్టినిండ్లును, రంగభూములు నైనవి. యక్ష గాన కవులును ప్రదర్శకులు నెక్కువ మంది రాజసన్మానము నపేక్షింపని సామాన్యులే; అశేష ప్రజానీకము యొక్క విశేషామోద వినోదములే వారి పరమ లక్ష్యములు. ఎన్నియో యక్షగానములలో నితి వృత్తములు పౌరాణికములే యైనను గొన్ని యక్షగానములు పండితోప

+ విలక్షణము లగు తంజావూరి య. గా. ప్రయోగ విశేషములఁగూర్చి కొంత విషయము ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము ద్వారా ప్రకటించియుంటిని. కాలక్రమమున నవకాశము చొప్పునఁ గడమ విశేషములను వెలువరింపఁ గలను.

జ్ఞములే యైనను గొన్ని రాజాస్థాన రంగభోగములే పొందినను వాని భాషలో, భావములలో, నా గేయచ్ఛందస్సుల తీరు తీయములలో నా యా పాత్రల చిత్రణలో, సన్నివేశముల సంఘటనములోఁ బ్రజాహృదయము, లోకము పోకడయుఁ బ్రతి ఫలించును. ఆ ప్రతిబింబనము నిరాడంబరముగ నిసర్గమధురముగా నుండును. యక్షగానములు దృశ్య ప్రయోజనాత్మకములు గూడ నగుట చేత నందలి లోక చిత్రణ సన్నివేశములు వాస్తవికతకు సన్నిహితముగా నుండును. కొన్ని యక్షగానములలో సన్నివేశములు మాత్రమే కాదు కథావస్తువులే పూర్తిగా లోక సిద్ధము లైన సందర్భములును గలవు.

మన యక్షగానములలో లోకవృత్తము నధికముగాఁ బ్రదర్శించినవి తంజావూరి యక్షగానములు. వానిలోఁ దాత్కాలిక విషయములు నితివృత్తము లైనవి. (ఉదా:- విజయ రాఘవాస్థానకృతులు. పౌరాణికేతి వృత్తములకుఁ గూడఁ దాత్కాలిక విషయ స్పర్శ తఱచు కన్పించును. ( ఉదా :- శాహరాజాస్థానకృతులు ). అవి రాజాస్థానాశ్రితులైన విద్వత్కవుల చేతనే రచింపఁబడినను, స్వయముగా రాజకవుల చేతనే రచింపఁబడినను వానిలోఁ గోటవాకిలి కడనున్న కోలకేతని మొదలు కోటలోపలి రాజుగారి వఱకుఁ గల పలు తరగతుల రాజోద్యోగుల వేషభాషలు, ఆయా రాజుల యాచార వ్యవహారములు, ఆహారవిహారములు, నగరిముస్తీదు, కొలువు సింగారము, ఆస్థాన విద్వాంసుల యద్వాతద్వాలు, ఏషాగాధలు, వివాహాద సందర్భములోఁ బురోహితుల సంభావనల తగవులు, ముత్తైదువల ముచ్చటలు మొదలైన విషయములు గలవు. ఆంధ్ర దేశ తెలంగాణముల యక్షగానము లందును నిటీవలి వానిలో లోక వాసన లెక్కువగా స్ఫురించినవి. ఆ యా యక్షగానములలో నవతుల కయ్యములు, సుంకరుల యాగడములు, మంత్రసాని దెప్పిళ్ళు -

ఇవి కాక గొల్లలు, ఎఱుకలు, జెట్లు, పంబవారు, పెరికెలు మొ॥ లగు జాతుల చరిత్ర, వారి వాలకములు, పూజలు ..., స్త్రీలు, ఆశయములు విశ్వాసములు మొదలగు విషయములు తెలిసికొనుటకు ... వారి కట్టు బొట్టులలోఁ గూడఁ దేటపడఁ గలవు. ఇట్టి విషయముల లోకరీతి ప్రదర్శన ప్రయోజనము యక్షగానమున కాని ... గని నట్లు మన పూర్వసాహిత్య శాఖలో మఱి యొక్కయు గాని ... పోయినది. లోకవృత్త ప్రదర్శన ప్రయోజనాత్మకతయే యుత్తము సాహిత్య జీవలక్షణముగాఁ బరిగణించుచున్నారు ... దేశ దేశాల సాహిత్యశాస్త్రవేత్తలైన పెద్ద పెద్ద పండితులు. కావున ప్రౌఢిని బట్టి యక్షగానము లన్నిటి నుత్తమ సారస్వత శ్రేణిలో ... కట్ట సమకట్టుట సాహసము కాని లోకవృత్త ప్రదర్శనాది ప్రయోజ నముల దృష్టి నైనచో యక్షగాన వాఙ్మయము యొక్క విశిష్టత కాదనరానిది.

9. దేశినాటక కళా ప్రాతినిధ్యము :—

స్థూలముగాఁ జూచినచో దేశి వాఙ్మయ మంతయు మధుర కవితాశాఖకుఁ జెందిన గీత ప్రబంధముల ప్రాచుర్యము గలది కావున నట్టి గీత ప్రబంధముల కెన్నిటికో యక్షగాన మాకరమగుటచేత యక్ష గానమును దేశి వాఙ్మయ కోశమంతటికినిఁ బ్రతినిధి యనఁ జెల్లును. కాని యక్షగాన మనఁగా నీనాఁడు గానప్రక్రియగాఁ గాక రూపక ప్రక్రియగాఁ బరిగణింపఁ బడుచున్నది. అయితే యక్షగానమునకు ముందే దేశమున వీథి నాటకములు ప్రచారము నందుండినను, అది యా వీథినాటకములతో నేకమై నాటకప్రక్రియగా రూపొంది, నాటక శబ్ద వాచ్యమునై, మధ్యలో మార్గనాటక ప్రభావము సోకినను దన వ్యక్తిత్వమును గోల్పోక, కలాపము, కొరవంజి మొదలగునవి దేశీయ దృశ్య రచనలుగా రూపొందుటకై తన ప్రక్రియాసత్త్వమును దానము

చేసి బొమ్మలాటలకును వాటమైన వంతపాటగాఁ బరిణమిల్లియుండుటఁ జేసి, దానిని దేశిసరణికిఁ జెందిన నాట్యకళా ప్రపంచమునకుఁ గూడ దగిన ప్రతినిధి యనుటలో విప్రతిపత్తియుండరాదు.

10. విశిష్టతలలో విశిష్టత :-

ఆంధ్ర కర్ణాటక తమిళ తుళు* భాష లన్నిటను యక్షగానములు వెలసినవి. యక్షగానము గాత్రమాత్రోపజీవి యగు నొక ప్రత్యేక గాన శైలిగా నెన్నడో కన్నడదేశమునందే ప్రాదుర్భవించి యుండిన నుండవచ్చును, గాని యక్షగాన రచనకు మన యాంధ్రమున నున్నంత ప్రాచీనతాస్థితి కడమయెడలఁ గానరాదు. ఆంధ్రులు 17 వ శతాబ్దిలోఁ దమిళ కన్నడ సీమలకు విస్తరించి యుండిన కాలముననే, తంజాపురాంధ్ర నాయక రాజుల యాస్థానములో యక్షగానరచన జగసాగి రంగభోగము పొందుచుండిన కాలముననే క్రమక్రమముగా కన్నడాది భాషాకవులును గొంద రాకృష్టులై యక్షగాన రచన కుపక్రమించి యుందురు. మన వాఙ్మయ ప్రక్రియలన్నియు నొక్క యక్షగానము వినా తదితర భాషా (సంస్కృతాంగ్లాదులు) వాఙ్మయములనుండియే గ్రహింపబడినట్లు చెప్పుకొననలసియున్నది. (ఉదాహరణ ప్రక్రియ గూడ నిందుల కపవాదమగునేమో!) అందుచే యక్షగానము ప్రక్రియగాఁ బురాణేతిహాస శతక ప్రబంధాదులవలెఁ గాక మన వాఙ్మయములో స్వతంత్రమైన మన తెనుఁగుదన ముట్టిపడు, మనవాఙ్మయ వ్యక్తిత్వమును బట్టి యిచ్చునట్టి ప్రక్రియయనియు, నీయొక్క సాహిత్య ప్రక్రియ విషయముననైన దెనుఁగువారు మఱియొకరి కనుకార్యులు కాఁగలిగిన ప్రతిష్ఠఁ డక్కఁ గొందురనియుఁ జెప్పఁదగియున్నది. ఇంత

---

* తుళు భాషా యక్షగానమున కుదాహరణ మిదివఱకుఁ దేరొక్కనఁ లేదు. అందు వెలసినవి కొద్ది, "పంచవటి" మొదలగు య. గా. పేరు కొద్ది వినిపించుచున్నవి.

యేల! తెనుఁగు యక్షగానము తమిళనాడు నడిబొడ్డగు తంజావూరిలో మహారాష్ట్రప్రభువుల లేఖినులపైఁ గూడ నాట్యముచేసిన దనగా దాని ఘనత యెట్టిదో యిట్టె యూహింపవచ్చును.

## ఉపసంహృతి

యక్షగాన మనునది ప్రౌఢ వాఙ్మయ శాఖ కాదనియు, నది యేదో యొక పామర వాఙ్మయ ప్రక్రియ యనియు నొక యపోహ కొందఱు పండితులలో నుండుటకద్దు. పండిత కవులెందఱో యక్షగాన రచన చేపట్టిరను విషయము, యక్షగానము పండిత పామర వాఙ్మయములకు సామరస్యము ఘటించినదను విషయమును బూర్వోక్తములు. అసలు ప్రౌఢియన్నది రచన నాశ్రయించి యుండును గాని ప్రక్రియను బట్టికాదు. యక్షగానములందు పండితోపజ్ఞములందు ప్రౌఢి సమృద్ధిగా గలదు. ప్రౌఢవాఙ్మయ మనఁబడు ప్రబంధములందు పేలవము లైనవి లేకపోలేదు. పండితోపజ్ఞములైన యక్షగానములందును నవి జన సామాన్యాను రంజనమున నుద్దేశింపఁ బడినవి కాఁబట్టి ప్రబంధము లందలి శబ్దాశ్రయమైన ప్రౌఢి యంతగాఁ గానరాకపోవచ్చును గాని వానిలో భావాశ్రయమైన ప్రౌఢికి లోటులేదు.

అదియుఁగాక నందలకు నందలుగా వెలసిన మన యక్షగాన ముల కర్తలందఱును విదగ్ధులైన విద్వత్కవులు కారు గాని యక్షగాన రచనమన్న సంగీత నాట్యాది బహుళ కళా పరిజ్ఞానము లేనిదే కేవలము సాహిత్య పౌరోహిత్యము మాత్రమే చేసికొను కవిమాత్రు లకే కాదు – ఉద్దండ పండితులగు మహాకవులకును గలము జరుగని పని.

యావదాంధ్ర వాఙ్మయముననుబహుముఖ వైవిధ్యమును, వైశిష్ట్యమును గలిగి విశాల సాహిత్యశాఖగావిలసిల్లిన ప్రక్రియ యక్ష గాన మొక్కటియే.

# అనుబంధము

# 1

## యక్షగాన ప్రధాన రచనాంగములు

### ఛందస్సు

యక్షగాన ప్రధాన రచనాంగములు రేకులు, దరువులు, ద్విపద పద్యము, గద్యము, పదము తత్తత్ప్రభేదములు దేశిసరణికిఁ జెందిన బహువిధపద కవితాగీత ప్రబంధరీతులు. ఆయా రచనాంగ ప్రభేదముల ఛందస్సంగీత ప్రక్రియగూర్చి లక్ష్యలక్షణ సమన్వయ పురస్సరముగా సవివరమైన విచారణ మొనర్చుట యనఁగా నదియొక ప్రత్యేక పరిశోధనకు విషయము; ప్రత్యేకమొక బృహద్గ్రంథమునకు సామగ్రి. ఇపుడిచట నందు ముఖ్యములైన వానివిషయము (గంధవిస్తరభీతి నతి సంగ్రహముగా) సమీక్షింపఁబడును.

#### 1. రేకు — రగడ

'ఆయాయి రగడ భేదములు రేకులు పెక్కులమరు' –లక్షణసార సంగ్రహము (III. 102)

ఆదినుండి యనేకాంధ్ర యక్షగానములం దతి ప్రచురముగాఁ గనుపట్టుచున్న జంపె త్రిపుటాది తాళ లయాశ్రయములగు రచనములను మన లాక్షణికులు రేకు లనియు నవి వివిధ రగడ వికృతు+

+ ఇవి వైతాళీయ జాతులనియు. (అనఁగా దేశీయగీత ప్రబంధములనియర్థము) రగడయొక చాటుప్రబంధ మనియు మన లాక్షణికమతము. (చూ. కావ్యాలంకార చూడామణి (IV.40); లక్షణసార సంగ్రహము II.128-140, అప్పకవీయము I. 30, IV. 290. అప్పకవి మతమున రగడయే కాదు గద్య, ద్విపద, మంజరి, దండకము మొ॥ కూడ చాటు ప్రబంధములే.

లనియు గుర్తించిరి. (చూ. చిత్రకవి పెద్దన లక్షణసార సంగ్రహము 2-141. అప్పకవీయము 4-303. వారు చెప్పిన లక్షణము పూర్వోక్తము) ఇవియే ప్రాచీన కాలమునఁ బ్రసిద్ధములై యుండిన జక్కుల రేకులై యుండవచ్చును. (జక్కుల రేకులు తాళ్ళపాక వారి సంకీర్తన లక్షణమునను, లక్షణదీపిక యందును బేర్కొనఁబడినవి. యక్షగానోత్పత్తికి జక్కుల జాతికిని సంబంధము నూహించుట సమంజసముగాఁ దోఁచుచున్నందున గాన కళాప్రావీణ్య విశ్రుతలగు నా జక్కుల పురంధ్రుల పాటలనఁదగు నా జక్కుల రేకులే [1] ప్రాచీన యక్షగానము యొక్క రేకలు తీర్చి దిద్దిన గానరీతులై యుండునని యూహింపనగును.) ఈ రేకుల మూలప్రకృతి యగు రగడ ప్రాచీన కన్నడ లాక్షణికుఁడగు నాగవర్మ (క్రీ. శ. 12వ శతాబ్ది) పేర్కొనిన "రఘటా బంధ" మే కావచ్చును.

"ಗಣ ನಿಯಮ ವಿಪರ್ಯಾಸದೊ
ಳೆಣೆ ವಡೆ ದೊಳ್ಪೆಸದು ಮಾತ್ರ ಸಮನಾಗಿ, ಗುಣಾ
ಗ್ರಣಿಯ ಮತ ದಿಂದ ತಾಳದ
ಗಣನೆ ಗೊಡಂ ಬಟ್ಟುದದುವ ರಘಟಾ ಬಂಧಂ"

ఛందోంబుధి 3 — 222

అనఁగా గణ నియమ విపర్యాసమున్నను సమసంఖ్యగల మాత్రలతోఁ దాళబద్ధమై యుండున దని యర్థము. ఇది మన రగడ లక్షణమునకు సరిపోవును. [2] కన్నడ వాఙ్మయమున రగడ చాల కాలమునుండి ప్రచారమున నుండినదని తెలియుచున్నది. తెలుఁగున

---

1. రేకు లనఁగా పాటలు లేక పదములని గ్రహింపనగును. మన లాక్షణికుల వక్కాణను బట్టి పాట లందలి పాదము, చరణము, దళము అనునట్టొక పంక్తి వాచకముగా నెంచ వచ్చును.

2. సంగీత రత్నాకరమునఁ రాహడీ, యను పేర నొక ప్రబంధ ముదాహరింపఁ బడినది. (4—295) కాని యది బహుపాదములు గల వీర రసాత్మకమైన సంగ్రామ రచిత స్తుతి యని మాత్రము పేర్కొనఁ బడినది. దీని లక్షణ మపర్యాప్తము.

నిది 11వశతాబ్దినుండి కొంతవాడుకలోనుండినట్లు రాజరాజు కోరుమిల్లి శాసనము వలన గుర్తింపనగును. పాలకురికి సోమనాథాది కవులు ప్రత్యేకముగను, ఉదాహరణముల నడుమను, శ్రీనాథాదులు చంపువుల నడుమను రచించుచు వచ్చిరి.[3] రగడ మనలాక్షణిక పరిగణనమున కెక్కుటకు క్రీ.శ. 1400 ప్రాంతమున నుండిన విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణియే (4-40) మొదలు. కాని యందలి లక్షణ మపర్యాప్తము. నవవిధములైన రగడ ప్రభేదములను బ్రప్రథమముగాఁ బరిగణించి లక్ష్యపూర్వకముగా లక్షణనిర్వచనము చేసినవాఁడు క్రీ.శ. 15 వ శతాబ్ది పూర్వార్ధమున నుండిన అనంతామాత్యుఁడు. (చూ. ఛందో దర్పణము 3. 53-61) అనఁగా నప్పు డప్పుడే యాంధ్ర దేశమున జక్కుల రేకులు ప్రచారము పొందుచుఁ బండితుల చెవులకు నెక్కుఁ జొచ్చినవని చెప్పనగును. (ఆంధ్ర వాఙ్మయమునఁ బ్రప్రథమముగా యక్షగాన ప్రశంస వచ్చిన భీమఖండము, జక్కుల పురంధ్రి పాటకుఁ బ్రసక్తి గల్గిన క్రీడాభిరామము నాకాలము నాటివే.)

అనంతాదులు చెప్పిన నవవిధ రగడల గతి లక్షణము లెట్టి వనఁగా :-

1. హయ ప్రచారమను దానికి - 4 సూర్య గణములు.
2. తురగ వల్గనమునకు - 8 సూ. గ. లు (హ. ప్ర. కు రెట్టింపు)
3. విజయ మంగళమునకు - 16 సూ. గ. లు. (తు. వ.-నకు రెట్టింపు)
4. ద్విరదగతి - నగ, సలల, భల, సల, త, ర గణములలో నేవో నాలుగు.

---

3. విపులమైన రగడ చరిత్రకు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి దేశి, శ్రీ ని. వేంకటరావుగారి ఉదాహరణ వాఙ్మయ చరిత్ర చూడఁదగును.

5. జయభద్ర - ద్విరద గతికి రెట్టింపు.

6. మధురగతి - గగ, భ, స, సల, గణములలో నేదో నాలుగు.

7. హరిగతి - మధురగతికి రెట్టింపు.

8. హరిణగతి - గగ, భ, స, సల గణములలో నేదో రెండు సూర్య గణ పూర్వకములుగా నుండును.

9. వృషభగతి - హరిణ గతికి రెట్టింపు.

అనంతున కర్వాచీనులైన లాక్షణికులు రగడలఁ గూర్చి చెప్పిన వారెల్ల నీ తొమ్మిది విధములనుగూర్చి మాత్రమే చెప్పిరి. అనంతుని లక్షణమునే పునశ్చరణ చేసినారు. కాని తంజావూరి మహారాష్ట్ర ప్రభువగు శహాజీ విష్ణుపల్లకి సేవాప్రబంధమున "మయూర గతిరగడ" యను నొక క్రొత్త పేరు వినవచ్చుచున్నది.

అందలి ఉదాహరణము :-

"మారమణి వల్లవ కుమారమణి మోదం
బూరఁ గరుణింపను మయూరగతితో నే
తేర మది నిన్ననిటు దీర్ఘమగు దండెన్
భారముగ రాజిలెడు పల్లకియు వచ్చెన్"

కడపల నొక్కమాత్ర (లఘువు) తక్కువైనది కాని కడమ యంతయు ద్విరద గతియే. అసలీ రగడలన్నిటిఁ బ్రధానములైనవి నాలుగే గతులు - పైనుదాహరింపఁబడిన వానిలో 1, 2, 3 ఒక్క గతి తరగతికే చెందినవి. అట్లే 4-5 ఒక్కటే తరగతి. 6-7 ఒక తరగతి. 8-9 ఒక తరగతి. ఇట్లే చిత్రకవి పెద్దనాదులు యక్షగానపు రేకులందు నాల్గువిధములైన రగడగతులనే చెప్పి యున్నను నవవిధములు నందు గతార్థము లగుచున్నవి.

ఇఁకఁ బ్రకృతము వారు చెప్పిన లక్షణమునకు లక్ష్యసమన్వయ ప్రయత్నము :-

1. త్రిపుట రేకు :- వృషభగతి 2 పాదములు - 7 లఘువులు

ఉదా :- రుద్రయ సుగ్రీవ విజయము నుండి.

"లలితగాత్రుడు శుభచరిత్రుడు దళిత శత్రుడు సుజనమిత్రుడు
నలిన నేత్రుడు కందుకూరి జనార్దనుండు"

వృషభగతి పాదమున నేడేఁసి లఘువుల దళములు నాల్గుండును. రెండు పాదములందెనిమిది. అందేడు లఘువులను దొలఁగింపఁగా నట్టి దళము లేడగును. మీఁది యుదాహరణమునఁ జివరనొక్క లఘువు తక్కువైనది కాని (అది పాటలో సద్దుకొని పోవును) లక్షణము సరిపోయినది. అందున్న సప్తలఘుక దళము లేడే. "తకిట కిట తక - తకిట కిట తక" - ఇట్టివి మఱి రెండావృత్తులు, చివర 'తక్క త కిట' - ఇది త్రిపుట యొడుపు. (వృషభగతి కనుగలముట్లైన రచనాంతరములు గలవు. అవి స్థలాంతరమునఁ బ్రసక్తములు).

2. జంపె రేకు :- ద్విరదగతి 2 పాదములు - 1 లఘువు (చివర)

ఉదా :- ఓబయ గరుడాచలము నుండి.

"సురరాజ సన్నుతికి సురుచిరాధర మతికి
కరుణా రసోన్నతికి గరుడాద్రి పతికిన్"

లక్షణము సరిపోయినది. ఇందు పంచమాత్రాక దళములేడు కలవు. ఎనిమిదవ దాన నొక్క లఘువు తక్కువ. 'కిటతకిట - కిటతకిట... తకిటా' అని జంపె యొడుపు.

3. రచ్చ రేకు :- తురగవల్గనము గతి.

ఉదా :- అక్కయ కృష్ణవిలాసమునుండి.

" పికిలి పువ్వు లెడల సెడల బెనచినట్టి పూలదండ
లొక యొయార మమర నొప్పు కొప్పుజుట్టి "

ఈ యుదాహరణమునం దురగవల్గనము గతి గలదు. కాని యీ అక్కయ కృత్యంతరమే యగు భీమసేనవిజయమునందు గల రచ్చరేకులలో వృషభగతి విశేషము. ఉదా :-

" సమ్మతింపక రేపు మాపని జాగుసేసే తావుగాదిది
కొమ్మ దయనిటు చూడుమిను నే నమ్మినాడన్ "

కంకంటి పాపరాజు విష్ణుమాయా విలాసమునందలి రచ్చరేకులు నిక్క వృషభ గతియందే నడచినవి. (చూ. వానిళ్ళ ప్రచురణ. పుట 17. 36) అందు తురగ వల్గనగతి కనుగలములైన రచనాంశములును గలవు. (అవి స్థలాంతరమున బ్రసక్తములు)

4. ఏకతాళి :- మధురగతి.

ఉదా :- సుగ్రీవ విజయము నుండి.

" ముక్కులు చెక్కులు మూపులు వీపుల్
ప్రక్కలు పిక్కలు బరులును దరులున్ "

లక్షణము సరిపోయినది. ఒక్కొక్క దళము చతుర్మాత్రాకము. "త రి కి ట - త రి కి ట" యను నొడువుగలది. (ఏకతాళి శుద్ధసూడ జాతి గీతప్రబంధముగ సంగీతదర్పణమునం జెప్పం బడినది. చూ. 4-శ్లో 417)

5. అట తాళము :- పాదమునకు 24 మాత్రలు.

ఉదా :- సుగ్రీవ విజయమునుండి

"చంపజాలక విడిచిపెట్టిన సరకు గొనక, వీడొక
తెంపుగల మగవాని వలెనే తిరిగి వచ్చెన్"

లక్షణము మొదటి పాదమునకు మాత్రమే సరిపోవు చున్నది. ఒక్కొకచో మొదటిపాదమున మాత్రాధిక్యమును జూపట్టుచున్నది. అందులకును సు. వి. మే తార్కాణ.

ఉదా:- "నిన్న నీచే భంగ పడి చెడి నేడు వచ్చునే పోరికిన్, దిరిగియు
పన్నతనమున నొక్క బలియుని ప్రాపులేక"

ముఖ్యములైన రగడ గతి ప్రభేదము లెల్లను ద్రిపుటాదుల యెడ గతార్థములైనవి. అందుచే అట తాళమునకు మాత్రా సంఖ్య మాత్రము సూచింపఁ బడినది పెద్దన చేతను, అప్పకవి చేతను. కాని దీనికిని యొక గతి కలదు. కస్తూరి రంగ కవి హరిగతి కట తాళమును జేర్కొనెను. (చూ. ఆనంద రంగ రాట్ఛందము) కాని యట తాళమున నడుమఁ దేలి పోయినను నెత్తుగడ నుండి చివరంటనున్న గతి హరిణ గతి లేక వృషభ గతి కాని హరి గతి మాత్రము గాదు. ఒక్కొక చో అట తాళమునకుఁ దురగ వల్గన గతియుఁ జూపట్టెడు. వెంకటాద్రి సుభద్రా వివాహమున "అటతాళం - తెగమానం" (?) :-

"నెలత మోముసాటిరాక నీళ్ళలోన కమలములును
నిలువలేక సిగ్గుచేత తలలు వంచె నందురూ"

అట తాళమును గూడ రేకు లనుట కద్దు. గోపాలుని సింగయ ప్రభావతీ ప్రద్యుమ్నమున "అటతాళ రేకులు" ఉదాహరింపఁ బడి నవి. అందు లక్షణమున విశేషము లేదు.

మన లాక్షణికు లుదాహరించిన యీ యైదు రకములును గాక రేకు లింక ననేక విధములైనవి యక్షగానములలోఁ బ్రయుక్తములై

నవి. అయితే, యించు మించు ప్రతిరేకు నేదోయొక రగడ గతిని సన్నిహితముగా నుండును. కొన్నిట గతి భేదము పేర్కొనుటకై రగడ లుదాహరింపఁ బడినట్లే కొన్నిటఁ దరగతి పేరఁ గాక యుత్త రేకులే యుదాహరింపఁ బడినవి. అవియుఁ బ్రాయికముగా నవవిధ గతులలో నేదోయొక దానికిఁ జెందును. అట్టివి కాక ప్రత్యేకముగా నొకపేరఁ బేర్కొనఁ బడినవియు లాక్షణికులు పేర్కొననివియు నగు వానిలో ముఖ్యములు గొన్ని :—

1. ఆదితాళరేకులు :- ఉదా :- సింగయ ప్రభావతీ ప్రద్యుమ్నమునుండి -

" బిగికౌగిట నతి బిగియగ నొత్తిన
నొగిలిన బిగి చన్నులు వగమీరన్, "

ఇది యచ్చముగా మధురగతి.

2. మటిమెరేకులు :- ఉదా :- చిన కపోతయ్య వీరచోడవ్వా చరిత్రనుండి.

" కట్టుపొడల దుప్పటమ్ము పెట్టుకొనగ చిలువసొమ్ము
పుట్టు తిరిపె మడుగు నమ్ము తిట్టవలదు వెనుక మమ్ము "

ఇందలి గతి తురగవల్గనము. ( పెద్దన, అప్పకవి తురగవల్గనము రచ్చరేకు గతిగాఁ జెప్పిరి ). ఇట్టిదే "మట్టె" యనుపేరఁ గొన్ని యక్షగానములందుఁ గన్పట్టు చున్నది.

ఉదా :— విష్ణుమాయా విలాసమునుండి

" జాఱుకొప్పు చూచి యొకఁడు జంకెనలకు బ్రమసియొకడు
ఓరచూపు జూచి యొకడు తారతీరు జూచి యొకడు"

"మట్టె" మఠ్ఠ లేక మఠ్య శబ్దభవమై యుండును. మఠ్యా సూళాది సప్త తాళములలో నొకటి.

3. నడరేకులు :- ఉదా :- ప్రభావతీ ప్రద్యుమ్నము నుండి

"సరులో తావుల గురులో స్త్రీలను
మరులు కొలుపు మచ్చరులో జాణ"

ఇందు మధుర గతి స్పష్టపడినది. ఉత్త "నడలు" అనుపేర నొక రచనా విశేషము గలదు. ఉదా:—

(అ) "అనిలజ చని యాతని దోడ్కొని ర
మ్మని నను ఇనుజుడు విని యిట్లనియెన్"

— బలభద్రదాసి కపోతవాక్యము.

(ఆ) "హరునిన్ సురనది ధరునిన్ విష సం
హరునిన్ భీమ శంకరుని గొలుతున్."

— వీర చోడవ్వ చరిత్ర.

(ఇ) "గట్టు రహి గను పట్టు దీని చను
కట్టు గనఁ దమి పుట్టు ఁబో."

— విష్ణు మాయా విలాసము.

ఇందు (అ)లో నెక్కువగా, (ఆ) లోఁ గొంతవఱకు మధుర గతి స్పష్టపడినది. (ఇ) లో మాత్రము ద్విరద గతి కన్పట్టుచున్నది. "మధ్యమనడలు" అను నింకొక రచనా విశేషము గలదు. అందును ద్విరద గతి కన్పట్టుచున్నది.

ఉదా :— కపోతవాక్యము నుండి

"సూర్యుఁడే సుగ్రీవు సురలెల్లఁ గపులైరి
ఆ రాఘవుఁడు విష్ణుఁ దశురేశ వినవె."

4. వెండిరేకు :- ఉదా :- గిరిరాజు లీలావతీ కల్యాణము నుండి?

పాయక మ్రొక్కెదనమ్మా — పూల — పాన్పున వసియించవమ్మా
పోయివచ్చిన సుద్దికొమ్మా — మాకు — పొందుగ తెలుపుమో యమ్మా.

ఇందొక తూగు గలదు కాని రగడ గతి నేర్పఱచుట కష్టము.

5. కుఱుచరేకు : ఉదా :- కపోతవాక్యము నుండి?

"మందారములు మంచి చందనంబుల మీద
సందడిగ బారు గురవింద తీగెలునూ"

ఇందు ద్విరద గతి స్పష్టపడినది.

6. పాళిరేకులు : ఉదా :-నిమ్మనాధుని గురునంబి చరిత్రనుండి—

" తాళములు మద్దెలలు ఢక్కియుఁ
దాంబురల్ వా యింపఁగా " ॥ ౧ ॥
తాళమాన మొకింత దప్పక
వాలుగంటి నటింపఁగా " ॥ ౨ ॥

గతి స్ఫురణను బట్టి యీ పాళిరేకులందు మూఁడు హరిణ గతి దళములు, మీఁద నొక ద్విరద గతి దళమును బాద లక్షణమని చెప్ప నగును. కాని గ్రంథాంతరము లందీ పాళిరేకులు విలక్షణముగాఁ గన్పట్టు చున్నవి.

ఉదా :- వీర చోడవ్వ చరిత్రనుండి—

"అప్పరో నీ విపుడంపిన పులగము
ఒప్పుకొనియె భావ కోలా లా.
కురిసె పువ్వుల వానలూ, యింపుగ
మెరసె దేవ దుందుభులూ."

7. (అ) బొళిరేకులు :- (ఆ) బొళరచ్చలు :-

ఉదా :- వీర చోడవ్వ చరిత్రనుండి.

(అ) " భావా మెరిగి భీమ భావాకు పులగము
వేవేగ నిమ్ము వివాదమేటికె "

(అ) తేజాముతో కన్నపు తేజినెక్కి జనులు
పూజా శాయాగ దిరుగు జే జే కు జే జే.

పాటలో మాత్రాకాలము పొడిగింపు వలనఁ దూగేర్పడు వీనికి లక్షణ నిర్దేశము చేయుట కష్టము.

8. <u>ముఖారిరేకులు</u> :- ముఖారి యొక ప్రసిద్ధరాగ ప్రభేదము. రేకులు తాళ ప్రధానము లైనవి. ఇట్లొకరాగము పేరితోఁ గలిసి రేకులు బుక్కమ సాంబయ్య బల్లాణ రాజు చరిత్రము నందొకచో మాత్రము కన్పట్టుచున్నవి.

ఉదా :-

" వస్తూ వాహనా భరణములు వన్నెగ బాణడి దుప్పట్లు
విస్తారా భణతినొసగరా । బల్లాణరాయ
హస్తి భూషాణు కర్పితము గాను ॥ "

ఇది "ఏల" వలెఁ గన్పట్టుచున్నది.

.... .... ....

" అర్ధరేకులు " లేక " అర్ధచంద్రికలు "

చిత్రకవి పెద్దన, అప్పకవి త్రిపుట, జంపె మొదలగు రేకులందు సగము పరిమితి గలవి అర్ధచంద్రిక [4] లని సూచించిరి. ఇట 'చంద్రిక' యనఁగా రేకు — అనఁగా చంద్రరేఖ ( రేకు 'రేఖా' శబ్దభవము కావచ్చును. ) అని యర్థము చెప్పవలెను. ఉదాహరణ కావ్యము లందు రగడ భేదము లగు కళికోత్కళిక లెట్టివో యక్షగానము లందీ రేకులు నర్ధచంద్రికలు నట్టివి. అనేక యక్షగానము లం దర్ధచంద్రికలను పేరే కన్పట్టును. కాని

4. ఇది తాళ్లపాకవారి సంకీర్తన లక్షణము 53 వ పద్యమునఁ జేర్కొనఁ బడిన అర్థచంద్ర పదము గాదు. దాని లక్షణము దీనికి నప్పదు.

కొన్నిట [5] "అర్ధరేకులు" అను పేరును గన్పట్టుచున్నది. మన యక్షగానము లందు రేకు లెంత ప్రాచీనములో అర్ధచంద్రికలు నంత ప్రాచీనములే. చక్రపురి రాఘవాచార్యుని విప్రనారాయణ చరిత్రము, రుద్రకవి సుగ్రీవ విజయము పాపరాజు విష్ణుమాయా విలాసము మొదలగు ననేక యక్షగానము లందర్ధ చంద్రికలు గలవు. (వి. నా. చ., సు. వి. లం దర్ధచంద్రికలలోనే షష్ఠ్యంతములు చెప్పఁ బడినవి). ప్రాయికముగా, రేకు లెన్ని గతుల నుండునో అర్ధచంద్రికలు నన్ని గతుల నుండును. సుగ్రీవ విజయమున ఏకతాళి జంపె, త్రిపుటలలో అ. చం. లు గలవు. (చూ. కపిలేశ్వర పురము ప్రచురణ. పుటలు 2, 14, 17). ఒక్కొ-కచో నర్ధచంద్రికలకు రాగములు గూడఁ జేర్కొ-నఁ బడినవి.

ఉదా :-పోలుగంటి వెంకట కృష్ణయ్య శారద కొరవంజి నుండి:-

"పన్నీట జలకంబు బాగుగా నాడెన్
సరిగంచు చీర చుంగులు దీర్చి కట్టెన్" మొ.

---

5. లక్షణా కల్యాణము (ఆం. ప. మం. ప్రతి).

ఒక గమనిక :— నాగవర్మ ఛందోంబుధి యందు (III. 254–56) రఘటా బంధ ప్రభేదములుగాఁ జెప్పిన మందానిల లలితోత్సాహ లక్షణము లచ్చుపుచ్చు వరుసగా మన మధుర, ద్విరద, తురగవల్గన గతుల రగడలకు సరిపోవుచున్నవి. అందే (V. 310) చెప్పబడిన ఛందోవతంస లక్షణము మధుర గతియే. ఇఁక ఛందోంబుధి యందు రగడ ప్రభేదములుగాఁ జెప్పఁబడక పోయినను దద్వికారము లనఁదగు షట్పదీప్రభేదములు గతి సన్నిహితత్వమును బట్టి శరషట్పది పరివర్ధినీ షట్పదులు మన మధురగతికిని, కుసుమషట్పది వార్ధికషట్పదులు ద్విరదగతికిని, భోగషట్పది హయప్రచార గతికిని, భామినీషట్పది హరిణ గతికిని దీటుగా నున్నవి. ఆయా రచనా ప్రక్రియల ప్రచార ప్రాచీనతకు సూచకముగా నీ విషయ మిట నుటంకింపఁబడినది.

## తాళములు

కన్నడ లాక్షణికుఁడగు కవి జిహ్వాబంధకారుఁడు ఏక త్రిపుటాదులను దాళములుగా "రఘటా" భేదములుగాఁ బరిగణించి నాఁడు. మన కస్తూరి రంగకవియుఁ దన యానందరంగ రాట్ఛంద మున నవవిధ రగడలకుఁ దాళములను బరిగణించుచు జంపె త్రిపు టాదులను దాళములుగాఁ జేర్కొనినాఁడు. అతని పరిగణన :-

(1) హరిగతి :- ఆటతాళము (కాని హరిగతి మధురగతికి రెట్టింపు. మధురగతి కేకతాళము చిత్రకవి పెద్దనాదులు చెప్పిరి. అది కుదిరినది. హరిగతికి నేకతాళమే కుదురును).

(2) హయ ప్రచార తురగ వల్గన విజయ మంగళములు - రూపకతాళము. (రచ్చరేకునకుఁ దురగవల్గన గతిఁ జెప్పిరి పూర్వ లాక్షణికులు)

(3) మధురగతి - ఏకతాళము.

(4) ద్విరదగతి, విజయ భద్ర - జంపెతాళము.

(5) హరిణగతి, వృషభగతి - త్రిపుట తాళము.

(3, 4, 5 ల విషయము పూర్వలాక్షణికోక్తికి సరిపడి యున్నది.)

ఈ జంపె త్రిపుటాదులు మన యక్షగానములందుఁ గొన్నిట జంపె త్రిపుటలని మాత్రము, కొన్నిట జంపె రేకులు, త్రిపుటరేకులు ననియుఁ గొన్నిట జంపెతాళము, త్రిపుటతాళము ననియుఁ జేర్కొనఁ బడినవి. అనఁగా రేకులనఁగా దాళ ప్రధానములును రగడ వికృతులునైన గేయరచనలను సిద్ధాంత మేర్పడు చున్నది.

అసలీ జంపె, త్రిపుట, అట, ఏక, రూపక తాళములును, ధ్రువ మఠ్య తాళములును గలిసి సూళాది సప్తతాళములుగా సంగీత ప్రపంచమునఁ బ్రసిద్ధములు.

"ధ్రువో మఠ్యోరూపకశ్చ ఝంపతాళ తృతీయకౌ
అడ్డతాళ శ్చైక తాళీసూడ తాళా భవన్త్యమీ"

— చతుర దామోదరుని సంగీత దర్పణము.

వాని లక్షణములు సంగీత దర్పణాది సంగీత శాస్త్ర గ్రంథములందలి తాళాధ్యాయమునుండి యెఱుఁగ నగును

(ఝంప = జంపె; తృతీయః = త్రిపుట; అడ్డః = అట లేక ఆట) మన యక్షగానములందు వీని ప్రాచుర్య క్రమమిట్లుండును :-

జంపె, త్రిపుట, అట, ఏక, రూపక, మఠ్య, ధ్రువ.

ఇందు మొదటి నాల్గింటికి నుదాహరణములు మీఁదఁ జూపఁ బడినవి. కడమ వాని కుదాహరణములు :-

1. ధ్రు వ తా ళ ము.

"కోలుకో లెన్నయని కుందరదన లారా
చాల నాడుదము రారే శాహేంద్రు ముందఱ"

2. మ ఠ్య తా ళ ము.

"సరస సద్గుణుఁడూ శాహ భూ వరుఁడూ
అరయ మెచ్చునతడూ ఆడుద మిపుడూ"

3. రూ ప క తా ళ ము.

"కోలు కోతె యనుచు నాడి కొమ్మలార నేను శహభూ
పాలు చేత బిరుదు లందెద బాగు మీఱను"

— గిరిరాజ కవి వాద జయము నుండి.

జంపెవిషయమున నొకరెండు విశేషములు గలవు.

1. కుఱుచ జంపె :— మొదటి పాదము రెండు జంపె దళములు, మీఁద నాఁలు మాత్రలు; రెండవ పాదమున రెండు జంపె దళములు, మీఁద రెండు మూఁడు మాత్రలులును గలిగి రెండేసి పాదములకుఁ బ్రాసవిహితమై యుండు నది.

ఉదా :- గరుడాచలము నుండి

" ఎవరి పడుచవె నీవు కొమ్మ, నాతో
వివరింపవే ముద్దుగుమ్మ "

2. ఎఱుకల జంపె :- అక్కజము! దీనిగతి జంపె లక్షణమగు ద్విరద గతికాదు. రచ్చరేకున వలెఁ దురగ వల్గన గతి గన్పట్టుచున్నది. రెండేసి పాదములకుఁ బ్రాసవిహితము

ఉదా :- గురునంబి చరిత్రనుండి

" యత్న పెట్టినారుచూడు పాపకర్మలెల్ల రాజ
రత్నమా పరామరించు రమణ మా మొరాలకించు "

ఈ సప్త తాళములు గాక యితరము లనేకము య. గా. లందు వాఁడ బడినవి. అందాదితాళము ముఖ్యమైనది. అదియుదాహృత పూర్వము. మిగిలిన వానిలో విశిష్టము లొకమూఁడు మాత్ర మిట నుదాహరింపఁ బడును.

1. లఘుశేఖరము :— ఇది నారదుని సంగీత మకరందము నందును (నృత్యాధ్యాయము, తాళ లక్షణ ప్రకరణము — శ్లో. 61)

పార్శ్వ దేవుని సంగీతసమయ సారము నందును (7-57) తాళప్రభేదముగాఁ జేర్కొనఁ బడినది. అందు "ఏకేన సవిరామేణ లఘునా లఘు శేఖరః" అని దీని లక్షణము. ఇది పాపరాజు విష్ణుమాయా విలాసము, (4 పాటలు) అక్కయ కృష్ణవిలాసము మొ... కొలఁది య. గా. లందుఁ బ్రయుక్తమైనది.

ఉదా:- వి. మా. వి. నుండి

> " నన్ను ధిక్కరించినాడు నారదుండు నాటి రీతి
> నున్న నిన్ను గన్న బ్రమసి నన్ను నిన్ను మఱతు ననుచు "

ఇందలి తురగ వల్గన గతి గమనింపఁ దగినది. (కృ. వి. డిటో)

2. <u>ర చ్చ తా ళ ము</u> :— "రచ్చతాలే లఘుః ప్రోక్తో దవిరామః ప్రకీర్తితః" అని సంగీత దర్పణము. కాని మన లక్ష్యములు కొంత విలక్షణముగా నున్నవి :-

> " కొలిచి రంబుజ సంభవాదులు, తెలివి మీఱిన బ్రహ్మవాదులు
> బలహరాది సుధారసాదులు, భక్తి యుక్తులు వెలయ సాదులు "
>
> విష్ణుమాయా విలాసము.

> " మువ్వలు గదలకుండ, ముచ్చవలె వచ్చి దంత
> పవ్వళించియే యుండ, పాలు త్రాగు పొట్టనిండా "
>
> — అక్కయ కృష్ణవిలాసము.

మొదటి దానిలో వృషభగతి స్పష్టపడినది. రెండవ దానఁగూడ నొక గతి కలదు గాని మొదటి దానికంటె విలక్షణముగానున్నది.

3. <u>చి త్ర తా ళ ము</u> :— సంగీత దర్పణమున దీని లక్షణము :-

> "అణుద్రుతౌ భవేద్యత్ర చిత్ర తాళః ప్రకీర్తితః
> ద్రుతేత్వేకతాలీ స్యాత్ కథితా భరతాదిభిః "

ఈ చిత్రతాళమున కొక్క లక్ష్యము గన్పట్టు చున్నది.

"చిత్రవన్నెల పట్టు కోక లతి
చిత్రముగా గట్టె నొప్పుగాను
దండి వెలయు ధళ ధళ మని డాకాల
పెండెము బెట్టెను బిరుదుల పొగడన్"

— విశ్వేశ్వరుని ధర్మపురి మహాత్మ్యము.

ఇందుఁ గొలువడిన గతిసమత గానకాలమున నణు ద్రుతివలనఁ జూడవచ్చును.

గమనిక :- శహాజీ త్యాగ వినోద చిత్ర ప్రబంధమునఁ బ్రదర్శితమైన తాళ వైవిధ్య వైచిత్రి యింతింత గాదు. అందు బసవ శంకరము, హనుమత్కుంభము మొదలగు దేశితాళ విశేషములును గలవు. సంగీతజ్ఞులకా గ్రంథము ప్రత్యేకము పరిశీలనార్హము.

## 2 దరువు

సీ. మా.

…… యక్షగానంబునకును
పద్య గద్యంబులు బహువిధ తాళముల్
రేకులు గూర్పవర్తిల్లు ; నాట
కమున కట్టుల పద్య గద్యముల్ దరువులు
విరచింప వింతగా పరిఢవిల్లు''

ఇది 17 శతాబ్ది నడుము నుండిన గణపవరపు వేంకటకవి లక్షణ శిరోమణి (ఆం. సా. ప., నం. 31 ఎ) ప్రథమోల్లాస మందలి వక్కాణ. దీనినిబట్టి యక్షగానములు వేఱనియు నాటకములు వేఱనియు రెంటను పద్యగద్యములు సమానములైనను య. గా. లందు రేకులును నాటకములందు దరువులును విశేషము లనియు ననఁగాఁ రేకులును దరువులును వేఱనియు నేర్పడుచున్నది. అట నాటకము లనగాఁ బూర్వము మనకుఁ దెనుఁగున మార్గ నాటకముల వంటి నాటకములులేవు కావున వేంకట కవి యుద్దేశించినవి వీధి నాటకములు గావచ్చును. వీధి నాటకము యక్షగానముల పుట్టువు పొలఁకువలు వేఱు వేఱు కాని కాల క్రమమున యక్షగాన మొక రూపక ప్రక్రియగాఁ బరిణత మగుసరికి రెండు నేకమైపోయి యుండవచ్చునను నూహ కవకాశము గలదని మీఁదఁ జెప్పబడినది. నాటకములని పేర్కొనఁబడిన వానిలో యక్షగానలక్షణములు, యక్షగానములని వ్యవహరింపఁబడిన వానిలో వీధి నాటక లక్షణములును — ఇట్లు అన్యోన్య గుణ సంక్రమణము గల గ్రంథ జాలమెంతయో గలదు. (అట్టి య. గా. నాటక గ్రంథజాలమంతయు నీ గ్రంథము ద్వితీయభాగమున సమీక్షింపఁ బడినది) అట్లే "దరువులు" గల యక్షగానము లనేకము గలవు. రేకులగు జంపె, త్రిపుటాదులు గలిగి నాటకము లని వ్యవహరింపఁ బడిన గ్రంథము లెన్నియో

కలవు. ఆ జంపె త్రిపుటాదు లనేక య. గా. నాటకములందు దరువు లనియే పేర్కొనఁబడినవి. (ద్వి. భా.) కొన్నిట వట్టి "దరువులు" గా మాత్రమే పేర్కొనఁ బడిన వానియందును జంపె త్రిపుటాది తాళ గతులను స్పష్టముగా గుర్తింపవచ్చును. తరువాతఁ దరువాత దరువులు రాగ తాళోభయ ప్రధానములుగను రూపొందినవి. అసలు రేకునది ఛందో నిర్దేశముగల లాక్షణిక నామము. దరువు సంస్కృత నాటకములందలి ధ్రువ వలె ప్రయోజన వ్యవహారనామము. అందుచే దరువు రచనలో రేకైనఁ గావచ్చును లేక తత్ప్రయోగ సందర్భములకుఁ బనికివచ్చు నెట్టి గేయ రచనయైనఁ గావచ్చును.

దరువు ధ్రువా శబ్దభవమని పండితుల తలంపు. సంస్కృత నాటకములందు ధ్రువాగానమునకుఁ బ్రసక్తి కలదు. భరతుని నాట్యశాస్త్రమున ద్వాత్రింశాధ్యాయమున ధ్రువా విధానముగూర్చి ప్రత్యేకముగాఁ జెప్పఁ బడినది. అందు ధ్రువాగానము ప్రవేశాక్షేప నిష్క్రామ ప్రాసాదికాంతరములని పంచవిధములుగాఁ జెప్పఁబడినది. సంగీత సమయసారమున ధ్రువ ఏకాదశ విధములుగాఁ జెప్పబడినది. కాని నాట్య దర్పణ, భావ ప్రకాశ, వసంతరాజీయాద్యనేక గ్రంథములందు భరత మతమే పునశ్చరణ చేయఁ బడినది. నాట్యదర్పణమున ధ్రువా లక్షణమునకు లక్ష్యపురస్సరమైన చక్కని వివరణయు, సమన్వయమును గలవు. ఆ యా లక్ష్యలక్షణములను జూచినచోఁ బరిణత ప్రక్రియలగు మార్గరూపకములందు ధ్రువా ప్రయోజనమున కొక సాంకేతిక ప్రతిపత్తి యున్నట్లు తోఁచును. మన యక్షగానపు దరువులయెడ నట్టి సాంకేతిక ప్రతిపత్తి యంత కానరాదు. భరతాదులు చెప్పిన ప్రావేశిక్యాది పంచవిధ ధ్రువలలోఁ బ్రావేశిక ధ్రువకు మాత్రమే మన యక్షగానములందు విశేష ప్రసక్తిగలదు. భామ

కలాపాదులందు నర్వాచీన య. గా. లందును బాత్రలు తెర బయ ల్వెడలు సందర్భము లందున్న దరువు లీ కోవకుఁ జెందును. కాని యట పాత్రప్రవేశ సందర్భములందు గల దరువులను బ్రావేశిక ధ్రువ లనుకొనుట తప్ప నందాసాంకేతిక ప్రతిపత్తి చక్కఁగాఁ బాదు కొనియుండలేదు.

ఉదా :-

"ప్రవిశతః పాత్రస్య రసభావ ప్రకృత్యవస్థాదికం ప్రవేశ శబ్దేనోచ్యతే, తదనుసారేణ శ్లేష-సమాసోక్త్యా దలంకృతం యద్రూపకం గీయతే సాప్రవేశః ప్రయోజన మస్యా ఇతీ కణీ ప్రావేశికీ"

— నాట్యదర్పణము.

ఇందుల కుదాహరణ అనర్ఘరాఘవమున స్వాశ్రమ రక్షణా ర్థము రామాకర్షణార్థ మరుదెంచిన విశ్వామిత్రుని ఆదిత్యోదయ వర్ణనా వ్యాజ ప్రవేశ సందర్భము. ఇంత "పకడ్‌బంద్" గా నుండదు మన దరువు లక్షణము. వసంత రాజీయ* లక్షణము మాత్రము కొంత సరిపడునట్లున్నది.

ఉదా :-

"సూచనే పాత్ర భేదానం తత్వ్ర భావార్థ సూచనీ
యా గీతిః సాధ్రువా తుల్య సంవిధావ విశేషణే,
ప్రవేశ సూచకా దౌతు ధ్రువా ప్రావేశికీ మతా."

ఇట్టి సామాన్య లక్షణము మన య. గా. లందలి పాత్ర ప్రవే శపు దరువులకు పరిపోవును.

---

* ఇది యిపు డుపలబ్ధము గాదు. నాదెండ్ల గోపమంత్రి ప్రబోధ చంద్రోదయ వ్యాఖ్యానమున నీ వ. రా. నందలి ధ్రువా లక్షణ మాహరింపఁ బడినది.

14–15 శతాబ్దుల నుండి మన వాఙ్మయమున ధ్రువా ప్రశంస వినఁబడు చున్నది. భీమఖండమున ప్రావేశిక ధ్రువాగాన ప్రసక్తి గలదు. సింహాసన ద్వాత్రింశికలో ధ్రువా ప్రబంధము పేర్కొనఁ బడినది. తాళ్ళపాక వారి సంకీర్తన లక్షణమున "దరువు" పేర్కొనఁ బడినది. 16శ. చివరినుండి య. గా. లలో "దరువు" కన్పట్టును. పోను పోను, య. గా. లలో "దరువు" నకే పలుకు బడి హెచ్చినది. మార్గ రూపకములందు వలెఁ బంచప్రకార సాంకేతిక ప్రతిపత్తి లేక పోవచ్చును గాని మన యక్షగానము లందు దరు వనేక ప్రయోజనముల కుపయుక్త మైనది - పాత్రవర్ణన, ప్రవేశము, స్వీయోదంత కథనము, పాత్రాంతరములతో సంవాదము, ప్రకృతి వర్ణన, సన్నివేశ వర్ణన, కథానుసంధానము మొ... ఇవి బహుయక్షగాన సామాన్యములైనవి. విశేషములు గొన్ని మచ్చుముక్క లుదాహరింపఁ బడును.

1. <u>కొరవంజి దరువులు</u>:– ఈ పేర విజయ రాఘవ చంద్రికా విహార విజయ రాఘవ కళ్యాణాదు లందు కొరవంజి వేష భాషలు వర్ణితములైన దరువులు గలవు.

ఉదా :- మాళవి - తివడి (త్రిపుట)

"జింకపొక్కిటి యసట దీఱిన ।
 చిన్ని తిలకము మించగా
సంకుకడెములు నూరు వజ్రపు ।
 సంది దండలు మెఱయఁగా వచ్చెనెఱుకత వచ్చె॥ "
ఆరజముగా నెరిక వోసిన
 సొరిదిచీర చెఱంగులు

 పాదముల రాడగా ॥వచ్చె॥

గుబ్బచన్నుల మీద జేర్చిన
గోవకెంపుల పేరులు
గబ్బిగా గురిగింజ పూసల
కంట సరులై మించగా ॥వచ్చె॥

2. జక్కిణి దరువు:—జక్కిణి యొక నృత్య విశేషముగ బృహద్దేశ్యాది గ్రంథములందుఁ జెప్పఁబడినది. తదుపయుక్తమైన గీత ప్రబంధ విశేషమే యీ జక్కిణి దరువు.

ఉదా: తిరుమలకవి చిత్రకూట మాహాత్మ్యమునుండి:-

ధన్యాసి - ఆది

సకల నటన విభేద చమత్కార ప్రకార
ప్రకటన కరణి సమరథు
నటనుతు మేటి ఖోజాణురే
నటన సురధాణురే
సురుఖునమ్మణు కౌణురే॥

3. గుజరాతి వగవింత కోపు దరువు:—ఇదియుఁ జిత్రకూట మాహాత్మ్యము నందలిదే. ఇదియు నభినయోపయోగి యైనదే. రెండింటి యందును భాషాంతర ప్రయోగము గమనింపఁ దగినది.

ఉదా:— అసావేరి - ఝంపె

ద్వారకాధిపు నటన వరవిణుతు మిరే
తుమెచదారు పదపదుమ భంజనవరు సామిరే ధీరురే
భక్తమందారురే మేరునగ ధీరురే॥

4. కోలాట దరువు:- ఆడు పిల్లలచే దండలాసక క్రీడావసరము లందు పాడఁబడుట కుద్దిష్టములైనవి. అడుగునకుఁ దగిన నుడుగు కోలు కోలను నార్భటము, కైశికీ వృత్తియుఁ దీని ప్రత్యేకతలు. గిరిరాజు కవి వాదజయ మందలి కోలాట దరువు లుదాహృత పూర్వములు.

5. కోలాటవర్ణము :- ఇదియు నొక విశేషమైన దరువే. కోలాటకు దీనికిని సంబంధములేదు. కోలాటదరువునకును దీనికినిపోలిక తక్కువ. దానిగతి వేఱు, దీనిగతివేఱు. ఇందు 'కోలు కోలు' అను నార్భటములేదు. మఱి దీని కాపేరెట్లు వచ్చినదో !

ఉదా : ఆలూరి కుప్పనార్యుని పార్థసారథి విజయము నుండి :-

రాగం - భైరవి

తొడరి గోవులకు దూడలను విడువకనూ
విడివడిన లేగలను బడిబడి కట్టకనూ॥
కాచిన యట్టి పాలకడవలు డించకనూ
కాచక నిడినపాలు కాచుటకు తోచకనూ ॥
వెలయు శ్రీగోపాలుని వేణుగాన మాలించి
వెలువడిరి గోపికలు వింత వింత వైపుమించి॥

6. వృత్తదరువు :- ఎత్తుగడ వృత్తమై సగములో దరువు ధోరణికిఁ దిగిన నది వృత్తదరువు. (ఇదే వృత్తార్థమనియుఁ గొన్నిట వ్యవహరింపఁబడినది. 18 శ. కి ముందిట్టివి కన్పట్టుటలేదు.)

ఉదా : ఎల్లయ చంద్రతారా విలాసమునుండి :-

తోడి రాగము

వృ. "సుందరమైన రూపమును జూచి మనంబున నాస చేతుగా
వందమునొంది తార హరిణాంకుని ప్రక్కను నిల్చియేమిరా

ద. దంధాన సేయగ నేను మారుని 'బారి
తొందర కోర్వగలేను
డెందము కుందగ చిందర కెందుచు
కందువ లరయుచు సందునఁ బొందగు....దం."

7. టప్పా దరువు :- భీమసింగి కవిరాజు రాజారాణీ విలాసము నందును, వెంకటకృష్ణాజెట్టి శివపారిజాతము నందును గలవు. (రా. రా. వి. న టుమ్రీలును గలవు. టప్పాలు టుమ్రీలును మరాటీ గీత విశేషములు) వీని రచనయందు విశేషము కానరాదు.

ఉదా :— శి. పా. నుండి :-

"ఇందుధరు నిందు దేవే చంద్రవదనా
ఇందుముఖి శ్రీపార్వతి సుందరుని....ఇందు"

గమనిక : దరువులలో శహాజీ రచించిన దరువులకొక ప్రత్యేకత గలదు. అందుచే నవి ప్రత్యేకము ప్రసక్తములు. చూ. అనుబంధము(3).

# 3 ద్వి ప ద.

రేకులు, దరువుల తరువాత యక్షగానమునఁ బ్రధానమైనది ద్విపద. ప్రాయికముగా ద్విపదలేని యక్షగానమే లేదన వచ్చును. అది యక్షగానములో నెన్ని యవతారము లెత్తినదో చెప్పనలవి కాదు. ద్విపద దేశిచ్ఛంద మనియే యనేకాంధ్ర విద్వాంసుల విశ్వాసము. కాని సంస్కృత ప్రాకృతము లందది చాల కాలము నుండి ప్రచారమున నుండినట్లు తెలియుచున్నది. వైదిక వాఙ్మయములో ద్విపదా గాయత్రీ, ద్విపదా జగతీ, ద్విపదా శత బృహతీ, ద్విపదాత్రిష్టుప్, ద్విపదా విరాట్ అను ఛందస్సులు గానవచ్చుచున్నవి. ద్విపద, ద్విపది, ద్విపదిక, ద్విపథగ ద్విపదీ ఖండము. దోహా (ప్రాకృతము) మొదలగు వివిధ నామములతో నొక ఋగ్భేదమనియు, గీత ప్రబంధమనియు, మాత్రా వృత్తమనియు నిట్లు బహు భంగులుగా వివిధ గ్రంథము లందు దాని ప్రశక్తి కాన నగుచున్నది. ఆ ప్రసక్తి యెట్టిదో అది మన ద్విపదకు సరిపడునో లేదో చూతము:-

1. వా చ స్ప త్య ని ఘ ం టు వు:—

---

ద్విపదికా - ద్విపదీ; స్వార్థే 'క' హ్రస్వః గీతి భేదే. "శుద్ధా ద్విపదికా గీతిర్జంభలేత్యభి ధీయతే" భరతః. ద్విపదికయా దిశోవలోక్య నిః శ్వస్య సాస్రమ్" — విక్రమోర్వశీయమ్.

ద్వి ప దీ:— ఋగ్భిన్నే. (1) ద్విపద యుక్త గీతి భేదే. (2) మాత్రా వృత్తా భేదేచ. "ఆదౌ షట్కలమేతత్ తదను పంచ చతుష్కలమ్, గుర్వంతం ద్విపదీభవ తీహ వింశత్యష్టకలం దలమ్"

"గాయత్ర్యస్యేక పదీ ద్విపదీ చతుష్పద్య పదసి నహి పద్యసే"

— శతపథ బ్రాహ్మణము 14,8, 1510.

2. శబ్దస్తోమ మహానిధి :—

ద్విపదా :— స్త్రీ. ద్వౌ పాదావ స్యాః— పాదస్యాన్తలోపః టాప్ - భత్వాత్పదా దేశః. ఋక్ని శేషే ఛందో భేదే జీప్—ద్విపదీ.

3. శబ్దార్థచింతామణి :—

ద్విపదా — స్త్రీ. ఋగ్వి శేషే. ద్వౌ పాదావస్యాః సంఖ్యాసు పూర్వస్యేతి పాదస్యాన్తలోపః - టాబృచీతి టాప్ — పాదః పత్.

ద్విపదీ — స్త్రీ. మాత్రా వృత్తాంతరే. "ఆదౌ షట్కల మే తత్ ....... ."

4. భరతనాట్యశాస్త్రము :-

విక్రమోర్వశీయమున ద్విపదిక పేర్కొనఁబడినది కాని యందు లక్ష్యములేదు. తద్వ్యాఖ్యాత భరత ప్రోక్తముగా ద్విపదిక లక్షణము నిట్లుటంకించెను. :—

"శుద్ధాఖణ్డాచ మాత్రాచ సంపూర్ణేతి చతుర్విధా
ద్విపదీ కరణాఖ్యేన తాళేన పరిగీయతే
పాదేషః పంచ భాగోస్తే జౌ స్తః షష్ఠ ద్వీతీయ కౌ
చతుర్భి రీదృశైః పాదైః శుద్ధా ద్విపది కోచ్యతే.
అర్ధాంతేన్యే స్వరా నాహుః ఖండాస్యా చ్చద్ధ యార్థయా
షష్ఠేనైకేవ గురుణా మాత్రా ద్విపది కా మతా,
జ్ఞేయా శుద్ధైవ సంపూర్ణా గురుణాంతేధి కేనతు."

ఇది భరతమునఁ గన్పట్టుట లేదు. ఇదే యథాతథముగ సంగీత రత్నాకరమునఁ గలదు. (అధ్యా. 4 శ్లో. 214-217) కాని ద్విపదిక జంభలా నామక మగు నొక గీతి భేదముగా భరతుఁడు చెప్పినట్లు వాచస్పత్యమునఁ గలదు కదా. విక్రమోర్వశీయమునఁ

జతుర్థాంకమున ద్విపదికకు లక్ష్యము లేదుకాని జ ం భ లి క యను నొక గీతమునకు లక్ష్యము గలదు.

ఉదా :– (ప్రాకృతము) :–

" సహ అరి – దుఖ్ఖాలిద్ధ అం
సరవర – అమ్మి సిణిద్ధ అం
అరవిల – వాహ – జలోల్ల అం
తమ్మ ఇ హంసీ - జు అలఅం"

దీనిపై రంగనాథుని వ్యాఖ్యానము :–

" జంభలికా గీతి విశేషః తథా చాహ భరతః ఉద్గ్రాహాది సకృద్వైక ఖండోద్విశక లోధవా. యత్రధ్రువో ద్విర్వాభోగో (?) ధ్రువేముక్తిః స జంభకః. – ఇతి, " ఏతస్యైవనామ జంభలికేతి మతంగ మతమ్. ధ్రువే ముక్తి రహితా పూర్వోక్తలక్షణ లక్షితా నేతి శ్రీమద్భట్టసోమేశ్వర చరణాః "

(ఈ జంభలికయే ద్విపదిక రూపాంతరమగు జంభలయగునా ?)

5. మ తం గు ని బృ హ ద్దే శి :-

" యాస్మాత్ కరణ తాలేన ద్విపదీ వృత్త సంగతా
సా భవేత్ ద్విపదీ నామ ప్రోక్తా వస్తు విచక్షణైః
ఆద్యం పాద ద్వయం యత్రస్యా దను ప్రాస వర్జితం
అనుప్రాస స్తృతీయేపి చతుర్థేవాథ గీయతే."

6. జనాశ్రయి :– అధ్యా. 5. సూత్ర. 54 - 58

సూ, " గణాత్రయో భంగ ద్విపదీ" - 54

వృత్తి. త్రయోగణాః ప్రతిపాదం భవన్తి చేత్
భంగ .ద్విపదీ నామ భవతి, గణాధికార వర్త

మానే పునర్గణ గ్రహణం చతుర్లఘూనాంచ
సర్వేషాం గణానా మభేదేన గ్రహణార్థమ్.
ఇతరథాహి చతుర్లఘూనా మేవ గ్రహణం స్యాత్.

సూ. "చత్వారం పంచషట్ సప్తవా" – 55.

వృత్తి. తస్యా ఏవ భంగ ద్విపద్యా న కేవలం త్రయ
ఏవ గణా భవన్తి చత్వారో వా పంచవా
షడ్వా సప్తవా భవన్తి.

సూ. "భాంతేవా" – 56.

వృత్తి. తస్యా భంగ ద్విపద్యా ప్రతి పాదం గురురన్తేభవతి వా న వా.

సూ. "త్రింశద్వా పరమా" – 57.

వృత్తి. త్రింశల్లఘవో యస్యా భంగ ద్విపద్యాః
సా భవతి త్రింశద్వా పరమాధికా భంగ ద్విపదీ.

తతః సర్వాభ్యో భంగ ద్విపదీభ్యో యా పరమా సా
త్రింశద్వా భవతి తదధికా నా స్తి"

సూ. "ద్విపదీ గీతికా పరా" – 58.

వృత్తి. సైవ భంగ ద్విపదీ ద్విపదీత్యు చ్యతే గీతికా
పరా భవతి చేత్.

ఉదాహరణమ్ :– (ఒక్కొక పాదము మాత్రము)

"క్షీణమంబు వా పీషు సరిత్సుచ సాంప్రతం
రక్ష్యమాణం బహు ధన మిహ భాగ్య విపర్యయే" ?
"కరుణాకర నిష్కరుణేన వాయునా
రిపు వారణ దాన గంధినా."

7. రత్నావళి :– ఇందు ప్రథమాంకమున ద్విపదీ ఖండమునకు.
ప్రాకృతమున నొక లక్ష్యము గలదు. అందుండి ఉదా :–

" కుసుమా ఉహ పి అదూ అఓ
ము ఉలా ఇద బహు చూ అ ఓ
సిధిలి అ మాణగ్గ హణఓ
వా అ ఇ దా హిణ పవణఓ.

(భావప్రకాశమున 'కావ్య' మను నుపరూపకము 'సభగ్న' తాళ ద్విపదీ ఖండ మాత్రా పరిష్కృత" మ్మనియు, "కల్పవల్లి" యను నుపరూపకము "ద్విపదీ ఖండ గేయాఢ్య" యనియుఁ గలదు. బాణ భట్టు కాదంబరి పూర్వభాగమునఁ 'ద్విపది' యొక్క పార్శ్వవిశేషముగాఁ జేర్కొనఁబడినది).

8. మానసోల్లాసము :-

"త్రయోగణా గుణ్చాంతే ప్రథమేథ తృతీయకే
ద్వితీయేచ తురీయేచ ద్వౌ గణా ద్వౌగురూ తథా
జగణో నాత్ర కర్తవ్యో భాగాంతే యమకం భవేత్
ఇతి ద్విపదగం నామా తస్యోదాహృతి రుచ్యతే.
గీతవ్యః స్వరసంయుక్త స్తాలేన పరివర్జితః
ప్రబంధో ద్విపదాభిఖ్యో గీతి విద్యా విశారదైః
షట్కలో గణ అద్యన్య తతః పంచ చతుష్కలా
అంతే గురు ర్ద్వితీయే జః షష్ఠేచ ద్విపదీ తు సా
పాదద్వయాంతే కర్తవ్యః స్వరన్యాసో యథోచితః
ఏనకేనాపి తాలేన గాతవ్యా ద్విపదీ బుధైః"

9. సంగీత చూడామణి :-

"సంస్కృతే యే ద్విపదగాః ప్రాకృతే దోహ కాశ్చతే
అభీష్టమాత్ర తాళః స్యా దాభోగో అన్య పదైః కృతః
స్వరైర్న్యాసో విధాతవ్య తాళమాన ద్వయేన వా."

10. సంగీత రత్నాకరము : విక్రమోర్వశీయ వ్యాఖ్యాత భరతముని ప్రోక్తమైనదిగాఁ జేర్కొనిన ద్విపదీ లక్షణము యథాతథ

ముగా నిందున్న దే. అదికాక " ద్విపథ ప్రబంధ " మనున దానికి మాత్రాభేదమునుబట్టి బహుభంగులైనదిగా, నిదే ప్రాకృతమున 'దోహా' యనియుఁ బేర్కొనబడినది. (ఈ 'దోహా' కు నాలుగు పాదములు; 1, 3, పాదములకు పదుమూఁడును, 2, 4 పాదములకు పదునొకండును మాత్రలుండును. చూ. కోల్ బ్రూక్. పుట 413).

సం. ర. వ్యాఖ్యాన (కళానిధి) కర్తయగు కల్లినాథుఁడు "ద్విపథం దోధక మితి పర్యాయశబ్దౌ, తేన దోధకలక్షణమేవ ద్విపద లక్షణం వేదితవ్యమ్. దోధక లక్షణంతు భా భగా గితి " యని వక్కాణించినాఁడు.

11. సంగీతసుధాకరము:

" కరణాఖ్యేన తాలేన గాతవ్యో గమకాంతరే
అభోగోన్య పదైః కార్యో న్యాస స్తాలా ద్విమానతః
ద్విపదీచ భవవే దేవమ్ ".

12. కన్నడఛందోబుధి:- ఇందు ద్విపద దువయి, దువవిగ, దువది మొ॥ పేరులతోఁ బేర్కొనఁబడినది. (IV. 293-95). అందుఁ దత్పాదమునకు 28 లేక 26 మాత్రలుండునని చెప్పఁబడినది.

13. కవిజనాశ్రయము:-

" ఇంద్ర గణములు మూఁ డినగణం బొకటి
చంద్రాస్య ద్విపదకుఁ జనుఁ జెప్ప రేచ "

ఈలక్షణమే ఆంధ్రలాక్షణికు లందఱిచేతను బునశ్చరణచేయఁ బడినది. మనద్విపదకు యతిప్రాస నియతి గలదు. మంజరీ ద్విపదకు గణని యతి యుంతే కాని ప్రాస నియతి మాత్రములేదు. (చిన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో ద్విపద " ద్విపది " యని

పేరొ్కొనబడుట విశేషము) మన ద్విపద మాత్రాచ్ఛందో గీతప్రబంధ వైఖరులు గలిగియున్నది. (ఇంద్ర చంద్ర సూర్యగణాదులు నిసర్గగణములుగావు. మాత్రాచ్ఛందస్సులను గొలుచుటకుఁ బ్రక్రియా సౌలభ్య పరాయణులైన లాక్షణికులు పట్టుకొనిన కృతకములైన కొలబద్దలు. "ద్విపద ప్రబంధమున" పల్నాటి వీరకథ పాడఁబడెడిదని క్రీడాభిరామమున 15వ పద్యమునఁ గలదు. ద్విపదకు ద్విగుణమగు తరువోజ దంపుళ్ళపాటయని కావ్యాలంకార చూడామణియందు 8-50. చెప్పఁబడినది. యక్షగానములందుఁ బ్రయుక్తములైన లక్ష్మీకల్యాణాది గీతములు ద్విపద వికారములు) కాని మీఁద వివిధ సంస్కృత గ్రంథములనుండి యన్ని లక్షణములెందుల కెత్తిచూపబడిన వనఁగా నందేదియు యథాతథముగ మన ద్విపద లక్షణమున కెన కాదని చూపుటకే. "ఉదాహస్త్ర్వల...ఇత్యాదిలక్షణమున ముఖ్యముగా గమనింపదగినది 'గుర్వంతం ద్విపదీ భవతి" అను నది. మన ద్విపద లఘ్వంతము. ద్విపదికగా ననుమానింపఁ దగిన జంభలికా గీతి లక్షణమును బరిశీలించిన నది పాద పాదమునకుఁ బదుమూఁడేసి మాత్రలు గలదని(రత్నావళి లక్ష్యవిషయము నిట్టిదే) తెల్లమగును. మన ద్విపద పాదము పరిమితి యధమ పక్షము పదునైదు మాత్రలు. బృహద్దేశీత్యాదులందు ద్విపద కరణ తాలముతోఁ బాడఁ బడునని కలదు. ('తాలే కరణ ఇత్యాఖ్యే జ్ఞేయం బిందు చతుష్టయమ్" అని నారదుని సంగీత మకరంద లక్షణము). ఇట్లు మన ద్విపను కరణతాళముతోఁ బాడు సంప్రదాయ ప్రసక్తి మన యాంధ్రమునం దెచ్చటను గానరాదు. ఇఁక జనాశ్రయి లక్ష్యములనుజూచినచో నందు పాద పాదమునకు ముప్పది పై చిలుకుగా నున్నవి మాత్రలు; మన ద్విపద పాద మాత్రావధి పదు నెనిమిది. మానసోల్లాసాదు లందలి 1-3 పాదము లందు మూఁడు గణనొకములు గురువు, 2—4 పాదములందు రెండు గణ

ములు రెండు గురువులు అను ద్విపదగ లక్షణము 1—2 పాదముల కొక్కటే లక్షణము గలిగి లఘ్వంతమగు మన ద్విపదకు నప్పదు. సంగీత రత్నాకరమున పాదమున కొక భగణము (6 మాత్రలు గలది), 5 భగణములు, అంత మందు గురువు నగుమ 2 వ, 6 వ గణములు జగణములునైయిట్టి పాదములు నాల్గుండిన నది శుద్ధ ద్విపదిక యనియు, నిందలి మొదటి రెండు పాదములు నియత లక్షణములై పిదప రెండు ననియత లక్షణములుగ నున్నచో నది ఖండ ద్విపద యనియు, ప్రతి పాదమునను షష్ఠగణ స్థానమున నొక్క గురువును మాత్రమే ప్రయోగించినచో నది మాత్రా ద్విపదిక యనియు, శుద్ధ ద్విపదికయొక్క ప్రతి పాదాంతము నందు నొక్కొక గురువును జేర్చినచో నది సంపూర్ణ ద్విపద యగు ననియుఁ జెప్పఁబడినది. ఇట్లొక్కొక పాదమున నిన్ని గణములకు నందు జగణమునకును బ్రసక్తి, అంత మందు గురువునకుఁ బ్రసక్తి మన ద్విపదయెడలఁ గానరావు. సంగీత రత్నాకరము నందలి ద్విపథకమే దోధక మనియు దానికి 3 భగణ ములు 2 గురువులు లక్షణ మనియు కల్లినాథుఁడు చెప్పినాఁడు. ఈ దోధకమునే త్రిష్టుప్ ఛందో వృత్తముగాఁ బరిగణించి యున్నారు మన లాక్షణికులు. అపర్యాప్తమైనను దోధక లక్షణము మన ద్విప దకు సన్నిహితముగానున్నది. అందలి చివరి గురువును లఘువు చేసి నచో నది ద్విపద పాద మగును. అయితే దోధకమున భగణప్రయో గము విహితము. ద్విపదయం దైచ్ఛికము. రెండేసి పాదములకు లక్షణ సామ్యము గల దెల్ల ద్విపదయను సామాన్యార్థమున నివి యన్నియు ద్విపదలే కాని మన ద్విపద లక్షణము తదితరముల కంటె విలక్షణమైనదనియే, అది దేశిచ్ఛంద మనియే చెప్పనగును. ద్విప దను జాతిచ్ఛందముగాఁ బరిగణించినారు మన లాక్షణికులు. ఇటీవలఁ గొందఱు పండితులు మన ద్విపద దేశిచ్ఛందస్సు కాదని యభిప్రాయ

పడి ద్విపద నొక ప్రధాన రచనాంగముగాఁ గల యక్షగానము దేశి త్వమును శంకించిరి. కావున దానిగుఱించి యింతదూరము వ్రాయ వలసి వచ్చినది.

మన యక్షగానము లందు ద్విపదకు విశేష ప్రసక్తి గలదు. బహు యక్షగానము లందు గ్రంథాంతమున కవిగద్యకు బదులు ద్విపదయే యుక్తమైనది. అందు కృతి సమర్పణము కవి విషయము నుండును. కొన్నిట గ్రంథారంభమునఁ గథా సంగ్రహాది విషయ కథనము కొఱకు నుపయుక్తమైనది. ద్విపద గ్రంథము నడుమఁ బలు తావులఁ గథా కథనము, వర్ణన, పాత్ర ప్రవేశము (సంధి ద్విపద - పాత్రప్రశంస, తెర ద్విపద - పాత్రస్వీయోదంతోద్ఘాటనము), పాత్రల సంభాషణ మొదలగు ననేక సందర్భము లందుఁ బ్రయుక్తమైనది. అది కాక ద్విపద రూపాంతరము లెన్నియో యక్షగానము లందుఁ బ్రయుక్తము లైనవి. అందు :-

1. మంజరి :- ఇందు ప్రాసనియతి లేక పోవుట మాత్రమే దీనికి ద్విపదతోఁగల భేదము. ఇదికాక మంజరిపేరనే యింకొక రచనా విశేషము య. గా. లం దతివిరళముగాఁ బ్రయుక్తమైనది.

ఉదా :- గిరిరాజు లీలావతీ కల్యాణమునుండి

" ఈ రీతిగ ధరణీశుఁడు వెడలిన
సారె పోత్త తమ చారులచే విని
వెంచియు వేఱువని వితమున విమతులు
గుమిగల తమ తమ కులగతు తెన్నుచు "

ఇందలి రేఫలకారాళి నడక గమనింపఁదగినది. ఇది కాక మఱియొక విధమైన మంజరి 19 శ. ఉ. భా. నుండి బయల్వెడలిన య. గా. లలో (య. గా. లని వ్యవహరింపఁబడిన హరికథలలో) ప్రయుక్తమైనది.

ఉదా :- శ్రీ మదజ్జాడాది భట్టనారాయణదాసుగారి ప్రహ్లాద చరిత్రమునుండి -

ధన్యాసి రాగము

" అని చండామార్కులను గురువులకు – నప్పగించె నబ్బాలున్
కనక కశిపుండు సుమూర్తంబున – గంజాక్ష భక్తి లోలున్ "

ఇందు పాదమునకు 16 + 12 మాత్రలు. యతి స్థానము 17 వ మాత్రా స్థానము. ప్రాస, అంత్యప్రాసలు విహితములు. ఒక్కొకచోఁ బ్రాస యతియుఁ గన్పట్టును.

2. సువ్వాల ద్విపద :- సువ్వి సువ్వాల యనునవి దంపుళ్ళ పాటలుగాఁ బ్రసిద్ధములు. అనేకయక్షగానములందుఁ బ్రయుక్తములు. సువ్వాల లక్షణసార సంగ్రమున (3-102) పేర్కొనబడినది. అప్పకవీయమున సువాలకొక లక్ష్యముగలదు (4-403) కాని "సువ్వాల ద్విపద" యనుపేరు చిత్రముగా నున్నది. ఆ పేరిట నొకరచనా విశేషము యక్షగానములందుఁ జూపట్టుచున్నది.

ఉదా : - కుండినపుర కురవంజినుండి

" గూని వీపు గొగ్గి పండ్లు కొంగ మెడయు గొప్పనడుము
దోనె కడుపు దొప్ప చెవులు దోమ కన్నులు "

ఇందలి తురగవల్గన గతి గమనింపఁ దగినది. (గుత్తిముచిన కపోతయ్యా రచించిన దారుకావన క్రీడ సువాల- ప్రా. లి. పు. భా., నం. 1887 అచ్చుముగా నిట్టిదే) * సువాల ద్విపద యనుటలో గమనింపఁదగిన విషయ మొకటి యున్నది. ద్విపదకు ద్విగుణ మగు తగువోజు

*"సువాలధాతువు" అను పేర ప్రా. లి. పు. భాం డి. నం. 1855 కుర వంజిలో నున్న రచనయు నిట్టిదే

దంపుళ్ల పాటగాఁ గావ్యాలంకార చూడామణిలో (8-50) చెప్పఁ బడినది.

"తలకొని తగఁ బ్రాలు దంపెడి చోటఁ
దరుణులచే నొంపు దనరుఁ దర్వోజ"

(య. గా. లందు సు. ద్వి. కే గాని తరువోజకుఁ బ్రసక్తి లేదు) అప్ప కవీయము నందలి సువాల

"అక్షర హరి విక చాంబు రుహాక్షా
యక్షప సఖనుత యదుకులదక్షా, సువ్వీ సువ్వాలే"

అని మీఁది సువాల ద్విపదవలెఁ గాక "మామూలు" మనద్విపదయే గుర్వంతమైన నెట్లుండునో యట్లే యున్నది. అయితే మ రగతి మాత్రమే పాటింపఁబడినది. అది రోకటి పోటు యొడుపులో నొక వేగమును సూచించు నట్టిది. "సువ్వీ సువ్వాలే" యను నది చివర నొక యూఁత పదము, కుల్లని వంటిది.

3. గౌరీకల్యాణము :- ఇది ఆడువారి పెండ్లి వేడుక పాటగాఁ బ్రాచీనకాలము నుండియుఁ దెనుఁగు నాట మిగులఁ బ్రసిద్ధమైనది. (జక్కన విక్రమార్క చరిత 4-130, 179, అనంతుని భోజరాజీయము 4-87, కాకమాని మూర్తి పాంచాలీ పరిణయము 4-22, మల్లన రాజశేఖర చరిత్రము లందు దీని ప్రసక్తి గలదు) కొన్ని యక్షగానము లందుఁ బ్రయుక్తమైనది. ఇది ద్విపద వికారముగా భాసిల్లును.

ఉదా :- మాతృభూతన పారిజాతాపహరణము నుండి

"శ్రీ రుక్మిణీ లోల చిర సుగుణజాల
కారుణ్య మయశీల కల్యాణ చేల —"
(గౌరీ కల్యాణమే వైభోగమే),

(అప్పకవీయమున "పెండ్లి పాట" యను పేరఁ బొడాంతమున "గౌరీకల్యాణ వైభవమే" అన్న యూఁత పలుకుతోనొక లక్ష్యమున్నది. అది యచ్చముగాఁ బూర్వోక్తమైన సువాలపాటనమే. ఊఁత మాట మాత్రము మారినది.)

4. లక్ష్మీకల్యాణము :— ఇదియు గౌరీకల్యాణము వంటి యొక పెండ్లివేడుక పాట. (వెంకటనాథుని పంచతంత్రమున, 4–360, పేర్కొనఁబడినది.) కతిపయ యక్షగానము లందుఁ బ్రయుక్తమైనది. ఇదియు నచ్చముగా ద్విపద మచ్చే.

ఉదా :- హేమాబ్జ నాయికా స్వయంవరము నుండి

"శృంగార మమరంగ చెలువ మన్నారు
చెంగమ్మ పెండ్లికి చెలులార రారె
నిత్య కల్యాణంబు పచ్చ తోరణము
హెచ్చైన కదలి రాజింట నే ప్రొద్దు"

ఇందూఁత పదము లేదు. మృత్యుంజయ విలాసమున గౌరీ లక్ష్మీ కల్యాణముల యూఁత పదములు రెండును గ్రహింపఁ బడినది.

ఉదా :-

"శ్రీ మహాలక్ష్మిని శ్రీ విష్ణుఁ బోలి
తామర తంపరై తగిరి దంపతులు ॥
గౌరీ కల్యాణమే వైభోగమే
లక్ష్మీ కల్యాణమే సౌభాగ్యమే."

తాతంభట్టు చింతామణి యను లక్షణ గ్రంథమున (తం. స. మ. కే. నం. 779) "లక్ష్మీ కళ్యాణము నందలి రేకులు" అని "నీరజోదరు రాణి నీలవేణికిని" అని ద్విపద పాదము లుదాహరింపఁ బడి

నది. ఆ లక్ష్మీ కల్యాణ మొక యక్షగాన గ్రంథము కావచ్చును. కాని యందలి రేకు లనునవి ద్విపదపాదముల వలె నుండుట యిట గమనింప దగినది. 'ఆయూయి రగడ భేదము రేకులు పెక్కులమరు" నని యన్నాఁడు గదా లక్షణ సార సంగ్రహ కర్త (3—102). అనఁగా నొక్క యెడ ద్విపదకు రగడకుఁ గూడ బాంధవ మేర్పడిన దన్నమాట.

<u>5 ద్విపదార్ధము</u>:— ఈ పేరిటి రచనలో మొదటి సగము ద్విపద, పిదప సగము దరువునై యుండును. కందార్ధములు, గీతార్ధములు మొదలగు నిట్టి రచనా విశేషములు 18—19 శతాబ్దులనుండి వ్యాప్తిలోనికి వచ్చినవి. యక్షగానముల కెక్కినవి.

ఉదా :- నందిపాటి మిత్రవిందా పరిణయము నుండి.

"భామరో నీమాట బహుచిత్ర మమ్మ
కోమలా కారుఁడౌ కృష్ణుండు నీకు
మామ పుత్రుండను మాట యే కాని
అ మహా మహుని నీవు
చూడలేదెట్టు లతివా మోహించినావూ
తామరా సాక్షి నీకూ తగునే యీ వట్టిభ్రమలు. ....,"

గమనిక :— ఇవికాక యింకను ద్విపద వికారము లైన దేశి రచనా రీతు లెన్నియో గలవు - నివాళిపదము, జాళపదము మొదలైనవి.

# 4. పద్యము

మన చంపూ కావ్యాదులలో నుపయుక్తము లైన వివిధ జాత్యుపజాతి వృత్తము లించు మించన్నియు (అక్కరలు, షట్పదోజాదులు, కొన్ని తక్క) యక్షగానము లందుఁ బ్రయుక్తము లైన వని చెప్పవచ్చును. అందనేకము ప్రసిద్ధములు, మనఛందో లక్షణ గ్రంథము లందుక్తము లైనవి. వాని లక్షణము లిటఁ బునశ్చరణ చేయవలసిన పనిలేదు. కతి పయ విశేషములు మాత్రము తెలుపఁ బడును.

లయగ్రాహి మొ... వాని యందు జంపెగతి, మత్తకోకిలాదు లందు త్రిపుట గతి, ఉత్సాహాదు లందు రచ్చ రేకు నడక, మాలినీ త్యాదులందు ఏకతాళి యొడుపును గుర్తింపఁ దగినవి. ఇవి పద్యము లుగాఁ బరిగణింపఁ బడుచున్నవి. కాని ప్రాయికముగా వీనిని రగడ వికృత లనఁ దగును.

ఇఁకఁ బద్యవిశేషములొక మూఁడు :-

1. కపోతకవృత్తము :– కూరపాటి అమరలింగామాత్యుని పార్వతీ కల్యాణమున నొక లక్ష్యము గలదు.

> " హిమగిరి కన్య మహేశ్వరు గూర్చన్
> సుమ విశిఖంబుల సొంపుగ నేయన్ " మొ....

ఇది జగతీ చ్ఛందము నందలి శోనక లేక తామరస వృత్తముగా మన లాక్షణికులచే నుదాహరింపఁబడినది. (చూ. అనంతుని ఛందము 2–46)

2. శారద పద్యము :- ఈ పేరిటఁ గతి పయ యక్షగానము లందొక రచనా విశేషము గన్పట్టు చున్నది. ఇది పేరికే పద్యము

కాని దరువు ధోరణి నున్నది. ఒక్కొక్కచో దీనికి రాగ తాళములు గూడ నుదాహరింప బడుట విశేషము.

ఉదా :- అకలంక శ్రీకృష్ణమూర్యుని కృష్ణవిలాసము నుండి :-

**ఆదితాళము — కన్నడ రాగము.**

" అనుచు వసుదేవు మోము గనుఁ గొనుచు
నను కరుణ జూడవే యనుచు
యిఁక సేవగింప వలదనుచు
నీ దాసుఁడ ననుఁ గను మనుచు
కను గొలఁకుల కడఁ గారెడు నశ్రులు
తన కొన గోటను తరి తరి జిమ్మెన్ ".

దీని కొక విధముగా లక్షణ నిర్వచనము చేయవచ్చును. మూఁడు నాలుగు మాత్రల పరిమితిగల యొక (క్రియా) పదముతో నారంభించి యంతే పరిమితిగల యట్టి (క్రియా) పదముల నంత్యప్రాసోపయుక్తములగు వానినిఁ గొన్నిటిని గ్రహించి పదేసి మాత్రల పాదములపై నొక్కొక దానిని నిలిపి యట్టి పాదములు కొన్నియైన వెనుక సమాపక క్రియాంత మగు మధుర గతి రగడ పాదము లొక రెండు ఘటింపవలయును.

3. కల్యాణవృత్తము :- త, న, స, గణములు గలది. పురిజాల లక్ష్మీనారాయణ పారిజాతము నందుఁ బ్రయుక్తమైనది.

ఉదా :-

శ్రీ వారిజ భవ భవన । ద్దేవేంద్ర వినుత పదరా
జీవ త్రిజగదవనదీ । క్షా వేంకట రమణ-హరీ. -

4 తురంగప్రయాతము :- ఈ పేరితోడి పద్య మొకటి కొన్ని తడవలు కొండమగుండ్ల శేషాచార్యుల కుమారవ [illegible] విలాస నాటకమునఁ బ్రయుక్తమైనది.

ఉదా :-

కామశత సహస్రసుప్ర — కాశమాన విగ్రహా!
సామజాధి పావన ప్ర — చార లసదనుగ్రహా!

పాదపాదమునకు నేడు సూర్యగణములు మీఁద నొక గురువు. పంచమ గణాద్యక్షరము యతిస్థానము, ప్రాసనియమమును గలదు - ఇది కేవలము ప్రసిద్ధ జాతి చ్ఛందః ప్రభేదమైన 'ఉత్సాహ' యేగాని మఱియొండుగాదు. అయితే యిందలి తురగవల్గన గతి జూచి శేషాచార్యులు కోరి మోజుపడి యీ పేరు పెట్టుకొని యుందురు.

## అర్ధపద్యములు

కందార్ధములు, సీసార్ధములు, గీతార్ధములు, వృత్తార్ధములు; ద్విపదార్ధములు - అను పేరఁ గొన్ని రచనా విశేషములు 18–19 శతాబ్దులనుండి యక్షగానములం దెడనెడఁ గన్పట్టుచున్నవి. 19 శ., ఉ.భా. నుండి వీని ప్రాచుర్య మధికమైనది. ఇవి యన్నియుఁ దొలి సగము పద్యము మలి సగము దరువుగను గన్పట్టుచున్నవి. వీనికి రాగ తాళములు పేర్కొనఁ బడుటయుఁ గలదు. వీనికి కందాలంకారము సీసాలంకారము నను పేళ్లును గొన్నిట (ఉ॥ లక్ష్మీనారాయణ విలాసము) గన్పట్టును. వీని కిటీవల అర్ధపద్యములను వ్యవహారము గల్గినది. ఇందు వృత్తార్ధ ద్విపదార్ధము లుదాహృతపూర్వములు. కడమ వాని కొక్కొక్క యుదాహరణము:-

1. కందార్థము :- ఉదా :-లక్ష్మీనారాయణ విలాసమునుండి:

జయంత సేన - ఆట

సురలు ధరా సురులు ధరా
ధరులు ధరావరులు నాత్మ తరుణీ యుతులై
సురనదిని మునిఁగి పంక్తుల
నిర వందగ నంత కాంత
లింపల రార
కెంపు చెక్కడపుఁ దో - రంపు పళ్ళెముల వ
డ్డింప సాగిరి మే లంపు నేర్పు మాట ॥లింపల రార॥

( ఈ "జయంత సేన" ప్రసిద్ధమైన తంజాపుర రఘునాధ రాయ పరికల్పితమైన మేళా యే యగునా ?)

2. సీసార్థము :— ఉదా:— తరిగొండ వెంగమాంబ శివ విలాసమునుండి :

" వినవే మందాకిని వేమాఱు నాతోను
ఎనసిన మాట లింకేల నీకు
వనజాక్షి నీ వింత వగలు జేసినఁగాని
మనసు నీపైలేదు మత్స్యకంరి

గొన కాని భ్రమ రాంబ కోపము జేసీని
నను నీవు పిల్వ రాకువే । మందాకిని
నను నీవు పిల్వ రాకువే । నాతోడ నీవు
చనవు మాటాడ రాకువె "

3. గీతార్థము :- ఉదా :-శ్రీరాజా మృత్యుంజయ నిశ్శంక బహాద్దరువారి దశావతార య. గా. నుండి :—

" కాంచనాక్షుఁ డిపుడు కడు పరాక్రమమున
పుడమి నెల్లఁ జాప పోల్కి జుట్టి

పోవు ననెడి వార్తఁ బొల్పగ విని మేము
వాని నిపుడు చూపి వసుధ నేలఁ గను —

వచ్చితి మిపుడు వాసి మీరగను
మోహన మైన వరహావ తారమును
సాహస మొప్పగ సంతోషమున దాల్చి ॥వసుధ॥

(ఇది యిందు గీతాలంకార మని పేర్కొనఁబడినది. కురుమద్దాలి వేంకటాచలకవి భాగవత దశమస్కంధ మను గేయ కావ్యమున కందార్థాదులు కందార్ధ గీతార్థ ద్విపదార్థ చంద్రికలని పేర్కొనఁబడినవి).

యక్షగానము లందలి పద్య రచనలో సర్వ సాధారణముగ గర్భబంధాది చిత్రకవిత్వపు గసరత్తు లుండవు. కాని యత్యంత విరళ ముగనైన నసలు లేక పోలేదు. తిరువెంగళామాత్యుని నీలాచల విలాసమున చతుర్విధ కందము, గర్భితచంపకమాల, చతుర్విధకందగర్భిత మణిగణ నికరము, మత్తేభ కందగర్భిత సీసమును గలవు. పురాణము పిచ్చయగారి మైరావణ నాటకమున కంద గీతగర్భిత చంపకమాల, పుష్పగుచ్ఛ బంధము, పద భ్రమకమును గలవు. అనేక యక్షగానము లందు సంస్కృతశ్లోకములును గలవు.

యక్షగానము లందలి గర్భబంధకవితా వైచిత్రి కుదాహరణ ముగాఁ గొద్ది సందర్భము లేరి చూపింతును :

1. చతుర్విధకందము :- నీలాచలవిలాసము లోనిది—

నందాత్మజాత, సుజనా
నందా, ఖగరాజగమన, నతదేవగణా
కుందాభరదన, వరద, ము
కుందా, అగణిత చరిత్ర, గురుతర సుగుణా!

కందము యొక్క చాతుర్విధ్యములో నిది యొక తెఱఁగు. కడమ మూఁడు భంగులను లాక్షణిక సంప్రదాయము ప్రకారము* ప్రస్తరించి చూపుదును :

గర్భద్వితీయ కందము :

ఖగరాజ గమన నతదే
వగణా కుందాభరదన వరద ముకుందా
అగణిత చరిత్ర గురుతర
సుగుణా నందాత్మజాత సుజనా నందా !

గర్భతృతీయ కందము :

కుందాభరదన వరద ము
కుందా అగణిత చరిత్ర గురుతర సుగుణా
నందాత్మజాత సుజనా
నందా ఖగరాజ గమన నతదేవ గణా !

గర్భచతుర్థ కందము :

అగణిత చరిత్ర గురుతర
సుగుణా నందాత్మజాత సుజనానందా
ఖగరాజగమన నతదే
వగణా కుందాభరదన వరద ముకుందా !

2. కందగీత గర్భిత చంపకమాల : పురాణం పిచ్చయగారి మైరావణ నాటకము నుండి

సురముని సేవితా వరద సోమనిభానన పంకజాక్ష మం
దరధర శ్రీకరా వికటదానవ భంజన విక్రమార్క శ్రీ
హరికనకాంబరా ఫణిశయాన నరార్చిత పాద, పద్మ నా
భ రణ జయావహా సుజన పాలన శౌరి యశోవిశాలకా !

---

* 'రెండవ చరణంబునకున్ । రెండవ గణమాదిగాఁగ నిర్మించినచో ।
దండిఁ జతుర్విధ కందము' — అప్పకవీయము IV. 412.

గర్భ కందము :

ముని సేవితా వరద సో
మనిభానన పంకజాక్ష మందర ధర శ్రీ
కనకాంబరా ఫణిశయా
న నరార్చిత పాద పద్మనాభ రణజయా !

గర్భగీతము :

వరద సోమ నిభానన పంకజాక్ష
వికట దానవ ఖండన విక్రమార్క
ఫణిశయాన నరార్చిత పాదపద్మ
సుజన పాలన శౌరి యశోవిశాల !

3. పదభ్రమకము : పై మైరావణ నాటకమునుండియే —

మారా నుతతను రామా
ధీరా సారథికలోక థిరసారాధీ
వీరా రతతర రావీ
దారా పారద సుఖీ సుదర పారాదా !

ఇందలి విశేషమే పాదమునకా పాదమున అనులోమ విలోమ గతుల రెంటను వర్ణక్రమ మొక్కటే యగుట.

4. రథబంధము :— అప్పకవీయమునఁ బదునొకండు బంధములు సోదాహరణముగాఁ జేర్పఁబడినవి. కాని యందు దీని ప్రసక్తిగానరాదు. ఇదియొక విశేషబంధము. ఇందుల కొక యుదాహరణము కొండూరి సీతారామకవి రచించిన (మట్టినగర) సావిత్రీ నాటకమునఁ గలదు. అది —

మ. పురభేదీ మది నీపదంబు లనిశంబున్ నమ్మియున్నాఁడఁ గిం
కరుపోల్కిం దగ నేలు సత్కరుణచేఁ గాదన్న మత్ప్రాలనం
బు రచన్నెమ్మిగఁ జేయువార లెవరో పుణ్యా భవాబ్ధాగ్ని భా
స్కరనేత్రా గిరిజా కళత్ర ప్రమథేశాద్రీశ్వరా శంకరా !

5. శైలబంధము :— ఇదియు అప్పకవీయమునఁ జేర్కొనఁబడని బంధ విశేషమే. దీనికిని బూర్వోక్త సావిత్రీనాటకము నందే యొక ఉదాహరణము గలదు. అది —

చ. సతత విలాస తత్వగుణసార సురాసుర మిత్ర జిష్ణుశం
స తత కృపాకటాక్ష శుకసన్మునిలక్ష్య స్మరారి భోగి హా
ర తపనచంద్ర భాస్కర వరాంబక దేవ నదీధరార్చిర
క్ష తరుణ నిత్యబుద్ధ సురసన్నుత గోపతివాహ శంకరా !

ఈ బంధములు రెండును బ్రసిద్ధములు గావు. వీని నెట్లు ప్రస్తరించవలయునో నాకుఁ దెలియదు. అభిజ్ఞుల పరిశీలనార్థ ముదాహరించితిని. నా యెఱిగి నంతలో రథబంధమునకు మాత్ర 'మొక లక్ష్యాంతరము గణపవరపు వేంకటకవి ప్రబంధరాజ వేంకటేశ్వరవిజయ విలాసమునఁ గలదు. శైలబంధము పేరే నా కశ్రుత పూర్వము.)

## 5. వచనము లేక గద్య

యక్షగానములందు వచనము సంధిప్రయోజనాత్మకముగను, పాత్రల సంభాషణములందును, వర్ణన సందర్భములందును గూడఁ బ్రయుక్తమైనది. కొన్ని య. గా. గ్రంథాంతములందు కవి గద్యలు గలవు. తంజావూరు యక్షగానము లందుఁ గొన్నిట గ్రంథాంతగద్య కవి విషయికము, కృతిపతి శుభాశంసన పురస్సరమునై "భరతవాక్య" మనుపేర నున్నది.

యక్షగానములందుఁ బ్రయుక్తములైన గద్య ప్రభేదము లలో విశిష్టములైన వాని నీక్రిందివిధముగఁ బరిగణింప నగును.

1. చూర్ణిక :- చూర్ణమను దానినొక గద్య ప్రభేదముగా వామనాది సంస్కృతాలంకారికులు పరిగణించిరి. "అనావిద్ధ లలిత పదం చూర్ణ" మ్మని యతని కావ్యాలంకార సూత్ర వృత్తి. సంగీత రత్నాకర మందు గద్య మొక ప్రబంధముగాఁ బరిగణింపబడినది. అందు "గద్యం నిగద్యతే ఛంధో హీనం పదకదంబక" మ్మనియు,

"చూర్ణం శాంతే రసే వీతం గాతవ్యం బ్రహ్మదైవతమ్
వైదర్భి రీతి సంపన్నం సాత్త్వతీం వృత్తి మాశ్రితమ్"

అని చెప్పఁ బడినది. (IV.—185 — 186). ఈ చూర్ణ శబ్దము యొక్క రూపాంతరమే చూర్ణిక. అనేక యక్షగానము లందు చూర్ణికకుఁ బ్రసక్తి గలదు కాని యించు మించన్నిట నది సంస్కృత కేవలముగ నున్నది.

ఉదా :— రంగాజమ్మ మన్నారు దాస విలాసనాటకము నుండి :

" అయంకిల సకల మహీపాల మకుటోప లాలిత చరణ కమల
యుగళో వీప్సేవ విశ్వంభరస్య .... .. ....
విజయ సారథి భాగధేయో విజయ రాఘవ నామధేయో
రాజాఽయ మధివసతి రాజధానీమ్. "

ఇది స్తోత్ర ప్రాయముగ నున్నది. సంస్కృత విభక్త్యంతముగఁ గూడ నున్నది. ఇంకను విశేషము విజయ రాఘవుఁడు తన విప్రనారాయణ చరిత్రమునఁ జూర్ణికలోఁ బాత్రల ముఖాముఖి సంభాషణమును బ్రవేశ పెట్టినాఁడు.

ఉదా :-

విప్ర :— హే తరుణి కిమే తదత్రాగమనం ? కిమా వాసస్థానం ?
కిం భవదీయం నామధేయం ? .... తావకీనం కథయ
వృత్తాంత మఖిలమ్,

దేవదేవిః :- ఆకర్ణయ మౌని జనవరేణ్య............ "

(ఇట్లే మన్నారు దాస విలాసనాటకాదులందు వివాహ సంకల్పాదిక సందర్భములందును సంస్కృతవచనములు ప్రయుక్తములైనవి. తంజావూరు య. గా. నాటకములలోఁ దమిళ కర్ణాట మహారాష్ట్ర భాషలందును బాత్ర ప్రసంగ వచనములుగలవు)

2. కైవారము :- తంజావూరు విజయరాఘవాస్థాన యక్షగానములలోఁ దఱచుగా నిది నాందీప్రాయమైన గ్రంథప్రారంభ పద్యమైనంతనే రూపక ప్రరోచన సూచనగాఁ బ్రయుక్తమగును. ఇది ప్రాయికముగా సంస్కృత సమాసప్రచురము, సంబుద్ధ్యంతమునై, రెండేసి సంబుద్ధుల కంత్యప్రాసము గలిగిన యొక స్తోత్రపాఠ ప్రాయమైనరచన.

ఉదా :- విజయ రాఘవ కల్యాణము నుండి :—

> "పరాకు స్వామి, శ్రీరాజ గోపాల సేవా ధురీణ,
> సీమంతినీ మోహన పంచ బాణ, .... విజయ రాఘవ
> మహీపాల, విజయ లక్ష్మీ విశాల, పరాకు, దత్తావధానుం
> డవై చిత్తగింపుము."

సంగీత రత్నాకరమున గద్యప్రబంధము వెంట "కైవాడ" మొక ప్రబంధముగాఁ బేర్కొనఁబడినది. (4-200) అందిది ధ్రువోద్గ్రాహములు గలదిగాఁ జెప్పఁబడినది. శ్రీనాథుఁడు భీమఖండమున గంధర్వులు "కైవార పదానుసార కమనీయముగా ప్రావేశికధ్రువాగానావళులం బరిఢవించి" రని చెప్పియున్నాఁడు. అసలిది రాజుల నుద్దేశించి వందిమాగధులు పఠించు రాజవంశ బిరుద ప్రశంసాత్మకమైన గద్యవిశేషముగాఁ బ్రసిద్ధము.

3. విన్నపము :— ఇదియొక గద్య ప్రభేదముగాఁ బ్రసిద్ధులైన తాళ్ళపాక కవులకాలము నుండియుఁ బరిగణింపఁబడుచు వచ్చుచున్నది. (చూ. తా. పెద తిరుమలయ్య వైరాగ్య వచన మాలికా గీతములు) ఆద్యంతము లందు సంబుద్ధులతో నడుమ నొక భక్తుఁడు భగవంతుని గూర్చికాని భృత్యుఁడు స్వామి గుఱించికాని చేయు విన్నపము విషయముగా నొక విధమైన యొడుపుతో, తూగుతో నడచు నట్టిది. విజయ రాఘవుని యక్షగానములలో దీని కెక్కువ ప్రసక్తి కలదు. .

ఉదా :— అతని కాళీయ మర్దనము నుండి :—

> "రుక్మిణీ ప్రాణ వల్లభా" ద్రౌపద్యభిమాన రక్షక,
> .... .... .... నీదయ మా యందుంచి మమ్ము రక్షింపవే
> సహజ గుణ సంపన్న సంపంగి మన్న "

4, ముచ్చట — ఇదియు నొక విధమగు తూగు గల గద్య శేషము. 19–20 శతాబ్దుల నాఁటి యనేక యక్షగానము లందుఁ బ్రయుక్తమైనది. ఇది ప్రాయికముగాఁ బాత్రముఖమునఁ బ్రవర్తితమై "దేవా మహానుభావా" ఇత్యాదిగా సంబుద్ధ్యంతమై అంత్య ప్రాస విశిష్టమై యుండును. గుడిపాటి రామదాసకవి కాళిందీవిలాసాదు లందలి ముచ్చటలు శబ్దాలంకార ప్రచురములు.

5. కొరవంజిగద్దె :– ఎఱుకత చెప్పు సోదెనే గద్దెయనియు నందురు. అనఁగా నది సోదె చెప్పునపుడొక కూనరాగపు టొడుపు తోఁ జదువు గద్యయే.

ఉదా :- మన్నారు దాస విలాస నాటకము నుండి:

"యెరుఖాదు గెరు ఖాదు గెరు ఖాదుగె దుండి,
నీవు తలంశిన తలంపు నీవు తలంశిన తలంపు
నిజముగా సెప్పేనే నిజముగా సెప్పేనే
.... . ....
అమ్మాయమ్మ అమ్మా యమ్మ శెయిసూపు శెయిసూపు
శెయిసూపవే దుండి, దనము గల శెయ్యే,
దానము గల శెయ్యే, బంగారు శెయ్యే, బాగ్గెముల
శెయ్యే దుండి ... .... కండ్లంటే తోడు, కడుపంటె
కొడుకు, కంటంటే మగండు వొండె రెండే వొండు."

6. ప్రాసవచనము :– నెడాదూరు వేంకటాచార్యకవి రచించిన సమగ్ర రామనాటకము సగము గ్రంథమీ ప్రాసవచనముల తోనే నడచినది. ఈ వచనమునందు పాదనియతియుఁ బ్రాసనియతియుఁ గన్పట్టుచున్నవి. చరణములు గణబద్ధములుగావు. కాని మాత్రల పరిమితి సుమారులో సరిపోవుచుండును. మాత్రలు ఒక్కొక చరణ మున 30 నుండి 40 వఱకు నుండవచ్చును. ఒక్కొక చరణము రమా

రమి నడిమికి రెండు దళములుగా విరుగును. అట యతి పాటింపఁబడును. అంత్యప్రాస నియమములేదు. పౌరాణిక పాఠధోరణికి సన్నిహితముగా నున్నది దీని వరుస.

ఉదా:—

శ్రీవాసున్ శ్రీకరుని నిర్జరాది — సేవ్యుని సదానందుఁడైన వాని
శ్రీవారిజాసనుని గన్నవాని — శ్రితజన యశస్కరుని వాసుదేవున్
శ్రీవాసవానుజుని మునులకెల్లఁ — జింతిత మనోరథము లొసఁగువాని
శ్రీవారిజేక్షణుని వెంకటాద్రి — శేఖరుని గొల్చెదను క్షేమమంద॥

(ఇఁక భామ కలాపము మొదలగు వానియందు ముచ్చటల వలెనే పాత్రముఖతః ప్రవర్తితములైన వచనములు కొన్ని 'కందువ' లను పేరఁ గానవచ్చుచున్నవి. అయితే ఆపేరు విషయ పురస్కృతమైనదే కాని యొక విశిష్టప్రక్రియ గాదు. ముచ్చట, విన్నపము మొదలగు నామములును విషయ పురస్కృతములే యైనను అంగలి రచనలో నొక యొదుపు, నొక తూఁగును గలవు.)

---

## 6. ప ద ము

భరతుని నాట్యశాస్త్రమున పద లక్షణమిట్లు నిర్వచింపఁబడినది. (32.25-27) :—

" గాంధర్వం యన్మ యా ప్రోక్తం స్వర తాళ పదాత్మకమ్
పదం తస్య భవేద్వస్తు స్వరతాళాను భావకమ్
యత్కించి దక్షర కృతం తత్సర్వం పద సంజ్ఞితమ్
నిబద్ధం చానిబద్ధంచ తత్పదం ద్వివిధం స్మృతమ్
అతాళంచ సతాళంచ ద్వి ప్రకారంచ తద్భవేత్
సతాళంచ ధ్రువార్థేషు నిబద్ధం తచ్చ వై స్మృతమ్. "

మన యక్షగాన పదము లిందుఁ బేర్కొనఁబడిన లక్షణముల కించు మించులో లక్ష్య భూతములు కాఁగలవు. పాల్కురికి సోమనాథుఁడు పండితారాధ్య చరిత్రమున సమకాలిక పదవిశేషములను గొన్నిటిని బరిగణించినాఁడు. అవి తుమ్మెద పదములు, ప్రభాతపదములు (మేలుకొలుపు పాటలు కావచ్చును.), శంకర పదములు, వెన్నెల పదములు మొదలగునవి ఇందుకొన్ని యిపు డుత్పన్నప్రాయము లైనవి. కొన్నిటి స్వరూపమును మాత్రము యక్షగానము సంరక్షించుచు వచ్చినది. సోమనాథుఁడు పేర్కొనని పదములును గొన్ని మన యక్షగానములందుఁ గలవు. అందు ముఖ్యములు గొన్ని యిట నుదాహరింపఁ బడును.

1. తు మ్మె ద ప ద ము :—ఇందులకుఁ బ్రాచీనలక్ష్యములు యక్షగానములలో నేకాక వ్యస్తముగను నిపు డుపలబ్ధములగుచున్నవి. (చూ. తిరుపతి వేంకటేశ్వర ప్రాచ్యగ్రంథ ప్రచురణ నం. 11-తాళ్ల పాకము

కృతులు 4 వ సంపుటము. అన్నమాచార్యుల శృంగార సంకీర్తనలు 9 వది, 32 వది. ఏగింటి వచనాలలోను తు. ప., లు గలవు.

యక్షగానముల నుండి యొక యుదాహరణము :—

" చెట్టు పెట్టి పాయె తుమ్మెదా
చెట్టు పూలు కాయ కాచె తుమ్మెదా
కాచె వారు లేరు తుమ్మెదా
నన్ను కాకు కాయకల నెల్ల తుమ్మెదా ...
ఇంటి లోని పోరు తుమ్మెదా
నను యిలు వెళ్ళ నీరు తుమ్మెదా , "

— రుక్మాంగదము (ప్రా. లి. పు. భా. ఆర్. సం. 205.)

తుమ్మెద పదములలోఁ బ్రాయికముగాఁ బ్రియవ్యపదేశము, శృంగార రస స్ఫూర్తియు నుండును. (కవితాజగత్తున భృంగాపదేశ విషయము ప్రసిద్ధముగదా. చూ. భాగవతము దశమస్కంధము — భ్రమర గీతలు)

2. వెన్నెలపదము :- ఉదా :— నివర్తి శేషాచలపతి శాహ రాజ విలాసము నుండి :

" బాల మేలు మే లీ వేళ
బాళి చాల మేలు దూలె వెన్నెలారో
కొప్పున నున్న పూవులు
గుప్పునను రాలె నేమె వెన్నెలారో
కప్పురపు సురటితో
నిప్పులు రాలినట్లయ్యెనే వెన్నెలారో "

ఇది ప్రాయికముగా నాయిక విరహావస్థను సూచించునది.

3. చందమామపదము :— తాళ్ళపాకము వారి "సంకీర్తన లక్షణము" న దీని లక్షణ మిట్లు గలదు (పద్య 64) :—

" దుస్తర విప్రలంభమున దూతిక తోడ మొఱంగి చంద్రవి
న్యస్త భర స్వభావమున నాయకుఁ డేనియుఁ గాంతయేనియున్
విస్తర పాద పాదముల వేడుకఁ జందురుఁ బేరుకొన్నచో
బ్రస్తుతి కెక్కెఁ దత్పదము భాసురమై ద్విచతుష్పదా కృతిన్ "

ఇందులక్షుఁ దగిన లక్ష్యము – లక్షణా కల్యాణమునుండి (ఆం. ప. మం. ప్రతి – నంబరు, కవి పేరునులేవు) :

చందమామ పదం — ఏకతాళం

వందనాము సేతు నీకు చందమామా మాతో
మందె మేలముతో రాకు చందమామా
ఇందుముఖుల నేచకూ చందమామా వట్టి
నిందలకు లోనుగాకు చందమామా ! మొ॥

4. నివాళి పదము:– ఇది ద్విపద వికారమైన రచనయే.

ఉదా :– (1.) గురు సిద్ధలింగము శ్రీగిరి కురవంజి నుండి :–

'' నివ్వాళి శశిధరా నిర్మల గాత్ర
నివ్వాళి శుభనేత్ర నీకు నివ్వాళి ''

(2.) వె. పెద్దామాత్యుని భద్రకాళీ కల్యాణము నుండి :–

" జలజ సౌరభ గాత్ర సరస కైలాస
నిలయ శ్రీ వీరేశ నీకు నివ్వాళి ''

5. సమపదము :– ఉదా :– తిరుమలకవి చిత్రకూట మాహాత్మ్యము నుండి :–

సైంధవి రాగము

" చెన్నలరు పూవు దోటల నను వొందు
చిత్రకూట మహాటవి యందు

తిన్నదమున గౌరి తా నవతరించి
నెలకొన్నది గరిమ గన్నది ''

కడమ పాదములునిట్లే సమతగలిగి యంత్యప్రాసవిశిష్టములై యున్నవి.

6. చౌ ప ద ము :– (చతుష్పద * చతుః – పద – చవుపద= చౌపదము).

ఉదా :- బలభద్ర దాసి కపోత వాక్యమునుండి :–

'' అడవిలో రఘురాము సతి నీ వపహరించీ తెచ్చితి
ఒడలితో నిన్నుంత నియ్యడు ఒప్పగించవె దేవిని. ''

ఇందలి త్రిపుట గతి గమనింపఁ దగును. (ఇది ఛందో దర్పణము అప్పకవీయము మొదలగు మన లక్షణ గ్రంథము లందలి చౌపద, వితాళ చౌపద, కర్ణాట చతుష్పదల లక్షణములకు సరిపడలేదు. సంగీతరత్నాకరమున చతుష్పదీ ప్రబంధ లక్షణము గలదు - IV.270-271).

7. జా ళ ప ద ము :- ఉదా:– కపోత వాక్యము నుండి :–

" గజరాజవరద ఓ భుజగేంద్ర శయన
గజముఖాశ్రిత శేష త్రిజగ వందితుద ''

ఇది అప్పకవీయము నందలి కర్ణాట చతుష్పద లక్షణమునకు( 'పంచ లఘు గణంబులు మూఁడు రవియు ......ప్రాసంబు దాఁక రెంటి పయి నగు విశ్రమమున ''.........అ. క. 4-286) సరిపోయినది. ఇందు ప్రాస యతి విశేషము. ఇందును ద్విపద సామ్యము గమనింప దగును.

8. సారంగపదము :-లింగమూర్తికవి శివపారిజాతమునుండి:-

" గంగాధరా సత్కృపాపాంగా జితకంధిత
రంగా (?) ఉత్తరేశ్వర లింగా
అంగజ భస్మీకృతాంగ – హస్తధృత సారంగ
దాక్షాయణి కామాంగ భూలతాంగ (?)
సంగర విజిత మతంగ భాసురోత్తుంగ
చర్మకలితాంగ శివశివ గంగాధర ॥

('సారంగ' పేరనొక సంగీత రాగవిశేషమునుగలదు)

9. షట్పది :- ఇది కర్ణాట వాఙ్మయమున మిక్కిలి ప్రచారము నందినది. మనయక్షగానము లందతి విరళము దీని ప్రయోగము. * కన్నడ దేశమునకు సన్నిహితముగా నున్న హిందూపురమందుండిన బాగేపల్లి అనంత రామాచార్యులవారి కృతులందు మాత్రమెక్కువగా నుపయుక్తమైనది.

ఉదా :- వారి సావిత్రీ చరిత్రము నుండి :-

" అశ్వపతి యని తొల్లి మద్రమహీశ్వరుఁడు తనరారు నిస్తుల
శాశ్వతైశ్వర్యాదులను హరిదశ్వ తేజుండు (1)
నశ్వరము గానీక వంశ మవశ్యముగ సంతతిన్ బడయన్
నిశ్చయము గావించె దృఢముగ విశ్వ విదితుండు " (2)

---

*కన్నడ యక్షగానములందు దీనికి ప్రాచుర్య మెక్కువ; ద్విపదకుఁదక్కువ. మనకుఁ గేవల ద్విపద కావ్యము లున్నట్టే వారికిఁ షట్పదీకేవలములగు కావ్యములు గలవు.

ఇది మన తెనుఁగు షట్పది లక్షణమునకు సరిపడలేదు.* ఇందు స_ప్త మాత్రాకములైన దళము లేడు విరుగుచున్నవి. మీఁద నొక లఘువు. రెండేసి దళముల పైఁ బ్రాసయతి గు_ర్తింపనగును. ఇది కన్నడ భామినిషట్పది, హరిణగతి రగడ, త్రిపుట తాళముల గతులకు సన్నిహితముగా నున్నది. (సంగీత రత్నాకరమున షట్పదీ ప్రబంధ లక్షణము గలదు. IV.272 - 273).

10. పాళిపదం :- ఉదా :- ఎంబారయ్య కొరవంజి నుండి :-

" మనసున మనవాళ్ళ మౌనమున దలచవె
ఎనయ గురుడు నీ కిపుడు వచ్చెనె "

ఇందు మొదటి పాదమున 9 మాత్రల దళములు రెండు. రెండవ పాదమున 8 మాత్రల దళములు రెండు.

11. గొబ్బిపదము :- గొబ్బి గోపి శబ్ద భవ మనియు గొబ్బి నృత్యము గోపికల రాసక్రీడ వంటి దనియుఁ గొందఱు పండితుల తలంపు. అది ఉ_త్తర హిందూ దేశమున రాజస్థానాది ప్రదేశములలోఁ బ్రచారమున నున్న గర్భనృత్యము వంటిదనియు గర్భశబ్దభవమే గొబ్బి యనియుఁ గొందఱి తలంపు. ఆ రెండిట నే దైనను నది స్త్రీ ప్రాయ మైన మండలాకార నృత్యమే. తదనుకూలమైన గీత ప్రబంధ విశేషమే గొబ్బి పదము. ఈ గొబ్బి పదములు క్రీ. శ. 15 శ. నాఁటికే ఆంధ్ర దేశమునఁ బ్రచారమున నుండిన వనుటకు తాళ్లపాక అన్నమా

* చూ. కావ్యాలంకార చూడామణి VIII 58.
ఛందోదర్పణము III. 46, లక్షణసారసంగ్రహము II. 124; అప్పకవీయము IV. 289. (ప్రాసతో మూఁడేసి విఱుపులుగల పాదములు రెండు పాదమునకు 6 ఇంద్రగణములు, 1 చంద్రగణము)

చార్యులు రచించిన గొబ్బి పదమే తార్కాణ. (చూ. తిరుపతి దేవస్థాన ప్రచురణ - తాళ్లపాక వారి కృతులు నం. 3 - పుట 327) యక్షగానము లందును దీనికి దగు ప్రసక్తి గలదు.

(ఇది గొబ్బిపాట యనియు వ్యవహృతమైనది)

ఉదా :- కుప్పనార్యుని పార్థసారథి విజయము నుండి :—

శ్రీగోపాల' శ్రీ రంజిల్లగ నిన్ను
  కోరి కొల్చు వారము శ్రీ గోపాలా,
శ్రీ గోపాలా, యీ రీతి చలము జేసిన
  నింక నోర్వ నేరము శ్రీ గోపాలా'

అన్నిట నీ పద మిదే తీరునలేదు.

12, ఏలపదము :- యక్షగానము లందిది విశేషము ప్రసక్తము. కుంచి పరపతిగల పదము. ఇది యాలపదమనియు నేలపాట యనియుఁ బేర్కొనఁబడినది.* బృహద్దేశి, సంగీత సమయ సారము, సంగీత రత్నాకరము, సంగీతదర్పణము మొదలగు వానిలో నిది శుద్ధ సూడజాతికిఁ జెందిన అష్టవిధ ప్రబంధములందు నొకటి యనియు, నది చతుర్విధ మనియుఁ జెప్పబడినది. కేదారభట్టు వృత్తరత్నాకరమునఁ దృతీయాధ్యాయమున సమవృత్తప్రకరణమున అతి శక్వరీచ్ఛందమున ఏల యొకవృత్తముగాఁ బరిగణింపఁబడినది. అందు "సజనానయా శరదశక విరతిరేలా" యని దీని లక్షణము. ఆ యేల సంగతమోకాని గీత ప్రబంధమైన ఏలయే ప్రసిద్ధమైనది. కన్నడ లాక్షణికుఁడగు నాగ

* ఏల హేలా శబ్ద భవమని కొందఱు పండితుల తలంపు. ఇది హేలగానెట్లు వలసిన నట్లు రాగ తాళములు సాగదీయుచుఁ బాడుకొనుటకనువైనది. గొల్లకలాపము లందలి సుంకరి కొండని ఏల లిట్టివే. అవి గొల్ల గోవాళ్ళ హేలా రసికత్వమునకు గుర్తులు.

వర్మ "ఏళై" ను కర్ణాట జాతిగాఁ బరిగణించినాఁడు. ఆంధ్ర వాఙ్మయమునను ఏలా ప్రశంస చాలకాలము నుండియుఁ దఱచుగనే వినఁబడుచున్నది. పాల్కురికి సోమనాథుఁడు బసవపురాణము నేలలుపెట్టిపాడు దురని చెప్పినాఁడు. కావ్యాలంకార చూడామణి, వేంకటనాథుని పంచతంత్రము, మల్లన రాజశేఖర చరిత్రము, పాంచాలీ పరిణయము, వసుచరిత్రము, ప్రభావతీ ప్రద్యుమ్నము మొదలగు ననేక ప్రాచీనాంధ్ర గ్రంథములందేలా ప్రశంసగలదు. తాళ్ళపాకవారి సంకీర్తన లక్షణమున ఏలా లక్షణ నిర్వచన ప్రయత్నము కొంతజరిగినది.

> "నాయకాహ్వాన పూర్వమై నయము గలిగి
> మ్లేచ్ఛ పరిభాషఁ దగి రాగ మిళిత మైన
> యేల పాట పదంబు నా నిలఁ జెలంగు
> మహిత నాయక సంబుద్ధి మధ్యమగుచు"
> (65 వ పద్యము)

ప్రభావతీ ప్రద్యుమ్నమున "నానా తాళములు యథోక్త వ్యాప్తిఁ బరగు నేలాది ప్రబంధ చయము" అని చెప్పఁ బడినది. మఱియు నందది మార్గరూపకమునఁ బ్రయోగింపఁబడినట్లు చెప్పఁబడుట విశేషము. (చూ. ప్ర. ప్ర. ఆ 4. 97 - 103). సంస్కృత సంగీత లక్షణ గ్రంథము లందు ఏలా లక్షణ మత్యంత విపులముగాఁ జెప్పఁబడియుండుటచే గ్రంథవిస్తర భీతి నది యిట నుటంకింపఁ బడుటలేదు. *అపర్యాప్తమైనను తాళ్ళపాకవారి లక్షణము నుబట్టి య. గా. ఏలకు సరిపోవును. (య. గా. ఏలలు - అధిక భాగము నాయక సంబుద్ధి మధ్యములే కాని యొక్కొకచో సంబుద్ధిరహితములును లేక

---

* ఆకర సూచనలు :- (1) సంగీత సమయసారము 4. 130-135; (2) సం. రత్నాకరము 4 33-132. (3) సం. దర్పణము - ప్రబంధాధ్యాయము శ్లో. 379 - 393.

పోలేదు. బసవ పురాణము నేలలు పెట్టి పాడుదురని సోమనచెప్పినాఁడనఁగా నట ఏలలనఁగా ఏ శివపరములైన సంబుద్ధులో యైయుండు నని తోఁచును).

ఉదా :- రుద్రకవి సుగ్రీవ విజయము నుండి :-

" భాను వంశా మూన బుట్టి
దానవా కా మీని గొట్టి
పూని మఖము నిర్వహింపావా ఓరామచంద్ర
మౌని వరులు సన్నుతింపాగా '

ఏల పాటలోనిది యంతయు నొక్క సమగ్రమైన దళము. కడమ దళములు నిట్లే యుండును. ఇందు త్రిపుట తాళగతి గోచరించుచున్నది.

2. పాపరాజు విష్ణుమాయావిలాసము నుండి :-

"మల్లె విరుల జోడు తొడిగి
నల్లా చెఱకు విల్లుబట్టి
మొల్ల తూపు లుల్లా సిల్లాగ ఓ పంచ బాణ
చెల్లా ఘనుల నెల్లా నే చేవూ ''

ఇందు సంగీతపు సాగదీత లేనిచో హయ ప్రచార రగడ గతి గల దన వచ్చును. కాని యసలు సామాన్య గీత ప్రబంధముల మాత్రా కాలము నిశ్చయించుటయే కష్టము, అందును హేలగా నాయా సందర్భములకుఁ దగిన యొడుపుతోఁ బాడఁ బడు ఏలల మాత్రాకాలము నిశ్చయించుట చాల కష్టము. ఒక్కొకచో ఏలలకుఁ దాళములును జేర్కొనఁ బడినవి. అందు అటతాళమునకుఁ బ్రాచుర్యము. (చూ. గుడిపాటి రామదాసకవి కాళిందీ విలాసము).

# అ ను బం ధ ము

# 2

## తంజావూరు పద వాఙ్మయము

### వి జ య రా ఘ వా స్థా న ము

ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో దక్షిణాంధ్రయుగము, తచ్చరిత్రలో తంజావు రాంధ్రనాయక రాజ పరిపాలనకాలము మహోజ్జ్వల ఘట్టములు గదా! ఆ నాయకరాజులలో గీతి సాహితీప్రియుఁడు, జాతివార్తా చమత్కార చతురుఁడు, రసిక శేఖరుడైన రాజకవియు నగు రఘునాథుని పుత్రుడు విజయ రాఘవుని రాజ్యకాలము (క్రీ. శ. 1633 - 1673) రసిక భోజ్యమగు సాహిత్య సంతర్పణములకు కల్యాణవేళ. అతని ఆస్థానము పదకవితకు పట్టుకొమ్మ. యక్షగానమున కాటపట్టు. అది ఆంధ్రపద కవితా తీర్థంకరుడగు క్షేత్రయార్యుని గాత్రమునుండి గంధర్వలోక మవతరించిన చోటు. క్షేత్రయార్యునవతారముతో మన పద వాఙ్మయచరిత్రలో నవ్యయుగోదయ మైనది. ఆనాడు పదమన్న గ్రామసీమల పామర గాత్ర మాత్రోప జీవియగు ఏదోవట్టిగాలి పోక పాటకాదు. పండితోపజ్ఞమై, రసభావ నిర్భరమై ఆలంకారిక మర్యాదా సనాథమైన కవిత్వస్థాయి స్వాయత్తమై, రాచవారి కొలువుకూటముల ఆటవెలదుల అభినయోపయోగియై పరిఢవిల్లినది. క్షేత్రయ అనేక రాజాస్థానములందు సన్మానము లందుచు విజయరాఘవు నాస్థానమునకును విచ్చేసినాడు. ఆ ప్రభు నామాంకిత ముద్రలతో రసగుంఫితము

లగు మధుర పదము లనేక మతనికి కానుక పెట్టినాడు.[1] రాజునకు తగిన నజరాణా! క్షేత్రయార్యుని పదకవితామార్గము రసికజన మనోరథ ఘంటాపథ మైనదని గ్రహించినాడు విజయరాఘవుడు. వెంటనే అట్టి పదకవితా రచన కాస్థాన కవులను ప్రోత్సహించినాడు. తానును గంటమెత్తి పదకవితావిద్యలో నొక మహోన్నత పట్టభద్రుడై నిలిచినాఁడు.

ఆనాటి యక్షగానములు రకరకముల పదముల కాకరము లైనవి. విజయ రాఘవాస్థానములో యక్షగానములును పదములవలె పాడబడుచుండెడివని అతని యాస్థానకవి చెంగల్వ కాళయ తన రాజగోపాల విలాసప్రబంధమున[2] సూచించినాడు. (I—24). విజయ రాఘవున కించుకముందునాటి పరమానందతీర్థ యతి తనముక్తికాంతా పరిణయమును[3] యక్షగాన ప్రాయరచనను "పదచాళిక" (పదకేళిక) యని పేర్కొని యుండుట చూడ యక్షగాన ప్రయోగమునకు పదాభి నయ సాదృశ్యమును గలదని తోచును. విజయరాఘవాదుల అభినయ ప్రయోజనాశయాత్మక మైన పద కవితాభిమానమే కొంతవట్టు తంజావూరున యక్షగాన ప్రతిష్ఠకాలంబన మైనది. యక్షగానములు పదములు నానాడు నగరి నాటకశాల నట్టువ మేళములచే రాజసభా రంగమున అభినయ ప్రదర్శనల కెక్కి రాణించినవి. నాడు విజయ రాఘవు నెదుట పదకేళిక పట్టని నట్టువపాప తంజావూర నరుదు.

---

1. చూ. 'క్షేత్రయ్యపదములు' అనుగ్రంథము, ఆంధ్ర గానకళాపరిషత్తు ప్రచురణ — రాజమండ్రి, 1950 విజయరాఘవముద్రాంకితములిందు పండ్రెండు పదము లుదాహరింప బడినవి

2. తంజావూరు సరస్వతీమహాలు ప్రచురణ, 1951

అతని యాస్థానమున పదకేళికలకు రూపవతి[4] యను నామెది పెట్టినపేరు. మరియు పలువిధములగు పదాభినయ పద్ధతులలో నొక్కొక్క పద్ధతి యందు ప్రత్యేక నైపుణికి ప్రసిద్ధి వహించిన నట్టువరాండ్రాయాస్థానమున నెందరో గలరు.[5] బహువిధ పదాభినయ ప్రతిష్ఠల నా కొలువు కూటమున కోటికి పడగెత్తినది విజయనగర సమ్రాడ్వీరవేంకటరాయ దత్త బిరుద విరాజిత 'విజయరాఘవ విలాస'[6] భవన రాజ విభ్రాజిత కీర్తిపతాక చంద్రరేఖ. నాడట గజ్జెకట్టినదో లేదో కాని గంటము పట్టి 'శృంగార రసతరంగిత పదకవిత్వ మహనీయ మతిస్ఫూర్తియై' 'విజయరాఘవ మహీపాల విరచిత కనకాభిషేక' యై విరాజిల్లినది రంగాజమ్మ[8]. విజయరాఘవు డుత్త పదకర్తయు, పదాభినయ వినోదియు మాత్రమే కాడా పదకవితా తదభినయ కళాప్రవీణలగు శృంగారవతులతో గాంధర్వ విధుల మధుర బాంధవ్యములు నిర్వహించినవాడు. అతని రసికత్వము అభినివేశము నట్టివి. ఆతనికి రాణివాసము వారి మీదకంటె ఈ నాగవాసము వారి మీదనే అనురాగము హెచ్చు. అట్లే అతనికి పద్యగద్యములపై కంటె పదకవితలు, యక్షగానముల పైనే వల్లమాలిన మోజు. విజయరాఘవ విలాసమున వెలసిన వాఙ్మయమున ముక్కాలు మువ్వీసము మధుర కవితాశాఖకు చెందినదే. నాడా విజయరాఘవ విలాసమున 'శారదాధ్వజ' మెగిరినది. 'సాహిత్యరాయ పెండారము' ఘల్లుమన్నది.'

4. 5 6. 7 — ఆయా విషయముల ప్రశంస రాజగోపాలవిలాసము, విజయరాఘవుని ద్విపద కావ్యము రఘునాథ నాయకాభ్యుదయము (తం॥స॥మ॥ ప్రచురణందు 1951) ల రెంటను గలదు.

8. రంగాజమ్మ మన్నారు దాస విలాసనాటకము – ఆంధ్రసాహి పరిష త్ప్రకాశితము, కాకినాడ, 1926

9. ఈరెండింటి ప్రశంసయు రాజగోపాల విలాసమునను, రంగాజమ్మ మన్నారుదాస విలాస ప్రబంధము (తం. స. మ. కే నం. 213–14) నందును గలదు.

విజయరాఘవుడు గోపికాగీతలు, భ్రమరగీతలు, రగడ, చౌపదములు, సాంగత్య పదములు ఏలలు విడిపదములు, దరువులు, సంకీర్తనములు అధ్యాత్మలు మొదలగు కేవల గేయప్రబంధములును-వాల్చిచి, గుజ్జరి, విల్వేడు, దండలాస్యము, కందుకక్రీడ, అల్లిక, కొరవంజి, శుభలీల, గుజరాతి దేశిచౌపదము, జక్కిణి, దురుపదము, మదన పదదూత్యము, జోగి పదచాళి, శారదాసామ్రాజ్యము, చిందు, సవతి మచ్చరము, నాట్యకదంబము మొదలగు నాట్యబంధముల కనుకూలములగు గీత ప్రభేద విశేషములును రచించి యుండినట్లతని ప్రహ్లాద చరిత్ర[10] యక్షగాన గ్రంథావతారికవలన దెలియుచున్నది. కాని అవి యెవ్వియు అతని యాస్థాన కవులు రచించిన పదములును విడిగా గానవచ్చుటలేదు. నేటికి వారి పదకవితాభిమానమునకు నిదానముగా నిలిచినవి వారి యక్షగాన రచనలే.

ఈ యక్షగానములలో ప్రహ్లాదచరిత్ర పట్టికలోనున్న పదప్రభేదములన్నియు లేవు. ఇందు ముఖ్యముగానున్నవి శృంగారపదములు, గొల్లపదాలు, చెంచుపదాలు, కొరవంజి దరువులు, సాంగత్యపదము, ఏలపదము మొ. లక్ష్మీకల్యాణము, ధవళశోభనములు, సువ్వాలలు మొ. ఆడంగుల వేడుకపాటలు. ముఖ్యములైన కతిపయ పదముల మచ్చులిట నుదాహరింపబడును.

## 1. శృంగారపదములు

విజయరాఘవుని నాఁట వీనికే ప్రాధాన్యము. ఆయక్షగానములలో వీనికే ప్రాచుర్యము. ముఖ్యముగా నీపదములు రెండుతరగతులు: ౧. పంతువగ పదములు – ప్రాయికముగా విప్రలబ్ధ యగు నాయిక

10. తం. స. మ. కే. నం. 541.

నాయకుని స్మరించుచు చెలికత్తెతో తన విరహాపుసాద వెళ్ళబోసికొనుట (భామకలాపమునందు మాధవితో సత్యవలె) యిందలి విషయమై యుండును. ప్రాయికముగా నిట్టి పదములు పంతువరాళి కాంభోజి మొదలగు రాగములలో నుండును. ఈ పంతువగ పదాలకు తగిన వంత వాద్యము నాగస్వరమని విజయరాఘవకల్యాణమున సూచింప బడినది. ఇట్టి పంతువగపదము లా యక్షగానము లన్నిట సమృద్ధిగ నున్నవి. ౨. పదకేళిక కుపయుక్తము లగునవి — నాయకు నెదుట నతని నుద్దేశించి అతనిప్రీతి నావాహన సేయుచు అభినయింప దగినవి. ఈపద కేళికల ప్రసక్తి ప్రహ్లాదచరిత్ర, రఘునాథాభ్యుదయము, విప్రనారాయణ చరిత్ర, విజయరాఘవ కల్యాణము, హేమాబ్జనాయికా స్వయంవరము లందుగలదు. ఈపద కేళికకు తొలిపలుకు గా హేమాబ్జ నాయికా స్వయంవరమున నొక కుసుమాంజలి శ్లోకము, విజయరాఘవకల్యాణమున నొక సల్లాము దరువును ఉదహరింపబడినవి.

విజయరాఘవుని నాఁటి యీ పంతువగ పదములకు, పదకేళిక లకు అసలా శృంగార పదసామర్థ్యమునకు క్షేత్రయ్యపదములే యొజ్జ బంతు లనవచ్చును. కాని యివి యన్నియు రాజపరములు. క్షేత్రయ పదములలో రాజపరములు కొన్నియున్నను అధికభాగము మధుర భక్తి ప్రచురములు. విజయరాఘవాదుల పదములలో ఆ మధురభక్తి ప్రతిపత్తి దిగజారిపోయి అందలి 'జావళి' శృంగార ప్రతిపత్తిమాత్రమే మిగిలినది.

## క్షేత్రయ పదము:

విజయ రాఘవాదుల పద కవితారచనకు క్షేత్రయ పదములే యొజ్జబంతు లనుటకు, పోలికలమాట యటుండ, విజయరాఘవుని

'పట్టంపుకవి' (Poet Laureate) యైన కామరసు వెంకటపతి సోమయాజి తన విజయరాఘవ చంద్రికావిహారమున, విజయరాఘవునిపై క్షేత్రయ చెప్పిన పదమొకటి[11] గ్రహించి యుంచుటయే ప్రబల తార్కాణము. అది :-

ఎఱుకల కాంబోది – ఆది

" సుదిన మాయెనే యీ ప్రొద్దు సుదిన మాయనే । యీ
మదనావతారుని సేవ మనకు గల్గెగా ॥
ప్రొద్దుట నిల్వు టద్దము పొడగన్న ఫలము । యితని
ముద్దుమోము సూడఁగల్గె ముద్దుల గుమ్మా ॥
ఈ ప్రొద్దు పూర్ణకుంభము లెదురైన ఫలము । యీ
భూపాలకుంజరుని నే బొడగంటినమ్మ ॥
ద్విజరాజుల సేవించిన దివ్యశకునము చేత
విజయరాఘవ శౌరిని వీధిలోగంటి ॥ "

కామరుసు పదము :

వెంకటపతి సోమయాజియు స్వతఃసిద్ధముగా చేవగల పదరచన చేయగలవాడు.

ఉదా : సందర్భము – విజయరాఘవుడు చంద్రికావిహారియై రాఁగా అతని జూచి మరులుగొన్న యొక అత్తింటి కోడలు చెలికత్తెతో నన్నది –

కాంబోది – రూపకము

" వేడుకైనను జూడఁగూడదు వింతవారిని నా
తోడికోడలు నన్ను తొంగి చూడనియ్యదు

11. ఆంధ్రగాన కళాపరిషత్తు వారిచే ప్రకటితమైన 'క్షేత్రయ్య పదములు' అను గ్రంథమున విజయరాఘవ ముద్రక్రింద 11 వ పదముగా నిది ప్రకటితమై యున్నది. దాని రాగతాళము లందు కాంభోజి-త్రిపుటలుగా నుదాహరింపబడియున్నవి.

పాడితప్పి మగడు మిగుల పగచాటును యీ
మేడమీదికి వచ్చెనంటె మెదలనియ్యడు ॥౧॥

వంచన జేసి యితని జూడవచ్చే నంటేను
పొంచియుండు మఱది యిరుగు పొరుగు పంచల
పంచశరుని మించిన యీ పట్టభద్రుని
నించుక సేపు చూడగూడ దేమిసేతును ॥౨॥

అత్తచేతపోరు మిగుల నధికమాయెను
కత్తిమీద సాము నాకు కదలరాదుగా
బత్తితో విజయరాఘవ పార్థివేంద్రుని నేడు
క్రొత్తగా జూచిన చూపు కోటి సేయదా ॥౩॥

## విజయరాఘవ పదము :

ఆంధ్ర పదకవులలో క్షేత్రయ్యను చెప్పి మరియొకరిని చెప్ప వలెను. కాని పదకవితా రచనలో అతనితో పోటీచేయగల 'తాహతు' గలవాడు విజయరాఘవుడు. అతని రఘునాథాభ్యుదయ విప్రనారాయణ చరిత్రములలో ననేక శృంగార పదములు గలవు. ఆ గ్రంథములు ముద్రితములు. అముద్రితమగు తంజాపురాన్న దాన నాటకము నందు తత్కర్త పురుషోత్తమ దీక్షితుడు తమ 'ఏలినవారు (విజయ రాఘవుడు) ఆనతిచ్చిన పదాలలో ఒక పదం' గ్రహించి యుండుటచే అది మాత్ర మిచట నుదాహరింప బడుచున్నది.

" అయిదు వరాలిచ్చితి అది యేమిరా యని యడిగితే
అయిదువరాలవు గావా యని అతివ చతురులు బలికేను ॥౧॥

మాట నేర్పులవాడు గదా మన్నారు దేవుడు
బోటిరో యేమని పొగడుదు నేను ॥౨॥

సరిపెన లిచ్చితివి యెంతసరసుడ వంటేను
సరిపెన లియ్యనా యని సకియ కందువ లాడెనే ॥౩॥

ఏలరా నన్నింత యేతురా యంటేను
ఏలరా నన్ననేది యింతి నీ నైజ మనెనె ॥౪॥

## రంగాజమ్మ పదము :

విమల గాంధర్వ విద్యే వెన్నతో బెట్టిన దీమెకు. ఆమె మన్నారు దాస విలాస నాటకము నుండి యొక పదము :

కాంభోజి – అట

" చెలువుగా నేడు నాకలలోన వచ్చిన
చెలువు డేడే చెలియ చెలువు డేడే ॥౧॥

ముద్దుపెట్టగ వాడు వద్దుపొమ్మంటినో
సుద్దుల దేలించి సొక్కింప నైతినో ॥౨॥

మొలకచన్నుల మీద నెలవంక లుంచితే
వలదు పొమ్మంటినో లేక వాదు సేసితినో ॥౩॥

నీవి యంటగ తాళు నిలువరా యంటినో
యీవగ దలచగ నౌను గాదంటినో ॥౪॥

## పురుషోత్తమ దీక్షితుని పదము :

పై నుదాహరించిన పదములన్నియు నించు మించు పంతువగ పదముల వంటివే. ఈక్రిందిది పద కేళిక (తంజాపురాన్నదాన నాటకమునుండి) –

ఘంటారవము – అది

పంతమేల రారా వింతదానఁ గారా
రంతు సేయ మేరా విజయరాఘవ మ్రొక్కెరా॥

దక్కితి దయ మీరనే, టొక్కితి విడెమీర నీ
పక్క బాయ లేరా నన్ను బాలిని చేకోరా॥

నిన్నె మదిని కోరియున్నారా ఓరోరి
కన్నుల విల్తుని బారి ఘన మాయె యీసారి॥
ఏరా నన్నుచాల ఏలరా యీవేళ, రతుల నేలరా యీవేళ
రారాపు సేయ మేరా విజయరాఘవ భూపాల॥

## 2. గొల్ల పదాలు

గొల్లజాతికి సాహిత్యవిద్యకు చుక్కెదురని యొక నానుడి గలదు గాని సంగీతవిద్యయెడ వారతి సుముఖులు. పిల్లనగ్రోవి గొల్ల జాతి గానకళా ప్రతిష్ఠ కొక ప్రాచీన చిహ్నము. సుద్దు గొల్లలు పద విద్యకు పద్దులు. కృష్ణలీలలు, కాటమరాజు కథానులాపములు వారి గుత్తపాటలు.[12] గొల్లకలాపములలోని సుంకరి కొండని ఏల పదాలు గొల్లగోవాళ్ళ హేలారసికత్వమునకు గుర్తులు.

ఆనాడు నాయకరాజుల నగరి మొగసాల కావలివారు గొల్లలు. వారి వాలకములు ప్రసంగములు చిత్రమైనవి. వాని కాకృష్టులై హాస్య చతురాస్యులగు నా యాస్థానకవులు కొందరు చాటుకావ్యములుగా పరిగణించి హావణించిన తమ యక్షగాన నాటకములందా గొల్లల వేషభాషలను జొప్పించిరి. రంగాజమ్మ కృతియందు గొల్లల హాస్య ప్రసంగములు గలవు గాని గొల్లపదము లొక్క విజయరాఘవుని పూతనాహరణము నందే కన్పట్టుచున్నవి. సందర్భము: నందగోపు నా దేశముపై గొల్లలు పూతనకళేబరము నీడ్చిపుచ్చుటకు వత్తురు. అప్పుడు వారి పదాల సందడి:—

౧. భూపాల — రూపకము

" ఓటి కిన్నెర మీటు కొంట గొల్లలారో — ఆ
యేటి సాయెనై నేటిమాపు గొల్లలారో॥

12. మా. హంసవింశతి II 87-89.

తందనాలు పాడుకొంటలు మనము రాగా — ఆ
మందలో నొక్క సద్దురేగె గొల్లలారో॥
నందయ్య పిలిచెనట గొల్లలారో — మన
మందరము బోదము రారో గొల్లలారో॥
బూసి సూసి కేకవేసి గొల్లలారో — వాడు
గోసి విడగ దూసె గదర గొల్లలారో॥

### ౨. సౌరాష్ట్ర — రూపము*

రెండు రెండు యిప్పగింజలే తుమ్మగిలో
రెండువేల మా యావుల మందలే తుమ్మగిలో

* * *

కుడుములు పిండికూర వెన్నెలాహే
కూకుండి తినగదే వెన్నెలాహే
నల్లేరు దురదంట వెన్నెలాహే
నమల వెరచునె మాగంగ వెన్నెలాహే

### 3. మ్రొక్కుబడి పదాలు

సాక బెట్టి నీకు మ్రొక్కేమేకవీర — మమ్ము
సాకి సంతరించవమ్మ ఏకవీర ॥పల్లవి॥

* * *

ఏట్లో పాఱెడి ఎఱ్ఱని గంగ
పాలలో నుండేటి పచ్చని గంగ
ఎట్లో మా యెఱ్ఱన్న యెచ్చరించంగ
పాఱెడి గంగ వచ్చి పవ్వళించంగ
చల్లని తల్లి మీకు జాతరలు సేసేమమ్మా
నల్లావుల పాలు పొంగళ్ళు పెట్టేమమ్మా
గొల్లల కెల్లను కొలము దేవరవై
యెల్లమ్మ యెల్లమ్మ యేలుకోవమ్మ॥

* * *

* ఇవి 'ఊళ' బెట్టి పాడిన పాటలట

అ (౨) కక్కలమ్మకు నేడు మొక్కు చెల్లింతాము
వక్కలాకులు వేగ వండరా (?) వోరి॥

* * *

మఱ్ఱిమాని కింద నున్న మాతంగి రావె
ఎఱ్ఱమ్మ చెరువు చేయించేనుగాని॥

చింతమాని కిందనున్న సివసత్తిరావె
సంతబైటనున్న ఓ సాంబవీ రావె॥

బత్తితో తిరువళిక యెత్తేను నీకు
బుత్తిముత్తు లియ్యవమ్మ పోలేరమ్మ॥

సత్తెము గల్గిన తల్లి సమకూర్పుమేలు
పత్తిచేని బైటనున్న ముత్తేలమ్మ నీవు॥

పళ్ళెందు నేతదీపము పెట్టేను నీకు
సిళ్ళాడె నమ్మ ఓకొల్లూరి గంగ॥

### ౮. 'రామాయణ బావుతాలు సదుచ్చుకొన్న' ప్రబుద్ధు డొకడు పాడిన పదం.

" నల్లని దేవర నామము సాతిన
బళ్ళారాయుడు బసవయ్య కొడుకు ॥౧॥

నారదమయ సుప్పనాతిని పెండ్లాడి
బారతకత సెప్పె భైరదేవరకు ॥౨॥

రంబకు పుట్టెను రాభణుం డనగాను
కుంభకర్ణుని పెద్దకొడుకు గాదటరా ॥౩॥

అతికాయు డంగదుం డల ధర్మరాజుతో
అతివకై పోరాడి రది వింతగాదా ॥౪॥

మనకు వరాలిచ్చే మైలారు దేవర
అనుమంతు దేవర కలుండు గాదా ॥౫॥

### ౫. సివమాడు గొల్లని పదం

" ఓంకారము । ఓకాటమరాజా
కరకరపొద్దు పొడిచి కారెండలుగాసి
బిరాన్న బీరెండ బిరుదు గొట్టంగ వన్నెలాహే.॥
తూర్పున మీ యావులు తుంగలు మేసి
పడమట మా యావులు పచ్చికలుమేసి వన్నెలాహే ॥

## 3. చెంచు పదాలు

కోనేటి దీక్షితచంద్రుని, విజయరాఘవకళ్యాణమున విజయరాఘవుని మృగయా విహారమై, చెంచులు కలుకుట్లు వండి కాట్రేని కారగింపుచేసి విందు వినోదములు జరుపుకొన్న సందర్భమునందలివి :—

### ౧. కాటమరాజు పదం. కాంబోది—ఆట.

కుంబములో పుట్టినట్టి । కుంభకర్ణుని కొడకవై
కుంబమాల్లా దింటివిగదరా । ఓ కాటమరాజ !
కూరనార వెతకవుగా ॥

అంబారి కసాగసాన । అంబుధి దాటువేళ
పంబలు వాయింపుచును । ఓ కాటమరాజ !
కంబళి నాచుకొంటివిగా ॥

సుప్పనాతి ముక్కుపోయి । నొప్పిచేత మూలుగంగా
ఇప్పపూల దండవేసి । ఓ కాటమరాజ !
అప్పుడే కూడితివి గదరా ॥

### ౨. కంబమురాయ పదం: మంగళకైశిక—ఆది.

' సరిగె పాళు కేలబూని । వెలుగుమీది తొండవలెను
ఎలుగురాజుమీద నెక్కి । ఓ కంబమురాయ !
జలదారి దాటితివౌరా ॥

మంచము నెత్తిబెట్టుక । కంచము వాయించుకొంట
మంచుకొండమీద నెక్కి । ఓ కంబమురాయ !
చెంచెలి కూర తెచ్చితివిగా ॥

### 3. పోలేరమ్మ పదం : ఘంటారవ—ఆది.

" బూరుగమాను గని । బూచియని వెరచుకొని
బొబ్బరింతువుగదమ్మ పోలేరమ్మ ॥

వాలుచన్ను లల్లాడంగా । నాలుక వెళ్ళబెట్టుక
ఊళ బెట్టుదువు గదమ్మ పోలేరమ్మ ॥

### ४. కూనలమ్మ పదం ; పున్నాగ—ఆది.

కుండనిండ కొండగోగు కూరవండి
కూకుండి తిందువమ్మ కూనలమ్మ ॥

కోతికూన చంకబెట్టి కోటయెక్కి
కొక్కరింతువు గదమ్మ కూనలమ్మ ॥

కూటికుండ దెఱచివేసి గునిసి యాడుచు
కుక్కల దోలుదువమ్మ కూనలమ్మ ॥

### ౫. ధరమరాజు పదాలు ; (అ) కాంబోది—ఆట.

' ఉడుముల బట్టితెచ్చి । వడుములకు త్రాడుగుచ్చి
కొడవలి చేతికిచ్చి । ఓ ధరమరాజ !
అడవులలో నాడితివిగా ॥

బొడ్డికూర సద్దిగొంచు మద్దెల నెత్తిబెట్టుక
మద్దిమాని మీదనెక్కి । ఓ ధరమరాజ !
ఎద్దులను మేపుదువుగా ॥

### (ఆ) ఘంటారవం—ఆది.

' ఉప్పులేని సలిదిగంజి ఓ ధర్మరాజా
ఊదుక తాగుదువయ్య ,,
ఉట్టిమీది కెగరబోయి ,,
కాలు వూనమాయెగద ,,

వొట్టిమాని మీదనున్న ఓ ధర్మరాజా
పూగి పూగి యాడుమయ్య ,,
పుల్లంకి పిట్టవలె ,,
పులికి కులికి యాడుమయ్య ,,
పూసరవెల్లివలె ,,
తల వూచి వూచి ,,

పైది పదములలో కాటమరాజు పదము, కంబమురాయ పదము, దరమరాజు పదము (అ)— ఈమూడును ఏలపదములని గుర్తింప నగును. (ఏల విషయము పూర్వోక్తము).

## 4. సాంగత్య పదము

విజయరాఘవుడు సాంగత్యపదములు రచించినట్లు తెలియు చున్నది గాని నేడు మన్నారు దేవుని హేమాబ్జనాయికా స్వయం వరమున మాత్రమే యొక్కటి కన్పట్టుచున్నది. ఇందలి చరణములు ప్రశ్నోత్తర పరంపరగా సాగినవి. (ఇదియొక కన్నడ పదచ్ఛందస్సు. కన్నడమున సాధారణముగ రూపకతాళమునఁ బాడఁబడును)

ఎఱుకల కాంభోజి – ఆట.

చెలువైన శ్రీవత్స చిహ్నంబు ఉరముపై
గలిగి రాణించు యీ ఘనుడెవ్వడె చెలియ ?

పొల మీను రూపముంబూని యా నలువకు
తొలుదొల్త లొసగిన దొర యీతడమ్మా ! ॥మొ॥

ఇవికాక విజయరాఘవాదుల యక్షగానములం దింకను ధవళ శోభనములు, సువ్వాలలు మొదలగు పాటలు తరచుగా గలవు గాని అవి ఆంధ్ర దేశ యక్షగానములందును ప్రచుర ప్రచారము గాంచినవే. వాని విషయమున తంజావూరి కవుల ప్రత్యేకత యేమియులేదు. విపుల ముగా చర్చించుట కిట నవకాశములేదు. కాని పై నుదాహరించిన పద

ములలోనే ఆ కవుల ప్రత్యేకత తేటపడగలదు. అట్టి పదము లాంధ్ర దేశయక్షగానములం దరుదు. ఆ కవులు శృంగార రస పిపాసువులును క్షేత్రయ మార్గానుయాయులు నయ్యు క్షేత్రయవలె శృంగార పద రచనామాత్ర సంతుష్టులుగాక పదరచనయొక్క బహుముఖ ప్రయోజకత్వమును బాగుగా గుర్తించినారు. ఆ గొల్లపదములు, చెంచుపదములు, కొరవంజి దరువులు నెంతో అపురూపమైనవి. రాజ కవియు నట్టి రచనలకు కోరి సమంజసమగు నొక సందర్భము గల్పించుకొని పూనియుండుట ప్రశంసనీయము, తంజావూరివాఙ్మయము తాత్కాలిక సామాన్య ప్రజాజీవనమునకు నద్దము పట్టిన దనుట కితర సందర్భములనేకముతో పాటివియు తార్కాణలు. ఇంకను పురవర్ణనాది సందర్భములకును పదము నుపయోగించిరి. రాను రాను పదము దరువునకును, గీత ప్రబంధ సామాన్యమునకును బర్యాయ వాచకమైనది.

క్షేత్రయ శృంగారపద కవితోద్యమము విజయ రాఘవాదులతో నాగిపోలేదు. నాయక రాజుల తరువాత తంజావూరు పరిపాలకులగు మహారాష్ట్రులకాలమునను కొనసాగినది. క్రీ. శ. 1684 - 1712 సం॥ ల నడుమ తంజావూరు నేలిన శహాజీ, అతని ఆస్థానకవియగు దర్భా గిరిరాజు ఆరితేరిన పదకవులు. వారి సమకాలికుడు, మధుర విజయరంగ చొక్కనాథుని మంత్రిపుంగవుఁడును, శశాంకవిజయ కృతి భర్తయు నగు వంగల సీనయామాత్యుఁడు ప్రసిద్ధపదకర్త. ఆంధ్రమున రసవత్పద యక్షగాన కర్తయగు మైసూరి కంఠీరవరాజునువారి సమకాలికుడే. వారి తరువాత శరభోజి, తుక్కోజి. చిట్టచివరి శివాజీ (క్రీ. శ. 1833 - 1855) వఱకు తంజావూరిలో తెలుగున పదకవితా రచన ధారాళముగా సాగినది. శివాజీ ఆస్థానమునందలి ఆంధ్ర పద

కవులలో ప్రసిద్ధుఁడు వరహప్పయ్య.[13] ఆ 'వరహప్పయ్యతోఁగూడి వడిరాగముల పాడీ వన్నెలలరుచుండు' వాఁడట శివాజీ.[14] ఆ గిరిరాజాదుల పదముల సంపుటములు కొన్ని తంజావూరు సరస్వతీ మహాలులో గలవు. ఆ మహారాష్ట్ర ప్రభువుల కాలమున నచట కొన్ని నీతిపదములును వెలసియుండుట విశేషము. అసలు పదకవితారచనలో క్షేత్రయ విజయరాఘవ తదాస్థానకవులకు మార్గదర్శకుఁడైనట్లే వారు శహాజీ గిరిరాజాదులకు మార్గదర్శకులైరి. కాని నేఁడు తంజావూరిలో వారివి కొలఁది యక్షగానములే గాని పదసంపుటములు కానరాకుండుట శోచనీయము.

---

13. చూ. శివాజీ అన్నపూర్ణాపరిణయము తం స. మ. కే. నం. 499
14. చూ. శివాజీ సీసములు. తం. స. మ. కే. నం. 811.

# అనుబంధము
# 3
## శహాజీ దరువులు

తంజావూరు మహారాష్ట్ర ప్రభువు శహాజీ యక్షగాన ప్రబంధము లందలి దరువులు మిక్కిలి అపురూపమైనవి. అందతని సంగీతసాహిత్య నాట్య విద్యా వైదుష్య వైభవము విశదమగును. యక్షగాన రచనా పరిణామ ప్రక్రియాప్రాగల్భ్యము తేటపడును. ఆ దరువుల విశేషములు కొన్ని మచ్చునకు మాత్ర మిందుదాహరింపబడుచున్నవి. ఇందనేకము మన యక్షగానములం దితరత్ర కానరావు.

1 సలాము దరువు: పంచరత్న ప్రబంధమునుండి —

భైరవి – అట

కర్పూర ధవళాంగ । కందర్ప దర్పభంగ
సర్పభూషణ । ధృతగంగ । సదయ త్యాగరాజ ఉత్తుంగ ।
నిసగారి గమాప । ధధపమ
గరి గమ పమ । పధ నిధ ధప
పధనిసరి సనిరి సన ధప
సానిధధ పమ ధాపా మగారి సరిస ।
సల్లాము సల్లాముర ॥
తకధిమికిట ఝుంతరి తక్కిట కిటతక మొ॥

2 ప్రబంధ దరువు: పంచరత్న ప్రబంధమునుండి

బిలహరి – ఆది

ఇందు కళాధర । సుందర వదన పు
రందర వందిత చరణారె ।
కుందరదన యర । విందనయన కర
నందిత శాహేంద్ర నందరూప త్యాగేశ ।

యెలిలాం యెల్లాంలె । దేవాది దేవ
యెలిలాం యెల్లాంలె ॥
తాం తకతక । యెల్లిల్లాం । తద్ధిమి తద్ధితక ధరికిట తక
ధీంగుణాంకు తక । తళాంగు తకధిమి తక్కిణాం ।
తకకిణాం । కిటతరి । తకధళాంగు ।
ధణకు తకధిత్తా । యేలిలాం యెల్లాంలె ॥

ఈ దరువే యించుక మార్పుతో అతని త్యాగవినోద చిత్ర ప్రబంధమునందు జక్కిణి దరువుగా నుదాహరింపబడినది.

3. పదాభినయము దరువు: పంచరత్న ప్రబంధము నుండి —

సావేరి - ఆది

దేవదేవేశ నన్నెప్పుడు । గావు మహేశ ।
కాముని బొరిగొన్న సామివి నీవా । దారు
కావన జనులకు గామిడ వీవా ॥

4. సవ్యాపసవ్య సమపద లీలా దరువు: త్యాగ వినోద చిత్ర ప్రబంధము నుండి —

రేగుప్తి - ఆది

నగుత దిటిది (?) తగున । మగువకు లోకు వగుమ
కనరు తీరు తీరునక । నెనరు పోను పోరుననె
మెలత మీర మీ తలమె । కలయ మానుమా యలక
చేడియ రాదు రాయడిచే । పోడిమిగాని గామిడిపో
వాదే శాహేశా దేవా । రా దేవ రావదేరా ॥

ఇం దనులోమ విలోమ గతుల రెంటను శబ్దక్రమ మొక్కటే యగుట గమనింపఁ దగును.

5. క్రమసప్తస్వర వర్ణార్థ లీలాదరువు:— త్యా. వి. చి. ప్ర. నుండి —

ఆట తాళము

సరిగామా పధ — నీ వింక పైడిక (?)
తరుణు లెవ్వరు — దాని సరిగారీ
అలినీల వేణులు — అబ్జనిభాస్యలు
కలకంఠులు — దాని సరిగారీ
జలజ దళాక్షులు — సరస బింబోష్ఠులు
మెలత లెవ్వరు — దాని సరిగారీ ॥

ఇది యొక్కటే దరువు తోడి, కల్యాణి, ఖాబి, శంకరాభరణము రాగములు నాల్గింటను బ్రవర్తింపఁ జేయఁ దగినదిగాఁ జెప్పఁబడినది.

6. మోహరం: పంచరత్న ప్రబంధము నుండి —

తత్తక్కారం । ఝుకఝుక । తత్తతత్త తాం దత్తా
తోధికితాం తందందాం । తాంగత్తోకిట తకధరికిట
తందంధి తాంద్ధితక్కి । తోంధోం గత్తోం
ధిక్కితక్క । తోంతక తకధికి తందతాం ॥

తీరుమానం:—తందక । తకతక । తందక తకతక
తందక । తకతక । ధళాంగుతోం ॥
ధిందికి । ధికిధికి । ధిందికి ధికిధికి
ధిందికి ధికిధికి । ధీంగణతోం ॥

....

తకధళాంగు తకధళాంగు । తధింగిణతోం ॥

7. గణపతి కవుత్తం: పం. ర. ప్రబంధము నుండి —

ధీత్తత్తై । ధీత్తత్తై । తత్తాదిద్ధితోనంతా ।
ధక్కిట ధిక్కిట్టతక్క । ధిరుగుడుతాం తోంగ
ధీందత్త ధీందత్త । ధీంధధీం దత్తక్క

తధిమి ధిమిత తక్క । ధిరుగుడుతాం తోంగ
తాతాధిత్తా ధిక్కిట । తకధిక్కిత్తాందత్త
ధక్కిట కిటతక । ధిక్కిట కిటతక
తోంగుడ కిటతక । నంగిడ కిడతక
కరిముఖ హరసుర । వరకమలజ నుత
వరపాశాంకుశ యుత । చరణం తేశరణం
తక్కిట ధిమికిట తోం । తకతోం
తధిక్కిట తక ధిమి కిట్టతోం ॥సతతం॥

8. నెలకట్టు : పం. ర. ప్రబంధము నుండి —

తెయి తెయిం దత్త । తాహత్త తెయి తెయిం
దత్తతత్త । తెయి తెయిం దత్త తాహత్త
తెయి తెయిం । దత్తతత్త తద్ధిందత్తా ధిందత్తా
ధిందత్తా । తతతధి । తతతధి । తకధిం దత్తా
ధిందత్తా । ధిందత్తా । తతతధి తతతధి
తధింగిణతోం ॥

9. సొల్లుకట్టు : పం. ర. ప్రబంధము నుండి —

తాంధి తద్ధిమి తకఝుం గణక ఝుగ
తత్తోంగుడు । తకతోంగుడు ధిమికిడు
తాంధి తాంధితక ధణం త్తకిణ ఝుక
తతోంగ తకధోంగ । తోంతోంగ
తకతక ఝుకణకఝు ॥

10. త్రికాలస్వరం : పం. ర. ప్రబంధము నుండి —

సారిగ గారిస । రీగప పామ్మగ । గపధస సానినీధ ।
రీసరీస ధాపమగ । పధసా నిధ పధని ।
పధధప మగరిగ । సరిగ పామాంగ
పధనిధ ధాపమా గరిరిస । యెలిలాం యెలాంలే
తాహంగ తక ఝుణుతాం । కిటతరి తక ఝుణుతాం ॥

11. వర్ణ త్రికాల సొల్లు : పం. ర. ప్రబంధము నుండి —

ధిమి ధిమి కిట । తక ఝుణుత తకిట
కిటతరి కిటత ధిమిత తక ఝుణు
ఝుణుత ధణ తకతక । కిణ తకధిమి
తక ధికి తక । తోంగు తక దధింగిణతోం ॥
యెలిలాం యెల్లాం ॥

12. జతి : పం. ర. ప్రబంధమునుండి —

తాంధిధి తాం తాం । దిద్ది తాం దాం
దిద్ది తాం దాం తక
తోం తోం తోం గతోం తోంగు ॥

13. స్వరజతి : త్యా. వి. చి. ప్రబంధము నుండి —

గగరీ స్సరి నిరి సాన్నిధ । ధ .... నిరీస్ససాస
పమా మాగా । మాగ గరిస । గమప పామ
ధప మగరిస । పామామ్మాగా మాగ గారిస
ధధనిధాధ । పమ పమామ । గరిమ గరిస
పామామ్మాగా .... గరిస ॥
నాయక భువన విధాయక అచ్యుత
సాయక భువన విధాయక త్యాగేశ ॥

14. స్వరసొల్లు జతి : త్యా. వి. చి. ప్రబంధము నుండి —

తద్దిన్నాం కిడతక । తాంధిత్తక్కిడ తక
ఝెంతారిత్త గణంగితాం ధిత్త ....
తద్ధళాంగు తక ధరికుడు
తకతోంగుడు తక । తధిగిణధోం ॥

15. వర్ణ సొల్లు జతి : పం. ర. ప్రబంధము నుండి —

తాంతక తకధినానాం
తద్దిన్నాం త్తక ధిత్త
ధినానాం ధిత్తానాం ధిరుగుడు తక
ధీంధిమిత తక ధళాంగుతోం ॥

16. పంచఘాతము: త్యా వి. చి. ప్రబంధము నుండి –

సావదహ్వాహో అ । సావధనరాహహో
జనాహో । కాళదుష్టదానిదాక । కర పసరూన ।
జపతో కాళహర చింతా సాద
కమనీయధర్మ అచర ॥

మీఁదఁ బేర్కొనఁబడినవానిలో 'జతి' యను పదము సంస్కృత సంగీత శాస్త్రకర్తలు ప్రయోగించిన 'యతి' శబ్ద వికృతి యనుకొందును. 'యతి' యన్నది సంగీత శాస్త్రకర్తలచే వాద్యాధ్యాయమున నొక వాద్య ప్రబంధముగాఁ బేర్కొనఁ బడినది. సంగీత రత్నాకరమున (VI. 152-153) నది – కూటవర్ణ విరచితము (కూటవర్ణములనఁగా పటహాది వాద్య సాధారణ వర్ణములు అని చతుర కల్లినాథుని కళానిధి వ్యాఖ్య), అత్యంత కోమలము ('బంధకాఠిన్య వర్జితము' అని వ్యాఖ్య), ఏకరూపాక్షరము (అనఁగా 'ఉపక్రాంత వర్ణానుసారేణైవ సమాపితః' అని వ్యాఖ్య), తాళచ్ఛందోభివ్యంజనోజ్జ్వలము, బహు విరామ సంయుతము నైన వాద్యఖండముగాఁ బేర్కొనఁ బడినది.

మీఁది 'గణపతి కవుత్తం' అనునది సంగీతశాస్త్రము లందొక వాద్య ప్రబంధముగాఁ బేర్కొనఁ బడిన 'కవితమ్' అనుదానికి దగ్గరి చుట్ట మను కొందును. సంగీత రత్నాకరమున (VI. 172) తల్లక్షణ మిట్లున్నది :–

" ఇత్యుద్గ్రాహ ధ్రువౌ కృత్వా స్తోద్గ్రాహాంత్యదలేఽథవా ।
స్తోద్గ్రాహే యత్రముక్తి స్తత్కవితం కవయో విదుః "

'పంచఘాత' మనున దొక తాళ విశేషమో లేక తాళ ప్రబంధ విశేషమో యనుకొందును. తల్లక్షణము :

'గద్వయం లత్రయం జ్ఞేయం నిశ్శబ్దం లత్రయం తతః
పంచ ఘాతస్స విజ్ఞేయః ప్రసిద్ధ స్తాల వేదినామ్'

'జీవద్వయం భవేద్యత్ర నగణశ్చ విరామవాన్
ఇతివా పంచఘాతః స్యాల్లఘు త్రితయ సంయుతః' *

— సంగీత దర్పణము.

ఇఁక మోహారం, నెలకట్లు మొదలైనవి ప్రసిద్ధ సంస్కృత సంగీత శాస్త్రగ్రంథము లం దుదాహరింపఁబడలేదు కాని యవియు వాద్యప్రబంధములు, తాళ ప్రబంధములు అను వాని కోవకుఁ జెందు నట్టివిగాఁ దోఁచును.

సంగీత శాస్త్రిక దృష్టితోఁ బరిశీలించినచో శాహరాజు సాహిత్యమందు, అసలు యక్షగాన వాఙ్మయ మంతట నపురూపము లైన విశేషము లనేకము గోచరించును. యక్షగాన మొక సంగీత ప్రక్రియా నిక్షేపము. అందలి విశేషము లన్నిటిని వివరించి లాక్షణిక ముగ వ్యాఖ్యానించుటకు నాకు శక్తి చాలదు. అది ప్రత్యేక మొక పరిశోధన వ్యాసంగమునకు విషయము. అభిజ్ఞుల పరిశీలనార్థ మీాయను బంధములఁ గొన్నిటి నూరక ఉదాహరించితి నంతే. అక్కడక్కడ నా యోపిన కొలఁది కొంత కొంత వివరించుటకుఁ బ్రయత్నముఁ చేసితిని. దోసఁగులు పొసఁగిన – హసింతురు గాక పురోభాగులు, మన్నింతురు గాక మహాభాగులు.

* వాసుదేవకవి పార్వతీపరిణయమున 'పంచఘాతమఠ్య' ఉదాహరింపఁ బడినది. అది మఠ్యతాళప్రభేద్యమగునా?

# అనుబంధము

# 4

## వివిధ గేయ రచనలు

పై అనుబంధముల పరిధిలోనికి రాని పలురకముల యక్షగాన పదములు పాటలు నీ యనుబంధమునఁ బ్రసక్తము లగుచున్నవి. అందు కొన్ని సంగీతోచిత ప్రక్రియానిబద్ధత గలవి. మఱికొన్ని పద్యము పోకడ యనఁగా ఛందోనిబద్ధత గలవి. కొన్ని కేవలము సందర్భము, అందుఁ బ్రసక్తమైన విషయమును బురస్కరించుకొని పెట్టఁబడిన పేరులు గలవి. ఇందుఁ జాలభాగము దేశిరచనలు. అందు రగడ వికారములు గొన్ని. ద్విపద వికారములు గొన్ని. ఇట్టి దేశి సంగీతరీతులును అతి ప్రాచీనకాలమునుండియుఁ బ్రసిద్ధివహించి యున్నవి. బృహద్దేశి, సంగీతరత్నాకరాది ప్రాచీన సంస్కృత సంగీతశాస్త్రగ్రంథములందును ప్రబంధాధ్యాయ పరిగణన కెక్కినవి కొన్ని. యక్షగాన ప్రయోగమునుబట్టియేకాక పాల్కురికి సోమనాథు డేకరువుపెట్టిన పట్టికను బట్టియు, లక్షణదీపిక, సంకీర్తన లక్షణము, అప్పకవీయము మొదలగు లక్షణగ్రంథములందును మన కావ్యములందును గల ప్రసక్తిని బట్టియు, తాళ్ళపాకవారి పదవాఙ్మయము, త్యాగరాజు ఉత్సవసంప్రదాయ కీర్తనలు, జానపద వాఙ్మయము మొ॥ వానియందలి లక్ష్యకోశమును బట్టియు నిందలి కొన్ని గీత ప్రబంధములకుఁ బ్రాచీన కాలమునుండియుఁ దెనుఁగున గల ప్రచారము తేటతెల్లము కాఁగలదు. కాలక్రమమునఁ గొన్ని క్రొత్తలు పొడసూపకపోలేదు. అర్వాచీన యుగములఁ బరిణామ

పదములఁ బ్రమాణించు యక్షగానము వానిం గొన్నిటిని గ్రహించుచునేవచ్చినది.

ప్రకృత మీ యనుబంధమునఁ బ్రసక్తములైన గీత ప్రబంధము లన్నిటికిని సిద్ధముగా లక్షణ మేర్పరింపఁబడియుండలేదు. సహజముగా గీత ధర్మము గలవి కావున పాడఁబడు సమయమున రాగము సాగదీతవలన వీనియందలి గురులఘువ్యవస్థ మాఱవచ్చును. బహు లక్ష్య పరిశీలనముజేసి వీలైన సూచనలు మాత్రము నా చేతనైనంత చేసెదను. ఇవి నిష్కృష్ట లక్షణములని భావింపరాదు. సూచనలు మాత్రమ. అభిజ్ఞుల పరిశీలనార్థము మన యక్షగానములందే సాటి సంగీత సంబంధి సామగ్రి యున్నదో యెత్తిచూపుటకే యీ ప్రయత్నము. అప్పకవి లాలి, గౌరీకల్యాణము, ధవళము, సువ్వాల, అర్ధచంద్రికలకు లక్ష్యములు మాత్రము చూపించెను. లక్షణము నిరూపింపలేదు. అతఁడు నొక యక్షగాన రచన చేసినఁవాడు. లక్ష్య కర్త, లాక్షణికుఁడునైయుండియు నట్లు కతిపయ గేయప్రబంధముల కూరక లక్ష్యములు మాత్రమ చూపించె ననఁగా వానికి లక్షణ మేర్పరించుటలోఁగల సాధకబాధకము లతని కధిగతార్థములన్నమాట.

వరుసగా నొక్కొక్క గీతి రీతిని స్థాలీపులాక పరిశీలనముచేసి చూతము :—

1. అధ్యాత్మలు :- విజయరాఘవుని ప్రహ్లాద చరిత్ర అవతారికలో నతని రచనలు పేర్కొనబడిన యొక సీసమాలికలో ఏలలు, విడి పదాలు, సంకీర్తనలు మొదలగు వానితో పాటిదియు నొక గేయ విశేషముగ నుటంకింపఁబడినది. ఆతనిదగు లక్ష్య మొక్కటియు లభ్యముగా లేదు. యక్షగానములందు దీని ప్రయోగము క్వాచిత్కము. తెలంగాణమ్ము ప్రాంతమునకుఁ జెందిన మట్టెవాడ భీష్మన కంకితమైన

శివరాత్రిమాహాత్మ్య మను యక్షగానమున నిది పలుతావులఁ బ్రయుక్త మైనది.

ఉదా:- ౧. ప్రవిమల ప్రమథుల - పాలిటి పెన్నిధి శివునిరాత్రి, సకల
దివిజ చకోరత - తికిని సుధానిధి శివుని రాత్రి ।పల్లవి।
కాయిక దోషాంధ-కార పంక్తికిరవి శివునిరాత్రి, ని
ర్మాయిక జనవన - రాజిమందారము శివునిరాత్రి ॥

. ఈరీతి తర్కించి - యేగె మిథిలాపుర
ద్వార బాహ్యోపవన - ధాత్రికిని యందున్॥

మొదటిదానిలో చతుర్మాత్రాక గణప్రాచుర్యముతో నేకతాళగతి స్ఫురించును. రెండవది పంచమాత్రగణాక మగు జంపెరేకు. ఇట్లు దీని గమన మన్నితావుల నొక్కతీరుగ లేదు. రెండేసిపాదము లకుఁ బ్రాస నియతి గలదు. సజాతీయ వర్ణావృత్తితోఁ బ్రతిపాద మును రెండు దళములుగా విరుగును. దీనికి పల్లవి చరణ విభాగమున్న జాడ దోఁచును. సర్వసాధారణముగ రేకులో, దరువులో లేని యక్షగాన ముండదు. ఈ శి. రా. మా. న వానిపేరు కానరాదు. వాని స్థానము నాక్రమించుకొన్న వీ యర్థ్యాత్మలే. దీనిని రేకునకు దరువు నకు నుద్దియగు పదరచనా విశేష మనవచ్చును.

2. అనువులు :- కొద్ది యక్షగానములం దతి విరళముగాఁ గను పట్టును. ఒక్కొక్కదానియం దొక్కొక్క తీరుగా నున్నది దీని గతి.

ఉదా :- ౧. రూఢిమీర మహాగణంబులు గూడిచూడా, నాట్యము
లాడువాడు బుధోత్తములు గొని యాడువాడూ ॥

— వీరచోడవ్వచరిత్ర

౨. పతిలేని ధాత్రి యుడుపతిలేని రాత్రియును
మతిలేని మంత్రియును శ్రుతిలేని తంత్రి॥

— బలభద్రదాసి కపోతవాక్యము

౩ పురజనులందరు దను జూడంగ ముదము బొంది
అరుణ కిరణు డుదయమయ్యెడు నటకుమున్నె ॥

— భీమసేన విజయము

ఉదా :— ౧ లో త్రిపుట గతి, ౨ లో జంపెగతియుఁ గలవు. మూఁడవదాన గతి స్పష్టపడ లేదు. (ఇది కొన్నిట 'హానువు' లనియుఁ బేర్కొనఁబడినది).

3. అప్పగింత పాట :— ఇదియొక ప్రత్యేక రచనా ప్రక్రియ గలదికాదు. కల్యాణ కథలందు తలిదండ్రులు వియ్యాలవారికిఁ దమ కన్యనప్పగించు సందర్భమును బురస్కరించుకొని పుట్టినది మాత్రమ.

ఉదా :— బాలామణి మిగుల గోల
బుద్ధులేవేళ నేర్పుడీ భామ చాల
ఈడు బాలికలగూడు, బొమ్మల
జోడు పట్టి తానాడు

— జానకీపరిణయము

4. అలక పాట :— ఇదియు అప్పగింత పాటవలె సందర్భ పురస్కృతమైనదే కాని యొక ప్రత్యేక ప్రక్రియ గలదికాదు.

ఉదా :— "ధర్మస్వరూపమై ధరణి పోషించు
ధర్మరక్షక నీకు తగదు లేవయ్యా ॥

మొన్న సంగయ్యవిఁ జెన్నుగాబట్టి
వన్నెలింగముగట్టి వరుడ రావయ్యా ॥

— బసవమహిమామృతవిలాసము

ఇందు జంపెగతి స్పష్టముగనున్నది. రెండేసి పాదములకు ప్రాస నియమము, పాదపాదమున పదిమాత్రల్పై యతియుఁ జూపట్టు చున్నవి. కాని అలకపాటలన్నియు నియతముగ నిట్లే యుండవు.

5. <u>అల్లొనేరేళ్లు</u>:- ఈమాటకు రాజజంబూఫలము, నమస్కారము, బాలక్రీడావిశేషము, ఒకానొకపాట అని వివిధార్థములు గలవు. (చూ. సూర్యరాయాంధ్ర నిఘంటువు.) ఇదియొక గీత ప్రబంధ విశేషమనుట యిటఁ బ్రకృతము. చాల యక్షగానములం దిది ప్రయుక్తమైనది. 'అల్లొనేరేడల్లొ' అను మాట యీపాట కొక పల్లవి వంటిది. ప్రతి చరణాంతమునను బునరావృత్తమగుచుండును. అనేక యక్షగానములందు దీని చరణము లచ్చము జంపెరేకులే. (చూ. పాలవెంకరి బోడిమల్ల భూపాలుని జానకీ పరిణయము, చౌదరి రామదాసు రుక్మిణీ పరిణయము, మామిళ్ళపల్లి వెంకటాచలమయ్య ఏకాంతసేవ మొదలగునవి.

ఉదా:- ఒక చరణము

శ్రీరామ విభవంబు చెలువంద గాంచీ
ధారుణికి పుత్రియై తగ నుద్భవించి
కూరిమితో జనకునకు కూతురనుపించీ
కోరికతో దశరథుని కోడలనుపించీ । అల్లొనేరేడల్లొ॥
జానకీ పరిణయము సౌభాగ్యమాయె॥

— జానకీ పరిణయము

ఈ పాటకొక సంప్రదాయ సందర్భమును గలదు. ఇదియొక పెండ్లిపాట. 16 శ. ప్రబంధము లందును పెండ్లిపాటగా దీని ప్రసక్తి కనుపట్టును. (చూ. కకుత్స్థవిజయము 4.3; పాంచాలీ పరిణయము 4.10) కల్యాణ కథాత్మకములగు యక్షగానములందు ముత్తైదువల సువ్విపాటకుఁ బిదప నిది కన్పట్టును. పై జానకీ పరిణయ రుక్మిణీ పరిణయము లిందులకును దార్కాణలే. అనఁగా సుంకులు దంచుట సువ్విపాటకును, సుంకులు చెరుగుట అల్లొనేరేళ్ళకును సందర్భము

లన్నమాట. గణపవరపు వేంకట కవి యీ విషయమును స్పష్టముగాఁ జెప్పినాడు :—

> పల్లవ పాణులు కొందఱు
> పళ్లెరములఁ బూని రవల బంగరు గాజుల్
> ఘల్లురన సుంకు జెరిగిరి
> యల్లోనేరేడటంచు నయ్యిందిరకున్
>
> — ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము 571.

అయితే మామిళ్ళపల్లి వెంకటాచలమయ్య తన ఏకాంతసేవ యక్షగానమున దీనిని 'కొట్టణం పసుపు విసిరే పాట' గాఁ బేర్కొని యుదాహరించినాఁడు.

> శ్రీ కేశవం సదాశ్రిత కల్పభూజం
> నారాయణం సదానారదస్తుత్యం ॥అల్లోనేరేడల్లో॥
> శ్రీలక్ష్మి పరిణయము చెలువందమాయె॥

ఇదియు జానకీపరిణయము దానివలెనే జంపెగతి గలది. మాత్రల పరిమితియు నంతే (5×3+3 లేక 4). అందు 'సుంకులు చెరిగే పాట' వేఱే యుదాహరింపఁబడినది. కొన్ని యక్షగానములందు అల్లోనేరేళ్ళకు రాగనామము లుదాహరింపఁబడినవి. పణిహారం ఎంబారయ్య కురవంజిలో దానికి నాదనామక్రియ పేర్కొనఁబడినది.

6. (అ) అష్టకము :- ఇది కొలఁది యక్షగానములందుఁ దఱచు నాయికా విరహవేదనాదిక సందర్భములందుఁ బ్రయుక్తము. నాలుగు పాదములు నాల్గురెట్లెనిమిది దళములును గలది. ఆ దళములనుబట్టియే ఆ పేరు. ప్రతిపాదము తచ్చుముగా నొక త్రిపుట కాదు. అనఁగా పదేసి మాత్రలదళములు మూఁడింటిపై నొక రెండుమాత్రలు గలది. సరిగా ముత్తాళముల మాత్రసంఖ్యలో సరిపోవునది. దానివలనే వృషభ

గతి గలది. నాలుగు పాదములకును ఆద్యప్రాసయు, నంత్యప్రాస యును జూపట్టును. ప్రతిపాదమున పదునాల్గుమాత్రలపై అనఁగా ద్వితీయదళము ప్రథమాక్షరము యతిస్థానము.

ఉదా :— కదియ వచ్చిన మేనికాకను
గ్రమ్మిపూఁబొద వాడఁగా
కొదమ తుమ్మెద లూర్పుసెగలని
గూడ కూడని పాడఁగా
పదరు మదనుని తూపులాయము
పట్ల పలుమరు గాడఁగా
ముదిత ముందటి కరిగె శంభుఁడు
మొనసి ముచ్చట లాడఁగా ॥

— విష్ణుమాయా విలాసము

ప్రసన్న వేంకటేశ్వర విలాసాదు లందును అష్టక మచ్చముగా నిదే మచ్చునఁ గలదు.

(అ) <u>చౌపద్యష్టకము</u>: ఈ పేరుతో ఉపాధ్యాయుల మృత్యుంజయకవి వామనచరిత్రమున నొక రచన గలదు. అది అష్ట కములో సగము పరిమితి గలది. అనగా నష్టకములోని నాలుగు దళ ములు దీనికొక ప్రమాణాంశయగును. అందులకే చతుష్పది — చవు పది — చౌపది + అష్టకమైనదిది. అష్టకములోని రెండవదళమున కంటె దీని రెండవ దళమున రెండుమాత్ర లెక్కువ. అంత్యప్రాస నియతముగఁ గానరాదు. అంతే భేదము.

ఉదా :— వరకుతూహల సత్వరుండును
వర్ణ్యవిమల యశస్కరుండును
పరమదృఢతర సుమనస్కుఁడురుతర
భద్రనియతుఁడు నంధుఁడూ ॥

7. అష్టపది :— అనఁగా నెనిమిది పదములు గలది అని యర్థము. అష్టకము నిదియు సమానార్థకములే. కాని లక్షణ గ్రంథములందు వేఱువేఱఁ బేర్కొనఁ బడినవి. (చూ. లక్షణ దీపిక డి. 1329) జయదేవుని గీత గోవిందముతో దీనికిఁ బ్రతిష్ఠ వచ్చినది * యక్షగానము లందటనటఁ బ్రయుక్తమైనది. చూర్ణికవలెఁ దఱచు సంస్కృత ఘటితముగానే కన్పట్టుచున్నది.

ఉదా : త్వామనిశం ప్రేమయుతం భృశ
మామనుతే హృదబాలా
తాముర రీకురు కామవశాభిహతా
మిహ శాహనృపాలా ॥
లలిత ఫలకతల చిత్రిత మపితవ
కృత విలాస కలాపం
కలయతి దిశి దిశిహంత యథాత్మని
లలిత మనోహర రూపం॥ త్వామనిశమ్॥

అష్టకము నందు వలెనే ప్రాస పాటింపబడినదికాని యతి మాత్రము తెలుఁగునందువలె సజాతీయ వర్ణావృత్తి కాక సంస్కృత సంప్రదాయానుసారము విచ్ఛేద సంజ్ఞగాఁ బాటింపఁబడినది. అష్టకమునందు వలెఁగాక యిందు మధురగతి కన్పట్టుచున్నది. అష్టపదులందు మధుర గతికే ప్రాముఖ్యముగాని యది యొక నియమముగాదు. మొదట ఏ గతిభేదము గ్రహింపఁబడిన నదియే సాంతము పాటింపఁబడవలె ననుటయే దీని నియమము.

---

* ‘ ఘనత మీరంగ జయదేవ కవివరేణ్యుఁ, డందమైనట్టి గీతగోవింద మందు నంచితాష్టపదులు వల్కొనట్లు పదము, పరగు నెనిమిది పదములు పల్లవియును’ అనియు “ధర నెనిమిది పాదంబులఁ, బరగిన పదమదియు శరభపాద పదం’ బనియు దీనినొక పదవిశేషముగాఁ బరిగణించినాఁడు తాళ్ళపాక చినతిరుమలయ్య (చూ. సంకీర్తన లక్షణము 46—48)

"యక్షగానాష్ట పదాష్ట పదులు నాలుగు విధమ్ములు నొక్కొ-క్కటి పెక్కువిధమ్ములై' యష్టకమ్ముల పదంబులు నష్టపదులును వివిధరీతుల నానా ముఖంబుల విహరించు" నని యనియున్నాఁడు పొత్తపి వెంకటరమణ కవి. (లక్షణశిరోమణి - తృతీయాశ్వాసము ఆర్. 1257 పుట117)

8. ఇంగ్లీషు మెట్టు:- కేశవ పట్టణం జియ్యరయ్య నలనాటకమున నిదియొక దరువుగాఁ జేర్కొనఁబడినది.

ఉదా : అభిషేకించిరి మోదముగన్
అవనీధవునకు నతివేడ్కన్
శుభలగ్నంబున మునులు వశిష్ఠులు
సూరులు మిత్రులు నిష్టులునూ॥

ఇందు విశేషములేదు. ఇట్టివి తెలుఁగు మెట్టులే గలవుబోలెడు. మధుర గతిలో సాగు చౌపద్యష్టకము వంటిదిది. మూఁడవపాదమున మాత్రమొక రెండు మాత్ర లెక్కువైనవి.

9. ఊంజల్:- ఇదియొక ఊయలపాట ఊంజల్ తమిళ శబ్దము. ఉయ్యాల అని యర్థము. 'లాలి' యన్నదియు ఉయ్యాల పాటయ్యే, జోల ఉయ్యాలపాటగఁగూడ నున్నదిగాని వానిగతియే వేఱు, దీని గతి వేఱు. చిన్నపిల్లలను నిద్రబుచ్చుటయు దేవాయతన కల్యాణోత్సవములును వాని సందర్భములు. ఇది పార్థసారథి విజయము, అండాళు చరిత్రములందు కల్యాణ సందర్భమున వధూవరులను సఖులుయ్యాలలూచిన సందర్భమునఁ బ్రయుక్తము. ఆండాళ్ చరిత్రమున ఊంజల్ పాట వెంటఁగలదొక లాలి పాట. ఇట్లు వివాహవేళ వధూవరుల నుయ్యాలలూచు నాచారము తమిళ మళయాళి రాష్ట్రము

లలో నీనాఁటికి నున్నదని వినుదుము. పై రెండు యక్షగానములును చెన్నపురమున రచింపఁ బడినవి.

ఉదా :- ఆండాళ్ చరిత్రమునుండి

శ్రీవిల్లిపుత్తూరు వుంజల్‌తొట్టి
చతుర్వేదంగళుం శంగల్‌పూట్టి
అరుశాస్త్రంగళుం తూణ్గల్‌నాట్టి
ఆండాళు (రంగ) మన్నారు ఆడిరూంజల్॥

ఇందొక్కొక్క దళమునకు మాత్రలు 5+5+7; పా. సా. వి. న 5+5+6. ఇందుగమనింపదగినవి జంపెగతి, పంచమాత్రాక గణప్రాచుర్యము. జంపె గతికి సన్నిహితమైనది తాళ్ళపాక అన్నమాచార్యుల వారి కీర్తనలలో నొక ఉయ్యాలపాట గలదు. (సంXI పుట 216) అందలి పాదము లచ్చపు జంపె రేకులు. త్యాగరాజస్వామి ఉత్సవ సంప్రదాయకీర్తనలలో (ఆది అంక్కో ప్రచురణ 408వ పుట) నున్న ఉయ్యాలపాటకు ఝంపతాళమే పేర్కొనఁ బడినది.

10. ఓ డ ం :- 'శ్రీరామపుత్రి' యను మారుపేరిట నొక కవయిత్రి వ్రాసిన సీమంతినీ చరిత్రము అను య. గా. న మాత్ర మొక్క లక్ష్యము దొరికినది. ఈపేరతి విచిత్రముగ నున్నది. ఇతరత్ర కూడ కేవల మశ్రుత పూర్వము.

ఉదా : చూడ చూడా వేడుకాయే - సీమంతి
నేడు పెండ్లి కూతురాయే
మూడు భువనాల్ కీర్తినిండే - దుఃఖంబూ
వీడి తనదూ విభునిగూడే
బంగారు తట్టతో మంగళారతులు
శృంగారముగనిచ్చి యంగనలు అపుడు ॥

ఇందు మొదట నాలుగు పాదములందును త్రిపుటగతియు, చివరి రెండుపాదములందును జంపెగతియుఁగలవు. 1-3పాదములందు మాత్రాక్రమము 7 + 7 + 6 ;2-4 పాదములందు 7 + 7 ; 5-6 పాదములందు $5^3$ + 3. నాలుగేసి పాదములు ప్రాసైకఘటితములు.

11. కీర్తన :- కొన్నియక్షగానములందు రేకులో, పదములో, దరువులో ఉండవలసినచోట కీర్తనలపేరిట గేయరచనలు గన్పట్టుచున్నవి. రేకులు రగడ వికృతులు. ఒకవిధమైన ఛందోనిబద్ధత గలవి. పదములందును ఒకపాటి ఛందోనిబద్ధతగలవి కొన్నియున్నను అట్లు లేనివే యెక్కువ. ఛందోనిబద్ధత లేక రాగతాళ ధారాళములగు పదములు, దరువులు కీర్తనలు నొకపాదునుండి ప్రాకినతీగలే. యక్షగానపదములు, దరువుల గుఱించి 1వ యనుబంధమునఁ గొంత చెప్పుటమైనది. పోలిక లిరుగుపొరుగుగాఁగల యీమూఁటి యనుబంధము గుఱించి యిట మఱికొంత వివరింతును.

పరగున్ వృత్తము జాతియంతయుఁ జతుష్పాద ద్విపాదాకృతిన్
వరసంకీర్తనముల్ తదాకృతులనే వర్తించుమానంబుతో
దరువుల్ జక్కులరేకులేలలును నిద్దంబైన గొబ్బిళ్ళు భా
సురవాక్యంబులు జందమామ పదముల్ శోభిల్లు నందంబులై॥

(సం. ల. 50)

పై పద్యమునఁ జెప్పఁబడినట్లు స్థూలముగాఁ జూచినచో నివి యన్నియుఁ బ్రాక్తనమైన యేకపద సంప్రదాయము నుండి బయల్వెడలినవియే కాలక్రమమునఁ బరిణామముబొంది వైవిధ్యము నవధరించినవి.

అని చెప్పనగును. వీని యన్నింటికిని మూలము 'దేశైళ'—వివిధాభరణములందలి యేకైకమూలపదార్థమగు బంగారమువంటిదది. *

అర్జున భరతమ్మునను ఇట్లే చెప్పఁబడినదఁట –

'కర్ణాటలాట గౌడాంధ్ర ద్రవిళానాంతు భాషితం
ఏళాసప్త విధాజ్ఞేయా, ప్రోక్తామర్యాది తాళతః'

'ఏళలనఁగా పదములనిన్ని, మూఁడు చరణములకు ఖండికాత్రయం అనే పేరుగలదనిన్ని పల్లవి, ఉపపల్లవి అనిన్ని, ఇవి మాత్ర సమకనిబద్ధములైన హాగణాదులతోఁ గూర్చవలెననిన్ని, సూళాదుల కనుగుణ్యముగ నుండవలెననిన్ని, మఱియు నివి 'సంగీత తాళ నిర్ణయమ్ముల గీతనష్టి నితపుష్ట మాత్రాధిక్యమాత్ర లోపమ్ములఁబొందుచుండు' ననియు పొత్తపి లక్షణ శిరోమణియందుఁ జెప్పఁబడినది.

'యక్షగాన పదంబులు' చాలవఱకు 'సముచితానేకవిధ తాళ సంగతుల నలరునవియు (సంకీర్తన లక్షణము), 'లయ ప్రమాణంబుల నొప్పు' నట్టివియు (లక్షణదీపిక) నైనను సందుఁగొన్ని యొకపాటి ఛందోనిబద్ధతగలవి. ఇటువంటివి వృత్తపదములనియు, 'యతులుం ప్రాసములుం బదంబులును మాత్రానీకముల్ తాళసంగతులుం' గల్గిన పదములు నిబంధనామపదంబు లనియు వ్యవహరింపఁబడినవి (చూ. సంకీర్తన లక్షణము– 30-34). రేకులు తాళనిబద్ధతతోపాటు ఛందోనిబద్ధతయుఁగలవి కావునఁ గొంత యీశోవకుఁ జెందునని చెప్పనగును. విష్ణుమాయా విలాసాది యక్షగానములందున్న నీలాంబరి, ఘంటారవ,

* "కర్ణాట ద్రవిళాంధ్రలాట కైవిల సద్గౌడాది భాషాస్థితిం గర్ణాపూర్ణ సుధాశమానరుచులం గల్గించు దేశైలదా,స్వర్ణంబాభిరణత్వమొందు కరణిన్ సంగీత శాస్త్రంబులన్, వర్ణింపందగు నానుజాతియుతయై వర్తించుఁబ్రత్యేకమై?" (సం.ల.28.)

ఆహిరి, శేవగుప్తి ఇత్యాదిగా రాగనిర్దేశముగల పదములు ఏల పదము, తుమ్మెదపదము, వెన్నెలపదము. చందమామ పదము మొదలగు దేశిపద రచనలును నిర్దిష్టఛందః ప్రక్రియకు లొంగునట్టివి కావు ఇట్టివే దరువులును. దరువు గుఱించి ప్రత్యేక మొక యభిప్రాయము వ్యక్తమైనది సంకీర్తన లక్షణమున:

'మహిమ మీఱంగ ద్రుతమధ్య మానములును
జిత్రవర్ణంబుఁ దాళంబుఁ జెన్ను మీఱి
మునుపఁబాడిన పదవాక్యముల బొసంగి
ధరణి ద్విచతుష్పదాకృతి దరువు చెలఁగు (63)

మఱియు దరువు ఒక ముక్తక రచన వంటి దనియు, పదము కులకము వంటిదనియు అర్ధచంద్రకపదాదులతో పాటు దరువుగూడ 'పాదయుగళముగ బహుజన సంప్రయుక్తిఁబరగు' ననియు నందుఁజెప్పఁబడినది. (51). కీర్తనములు లేక సంకీర్తనములు నీకోవకుఁజెందునవియే. అందు భగవన్నామ గుణాదికము కీర్తింపఁబడుటచే యౌగికముగ వానికీ పేరుకల్గిన దనవచ్చును. సంకీర్తనలక్షణకర్త 'సంకీర్తన నామక పదసంప్రదాయం బెట్టి దనిన' అని పదలక్షణప్రసక్తికి ఆకరములను సంగీత-రత్నాకర, చంద్రికా, చూడామణి, సుధాకరము లను గ్రంథములను 'పేర్కొని' తానె యన్నిటికిని మూలమైన భరతమందుఁ బంచదశాధ్యాయమంగు విమల వృత్తచూర్ణనిబంధక వివిధనామ భవ్యలక్షణములకు నాస్పదము పదము" అని వక్కాణించెను. దీనిని బట్టి సంకీర్తన మనఁగా పద చాచకపర్యాయ మనియు నాసంప్రదాయ మతిప్రాచీన మనియు విశదమగును. తెనుఁగుగడ్డలో మనకీ నిక్షేపము తాళ్ళపాక వారి లోఁగిట దొరకినది. తాళ్ళపాక అన్నమాచార్యుఁడు (15శ.) పదకవితా పితామహుఁడు, సంకీర్తనాచార్యుఁడు, 'లక్షణములు పద కవితారక్షణములు' నైన బహువిధ సంకీర్తనములకుఁ గర్త. అతఁడు

పద సారస్వత లక్ష్యప్రపంచ విరించనుడే కాదు లక్షణప్రవక్తయును. కాని యతఁడు సంస్కృతమునఁ జెప్పిన ఆ లక్షణగ్రంథము నేఁడు లభింపదు. దానికాయన పుత్రుఁడు పెదతిరుమలయ్యంగారు వ్రాసిన వ్యాఖ్యాన మును నేఁడు లభింపదు. ఈయన పుత్రుఁడు చినతిరుమలయ్య 'తద్వ్యాఖ్యానుసారంబునన్' వ్రాసిన సంకీర్తన లక్షణము, ఆ అన్న మాచార్యాదుల సంకీర్తనములును నేఁడుపలబ్ధములు. లక్షణ శిరోమణి యందుఁజెప్పఁబడినట్లు ఉపపల్లవి (అను పల్లవి) లేదన్నమాట గాని తాళ్ళపాక వారి సంకీర్తనములు సరిగా పల్లవి, ఖండికాత్రయమును గలి గిన రచనలే. క్షేత్రయ పదములలో అనుపల్లవియొకటి అధికము. త్యాగరాజు కృతులలోఁగూడ నీ సంప్రదాయము బాగుగనే పాటింపఁ బడినది గాని కొన్నిట చరణాధిక్యమును జూపట్టుచున్నది. త్యాగయ్య కర్వాచీనములైన యక్షగానములందే కొన్నిటఁ (పాతూరి తిరుపతి సుందరకాండము, మామిళ్ళపల్లి—ఏకాంతసేవ, మైనంపాటి బాల గోపాలవిలాసము, గజేంద్రాళ్వారుచరిత్రము మొ॥) గన్పట్టుచున్నవి కీర్తనలు. యక్షగానములందలి కీర్తనలన్నియు భగవత్పరములు గావు. దరువులవలెనే బహు విషయాత్మకములు. లక్ష్యమునకు చూడు—క్రింద 37, 39వ అంశములు.

12, కోతియాటపదము :- చౌదరి రామదాసు రుక్మిణీ విలాస యక్షగానమున సింగడు కోతి నాడించు సందర్భమున నొక పదముగలదు. తిమ్మారాయుని తైతక్కలకుఁ దగినట్లు లయాత్మక ముగా నుండుటయే దీని లక్షణము.

ఉదా : ఆటతాళము

ధిమ్మొత్తరా తిమ్మ ధిమ్మొత్తరా
ధిమ్మొత్త ధింధిమ్మి ధిమ్మొత్తరా
ధిమ్మొత్తరా సీతమ్మగారికి ఉంగరము

యిచ్చిననాటి యిమ్మేదిరా తిమ్మ ధిమ్మెత్తరా
తగ బాల్యమున పూర్వనగము మీదికి నీ
వెగసినట్టి మంచి లఘువేదిరా తిమ్మ॥

13. గజల్ :- గజల్, డోరా, తోహరా మొదలగునవి కొన్ని పార్శీమట్లు 19వ. శ. ఉత్తరార్ధమునఁ దెనుఁగు దేశమున ధార్వాడ నాటక సమాజము వారి నాటకములకుఁ బ్రచారమేర్పడిన కాలమున మన హరికథలందును, యక్షగానము లందును జేరినవి.

ఉదా : బాగేపల్లివారి కుచేలోపాఖ్యానము నుండి

ఎన్నిదినంబులు జీవించిన నరు
డీల్గుట సత్యంబు
ఎన్నోవిధముల ధనమార్జించుట
లేలా నిత్యంబు॥

ఈ గజల్ తఱచు ఆది తాళవిశిష్టముగఁ గన్పట్టుచున్నది. ఇందు పాదమునకు నాలుగు మాత్రల దళము లైదు, మీఁద ఆఱుమాత్రల దొకటి. నాలుగు దళములపై యతి. రెండేసి పాదములకుఁ బ్రాస విహితము.

14. గొబ్బిళ్లు :- ఇది 1వ అనుబంధమున నుదాహరింపఁబడిన గొబ్బిపదము కంటెను విలక్షణమైనది. ఇందూఁతపదము విశేషము. గతియందును విలక్షణతగలదు. గొబ్బిళ్ళనఁగా ఒక ఆడుపిల్లల పండుగ (సంక్రాంతి) వేడుక, క్రీడావిశేషము, పాట, నమస్కారభేదము. (చూ. సూ. రా. నిఘంటువు). పండుగలు వేడుకలకును, వేడుకలు క్రీడలకును, ఆటలు పాటలకును దారితీయుట పరిపాటి. అట్టిదే యిది. ఇది తాళ్ళపాకవారి సంకీర్తన లక్షణమున నిబంధపదముగాఁ బరిగణింపఁబడినది. అర్ధచంద్రక పదము, ఏలపదము, చందమామపదము మొదలగు

వానితోపాటు 'పాద యుగళముగ బహుజన సంప్రయుక్తిఁబరగు' నని చెప్పఁబడినది (సం. ల. 50-51).

ఉదా: 1. గణపతిరెడ్డి గోపాల విలాసమునుండి

గొబ్బియాళో కొమ్మలార
రారెమరుని గుమ్మలార
ఇంతులార రారెమరుని
బంతులార రారె గొబ్బియాళో॥

2. చూడమ్మ రుక్మిణీ కల్యాణము నుండి

ఆనందభైరవి — ఆది

అందముగా కృష్ణుని సుందర పదముల
ముందున నిలిపి వందన మొనరించి
చిందుచు గొబ్బియాడరే॥పల్లవి॥
చెలులందరు గూడి గొబ్బియాడరే॥ఉప॥

**15.** <u>చెండ్లాట పాట</u>:-ఇదియొక పెండ్లి వేడుకపాట. ముత్తైదువలు వధూవరులచే పూలచెండ్లాడించు ముచ్చటకు సంబంధించినది. దీని రచన కొక నియతి యుండదు. కాని కొన్ని య.గా. లందు ఏల లుపయోగింపఁబడుట విశేషము.

ఉదా: వేలాకొలఁది స్త్రీలూగూడి
బాలా రుక్మిణి నెదుటా నునిచి
నీలవేణులు పాటాబాడాగా - శ్రీకృష్ణమూర్తి
పూలచెండ్ల నాడేవేడూక॥

తిమ్మరాజు లక్ష్మణరావు రుక్మిణీ కల్యాణము

16. జాతిస్వరమట్టు :- గజేంద్రాళ్వారుని చరిత్రమున నొక్కటి గలదు. అందిది మంగళగీతముగాఁ గన్పట్టుచున్నది.

రూపక తాళము

రామచంద్ర మంగళం - రాఘవేంద్ర మంగళం
కామజనక కౌస్తుభధర - కంజనేత్ర మంగళం ॥౧॥
అగణితముగ నీదుఖగతు - రగమునకును మంగళం
నిగమగోచరా నీకు - నిత్యశుభ మంగళం ॥౨॥

17. జావళి :- ఇదియొక రకమైన శృంగారపదము. నాయిక విరహము, నాయకాహ్వానము సర్వసాధారణముగ నిందలి విషయములు. లోగడ రాచవారి కొలువు కూటములందు, కామందుల లోగిళ్ల వివాహ సందర్భములందు మేజువాణీల (బోగముమేళముల) లోను నట్టువపాపలచే నభినయపూర్వకముగఁ బ్రయోగింపఁ బడు చుండెడిది. ఆంధ్రనాయకరాజ మహారాష్ట్ర ప్రభువుల ఆస్థానము లందుఁ బ్రవర్తిల్లుచుండిన పదకేళిక పంతువగ పదాలట్టివే. మైసూరి కంఠీరవరాజు పదములు నట్టివే. జావళులందుఁ గొన్ని భగవత్పరము లును గలవు. (గరిమెళ్ల వేంకటేశ్వర దశావతార జావళీలు మొ॥) క్షేత్రయపదములందుఁ గొన్ని యీకోవ కొజ్జబంతులనఁ దగినవి కలవు. అయితే వానియందును విప్రలంభశృంగారము, ప్రియావాహనము, అభినయోపయోగిత్వము నను వాని ప్రధానధర్మములు పాటింపబడు చునే వచ్చినవి. ఇవి విడిగా విశేషప్రచారము గాంచినవి. యక్షగానములందును గొన్నిప్రవేశించినవి. తెలుఁగువారి వాడుకలో 'జావళి' యన్న పేరుమాత్రమిటీవలిదిగాఁ దోఁచును (తత్ప్రయోగస్థాన సూచకముగ చవికె, కొలువు కూటము, అను నర్థముగల చావడి యను మాట దీనికి మూలమగునేమో విచారింప వలసియున్నది.)

చందన మహారాజు చరిత్ర మను దాన జావళీలు చాలగలవు.

ఉదా : జంఝూటి - రూపకము

ఉదా . సమయ మిదిగొ సరసమునకు రారా
రారా, అతిధీరా, ఘనమారా, సుఖమీరా ॥స॥

18. జోల :- ఇది తెనుఁగుదేశమునఁ జిరప్రసిద్ధమైన పాట. ఇది ఊయెల పాటయును గనుక సంస్కృత 'డోలా' శబ్ద భవమని యొక అభిప్రాయము. (హిందీ తద్భవము, ఝూలా). జో అను ఊఁత మాటకు బహువచన రూపమని మఱియొక అభిప్రాయము. 'లాలి' వలె నిది కేవల మూయెల పాటయే కానక్కఱలేదు. ఎక్కడపరున్న పిల్లల నైనను నిద్రపుచ్చు నపుడు పాడఁబడున దగుటయే దీని లక్షణము. జోకొట్టుటకు నిదురపోయని వీపు తట్టుట యని యర్థము. (హిందీలో 'సో' అనఁగా నిదురపో అని యర్థము). ఈ జోలపాటలు ప్రాచీన కాలమునుండియుఁ దఱచుగనే య. గా. లందును బ్రయోగింపఁబడుచు వచ్చినవి.

గణపతిరెడ్డి గోపాల విలాసమునుండి :-

జోల బాడెదమిపుడు సుందరాంగులమూ
జోలలకు నిదురపో సొంపుచూచెదము ॥జోజో॥
శ్రీమహాలక్ష్మితో చెలఁగి తిరిగేవూ
మామందలో నాదగా మరిగి తిరిగేవూ ॥జోజో॥

జోలపాట సర్వసాధారణముగ జంపెగతితో నడచు నట్టిది. దానికి తగి నట్లే పై పాటలో పాదమున కైదు మాత్రల గణములు మూఁడు, మీఁద మూఁడులేక నాలుగు మాత్రల దళ మొకటియు నున్నవి.

19 డిండిమము -డిండిమ మనఁగా 'రాయడి గిడి గిడి' యను నొకవాద్య విశేషము. ఆ వాద్యసంబంధమునఁ బ్రవర్తిత మగు వాద్య ప్రబంధముగాఁబోలీపదము – వేంకటపతి కాళీయమర్దన మను య.గా.న. నిది ద్వివారము ప్రయుక్తము. దీనమధురగతి చూపట్టెడు.

ఉదా :- సందర్భము - కృష్ణుని తాండవము

గజ్జెలు మువ్వలు ఘల్లున మ్రోయఁగ
చిందులు తొక్కెను చిన్నికృష్ణుఁడు
తాధిత్తా ధిత్తత్తా ధిర్తా
ధిత్త ధిత్తా ధిత్తతధిమిత్తక్కిట॥

రంగాజన్మ మన్నారు దాస విలాసనాటకమున (పుట 29) నిది భిన్న రీతిగా నుదాహరింపఁ బడినది :

'కాంచివల్ల ద్వలగ్నకం । ప్రాంచదుచ్చస్తన ద్వయం
కాచిదంబుజ లోచనా రఘు । నాథనందన నాథతేత్వామ్'

ఇందు పూర్వార్ధమునఁ బాదమునకు 13 మాత్రలు, ఉత్తరార్ధమున 14. ఒక విషమ వృత్తమువలె నున్నది.

20. డోరా :- ఇదియొక పార్శీచుట్టు 19–20శ. హరికథలందుఁ దఱచుగను, య. గా. లందు విరళముగను కథాఖ్యాన సందర్భము లందుఁ గన్పట్టుచున్నది. (కథాఖ్యానమునకు యక్షగానములందు ద్విపద, జంగంకథలలో రగడఁ హరికథలలో నీ డోరాలు నుపయుక్త ము లగుట పరిపాటి. ద్రుతగతి దీని స్వభావము.

ఉదా :- గజేంద్రదుర్వారుని చరిత్ర నుండి

అయిందిరయును నతి విస్మితయై
యరుగు చుండె వెనుక
తోయజాక్షి తన మనమున నేమియుఁ
దోఁచకుండె గనుక ॥

ఇందు మధురగతి తోఁచుచున్నది. (మాత్రలు $8^2 + 3^3$). యతి ప్రాసలు గన్పట్టుచున్నవి.

పురాణం పిచ్చయగారి కపటవేశ్యానాటకమున 'డోరాగజల్ మట్టు' అను నొక విశేషనామము గన్పట్టుచున్నది. ఆ మట్లన్నియు నాది తాళమున నున్నవి. వానిలోను మధురగతియే తోఁచుచున్నది. $(8^2 + 4 + 5)$

ఉదా : వినవేతల్లీ యీ రమ్యాంగుని విషయము తెల్పెదను
వనజ భవాన్వయ వార్ధిసుధాకరు డనఘుం డీఘనుఁడు ॥

గోపాలరామదాసకవి సీతాస్వయంవరమున 'డోహరా దరువు' అను మఱియొక వింతపేరు వినిపించినది. ఇందును మధురగతి గోచరించు చున్నది. $(8^3 + 4)$

ఉదా : నాద నామక్రియ - ఆది

జగతిలోన మిథిలాపురము నను
జనక నృపాలుండనఁగా
సొగసుమీఱ రాజ్యంచేలుచునూ
సుఖముండును వినఁగా ॥

21 తంగం :- (తంగప్పాట్టు): ఇదియొక తమిళగీత ప్రబంధ విశేషము. భగవత్స్తుతి పరమగుట దీని సంప్రదాయము. 1900 ప్రాంతపు య. గా. లందుఁగొన్నిటఁ గన్పట్టును.

ఉదా :- కురుచేటి సుబ్బరాయకవి గౌరీశంకర విలాసము నుండి

ఫాలసులోచన — పాప విమోచన
పాలించి నన్నేలరా - మరుకేళి
లాలించి తేలించరా ॥

అన్నిట నించుమించుగా దీనిచరణము లిట్లే గలవు. చరణమునఁగల మూఁడుదళములందును మాత్రలు $4^4$, $5+7+5$, $5+7$ గా నున్నవి. కొన్నిటఁ బ్రాస పాటింపబడినది. కొన్నిట లేదు.

22. తందనపదము :- 'తందనాన' అని కాని 'తందాన తాన' అని కాని యూఁతపదము ప్రతిపాదాంతమున ఆవృత్తమగు పదవిశేషము. ఇది సంగీతములో గానాంగ విశేషమైన తానశబ్ద సంబంధియై యుండును. 'తందానతాన' అను మాటకు 'a Sound used in beating time in music' అని యర్థము నిర్వచించిన దొక కన్నడ నిఘంటువు. ఈ తందన పదములు ప్రాచీనకాలమునను దెలుఁగు నాట ప్రచారమున నుండినట్లు వేంకటనాథుని పంచతంత్రము, కళా పూర్ణోదయము, భోజసుతాపరిణయము, దశావతారచరిత్ర మొదలగు మన కావ్యములందలి తత్ప్రసక్తిని బట్టి యూహింపనగును.

శహాజీ జలక్రీడలు అను యక్షగానమున మాత్రము దీని కొక్క లక్ష్యము గన్పట్టుచున్నది :-

'గంతా దోచుకు పోయెనె తందనానా। కృష్ణు
డెంతా మోసము చేసేనె తందనానా ॥౧॥
వక్కా లాకుల తిత్తి పోయె తందనానా ॥మొలను
జెక్కిన పొగచుట్ట పోయె తందనానా॥౨॥

23. తరంగము :- శ్రీ నారాయణ తీర్థులవారి శ్రీకృష్ణ లీలాతరంగిణి ప్రాదుర్భావముతో సంస్కృతఘటితమైన సంకీర్తనల

కిదియొక పేరైనది. తీర్థపాదుఁడు తెనుఁగున రచించిన పారిజాతాప హరణ యక్షగానమున అతని శ్రీ. లీ. తరంగిణి లోనివే యొకమూఁడు తరంగములు ప్రయుక్తములైనవి. తదుపరి 1919 ప్రాంతమున శేషాంబ నందిపాటి మిత్రవిందాపరిణయ మను కృతియొకదాన మాత్ర మీతరంగములు గన్పట్టుచున్నవి. ఇందలి తరంగములు తాళజతులవలె నుండుట విశేషము.

ఉదా : ఝుణు ఝుణుతాం ఝుణు జలరుహ నేత్రా
దధగిణతాం ఝుణు దానవ జైత్రా
ధిన్నాకిట్టక తాం ఝుణు త్రిభువన స్తోత్రా
తెయి తెయితాం ఝుణు దేవకి పుత్రా
సురాధిపులచే దురాన గూలిన
సురాసురు లెల్లను ధరాతలంబున
నరాధిపతులై నరంగబుట్టిన

ఇందు మధురగతి (ఏకతాళిగతి) గమనింపఁ దగినది.

24. <u>తలంటుపాట</u> :- ఇదియొక పెండ్లివేడుక పాట. వధూ వరులకు మంగళస్నానములు చేయించునపుడు పాడఁబడునది. కళ్యాణ కథలు గల చాల య. గా. లందు గలవు. ఇది కొన్నిట 'తలంటు శోభనపుఁ బాట' యనియుఁ బేర్కొనఁబడినది.

ఉదా :- మామిళ్ళపల్లి వెంకటాచలమయ్యా ఏకాంత సేవ నుండి-
శ్రీసీతారామునకూ । శ్రితజన మందారునకూ
కౌశికమఖపాలునకూ । కనకాంబర ధారునకూ
శోభనమే । శోభనమే।

చాల య. గా. లందిట్లే దీని పాదమున కొటేసి మాత్రల దళములు నాలుగు, నడుమ విరామము, రెండేసి పాదములకుఁ బ్రాసయుఁ జూపట్టు చున్నవి.

25. తలుపుదగ్గరిపాట:- ప్రణయకలహము వశమున నెడపడిన నాయికా నాయకుల పునస్సమాగమ సందర్భ పురస్కారముగా నాయికా నాయక సంవాద పురస్సరముగాఁ బుట్టిన దీపాట. కతిపయ య. గా. లందుఁ బ్రయుక్తము.

ఉదా:- సౌరాష్ట్ర - ఆది

అలిమేల్మంగామణి నే వచ్చితి
నలరుచు వాకిలిదీయవె
చెలువుడ నీవగలెల్లను దెలిసెను
నిలువక నటుపోవోయీ
నక్రముజంపి గజేంద్రుని గాచిన
చక్రధరుడనే భామా
చక్రధరుడవైతే ఘటముల ని
ర్వక్రత జేయగ పోవోయి

ఇట్లే యీపాట సాధారణముగ పాదమునకుఁ జతుర్మాత్రాకదళము లేడుగలిగి, నాలుగు దళములపై యతియు, రెండేసి పాదములకుఁ బ్రాసము మధురగతియుఁ గలిగియుండును.

26. తిలానతరగతి:- ఇది యొక దాక్షిణాత్య గీత ప్రబంధ విశేషము (బుచ్చర్ కన్నడాంగ్ల నిఘంటువున 'a variety of song' అని పేర్కొనఁబడినది). నృత్యానుకూలమైన ప్రయోగముగలది. ఇట్టి దొక్కటి బాగేపల్లివారి కుచేలోపాఖ్యానమునఁ గాన వచ్చినది.

ఉదా:- ఆదితాళము

మరచితో విప్రాగ్ర గణ్య ॥పల్లవి॥
ధరణిసురా విరాగివర ॥అను॥
సమిథలకై గురుసతి మము నను పగ
విమలమతిన్ విపినగతిఁ జనుట ॥చర॥ మరచితో

27. తేవారము :—ఇదియొక దైవస్తవ పరమైన దాక్షిణాత్య పద్యప్రబంధవిశేషము. మాత్రాఛందోఘటితము. (ఇందలి 'తేవ' సం॥ దేవశబ్దమునకు తమిళ తద్భవ మనుకొందును). 19-20 శ. సంధి కాలపు య. గా. లందెక్కువగాఁ బ్రయుక్తమైనది.

ఉదా: గుండు అద్వైతబ్రహ్మశాస్త్రి సత్యభామా పరిణయము నుండి:

సరస యోగీశ్వరేశా । సన్నుతామర రమేశా
వరకృపాదృష్టిజూపి । వంతయంతయును బాపి
అరసి నా దరికి డాసీ । యనుజు గానంగజేసీ
నరహరీ చిత్స్వభావా । నన్నుగానంగ రావా ॥

నాల్గుపాదములు—పండ్రెండు మాత్రల దళములు పాదమునకు రెండు, రెండవ దళము ప్రథమాక్షరము యతిస్థానము. రెండు దళములకు నంత్యప్రాస, నాల్గుపాదములకును సామాన్యప్రాసయు విహితములు. ఈ యతిప్రాస నియమము లన్నిట సమానమేకాని కొన్ని య. గా. తేవారములం దొకటి రెండుమాత్రల లాఘవము చూపట్టుచున్నది. (చూ. వేదాల తిరునారాయణాచార్యుల శకుంతలానాటకము) కొన్నిట తేవారము లచ్చముగా మాలినీ వృత్తములే (చూ. సత్యనారాయణ కథాసుధాలహరి).

28. తొహరా :- ఇది పైనుదాహరింపఁబడిన 'డోరా' కే మఱి యొక పేరేమో యని తోఁచుచున్నది. ఇంచుమించుఁగో ఆ లక్షణమే సరిపడును. గతి యచ్చముగా ఆ గతియే. 19 – 20 శ. య.గా. లందు గన్పట్టును.

ఉదా:- సత్యనారాయణ కథా సుధాలహరి నుండి -

ఎక్కడి యతివేమెఱుఁగవు సరసము
నేమిటి కడిగెదు నీవు
ముక్కు మూసికొని మునివై యుండక
ముచ్చటలకుఁ బొయ్యేవు.

29. త్రి భం గు లు :- 16 వ శతాబ్ది చివరినుండి యక్షగానములలో వీని ప్రాచుర్యము గన్పట్టు చున్నది. త్రిభంగి కవి జనాశ్రయము, కావ్యాలంకార చూడామణి, ఛందోదర్పణము, లక్షణ సార సంగ్రహము, అప్పకవీయము మొ॥ లక్షణ గ్రంథములందు 'ఉద్ధుర మాలావృత్తము' లందొకటిగాఁ బరిగణింపఁ బడినది. అందు తల్లక్షణము - ప్రతి పాదమున న-న-న-న-న-న-స-స-భ-మ-స-గ అను గణములు అనగా 34 అక్షరములు (42 మాత్రలు); పూర్వార్ధమున రెండుచోట్ల (10, 18వ అక్షరములు) ప్రాసయతి; ఉత్తరార్ధమున మూఁడు చోట్ల (25, 29, 34 అక్షరస్థానములు) అంత్యప్రాస. త్రిభంగి యొక గీతప్రబంధముగా - బృహద్దేశి (ప్రబంధాధ్యాయము శ్లో. 417) సంగీత రత్నాకరము (IV.272-73) సంగీత దర్పణము (IV.463 - 64) లందును ; ఒక తాళవిశేషముగా — సంగీతమకరందము (నృత్యాధ్యాయ తాళప్రకరణము - శ్లో. 44), సంగీతదర్పణము (తాళాధ్యాయము) లందును ; ఒక తాళప్రబంధముగా - సంగీతమకరందము (నృత్యాధ్యాయ తృతీయపాదము - శ్లో. 6) నందును చేర్కొ-నఁబడినది. కాని యీ లక్షణము లెవ్వియు య. గా. త్రిభంగులకుఁ బూర్తిగాఁ బట్టవు. వీని భంగి వేఱుగా నున్నది.

ఉదా : 1. జానకీపరిణయము నుండి

మీరకా చెంత జేరకా సీతఁ గోరకా
వెళ్ళిరో లాలా ॥౧॥
ఎగ్గునా నునుసిగ్గు నా మది తగ్గు నా
దాటిరో లాలా ॥౨॥

2. బల్లాణ రాజచరిత్రనుండి

మేడలూ పసిడి గోడలూ రంగు వాడలూ
పుణ్యచేడెలూ ॥౧॥
మేటులూ భటకిరీటులూ వీణెపాటలూ
రచ్చ చోటులూ ॥౨॥

చాల యక్షగానములందు త్రిభంగు లిట్లేయున్నవి. పాదాదిని గ్రహింపఁబడిన యొక మూఁడక్షరముల మాటకు రెండు మూఁడు మాత్రల యెడముతో మఱి రెండు మూఁడు ద్విప్రాసావృత్తులు గలిగించుట వీని లక్షముగాఁదోఁచును. మన లక్షణగ్రంథములందలి త్రిభంగి మాత్రాక్షర గణ నియమము దీనికిఁ బట్టదు. అయితే దానివలెనే యీ త్రిభంగులును పాదసంఖ్యానియమము లేనివి, మంజుల తాలావాలములు, అధికవర్ణ విశాలములు, అంత్యప్రాస త్రిభంగికములునైనవి. లయగ్రాహి, లయవిభాతి, లయహారీ త్యాదులతోపాటు పరిగణింపఁబడిన ఆ త్రిభంగివలెనే యివియు లయ విశిష్టములు. ఈ త్రిభంగులందు జంపె తాళగతి ప్రచురముగాఁ గన్పట్టుచున్నది. (గణపతిరెడ్డి గోపాలవిలాసమున త్రిపుట తాళగతి గల త్రిభంగులున్నవి). సం. మకరందమునఁ జెప్పినట్లు వీని నొకవిధమైన తాళ ప్రబంధము లనవచ్చును. కొన్ని య. గా. లందు వీనికి రాగతాళ నిర్దేశమును గలదు. (చూ. వాసంతికా పరిణయము - రేవగుప్తి - జంపె).

30. <u>త్రిస్తబకము</u>: త్రిభంగుల వంటి రచనావిశేషమే యిది. య. గా. లందు విరళప్రచారము గల్లది.

ఉదా : విష్ణుమాయా విలాసము నుండి

వింటిని యేల లొంటిని బాలఁ
గంటినివేళ నోలాల ॥౧॥
వెన్నెల తోడ పొన్నల నీడ
సన్నల గూడ నోలాల ॥౨॥

దీనఁ బ్రతిపాదము ఆద్యంత ప్రాసములు మూఁడుదళముల స్తబకము. (చివరనున్న 'ఓలాల' యన్న దొకయూఁతపదము). ఇట్టి మూఁడు స్తబకముల సమాహారమే త్రిస్తబకము.

భీమసేన విజయ మందలి త్రిస్తబకము దీనికంటె విలక్షణముగా నున్నది :—

సిరిమెరసిన రూపు । విరి దొరసిన చూపు
కెంపు మీరిన మోవి । పెంపు మీరినదేవిఁ
బ్రేమతోఁ గొలుతుఁ॥

దీన ఆద్యంత ప్రాసనియమము పాటింపఁబడినది కాని పై వానికంటె విలక్షణమైన గతి గలది. పాదమునకు రెండే స్తబకము లగుపించు చున్నవి. కాక 'సిరి-మెరసిన-రూపు' — ఇట్లే దళమున కా దళమునే గ్రహించినచో నందలి పదములు మూఁడును బిమ్మటి దళములోఁ గల పదములు మూఁటితోఁ బ్రాసాధర్మ్యము వహించియున్నవి కనుక అట్టి మూఁడు పదముల దళమునే యిందు త్రిస్తబక మనవలెను.

బృహద్దేశి త్రిభంగి లక్షణము దీనికిఁగొంచె మన్వయించెడు నట్లు తోఁచును—

" పదైః స్వరైస్తథాపాదై ర్వృత్తత్రయ పదేన చ
తాలత్రయ విమిశ్రేణ త్రిభంగి రభి ధీయతే "

31. దండెయాడింపుపాట: ఇది యొకవాద్య ప్రబంధము వంటిది. తాళ మృదంగవాద్య పురస్సరముగాఁ బూర్వము వివాహాది సందర్భములందుఁ బ్రవర్తిల్లుచుండినట్టిది.

ఉదా: కానూరి వీరభద్రకవి బసవ మహిమామృత విలాసము నుండి

బసవేశా భవనాశా అసదృశా అఖిలేశా
తరితికిటతోన్ త .... రా
ధికిట ధికిటతోన్ త్రిపుర విదారా॥

32. దిండి: వింతపేరు గల యీ రచనావిశేషము పసుమర్తి కృష్ణమూర్తిగారి పార్వతీపరిణయమున మాత్రము నాల్గు తడవలు ప్రయుక్తమైనది.

ఉదా: అని తల యూఁచిన యా బ్రహ్మచారిణ
విని గిరిసుత తన సకియచెంతఁ జేరెన్
కనుసన్నచే నాపెను దలఁపఁ గోరెన్
తన మనసు నపహరించినట్టి చోరున్

ఇది మాత్రాఛందోఘటితమైన యొకవృత్తమువలె నున్నది. పాదమునకు 18 మాత్రలు (ప్రథమపాదమున నొకటి తక్కువైన దిందు). నాల్గుపాదములకు నాద్యంత్య ప్రాసములు విహితమైనట్లున్నది.

33. ధవళము: ఇదియొక మంగళగీతము. ప్రాచీనకాలము నుండియు బహుయక్షగానములందుఁ బ్రయుక్తమగుచు వచ్చినది. 16 శ. నుండి మన ప్రబంధము లందును దీని ప్రసక్తి గన్పట్టును చాల యక్షగానము లందిది —

(1) గ్రంథాంతమున ముత్తైదువలు హారతులు పట్టు సందర్భమునఁ గన్పట్టును. (చూ. అగస్త్యరాజు రామన సీతాకళ్యాణము).

నీని నొక హారతిపాట యనవచ్చును. 'అత్తరి నయిదువ లారతు లెత్తుచు ధవళములు పాడ' అని బిల్హణీయము 3.210. కొన్నిట నీని తరువాత మంగళ హారతి పాటలు వేఱ యున్నవి. (చూ. విష్ణుమాయావిలాసము). (2) తఱచు శోభనగీత పురస్సరముగాఁ గన్పట్టును. (ధవళశోభనముల నెడబాయని జంట కొక సామెతగాఁ జేర్కొనవచ్చును). (3) సర్వసాధారణముగ స్తోత్రపార ప్రచురము జయశబ్దాది సంబుద్ధిగుచ్ఛము నైయుండును. దీని నొక కైవార గీత మనవచ్చును. (చూ — వి. మా. వి.) అయితే కిరాతార్జునీయము, శారద కురవంజి కట్టణములందు ధవళము జయశబ్దాది కాదు. రెండవదాన నది కథాకథనమునకును నుపయుక్తమగుట విశేషము) (4) మధురగతి ప్రకృష్టమైనది. సాధారణముగాఁ బాదమునకు నాలుగు మాత్రల దళములు మూఁడేసి యుండును. రెండేసి పాదముల కంత్యప్రాస కన్పట్టుచున్నది. అప్పకవీయమున ధవళమున కొక లక్ష్యము గలదు (IV. 402) అం దిది జయశబ్దాదిగా లేదు. చతుర్మాత్రాకదళములు పాదమున నాలుచొప్పునఁగలవు కాని మధురగతి స్ఫుటముగా నున్నది.

గౌరీకల్యాణమునకు శంకరాభరణమునఁ బాడఁబడు సంప్రదాయమున్నట్లు ధవళమునకు భైరవి, పాడి రాగములందుఁ బాడఁబడు సంప్రదాయమున్నది:

> 'జోడుగఁ గూడి ప్రోడగమి చొక్కపడన్ ధవళంబు భైరవిం
> బాడిని పాడి రిద్దఱు జపా కుసు మాధర లా ధరాధి నా
> థోడు కళత్ర నేత్రయుగ ళోత్పలముల్ వికసిల్ల వల్లకీ
> గౌడవరాళి వైరి కలకంఠ గళోద్య దనర్గ ళధ్వనిం'

—కాకమాని మూర్తి పాంచాలీ పరిణయము (4.10)

పాంచాలీ పరిణయమున గౌరీకల్యాణమునకంటె ధవళము విశిష్ట మైనదనియు సూచింపఁబడినది —

' గౌరికల్యాణమున కేమి కంతుఁగన్న
తల్లి ధవళంబు పాడరాదా లతాంగి ' (1.22)

సంగీత రత్నాకరమున ధవళ మొక గీతప్రబంధ విశేషముగాఁ బరిగణింపఁబడినది. (IV. 298-302) : —

'త్రివిధో ధవలః కీర్తిర్విజయో విక్రమ స్తథా
చతుర్భిశ్చరణైః షడ్భిరష్టభిశ్చ క్రమాదసౌ॥

* * *

ఆశీర్భిర్ధవలో గేయో ధవళాది పదాన్వితః
యదృచ్ఛయా వాధవలో గేయో లోకప్రసిద్ధితః' ॥

అనఁగా ధవళము కీర్తి, విజయ, విక్రమము లని త్రివిధము. అవి వరుసగా 4, 6, 8 పాదములుగలవి. వీనియందు మాత్రా నియమము వివిధముగా నున్నది. ఈ పాద నియతి మన య. గా. ధవళములకుఁబట్టదు. అందెనిమిది కంటె నెక్కుడు పాదములనియు నున్నవి. సం. ర. ధవళము ధవళాది పదాన్వితమైన ఆశీర్వాద గేయము. మన ధవళ మొక 'కైవార గేయము. మంగళగీతము. అయితే యిది 'యదృచ్ఛయా' - అనఁగా 'ఉక్తగణ నియమరాహిత్యము' తో (కళానిధివ్యాఖ్య), 'లోక ప్రసిద్ధితః' - అనఁగా 'వర్తమాన లక్ష్యానుసారము' పాడఁబడు నని యుందే చెప్పఁబడినదిగదా.

మన యక్షగానములందుఁ దఱచుగా దాని స్వరూప విశేషములందును :

'జయ జయ దురిత విదూరా
జయజయ చిత్తవిచోరా
జయజయ దరమృదుహాసా
జయజయ దనుజ నిరాశా'

— ఓబయ గరుడాచలము.

(ధవళశబ్దమునకు కర్పూరవిశేషమనియు నర్థము. కర్పూరము తెల్లనిది. ఆరాత్రికముఖ్యద్రవ్యము. అందులకే హారతిపాటకును ఆ పేరు వచ్చియుండును).

34. నలుగుపాట: ఇదియొక పెండ్లి వేడుక పాట. దీని రచనకొక నియతి యుండదు. చెండ్లాటకు ఏలలు, తలంటునకు శోభనములు నుపయోగింపఁబడినట్లే దీనికి ధవళములు నుపయోగింపఁబడుట కద్దు. (చూ. నందిపాటి మిత్రవిందా పరిణయము). ఇట్టి పాటలు సాధారణముగా ఆపనిపాటల కనుగలమైన గతిస్ఫురణ గలిగియుండును. దీన ఆదితాళానుకూల గతి తఱచు కన్పట్టును.

ఉదా: అన్నపూర్ణాపరిణయమునుండి —

'నలుగిడ పిలిచేరె నవమోహనాంగి
చెలువ యన్నపూర్ణ చేరిరావమ్మ'

(త్యాగయ్యగారి ఉ. సం. కీర్తనలలోనున్న మూఁడు నలుగుపాటలకును ఆదితాళమే యుదాహరింపఁబడినది).

35. నోటు: ఇది యొక పాశ్చాత్యమట్టో, హిందుస్తానీ రాగవిశేషమో అయియుండును. దీని నడక చక్కఁగా సాగునది. ఒక్క బాగేపల్లి అనంతరామాచార్యులవారి కృతులందే తఱచు గన్పట్టును.

ఉదా: వారి సుభద్రాపరిణయము నుండి—

'జయశేష శైలవాస భక్తసంఘ రక్షక
భయకారి బహుళదుష్టదనుజ సంఘ శిక్షక'

పాదపాదమునకు మాత్రలు 5+6+6+4.
రెండేసి పాదములకుఁ బ్రాస నియతము.

36. బంతులాట పాట: ఆండాళు చరిత్రమున —

'చెండ్లాడిరి శ్రీ కోదెయు రంగడు కూడుకొని
కండ్లాసైగలు సేయుచును
మరి కలికియు కులుకుచు బలుకుచునూ
బాజీ బంతులు జారగ పయ్యెద
వీడగ, నడు మసియాడగనూ'

అను చెండ్లాట పాట వెనువెంట నేఁటుగా

'బంతులాడేరు చూడరే వింత చామంతి
బంతు లాడేరు చూడరే ॥
బంతు లాడేరు మీరి అరవిరి పాన్పుజేరి
కంతు జనకులంత కోదెనాయకిఁ గూడి॥

అను బంతులాట పాట గలదు. ఇట చెండ్లాట యన్నను బంతులాట యన్నను నొక్కటే కాని, రెండిట గతి భేదము మాత్రము గన్పట్టు చున్నది.

37. మంగళము:- మంగళము, హారతి, ఆరతి, ఆరాత్రికము, నివాళి, ధవళము మొదలగు బహువిధ నామములతో, బహుగతులతో నీరాజన ప్రయోజన పురస్సరమైన యీ గీతము బహుయక్షగానములందుఁ బ్రయుక్తమైనది. సామాన్యముగా షష్ఠ్యంతముగను, పాదాద్యంతముల మంగళశబ్ద పురస్సరముగను నుండును. సంగీత

రత్నాకరమునను గీతప్రబంధములో నిది పేర్కొనఁబడినది (IV.303). ఇది సాధారణముగ గ్రంథాంతములందుఁ గన్పట్టును. కొన్ని దక్షిణాంధ్ర యక్షగానములలో ముఖ్యముగా శహాజీ ప్రభృతుల కృతులలోఁ గొన్నిట గ్రంథాదియందును 'తోడియలేక తొడై మంగళం' అనుపేరఁ గొన్ని చక్కని కీర్తనలు కానవచ్చుచున్నవి. అవి తాళ్ళపాకమువారి కీర్తనలే. (కొన్ని యక్షగానములందు నడుమను తాళ్ళపాకవారి కీర్తనల ప్రసక్తి వచ్చినది). వానికీనాఁటికిని దక్షిణ దేశమున మంచి ప్రచారము గలదు. దక్షిణ దేశమున హరికథా కాలక్షేపములు, భాగవతమేళ నాటకములు, భజన కూటములు వానితోడనే ప్రారంభమగు సంప్రదాయ మేనాఁటినుండియో నేఁటికిని సాగివచ్చుచున్నది. తోడియ/తొడై మంగళం- అనఁగా తొలి మంగళమని యర్థమైయుండును. (గ్రంథాంతమున వేఱే మఱియొక మంగళ ముండునుగదా). అది యైదు కీర్తనల సంపుటి. వాని పల్లవి రేకులు :—

(1) నాట – జంపె : జయ జానకీ రమణ
జయ విభీషణ శరణ

(2) ఆరభి—మిశ్రచాపు: శరణు శరణు సురేంద్ర సన్నుత
శరణు శ్రీసతి వల్లభ

(3) మధ్యమావతి – ఆది : నారాయణ తే నమో నమో
నారద సన్నుత నమో నమో
మురహర నగధర ముకుంద మాధవ
గరుడ గమన పంకజనాభా

(4) సావేరి – రూపకం : దేవేశ గణారాధిత దివ్యాంబుజ పాదా
శ్రీ వేంకటగిరి నాయక శ్రీశా హెచ్చరికా

(5) పంతువరాళి—ఆది : మాధవ భవతు తే మంగళం
మధుమురహర తే మంగళం

( ఇవి తాళ్ళపాక చిన్నన్న గారి రచనలైనట్టు నాకు శూలమంగళం భాగవతులు సెలవిచ్చినారు. ఇందుఁగొన్ని తిరుపతి దేవస్థానమువారు ప్రచురించిన తాళ్ళపాక సంకీర్తన సంపుటములందుఁ గొన్నిటఁగన్పట్టుచున్నవి).

38. మేలుకొలుపు : ఇదియొక వైతాళిక గీతము. చిరప్రసిద్ధమైనది. య. గా. లందుఁ దఱచుగనే కన్పట్టును. తఱచు దేశాక్షి, మలహరి, దేవగాంధారి, భైరవి, బౌళి, సౌరాష్ట్ర మొ॥ ఉదయరాగములలో నుండును. భూపాలరాగము తోడి దాని యను బంధము కడు ప్రసిద్ధము.

ఉదా : ఆండాళ్ళు చరిత్ర నుండి –

జాము ప్రొద్దున లేచి భామలను మేల్కొలుపుకొనుచు
నీలవర్ణుని ద్వారముననూ నిలిచి లేపిరిగా
కృష్ణ మేలుకోరె॥

39. రాసప్రబంధము :- 'రాసము... నాట్యకథా ప్రబంధనోల్లాసము, బంధచిత్రిత విలాసము... మండలీకృత విభాసిత తాళలయానుసంధవిన్యాసము' అని శ్రీ గోపాలకృష్ణ విలాసమున రామాయణము వేంకటనరసింహాకవి వక్కాణ. భాగవత దశమ స్కంధమున "శంఖపద్మవజ్రకందుక చతుర్ముఖ చక్రవాళ చతుర్భద్ర సౌభద్రనాగ నంద్యావర్తకుండలీకరణ కురళీబంధ ప్రముఖంబులు" రాసక్రీడాబంధములుగాఁ జెప్పఁబడినవి. (ఇందు చక్రవాళ చతుర్భద్రములు కావ్యభేదములుగను మన లాక్షణికులచేఁ బరిగణింపఁ బడినవి. చూ. కావ్యాలంకార చూడామణి (IV.34-39) అట్టి రాసబంధముల నృత్యప్రక్రియ కనుకూలమ్ములగు గీత ప్రబంధములే రాసప్రబంధములు ఒక విధమైన రాసక ప్రబంధ లక్షణము సంగీత రత్నాకరమునఁ గలదు. (IV 352-355)

'అంగనా మంగనా మంతరే మాధవో
మాధవం మాధవం చాంతరేణాంగనా
ఇత్థమా కల్పితే మండలే మధ్యగ
స్సంజగౌ వేణునా దేవకీనందనః'

అని రాసమండల స్వరూపము ప్రసిద్ధము. దీనిగూర్చి కానుకొలను వెంకట దాసు అనుకవి తన "శ్రీకృష్ణనాటక యక్షగాన మహాప్రబంధ రాస క్రీడా విలాసము"నం దిట్లు వ్రాయుచున్నాడు :-

ఎందరో సుందరు లందరి కందరు
నందతనయులై పొందుగ నిలిచియు
నందివేణువుల మధురాధరముల
యందుఁ జేర్చి యిం పొందఁ బాడ

కమలకర్ణికా కారంబునఁ జిత్రముగ మండలత్రయ మధ్యగుఁడై " హరి నాట్యము సల్పెననుచు నొకచక్కని రాసప్రబంధము రచించెను. అది:-

జంఝూటి — ఆది

ఆనంద మానందము హరి రాసవిలాస
మానంద మానందము ॥పల్లవి॥
నానా గానాభినయ నాట్యమండల
తానమాన స్వరతాళాంచితము
బ్రహ్మానంద॥ అనుపల్లవి॥
సప్తస్వర ప్రస్తార విస్తారము
సప్తతాళగతిసార ముదారము॥౧॥
సమధిక్షైక పాద సమపాదముఖ్య నా
ట్య మహోదంచిత మత్యద్భుతము ॥౨॥
ఆననాక్షిహస్తా ం
మానము నిరుపమాన తానమానము ॥౩॥
సకల భువభళ్ళర ప్రపక్తము
ప్రకట సూర్యేందు సుపర్వమండల యుక్తము ॥౪॥
కానుకొలను వేంకటదాస మానస
స్థానభాసమాన సవిశేషము ॥౫॥

40. లఘువులు :- లఘుప్రచురమై పాదమునకు నాలుగేసి మాత్రల దళములు నాలుగు గలిగి, తొమ్మిదవ మాత్రాస్థానము యతి స్థానమై, రెండేసి పాదములకు ప్రాసనియతి గలిగి, మధుర గతితో ఏక తాళి రేకులవలె నడచు రచనావిశేషము. ఇట్టివి కూరపాటి అమరలింగామాత్యుని పార్వతీకల్యాణమునఁ జాలగలవు. అందు వానికి పూరి, బేగడ, ఎరుకలకాంబోది, సౌరాష్ట్ర, కాంబోది నీలాంబరి మొ॥ రాగములును పేర్కొనఁబడినవి.

ఉదా : పశుపతి యనియెడు పశ్చిమ గిరిపై
కుశరుహ శర రవి క్రుంకెను నేడూ॥

ఇట్టి రచనావిశేషమే యించుక మార్పుతో విశ్వేశ్వరుని ధర్మపురి మాహాత్మ్యమున 'సమలఘువు' లని పేర్కొనఁబడినది. పై పార్వతీ కళ్యాణమునందే సమపాదములు మాత్రమ గుర్వంతమై కడమ యెడల సర్వత్ర లఘుప్రకృష్టమైన రచనావిశేషము సర్వలఘువు లని పేర్కొనఁబడినది.

ఉదా : కలికిని జిగి బిగి పలుకుల మధువులు
జిలికెడు చిలుకల కొలికిని దలఁతుగ॥

41. లాలిపాట :- ఇది యొక ఊయెల పాట. సర్వసాధారణముగ ఉంజల్, జోల పాటలవలె జంపెగతి గలదగుట గమనింపఁదగినది. (మాత్రలు$5^3+3$ లేక 4) అప్పకవీయోదాహరణముమాత్రము ఏక తాళిగతి గలది. ఇందావృత్తమగు 'లాలి' యను ఊఁతపదము 'లాలన' శబ్దసంబంధి యగునేమొ! ఈపాట ప్రతిజాతియందును బిడ్డపుట్టుక, భామపుట్టుక, అసలు పాట పుట్టుక యెంతప్రాచీనములో అంతప్రాచీనము. బహుయక్షగానములందుఁ బ్రయుక్తమైనది.

ఉదా :- అగస్త్యరాజు రామన సీతాకల్యాణము నుండి —

లాలి బంగరుబొమ్మ లాలి మా యమ్మా
లాలి ముద్దుల గుమ్మ లాలి సీతమ్మా॥

42. లా వ ణి : ఇది కన్నడ మహారాష్ట్రాది భాషాసంబంధియగు నొక పదచ్ఛందము. హిందీ హిందుస్తానీ భాషల సంపర్కమున నిది కన్నడమునఁ బరిణామము బొందినదని డాక్టరు డి. ఎస్. కర్కిగారి కన్నడ ఛందో వికాసమునఁ గలదు (పుట 252). 19శ. నుండి కొలఁది తెలుగు యక్షగానము లందును ప్రవేశించినది. దీని స్వరూప మిద మిత్థమని నిర్ణయించుట మిగుల దుర్ఘటముగా నున్నది ఒక్కొకచో నొక్కొక తీరుగా నున్నది దీనిగతి. అభిజ్ఞుల పరిశీలనార్థము కొన్ని మచ్చుల నేరి చూపింతును :-

(1) 'జయజయ చారు వికాసిత సదమల వదనా
వదనాంబుజాత సురాహిత హరణధురీణా!
ధురీణాఘ ప్రపీడిత జనపాలన కంకణధారా

— తిమ్మరాజు లక్ష్మణరావు రుక్మిణీ కల్యాణము.

ఇం దిది యొక చూర్ణికవలెఁ గన్పట్టుచున్నది. వందిమాగధులు శ్రీకృష్ణుని స్తుతించుట సందర్భము.

(2) కాంభోజి – ఆది

కొంకణ దేశాధీశుని విలు చే
కొమ్మని జనకుం డనఁగా
కొంకక కడుపున సంకట మనుచును
బొంకి యతఁడు పొమ్మనెనే॥

— గోపాల రామదాసకవి సీతాస్వయంవరము

ఇందిది పాదమునకేడు చతుర్మాత్రాకగణములు కలిగి మధుర గతిరగడ మరి ముప్పాతిక దూరము గుర్వంతముగా నరసాగినట్లున్నది. పంచమ గణాద్యక్షరము యతిస్థానము. ప్రాసయతియు గ్రాహ్యము.

(3) ఆదితాళము

పరిపంథి రాజుల నెల్లన్
పరిమార్ప నంతట వెళ్ళెన్ ॥పల్లవి॥
భండన పండిత భటసమూహములు
చండవేగ బహుకాండ నివహములు

— బాగేపల్లి వారి చంద్రహాస చరిత్ర

ఇందు లావణి రాగవిశేషముగఁ బేర్కొనఁబడినది.

ఈలక్ష్యములు మూఁడిట నొకగతి స్ఫురణగలదు గాని వీనికొక సామాన్యసూత్రము నేర్పరించుట దుస్సాధము. నే నెఱిఁగినంతలో ఇతరత్ర దీని ప్రసక్తివచ్చిన సందర్భములు : (1) మదరాసు ప్రా. లి. పు. భాం. నందు మధుర సౌరాష్ట్రసభ వారికిఁ జెందిన కుచేల, రుక్మాంగద, తామ్రధ్వజ చరిత్రములు, ద్రౌపదీ వస్త్రాపహరణము అను హరికథాకల్పములగు రచనల ప్రతులు గలవు ( ఆర్. నం. 1602 & 1608 ). అవి యన్నియుఁ దెలుగుఁ కృతులు. కాని వానియందు ఢోరా, ఖ్యాక్, సాపంగి, ఖడ్గా, ఛంద్, కేకావళి మున్నగు విజాతీయ రచనావిశేషములతోపాటు లావణియును గలదు.

ఉదా : స్యందనవారణ తురగ పంక్తిభి
స్తులితార్ణవ ఘోషం
చందనాంబు పరిషేచన విగళిత
సకల ఘర్మదోషం॥

దీన నొక నియతి కన్పట్టుచున్నది. పాదమునకు మాత్రలు $8^2+6+4$. రెండేసి పాదములకుఁ బ్రాస, అంత్యప్రాసయు విహితములు. యతి నియతి లేదు. చక్కని గతి చాలు దీర్చినట్లున్నది. (2) 'కన్నడ ఛందోవికాస' (పుట 245-46) యందుదాహరింపఁబడిన శ్రీరంగ పట్టణద లావణి పాదము $9^3+5$, వీరభద్రన లావణి పాదము 8 హ గణములు+4 లేక 6 మాత్రలును గలిగియున్నవి.

43. వర్ణము: వర్ణమను నొక గీత ప్రబంధము వర్ణతాళ త్రైవిధ్యముతో కర్ణాటభాషచే బిరుదోపనిబద్ధమగునది కలదని సంగీతరత్నాకరమునఁ (IV. 182) జెప్పఁబడినది.

రంగాజమ్మ రచించిన మన్నారుదాస విలాస నాటకమున (పుట 29) దాని స్వరూపమిట్లున్నది:-

లలిత స్వభావ! కలిత ప్రభావ!
రిపుభంగ కృతిచంగ! రణరంగ భీమ!
దిన ప్రదాన ప్రదాన ప్రధావిప్రహర్షణోజ్జ్వలా!
విజయ రాఘవ ధరాపురందరా!

ఇందిది సంస్కృతభాషయే, కర్ణాటముగాదు కాని వర్ణతాళ తాళ త్రైవిధ్యము గలదియు, బిరుదోపనిబద్ధమునై యున్నది.

44. విరాళిపదము:- ఒక్కబలభద్రదాసి కృతము- కపోత వాక్యమను యక్షగానము ప్రా.లి.పు.భాం. డి. నం. 1844 ప్రతియందీపేర నీ క్రింది రచన కన్పట్టుచున్నది:

సంతోషము శ్రీహరి దలంపఁగ
బంతము లాడుచుఁ బచరించి
కంతుజనకుఁడగు కర్పూర నిలయుని
వింతగఁ బాడుఁడి యేలల॥

ఇంచుమించిట్టి రచనా విశేషమే యీ కపోతవాక్యమునందే తం.స.మ. కే. నం. 474/75 ప్రతియందు 'వర్ణము' అనుపేర నిట్లుదాహరింపఁ బడినది :

కుచ్చిన ముత్యము కుందెన లోపల
నచ్చుగ కుంకము లమరించి
పచ్చలు తాపిన పసిడిరోకండ్లను
మెచ్చుగ దంచెదరో లాల ||

ఇది వట్టి యేకతాళి రేకు. ఇందెక్కడో క్రమ మించుక తప్పినను సాధారణముగా విషమ పాదములందు 4×4, సమపాదములందు 4+4+5 మాత్రలు నుండును. నాల్గుపాదములకు నొకటే ప్రాస.

45. శబ్దజతి : ఇది యొక తాళప్రబంధము వంటిది. లయ ప్రక్రియాప్రకృష్టమైనది. య. గా. లందటనటఁ గన్పట్టును.

ఉదా : భారతుల శ్రీరంగ కవి శ్రీకృష్ణలీలల నుండి –

తధణ ధణకిర్తక తధణ ధణతా
కుధరధర హరి మధుమదాపహా
ప్రధనశూరా నిధువన ప్రియ
మధురవేణు నినాద మోహన
బుధజనావన తధణ ధణతా
తీరుగా పులిగోరు పతకము
మీరి యురమున జేరి యాడగ
సారెకును నాభీరకాంతల
జీరి క్రీడల గేరుచున్
తధణధణతా తక్కిణాంతక
చొక్కమగు చేర్చుక్క మొగమునఁ
జుక్కరీతి వెలుంగఁజెవిపై
జెక్కు చీకటి మొక్కఁ గల్వల
చక్కి పెంపెస లాడఁగా||

ఇందు త్రిపుట తాళగతి గలదు. జతియన్నది 'యతి' శబ్ద వికృతి కావచ్చును. యతి తాళదశప్రాణములలో నొకటి; సంగీత రత్నాకరమున నొక వాద్య ప్రబంధముగాఁ బేర్కొనఁబడినది. జతి యనఁగా నొక గీత భేదమనియు, నాట్య-గాన యోగ్య శబ్దసంతతి యనియు సూ. రా. నిఘంటువు. శ్రుతి లయలు గాన ప్రధానాంగములు. శ్రుతి విశిష్టమైనది స్వరజతి, లయ విశిష్టమైనది శబ్దజతియుఁగావచ్చును.

స్వరజతి 3వ అనుబంధమున నుదాహృతము.

46. <u>శోభనము</u>: దాని పేరే చెప్పుచున్నట్లిది యొక శోభన గీతము. తఱచు వివాహ సందర్భములందు మంగళహారతుల వేళను, మంగళస్నానాదిక సమయములను దీనికి వినియోగము. చిరప్రసిద్ధము, బహుయక్షగానములందుఁ బ్రయుక్తము నైనది. తఱచు ధవళము తోడి జంటపాటవలెఁ గన్పట్టును. ఇది యాడువారి వేడుక పాట. కాని విష్ణుమాయావిలాసమున 'తాళధ్వనితో వేమఱు నటియించుచు వీణాముని నారదుఁడు శోభనము వినిపించెన్' అని యున్నది. ఇది సాధారణముగా షష్ఠ్యంతము. చివర 'శోభనమే' అనున దూఁతపదముగా వచ్చుచుండును. దీని రచనా ప్రక్రియ కొక నియతి లేదు. గతి వైవిధ్యము బహుళము.

ఉదా :- వెంగమాంబ శివవిలాసము నుండి

గిరికార్ముకముగ నొనరించి
ఉరగము నారిగ బిగియించి
ఒనరఁగ శ్రీహరి యనుబాణము దొడిగి
పురములు గెలిచిన పుణ్యులకు
శోభనమే ॥శోభనమే॥

47. సంగీత మకరందము :- ఏకోజీ విఘ్నేశ్వర కల్యాణ మొక్క-దానఁ గన్పట్టు చున్నదిది :-

వీడెవ్వడే యో యమ్మా
జోడు గూడ రమ్మనె నమ్మా ॥౧॥
సరసముగ మాటాడీనమ్మా
సరసుడు వీడెవ్వడో యమ్మా ॥౨॥
చన్నులంట వచ్చినమ్మా
చక్కె-రమోవి యిమ్మనె నమ్మా ॥౩॥

చరణమునకు 27-30 మాత్రలు గన్పట్టుచున్నవి. మాత్రల యంతర మెట్లున్నను నొక గతిస్ఫురణము గలదు.

48. సువ్వి - సువ్వాల : ఇదియొక దంపుళ్ళపాట. చిరప్రసిద్ధమైనది. బహుయక్షగానములందు వివాహ సందర్భములందుఁ బ్రయుక్తమైనది. దీనికి సువ్వలాలి, సువ్వాల, సుంకులపాట, కొట్నముల (కొట్టడము-కొట్టణము-కొట్నము) పాట యనియు నామాంతరములు గలవు. ఇది సువ్వాల ద్విపద, సువ్వాలధాతువు అను పేర్లతోఁ గూడఁ గొన్ని యక్షగానములందుఁ గన్పట్టుచున్నది. (వీని విషయము 1వ అనుబంధమునఁ గొంత ప్రసక్తమైనది). సువ్వి - 'a chorus used by women at marriages when pounding rice' అని కన్నడ నిఘంటువు లందును జేర్కొ-నఁబడినది. సువ్వి యన్నది ధ్వన్యనుకరణ శబ్దము, నూఁతపదమును గావచ్చును. రోకటి పోటున కెన్ని యొడుపులుండునో యీ పాట కన్నిగతు లుండును. అందు తురగవల్గన గతికి ప్రాచుర్యమధికము.

కొన్ని యక్షగానములందు 'సుంకులు దంచేపాట' సువ్విగను, 'సుంకులు చెరిగేపాట' సువ్వాలగను గన్పట్టుచున్నది. (సుంకులు చెరిగేపాట అల్లోనేరేడుగను బరిగణింపఁ బడినది. చూ. మీఁద).

ఉదా:- 1 అ 'సుంకులు దంచే పాట':

సువ్విగోపాల బాల! సువ్విసద్భక్తి పాల
సువ్విభాసుర కపోల! సువ్వలాలీ॥

ఆ 'సువ్వాలపాట': శంకరాభరణ-ఏక:

వారిజ సన్నిభలోచనా। భక్త
వత్సల పాపవిమోచనా
కారుణ్య సాగర ఖగరాజ వాహన
మారజనక సుకుమార శరీరా ॥సువ్వాలే॥

— నందిపాటి మిత్రవింద

2. 'సుంకులు చెరిగేపాట':

శ్రీరఘువీరు పెండ్లట - మన
సీతను ఇస్తామన్నారట
గారవంబుతోడ గరితలెల్లఁగూడి
కోరికతో పెండ్లికొడుకును శాయరె ॥సువ్వాలె॥
సీతాను యిటు బిలుపించరె - పెండ్లి
కూతురికి శృంగారించరె
చాతురీ మెరయాగ సతిపతు లిద్దరిని
ప్రీతితో నొకచోట ప్రియభక్తి నుంచారె ॥సువ్వాలె॥

— మామిళ్లపల్లి ఏకాంత సేవ

(తాళ్లపాక అన్నమయ్యగారి సువ్విపాటల గతులు — చూ. సం. III. పుట 282-287-వీనికంటె ఖిగుల విలక్షణముగా నున్నవి. వానికి కేదారగౌళ, భూపాల రాగములును జేర్కొనఁ బడినవి.)

49. హెచ్చరిక: ఇదియొక సౌఖశాయనిక గీతము. ఇందు పాదాంతమున హెచ్చరిక యన్న దొక యూఁత పదముగా వచ్చును. కొలఁది యక్షగానములందు ముఖ్యముగా ఏకాంత సేవ - పల్లకి సేవా ప్రబంధము లందును బ్రయుక్తము.

ఉదా : నుదురుపాటి వెంకనార్యుని పార్వతీ కల్యాణమునుండి —

సావేరి - రూపకము

శ్రీ మాధవ నుతవైభవ శివ చిన్మయరూపా
చామీకర ధరణీధర చాపా హెచ్చరికా ॥౧॥

సరసీరుహ సంభవముఖ సురపూజితపాదా
పురదానవ వరదావాంభోదా హెచ్చరికా ॥౨॥

హిమభూవర తనయాముఖ హేమాంబుజ భృంగా
రమణీయ తరామ్నాయతురంగా హెచ్చరికా ॥౩॥

తాళ్ళపాకవారి 'తోడియం' గీతసముచ్చయమున నొక హెచ్చరికయు, సారంగపాణి పదములం (పుట 97, దొక హెచ్చరికయుఁ గలవు. ఆ రెండును, ఈ వెంకనార్యునిదియును మూఁడును సావేరిరాగ రూపకతాళములందే యుండుట విశేషము. మూఁడింటను చక్కని గతిస్ఫురణ గలదు. మూఁడిటను దళమునకు మాత్రలు $6^3+4$. రెండేసి దళములకుఁ బ్రాస విహితము. ప్రతిదళమున 12 మాత్రలకుఁ బైని యతి. ప్రాసయతియు గ్రాహ్యము.

సారంగపాణిదే మఱియొక హెచ్చరికయు (పుట 96), త్యాగయ్య ఉత్సవసంప్రదాయ కీర్తన లందలి దొక హెచ్చరికయు జంపెతాళమున నున్నవి. వానిలో దళమునకు $5^3+3$ చొప్పునఁగలవు మాత్రలు.

ఏకాంతసేవా ప్రబంధములందు హెచ్చరికలు వచన ఘటిత ములుగను గూడ నున్నవి. (చూ. ప్రా. లి. పు. భాం. డి. నం. 1842 &1898). అవి చక్కఁగా నొక సన్నని రాగవరుసతో దేవదాసీ జనముచే పఠింపబడుట సంప్రదాయము.

*  *  *

## సంవాద పదములు

ఇవి పదప్రక్రియను బట్టి ప్రత్యేకత గలవి కావు. సందర్భ మునుబట్టి బహు ప్రత్యేకత గలవి. బహుయక్షగాన సామాన్యముగా ముఖ్యముగా యక్షగాన ప్రత్యేకశాఖలగు భామ కలాపము, గొల్ల కలాపము, కొఱవంజి అనువానియందు జనరంజక సాంప్రదాయిక పాత్రలచేఁ బ్రవర్తితములగుచు తరముల తరబడి ఆంధ్రజన సామా న్యము నాబాలగోపాలము నుల్లాసవారాశి నోలలాడించుచుఁ బ్రచుర ప్రచారము పొందినట్టివి. వీనియందొక విధమైన మోటుదనము, మోటుదనముతో పాటొక హాస్యపువాటము, ఒకవిధమైన వెటకా రము, వెటకారముతో పాటొక చమత్కారమును గలవు. అవి యీ నాటి జనులకు వినోదపువిందులు గూర్చినట్టివి.

1. సవతికయ్యము :— తొలుదొల్త పారిజాతకథేతివృత్తము లగు యక్షగానములందును, భామకలాపములందును, తత్రాపి తత్స దృశముగా సత్యారుక్మిణులవలె గంగా పార్వతులు మొదలగు సవతి జంటలు గల అనేక యక్షగానము లందును వారి సవతి మచ్చరము సందర్భముగా నొక సంవాదపదము (అది నిజముగా వివాద పదమే) గన్పట్టును.

సత్య : మంచీది కానీవె రుక్మిణీ
రుక్మిణి : వేలు వంచాలేవె సత్యభామినీ

...

సత్య : చిన్నదాన నని చూచితివో
ఎన్నడు నా చెయ్యెరుగవులే
నిన్ను గుద్దితే నీకై వలచిన
వాని గుండెలే యదరవలెన్

ముద్దరాలనని చూచితివో
పద్దుగ నాచెయ్యెరుగవులే
హద్దుగ గుద్దితె వానికి నీకును
చద్దికి వేడికి చాలవలెన్.

రుక్మిణి : సాదురాలనని చూచితివో
సకియరొ నాచెయ్యెరుగవులే
చరుపు చరిచితే వానికి నీకూ
పరుపు పానుపై యుండవలెన్.

అధమురాల నని చూచితివో
అదపులు ఎన్నడు నెరుగవులే
అదపులు చేసితె నీవును వాడును
అద్దుమీరక యుండవలెన్.

కళాపూర్ణోదయములో (3-195,96) నీ సవతి కయ్యపుఁ బట్టు రంభా మాయారంభల వివాద వ్యాజమున రమణీయముగాఁ జిత్రింపఁబడినది. ఈ విషయముగూర్చి కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రి గారు తమ సుగ్రీవ విజయపీఠికలో నిట్లు వ్రాకుచ్చి యున్నారు: "ఈ భాగవత కథలలో పారిజాత హరణకథ హృద్యతర మగుటచే దానికిఁ బ్రచార మెక్కువయ్యెను. అది హృద్యతరమగుట కందలి సవతుల కయ్యపుఁబట్టు ప్రధానకారణము. దీనినిఁబట్టి యక్షగాన సామాన్యమునకుఁ బారిజాతము లనియుఁ బేరయ్యెను. ఏ యక్షగానముఁ బ్రదర్శించినను అందు సవతుల కయ్యపు బట్టునకుఁ బ్రసక్తి గల్పించుటయో లేక పారిజాతమునందలి తత్కథాఖండమునే స్వతంత్రముగాఁ బ్రదర్శిం

చుటయో పిదప నేర్పడెను. (భామకలాపము స్థితి యిట్టి పరిణామ ఫలితమే కావచ్చును). ఈ సవతుల కయ్యపు కథపట్టు హృద్యతర మగుటచే బ్రబంధకవులను గూడ నిది వలపించెను". ఈ కథపట్టును బ్రదర్శించునపుడు పాత్రధారులపట్లఁ బాటతోపాటు గొంత ఆంగికాభినయ మావశ్యకమగును. కావుననే విజయరాఘవుడు తన ప్రహ్లాదచరిత్రమున 'సవతిమచ్చరము' నొక నాట్యప్రభేదముగఁ బరిగణించెను.

2. సుంకరి కొండయ్య – గొల్లభామ : గొల్లకలాపమున తఱచు వీరి సంవాదము గాన నగును. అది కొన్నిట సరసము, కొన్నిట విరసము గను నుండును. అందు సరసపు సందర్భమునే గ్రహింతము.

కొండయ : అర్ధరాత్రి వేళా నేను । రుద్రవీణె దీసూకోని
ప్రొద్దుబోక నిన్నేపాడాగా । ఓహో గొల్లదానా!
భల్లు భల్లున తెల్లవారెనే॥

గొల్లభామ . కీలుకట్లా తేరుమీదా । కిన్నెరాలు మీటేజాణ
కన్నులెత్తి నన్ను జూడరా । ఓనా హొయలుకాడ!
కిన్నెరాకు కాయ లంపేనూ॥

కొండయ : కన్నె రాతిరి వస్తా వనుచు । పట్టిమంచం బరుచుకు కూకుంటె
రాతిరి నీవు రాకపోతివె । ఓగొల్లభామా!
రాతిరే శివరాతి రాయెనూ॥

గొల్లభామ : కన్నెరావీ చెట్టుకిందా । సన్నసూదులు దంచాగా
సన్నజేసీ సున్నమడిగేవు । ఓవన్నెకాడా!
సన్న లెరుగా । చిన్నదానార॥

కొండయ : ద్దు మాముదాలూ గోనె । యెద్దుమీదవేసుకోని
కానరాని గట్ల లోనికి । ఓగొల్లదాన!
కాపురము శాయబోదామూ॥

గొల్లభామ : కట్లకట్లా కడవగొంచూ! మెట్లబావికి నీళ్లకు బోతే
మెట్టుజారి నూతబడితినిరా । ఓవో వన్నెకాడా!
రెట్ట బట్టి లేవదియ్యారా॥

గుబ్బలుండే తీరుజూచి । గుటకాళే మింగేవురా
గుండెగలా జాణవైతే । ఓవో వన్నెకాడా !
గుబ్బ పట్టీ దెబ్బ తియ్యారా ॥

సన్నాలు సైగాలు చేసి । సన్నావు నవ్వులు నవ్వి
క్రొన్నెలా మోము దీర్చుకా । ఓ నా హొయలుకాడా !
నన్ను సుంకము గొనగ వస్తివా॥

ఇం దీ సంవాద మంతయు ఏలలలో సాగుట గమనింపఁదగినది.

3. సింగి – సింగడు : ఎఱుకత పాత్రకుఁ బ్రత్యేకత గల యక్షగానములలో కొఱవంజులలో సింగి యెఱుక జెప్పి జాలము సేయగా సింగ డాలము సేయుచు నామె నన్వేషింప వచ్చును. ఆమె సంపాదించిన సొమ్ములు చూచి యామె ననుమానించును. ఇక నిద్దరికి వివాద సంవాదములు :

సింగి : అదా యిన్నెడ యింగేవాడా సింగా
గుడిసా విడిచీ యేలా వస్తివిరా వెఱ్ఱిసింగా !
సింగడు : గుడిసాలోకి ఎలుక వచ్చె కలికి సింగి నేను
జడిసి నీతో చెప్పవస్తి జాణసింగి !

* * *

సింగడు : కొంగ గువ్వ చెవుడుకాకి జంగుపిల్లి పూరెడు రంగుమీర దెచ్చి
పెడితె దొంగనసుకులా
సింగి ! దొంగనసుకులా ?
సింగి : ఇగురబోండ్ల కెఱుక దొడ్డనగరులందు జెప్పితె స్తె
తగరు వలెను మెక్కినీవు పొగరు కొంటివా
సింగా ! పొగరు కొంటివా ॥

# అనుబంధము
# 5

## యక్షగాన శబ్దజాలము

యక్షగానముల భాషాస్వభావమును గూర్చిన ప్రసక్తిమీఁద వచ్చినది. యక్షగానములం దిప్పటివఱకు మన నిఘంటువుల కెక్కని అపురూపమైన శబ్దజాల మెంతో నిక్షిప్తమైయున్నది. అందు నిఘంటువుల కెక్కినను మన ప్రబంధ వాఙ్మయమున తగిన ప్రచార మేర్పడనిది కొంతయు, నిఘంటుమాత్ర శరణ్యమైనది కొంతయును, యక్షగాన ప్రయోగమున అర్థాంతరమును సూచించునది కొంతయును గలదు. పలువిధముల విశిష్టమైన యక్షగాన పదజాలము గొంత వర్గీకృతమై యీ దిగువ నుదాహరింపఁబడుచున్నది :–

### 1. విశేష శబ్దములు

ఈ శీర్షిక క్రిందివి మాత్రము చాలవఱకు శబ్దరత్నాకరము, సూ. రా. నిఘంటువు, శబ్దార్థచంద్రికలందు లేనివే. కొద్దిపాటియున్నను అర్థభేదమున్నది.

ఆయిత్తారాలు. ఆదివారాలు (మన్నారు దాస విలాసము)

ఉభయతోపట్టు. ఉభయతోముఖియైన (ఈనుచున్న) గోవునుదానము (ఇది మంచిదానమఁట) పట్టు (మ.దా.వి.)

ఉరతణీ. (కన్నడ–ఉరటణి)సత్కారము (లేపాక్షిశివనాటకము)

ఉరాటం. ఉరిత్రాడు (సరస్వతీ కల్యాణము)

కడలాలిదోషము. వైధవ్య దోషము (వీరభద్రకవి సీమంతినీచరిత్రము)

కాలనీళ్ళు. దిష్టితీసిన పసుపునీళ్ళు మొ॥ (వెంకటాంబరామాయణము)

కీచంటెబిడ్డ. తల్లి ౨ గాల కెడపడి చిక్కిపోయిన బిడ్డ (గంగాపార్వతీ సంవాదము)

కూకుండు. (గ్రామ్యము) కూర్చుండు (చెంగల్వరాయని ఎఱుకల కథ)

కూత్తు. (తమిళ్-కూత్తు) నాట్యము (తంజా పురాన్నదాననాటకము)

కేరి. ఉనికిపట్టు (విజయ రాఘవ చంద్రికావిహారము)

గంత. (బొంత-శ.ర.) వక్కలాకులతిత్తి (శహాజీ జలక్రీడలు)

గవిణేరు. గవర్నరు (పురిజాల పారిజాతము)

గాచారము. గ్రహచారము (శచీ పురందరము)

గాణబయకారు. వాగ్గేయ కారుడు (మ. దా. వి.)

గుడుగుడుపవాడు. శకునపక్షిగాడు. (వెం. కృ. జెట్టి శివపారిజాతము)

ఘడియారం. రూపాం. గడియారము (మ. దా. వి.)

జన్నెవారము. ఆదివారము. (పోట్ల దుర్తి గొల్లకలాపము)

డీడిక్కిసలాడు. డీకొట్టుట (అకలంక కృష్ణమార్యుని కృష్ణవిలాసము)

తారా. దీపావళి సంభారవిశేషము. (చిత్రాంగదవిలాసము)

తిరువళిక. దేవునికిఁ బెట్టిన దీపము (విజయరాఘవుని పూతనాహరణము)

దిట్టత. గట్టితనము (వెంకటదాసు ధర్మాంగద)

దినశుద్ధి. పంచాంగమునుబట్టి సదసద్దిన నిర్ణయము (తంజాపుర—)

దివాళి. దీపావళి (మ దా.వి.)

దుగ్ధ. కౌతుకతీవ్రత (త్యాగయ ప్రహ్లాద)

దొరాదొరలు. పెద్దపెద్ద ప్రభువులు (లీలావతీకల్యాణము)

నటముటుకాండ్లు. నటులు (శచీపు రందరము.

నుడుగు. పాట. (హేమాబ్జనాయికా—)

నోష్ఠ. నోసట (నృసింహరాజుఉషా—)

పంగుని. (త) ఫాల్గుణము (మ.దా.వి.)

పంతువగ. విరహ వేదన (రతికల్యాణము)

పదిలత. భద్రత (వెంకటదాసు ధర్మాంగద)

పాలించు. ఇచ్చు (హేమాబ్జ)

పుట్టముంగి. పుట్టువునుండి మూఁగ యైనవాఁడు (అకలంక—)

పేరడి. అప్రతిష్ఠ (మ.దా.వి.)

పోలుకాఁడు. పొల్లుగాఁడు. (సాంబయ్య కిరాతార్జునీయము)

ప్రసంగము. స్తోత్రము (భక్తవత్సల విలాసము)

ప్రసంగి. య. గా. ప్రదర్శకులలో నొకఁడు. పాత్రలఁ బలుకరించు వాఁడు (పంచకన్యాపరిణయము)

బసవశంకరము. 1. గొల్లవారిబిరుదు, ఆభరణవిశేషము (అత్రేయపురి గొల్ల కలాపము). 2. ఒక దేశితాళ విశేషము (త్యాగవినోదప్రబంధము)

భాండీరి. ప్రాకృతభాషావిశేషము
'కాంభోజీ మాగధీగాడీ
మాహారాష్ట్రీ కళింగజా
గైర్వాణీ మిశ్రితాభాషా
భాండీరీతి ప్రకీర్తితా'
(విజయరాఘవ కల్యాణము)

యా(ం)పరాలు. పాటు (శివకామ సుందరీపరిణయము)

లఘువు. దూకు (చౌదరి రామదాసు రుక్మిణీ—)

లజ్జమాని. అడుగురి (మిట్టమరి రామాయణం)

వంతము. వంటకము (పద్మినీపరిణయము వైదికపరిభాష)

వచ్చము. రూపాం. ఒచ్చెము (యతి ఘటితముగ-నృసింహరాజు ఉషా-)

శానా. రూపాం. చాల (కణ్వచరిత్ర)

వాపిరితనము. (వాఁపు+ఇరి) అబ (రామలింగదాసు శ్రీనివాస విలాసము)

వాయదకాండ్లు. వాద్యగాండ్రు (పురజాల పారిజాతము)

వింద్రాళము. ఒడి (వి. రా. ప్రహ్లాద)

వైపు. బాగు (అన్నపూర్ణాపరిణయం)

వైయాసి.త. వైశాఖము (అన్నపూర్ణా)

శేఖరించు. జరిపించు (మ.దా.వి.)

సంకచక్కిలాలు. శంఖచక్రాలు (వి. రా. పూతనాహరణము-గొల్లలభాష)

సనకటించు. వినికిడిచేయు (వి. రా. కల్యాణము — గ్రామ్యము)

సరుసుకొను. సరుదుకొను, పంచుకొను (హేమాబ్జ)

సిల్లాడు. ఉత్సవమాడు (వి. రా. పూతన-)

సీసకలేఖిని. పెనసలు(లక్ష్మీనారాయణ విలాసము)

సుడియడు. బాలుడు (వి.రా. ప్రహ్లాద)

సుడి సుద్దములు. అంగసాముద్రికమున సుడులకు సంబంధించిన సూత్రక్తములు (చెంగల్వరాయని ఎఱుకల కథ)

సుడుపడు. కుట్టుడు(మ.దా.వి.)

సొల్లు త. వచించు (శ్రీగిరి కురవంజి)

సోలుదాదులు. రూపాం. సోలరు. సిపాయిలు (పురిజాల పారిజాతము)

హావణించు. రచించు (రఘునాథ నాయకాభ్యుదయము)

2. వైరి పదములు

అతిపగ. (వెంగమాంబ శివవిలాసము)

అతిముద్దు. (సత్యభామ కథ)

అత్యంతపంతము. (శివవిలాసము)

అనేకజడలు. (మంజువాణిభామకలాపము)

ఇష్టవేలుపు. (లక్షణా కల్యాణము)

ఉన్నతచప్పరంబులు. (శివవిలాసము)

కుసుమబంతి. (శివవిలాసము)

గర్భచిన్నెలు. (బాలెంతకథ)

దాసవెట్టి. దాసునియందలి అనురక్తి. (త్యాగయ ప్రహ్లాద)

దినరోజులు. అనుదినము? (వి రా. చం. వి.)

దినసరులు. దినచర్యను గూర్చినవ్రాతలు. (కిరాతార్జునీయము)

ధీరమల్లారు. ధీరశ్రేష్ఠుడు. (మ.దా.వి)

నానాచూపులవాడు. (శివవిలాసము)

నానాహైరాణి. బెవద (సిరిపెగడ సుబ్బరాయని సారంగధర)

నిత్యకొలువు. ప్రతిదిన సాధారణమైన సభ (శచీపురందరము)

పుడమిజ. సీత (తుమ్మపూడి రామాయణం)

పుడమీశ్వరుడు. (వీరభద్రకవి సీమంతినీ చరిత్ర)

పుణ్యచేడెలు. పుణ్య స్త్రీలు (సాంబయ్య బల్లాణరాజ చరిత్ర)

ప్రౌఢచేడియ. (వి.రా.చం వి.)

బసవ దాసోహాలు. బసవని భక్తులు. (బసవ మహిమామృత విలాసము)

బహుతప్పులు. (రంగపురిపారిజాతం)

బహుమేలు. (త్యాగయ ప్రహ్లాద)

బాలతొడవు. (లక్షణాకల్యాణము)

బ్రహ్మకాయ. గొప్పవాడు, నిపుణుడు (శహాజీ గంగాపార్వతి సంవాదము)

మహామహావారు. గొప్పగొప్పవారు (భక్తాంఘ్రిరేణు విలాసము)

మాణిక్యపేరులు. మణిహారములు (వాయలూరి పారిజాతం)

మూర్ఖపగ. (మంగులూరి ప్రహ్లాద)

యావన్మంది. అందఱును (మహాభారత విలాసము)

రసపిచ్చి. (వల్లయపురి ఉషాపరిణయము)

రామకోణంగి. శకునపక్షిగాడు (సరస్వతీకల్యాణము)

రావణారంకు. పెద్దఱంకు (లక్ష్మణ ప్రాణరక్షణము)

లోకతరబడి. లోకాచారము (ముగ్ధ సంగయ్య కథ)

వాగ్గిట్ట. పదవాక్య ప్రమాణజ్ఞుడు (మైనంపాటి బాలగోపాలవిలాసము)

వీర మద్దెల. గొప్పమల (ప్రభావతీ ప్రద్యుమ్నము)

వీరముద్దియ. ఆభరణ విశేషము (నక్కల పాటి సంజీవకవి ఎఱుకలకథ)

శైలపట్టి. పార్వతి (శివవిలాసము)

సత్రమరులు. సత్రమునందు మరులు (తంజాపురాన్న దాననాటకము)

హంవీరతాయెలుతు. రక్షాబంధ విశేషము-జోదులు, వస్త్రాదులు ధరించునట్టిది (హేమాబ్జ)

...

3. అన్య దేశ్య ము లు

కచ్చేరి. కొలువు (లక్ష్మణ మూర్ఛ)

కబర్దార్. జాగ్రత్త అను హెచ్చరిక (చెంగల్వరాయని గొల్లకథ)

కమ్చీ. కళ (సుకుమారీ పరిణయం)

కవరు. భమిడిపాటి అప్పకవి భామ కలాపము)

కాగజము. కాగితము (మాతృభూతన పారిజాతం)

కితాబు. వాక్కు, బిరుదు (కో. తిరు వెంగడదాసు తిరుమంగయాళ్వాగు చరిత్ర)

కురిచీ. కుర్చీ. (లక్ష్మీ నారాయణవిలాసము)

కూనీ. ఖూనీ, హత్య (అకలంక-కృష్ణ విలాసము)

ఖడేరావు. 'ఆగు' అన్నట్టి హెచ్చరిక (సుకుమారీ)

ఖర్చు. (ల నా. వి.)

ఖామూష్. నిశ్శబ్ద మనునట్టి హెచ్చరిక (రామదాసు నాటకము)

గలీబు. (మంజువాణీ వారి భా. క.)

గులోబు. గ్లోబు. ( ,, ,, )

గ్లోబు. (అన్నపూర్ణా)

చెలాయించు. (సుకుమారీ)

జమాయించు. ( ,, )

జరువురు. (జరూర్) తొందఱ (ల. నా. వి.)

జూటుతనము. (ఝూటా) మోసము (వి రా. పూతన)

జోకాయించు. (సుకుమారి)

ఝూరీ. (రాజ రంజన విద్యావిలాసము)

డేరా. గుడారము (సుకుమారి)

తమాము. పూర్తిగా (తి వెం. దా. తిరుమంగ)

తమాసా. (అకలంక - కృ. వి.)

తహాశీలు. (ఆకెళ్ల అప్పయ్య గొల్ల కలాపము)

తివాసీ. (మంజువాణి భా. క.)

తోడా. బిరుదు పెండెము (అన్నపూర్ణా)

దస్కతు. సంతకము (ల. నా. వి.)

దాఖలు. (భ అ - భా. క.)

దావా. (ల. నా. వి.)

దిలాసా. (అకలంక-కృ. వి.)

దివాణం. రాచనగరు (శచీపురందరము)

దేరీజ. డేరా (తం. స.మ. 473)

ధగిడీ. 'ముండ' వంటి తిట్టు (పోటదుర్తి గొల్లకలాపము)

నావనీసు. పట్టిక (అన్నపూర్ణా)

నిద్దా. మేలైన (మా. భూ. పారిజాతం)

పంకా. (మం. వా. భా. క)

పాందాన్. తాంబూల కరండము (ల. నా. వి)

ఫిరంగి. (అంబా వివాహము కొఱవంజి)

పూరా. పూరిగా ( ,, ,, )

ఫౌజు. పటాలము ( ,, ,, )

బంకు. సందుకావలి (రా.రం.వి.వి.)

బంగు. చోష్యవిశేషము-మత్తుపదార్థము (శాంతాకల్యాణము)

బందుబస్తు. బలిమి (మృత్యుంజయ)

బడాయి. (అకలంక-)

బనాయించు. (సుకుమారి)

బేజారు. భయము, గాభరా (భ. అ. - భా.క.)

భరాయించు. భరించు(అంబావివాహ)

భేటి. సముఖము, దర్శనము, సమావేశము (శాహమహారాజకల్యాణము)

మద్దత్తు. (ల.నా.వి.)

మస్తి. 'సరే' వంటి అవ్యయము (రామ పట్టాభిషేకము)

మిలిటరీ. (అంబా)

ముస్తాదు. అలంకరించుకొనుట, సిద్ధమగుట (ల. నా. వి)

ముస్తీపుచేయు. సిద్ధముచేయు (శచీపురందరము)

ముస్తీదు. ముస్తాబు, సన్నాహము (హేమాబ్జ)

మొఖమల్. (మం.వా.—భా.క.)

రకము. (సింగన పారిజాతము)

రాదారి. (భ. అ.—భా క.)

రైలు. (భ.అ.—భా.క)

లవండరు. (మం.వా.—భా.క.)

లష్కరు. దండు (సుంకరి కొండడి వేషముకథ)

లాంతరు. (ల.నా.వి.)

లెటరు. (భ అ.—భా.క.)

వస్తాదు. (సుకుమారి)

శమ్మె. సెమ్మె, దీపపు ప్రమిద. (మ.వా.-భా.క.)

శాయి. సిరా (మా. భూ. పారిజాతం)

శిఖాచేయు. ముద్రవేయు (వి. చం. వి. వి.)

శిభంది. రూపాం. సిబ్బంది. బలగము (లక్ష్మీపతిరాయడు నలచక్రవర్తి చరిత్ర))

షోకు. (రామదాసు నాటకము)

సముదాయించు. బుజ్జగించు (శ్రీరంగ కవి శ్రీకృష్ణ జలక్రీడలు)

సలాము. (సుకుమారి)

సీలు. (భ అ.-భా.క)

సీసా. (మం.వా.—భా.క)

సుమారు. (భ అ.—భా.క)

సై లెను. (రామదాసు నాటకము)

సొనాయించు. అమ్ముచు (సుకుమారి).

హాజీలు సేయు. హాజరు పెట్టు, ఆయత్త పఱచు (గంగా పార్వతీ సంవాదం)

హురుముత్తుగా. పెద్దగా, గొప్పగా (వి. రా. ప్రహ్లాద)

హేజీబు. మనవి (లీలావతీ కల్యాణం)

...

## 4. జాతీయములు

అజగజాంతరము. (వి.రా.చం.వి.)

అమ్మలక్కలు. (వి.రా.చం.వి)

ఇలయీనినట్లు. (కిరాతార్జునీయము)

ఇల్లు బంగారాయెను. (అకలంక - కృ. వి.)

ఉలపసలపలు. కానుకలు (కిరాత విలాసం)

ఏనుగుపాడి. ఉదారవితరణము (లీలావతీ కళ్యాణము)

ఏసాగాథలు. సరిపడని మాటలు, అనవసర ప్రసంగములు, వ్యర్థప్రలాపములు (మ. దా. వి. హేమాబ్జ)

ఒకరిపట్ల పదుంద్రుడు. (వి. రా. విప్ర నారాయణ చరిత్ర)

ఒత్తూ ధావళ్ళవంటి. స్థూలమైన (కృష్ణవేషకథ)

ఓహారి సాహిరి. (అకలంక - కృష్ణ విలాసము)

కంచంత కాపురము. పెద్దసంసారము (రాజరంజన విద్యావిలాసము)

కన్నడ సేయు. చులకన చేయు, కించపరచు (పార్థసారథి విజయము)

కాయ జవాబు. కలిసిరానివార్త (ఓబయగిరుడాచల విలాసము). ఒకపని సవ్యముగా జరిగినట్లా లేనట్లా అనుటకు పండా? కాయా? అని అడుగుట వ్యవహార పరిపాటి.

కూసరకాసర చేయు. ఉపేక్ష సేయు, అసడ్డచేయు (భక్తాంఘ్రిరేణు విలాసము)

కొండుకులకోట. బహుపుత్ర సంపన్న భాగ్యశాలిని (మృత్యుంజయు)

గాలివార్త. (రా. రం. వి. వి)

గుత్తకొను. సొంతము చేసికొను (జాంబవతీ విలాసము)

చందమామ గుక్కిళ్ళు. అందరాని ఫలము (వి. రా. చం. వి.)

చారాచారెడు. విశాలమైన కన్నులు మొ॥ కృష్ణవేషకథ)

చుట్టాల సురభి. బంధుహితుఁడు (మృత్యుంజయ)

చెంపశుద్ధి. చపేట ప్రదానము (హేమాబ్జ)

తరకట బురకట. అబద్ధము (చెం.రా. ఎఱుకలకథ)

తాపచుట్టరికము. ఇచ్చి పుచ్చుకొను సంబంధము (ఆత్రేయపురి గో. క)

త్రవ్వితలకెత్తు. ఉద్ధరించు (భక్తాంఘ్రి రేణు విలాసము)

నంగనాచి. (నక్క-నాంచారు) నేరము చేసియు నేరనిదానివలె నటించునది. (గంగాపార్వతీ సంవాదము)

పలుకు బంగారము. (అకలంక-కృ.వి)

పిలువని పేరంటము. (భవానీశంకర విలాసము)

పుర్రచెయ్యి. ఎడమచేయి - అపసవ్యమైనది (బసవ మహిమా)

పోతుపేరంటాలి పొలుపు. మగవాని ఆడువాలకము (భీమసేనవిజయం)

పొద్దు గూకులు. ప్రొద్దుగ్రుంకువఱకు (త్యాగయ ప్రహ్లాద)

బంగారు కొండ. అమూల్య వస్తువు. ప్రియతముడు (అకలంక-కృ వి.)

బభ్రాజిమానం. అసమర్థుఁడు (ధర్మపురి మాహాత్మ్యము)

బారాబారెడు. పొడవైన (కురులు మొ॥ కృ. వే కథ.)

బ్రహ్మాకాయ. శ్రేష్ఠుడు, నిపుణుడు (గంగా పార్వతీ సంవాదము)

బ్రహ్మిష్ఠోబ్రహ్మ కొడుకు. శ్రేష్ఠుఁడు (మ. దా. వి.)

మదన శుంఠ. శృంగార పరిజ్ఞాన విహీనుఁడు (భక్తాంఘ్రి-)

మహా మహావారు. (గొప్పగొప్ప వారు (భక్తాంఘ్రి)

మొగము వాచు. భ్రాంతి పడుట (అకలంక-కృ వి.)

యద్వాతద్వాలు. పెడసరపు మాటలు, పొందుపొసఁగని మాటలు, లజ్జుగుజ్జులు (వి.రా ప్రహ్లాద, హేమాబ్జ)

రావణసన్న్యాసి. కపట సన్న్యాసి (వి. రా. విప్రనారాయణ చరిత్ర)

రావణారంకు. పెద్ద లేక ప్రసిద్ధమైన అంకుతనము. (లక్ష్మణ ప్రాణరక్షణము)

లంకించుకొను. దొరకపుచ్చుకొను లోఁగొను (హేమాబ్జ)

వజ్రశుంఠ. గండ మూర్ఖుఁడు (వి. రా. ప్రహ్లాద, హేమాబ్జ)

వలపు వక్కాణకమ్మ. ప్రణయలేఖ (వి. రా. చం. వి.)

వలరాచసివము. మాన్మథోన్మాదము (మ. దా. వి.)

వా_ర్తలాడు. చమత్కారముగా సంభాషించు (వి రా వి ప్ర. నా. చ.) కైవారము సేయు (చిత్రకూట)

సంత మెఱుగు. బజారు పోకు, అడంబరము (బాలక్రీడా విహారం)

సరిమానము. ఏమాత్రపు హెచ్చు తగ్గులు లేక సమానముగా నుండుట (త్యాగయ ప్రహ్లాద)

...

5. ధాన్యముల పేర్లు

ఇప్పసరులు, కర్పూర భోగాలు, కుసుమసరాలు, గంగాజలాలు, గౌరీశకుంకుమలు, చామపువ్వులు, చిరుత సంబాపువ్వులు, నల్లగాగిరెక్కలు, నాగ సరులు, పాలబుడమలు, బంగారు తీగెలు, బలువు గుత్తులు, మదన సరులు, ముకుందభోగాలు, ముత్యాసరులు, మేటివంకెలు, రత్నసరులు, రాజనాలు (ఇప్పపువ్వు, జీలకఱ్ఱ, మంచి పునుగు, మేలికొండ, సన్నజలుగు మొ॥ ఇందలి రకములు) రామబాణములు, రామభోగులు, రాయ సరులు, సీతా భోగాలు.

...

6. భక్ష్య విశేషములు

అంబలి, అట్లు, అతిరసాలు, అప్పడాలు, అప్పములు, ఆనబాలు, ఆవడ, ఇడ్డెన, ఉక్కెర, ఉల్లెడ పోళీలు, ఊరగాయలు, రుడో బిండ్లు, కక్కెరాలు, కజ్జకాయలు, కజ్జాయము, కఱుకుట్లు, గరిజకాయలు, గసగసాలకజ్జకాయలు, గారెలు, గురుగులు, చంద్రకాంతలు, చక్కిలాలు, చక్కెరకుండ్లు, చల్లగారెలు, చిట్టిబూరెలు, చిత్రాన్నము, జిలోబి, తిమ్మనము, తిరువిసములు, ధధ్యోదనము, దోసెలు, నీరుగ, పరమాన్నము, పాయసము, పులగము, పుళియోగిర (పులిహోర), పూరీలు, పూర్ణకుడుములు, పూర్ణాచిపోళ్ళి, ఫేణీలు, పొంగలి, భరుగులు, (వరుగులు ?), మండెగలు (పూత రేకులు?), లడ్డు, వగవగలు, వడలు, వెన్నప్పములు, సంకటి, సిగరణాలు, సిగిరెలు, సుకియలు, సేవాలపాయసము, సొంటి మజ్జిగ, సొజ్జెబూరెలు.

...

### 7. ఉడుపులు

అంగీ, అరచట్ట, కబాయి, కాసె, కుత్తినీ, కుళ్లాయి, కోక, గొంగడి, చల్లడము, చీర, (గంగ సాగరపుచీర, గోరంచు, చెంగావి, పగడపట్టు, పట్టుమళ్లి, బుటేదారు, బురుసా, మాయపట్టు, మొ॥ కొన్ని చీరల రకాలు) చోగ, తడుపు, తాప్తా, దట్టి, దుప్పటి, ధోవతి, పచ్చడము, పాగ, పావడ, పైఠిణీ, రవిక.

### 8. ఆభరణములు

అందెలు, ఉంగరములు, ఉజ్యాములు, ఉత్తరజందెము, ఉత్తరిగె, ఒంట్లు, ఒడ్డాణము (రూపాం. ఒడ్డియాణము, ఒడ్యాణము, ఒడ్డేణము, వడ్డాణము), కంకణములు, కంటసరి, కంటె, కంఠమాలిక, కడియాలు, (ఇంద్రాణి కడియాలు, దండకడియాలు, మేరువు కడియాలు మొ॥), కమ్మలు (పంజుల కమ్మలు) కింకిణులు, కుండలములు, కుతికంటు, కొప్పు బిళ్ళ, గజ్జలు, గాజులు (ఉదిరి గాజులు), గొడసరాలు, చంద్రవంక, చంద్రహారము, చిటికెనబొద్దులు, చిలుకతాళి, చుక్కలపేరు (తారహారము), చెంపకళ్ళీలు, చెంపసరాలు, చెరుపు, చీకట్లు చేయము, చేసరులు, చౌకట్లు (గండచౌకట్లు), జంపులు, జడబిళ్ళ, జుబికీలు (జుమకాలు, జుమికెలు), జోమాల దండ, తాయెతులు (పత్తికాయ తాయెతులు, హంవీర తాయెతులు), తాళిబిళ్ళ, తురాయి, దర్భముళ్ళు (అంగుళీయకవిశేషము), నత్తు, నాగసరము, నేవళము, పదకము, పల్లేరుపువ్వులు, పాపిడిబిందెలు, పంపిణీలు, పిల్లాండ్లు (రూపాం. పిల్లేళ్ళు, పిల్లాణియల్. త.), పెండెము (గండపెండెము, బిరుదు పెండెము), పోగులు, పోచీలు, బటువులు, బణ్ణసరము (వర్ణసరము,) బవిరెలు, బాజుబందులు, బావిళ్లు (బావిలీలు), బాసికము, బాహుపురులు, బుగడలు (బొగడలు), బులాకీ, బేసరి, బొబ్బిలికాయలు,

భుజకీర్తులు, ముంగఱ (ముక్కుఱ), మురుగు(మురువు)ముంగాముర మములు(ముంగామురారి), మెట్టెలు (గిలుకు మెట్టెలు), మొగపుల తీగె, మొగలిరేకు, మొలనూలు, రాకడి (రాగిడి,) రాకడికుచ్చులు, రావిరేక, రేబణిబిళ్ళ, వంకీలు, వీరముద్దియలు, సంది దండలు, సందిబొందులు, సరిగె, సరిపెణ (పులిగోరు సరిపెణ), సరిపేషు, సవరపుకుప్పె,సురమాయి జల్లులు, సూర్యచంద్రులు.

9. క్రీడలు

అచ్చనగండ్లు, అమ్మాన, అల్లో నేరళ్లు, ఇట్టిక (ఒప్పులకుప్ప వంటిది - నుదురుపాటి వెంకన పార్వతీ కల్యాణము), కోలాట గుజగుజ రేకులు, గెంజిపాడి, గొబ్బి, చెండ్లాట, దండెయాట, దాగుడు మూతలు, పందాట (బంతియాట), పగడసాల, పొళ్లంజి, బొమ్మల పెండ్లి, వామన గుంటలు (ఓమన గుంటలు), సయ్యాట, సొగటా లాట.

10. నృత్యములు

అల్లిక, కందుకక్రీడ, కొరము-కొర వంజి, గుజరాతి - గుజ్జరి, చిందు, చౌపదము, జక్కిణి - ప్రబంధ జక్కిణి, జగ్గు, జోగి-జోగిణి-జోగి ణీపంతు, దండలాసకము (కోలా టము), దురుపద కేళిక, దేశి, నాట్యకదంబము, పదచాళి (పదకేళిక), పేరణి (పేరడి),మదన బలదూత్యము, మైసిరి, వాల్విచి, విల్వేదు, శారదా సామ్రాజ్యము, శుభలీల, సవతిమచ్చరము.

11. వాద్యములు

అమృతకుండలి, అమ్మిజంబులు ఆరబ్బి, ఉడుకు, కర్ణాలు, కాహాళ, కిన్నెర, చక్రవాద్యము, చితారు, జోళ్లు, డవిణ, ఢక్క, తంబుర, తప్పెట, తాళము, తాపామార్వా, తిత్తి, తుడుము, దండె, ధర్మదార,

నరగ, నౌబత్తు, పంబ, పటహము, పణవము, పిడిగండ్లు, బూరగాళ్ళె, భేరి, మల్హారు, మృదంగము, మురజము,రవిచంద్ర వాద్యములు, రావణహస్తము, రుద్రవీణె, వీణ, వీరణాలు, వీరదాళ్లు, వీరమద్దెల, శంఖము, సుర్ణాలు, స్వరమండలము, హుడుక్క (ఉడుకు), హెగ్గాళె.

...

## 12. ఆయుధములు

అమ్ములు, అరిగెలు, ఈటె, ఉంట విల్లు, కత్తి (పట్టాకత్తి, బాణాకత్తి, విచ్చుకత్తి, సానకత్తి), కటారి, కేడెము, కైజారు, చిల్లకోల, చివగడ, తుపాకి, దుమ్ములు దోదుమ్ములు, నేజ, లకోరి, విల్లు (తడవిల్లు, సెలవిల్లు మొ॥) సింగాణి.

...

## 13. జంతువుల పేర్లు

వేటకుక్కలు: క్రాలేడు, చొచ్చిన వచ్చు, పందేల పసిడి, పచ్చిమిరియము, మిత్తిగామిడి ముచ్చులగొంగ, మొకమాయ, వేటమాణిక్యము, సింగాడి, సురగాలి.

ఆవులు: కంచి పెరుందేవి, కావేరి, గోదావరి, చందమామ, నాంచారు, బంగరుకొండ, భాగీరథి, మాతంగి.

గుఱ్ఱములు: మూల భైరవుడు, రాయరంపము,వాయువేగుడు.

...

## 14. రాజకీయోద్యోగులు

అన్నగారు (క్రొజ్జా. రాణివాసపు కావలి), అమరనాయకులు, అవసరమువారు (సమయని వేదకులు), ఆస్థానసంతోషి (విదూషకుడు), కటికము,(కట్టియం, కటికవాడు, కేతినాయుడు, కోలకేతడు, చోపుదారు, బాగుదారు), కణకం (గణికుడు), కరణము, కావలుకారు, కైజీతమువారు, కొత్వాలు, చపురాసి, జమాదారు, జవాను, తలవరులు, దఫేదారు, (డఫేదారు), దివాను, దుబాసి (ద్విభాషి), దేశపాండ్యా, దేశముఖు, నవాబు (నబాబు),

పండారు (భాండారి), పటవారి, పటేలు, పాదుశాహి (పాదుశా, పాదుషా, పాచ్ఛాహు) పాలె గాడు, పేష్కారు, బంట్రోతు, బరాబరి, బొక్కసము వారు, మణియగాడు, (దేవాయతనా ద్యధికారి), మహల్దారు (భవన రక్షకుడు), రాయసమువారు (వ్రాయసము వారు - లేఖకులు), రాణువ వారు, వజీరు, సబనీసు (గణకుడు), సవారు (రౌతు), సిపాయి, సుబేదారు, హాసము వారు (రాజ సన్నిధినుండే సిబ్బంది) హెగ్గడి.

...

---

# అనుబంధము

# 6

## యక్షగానములలోని సామెతలు

సామెత లనగా తరతరముల నొక జాతి జనసామాన్యము జిహ్వాంచలముల నాడు నిరాడంబర భావనిర్భర కవితాజీవిత కలమంత్రములు. అల్పాక్షరముల ననల్పార్థరచన, భావవైశద్యము, సందర్భఝుటితిస్ఫూర్తి, అందమైన పదాల పొందిక వీనిసొత్తు. ఏజాతి భాషలో చక్కని సామెతల సంపత్తి యెక్కువగా నుండునో ఆజాతి సాహితీ సౌమనస్యమున కది యొక కొండగుర్తు. తెనుఁగు భాషలో సామెతలు కోకొల్లలు. ఈసంపత్తి విషయమున నన్యభాషల ననేకము నతిశయించునట్టి దాంధ్రభాష. మన జాతీయ సాహిత్యప్రక్రియయైన యక్షగానము మనకెన్నో సామెతల నామెత లిచ్చినది. మన పండితమాత్రుల గీర్వాణ ప్రచండ వాఙ్మయమున సామెత లనేకము కృతకరూపము బొందినవి. వాని నిసర్గ మనోహర స్వరూపమును చక్కఁగా సంరక్షించినది యక్షగానము. వానియందలి కవితాత్మను, అలంకార చమత్కార చారుతను గూర్చి యెంతయినను వ్రాయవచ్చును గాని ప్రకృత మవకాశము చాలమి కతిపయ యక్షగానములందలి సామెతలు కొన్ని మచ్చునకు మాత్ర మిట నుదాహరింపఁ బడుచున్నవి :

అంగడిమీద కన్నులు అత్తనెత్తి చేతులు

(గంగాపార్వతీ సంవాదము)

అంతనాడు లేదు ఇంతనాడు లేదు సంతనాడు దిగింది ముంతంత గూద.

(లక్ష్మణకవి ధర్మాంగద)

అచ్చుబొడిచి నిన్నాబోతనవలె

(అకలంక - కృష్ణవిలాసము)

ఉసురు గలిగితె ఉప్పమ్ముక బ్రతుకవచ్చు.

(హేమాబ్జనాయికా స్వయంవరము)

కలలందు నరుకులాడినఁ గలవే గాయములు మేలుకాంచిన వెనుకన్.

(భవానీశంకర విలాసము)

కలిబోసిన వెనుక ఉట్లవంక జూడనేల.

(గంగా పార్వతీ సంవాదము)

కానుగ వాసాలు గదోయి కతాలు సాహేబంటే పుచ్చిన దాకా వుండవా బురాను సాహే బన్నట్లు.

(కపిలదేవహూతి సంవాదము)

చావుకేడిచి చాటుకు బోతే మృత్యుదేవత ముందర గూర్చున్నట్లు.

(క. దే. సంవాదము)

తన్నుదా దెలిసిన తత్వ మేల

(ప్రహ్లాదభక్తివిజయం)

తుపాకి కడుపునఁ ఫిరంగి పుట్టినట్లు

(శేషాచార్యుల శకుంతల)

తీరు తీరు గుడ్డలు గట్టుక తిరుణాలకు బోతే ఊరికొక గుడ్డ ఊసి పోయినట్లు.

(క. దే. సంవాదము)

దాసరి తప్పు దండముతో సరి.

(భవానీ శంకర విలాసము)

నక్కనారాయణుం డెక్కడనో తోకనారాయణుం డక్కడనే.

(భక్తాంఘ్రి రేణువిలాసము)

I–47

నిజము నిదానముమీఁద తెలియును.

(భవానీశంకరవిలాసము)

నిన్న గుప్పయు నే డాళ్ళు.

(లక్ష్మణా కల్యాణము)

పట్లు పట్లమీఁద బావ పిలిస్తే మరిచి మామపక్క పండినట్లు.

(క. దే. సంవాదము)

పసుకాట యిచ్చేది పసలేదు చొచ్చేది మూరె డన్నట్లు.

(శచీపురందరము)

పాటిమీఁది దేవరకు కూటిమీఁద నే కోరిక.

(శేషాచార్యుల శకుంతల)

పొంకాల పోతిరెడ్డికి ముప్పైమూఁడుదొడ్లు మూఁడెడ్లన్నట్లు.

(క. దే. సంవాదము)

పొడువులకు రోకలి మింగితే పొన్ను ముడ్డి సిరికినట్లు.

(క. దే. సంవాదము)

ప్రసాదానికి బలిష్టం పనికి నీ అదృష్ట మన్నట్లు.

(క. దే సంవాదము)

మంచమెక్కిన మీఁద మర్యాద లేల.

(కిరాతార్జునీయము)

మింగ మెతుకు లేదు గాని మీసాలకు సంపెంగనూనె.

(క. దే సంవాదము)

మూల పెరుమాళ్ళు ముష్టెత్తుకుంటే ఉత్సవపెరుమాళ్ళు దధ్యోదన మడిగినట్లు.

(క. దే. సంవాదము)

యత్ర జంగం తత్రభిక్షమన్నట్లు.

భక్తాంఘ్రి రేణువిలాసము)

రాట్నం వచ్చె బండి తియ్యరా అన్నట్లు.

(సర్వాంగ సుందరీవిలాసము)

లంజా ముంజా ముదిరితే కొఱగాదు.

(భక్తాంఘ్రి)

వంకాయలు ముచ్చిలించిన వానిబుద్ధి టెంకాయలకైనవచ్చు.

(అకలంక - కృష్ణవిలాసము)

సద్దన్నపు మీఁది వెన్న చందురు డవునే.

(ప్రహ్లాదభక్తివిజయము)

సన్నికలు కడగరా సయిదల్లి అంటే కడిగినట్టే నాకినా ఖుదా తోఁడన్నట్టు.

(క. దే. సంవాదము)

సాటి యాఁరాలు సరిగె బెట్టుకుంటే తోఁటి యాఁరాలు ఉరిబెట్టుకున్నట్లు.

(క. దే. సంవాదము)

సిగ్గు బోవువేళ చీర లబ్బినరీతి.

( ।పహాద భ కవిజయము)

# ఆంధ్ర
# యక్షగాన వాఙ్మయ చరిత్ర
## ద్వితీయ భాగము

## యక్షగాన
## కవులు — కావ్యములు

రచన
డాక్టర్ యస్వీ జోగారావు

# ద్వితీయ భాగము

# యక్షగానకవులు – కావ్యములు



## విషయసూచిక

# 1. ప్రోలుగంటి చెన్నశౌరి

## సౌభరిచరితము :

ఇతఁడే యిప్పటికి మనకుఁదెలిసినంతలోఁ బ్రప్రథమాంధ్ర యక్షగాన కర్త. హరిభట్టు రచించిన యుత్తర నారసింహ పురాణము (ఆం. సా. ప. చేఁ బ్రచురితము) కృత్యాది యందుఁ గృతిపతి యగు ప్రోలుగంటి రంగనమంత్రి వంశవర్ణననుండి యీతనిచరిత్ర మెఱుఁగనైనది. ఈతఁ డార్వేల నియోగి. ఆశ్వలాయన సూత్రుఁడు. వాసిష్ఠ గోత్రుఁడు. ప్రౌఢరాయలయొద్ద దండనాయకుఁడైన తిప్పన యీతని ప్రపితామహుఁడు. దేవమాంబా నాగశౌరు లీతని తలిదండ్రులు. ప్రోలుగంటిపుర మితని కాపురము. కాలము క్రీ. శ. 15 వ శతాబ్ది యుత్తరార్ధము.* ఆనారసింహ పురాణావతారికలోని 33 వ పద్యమున (సీసము) నీతఁ డష్టభాషా కవియనియు, ద్విపదనారసింహ పురాణము, బాల భారతాంధ్ర వచనకావ్యము, సౌభరి చరితంబు జక్కులకథయు నీతని కృతులనియు, నితఁడు సరసింగరాయలనుండి యగ్రహారాదికము గ్రహించినాఁ డనియు, నితని భార్య పేరు కొండమ యనియుఁ గలదు. ఇతని గ్రంథము లెవ్వియు నేఁడు గానరావు. ఆతని సౌభరి చరితము "జక్కుల కథ" యనఁగా నదే యక్షగానము (ఆ. సౌభరి యొక మహర్షి. అతని చరిత్రము భాగవత విష్ణు పురాణములందుఁ గలదు) ఆ గ్రంథ మలభ్యము. ఆనాఁటి యక్షగానము స్వరూప స్వభావాదులు తెలిసి కొనుట కవకాశము లేకుండఁబోయినది.

---

* చూ. ఆంధ్రకవి తరంగిణి 6 వ సంపుటము, పుట 73, 74.

# 2. చక్రపురి రాఘవాచార్యుఁడు

## విప్రనారాయణ చరిత్ర :

ఇప్పటిదనుక నుపలబ్ధమైనంతలో నున యక్షగానములలో గందుకూరి రుద్రకవి సుగ్రీవ విజయమే ప్రాచీనతము మైనదిగాఁ బరిగణింపఁబడుచు వచ్చుచున్నది. కాని దాని కొక్కించుక పూర్వమే రచింపఁబడి యుండుననను నూహ కెడమిచ్చు గ్రంథ మొకటి లభించినది. అదే మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున డి. నం. 1939 యగు విప్రనారాయణ చరిత్ర. ఈ గ్రంథము తాటియాకుది. ప్రాఁతది. శైథిల్య గ్రంథపాతములు గలది. గ్రంథారంభమున నొకటవ, మూఁడవ యాకులు పోయినవి. చివర నొకటి రెండాకులు పోయి యుండును. గ్రంథకర్త పేరిందు గానరాదు. కాని యీ గ్రంథమునకుఁ గర్త చక్రపురి రాఘవాచార్యుఁడని యీక్రింది యుపపత్తులవలనఁ గ్రహింప నగును.

1. చక్రపురి రాఘవాచార్యుని రచనలని రూఢిగాఁ దెలియ వచ్చిన "నలచరిత్ర" (సి. పి. బ్రౌనుచే, వావిళ్ళ వారిచే వెస్ట్రువార్డు వారిచేఁ బ్రకటితమైనది), "విష్ణుభక్త చరిత్రము" (ప్రా. లి. పు. భాం. డి. నం. 1182) అను రెండు ద్విపద కావ్యములు రెండును ఘటికాచల నారసింహస్వామి కంకితములని చెప్పఁబడినవి. ఇదియు ఘటికాద్రి నారసింహునకే కృతియైనట్లు స్పష్టముగాఁ గలదు. ఆ దేవర పేర షష్ఠ్యంతములును రచింపఁబడిన విందు. ఇదియు ద్విపద ప్రచుర మైన కృతి.

2. నలచరిత్ర విష్ణుభక్త చరిత్రములం దీ గ్రంథ ప్రశంస లేదు. కాని వానిలోఁ గవి తన పితామహుని గురువుగా వాధూల గోత్ర

పవిత్రుఁడగు కందాళదొడ్డ యాచార్యుని గూర్చి చేసిన ప్రశంస యీ విప్రనారాయణ చరిత్రము నందును, గ్రంథాద్యంతములందు రెండుచోట్లను గలదు.

3. నల విప్రనారాయణ చరిత్రలు రెండింటను గ్రంథాంతమున దొడ్డ యాచార్యుల ప్రశంసగల ద్విపద పంక్తు లొక్కతీరుగా నున్నవి.

(వి. నా. చరిత్రము నుఁ గొనకొంఅవడినది)

"అనుచు వాధూల గోత్రాబ్ధి చంద్రుండు
చిరకీర్తిమంతుఁ డాశ్రిత హితోదయుఁడు
కరుణాపయోనిధి కందాళ దొడ్డ
యాచార్యులకు శిష్యుఁడైనట్టి వైష్ణ
వాచార తత్పరుఁ డతిదయా పరుఁడు"

— నలచరిత్ర.

"అలరవాధూల గోత్రాబ్ధి చంద్రుండు
చిరకీర్తినెలసి యాశ్రిత హితోదయుఁడు
కరుణాపయోనిధి కందాళ దొడ్డ
యాచార్యులకు శిష్యుఁడైనట్టి వైష్ణ
వాచార తత్ప ... ... ..."

— విప్రనారాయణ చరిత్ర.

4. మఱియొక విషయము:— గ్రంథస్థ నిదర్శనము - బలవత్తరమైనది. ఏకకర్తృకములగు కృతులయం దేకోశముననో కొంత రచనాసామ్య ముండుట సహజము. పై రెండు గ్రంథములనుండి యట్టి సామ్యమునుబట్టి యిచ్చు కొన్ని పంక్తులేర్చి చూపబడును.

నలచరిత్ర - పూర్వభాగము సందర్భము దమయంతీ స్వయంవరపుఁగ్రైనేత :—

" తీరుగా మృగనాభి తిలకంబు దీర్చి
కోరి జవ్వాదితోఁ గూర్చిన మంచి
హారి చందనము మేన నందంద బూసి
కరమున వజ్రాల కడియముల్ బెట్టి
నీలంపు ముంగర నీటుగాఁబెట్టి
లాలితంబుగను బిళ్లలనూ లమర్చి "

విప్రనారాయణ చరిత్ర - సందర్భము దేవదేవి సింగారము (చూ. ప్రా. లి. పు. భాం. ప్రతి అయిదవయాకు మొదటిప్రక్క :—

" తీరుగా మృగనాభి తిలకంబు దీర్చి
కోరి జవ్వాదితోఁ గూర్చిన మంచి
అగలు గంధము మేన నలఁది సొంపొంద
మొగపులతీగె యిమ్ముల ధరియించి
నీలంపు ముంగర నీటుగఁబెట్టి
లాలితంబుగను బిళ్లల నూ లమర్చి
కరముల వజ్రాల కడియముల్ బెట్టి "

పై సందర్భములందుఁ బోలిక స్పష్టము. కాఁగా నలచరిత్ర కర్తయగు చక్రపురి రాఘవాచార్యుఁడే యీ విప్రనారాయణ చరిత్రకును గర్తయని గ్రహింపనగును.

నలచరిత్ర విష్ణుభక్త చరిత్రములనుండి చక్రపురి రాఘవాచార్యుఁడు కందాళ దొడ్డయాచార్యుని శిష్యుఁడైన చక్రపురి దొడ్డయాచార్యుని పౌత్రుడనియు, నితనికి రంగన యను పెదతండ్రి గలఁ

డనియుఁ దెలియవచ్చినది. రాఘవాచార్యుఁడు విష్ణుభక్త చరిత్రావతారికలోఁ గందాళ దొడ్డయాచార్యునిఁ దన 'కులగురుం' డని ప్రశంసించి యుండెను. తన విప్రనారాయణ చరిత్ర గ్రంథారంభమునఁ గందాళ దొడ్డయాచార్యు నిట్లు సన్నుతించినాఁడు :—

"ఎనసి డెబ్బదినాల్గు సింహా - సనుల నందఱ వన్నె గాంచిన
యభినుతుండగు దొడ్డయార్యుల వినుతి సేతున్.
హెచ్చియుండిన పరమతంబుల నెల్ల ద్రుంచి ప్రఖ్యాతివడసిన
సచ్చరిత్రుఁడు దొడ్డయార్యుల సన్నుతింతున్"

దీనినిబట్టియు నతని కృతులు మూఁటింటను నీ దొడ్డ యాచార్యుని ప్రశంస యుండుటను బట్టియు రాఘవాచార్యుని తాతయే కాక రాఘవాచార్యుఁడును గందాళ దొడ్డయాచార్యుని సమకాలికుఁడును, శిష్యుఁడునై యుండెనని యూహింపఁదగియున్నది. (తాత బ్రదికి యుండఁగా గ్రంథరచన చేసిన మనుమలు లేకపోలేదు. అదిగాక తాత గారి గురువు తాతకంటె వయసునఁ బెద్ద కానక్కఱలేదు.

ఈ దొడ యాచార్యుని ప్రశంసయే కవికాల నిర్ణయమునకుఁ దోడ్పడుచున్నది. కవి తన కృతి త్రితయమును ఘటికాచాల నరసింహస్వామి కంకితముచేసియుండుట, మూఁడిటదొడ్డయాచార్యుని స్తుతించి యుండుటయుఁజూడ నీ దొడ్డయగారు ఘటికాచల మతాచార్యుఁడై యుండునని తోఁచుచున్నది. ఘటికాచల మఠాచార్యులలో దొడ్డయాచార్య నామధేయు లిద్దఱు ముగ్గు రుండిరట్లు కొన్ని శాసనాధారముల వలనఁ దెలియుచున్నది. రాఘవాచార్యుని విష్ణుభక్త చరిత్రావతారికలో నీదొడ్డయాచార్యుఁ డప్పళాచార్య సుతుఁడని పేర్కొనఁబడి యున్నది. ఆ యిరువురి పితాపుత్రసంబంధమును నిరూపించు నాధారములు లభించుటలేదు. కాని యిరువురిపేళ్లు నొక్కచోఁ గలిపి కట్టుగాఁ

గన్పట్టు శాసనమొక్కటి కలదు. అది తిరుపతి తిరుమల దేవస్థాన శాసన సంపుటములలో నైదవదానిలో 115 వ పుటలో నుదహరింపఁ బడినది. దాని నం. 47 ఎ. శాసన కాలము క్రీ. శ. 3-7-1545. అది తాళ్ళపాక తిరుమలయ్యంగారి వనభోజనోత్సవవితరణకు సంబంధించినది. ఇందు స్వామిప్రసాద గృహీతలుగా ననేక వైష్ణవాచార్యులతో పాటు కందాడై అప్పలాచార్యులు, దొడ్డయ్యంగారులును పేర్కొనఁబడిరి. ఆ పుటలోనే శాసనాంగ్లానువాదమున నా దొడ్డయ్యంగారిని గూర్చి "Doddayacharya, the famous religious teacher residing at Sholingar" అని యొక వక్కాణ ముండలికరింపఁబడి యున్నది. షోలింగరనఁగాఁ జోళసింహపురము. అదే ఉత్తరార్కాడు మండలముననున్న నృసింహక్షేత్రమగు ఘటికాచలమునకు మఱియొక పేరు మాత్రము * ఈ దొడ్డయాచార్యులే చక్రపురి రాఘవాచార్యుని కుల గురువు కాఁదగును. అనఁగా రాఘవాచార్యుఁడు క్రీ. శ. 1545 ప్రాంతమువాఁడు కావచ్చుననుట (తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యమునఁ గృతిపతియగు విరూరి వేదాద్రిమంత్రి గురువుగా నొక కందాళ అప్పలాచార్యులు పేర్కొనఁబడినాఁడు. అతని ఘటికాచల సంబంధమున కాధారమును, కవ్యుపజ్ఞమగు కృత్యాదియు లభింపలేదు కాని యొకవేళ రామకృష్ణకవి ఘటికాచల మాహాత్మ్య రచన కతని ప్రోత్సాహమే కారణమేమో! అతఁ డీదొడ్డయాచార్యుల తండ్రియగునేమో! వైజయంతీ విలాసకర్తయగు సారంగు తమ్మయ యొకఁడు తనగురువు కందాళ యప్పగారని చెప్పినాఁడు. మరి యతఁడే దొడ్డయాచార్యుని తండ్రి యగునో! ఆం. క. త. లెక్కప్రకారము వైజయంతీవిలాసరచనాకాలము క్రీ. శ. 1510 ప్రాంతము. విప్రనారా

* Vide 'Topographical list of Inscriptions of Madras Presidency' By Sri V. Rangachari., Vol. II, Page 108-Foot note

యణచరిత్ర మితివృత్తముగాఁగలది యాప్రబంధము. కందాళప్పగురుని యాదేశప్రకార మది ప్రబంధముగా రచింపఁబడియుండ, దొడ్డయాచార్యు నాదేశ ప్రకారమే రాఘవాచార్యుఁ డాకథ నీ యక్షగానరూపమున వెలయించి యుండెనేమో! ఇవి యన్నియు నిర్ణయములుకావు. ఇప్పటి కూహాలును బరి పగి విధముల విచికిత్సా కృతులును మాత్రము.

కందుకూరు రుద్రకవి "క్రీ. శ. 1568 ప్రాంతముల వాఁడేని కొంత తర్వాత వాఁడేని కాఁగలఁడు" అని కీ. శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారియభిప్రాయము. ఆ యభిప్రాయముతో నాంధ్రకవి తరంగిణి కారులును నేకీభవించి యున్నారు. చూ. సం. 10 పుట 160) అందుచే క్రీ. శ. 1545 ప్రాంతమువాఁడు కావచ్చునని యూహింపఁదగిన చక్రపురి రాఘవాచార్యుఁడు రుద్రకవి కొక్కించుక పూర్వుఁడై యుండిన నుండవచ్చును

రచనాప్రక్రియను బట్టియు రాఘవాచార్యుని విప్రనారాయణ చరిత్రయంత ప్రాచీనమైనదిగను గన్పట్టును. రుద్రకవి సుగ్రీవ విజయముతోఁ దగిన రచనాసౌమ్యము నిందు స్ఫుటముగాఁ జూపట్టును. ఉపలబ్ధ ప్రతిలో నీ గ్రంథము శ్రీ కారాదిగా లేదు కావున నొకయాకు పోయి యుండునని యూహింపఁదగి యున్నందునను సుగ్రీవవిజయము నందువలె నిందు ప్రారంభమునఁబద్యము గానరాదు. కాని యన లుండి యుండవచ్చును. తమపరి సుగ్రీవ విజయమున నొక త్రిపుటలోఁ గందు కూరి జనార్దనస్తుతి. ఇందును ద్రిపుటలో దొడ్డయాచార్యుల స్తుతి ఆ వెనుకనే సు. వి. న " అని మరియు నద్దేవతా సార్వభౌమునకు షష్ఠ్యంతంబులు సెప్పినట యెటువలెను" అని యున్నది. వి. నా. చ. నను 'అని మరిన్ని ఘటికాద్రి నారసింహునకు షష్ఠ్యంతాలు చెప్పినట యెటువలెను' అని యున్నది. రెండింటను షష్ఠ్యంతము లర్థచంద్రిక

లను నొక్క గేయచ్ఛందస్సులోనే యున్నవి. అవి రెంటను బాద పాదమున వరుసగా దశావతార ప్రశంసాత్మకములుగనే యున్నవి.

ఉదా :—

"చదువులు దెచ్చిన జలచర పతికిన్
కుధరము మోచిన కూర్మంబునకున్" ము...

—సుగ్రీవ విజయము

"నలినజు చదువులు నిల్పిన హరికిన్
మూపున కుధరము మోసిన హరికిన్" ము

—విప్రనారాయణ చరిత్రము.

వెంటనే "అంకితంబుగా నాయొనర్పంబూనిన సుగ్రీవ విజయంబను యక్షగానంబునకుం గథాక్రమంబెట్టిదనిన" అని సు. వి. ఎత్తుగడ. అట్లే "అంకితంబుగా నాయొనర్పంబూనిన విప్రనారాయణ చరిత్రంబను యక్షగానంబునకుఁ గథా క్రమంబెట్టిదనిన" అని వి.నా.చ. ఎత్తుగడ.

"అని సమస్తా సురారాతి కదంబ; వినమిత నిజభుజా విక్రమ్ము పేర" ఇత్యాదిగా సు.వి. గ్రంథాంత ద్విపద. "అని సర్వజీవదయాపరు పేర" అని ద్విపదలోనే వి. నా. చ. గ్రంథాంతమును. రచనలో రెండింట ద్విపదకును, జంపె, త్రిపుట మొదలగు తాళప్రధానము లగు రేకులకే ప్రాచుర్యము గలదు. ఎడనెడ, సంధివచనము లని పేర్కొన బడలేదు, కాని సంధి ప్రయోజనాత్మకములగు చిన్నచిన్న వచనములు, ఏలలు నర్థ చంద్రికలు నను దేశీయ మధురకవితాచ్ఛందో విశేషములు నతి విరళముగాఁ బద్యములును రెండింటను బ్రయుక్తములైనవి. (కర్తృ కాలము తెలియని యక్షగానముల ప్రాచీనత నూహించుటకీ రచనా

ప్రక్రియా వివేచన తోడ్పడఁగలదు) రచనా ప్రణాళికయే కాదు కావ్యాంతర స్నాయువులను స్పృశించి తత్స్వరూప స్వభావములను నిరూపించు శైలి మొదలగు విషయములుగూడ నీవిప్రనారాయణ చరిత్ర ప్రాచీనతను నిరూపింపఁగలవు.

దక్షిణ దేశమున వైష్ణవ మతప్రవర్తకులగు పన్నిద్దరాళ్వారులలో నొకఁడగు విప్రనారాయణుని చరిత్ర మిందు వర్ణితము. అతనికథ రసికి ప్రశంసల నందినట్టిది. ప్రసిద్ధమైనది. అది యితివృత్తముగా ననేక రసవత్ప్రబంధములును యక్షగానములును తెనుఁగున వెలసినవి. ఈయక్షగానమున గ్రంథకర్త ప్రసిద్ధమగు నాకథలోఁ బ్రత్యేకముగాఁ గావించిన మార్పులులేవు. రాఘవాచార్యుల రచన సలక్షణముగా నున్నది. కాని యంత ప్రౌఢముగా లేదు.

# 3. కందుకూరు రుద్రకవి

## సుగ్రీవ విజయము*

ఇతఁడు పెదలింగనార్య తనూజుఁడు. గురువరాచార్య శిష్యుఁడు. ఇతని నివాసము నెల్లూరుమండలమునందలి కందుకూరు. ఇతని యుదంతముగూర్చి మతభేదములు కొన్ని గలవు. కాని యితని కాలవిషయ

* ముద్రితము. ప్రచురణలు, (1) వేలూరి కుప్పుస్వామి మొదలారివారి అమెరికన్ డైమండుప్రెస్, మదరాసు, 1930 (2) కపిలేశ్వరపురం జమీందారుగారిచే కాకినాడ ముద్రణాలయమున 1939 లో వేటూరివారి పీఠికతోఁ బ్రకటితము.

మున సహేతుకమైన పరిష్కారము కుదిరినది. ఇతఁడు 'క్రీ. శ. 1568 ప్రాంతములవాఁడేని, కొంతతర్వాతివాఁడేని కాఁగలఁడు' అని కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి యభిప్రాయము. (చూ. సుగ్రీవ విజయ పీఠిక) ఆ యభిప్రాయముతో నేకీభవించినారు శ్రీ చాగంటి శేషయ్యగారు. కొంతతర్వాతి వాఁ డనఁగా నెంతో కాదు — "మొత్తము మీఁద నితఁడు బదునాఱవశతాబ్దియం దున్నవాఁడని స్పష్టపడు చున్నది." (చూ. ఆం. క. త. సం. 10 — పుటలు 155 — 160)

ఇందలి కథ ప్రసిద్ధము. అపూర్వ కల్పనాంశము లిందు లేకపోయి నను నున్నంతిలోఁ బ్రతిసన్ని వేశమునందును బాత్రస్వభావోన్మీలన మతి మాత్ర మనోజ్ఞముగా నిర్వహింపఁబడినది.

శ్రీరాముని సీతావిరహక్లేశము, రామునితో నేల కొరగిన వాలి వాదము, తారావిలాపఘట్టము, అంగదు నప్పగింత మొ. సందర్భము లిందులకు నిదర్శనములు. పాత్రల సంభాషణలు చకచక సాగినవి. పలుకు నుడిగారము ట్టిపడుచున్నవి రచన కడు చక్కనిది. రససౌభా గ్యము సమృద్ధిగ గలదు. ఇది కవి సూచించినట్లు కరుణభాసురమైనదే. తాత్కాలికమైన శ్రీరాముని సీతా వియోగ దుఃఖముతో ననఁగాఁ గరుణ విప్రలంభముతోఁ గథారంభము. శాశ్వతమైన భర్తృవియోగ వేదనలోఁ బారస్థాయినందుకొన్న తారరోదనము గ్రంథాంత్యభాగమున ముఖ్యసన్ని వేశము. అనఁగా నిందు కరుణమంగిరసము. అంగముగా వీరరసము సుప్రసక్తము (వాలి సుగ్రీవుల యుద్ధఘట్టమున). మనయక్ష గాన వాఙ్మయప్రపంచమున నిదియొక ప్రశస్తకృతి:— (ఈ రుద్ర కవి కృతియే తమిళముననూ యక్షగానముగనే యనూదితమగుట గమ నింపఁదగినది. చూ. ప్రా. లి. పు. భాం. తమిళగ్రంథములు నం. 509 — 511) దీని రచనా ప్రణాళిక యపుడే చక్రపురి రాఘవార్యుని విప్ర

నారాయణచరిత్రగూర్చి వ్రాయునపుడు తడవఁబడినది. ఇందలి రచనా విశేషములు :— త్రిపుట, జంపె, కుఱుచ జంపె, అటతాళము, ఏకతాళము మొ. తాళప్రధానములైన దరువులు * ధవళశోభనములు, ఏలలు అర్ధచంద్రికలు, (భిన్న గతులలో) మొ. దేశీగీతిచ్ఛందస్సులు, రెండు వందలపైచిలుకు ద్విపదపంక్తులు, ఒక వృత్తము, రెండుసీసములు, ఒక కందము, మూఁడు గీతపద్యములు, సంధివచన ప్రాయములైన యల్ప వచనములు. ఇది యక్షగాన మనియు య. గా. ప్రబంధ మనియుఁ బేర్కొనఁ బడినది.

ఇది శ్రవ్యదృశ్యోభయ ప్రయోజనాత్మకమైనదని తోఁచును ఇందలి పాత్రల సంభాషణలు వచనమున లేకపోవుటయు, నక్కడక్కడ నొక్క దరువులోనే లేక యొక్క ద్విపదలోనే పాత్రల సంభాషణముతో పాటు కథాకథనము నుండుట జూడ నిది గానరూప కథాఖ్యానమున కుద్దేశింపఁ బడినదా యనిపించును. కాని, పరిశీలించి చూచినచో నిది ప్రదర్శన సౌలభ్యమును గల రచనయని తోఁపక మానదు. పాత్రల సంభాషణములు వచనమున లేవన్నమాట కాని గ్రంథమున నాఖ్యాన శైలికంటె సంవాద శైలియే ప్రచురమైనది. సంభాషణ లెక్కువగా దరువులలో సాగినవి. నడుమ నక్కడక్కడ నున్న చిన్న చిన్న వచనములలోఁ గథానుసంధాన మేసూత్రధారునివంటి ప్రదర్శన నిర్వాహకుని వలననో కావింపఁబడును.

ఈసందర్భమున వేటూరి వారి మాట యొకటి స్మరింపఁదగి యున్నది. "ఈరుద్ర కవి సుగ్రీవ విజయమునగూడ స్త్రీ వృద్ధ పామరాదులు పలువురు పాడుచుందురు. ఆ యా పాత్రముల పాటలు తత్తద్వేషధారులువచ్చి పాడునట్లును తక్కిన సంధివచనాదులు ఒక్కరిద్దరు

* కొన్ని సు. వి. ప్రతులలో మాత్రము కొద్ది రాగసూచనలు గలవు.

సూత్రధారప్రాయులు పఠించునట్లును ఈసుగ్రీవ విజయము వీధి యాటగా నాడబడు చుండెడిది. (చూ. వారి సుగ్రీవ విజయపీఠిక) డాక్టరు శ్రీనేలటూరి వెంకటరమణయ్యగారును నీ సుగ్రీవ విజయము తత్కృతిభర్తయగు కందుకూరి జనార్దనస్వామివారి వసంతోత్సవసమయమునందు ప్రథమమునఁ బ్రదర్శింపఁబడి యుండుననుటకు సందియము లేదని సెలవిచ్చి యున్నారు. *

---

## 4. కంకంటి పాపరాజు

### విష్ణుమాయా విలాసము:- ♦

ఉత్తర రామాయణ రసోత్తర కావ్య రచనా విశ్రుతుఁడగు కంకంటి పాపారాజ ప్రధాని యొకచక్కని యక్షగానమునుగూడ రచించియుండుట రసికుల యదృష్టము. అదే విష్ణుమాయావిలాసము శృంగార రసాసవ పూర్ణ సువర్ణచషకము.

అతఁడు నెల్లూరు మండలము నందలి ప్రళయ కావేరి (నేటిపులి కాట్) పట్టణమున నొకప్రభుత్వోద్యోగి. ఆర్వేల నియోగి. ఆపస్తంబ సూత్రుఁడు. శ్రీవత్ససగోత్రుఁడు, వల్లభామాత్యప్రపౌత్రుఁడు, అప్పయ

---

* చూ. వారి 'యక్షగానము – తంజావూరు' అనువ్యాసము. ఆంధ్రపత్రిక ఖర సంవత్సరాది సంచిక.

♦ ఇది యిటీవల తం. స. మ. కే. నం 495 ప్రతిని బట్టి డాక్టరు శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారిచేఁ బరిష్కరింపఁబడి, వారి పీఠికతో వావిళ్ళవారిచేఁ బ్రకటిత మైనది. — మదరాసు 1956.

నరసములకుఁ బుత్రుఁడు, సమీర కుమార విజయ ప్రబంధకర్తయగు పుష్పగిరి తిమ్మనార్యుని మిత్రుఁడు. మదన గోపాలస్వామి భక్తుఁడు. ఆ స్వామి కే తన కృతిద్వితయము నంకిత మిచ్చినాఁడు. ఈవిషయములెల్ల నతని కృతులనుండియే యెఱుకపడుచున్నవి. అవియటుండ ముందు ముఖ్యముగాఁ జూడఁదగిన దతని కాలవిషయము:

ఈవిషయమున నిప్పటి దనుక మనకు కీ. శే. వీరేశలింగముగారి మాటయే ప్రమాణము. "ఈతఁడు క్రీ. శ. 1790 ప్రాంతమున నుండు నట్లు చెప్పుచున్నారు. కవి యిప్పటికి నూఱుసంవత్సరముల క్రిందట నుండినవాఁడు" అని వారి కవుల చరిత్ర. ఆమాటయే నేఁటి దనుక పరంపరగా వాఙ్మయ పరిశోధకులచేతను విశ్వసింపఁబడుచు వచ్చుచున్నది. అందులకుఁదగిన యాధారములేదు. కవికాల నిర్ణయమున కిటీవల ప్రబలమగు నాధార మొక్కటి కన్పట్టినది. మదరాసు ప్రభుత్వ ప్రా. లి. పు. భాం. స కంకంటి పాపరాజు నుత్తర రామాయణప్రతులనేకము గలవు. అందు డి. నం. 9 తాళ పత్రప్రతి యతిశిథిలమై, కడుప్రాచీనముగఁ, గన్పట్టును. దాని చివర "ప్రజోత్పత్తి నామసంవత్సరపుష్య బహుళ ఏకాదశిలు, మంద వారం వరకు మునగాల తిరువెంగళయ్యా వ్రాసిన ఉత్తర రామాయణము సంపూర్ణము" అని కలదు. ఇది స్వామి కన్నుపిళ్లెగారి "ఇండియన్ ఎఫిమెరిన్" ప్రకారము క్రీ.శ. 7-1-1632 తేదికి మాత్రము సరిపోయినది. శక సంవత్సర సంఖ్య చెప్పఁబడనప్పుడు క్రీస్తుశకపు తేదీ నిర్ణయించుటకు సంవత్సర మాసపక్ష తిథులతోపాటు విధిగా వారముగూడ చెప్పఁబడినప్పుడే యది పొసఁగును. మన సంవత్సరషష్టి చక్రము మఱలమఱల నావృత్తమగుచునే యుండును. ఆమాసము లాపక్షము లాతిథులే యథాపూర్వము సంభవించును. వానితోపాటు వార నిర్దేశమైనచో నవి యన్నియుఁ గుదిరిన తేదీ

మఱల మఱల సంభవించుట కాదాచిత్కము.[1] కాని కేవల మసంభవ మని తలఁపరాదు. ఒక్కొకప్పుడు మూఁడు నాలుగావృత్తులకే యట్టిది సంభవింపవచ్చును. కాని ప్రస్తుత సందర్భమున క్రీ. శ. 16-2 తరువాత మఱల నట్టిది తటస్థింపలేదు. అందుచే మన మా తేదీని ప్రమాణముగా గ్రహింపవచ్చును. అయితే యది ప్రతి విలేఖన కాలము మాత్రము. గ్రంథకర్త యంతకుఁ బూర్వుఁడు గావలెను. ఎంతపూర్వుఁ డది ప్రకృత ముదయించు ప్రశ్న. తత్సమాధానమున కొక ద్రావిడ ప్రాణాయామమును బట్టవలెను.

పాపరాజు పుష్పగిరి తిమ్మకవిని దన యాప్తసఖునిగా స్వీయ కృతులు రెండింటను స్మరించియున్నాడు. ఆ పుష్పగిరి తిమ్మకవి శేకు మళ్ళ రంగశాయికవి కతని ద్విపద భాగవతరచనలోఁ దోడ్పడినట్లుండు జెప్పఁబడినాడు అనఁగా పాపరాజు, పుష్పగిరి తిమ్మన, రంగ శాయి కవులు ముగ్గురును సమకాలికు లగుట సునిశ్చితము. ముగ్గు రును నెల్లూరుమండలమువారు. రంగశాయి తన ద్విపద భాగవతమున ద్విపద భారత కవిత్రయములోఁ బ్రథముఁడగు "బట్టెపాటి తిరుమల భట్టుగారి ప్రౌఢోక్తులు గలుగ స్మరించి" నాఁడు. బట్టెపాటి తిరుమల భట్టు, తిమ్మకవి యన్నను నతఁడే (తిరుమల శబ్దభవమే తిమ్మ), తన ద్విపదభారత విరాటపర్వమును జంగాల ముమ్మయకుఁ గృతి యిచ్చెను.[2] జంగాల ముమ్మయ యల్లుఁడైన పాలచూరి కృష్ణభూపాలుఁడు తెనాలి రామభద్రకవి విరచితమైన యిందుమతీ పరిణయమునకుఁ గృతి భర్త. ఈ రామభద్రకవి తెనాలిరామకృష్ణకవికిఁ దమ్మునిమనుమఁడు.

1. అముద్రితము. చూ. ప్రా. లి. భాం. ప్రతి ఆర్. సం. 765.
2. ఆంధ్ర విశ్వకళా పరిషత్ప్రకాశితము.
3. ఇం. ప. అముద్రితము. తం. స. మ. కే. సం. 138.

"రామభద్రకవి క్రీ. శ. 1575 ప్రాంతమున నీ యిందుమతీపరిణ యమును రచించియుండునని తోఁచుచున్న" దని శ్రీచాగంటివారు.[1] కాగా రామభద్రకవి కృతిభర్తకు పిల్లనిచ్చిన మామగారగు జంగాల ముమ్మయయు నతనికిఁ గృతియిచ్చిన బట్టేపాటి తిమ్మయయు క్రీ. శ. 1575 ప్రాంతమున నుండియుందురనుట యనుచితము గాదు. తీగెతీసిన డొంకయంతయుఁగదలినది. నలుగురైదుగురుకవుల కాలములు తెలియ వచ్చినవి. ఇంతకును దేలినదేమనగా, నటు బట్టేపాటి తిమ్మయ కాలము నకును నిటు ప్రా. లి. పు. భాం. డి నం. 9. ఉత్తర రామాయణ ప్రతి విలేఖన కాలమునకును నడుమఁగా క్రీ. శ. 1575–1632 సం. లకు నడుమ కంకంటి పాపరాజు, పుష్పగిరి తిమ్మకవి, తేకుమళ్ళ రంగయశాయి కవులుండి యుండురనుట సిద్ధార్థము. * ఆనడుమ నెపుడో పాపరాజు విష్ణుమాయా విలాసరచన జరిగియుండును. అది బహుశా కొంచె మిటు నటుగా క్రీ. శ. 1600 ప్రాంతము కావచ్చును.

పాపరాజు తన వి. మా. వి. యక్షగాన రచనగురించి తదుపరి రచనయగు నుత్తర రామాయణ గ్రంథావతారి కాశ్వాసాంతగద్యలందు సగర్వముగాఁ బ్రకటించుకొనినాడు.

---

1. ఆం. క. త సం 10 — పుట 53.

* నా యీ కవి కాల నిర్ణయమును డాక్టరు శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగా రామోదించి యున్నారు. చూ. వారి వి. మా. వి. పీఠిక.

కొందఱప్పకవి పాపరాజాదులను పేరొ్కనలేదను కారణమున వారి పూర్వ కాలికత్వమును శంకింపఁజూతురు. అప్పకవి పేరొ్కనని తత్పూర్వకవుల సంఖ్య రెండువందలకుఁ బైఁబడిగలదు. అందుచే నాపూర్వకవుల కాలనిర్ణయవిషయమున నున్నంతలో నదియొక యాధారమగును గాని లేనివిషయముల నదియొక సాకుగారాదు.

ఇందలి యితివృత్తము క్షీరసాగర మథన కథ కన్యాని జగన్మోహినీ వృత్తాంతము.[1] కథ కడు ప్రసిద్ధము. రసవంతము నైనది. ఆ యొక్క చిన్న సన్నివేశమును గ్రహించి దానిని రసప్రకృష్టముగాఁ బ్రపంచించి కంకంటికవి తీర్చినతీర్పులో నెల్లూరి నెఱజాణ నేర్పంతయుఁ గన్పట్టినది. ఉత్తరరామాయణమున నున్నంత ప్రబంధశైలీ ప్రాగల్భ్యము లేకున్నను నిండు మధుర పదప్రచురమైన రసోచిత రచనగలదు. పలు తెఱంగుల తెలుఁగు నుడిగార ముట్టిపడుచున్నది చతురాతి చతురమైన భావప్రౌఢి గలదు.

ఇందు రకరకముల పదములు, దరువులు రాగ తాళ ధారాళములైనవి కలవు. ఏకతాళ, జంపె, కుఱుచ జంపె, త్రిపుట, రచ్చ తాళం, ఆది, అటమట్టెఁ లఘు శేఖరము మొ తాళ ప్రధానములైన దరువులే యెక్కువ. ఏలలు, అర్ధచంద్రికలు, ధవళ శోభనములు, నడలు త్రిస్తబకము మొ. అనేక దేశి మధుర కవితారచనలు గలవు. అవియుఁ జాల మట్టునకుఁ దాళప్రధానములైనవే. నీలాంబరి, ఘంటారవ, ఆహిరి, శేగుత్తి మొ. రాగముల పేళ్ళతోఁ గొన్ని పదములు గన్పట్టును గాని గతిలో నవియుఁ దాళ ప్రధానములుగనే నడచినవి. రాగ ప్రాధాన్యముగల పాటలును గలవు. అవి వసంత తిలకము, నాధరామ క్రియ, మధ్యమావతి, పంతువరాళి, మొ. రాగములలోఁ గలవు. వానికిఁ దాళము లుదాహరింపఁబడలేదు. అవి పదములని పేర్కొనఁబడ లేదు. ఇందింకను బలుపద్యములు, ద్విపదలు, లయగ్రాహి, అష్టకము, సం. చూర్ణిక, శ్లోకములును గలవు. వచనము పరిమితముగా సంధివచన

1. ఆంధ్రమున విష్ణుమాయా విలాసాభిధానకృతు లింకను గలవు. వాని పరస్పర సంబంధములనుగూర్చిన విచారణ శ్రీ వెంకటరమణయ్యగారి వి. మా. వి. పీఠికలో జూడనగును.

ప్రాయముగా నున్నది. కాని దరువులలోఁ బాత్రల నడుమఁ గమ్మని సంభాషణలు గ్రుమ్మరించినాఁడు కవి. సన్నివేశమునకుఁ దగిన పద ప్రభేదము నెన్నుకొనుటలో గడుసరి పోకడలు పోయినాడు. 'చెవులకుఁ జవులుగ జెప్పెద మోహిని, యవతారము తెలఁగని' శుకుఁడు పరీక్షిత్తుతో నన్నాఁడని యున్నది యెత్తుగడలో. అది పాపరాజు రచన యెడను సార్థకము. రుద్రకవి రచనా ముద్ర దీనిపై లేకపోలేదు. ఇదియు నతని సుగ్రీవ విజయమువలె శ్రవ్యదృశ్యోభయ ప్రయోజనాత్మకమైనదే. ఇది యక్షగాన మని పేర్కొనఁబడినది. "భూమిని దిలకించి బుధు లెల్ల పొగడ" నిది విభాసిల్లునని కవి యాశయము.

---

# 5. తేకుమళ్ళ రంగశాయి

**జానకీ పరిణయము :**

ఇతఁడొక నెల్లూరు మండలకవి. ఇతని కృతులని సునిశ్చితముగాఁ దెలిసినవి రెండు లభించినవి. అందొకటి వాణీ విలాస వనమాలిక [1] మరి యొకటి ద్విపద భాగవతము [2] మొదటిది "బహు ప్రబంధకర్త"యైన మహాంకాళి వెంకటపతి తోడ్పాటు వలనను, రెండవది పుష్పగిరి తిమ్మకవి తోడ్పాటు తోడను రచింపఁబడినవని యందుఁ గలదు. పుష్పగిరి తిమ్మకవి కంకంటి పాపరాజునకువలె నితనికి సహాశ్రోత యఁట. అనఁగా నీనలుగురు కవులును సమకాలికు లగుచున్నారు. పాపరాజు

---

1. ప్రా. లి. పు. భాం. వారిచేఁ బ్రచురితము
2. ప్రా. లి. పు. భాం., ఆర్. నం. 765.

కాలముతోఁ పాటి రంగశాయి కవి కాలముకూడ క్రీ. శ. 1575–1632 ప్రాంతమునిమీఁదనిర్ణయింపఁబడియున్నది. రంగశాయి శ్రీవత్ససగోత్రుఁడనియుఁ, దిమ్మాంబికా కప్పరామాత్యుల పుత్రుఁడనియు, రామభద్రార్యుని శిష్యుఁడనియు నతని గ్రంథముల వలనఁ దెలిసినది. అందితని కృత్యంతరములును చేర్కొనఁబడినవి. అవి తిరువళ్ళూరు వీరరాఘవ శతకము, కృష్ణదండకము, జానకీ పరిణయ యక్షగానము. తాను 'జానకీ పరిణయ యక్షగానము' రచించి యుండినట్లు పై రెండు గ్రంథములందును జెప్పినాఁ డితఁడు. కాని యీ శతక దండకములు గాని యీయక్షగానము గాని నేఁడు లభించుట లేదు. ఇప్పటి దనుక రంగశాయి చరిత్ర మన కవిచరిత్ర గ్రంథములకెక్కలేదు. ఇతఁడు నొక యక్షగాన కర్తయని తెలియవచ్చుటచే నిటఁ బ్రసక్తమైనది.

---

# 6. బాలపాపాంబ

## అక్కమహాదేవిచరిత్ర: *

ఈమెయే ప్రప్రథమాంధ్ర యక్షగాన కవయిత్రిగా నూహింపఁబడుచున్నది. ఈమె తన తండ్రి "వీరవసంత వసుమతీశుఁ" డని చెప్పినది. వీరవసంతరాయఁడను వానికి సంబంధించిన శాసనములు కొన్ని గలవు.

1. తారమంగలము శాసనము :— కాలము క్రీ. శ. 1567. (19 of 1900, M. E. R. 1900, P. 31, Sewell I. P. 200) — ఇందు వీర వసంతరాయఁడు సింహళమును జయించినట్లు గలదు.

---

* ప్రా. లి. పు. భాం. డి. నం. 1834, 1835.

2. మఱియొక తార మంగలము శాసనము —కాలము క్రీ. శ 1568 (సేలంజిల్లా, ఓమలూరుతాలూకా :— S. No. 122 of Vol. I of the Topographical list of Inscriptions of the Madras Presidency).

వీర వసంతరాయఁడు ఇళమసముద్రమను గ్రామమును తార మంగలములోని కైలాసనాథ — ఇళ మీశ్వర దేవాయ తనముల కిచ్చి నట్లున్నది.

3. మైలం పట్టిశాసనము :- కాలము క్రీ. శ. 1587 (కోయం బత్తూరు జిల్లా, పోలాకితాలూకా, S. No. 379 of Vol. I, Ibid) ఇదివీరవసంత రాయని ప్రధానియొక్క శాసనము.

పై మూఁడు నొక్కనికి సంబంధించినవే కావచ్చును. అతఁడు విజయనగర రాజుల క్రిందఁగాని మధుర నాయకుల క్రిందగాని యొక సేనానియో పాళెగాఁడో యై యుండునని తోఁచుచున్నది. పై శాసన ములలో రెండవదానిని బట్టి యతఁడు శివభక్తిపరుఁడని తెల్లము. పాపాంబ శివభక్తురాలని యామె గ్రంథమే చెప్పక చెప్పుచున్నది. కాని యింకను నితరాధారము లరసి యీ వీరవసంతుఁడే పాపాంబ తండ్రియని స్థాపింపఁగలిగిననాఁడే యామె పదునాఱవశతాబ్ది యుత్తరా ర్ధమునకుఁజెందినదని నిర్ణయింపవలెను. సుగ్రీవ విజయ సంవాదిగా నున్న యీామె గ్రంథరచనాప్రక్రియ యొకటి తత్ప్రాచీనతను సూచింపఁ గలదు. ఇప్పటిమట్టున కీగ్రంథరచనా కాలము క్రీ. శ. 16 వ శతాబ్ది యుత్తరార్ధముగా నూహింపఁబడుచున్నది.

ఈ పాపాంబ కృతి అక్కమహాదేవి చరిత్రకే అక్కమహాదేవి బోధోల్లాసమనియుఁ బేరు. అక్కమహాదేవి వీరశైవమత ప్రవర్తకు లగు బసవేశ్వరునకు, నల్లమ ప్రభువునకును సమకాలికయైన మహాభక్త రాలు. ఆమె కథ ప్రభులింగ లీలలలోఁ గొంత గలదు. పాపాంబ

కృతిలో నామె కథ యేమనగా:— పార్వతీదేవి యొకపరి శివునితోఁ బంతము పట్టి యల్లమ ప్రభునిఁ దన మాయకు దాసునిఁజేయఁ బ్రయత్నించి యది కుదురక శివు ననుమతమునఁ దన సాత్త్విక తేజమున భూలోకమున అక్కమహాదేవి నవతరింపఁ జేసినది. ఆమె ఉడుతడి పురాధీశుఁడైన విమలుని పుత్త్రియైనది. ఒక యానవెట్టి జైన నృపాలు నొకనిఁ జేపట్టినది. కాని యతఁడామె కభీష్టమగు లింగధారణము జేయ నిరాకరించెను. అంతట నామె యోగావేశమెత్తి తల విరియఁబోసి కొని నగ్నముగా నగరు వెడలి చర చర పుర వీథులు గడచి యడవులఁ బడి కొండలు కోనలు నడచి కళ్యాణపురి చేరి యట ననుభవ మంటపాభ్యంతరమునఁ గొలువు దీరియున్న అల్లమ ప్రభువుని దర్శించి, యతని కఠిన పరీక్ష కాగి యతని వలన యోగ రహస్యము దెలిసి శివుని గూర్చి తపము సేయ శ్రీగిరి కరిగెను. పార్వతి తన పంతము విడిచెను.

పాపాంబ "సంగీత సాహిత్య సరసలక్షణాల రంగు మీఱిన యట్టి రమణి" యఁట. ఈ కృతిలో జంపె, అట, ఏక, త్రిపుట, రచ్చరేకులు మొ. తాళప్రధానములైన దరువులు, ద్విపదలు, వచనములు, కందాది పద్యములు, అర్ధచంద్రికలు, జోలలు, శోభనములు, మంగళ హారతులును గలవు. రచన:— చక్కనిది. కవయిత్రికి వర్ణన లన్నఁగను ప్రీతి. కైలాసము, ఉడుతడి కల్యాణపుర వర్ణనలు, అక్కమ శైశవము, సూర్యాస్తమయ చంద్రోదయము మొ॥ సందర్భములు చక్కగా వర్ణింపఁబడినది. కథా కథనమును జక్కగా నిర్వహింపఁబడినది. పార్వతీ పరమేశ్వరుల పందెపు సంవాదములు, అక్కదేవి మహాప్రస్థానము మొ. సందర్భము లందు యథా శక్తిఁ దన విదగ్ధతను బ్రదర్శించినది. పాపాంబ దీనిని యక్షగానమని పేర్కొన్నది. తననాఁటి కనేక యక్షగానములు వెలసినట్లు సూచించినది.

---

# 7. క్రాంజ వెంకటాద్రి

## వాసంతికా పరిణయము: *

ఈ కవి నివాసము " శ్రీ మించు కర్ణాట సింహాసనంబునఁ బరగి యహోబల ప్రాంతమునను జెలఁగి — , తొరగంటి నరస రాజేంద్ర దత్తమగుచు వెలయు — గుళదూర్తి యగ్రహార " మని యీవాసంతికా పరిణయమునఁ గలదు. ఇది కర్నూలుజిల్లా కోయిలకుంట్ల తాలుకాలో నున్నది. ఈ యగ్రహార ప్రదాత తొరగంటి నరసరాజనఁగా బట్టుమూర్తి నరస భూపాలీయ కృతిపతియుఁ దొరగంటి దుర్గాధ్యక్షుఁడు నళియరామ రాయాదులకు మేనల్లుఁడును, తిరుమల రాయల కల్లుడు నగు పోచిరాజు నరసరాజు. నరస భూపాలీయావతారికలో రామ రాయ తిరుమలరాయల ప్రశంస గూడఁ బ్రత్యేకముగాఁ గలదు. దానిని బట్టి నరస భూపాలీయ గ్రంథ ప్రాదుర్భవము నాఁటికిఁ దిరుమల రాయ లింకను బట్టాభిషిక్తుఁడు గాలేదనియుఁ గర్ణాట సామ్రాజ్యము చెక్కు చెదరక రామరాజు నేల్బడి లోనే యుండిన దనియు స్పష్టమగు చున్నది. క్రీ. శ. 1565 సం. లో రక్కస తంగిడి యుద్ధమున రామ రాజు నిహతుఁ డగుటయుఁ గర్ణాటరాజ్య క్షీణ దశారంభ మగు టయుఁ బిదప తిరుమలరాయలు గద్దె నెక్కుటయు జరిగినవి. అనఁగా నరస భూపాలీయమునఁ దొరగంటి దుర్గాధ్యక్షుఁడుగాఁ బ్రశంసితుఁ డైన నరసరాజు రామరాజు కాలముననే యనఁగా క్రీ. శ. 1560 ప్రాంతముననే యా పదవియందుండెననుట స్పష్టము. ఒక దుర్గాధ్యక్ష మాత్రునిచే దత్తమైన యొక యూరి కతని పేరుపెట్టఁబడి యుండినచో నది యాపేర నెంతకాలమైనను వ్యవహృతము గావచ్చు కాని దాతృ

---

* తం. స. మ. కే. నం. 494.

నామము గ్రామనామము వేఱైన యప్పుడా దాతృ నామము సాధారణముగ నాదాతతో పాటో యాదాతకు సంబంధించిన యధికారమంతరించుటతో పాటో విస్మృతమగు నవకాశము గలదు. ఇట్లుగాక వెంకటాద్రి కవి తన గ్రంథమునఁ బ్రత్యేకముగాఁ దమ గుళ్ళదూర్తి గూర్చి తొరగంటి నరసరాజ దాతృత్వ ప్రశంసను జేసియుండుటఁ జూడ నానాఁటికి నరసరాజధికారమున నుండెనేమో యను శంక వొడముచున్నది. అదిగాక కవికర్ణాట సింహాసనపు టుచ్చస్థితిని గూడ సూచించి యున్నాఁడు. గ్రంథరచనయుఁ బ్రాచీనతను సూచించుచున్నది. ఈ గ్రంథమును గూర్చి డాక్టరు శ్రీ నేలటూరి వెంకట రమణయ్య గారు 'ఇది యహోబల క్షేత్రమునకు సంబంధించిన కథయై యుండునేమొ. క్రీ. శ. 16 శతాబ్దపు టుత్తరార్ధమున నహోబల మఠాధిపతి యగు శఠగోప జీయరను విద్వద్వతంసుఁడు వాసంతికా పరిణయమను సంస్కృత నాటకమును రచించెను. ఆ కథనే యహోబల ప్రాంతము వాఁడైన వెంకటాద్రి యక్షగానము గావించెనేమొ' యని వ్రాసియున్నారు. * ఇది వా రూహించినట్లచ్చముగా నహోబలక్షేత్ర గాథయే. ఆ నరసింహస్వామియే యిందలి నాయకుఁడు. చెంచెతయగు వాసంతిక నాయిక. ఆ యహోబల మఠాధిపతి వ్రాసిన వాసంతికా పరిణయ నాటకేతి వృత్తము నిదేకావచ్చునను నేలటూరి వారి యీ యూహయు నిక్కమై యుండును. ఆ యీ కారణములచే వెంకటాద్రి కృతిరచనము క్రీ.శ. 16 వ శతాబ్ది యుత్తరార్ధమున జరిగి

---

* చూ. వారివ్యాసము ఆంధ్ర పత్రిక ఖర సంవత్సరాది సంచిక పుట 23.

ఆ శఠగోప జీయరు 16 వ శతాబ్ది యుత్తరార్థము నందుండెననియు, నతఁడు వాసంతికా పరిణయమను సంస్కృత నాటకము వ్రాసెననియు యస్. కృష్ణస్వామిఅయ్యంగారి "Sources of the Vijayanagar History" 233 వ పుటలోఁ గలదు.

యుండు ననవచ్చును. (ఇది యిప్పటి కూహామాత్రము, నిర్ణయాధి కారము భావి పరిశోధకులది)

ఈ వెంకటాద్రికవి "క్రౌంజవంశాయతుండు". ఈ వంశకర్త తిరుమలార్యుఁడఁట. లింగాంబికయుఁ గొండుభట్లు నీతని తలిదండ్రులు. సింగిరిభట్లు, కొండుభట్లు నను వారలతని పితామహ ప్రపితామహులు. కవి "సకల లక్షణ లక్ష్య మర్మ విశారదుఁడు", "సాహిత్య విద్యా ప్రచండుఁడు", "సరస గానకళా ప్రవీణుఁడు" నఁట.

అహోబల నరసింహస్వామి వాసంతిక (వసంతస్య పుత్రీ) యను చెంచెతను బెండ్లియాడిన కథ యిందు వర్ణితము. ప్రసిద్ధమైన గరుడాచల నాటకము లేక చెంచు నాటకమను దానిలో నిదే యితి వృత్తము. ఇందలి రచన సరసముగా సాగినది. ఇందు ధవళ శోభనములు. సువ్వాల, ఏలలు, త్రిభంగులు, అష్టకము మొ. మధుర కవితారచనలు, జంపె, త్రిపుట మొ. తాళ ప్రధానములైన దరువులు, దీర్ఘద్విపదలు, వచనములు, నెడనెడ కందములును గలవు. ద్విపద వచనములందుఁ గథాకథనము, దరువు లందుఁ బాత్ర ప్రవేశ సంభాషణములు నెక్కువగా నుద్దిష్టములు. ఇది యక్షగానమని పేర్కొనఁబడినది.

---

# 8. పరమానందతీర్థయతి

## ముక్తికాంతాపరిణయము: *

పరమానంద యతికృతముగాఁ దొమ్మిది (అద్వైత) తత్త్వ ప్రతిపాదకములైన గ్రంథములు గన్పట్టుచున్నవి.[1] అందు వచన ద్విపద కావ్యములు, పద్య శతకములు, నొక యక్షగానప్రాయ రచనయుఁ గలవు. పరమానంద యతి తన గ్రంథములందు దత్తాత్రేయ యోగి యొకనిఁదన గురువుగా సంభావించెను. నెల్లూరు సమీపమున నొక దత్తాత్రేయ మఠముండెడిదని యొక నెల్లూరు మండల శిలా శాసనము వలనఁ దెలియుచున్నదనియు, నాదత్తాత్రేయ యోగి మహావిద్వాంసుఁడనియు, నతని మఠము నాశ్రయించి (మతవిషయిక) గ్రంథ కర్తలనేకులు బయల్వెడలిరనియు, చంద్రభాను చరిత్ర కర్తయు, క్రీ. శ. 1586–1613 వఱకు కర్ణాట రాజ్యము నేలిన వెంకటపతి రాయల యాస్థాన కవియు నగు తరిగొప్పుల మల్లనకవి తాను దత్తాత్రేయ యోగి శిష్యుఁడైనట్లు చెప్పుకొనియుండుటచే దత్తాత్రేయయోగియు నాతని శిష్య ప్రశిష్యులును 16 వ శతాబ్ది యుత్తరార్థము నందుండిరని నిశ్చయించుటకు సంశయింప నవసర ముండదనియు శ్రీ చాగంటి శేషయ్యగారనుచున్నారు.[2] పరమానంద యతి కాలము క్రీ. శ. 1600 ప్రాంతమని యూహింప నగును.

---

* తం. స. మ. కే. నం. 557 — 558

1 చూ. ఆం. క. త. — సం. 10 పుట 178.

2 ఆంధ్ర కవి తరంగిణి — సం. 10. పు. 182, 183.

(శిష్యుల వలన విశేష యశస్సు నార్జించిన పరమానందయ్య యనుయోగి యితఁడగునో !)

ఇతని యక్షగానప్రాయరచన ముక్తికాంతాపరిణయము ఇందును "... మర్త్య దత్తాత్రేయ మానికి జేజే" యని గురుని స్మరించి యున్నాఁడు. ఇతఁడు దీనిని యక్ష గానమనక "కరమొప్ప వరముక్తి కాంతా వివాహ, మరు దారఁబదచాళి కమరఁజెప్పెదను" అని యుండెను. పదచాళిక లేక పదకేళిక యనఁగా నొకపదమును బాడుచుఁ బదోద్దిష్టమైన రసము నభినయ రూపమున నావిష్కరించుట (పదకేళిక లాంధ్ర దేశమునఁ జాలకాలమునుండి సాగుచుండినను దంజావూరు నాయక రాజాస్థానమున ముఖ్యముగా రఘునాథనాయకుని కాలమునుండి వాని ప్రతిష్ఠ వెల్లి విరిసినది. పదచాళి శబ్దమునకుఁ బ్రచార మచ్చటినుండియే హెచ్చుగా సాగినట్లు తోఁచును.)

పదచాళి యనఁబడిన యీ గ్రంథమునందు నాలుగైదు చోట్ల నొక పాటి పొడవైన ద్విపదలు గలవు. కాని గ్రంథ మంతయు నొక దరువు నొక వచనము చొప్పున నడచునని స్థూల ముగాఁజెప్పవచ్చును. దరువులకు రాగ తాళముల పేళ్ళుదాహరింపఁ బడలేదు. ఇది యక్షగాన ప్రాయమైన రచనా ఫక్కికయే యగుటచే దీని కిటఁ బ్రసక్తి కల్గినది. గ్రంథవిషయము :— సచ్చిదానంద పురాధీశ్వరుఁడు తన పుత్రిక యగు మోక్ష కన్యకు స్వయంవరము చాటించును. వివిధ మతాధిపతు లను దేశాధీశులు విచ్చేయుదురు. ఒక్కొక్కరి నొక్కొక్క నెపమున నొప్పరికించు మోక్ష కాంత సద్గురుఁడే దైవమని విశ్వసించు వేదాంతమతస్థుఁడగు 'వివేక జీవేశ్వరుని' వరించుట యిందలి ప్రధాన విషయము.

ఇందలి విషయము కొంత వట్టు సాంకేతికముగా సాగినను బెండ్లి వేడుకలు మొదలగు సాధారణ విషయములును సరసముగా వర్ణింపఁ

బడినవి. శైలి సరళమైనది. అటనడ దొసఁగు లున్నను మొత్తము పై రచన చక్కనిదనియే చెప్పవచ్చును.

---

# 9. రామబ్రహ్మయోగి

**ఏఱుక :— ***

ఇది 'రామ బ్రహ్మయోగి విరచిత సుజ్ఞాన పెఱుక యను యక్షగానం' బని యున్నది. గద్యలో 'ఎఱుక' యను వేదాంత గ్రంథమని యెత్తుగడ. ఈ గ్రంథకర్త గురువు పేరు కూడ రామ బ్రహ్మమే. గ్రంథమునఁ బలుతావుల నతని ప్రశంస గలదు. అతనికే యంకిత మిది. తాళ ప్రధానములైన దరువులు కలిగి యుండలి రచన ప్రాచీన యక్ష గాన ఫక్కికి సన్నిహితముగా నున్నది. ఇప్పటికిఁ దెలియ వచ్చి నంతలో రామ బ్రహ్మ గురుఁడొకఁడు గలఁడు. అతఁడాంధ్ర భగ వద్గీతలను గ్రంథము రచించిన కంభముపాటి నారపామాత్యునకును గురువు. నారప "క్రీ. శ. 16 శ. ఉత్తరార్ధముననున్న వాఁడని నిర్ణ యింప వచ్చునని" యాంధ్ర కవి తరంగిణిలోఁ గలదు. (సం. 10 — పుట 198) అందుచే నిప్పటి మట్టునకీ రామబ్రహ్మ యోగి కూడ నాకాలము వాఁడని యూహింపఁబడుచున్నాఁడు. (ఈ రామ బ్రహ్మ యోగి, నారప — ఇరువురు నద్వైతవాదులే)

---

* 'ఆత్మ యెఱుక' అను పేర నిది ద్వివారము ముద్రితమైనది.

1. శ్రీరాజరాజేశ్వరీ నికేతన ము. శా. మదరాసు, 1902.

2. శశిరేఖా ము. శా. మదరాసు, 1912. (ఇందు కర్తపేరు లేదు. గంథాంత గద్య కొంఅవడినది)

'ప్రతిలేని నిర్గుణుని బతిగాను మతిగోరిన' బుద్ధికాంతకడ కేళిక యను నేళికత వచ్చి కొంత వేదాంత గోష్ఠి నెఱపుట యిందలి ముఖ్య విషయము విషయక్లిష్టత నుజ్జగించి యుదాత్తతను బాటించి రచనయు నట్లు నడపినాఁడు కవి. జంపె, కుఱుచ జంపె, ఆది, ఏక, అట, త్రిపుటలలోనే దరువులు, ద్విపదలు, పద్యములు, ఏల, చూర్ణికయను నవి యిందలి రచనా విశేషములు. ద్విపదలలోఁ బ్రాస యతి పాటింపఁబడినది. దరువులలో శబ్దముల ననవసరముగా సాగదీయుటలు లేవు.

---

# 10. ఎలకూచి బాలసరస్వతి

## రంగకౌముది :—

ఇతఁడు సుప్రసిద్ధుఁడు. క్రీ. శ. 1600 ప్రాంతము నందుండిన వాఁడు * ఇతఁడు "కౌముదీ నాటక కావ్య కవిని" అని తన ఆంధ్ర శబ్దచింతామణి వ్యాఖ్యానమునఁ దెలిపినాఁడు. ఆ గ్రంథమలభ్యము. ఇతని కాలము నాఁటికి సంస్కృత మార్గనాటకములవంటి నాటకములు లేవు కనుకను, యక్షగానము రాను రాను నాటక శబ్దవాచ్యాత్మమై యుండుట చేతను నా కౌముదీ నాటకము యక్షగానమే యై యుండునని కొంద ఱూహించిరి. ఆతఁడు తన రాఘవ యాదవ పాండవీయమున "కవి సమీహితరంగ కౌముదీ నామనాటక విధాన ప్రతిష్ఠా ఘనుండ" నని యున్నాఁడు. కొంద ఱిందలి 'నాటక విధాన' శబ్ద సంపుటిపైఁ జూపు నిగిడ్చి యది నాటక లక్షణమును దెలుపు నొక శాస్త్ర గ్రంథమై

* అతని గుఱించి విశేషములకు ఆం. క. త. 11 వ సంపుటము జూచునది.

యుండుననిరి. మనకు లక్ష్యకోశమే లేదిఁక లక్షణ గ్రంథము నెందులకు రచించి యుండు నతఁడని కొందఱందురు. ఆ రెండును వేర్వేఱు గ్రంథ ములై యుండును, కౌముది నాటకము, రంగకౌముది నాటకశాలా లక్షణ గ్రంథమునై యుండునని మఱికొందరి మతము. కౌముది, రంగ కౌముది — అనునవి మన యక్షగానముల యెడ వింత పేళ్ళు. మన యక్షగాన వాఙ్మయ ప్రపంచమున నట్టిపేరు మఱి కానము. ఇంతకు నా కౌముదీ నాటక మసలు సంస్కృత నాటకమే యై యుండునేమో!

# 11. వెలుతురుబల్లి విశ్వనాథకవి

## శ్రీ రామ వి జ య ము : —

ఈ కవి క్రీ. శ. 1555 — 1607 సం. ల నడుమ పెద్దాపుర సంస్థానాధి పతియగు వత్సవాయి తిమ్మజగపతి కంకితముగా శేష ధర్మములను గ్రంథమును రచించి యుండెను. అందు కృతికర్త నుద్దే శించి కృతి భర్త మాటలుగా =

" సృజియించినాఁడవు శ్రీరామ విజయంబు
యక్ష గానంబు చిన్నపుడె రూఢి "

యని యున్నది. దీనినిబట్టి యీ యక్షగాన రచన క్రీ. శ. 1600 సం. నకుఁబూర్వమే జరిగి యుండునని నిశ్చయింపవచ్చును. ఆగ్రంథ మిపుడుప లబ్ధముగాదు. (ఈ విశ్వనాధ కవి వృత్తాంతము 'పెద్దాపుర సంస్థాన చరిత్రము. 33—34 పుటలలోఁ గలదు)

# 12. కాకునూరి అప్పకవి

## అంబికావాదము :—

సుప్రసిద్ధుఁడైన యాంధ్ర లాక్షణికుఁ డితఁడు. తన యప్ప కవీయమున యక్షగాన లక్షణమును దడవుటయే కాక యొక లక్ష్యమును గూడ రచించి యుండెను. "అంబికా వాద నామక యక్షగాన కృతియుఁ జేసితి" నని యప్ప కవీయావతారికలోఁ జెప్పి యున్నాఁడు. కాని యట్టి లక్షణవేత్త యొక్క యీలక్ష్య మెట్లుండునో చూచు నదృష్ట మదృష్టమే యైనది. అప్ప కవీయ రచనారంభ వత్సరమందు 'శాలివాహన శకమున గజశైల శరసుధా కిరణుల సంఖ్య' గాఁజేర్కొనఁబడినది. అనఁగా శా శ. 1578 = క్రీ .శ. 1656. అంబికా వాద రచన మంతకు ముందే జరిగినది.



# 13. దేవవరపు శోభనాద్రి

## బాలక్రీడా విహారము :—*

ఇతఁడు హారితసగోత్రుఁడు. దేవవరాన్వయుఁడు. కొడూరు వాస్తవ్యుఁడు. కొడూరు సంతాన గోపాలునకుఁ దన యీ కృతి నంకిత మిచ్చినాఁడు. ఈతని కాలనిర్ణయమున కొక్కటే మార్గము గన్పట్టుచున్నది. ఈబాలక్రీడా విహారప్రతి విలేఖనకాలము "ప్రమా

* ఆం. సా. ప. సం. 2699.

దీచనామ సంవత్సర భాద్రపదశుద్ధ శనివారం" అని యున్నది. ఇది క్రీ. శ. 6–9–1673 తేదీతో సరిపోయినది. దీనినిబట్టి గ్రంథమంతకుఁ బూర్వము పుట్టినదనిమాత్రమే చెప్పనగును. రచనాప్రక్రియను బట్టి చూడ నిది ప్రతివిలేఖనకాలమున కొక్కింతపూర్వము రచింపఁబడి యుండునని తోఁచును.

శ్రీకృష్ణు జననాదిగా యమళార్జున భంజనము వఱకుఁగల కథ యిందు వర్ణితము. మంత్రసానివాలక మొకటి యిందలి విశేషము. ఇందుఁ బ్రసిద్ధ రాగతాళములలో నున్నవి దరువులు. ద్విపద లెక్కువ. వచనములు, సీస గీత కందములును గలవు. రచన యొకమాదిరి. గ్రంథము యక్షగానమని పేర్కొనఁబడినది.

---

# 14. సిద్ధేంద్రయోగి

**భామాకలాపము:–**

సిద్ధేంద్రయోగి కూచిపూడి భాగవతుల కులపతులలో సుప్రసిద్ధుఁడు. భామకలాపసృష్టి ప్రతిష్ఠామహితుఁడు. ఇతఁడొక భాగవత మేళమును వెంటబెట్టుకొనిపోయి తానాషా యను హైదరాబాదు – గోల్కొండనవాబు నెదుట నొక నృత్యరూపకమును బ్రదర్శించి యతనిని మెప్పించి యతనిచేఁ దనపేరను దన యనుచరులపేరను శాసనపూర్వకముగా కుచేలపురమును (కూచిపూడికి- బూర్వపుఁ బేరు) దానముగాఁ బొందియుండినట్లు నేఁడు కూచిపూడిపెద్దలలోఁ బ్రసిద్ధులగు శ్రీవేదాంతం

లక్ష్మీనారాయణగారి వలనఁ (వీ రిటీవలఁ గీర్తిశేషులైరి) దెలిసినదని శ్రీమతి కె. గోమతిగా రనుచున్నారు.[1] ఆచార్య శ్రీ విస్సా అప్పారావు గారును నీవిషయమునే వేఱొకచోటఁ దెల్పియున్నారు.[2] ఆతానాషా యసలుపేరు అబుల్‌హసన్ అనియు నతఁడు గోల్కొండకుతుబ్‌షాహీల వంశమువాఁ డనియు క్రీ. శ. 1672 – 1685 సం. ల నడుమ హైదరాబాదు రాజ్యమును బరిపాలించె ననియుఁ దెలియవచ్చినది.[3] కాఁగా సిద్ధేంద్రయోగి కాలము నాప్రాంతమే యని నిశ్చయింపనగును.

భామకలాపముయొక్క ప్రదర్శన ప్రక్రియ విశిష్టమైన దైనను రచనా ప్రక్రియ యక్షగాన ప్రాయమైన దే. ఇంకను యక్షగాన రచనా ముఖ్యాంగములగు దరువులు, ద్విపదలు, గద్య పద్యములు నున్నవి. సిద్ధేంద్రునికి ముందే యాంధ్రదేశమున యక్షగానము లనేకము వెల సిన జాడ కన్పించుచున్నది. అతనికి ముందే కూచిపూడి భాగవతులు వీథినాటకము లాడుటలోఁ బ్రసిద్ధులై యుండిరని తెలియుచున్నది.* ఆవీథి నాటకములు నాయక్షగానములే యతని భామకలాప రచన కుద్బోధకములై యుండును. కాని ప్రదర్శన ప్రక్రియలో నిది సామాన్య యక్షగానాదులవలె గాక భరత విద్యావిధి నిబద్ధమైనది. నృత్య ప్రధానమైనది. నృత్యకళానుకూలముగా రసైక రమ్యముగాఁ బ్రదర్శించుటకుఁ దగినట్లు సంగ్రహమైన పాత్రసామగ్రి నేర్పరించుకొనుట మొదలగు విషయములలో సిద్ధేంద్రునకుఁ బద్మావతీ చరణచారణ

1. Vide., Her thesis on the Music of the Nrtya natakas of South India, Submitted for M. Litt., of the Madras University.

2 చూ. శ్రీ అప్పారావుగారి 'కూచిపూడి నాట్యసంప్రదాయం' అను వ్యాసము – సంస్కృతి, ఏప్రిలు, 1955.

3. Vide., Robert Sewell's The Historical Inscriptions of Southern India., P. 349.

* చూ. క్రీ. శ. 1502 నాఁటి మాచుపల్లె కైఫీయతు.

చక్రవర్తియగు జయదేవుని గీతగోవిందము మొదలైనట్లు తోఁచును. రెండింటను నాయికా నాయక సఖీ పాత్రములు మూఁడే ముఖ్యములైనవి. భామ కలాపము నందు సఖిపాత్రదొక ప్రత్యేకత. అది సిద్ధేంద్రుని యపూర్వసృష్టి. "మాధవి" యను నాపాత్ర పేరొకటి గమనింపఁదగినది. ఆపాత్రను ప్రదర్శక ముఖ్యుఁడొక పురుషుఁడే నిర్వహించును. వేషధారణమున విశేషముండదు, పైమీఁదఁ గండువా తప్ప, అదేసమయానుకూలముగాఁ బమిటయు నగును. అనఁగా నతఁడక్కలలో అక్క, బావలలో బావ; అతఁడు ప్రదర్శకులకు, నాయికా నాయకులకుఁ బ్రేక్షకులకుఁగూడ నొక ప్రతినిధిపోలె వ్యవహరించును.

కలాపమనఁగా నది వైకృత శబ్దమైనచో కలత, కలహము ననునర్థములు నిఘంటువులలోను (చూ. సూర్యరాయంధ్రనిఘంటువు) సొదవెళ్ళఁబోసికొనుట యను నర్థము వ్యవహారములోను గానవచ్చును. ఆమూఁడర్థములు నీకృతి ప్రతిపాదితార్థమున కన్వయింపఁగలవు. ఇందలి నాయిక భామ యనఁగా సత్యభామ; ఆమె కసలు సత్య యని మాత్రమే పేరు. భామా శబ్దము స్త్రీ సామాన్యవాచి. ఆమెకు భామ యనియు రూఢ్యర్థమునఁ బర్యాయ వ్యవహారము కలిగినదనఁగా నామెలో నాభామాత్వము పూర్తిగా మూర్తిభవించిన దన్నమాట. నటులలో భామ వేషగాని దొకప్రత్యేకత యనఁగా నీకసట్టి నాటక నాయికలలో భామ ప్రాముఖ్య మెట్టిదో యిట్టే యూహింపనగును. ఆంధ్రవాఙ్మయమునఁ దొలుదొల్తఁ బ్రబంధ నాయికగా నాసత్యభామ పాత్రను సర్వాంగ సుందరముగాఁ దీర్చి దిద్దినవారు తిమ్మనగారు. సిద్ధేంద్రుఁడాయన ప్రబంధ పారిజాతము తావి దనివితీర మూర్కొనియే యుండును. కాని నవ్యశిల్ప నైపుణితో నామెను నాటక నాయికగాఁ దీర్చినాఁడు. తిమ్మనగారి తీర్పులో నామె ఖండిత, స్వాధీన

పతిక; సిద్ధేంద్రుని చిత్రణలో నామె విప్రలబ్ధ. భామ కలాపమున పారి జాతకథ సత్యాస్వప్న కథనమున నిమిడి పోయినది. గ్రంథమంతయు నామెవలనంత కల, కలత నిదుర, చెలికత్తెతో సొద వెళ్ళబోసి కొనుటయు, నాయకునితో నామె రాయబారములు, సంవాదములుం జివర రుక్మిణితో సవతి కయ్యము ననునవి యిందలి ప్రధాన విషయ ములు. గ్రంథనామము సార్థకము. ఈభామ కలాపము శృంగార రస పేశల సుధా కలశము. అలంకార శాస్త్ర సారనికషోపలము. రచన ప్రౌఢభావ బంధురము, భావోచిత పదబంధ సుందరము. ప్రదర్శన భరత విద్యాప్రమాణ రమణీయము.

భామ కలాపము ప్రభావ మర్వాచీన యక్షగానములపై బాగుగాఁబడినది. సవతి కయ్యము ఘట్టమొకటి యిందలి కండపట్టు. దానికి పారిజాత కథ ప్రధానాలంబనము. సిద్ధేంద్రుని తరువాతను దానికి మాసపత్రికలుగా భామకలాపములు, నా" బాణీ" లో నడచిన పారిజాతకథేతివృత్తములగు యక్షగానములును గోకొల్లలుగా వెలసి నవి. సవతుల సందర్భసాదృశ్యము సాకుగా శివపారిజాతములును దత్సదృశములును వెలసినవి. భామకలాపము ప్రాదుర్భవముతో నాంధ్రదేశ యక్షగాన ప్రదర్శనములందు నూత్న చైతన్యమును గొంత పొడసూపెనని తలంపవచ్చును. అంతవఱకుఁ దఱచు తక్కువ తరగతి ప్రదర్శకుల త్రైతక్కలతో నలసగతిఁ బయనించుచుండిన యక్ష గానము భామకలాపము ప్రదర్శనం భరతపద్ధతి ననుసరించి పురోగ మించినదని చెప్పవచ్చును.

కాని యొక కే విచారము. ఈనాఁడు సిద్ధేంద్రయోగి భామ కలాపము దాని మౌలిక స్వరూపముతోఁ బ్రత్యేకముగా నొకగ్రంథ రూపమున లభించుటలేదు. (మన యముద్రిత గ్రంథ భాండాగారము

లందెందును గానరాదు. కూచిపూడిలోఁగాని యొకప్రతియైన దొరకునేమో మఱి,) అది విపథార్చాచిన భామకలాప గ్రంథములతోఁ గలగాపులగముగాఁ గలసిపోయినది. వానిలో సామాన్యముగాఁ గానవచ్చు దరువులు, పద్యములు కొన్నియున్నవి. అవి సిద్ధేంద్రోపజ్ఞములే యని తలఁపవలసియున్నది. కొన్నట సిద్ధేంద్రయోగి స్మరింపఁబడియున్నాడు.* కాని యవియెల్ల నతని గ్రంథము ప్రతులని తలఁచుట పొరపాటు. ఆ స్మరణ గౌరవార్థము గావచ్చును. అందతని గ్రంథ భాగములు కొన్ని గ్రహింపఁబడ యుండవచ్చును.

## గొల్లకలాపము :

సిద్ధేంద్ర యోగి గొల్లకలాపమును రచించెనని కొందఱును రచింపలేదని కొందఱు ననుచున్నారు. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు తమ యేకవీర (22 వ అధ్యాయము) లో 'సిద్ధేంద్ర యోగి గ్రంథము రెండు భాగములు. మొదటిది గొల్లకలాపము, రెండవది భామకలాపము' అని యున్నారు. శ్రీ విస్సా అప్పారావుగారు "గొల్లకలాపము — ఇది 19 వ శతాబ్ది రెండవ అర్ధ భాగములో కూచిపూడి నాట్య భాండారానికి చేరిన మరొక మణి" అని యున్నారు. (చూ. వారి వ్యాసము — సంస్కృతి., ఏప్రిలు. 1955).

---

* ఉదా.— 1. ప్రా. లి. పు. భాం. అర సం. 13-8-2 (పారిజాత హరణ మను పేర నున్నది. ఇది కేటలాగులోఁ జేరలేదు)

2. భా. క. మంజువాణీ ము. శా. ప్రచురణ, ఏలూరు, 1906 (ఇది యొక సంకీర్ణ గ్రంథము).

3. భా. క. శ్రీ వెంకటేశ్వర ము. శా. కాకినాడ, 1913. (ప్రచురణకర్త మంగు వెంకటరంగనాథరావు (ఇదియు వివిధ కవుల రచనావిన్యాసములుగలదైనను నొక యానుపూర్విగలది. మూలగ్రంథభాగములిం దెక్కువగలవని తోఁచుచున్నది)

కాని క్రీ. శ. 1714 — 1760 ప్రాంతమున నుండిన నక్కలపాటి సంజీవ కవి రచించిన గొల్లకలాప గ్రంథ మొకటి లభించినది. (అతని విష యము ముందు తెలుపఁబడును). గొల్లకలాపమున రెండు రకములు గలవు. ఒకదాని యందు గొల్లభామ పిండోత్పత్తి విషయము నుండి యెత్తుకొని సుదీర్ఘముగా నొక వేదాంతోపన్యాసము చేయును. రెండవదానియందు సముద్ర మథనగాథ, సుంకరకొండని సరసమును ప్రసక్తములు. మొదటిది సిద్ధేంద్రుని రచన కావచ్చును. అతఁడు యోగి. తదుచిత మైనదా రచన. అది వేదాంత విషయము మగుట సామాన్యులకుఁ జవి గొల్పకపోవుటచేఁ గ్రమముగ రెండవ రకపువి వెలసియుండును. వాని ప్రతులే నేఁడెక్కువగా లభించుచున్నవి. మొదటిరకము గ్రంథము ప్రతి కూచిపూడిలో లభించునేమొ !

ఈ కలాపములు రెండు నీనాఁటను నుండి యుడిగి ప్రదర్శింపఁ బడుచున్నవి.

సిద్ధేంద్రకృతిప్రశంస:

“ గొల్లకలాపము షట్ఛాస్త్రములకు నిలుకడ. భామకలాపము వడగట్టిన యలంకార భరత శాస్త్రములు ”.

— విశ్వనాథవారి ఏకవీర.

# 15. వర్ఘుల నరసింహకవి

## శకుంతలా నాటకము: *

ఇది "దుష్యంత చరిత్రము – యక్షగానం" బని కవిచేఁ బేర్కొనఁబడినది. కవి వర్ఘుల నరసింహుఁడు. కృతిభర్త పెనుశల (పెంచల?) నరసింహస్వామి. కృతిప్రోత్సాహకుఁడు "శ్రీమన్మహా మండలేశ్వర నంద్యాల నారాయణరాజు దేవమహారాజులుంగారు". ఇతని యగ్రజుఁడును, దండ్రియు రాఘవ నామధేయులనియు, నితని సితామహుఁడు నారాయణ రాజశేఖరుఁడనియు, వీరి దాత్రేయ గోత్రమనియు నవతారికలో గలదు. కాని వీరార్వీటి బుక్కభూపతి దుహితృవంశ విస్తారకులై 16 శ. ఉత్తరార్ధమున విజయనగర సామంతులై మంతు కెక్కిననాఁటి నంద్యాలరాజులుగారు. అప్పటి రాజుల వంశవృక్షము నందు వీరికోవ గానరాదు. కాని వారికోవకుఁ జెందినవారే యర్వాచీనులై యుందురు వీరు. వీరికాల మిదమిత్థముగాఁ దెలియదు. ఈ గ్రంథమునందు భరతపట్టాభిషేక ముహూర్తము "బహుధాన్య సంవత్సర కార్తీకశుక్లదశమి గురువాసరము" గాఁ బేర్కొనఁబడినది. అదికాని గ్రంథరచనా కాలమునకొక భంగ్యంతర సూచన యగునేని క్రీ. శ. 3–11–1698 తేదీకి సరిపోవుచున్నది. ప్రతివిలేఖకుఁడు కృతి పోత్సాహకుఁడగు నారాయణరాజే యగుట విశేషము. ఈప్రతిలేఖన కాలము విళంబి భాద్రపదబహుళ దశమి. వారము పేర్కొనఁ బడలేదు. (ఆ విళంబి క్రీ. శ. 1718 కావచ్చును).

ఇందలికథ ప్రసిద్ధము. రచన ప్రౌఢముగనే యున్నది. కాని యపప్రయోగములు ననౌచిత్యమును లేకపోలేదు. ఇందు దరువులు

---

* అం. సా. ప. నం. 695.

ప్రసిద్ధరాగతాళములలోఁ గలవు. కందార్థములు, సంధి వచనములు, ద్విపదలు, పద్యములును గలవు. సూత్రధార ప్రసక్తిఁ బాత్రలు తెర వెడలివచ్చి స్వీయోదంతమును సభవారికి నివేదించుట మొ. విశేషములు గలవు. కథారంభమున హాస్యగానిపాత్ర ప్రవేశమున్నది.

# 16. రెగళిగె నిమ్మనాథుఁడు

ఇతని తండ్రి పర్వతలింగము. గురుఁడు శంకర పిళువర్తి. చుండి కలికేతుఁడు, రాచవీటి వీరభద్రుఁడు నితని యిష్టదైవతములు. ఇతఁడు గురునంబి చరిత్ర, నిజలింగ చిక్కయ్య కథ యను రెండు యక్షగానములను రచించెను. ఇతని కాల నిర్ణయమునకుఁ బ్రతివిలేఖన కాలమే శరణ్యమైనది. ఈ గ్రంథములకు ప్రా. లి. పు. భాం. నం. ప్రతులు చాలగలవు. ఆ యన్నిట లేఖకులిచ్చిన కాలపు వివరములను లెక్కించి చూడఁగా ఆర్. సం. 811 నిజలింగ చిక్కయ్య కథ ప్రతి ప్రాచీనతమమైనదని తేలినది. విరోధి నిజవైశాఖ శుద్ధదశమి శనివారము దాని లేఖనకాలముగాఁ జెప్పఁబడినది. అది క్రీ. శ. 7-5-1709 తేదీకి సరిపోవుచున్నది. అనఁగా గ్రంథరచనాకాల మంతకుముందే జరిగియుండును. ఈ గ్రంథముల రచనా ప్రక్రియఁజూడ నది యింకను బ్రాచీనమైనదిగనే తోఁచును.

### గురునంబి చరిత్ర: ♦

గురునంబికే ఉదయ లేక ఒడయ లేక వడియనంబి యనియు సుందరమూర్తి నాయనారనియుఁ బేరు. ఇతఁడొక ద్రవిడ శివభక్తుఁడు.

♦ ప్రా. లి. పు. భాం. డి. నం. 1870, 1871, 1872, 1970.

ఇతని యుదంతము * బసవపురాణమునఁ గొంత గలదు. అజ్జరపు పేరయలింగము ఒడయనంబి విలాస ప్రబంధమున నెక్కువగాఁ గలదు. అంతకంటె విపులముగా నిందు వర్ణింపఁబడినది. పార్వతీపరమేశ్వరులు తమ ముకుర ప్రతిబింబములకుఁ బ్రాణప్రతిష్ఠచేయగా సుందరీసుందరు లవతరింతురు. వారు శాపవశమున భూలోకమున శానమరాయుఁడేలు తిరునావళూరిలోఁ బుట్టుదురు. సుందరి పరమనాచియను నట్టువక త్తె యగును. సుందరుఁడు నంబియై వాల్మీకేశ్వరునిచేఁ బెంపఁబడి పెద్దవాఁ డగును. అతఁడు పరమనాచినిఁ జూచి మోహించును. వాల్మీకేశ్వరుఁడే కుంటెనకాఁడగును. నంబి మంగుళూరిలో ననంగ సంగను బెండ్లాడును. చనిపోయిన తన పేరింటి బ్రాహ్మణబాలకు నొకని బ్రతికించును.

పరమనాచి చంట లింగమూర్తిని బలికించును. తదుప. శివుఁడు ప్రత్యక్షమై నంబి, అనంగ సంగ, పరమ నాచి, శానమ రాజు లకుఁ గైలాస కైవల్య ప్రాప్తుల ననుగ్రహించును. సంగ్రహముగా నిదీ యిందలి కథ.

కథా ప్రధానమైన దీ యక్షగానము. రచన యొక మోస్తరు. యిందు తాళప్రధానము లైన దరువులు, నెడనెడ గద్య పద్యములు. ద్విపదలు, ఏలలు, ధవళము మొ. గలవు. ఎఱుకల జంపె, పాళి రేకు లనునవి విశేషములు. పరమనాచి నెఱపిన నృత్యవిశేషములు :- జగ్గు, మైసిరి, జక్కిణి, పేరణి, సూళాదులు, అగ్గరికములు, దేశాది పద్ధతులు. ఈ గ్రంథము రాచవీటి వీరభద్రుని కంకితము. యక్షగాన మని పేర్కొనఁబడినది.

---

* పండితారాధ్య చరిత్ర మహిమ ప్రకరణమునఁ గలదు.

## నిజలింగ చిక్కయ్య కథ :– * (లేక చరిత)

బసవ నింట దొంగతనము సేయఁబోయి చిక్కయ లింగదీక్షఁ గైకొనుట — చిక్కయను జూచి తలారి రామయ భార్య నీలకుంతల మోహించుట — నిరాకరించిన చిక్కయ కామె కుతంత్రము వలన శిరశ్ఛేద మగుట. చిక్కయ శిరస్సు నిక్కముచెప్పఁగా నాకాశవాణి సాక్ష్యము వల్కుట — తలారి భార్యను జంప నుద్యుక్తుఁడు కాఁగా శివుఁడు ప్రత్యక్షమై యెల్లరకుఁ గైలాస మనుగ్రహించుట — అనున గందలి కథ. ఈ కథ యితివృత్తముగాఁ గొన్ని ప్రబంధములు జంగము కథలును వెలసినవి.

తాళ ప్రధానములైన దరువులు ప్రచురముగా గల యక్షగాన మిది. ద్విపదలు, సంధి ప్రయోజన మాత్ర పరములైన వచనములు, కొలఁది పద్యములు, అర్ధచంద్రికలు, ఏలలు, జోలలు, ధవళములును గలవు. రచన హృదయంగమ మైనది. సలక్షణమైన భాషలో సరళముగా, సజాతీయముగా, పొల్లుమాటలు పడకుండ భావములు సూటిగాఁ జెప్పఁగలఁడు కవి. ఇదియు య. గా. అని పేర్కొనఁ బడినది.

---

* ముద్రితము 1. హరిహరము. శా. 26-4-1881.

2. అమెరికన్ డైమండు ప్రెస్, మదరాసు, 1-8-1939.

## 17. నూల్వీటి హరియప్ప

### ఉలూచీ పరిణయము:

ఇతఁడు నందవరీకుఁడు. ఆశ్వలాయన సూత్రుఁడు. శ్రీవత్సస గోత్రుఁడు. ఇతని తలిదండ్రులు జానకమ్మ, నాగరాజు. ఇతని చరిత్రము అవుడూరి కిచ్చయ మాధవాభ్యుదయము (ప్రా. లి. పు. భాం. డి. సం. 643), నుండి యెఱుఁగనైనది. అందే యవతారికలో నితఁడులూచీపరిణయ యక్షగానమును, కృష్ణశతకమును రచించినట్లు చెప్పఁబడినది. కాని యీ యక్షగాన మిపుడెచ్చటను లభించుటలేదు. మాధవాభ్యుదయ కృతి ప్రోత్సాహకుఁడగు నూల్వీటి నాగయామాత్యుఁ డితని మనుమఁడని యందుఁగలదు. మాధవాభ్యుదయకర్త తమకాలము నాఁటికి "నూఱు నూటయేఁబది సంవత్సరముల క్రిందట నుండినట్లు తెలియవచ్చుచున్న" దని వీరేశలింగముగారు తమ కవులచరిత్రలో నవుడూరి కిచ్చయ చరిత్రమున వ్రాసినారు. అది యథార్థమగు నేని యీ హరియప్ప క్రీ. శ. 1700 ప్రాంతమున నుండియుండునని యూహింపనగును.

---

## 18. వెలిచేరు వేంకటరామ ప్రధాని

### బాణాసుర యుద్ధ నాటకము:

ఇతఁడు వెలిచేరు జగ్గయ్య కొడుకు. తాను విజయలక్ష్మీ నరసింహ విలాసము, వియన్నదీ పరిణయము, . పంచ వింశతి శతకములు,

బాణాసుర యుద్ధాది నాటకములును రచించినట్లు తనకృష్ణార్జున సంవాదమను ప్రబంధమునం (ప్రా. లి. పు. భాం. ఆర్. నం. 230) జెప్పినాఁడు. ఆ నాటకములు ప్రాయికముగా యక్షగానములు కాఁదగును. కాని యొక్కటియు లభింపలేదు.

మీఁది కృ. సం. ప్రతి చివర పిలేఖకుని వ్రాఁత యిట్లున్నది. "విశ్వావసు నామ సంవత్సర చైత్ర శు. ౧౧ శనివారం సర్కిప్రతినున్న క్రమాన నక్కలంక పేరన్న కుమారుఁడు సీతన్న శ్రీరామార్పణంగా వ్రాస్తిని" (ఈలేఖకుఁడు నక్కలంకి పేరభద్రకవి పుత్రుఁడగునా?) ఈ ప్రతిలేఖన కాలము క్రి. శ. 13-3-1725 తేదీకి సరిపోయినది. గ్రంథ రచనా కాల మంతకుఁ గొంత పూర్వమగును.

# 19. దళవాయి తిమ్మప్ప

## ప్రపన్న వేంకటేశ్వర విలాసము: *

గ్రంథకర్త తాను రామభద్రపుర వాస్తవ్యుఁడననియు, కర్ణాట రాయ దళవాయియగు కోనేటి తిమ్మనాయకుని యనుగ్రహముఁ గలిగిన వేంకట ధరాధిపునకు లబ్ధవరాంగనయందుఁ గలిగిన పుత్రుఁడననియు, నేటూరి పురమునఁ గోటికన్యాదాన కవులనేకులను తిరుమల తాతాచార్యు నకుఁ బౌత్రుఁడును వేంకటవరదదేశికునకుఁ బుత్రుఁడునైన వీరరాఘవా చార్యునకు శిష్యుఁడననియు సనాతనలో వ్రాసుకొనెను. రాయ

* ప్రా. లి. పు. భాం. ఆర్. నం. 888, ఆర్. 1040.

దుర్గము బళ్ళారిజిల్లాలోనిది. బళ్ళారిజిల్లా గెజటీరులో* కోనేటినృపతి విజయనగర రాజులనుండి దళవాయి బిరుదు సంపాదించినట్లును, బిజాపురము సుల్తానునకుఁ గప్పము చెల్లించుచు రాయదుర్గము నేలినట్లును, నతనికి వెంకటపతి నాయకుఁడను కొడుకుండినట్లును, వెంకటపతికి లక్ష్మమ్మయను భార్యవలనఁ బెదతిమ్మప్ప యను కొడుకుండినట్లును, పెదతిమ్మప్ప క్రీ. శ. 1732లోఁ జనిపోయినట్లును గలదు. ఇతఁడే ప్రకృతగ్రంథకర్తయగు దళవాయితిమ్మప్ప. ఆకోవలో నితనికిఁ దరువాత నొక తిమ్మపగలఁడు. (పెదతిమ్మప తమ్ముఁడగు వెంకటపతి కొడుకు) కావున నితనికి పెదతిమ్మపయనుపేరు వచ్చియుండును.

గ్రంథవిషయము :– రాయదుర్గక్షేత్రస్వామి ప్రసన్నవెంకటేశ్వరుఁడు. ఆస్వామి పురవీధులఁ "దిరువీధి" వేంచేయఁగాఁ గళావతి యను వేశ్యకన్య యతనిఁజూచి మరులుకొనును. చెలికత్తెయగు మంజువాణి యామె తల్లియగు చకోరాక్షి కీ విషయము తెలుపఁగా నామె కూఁతును మందలించును. తరువాత మంజువాణిచే స్వామికిఁ గళావతి రాయబారము. అది విఫలము కాఁగా కళావతి స్వయముగా స్వామిసముఖమునకుఁ బోయి తన నాట్యకళానైపుణ్యముచే నాతనిఁ బ్రసన్నుని జేసికొనును. ఈకథ యెత్తుగడలో నున్న యులాప్రబంధఫుఁ బోకడ గమనింపఁదగినది. అది దక్షిణదేశ యక్షగానము లందెక్కువగాఁ గన్పట్టును. (విశేషములకు ప్రకరణమునఁ జూచునది.). ఇందలి రచన నాతిప్రౌఢము, నాతిపేలవము. ఇందు దరువులు, ద్విపదలు, పద్యములు, వచనములు, నొక యష్టకము నొకచూర్ణికయుఁ గలవు. దరువులు ప్రసిద్ధరాగతాళములలోఁ గలవు.

---

* 1904 సం. ప్రచురణ — పుట 298

1906 సం. ప్రచురణ పుట 309.

చాలదరువులకడ నొకరాగము తాళము నుం దుదాహరింపఁబడి "నాట్యపద్ధతికి" అని మఱియొక రాగతాళముల జంటి పేర్కొనఁబడుచు వచ్చినది. ఇది కూడ గ్రంథము శ్రవ్య దృశ్య ప్రయోజనములు రెంటికిని నుద్దిష్టమైన దనుట స్పష్టము. ద్విపదలకును రాగములు పేర్కొనఁబడుట యింకొక విశేషము. ఇందు కన్నడ భాషలో నొక మూఁడు దరువులు గలవు. కవి యీకృతిని యక్షగానమని పేర్కొనినాఁడు.

---

# 20. నక్కలపాటి సంజీవకవి

ఇతనివి గొల్లభామ వేషముకథ, ఎఱుకలకథ అను రెండుయక్షగానప్రాయ రచనలు గాన వచ్చుచున్నవి. రెండింటను తూమూరు చెన్న కేశవముద్ర గానవచ్చుచున్నది. కాఁగా నితఁడు తూమూరు వాస్తవ్యుఁడై యుండునని యూహింప నగును. తూమూరు కడప మండలము సిద్ధవటము సీమలోనిది. ఇతఁడు సిద్ధవటము ప్రభువు లగు మట్లి యనంతరాజు, వేంకటరామరాజులఁ గూర్చి చెప్పిన చాటు పద్యములు రెండు చాటుపద్య రత్నాకరములోఁ గలవు. (శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి సంపాదితము — పుట 31–32). అనంతరాజు (మట్లి కావలె) చెఱకు తోటను నక్కలు పాడుచేయు చుండఁగా నాతని ప్రార్థనపై సంజీవరాయ కవి తన కవితా శక్తిచే నక్కల వాకట్టినట్లును, నందుపై ననంతరాజు నక్కలపాటివారని యతని కింటిపేరు దయ చేసినట్లును నందుఁగలదు. మట్లి వేంకట్రామ క్ష్మాజానిపై నితఁడు

చెప్పిన చాటువులో వేమల చినబసవరాయ వేంకట నృపతి యొకండు పేర్కొనఁ బడినాఁడు. ఈతని కాలము గుఱించి తెలిసినది కాదు. కాని ప్రసిద్ధుఁగు సిద్ధవటము మట్లై రాచకుటుంబములో మట్ల అనంత రాజ వేంకటరామ నామధేయులు జంట వరుసలు క్రీ. శ. 1600-1690 సం. ల నడుమ నొకటియు, క్రీ. శ. 1714 – 1760 సం. ల నడుము నొకటియుఁ గలవు. * సంజీవ కవి గొల్లభామ వేషము కథ యనఁగా గొల్లకలాపము. అది క్రీ. శ. 1680 ప్రాంతములనుండిన సిద్ధేంద్ర యోగి (అతని చరిత్ర మిందు గతపుటలలోఁ గలదు) గొల్లకలాపము నకుఁ గొంత ప్రచారము కలిగిన పిమ్మటనే రచింపఁబడి యుండును. అసలా కలాప ప్రక్రియ యన్న దతని సృష్టి. కావున సంజీవ కవి చె నుదాహరింపఁబడిన మట్ల రాజులలో రెండవకోవ వారి కాలమునకుఁ జెందిన వానిగనే పరిగణించుట లెస్స.

## గొ ల్ల భా మ వే ష ము క థ[1] :

గొల్లభామ నిత్య కృత్యములు నిర్వర్తించి సింగారించుకొని వాడలోఁ జల్ల మొదలగునవి యమ్మ వచ్చినది. ఆమె తన కులము లోని తెగలు, కులాచార విధి నిషేధములు మొ. ఏకరువు పెట్టెను. జగమెల్ల గొల్లయని సిద్ధాంతము చేయును. ఆమె పేరు మంగయాన. చాల గొల్లకలాపములం దా పేరే కన్పించును. సంజీవ కవి గ్రంథము గూడ బాగుగా ననుకరింపఁబడినది. యథాతథముగ నిందలి పంక్తులే కొన్ని గ్రహింపఁబడినవి. ఇందు మధ్య నొక్కచో మాధవి ప్రసక్తి

* Vide, Sewell's Historical Inscriptions of Southern India, P. 366.

1. ఆం. సా. ప. నం. 3225, 3708, 2778 లలో నిందలి పంక్తులు మాత్రము కొన్ని గలవు. (శ్రీ వేదునూరి గంగాధరం గారి కడ నొక ప్రతి కలదు)

వచ్చినది. కాని కొంత గొల్లభామ గొంతే వినిపించును. అనఁగా నిది కలాపమునకుఁ దగియున్నది. అందు దరువులు, ద్విపదలు, పద్యములు, వచనములు గలవు. రచన చక్కనిది.

### ఎఱుకల కథ:[2]

పుత్రవాంఛతో నున్న యశోదకడకు విష్ణు నియోగమున యోగమాయ యెఱుకతయై వచ్చుట యిందలి విషయము. "సూత్రధారి చదివే వాక్యము" లను పేరఁ బ్రశ్నలు నందుల కాపె సమాధానములును గా గ్రంథము సాగును. రచన యొకమోస్తరు. ఇందెఱుకల కాంభోజిలో రెండు దరువులు, పంతువరాళి, సౌరాష్ట్రలలో నొక్కొక్కటియు, నాట రాగమున నొకటి, రెండు దీర్ఘద్విపదలు, కొలఁది పద్యములు, రెండు పెద్ద కల్పవచనములును గలవు.

## 21. తక్కెళ్లపాటి లింగన

### విద్యుత్ప్రభా విలాసము:

గ్రంథ మలభ్యము. ఇతఁడు "విద్యుత్ప్రభా విలాసమ్ము వేడ్కఁ జూపి యుంచితిని యక్షగానరీతి" యని తన యుత్తర హరిశ్చంద్ర కథ (ప్రా. లి. పు. భాం. డి. సం. 425) లోఁ దెలిపియుండెను. ఇతని

2. ఆంధ్రేతిహాస పరిశోధక మండలి (రాజమండ్రి) లో నొక యసంఖ్యాక ప్రతిగలదు.

ఆం. సా. ప. సం. 2312 ప్రతిలోఁ గొన్ని యాకులు మాత్రముగలవు.

చరిత్ర ఆం. క. చ. తృతీయభాగమునఁగలదు. అం 'దిశేఁ జించు మించుగా నూటు నూటయేఁబది సంవత్సరముల క్రిందట నుండిన ట్లూహింపఁదగియున్న' దని యున్నది. అది నిజమగునో నితఁడు 18 శ. మధ్యనుండెనని తలంపవలసియున్నది.

---

# 22. బొమ్మలాట సాంబయ్య

**కిరాతార్జునీయము:** *

ఇదియొక బొమ్మలాటవారి కుటుంబమునకుఁ జెందిన యక్షగానము. దీని ప్రా. లి. పు. భాండాగార ప్రతి చివర నిట్లున్నది.

"గాటమౌ మోహాన కవియైన బొమ్మ
లాట సిద్ధయ్యకు నాత్మ సంభవుఁడు
యల్లమ్మ సత్పుత్రుఁ డెల్లవిద్యలకు
బల్లిదుఁడు సిద్ధయ్య బలుని తమ్ముండు
బ్రతిలేని యట్టి సాంబయ్య రచించె"

---

* 1. ప్రా. లి. పు. భాం. డి. నం. 1849—51, ఆర్. నం. 1143.

2. తం. స. మ. కే. నం. 476 _ 477.

3. అడయారు డి. స. గ్రం. జి. నం. 74854.

ఆర నం. 32 (ఇ) 11, 32 (ఎఫ్) 7

(కొలఁది భేదములతో నీ మూఁడు నొక్క గ్రంథము యొక్క ప్రతులుగా నే కన్పట్టుచున్నవి).

తం. స. మ. ప్రతి చివర నిట్లున్నది :-

" అంకితంబుగ బొమ్మలాటశాసనుఁడు
పొంకమూ ఘన కావ్య భూషణుఁడైన
సంబయ్య తమ్ముఁడు సరసుఁడౌనట్టి
శంబరధరుఁడు ........రచియించె"

అడయారు ది. స. గ్రం. 32 (ఇ) 11 ప్రతి చివర నిట్లున్నది :-

" ఘనమైన మోహనా ఘను నినదాంకు ( ? )
సంగీత సాహిత్య సరస కోవిదుఁడు
వినుతికెక్కిన సిద్ధవిభుని నందనుఁడు
పరువడి యల్లమాంబా తనూభవుఁడు
శంబయ్య తమ్ముఁడు సరసుఁడైనట్టి
శంభు వీరుండు శ్రీ శంభుని కృపను
తనరం కిరాతార్జునీయ మొనరంగ
రచియించె .............."

అడయారు 32 (ఎఫ్) 7 ప్రతిలో "అంకితంబుగ బొమ్మలాట శాసనుఁడు" అన్న ముక్క యధికము.

ప్రా. లి. పు. భాం. కన్నడ గ్రంథావళి డి. నం. 1169 కరియ బంటన కథ యక్షగాన ప్రతి చివర గ్రంథకర్తనుగూర్చి యిట్లున్నది :-

" ............బొంబయాటద రాయ
శంకర వరపుత్ర చరణ సేవకను
ఘనవాద మోహన కవి బిరుదాంక
జననుత సంగీత సాహిత్య నిపుణ

సిద్దయ్య తెలుఁగ ప్రసిద్ధ నాయకను
సద్ధర్మ గుణయుత సంబయ్య ననుజ
అంబుజ వదన యల్లమ్మ నాత్మజను
శంకరారియు భక్త సంబయ్య......"

మీఁది యుదాహరణముల వలన సాహస [illegible] బిరుదాంకుఁడును బొమ్మలాట శాసనుఁడు నైన సిద్ధయ్య కెల్లమయందు సాంబయ్య లేక సంబయ్య, శంబయ్య సంబయ్య, శంకరధరుఁడు, శంభువీరుఁడు నను వారు పుత్రులనియు వారెల్లరకు నీ కిరాతార్జునీయ రచనతో సంబంధము గలదనియుఁ దెలియుచున్నది. ఎల్లమ సిద్ధయల పుత్రుఁడును సంబయ్య యనుజుఁడును నైన బొమ్మలాట సంబయ్య లేక సాంబయ్య రచించినవిగా కరిరాజబంటనవిజయము,[1] సారంగధర చరిత్రము[2] నను రెండు కన్నడ యక్షగానములు గన్పట్టుచున్నవి. అతఁడే యీ కిరాతార్జునీయ య. గా. ను రచించి యుండుననియు, నందితనికి సోదరులును గొంత కొంత తోడ్పడియుందురనియు, దలంపవలసి యున్నది. ఈ బొమ్మలాట సాంబయ్య క్రీ. శ. 1750 ప్రాంతమువాఁడుగా "కర్ణాటక కవి చరిత" తృతీయభాగమునఁ జేర్కొనఁబడియున్నాఁడు.

ఇందలి కథ ప్రసిద్ధమైనది. అల్ప దోషములున్నను రచన కడుచక్కనిది. సంభాషణ లెక్కువ. తెనుఁగుదనము ఉట్టిపడుచున్నది. తాళప్రధానములైన దరువులు, రేకులు, అర్ధచంద్రికలు, ధవళములు, ద్విపదలు, కొలఁది పద్యములు, చిన్న సంధివచనములు గలవు. గ్రంథము యక్షగానమని పేర్కొనఁబడినది. లేపాక్షి వీరభద్రస్తుతి

1. ప్రా. లి. పు. భాం. కన్నడ గ్రంథావళి డి. నం. 1169
2. ,, ,, ,, ,, ,, ,, డి. నం. 1212 – 1220.

యిందుగలదు. (లేపాక్షి అనంతపురం జిల్లాహిందూపురం తాలూకా లోనిది.) ఇదికాని నాఁడీ బొమ్మలాట కుటుంబమువారిచే బొమ్మలాట ప్రదర్శనముల కెక్కినదేమో!

# 23. నిముషకవి రామయ్య

## జలక్రీడా విలాసము :*

గ్రంథకర్త సామంతకుఱ్ఱు (గోదావరి జి. అమలాపురము తా.) గ్రామకరణము. నిముషకవి లింగరాజుగారి పుత్రుడు. రామేశమని యితని నామాంతరము. ఇతని కృత్యంతరములు రామలింగేశ్వర శతకము, విష్ణుసంవేద్య రామేశ్వర పూజా విధానము. "ఈగ్రంథము సుమారు నూటయేఁబది సంవత్సరముల క్రిందటఁ జేయఁబడినది." (గ్రంథ ప్రకాశనకాలమునకు). అనఁగా గ్రంథకర్త క్రీ. శ. 1758 ప్రాంతము వాఁడగు చున్నాఁడు. ఈ విషయము లీగ్రంథప్రకాశకులును, గ్రంథకర్త "మా తండ్రిగారికి మాతామహు' లని చెప్పుకొనిన వారునగు మాచిరాజు నారాయణమూర్తిగారి పీఠిక వలనఁ దెలిసినవి. గ్రంథాంత గద్యనుండి యీ నిముష కవివారు హారితస గోత్రులని తెలిసినది.

శ్రీకృష్ణుని గోపికా వస్త్రాపహరణ మిందలికథ. భాష సలక్షణమైనది. శైలి సామాన్యమైనది. ఇందు దరువులు, ద్విపదలు,

*ముద్రితము ;— శర్వాణీ ము. శా. అమలాపురము మొదటికూర్పు 1908.

పద్యములును గలవు. దరువులకు రాగతాళములే కాక పల్లవి, అను పల్లవి, చరణములు ననఁగా సంకీర్తన లక్షణ ప్రక్రియ నిరూపింపఁ బడినది. ఆనంద భైరవిలో నొక యేలయు, త్రిశ్రలఘు తాళము విశేషములు. ఇది యక్షగానమనియు, శృంగారప్రబంధమనియుఁ బేర్కొనఁబడినది.

# 24. విరిపాటి నృసింహరాజు

## ఉషాపరిణయము :

పతద్గ్రంథ కర్తృత్వ విషయము సందిగ్ధము. ఒక ప్రతిలో విరిపాటి నరసింహ ధరణి కాంతుఁడనియు నింకొక ప్రతిలో వావిరిపాటి నృసింహాధరణి కాంతుడనియు నున్నది. అసలు లేవగానున్న గ్రంథాంత గద్యలో లక్షణామాత్య విశ్వనాథ కవి నామము లొకరెండు కన్పట్టు చున్నవి. ఇందెవరు గ్రంథకర్త లగుదురో నిశ్చయింపవలను గాకున్నది. గ్రంథరచనా కాలమున కొకమేర నిర్ణయించుటకు మాత్ర మొక యాధారము గన్పట్టినది. అది డి. నం. 1838 ప్రతి విలేఖన కాలము. అది సర్వధారి మాఘశుద్ధ చవితి శుక్రవారము. ఇది క్రీ. శ. 10-2-1769 తేదీకి సరిపోవుచున్నది. గ్రంథరచన యంతకు ముందు జరిగియుండునని మాత్రము చెప్పనగును.

---

* ప్రా. లి. పు. భాం. డి. నం. 1838, ఆర్, 1141

కథ ప్రసిద్ధము. మూస్యులు లేవు. రచన సరళ గ్రాంధిక ధోరణిలో సాగినది. పేలవము, బహుదోషజుష్టము. ఇందు ద్విపద పాటె క్కువ. తాళ ప్రధానములుగాం గొన్ని వరువులు, గద్యపద్యములు, రెండర్ధ చంద్రికలును గలవు. ము. గా అని పేర్కొనంబడినది.

---

# 25. గోగులపాటి కూర్మనాథకవి

## మృత్యుంజయవిలాసము:*

ఇతఁడు గోగులపాటి సూరయ పౌత్రుఁడు. గౌరమాంబా బుచ్చనామాత్యుల పుత్రుఁడు. వెంకన్న కామన్న లనువారి కగ్రజుఁడు. సింహాచల శ్రీరామ తీర్థాదిక్షేత్రముల నాచార్యకత్వము నిర్వహించుచుండిన తిరుమల పెద్దింటి సంపత్కుమార వేంకటాచార్య దేశికుని శిష్యుఁడు. (మూ. మృ. వి. గ్రంథాంత ద్విపద, గద్య). ఇతఁడు విశాఖపట్టణమండలము విజయనగరసంస్థాన దేవస్థానోద్యోగి. గజపతినగర సమీపముననున్న దేవులపల్లి గ్రామనివాసి. సింహాద్రి నార సింహశతకము, చోరసంవాదము లేక లక్ష్మీనారాయణ విలాసము ననునవి యితని కృత్యంతరములు 'ఈయన యిప్పటికి 150 సం.ల క్రిందట నుండెడివాడు, విజయనగర సంస్థానీకులయిన మొదటియానంద రాజుగారీయనకు పోషకులు' అని విశాఖపట్టణంజిల్లా వృత్తాంత

* ఇది పలుతడవలు ముద్రితమైనది. అందు రెండు ప్రచురణలు

1. శ్రీరంగవిలాస ము. శా. మదరాసు. 1907

2. ఆంధ్ర విజ్ఞాన సమితి విజయనగరము, 1941.

సంగ్రహము ( పుట 132 – 133 ) లోఁ గలదు. ఆ గ్రంథ ప్రకటన కాలము క్రీ. శ. 1888 అనఁగా కూర్మనాథకవి కాలము 1738 ప్రాంత మని తేలుచున్నది. అతఁడు మొదటి ఆనందరాజు పోషణలో నుండె ననఁగా (మృ. వి. మంగళమున 'విజయనగరదక్షులగు గజపతిరాజులు స్మరింపఁబడిరి) నా రాజు రాజ్యకాల మగు 1757 – 59 (అ)ప్రాంతమునఁ గూడ నుండెను. అతనితరువాత 1759 లో రాజ్యమునకువచ్చి 1794లో జరిగిన పద్మనాభయుద్ధములో (ఆ) నిహతుఁడైన రెండవ విజయరామ రాజు "శ్రీమత్తిరుమల పెద్దింటి సంపత్కుమార వేంకటాచార్య దేశి కోపదిష్ట నారాయణాష్టాక్షరీ మంత్రపారాయణుఁ" డని చట్రాతిలక్ష్మీ నరుసు రచించిన పద్మనాభ యుద్ధమను గ్రంథమున (ఇ) గలదు. ఆయాచార్యుఁడే కూర్మనాథ కవికిని గురువని యతని మృ. వి. న స్పష్ట ముగాఁ గలదుగదా. అందుచేఁ గూర్మనాథుఁడా విజయరామరాజు కాలమున గొంతవఱకుండి యుండెనని తలంపవలసియున్నది. అనఁగా నతఁడు 18 వ శతాబ్ది నడుమ విశేష కాలము జీవించి యుండును. క్రీ. శ. 1800 నాఁటికే యీతని మృత్యుంజయ విలాసమునకు మండ లాంతరములందును విశేషప్రచారము గల్గినట్లు తెలియుచుండుటచే నది 1750 ప్రాంతమున రచింపఁబడియుండునని యూహింపఁ దగియున్నది.

శివ పార్వతుల కల్యాణకథ యిందలి యితి వృత్తము. మృత్యుంజయ విలాస మని పేరు పెట్టుటలోఁ బ్రత్యేకత యేమియుఁ

---

* ఈ వివరములు శ్రీ అడిదము రామారావుగారి విస్మృత కళింగాంధ్రకవుల చరిత్రమునుండి యెత్తుఁగనైనది.

(అ) (ఆ) చూ. విశాఖజిల్లా గెజిటీరు – పుట 339.

(ఇ) పెద్దాపురము శ్రీ వత్సవాయి రాయజగపతివర్మ గారిచేఁ బ్రకటితము. ముద్రణ :— లక్ష్మీ ప్రిటింగువర్క్సు, రాజమండ్రి, 1934.

గానరాదు. ఈకథలో నాయకుని మృత్యుంజయ నామము సార్థకముగాదు. ఇందలి కథా ప్రణాళిక కాళిదాసీయమున కంత విలక్షణముగా లేదు. కాని శివుని మొఱకత వేషము, కటికమువంటి భృంగిరిటి హాస్య పాత్ర, గంగా గౌరుల సవతి మచ్చరము యక్షగానమని పేరు పెట్టినందుల కిందుఁ జేరిన విశేషములు.

రచనా గౌరవమును బట్టి మన యక్షగానములలో నిది యొక మేలు బంతి. కాని యది పద గుంభనలలో, వర్ణనలలో, సంవిధాన సంయోజనలోఁ బ్రబంధప్రాగల్భ్యము నంతటిని బుణికి పుచ్చుకొన్నట్టిది. ఇందుఁ బ్రబంధములందువలె నాశ్వాస విభాగము (మూఁడు), ప్రత్యాశ్వాసాంతమునను స్తుతిపద్య కవి గద్యలు నుండుట గమనింపఁ దగినది. ఈ యాశ్వాస విభాగము, నీరచనా శక్తియు యక్షగాన ప్రక్రియకు సహజమైనవికావు. కాని రూపక కళయు, గేయ ధర్మమును గూడ నిందుఁ దగినంత గలదు. గ్రంథకర్త మొత్తుగడలో దీనిని యక్షగానమని పేర్కొని యున్నను జివరికి వచ్చుసరికిఁ దన రచనాధోరణి నొకపరి సింహావలోకనము చేసికొని నట్లున్నాఁడు., మఱల యక్షగాన మనుటకు మనసొప్పక ' నాకుఁదోఁచిన యట్ల నవ్య కావ్యంబు రచియించితి ' నని యొక క్రొత్తపేరు పెట్టినాఁడు - " నాటక గేయ ప్రబంధ " మని. అందుల కెంతయుఁదగి యున్నది. అర్వాచీన యక్ష గాన కవు లాపేరినే, యా ప్రక్రియనే యాదరించిన వారును గొందఱు గలరు. వారి కృతులపై దీని ప్రభావము బాగుగాఁబడినది. (అది ముందు సూచింపఁబడును) ఇందుఁబ్రసిద్ధ రాగ తాళములలో దరువులు, ద్విపదలు, వానితో సమాన ప్రతిపత్తిగల పద్య గద్యములు, సం. శ్లోకములు, చూర్ణికలు, దండకములు, రగడ, కొట్నముల పాట, గౌరీ కల్యాణము, శోభనము, గలవు. ఇది ప్రదర్శన కెక్కినదని

నన్న వినవచ్చినది కాని యున్నదున్నట్లుగా నిది ప్రదర్శన సౌలభ్యముగల రచన కాదు.

---

# 26. ఉత్తరరంగకవి

## భక్తాంఘ్రిరేణు చరిత్రము :*

కవి గుఱించి వివరములు తెలియవు. ఈగ్రంథము రచనాకాలమున కొక మేర నిర్ణయించుటకు మాత్రము డి. నం. 930. ప్రతి విలేఖన కాలము శరణ్యమైనది. అది ఖర మాఘ శుద్ధ పంచమి – ఆదిత్యవారము. ఇది క్రీ. శ. 9–2–1712 తేదీకి సరిపోవు చున్నది. గ్రంథరచన మంతకు ముందు జరిగి యుండవలెనని మాత్రము చెప్పనగును.

ఇది ప్రసిద్ధుఁడగు విప్రనారాయణుని చరిత్రము. అతఁడఱవమున తొండరడిప్పొడియాళ్వారని వ్యవహృతుఁడు. "తొండరడిప్పొడి" కి సమానార్థకమే భక్తాంఘ్రిరేణు వనఁగా.

ఇది నాటకమని పేర్కొనఁబడినది. ఇందు గ్రంథారంభమునఁ జోళరాజు "నాస్థాన సంతోషి" యగు 'కోలకేతని' రాక చెప్పఁబడినది. (ఇది కాని దక్షిణదేశమునఁ బుట్టిన గ్రంథమా యని చిన్న యనుమానము తగులుచున్నది.)

---

* 1. ఆం. సా. ప. 2974 (భ. రే విలాసమని యున్నది.)

2. ప్రా. లి పు. భాం. డి నం. 1912, 1930.

చవిగొల్పు రచన మిది. సలక్షణమైనదయ్యుఁ జక్కని వాడుక నుడిగారపుసొంపులు గులుకుచున్నది. విటకంటకి, విప్రనారాయణుని శిష్యుఁడగు వికటదాసరి ప్రసంగములందు హాస్యస్వారస్యములు గలవు. వాలకముల వర్ణనలు, ప్రసంగములు జాతివార్తా చమత్కారచారువు లుగా నున్నవి. ఇందు ప్రసిద్ధరాగతాళములతో దరువులు, ద్విపదలు, గొలఁది పద్యములును గలవు. వచనములోఁగూడఁ బాత్రల ప్రసంగ ములుగలవు.

---

# 27. అకలంక శ్రీకృష్ణమాచార్యుఁడు

## కృష్ణవిలాసము:*

గ్రంథకర్త నృసింహగురునిపౌత్రుఁడు. లక్ష్మమా నృసింహ గురుల పుత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. సింగరాచార్య శ్రీ రఘు నాథభట్టరార్యుల శిష్యుఁడు. కవి నివాసము వినుకొండసీమ. ఆసీమలోని కొమ్మాలపాటి (నరసారావుపేట తా). కోదండరాముఁ డతని యిష్టదైవ తము. అతఁడే యేతత్కృతిపతి. కొమ్మాలపాటి పురాధిపతియు

---

* ఆం. సా. ప. నం. 3047 — జలక్రీడా విలాస మను "లేబిలు" తో నున్నది. ఇందు నడుమ నొక పత్రమున "రుక్మిణీ కల్యాణము — యక్షగానము" అని యున్నది. కృష్ణజననాద్రుక్మిణీ కల్యాణపర్యంతమిందలి విషయము. కాని యిం దెచ్చటను జలక్రీడాప్రసక్తి కానరాదు. దీనికిఁ గవి పెట్టిన పేరేమో తెలియదు. అది తెలియుదాఁక దీనిని కృష్ణవిలాసమని వ్యవహరించుట లెస్సయనుకొందుము.

మన్నెహంవీర పాపన్న భూపతి [1] కిని బుచ్చిమాంబికకును బుత్రుఁడు నైన గుమ్మడ పురమణరాజేతత్కృతి ప్రోత్సాహకుఁడు. ( ఈ విషయము లీగ్రంథము నుండియే యెఱుఁగనైనవి ) కృష్ణమార్యుఁడు ప్రౌఢకవి. ఉద్దండపండితుఁడు. ధనుర్విద్యావిలాసము, శకుంతలా పరిణయము, కొమ్మాలపాటి దండకము ననునవి యితని కృత్యంతరములు. ఇతని ధనుర్విద్యావిలాసకృతి పెరకుఁడగు కృష్ణానేని తిరుపతిక్ష్మాపతి క్రీ. శ. 1775 దాఁకనున్న వాఁడని శ్రీవేటూరివారు తత్పీఠికలో నిర్ణయించి యుండిరి[2] మఱి యీకృష్ణమార్యుఁ డాప్రాంతమున నున్న శ్లోక దా.

ఈగ్రంథమునందు దేవకి పైఁ గంసుఁడు కత్తినోఱ దూయుటతోఁ గథారంభము. చక్కని యెత్తుగడ. కథ రుక్మిణీ కల్యాణము వఱకు నున్నది. (ఈయసమగ్రప్రతిలోఁ గల్యాణకాండ లోపించినది).

ఇందలి రచన కడు ప్రౌఢమైనది. అర్థచమత్కార శబ్దాలంకార చారువైనది. మనోజ్ఞజాతీయతా ప్రకృష్టమైనది. ఇందు వివిధ ప్రసిద్ధ కర్ణాటక హిందూస్తాని రాగతాళములలో దరువులు, ద్విపదలు పద్యములు, ఒకచూర్ణిక, జోలపాటయుఁ జాలయేలలును గలవు. విరళ ప్రచారముగల జంగల రాగము, జుల్వ తాళము నిందుఁ బ్రయుక్తములు. "శారద పద్య" మను పేర నదిపద్యముకాదు రాగతాళము లుదాహరింపఁబడి దరువువలె నడుచు నొక రచనావిశేషమిందు ద్వారము ప్రయుక్తమైనది.

---

1. చెన్నూరి శోభనాద్రికవి శృంగార సుధా సముద్ర పూర్ణచంద్రోదయ ప్రబంధము. ( ప్రా. లి. పు. భాం. డి. నం. 848 ) కృతిపతి యితఁడే. ఆం. క. చ. న శోభనాద్రికవి కాలము నిర్ణయింపఁబడలేదు

2 ధ. వి. — ప్రా. లి. పు. భాం. ప్రచురణ. 1950.

# 28. (జూలకంటి) నారాయణకవి

## కొమ్మాలపాటి రామాయణము :*

### (సుందర కాండము)

ఈనారాయణకవి యింటిపేరు తెలియదు. ఇతఁడు జూలకల్లు వాసి. జూలకంటి గోపాలుఁ డీతని కిష్టదైవతము. త్రివర్ణవైష్ణవుఁడు (వైశ్య వైష్ణవుఁడు ?) తండ్రి గుర్వన. ఇతఁడీకృతిని "శ్రీమద్గుమ్మడపు రమణభూమీశలలామసతత పూజితుఁ" డగు కొమ్మాలపాటి సీతారామస్వామి కంకితమిచ్చెను. ఈగుమ్మడపు రమణరాజే తత్కృతి ప్రేరకుఁడు కావచ్చును. ఇతఁడే అకలంక శ్రీకృష్ణమార్యుని శ్రీకృష్ణ విలాస కృతిప్రోత్సాహకుఁడును. అతఁడు క్రీ.శ. 1775 ప్రాంతమువాఁడుగా శ్రీ వేటూరి వారి ధనుర్విద్యావిలాస పీఠికలోఁ గలదు. (ఇది పూర్వోక్త విషయమే) అనఁగా నారాయణకవియు నాకాలము వాఁడే యగును.

ఇందలి కథ ప్రసిద్ధము. రచన చక్కనిది. ప్రసిద్ధరాగ తాళము లందు దరువులు, ద్విపదలు, పద్యములు, సంధివచనముల వంటి వచన ములును గలవు. నాటకీయత గలదు. గ్రంథము యక్షగానమని పేర్కొనఁబడినది.

---

* ప్రా. లి. పు. భాం. ఆర్. నం. 671.

# 29. దినవహి ఓబయమంత్రి

## గరుడాచలవిలాసము:*

ఇతనితండ్రిపేరుకూడ నోబయ్యయే. తల్లి చెన్నమాంబ. ఇతఁడు నందవరము[1] కరణము. ఇంతే యితనిగూర్చి గ్రంథమునుండి యెఱుఁగనైనది. ఈ కవి కాలము నిర్ణయించుటకుఁ దగిన యాధారములు లభించుటలేదు. కాని రచనా ప్రక్రియనుబట్టి చూచినచో యక్షగాన పరిణామచరిత్రలో నిది మిక్కిలి ప్రాచీనస్థితిని సూచించుచున్నది. అచ్చుమచ్చిది సుగ్రీవ విజయ రచనాప్రణాళికను బోలినదే. వెనుకటిదినములలో సుగ్రీవవిజయముకంటెను నిది ప్రచుర ప్రచారమును వహించియుండెను. యక్షగాన వాఙ్మయ పరిశోధకులలో నగ్రేసరులగు కీ. శే. పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు "ఈ కాలమున మనకు లభించుచున్న యక్షగానములలో నెల్ల మిక్కిలి ప్రాచీనములైనవి గరుడాచలము నీలాచలము ననునవియే ... గరుడాచల నీలా

---

* ఇది 1872 లోనే ముద్రితమైనదని ఆం. వా. సూ. లోఁ గలదు. 1925 లోఁ బ్రకటితమైన వావిళ్ళవారి ప్రతియొకటి నేఁ డుపలబ్ధమగుచున్నది. కాని యముద్రితాంధ్ర గ్రంథ భాండాగారము లన్నిట దీనిలిఖిత ప్రతులు గలవు. (ప్రా. లి. పు. భాం. డి. నం. 1864—1868, తం. స. మ. కే నం. 479—480, ఆం. సా. ప. నం 245. 3680) వానికిని వావిళ్ళవారి ప్రతికిని కవి విషయముగల గ్రంథాంత ద్విపదలోఁ గొంతభేదము గలదు. ఆ విషయమున లిఖితప్రతులే గ్రాహ్యములు.

1. ఈకృతి గరుడాచలము లేక యహోబలమునకు సంబంధించినదగుట, అహోబలము కర్నూలు మండలముననున్నదగుట నీనందవరము కర్నూలు మండలములోనున్న నందవరమే యనుకొంటిని. కాని ప్రస్తుత మా నందవరము కరణముగారగు శ్రీ అబ్బాయి వెంకటసుబ్బయ్యగారా నందవరము కరణాల వంశావళిని సంప్రతించి యచట శా. శ. 1058 లగాయతు నేఁటివఱకు దినవహివారు లేరని తెల్పినారు.

చల నాటకములకంటె ప్రాచీనములైన యక్షగానములు తదితరము లిపుడు గానరావు" అని వక్కాణించియున్నారు.[2]

వారిది రుద్రకవి సుగ్రీవ విజయము నెఱిగియుండి యన్న మాటయే అయితే అది గరుడాచల రచనా ఫక్కికను బోల్చిచూచి వారుచేసిన యూహామాత్రమే. ఇప్పటికీ గరుడాచల రచనాకాలమున కొంతమేర నిర్ణయించుటకుమాత్రమే యనువుపడుచున్నది. అది డి. నం. 1867 ప్రతివిలేఖన కాలము - సౌమ్యనామ సంవత్సర జ్యేష్ఠశుద్ధ చతుర్థీ గురువారము. ఇది క్రీ. శ. 28-5-1789 కి సరిపోవుచున్నది.

గ్రంథ విషయము :- ప్రహ్లాదుని కోరికపై లక్ష్మీసమేతుఁడై వేదాచలమున విడిసిన నరసింహుఁడొకపరి గరుడాచల విహారమున బయలుదేఱుట - అక్కడ నొక చెంచెతను జేబట్టుట, - లక్ష్మీనరసింహుల నడుమ నారదుని కైలాటము - నరసింహుఁడు చెంచెతతో వేదాద్రికిఁ బయనమగుట - బెట్టుసరిచేసిన లక్ష్మీదేవి నెట్టెటో సమాధానపఱచుట - అంతలోఁ జెంచెత తండ్రి శిఖినాయకుఁడు తనకూఁతును లేవఁదీసికొని పోయెనని నరసింహునిపై నెత్తివచ్చుట - నరసింహుఁడొలిగట్టి వారితోఁ గలిసిమెలిసి చెంచుపోఁబడగుట - (క్రాంజ వెంకటాద్రి వాసంతికా పరిణయమున నరసింహుఁడు చెంచెతను జేపట్టుటతోసరి మఱి యా రెండవఘట్టము లేదు.

ఇందు దరువులన్నియుఁ దాళ ప్రధానములై మంచి పరువుగల నడకతో సాగినవి. అట, ఏక, త్రిపుట, రూపకము, జంపె, కుఱుచ జంపె తాళములు వాడఁబడినవి. ద్విపద లాఖ్యానశైలీ పరములుగా నున్నవి. సంధి ప్రయోజనాత్మకములగు వచనములు తఱచు, కంద గీత

2. వారి వ్యాసము 'యక్షగానము లేక జక్కులపాటలు, — ఆంధ్రపత్రిక దుర్మతి సంవత్సరాది సంచిక, 1921.

పద్యములు విరళముగాఁ బ్రయుక్తములు; ఏలలు, శోభనము, ధవళ మును గలవు. ఒక కందముతో గ్రంథారంభము. జంపెలో షష్ఠ్యంత ములు, ద్విపదతో గ్రంథాంతము. రచన చక్కనిది. గ్రంథము యక్ష గానమని పేర్కొనఁబడినది.

# 30. భీమసింగి కవిరాజు

## రాణీరాజవిలాసము :*

ఈ గ్రంథకర్త పేరేమో యిదమిత్థముగాఁ దెలిసినది కాదు. కాని గ్రంథమునఁ బలుతావుల భీమసింగిరాజులగు జంపన నరసింహా ప్పల విజయరామ భూపతులు పేర్కొనఁబడిరి. గ్రంథాంతమున "రాణీ రాజ విలాసం బీగతి రచియించిన కవిరాజును" అని మాత్రము గలదు. ఈకవిరా జెవఁడో భీమసింగి ప్రాంతమువాఁడై యుండును. ఆ రాజులే తత్కృతి ప్రోత్సాహకులై యుందురు. భీమసింగి విశాఖమండలమున శృంగవరపు కోట తాలూకాలోనున్నది. దీని కనతిదూరమున నున్న పద్మనాభమను గ్రామము నొద్ద విజయనగర రాజగు పూసపాటి రెండవ విజయరామరాజునకును, కుంఫిణీవారికిని జరిగిన యుద్ధము ప్రధాన విషయముగాఁ జట్రాతి లక్ష్మీనరసు రచించిన పద్మనాభ

* ప్రా. లి. పు. భాం. ఆర్. నం. 540 కేటలాగులోనిది రాజారాణి విలాస మని పేర్కొనఁబడినది. కాని గ్రంథాంతమున నిది రాణీరాజవిలాసమని కవిచేఁ బేర్కొనఁబడినది.

యుద్ధమను గ్రంథమున [1] 116 వ పద్యమునఁ బూసపాటి విజయ రామ రాజు పక్షమున జంపన విజయరామావనీంద్రుఁ డాయుద్ధమునఁ బ్రాణ్గొని నట్లు చెప్పఁబడినది. అందే 278 వ పద్యమున జంపన అప్పలరాజును నతఁడు యుద్ధమున నిహతుఁడైనట్లు గలదు. ఈ యుద్ధము క్రీ. శ. 1794 లో జరిగినది. [2] కాఁగా నీ గ్రంథము 1794 సం. న కించుక పూర్వము రచింపఁబడి యుండినట్లూహింపఁబడుచున్నది.

గ్రంథ విషయము :— మగధ రాజపుత్రి స్వయంవరమునఁ గాశ్మీర పతిని వరించుట — అతఁడొకనాఁడు మృగయా విహారము సేయఁ బోయి వనమున విహరింపవచ్చిన వైశ్య శూద్రముని కన్యల నిరువురఁ జూచి మోహించి, వారి పితరుల యనుమతిపై వారిని జేపట్టి యుండుం డుట - అట నంతఃపురములో విరహావిహ్వల యగుచున్న రాణి దూతికల వలన సంగతి విని రాయబారము లంపుట — అతఁ డానవాలిచ్చుట ఉండఁబట్టక రాజుకడకు రాణి స్వయముగా బయలుదేఱుట - రాజుతో, సవతులతో నామె సంవాదము — సమాధానము.

ప్రసిద్ధ కర్ణాటక హిందుస్తాని రాగ తాళములలో నున్న దరు వుల మయమైన రచన యిది. దరువులక్రింద స్వరజతులు, శబ్దములును బలు తావులను వాహరింపఁబడినవి. హిందూస్తాని దరువులగు టప్పాలు, టుమ్రీలు నుండుట విశేషము. పద్యములు చాలఁగలవు. ద్విపదలు లేవు. అక్కడక్కడ హిందీభాష కొంత ప్రయుక్తము. గ్రంథమంతయు సంవాద శైలియందే గలదు. “ రాజు వాక్యం ”, “ రాణివాక్యం ” మొ. పాత్రల సంభాషణ పీఠికలు గలవు. నాయిక విరహావేదన ఘట్ట

1. ముద్రితము — లక్ష్మీ ప్రింటింగు వర్క్సు, రాజమండ్రి, 1934 ప్రచురణ కర్త :— శ్రీ వత్సవాయి రాయజగపతి వర్మ.

2. చూ. విశాఖ జిల్లా గెజటీరు, పుట 339.

మున ప్రబంధము భామ కలాపముల పోకడలు గలవు. పారిజాతాప హరణ రాధామాధవ సంవాద ప్రబంధము లందలి పద్యములు గొన్ని గ్రహింపఁబడినవి. కాని యీ కవి రచనయుఁ గడు చక్కనిది. కవిచే నిది యక్షగానముగాఁ బేర్కొనఁబడలేదు. కాని ప్రక్రియ యంతయుఁ దత్సదృశమైనదే; ప్రదర్శనోద్దిష్టమైనదని యూహింపవచ్చు.

---

# 31. నరుకూరు నారాయణకవి

## పారిజాతనాటకము :♦

కవి విశ్వకర్మాన్వయుఁడు. నరుకూరి ముత్తయ్యకుఁ గాళ మాంబకుఁ బుత్రుఁడు. కొండూరి వెంకటాచార్యుని శిష్యుఁడు. గ్రంథము నరుకూరి చెన్నకేశవ ముద్రగలది. కవి నివాస మదే కావచ్చును. (నరుకూరు నెల్లూరుతాలూకాలో నున్నది.) ఇది వెంకటగిరి ప్రభువును రేచర్లగోత్రజుఁడును, వెలుగోటి బంగారు యాచమనాయకుని కుమారుఁ డైన కుమారయాచమ నాయకుని కంకితము. ఈ పేరింటి రాజు లావంశమునఁ జాలమంది గలరు. “ వెలుగోటివారి వంశచరిత్రము ” లేక “ వేంకటగిరి రాజుల వంశచరిత్రము ” అనుగ్రంథము* నె 126–134 పుటల

---

♦ ఇది 1882లోనే ముద్రిత మని ఆం. వా. సూ. లోఁ గలదు. మరల 1906. లో మదరాసు జీవరక్షా ము. శా. చేఁ బ్రచురితము.

* శారాదాంబా విలాస ముద్రాయంత్ర ప్రచురణ, మదరాసు, 1910 గ్రంథకర్తలు:— వెల్లాల సదాశివశాస్త్రులు, అవధానము శేషశాస్త్రులుగారలు.

నడుమ నావంశమున 25 వ తరమువాఁడగు కుమార యాచమ నాయ కుని యుదంతము గలదు. అందు 127 పుటలో " నరుకూరు నారా యణప్ప యనుకవి పారిజాతాపహరణమను యక్షగానమును వీరి కంకిత ముగా రచియించెను " అనికలదు. ఈకుమారయాచమ నాయకుఁడు బంగారుయాచమ నాయకుని తనయుఁడనియు, నితని జననము క్రీ. శ. 1762, పట్టాభిషేకము 1777, నిర్యాణము 1805 అనియు నందు గలదు. కాఁగా నారాయణకవి 1777 - 1805 సం. ల. నడుమ నుండె ననుట నిశ్చయము.

గ్రంథ విషయము:— కథ ప్రసిద్ధము. తిమ్మనగారి ప్రబంధమును జూచి తానీ నాటకమును రచించినట్లు కవి చెప్పినాఁడు. అదే కథా ప్రణాళిక కాని యిందు పుణ్యకవ్రతకథ పరిహరింపఁబడినది. సవతి కయ్యము ఘట్టము ప్రపంచింపఁబడినది. రాధపాత్రకుఁ బ్రసక్తిగలదు. రచన చక్కనిది. దీనిపై భామకలాపము ప్రభావము, నర్వాచీన పారి జాత య. గా. లపై దీనిప్రభావము నతిమాత్రముగాఁ గన్పట్టును. ఇందు తాళ ప్రధానములైన దరువులు, ద్విపదలు, పద్యములు, కందా ర్థములు, గీతార్థములు, ఏలలు, అర్ధచంద్రికలు, శోభనములు, శ్లోక ములు, చూర్ణికలు మొ. రచనా విశేషములు గలవు. సంధివచనము లాపేరఁ బేర్కొనఁబడినవికలవు. పాత్రల సంభాషణ పీఠికలు, పాత్ర లను వారివృత్తాంతము గుఱించి పృచ్ఛించు మాధవివంటి పాత్ర హాస్య గాఁడనుపేరఁ గలదు. వాఁడు పాత్రలప్రసంగములకు 'పేరడీ' లు చేయుట విశేషము. పాత్రలు ప్రవేశింపఁగనే స్వీయోదంతమును బ్రకటించు కొనుటగలదు. ముఖాముఖి సంభాషించుట గలదు. ఇది నాటకమని కవిచేఁ బేర్కొనఁబడినది. నాటకీయత ప్రస్ఫుటముగాఁగలదు. ఇది

ప్రదర్శనములందు విశేషప్రచారము గాంచినది. దీనికి "ఆటభాగవత" మనియుఁ బేరుగలదు.*

---

## 32. లింగమూర్తి కవి

### శివ పారిజాతము:

కవి గుఱించి వివరము లిందుఁ దెలియరావు. గ్రంథ ప్రతి (డి. నం. 1944) వ్రిలేఖనకాలము "విశ్వావసు సంవత్సరం భాద్రపద

---

* చూ. ప్రా. లి. పు భాం. ఆర్ నం. 560.

ప్రత్యంతరములు:— ప్రా. లి. పు. భాం. డి నం. 1899–1900 తం. స మ. కే. నం. 488 సత్యభామకథ — కర్త పేరింకుఁ గానరాదు. కాని యిది నరుకూరి పారిజాతము భాగమే. తం. స. మ. కే. నం. 487 రాధ కథ, ఆం సా. ప. నం 173 గొల్ల కథలోను నరుకూరి చెన్న ముద్రతోనున్న దగువుఁ గిలవు నారాయణకవి గొల్ల కలాపముగూడ రచించి యుండెనా!

* ప్రా. లి. పు. భాం. డి.నం. 1944--ఆర్.నం. 1157 (ప్రా.లి. పు భాం. డి. నం. 1945–ఆర్. నం. 1197 కూడా శివపారిజాతమే. ఇందు గ్రంథకర్తపేరు కానరాదు. ఇది పైదానికంటె వేఱని కేటలాగులోఁ గలదు. కానియది కేవలము స్వతంత్ర గ్రంథము కాదు. తత్కర్త యెవఁడో లింగమూర్తి గ్రంథ భాగములనే బాగుగా సంగ్రహించినాఁడు. ఆ పద పద్యములనే యించించుక మార్చుటకుఁ బ్రయత్నించినాఁడు.

ఆర్. 1157—45, 51, 57, 59, 62, 63, 64, 67, 72, 106 వ పుటలలోని ద్విపదలను, పద్యములను—

ఆర్. 1197— 13, 1, 4, 7, 8, 10. 12, 13, 16 వ పుటలలోని ద్విపదలతోఁ వరుసగాఁ బరిశీలించినచో నా పోలిక స్పష్టపడగలదు. 1157 లోని గొల్లభామ, సింగి సింగళ్ల ప్రసంగములు మెం. 1197లో విడువఁబడినవి.)

శు. 6 శుక్రవారం" ఇది క్రీ. శ. 9–9–1785 తేదీకి మాత్రమే సరిపోవుచున్నది. అనఁగా గవి యంతకుఁబూర్వుఁ డనవలెను. రచనాధోరణినిబట్టి చూచిన నంతఁగా పూర్వుఁడనిపించుటలేదు.

గ్రంథపుటెత్తుగడ యేమిటో గజిబిజిగానున్నది. మొదట "బాలరుద్ర వేషము" ప్రవేశము. అతనిని వెదకుచుఁ బార్వతిరాక. తరువాతనొక "బైరాగివేషము" ప్రవేశించి హిందిలోఁ బ్రసంగించును. తదుపరి యొకచిన్న గొల్లకలాపము. సుంకరి శ్రీగిరి (గొ. క. ల.లో సుంకరి పేరు కొండయగాఁ బ్రసిద్ధము) గొల్లభామతోఁ జెయిముట్టు సరసముచేయఁబోఁగా నామె యత్తగారు వచ్చును. అంత "ఎఱుకల వేషము"– పార్వతికిఁ బ్రియుఁడు ప్రసన్నుఁడగునని యెఱుకచెప్పుట-సింగనివర్ణన, ప్రసంగముగలవు. తరువాత "చెంచెతవేషము" న గౌరి, "బాలికవేషము" న గంగ, మీనాక్షి, పద్మాక్షి, కనకదుర్గయును వారెవరో శివుని వెదకవత్తురు. "రుద్రవేషము" వారిని వెదుకవచ్చును. త. నాయికానాయకుల విరహవేదన, సంవాదములు, అలుక తియ్యారింపులు, సవతుల కయ్యముసాగినవి. గ్రంథముపేరు శివపారిజాతమే కాని యిందు పారిజాతప్రసక్తిలేదు. అసలు పారిజాతకథ సవతి మచ్చరమునకుఁ బేర్పడ్డది. కాఁబట్టి యిందును శివ సతుల సవతిమచ్చరము వర్ణితమైనదికాఁబట్టి యీపేరుపెట్టబడినదనియూహింపనగును. మొదటఁగథాసంవిధానములోను రచనలోను లగువు బిగువులు గానరావు రానురాను హెచ్చినవి. ఇందు గొల్లభామ కథకు బొత్తుగాఁ బ్రమేయములేదు. (ప్రతివిలేఖకుల దోషము లేమైన నిందుగలవేమో!) ఇందుఁబదములు, ద్విపదలు నెక్కువ. తదుపరి పద్య సంఖ్యయు నందు సీస సంఖ్యయు నెక్కువ. వచనములు కొద్ది. సం. శ్లోకములు (కొన్ని ప్రసిద్ధములే), చూర్ణిక, యాలలు, సారంగపదము గలవు. గ్రంథమెక్కువగాఁ

బాత్రల సంభాషణలలోనే సాగినది. ప్రవేశ సమయమునఁ బాత్రలు స్వవిషయమును జెప్పుకొనుటయు నిందుఁగాననగును. రచన నిర్దుష్టము కాదుగాని చతురముగాసాగినపట్లు నిందుగలవు.

# 33. అక్కెన ప్రగడ హరిదాసు

ఇతఁడు "శ్రీరామ నిత్యోత్సవ యక్షగానము, అమరేశ్వర స్వామి బాలచాముండీ అమ్మవారి ఏకాంత సేవ" అను రెండు యక్షగానములను రచించినట్లును నవి ప్రచురితములైనట్లును ఆం. వా. సూ. లోఁగలదు. ఇతఁడు కుబ్జా కృష్ణవిలాస మను కావ్యమును రచించినట్లును నితనికాలము 18 వ శతాబ్ది యనియు వర్ణన రత్నాకరమునఁ గలదు. (గ్రంథములు నా కలభ్యములు).

---

# 34. గోపాలుని సింగయ

## ప్రభావతీ ప్రద్యుమ్నము:*

కవి విషయము:- గోపాలాన్వయుఁడు. భాస్కర మంత్రి పౌత్రుఁడు. వీరన మంత్రి పుత్రుఁడు. తల్లి యోబమ. ఆం. క. చ. నుండి తెలిసిన విశేషములు: ఇతఁడు నియోగి. మౌద్గల్య గోత్రుఁడు.

---

* ప్రా. లి. పు. భాం. డి. నం. 1910

కిరాతార్జునీయాంధ్ర కావ్యానువాద మితని కృత్యంతరము. ఈ కవి కర్నూలుమండలములోనివాఁడు. ఈ కవి పుత్రుఁ డెనుబది సంవత్సరముల క్రిందట జీవించియుండెను. కాఁబట్టి కవి నూఱు సంవత్సరముల క్రిందటివాఁడు. (అది ఆం. క. చ. రచనాకాలమునాఁటికి) అది యథార్థమగునేని కవి క్రీ. శ. 1౯వ శతాబ్ది తురీయపాదము నందుండెననవచ్చును.

గ్రంథ విషయము:— ఇది పింగళి సూరనార్యుని ప్రభావతీ ప్రద్యుమ్నమునకు యక్షగాన రూప పరివర్తనము. కథా ప్రణాళిక యథా సూరనీయముగా నడచినది. అందలి పద బంధములు, భావములును నిందలి దరువులలో విరివిగా దొరలినవి. అయినను సింగయ స్వతంత్రముగను జతురమైన రచన చేయఁగలఁడని తేటపడినది. ఇందు దరువులు, ద్విపదలు నెక్కువ. గద్యపద్యములు కొద్దిగాఁ గలవు. ఎడనెడ నర్ధచంద్రికలు, నోకోక ధవళము, శోభనము, ఏల, మంజరియును గలవు. దరువు లెక్కువగాఁ దాళప్రధానములు. వివిధ తాళ రేకులు నుండుట విశేషము. రాగము లక్కడక్కడ పేర్కొనఁబడినవి. సూరన కృతిలోని గంగావతార నాట్యప్రసంగమిందు లేదు. కాని దానికి "బదులు" గా పగలాట ప్రదర్శన వర్ణన విపులముగాఁ గలదు. అందు పాత్రలు తెరవెడలు క్రమము సూచింపఁబడినది. పేరడి, ప్రబంధజక్కిణి, చిందు, కొరవంజి, జోగిణి, మొ. నాట్య భేదములు పేర్కొనఁబడినవి. నటపారిపార్శ్వక, విదూషక ప్రసక్తి కలదు. ప్రేక్షకాగారమున రాణివాసపు వారికిఁ బ్రత్యేకపు టేర్పాట్లుండినట్లు పేర్కొనబడినది.

# 35. పురిజాల లక్ష్మీనారాయణకవి

**పారిజాతము:** *

కవి కాశ్యపగోత్రుఁడు. పాపయామాత్యపౌత్రుఁడు. అనంతమాంబానాగయామాత్యుల పుత్రుఁడు. తిరుమల తాతాచార్యుల శిష్యుఁడు. పాలకొండ రామభద్రనృపతి తత్కృతి ప్రోత్సాహకుఁడు.

దీనికిఁ కవి స్వహస్త లిఖితమైన తాళపత్రప్రతి లభించుటయు, లేఖనకాలము పేర్కొనఁబడి యుండుటయు విశేషము. ప్రతిచివర "కాలయుక్తినామ సంవత్సర పుష్య బ ౧౦ గురువారం సరికి పురిజాల లక్ష్మీనారాయణుఁడు లిఖించెను." అనియున్నది. ఇది క్రీ. శ. 31-12-1618 తేదీకి మాత్రము సరిపోవుచున్నది. కాని గ్రంథ రచనాకాలమది కాఁజాలదు.

ఈగ్రంథమున క్షీరగిరి ప్రశంస గలదు. కృతి ప్రోత్సాహకుఁడు పాలకొండ రామభద్రనృపతి క్షీరగిరి పాలకొండకు సంస్కృతీకరణమై యుండుననియు నది రామభద్ర నృపతి యూరై యుండుననియుఁ దోఁచును. స్థానికముగా క్షీరగిరియనికవుల వ్యవహారముగల పాలకొండ పుర మొకటి నేటి శ్రీకాకుళ మండలమున నున్నది. అది వెనుక విశాఖమండలమునకుఁ జెందియుండినది. ఆదినములలో నీప్రతి విశాఖమండలమునుండియే సంపాదింపఁబడినది♦ కవియు విశాఖమండలమునకుఁ జెందినవాఁడై యుండును. రామభద్ర నృపతికాలము తెలియవచ్చుట లేదు. కాని క్రీ. శ. 1618 నాఁటికి విశాఖమండలమున యక్షగాన

* ప్రా. లి. పు. భాం. ఆర్. నం. 438.

♦ చూ. ప్రా. లి. పు. భాం. త్రైవార్షిక నివేదిక సం. 3—పుట 1178.

ములు వెలసిన జాడ లేదు. అదికాక గ్రంథమున మాధవి పాత్రయు, భామ కలాపము ఫక్కికయుఁ గన్పట్టుచున్నవి. అవి క్రీ. శ. 1672–1685 ప్రాంతమున నుండిన సిద్ధేంద్రయోగి సృష్టికిఁ జెందినవి. మఱి యొక సంగతి ఇందు కవి మన్మథుని నవాబుతో సరిపోల్చిన సందర్భము నందలి యొక పద్యము:—

"నెలయను తెల్లవాండ్రు గరిణేలుగ (?) చిల్కలబారు సోలునా
దులుగ (?) సునాకమిచ్చునుగ తుమ్మెద పిల్లన గ్రోవికాండ్రుగా
దలఁకక పల్కు కోయిలలు శంబుర వాయదకాండ్రుగా నెమ
ళ్ళలుకుడు తా సిఫాయిలుగ నావలి తెమ్మెరయున్ ద్విభాషిగా
బలుఁకు మరుండు వెల్గెడె నబాబయి పాంథజనాళి నేచగన్"

ఇందలి గరిణేలు (గవిణే ?) సోలు దాగులను శబ్దముల కర్థము స్ఫురించుచున్నది కాని వాని స్వరూపము వింతగానున్నది. వాని యథార్థ స్వరూపము గవర్నరు, సోల్జరులునై యుండునా యని యనుమానము. "తెల్లవాండ్రు" శబ్దమున శ్వేత వర్ణుఁడగు పాశ్చాత్యుఁడు స్ఫురించుచున్నాఁడు. అతనికి నబాబుతోడి సంబంధమును ద్విభాషి శబ్దము సూచించుచున్నది. అట్టి సంబంధములు, నా తెల్లదొరల ప్రాభవము మనదేశమున క్రీ. శ. 1619 నాఁటి కేర్పడి యుండలేదు. విశాఖ మండలమున క్రీ శ. 1757 లో జరిగిన చరిత్ర ప్రసిద్ధమైన బొబ్బిలి యుద్ధము కారణముగా కవిపేరు, నవాబు, దుబాసి మొదలగు పదజాలమున కిటుఁ బ్రచారము గల్గినది. 1757 తరువాత వచ్చిన కాలయుక్తి 1793–99 సం. లలోఁ బడినది. ఆ కాలయుక్తి పుష్య బహుళ ౧౦ క్రీ. శ. 30-1-799, కాని యది బుధవారము. మఱునాఁడే కదా గురువారము — పు. బ. ౧౧. అంకెలోనో తిథిలోనో యేదో చిన్న యరమరిక యుండి యుండును గాని గ్రంథ లేఖనమైన దిన మదే యై యుండు

ననవచ్చును. (ఆ తరువాతి కాలయుక్తి 1858–59, లోఁజూచినను నీ యరమరిక తీరదు. ఎట్లయినను గ్రంథరచనా విషయమున నది 1859 కి ముందు జరిగెననుట సునిశ్చితము. 1799 సం. ను గ్రహించుట లెస్స యగును). అగుచో నదే కవి కాలమునగును గదా !

గ్రంథవిషయము :— కవి తన గ్రంథమును యక్షగాన ప్రబంధ మని పేర్కొనినాఁడు. అటఁ బ్రబంధ శబ్దము కావ్య సామాన్యవాచి మాత్రమే కాదు. కొంత సార్థకము నైనది. చంద్రోదయాది వర్ణనలు, నాయిక విరహావస్థయు, గ్రంథాంత పద్య గద్యములు నందులకుఁ దార్కాణములు. నాయిక మాధవితోఁ దన సొద వెళ్ళబోసికొను టయుఁ బ్రియునికడకు రాయబారములు బంపుటయు మొదలగునవి భామకలాపము ఫక్కిని దలఁపించును. పారిజాత కథతో సంబంధము లేని రాధ పాత్ర కిందుఁ బ్రసక్తి గల్గినది. అది యొక యసందర్భమే యగును.

ఒక విశేషము :— ఇందాట భాగవతములందుఁ బురుషులు స్త్రీ వేషములను ధరించుటగూర్చి సత్యభామకు సఖి పాత్రకు నడుమ నొక చర్చ సాగినది. పురుషులు స్త్రీ వేషములను ధరించు టుచితముగాదని సఖి వాదము. భంగాశ్వ జగన్మోహినీ వృత్తాంతములు చెప్పి సత్యభామ సఖి వాదమునకుఁ బ్రత్యాఖ్యానము చేసి విషయమును సమర్థించినది. ఈ ప్రసంగమునఁ గవియుద్దేశము పురుషులును స్త్రీ వేషములను బూన వచ్చునని సమర్థించుట. తగిన సందర్భము లేకున్నను నతఁడా విషయము నెత్తుకొని యక్ట్లేల సమర్థింపవలసివచ్చినది ? అనఁగా స్త్రీ పాత్రలను బురుషులుగాక స్త్రీలే నిర్వహించుట యుక్తమను వాదము క్రొత్తగాఁ గవి సమకాలికులలో బయలుదేఱినదో ; లేక యక్కడక్కడ వీధి భాగవతములలోఁ దొలుత స్త్రీ పాత్రలను స్త్రీలే నిర్వహించుచుండి

రనియు నీ కవికాలమునాఁటికిఁ బురుషులు నందులకుఁ బూనుకొను చుండఁగా నచ్చటచ్చట యాక్షేపణ బయలుదేఱి యుండుననియు నూహింపనగును.

ఈ యూహాను గవి నివాసమగు విశాఖమండలమునకే పరిమిత ముగా నైనను గ్రహింపవచ్చును. "విశాఖపట్టణముజిల్లా వృత్తాంత సంగ్రహము" 130 వ పుటలో నా మండలములో నాఁడబడు "జన రంజకనాటకము" లలో "స్త్రీలు, పురుషులు వేషములు వేసుకుని వినికిడిచేసెడి" వారని కలదు. అందే 136 వ పుటలో నా జనరంజక నాటకములలోఁ బారిజాతమొకటి యని చెప్పఁబడినది. అది లక్ష్మీ నారాయణకవిదే కావచ్చును.

పై ప్రసంగమునుబట్టి యిది పదర్శనోద్దిష్టమైనదే యని చెప్ప వలెను. ఇందుఁ బ్రసిద్ధరాగ తాళములలో దరువులు, ద్విపదలు, వచన ములు, పద్యములు, చూర్ణిక, శోభనము, మంగళహారతి మొ. కలవు. అటనట నెఱసు లున్నను సరసమైనదే రచన.

---

# 36. పణిహారం ఎంబారయ్యా

## కురవంజి:

ప్రతి ప్రా. లి. పు. భాం. డి. నం. 1855. ఇందు కవి గుఱించి వివరములు లేవు. పై ప్రతివిలేఖనకాలము "రుదిరోద్గారి సంవత్సరం మార్గళి నెల 10 వ తేదీ దశమీ శుక్రవారం" ఇది క్రీ. శ.

23-12-1803 కి సరిపోవుచున్నది. కవి యంతకొక్కింత పూర్వుఁడై యుండును.

రామానుజాచార్యుఁ డొకపరి కురవంజి వేషము స్వీకరించి కాంచీపురాధిపుని పట్టమహిషియగు అమందేవి తాయి కడకుఁబోయి విశిష్టాద్వైతపరముగాఁ బాంచభౌతిక దేహతత్త్వము, జీవేశ్వర మర్మములు మొ. వానిఁగూర్చి యుపన్యసించుటయుఁ బెను పెరుమాళ్లు (శ్రీమహావిష్ణువు) సింగఁడై వచ్చుటయు నీ గ్రంథవిషయము. (ఎటు కత పెట్టిన యేకరువులో అద్దంకి సింగరాచార్యుల పేరు దొరకినది. అతఁడు క్రీ. శ. 1600 ప్రాంతమందుండిన రేటూరికవుల గురువు - చూ. ఆం.క త. 11 సం.) ఇందుఁ బ్రసిద్ధ రాగములలో దరువులు, తాళప్రధానములగు పదములు, ద్విపదలు, రెండు మూఁడు వృత్తములు, సంధి వచనములు గలవు. ఏల, ముచ్చట, అల్లో నేరేళ్ళు, పాళిపదం, సువ్వాల ధాతువు విశేషములు-రచన యొకమోస్తరు.

---

# 37. విశ్వేశ్వరుఁడు

## ధర్మపురి మాహాత్మ్యము :

తిరుపతి శ్రీవేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాలయము ప్రతి సం. 6688. ఈగ్రంథము ప్రత్యంతరమే ఆంధ్రసాహిత్య పరిషద్గ్రంథ భాండాగారమున "చంద్రరేఖా విలాస" మనుపేర నున్నది. (సం. 863) అది ప్రతివిలేఖకుఁడు పెట్టిన పేరు. ఇందలి నాయిక చంద్రరేఖ. కాని "ధర్మపురి మహాత్మ్యం బెటువలెను" అనియే కవిచేసిన కథోపక్రమణిక. తిరుపతి

ప్రతి చూపేరనే యున్నది. ఇందు కవి నామవిషయ మొకటి శంకా వహము. రెండు ప్రతులలోను గ్రంథారంభ ద్విపదలో "నిజకుల కర్త మను...డు" అని యున్నారు. కాని యిది యొక పేరేమిటి! ఆం. సా. ప. ప్రతి గ్రంథాంత ద్విపదలో "విరచించె నీకథ విశ్వేశ్వరుండు" అని యున్నది అదే కవిపేరు కాందగును. (కాని తిరుపతి ప్రతిలో "విరచించె నీకథ విశ్వేశు పేర" అని యున్నది. అది పొరపాటు కాందగును.) ఈకవి "అభినవ కవి రాఘవయ్య సేవకుం" డని చెంటను గలదు. అంతకంటెం గవిని గుఱించిన వివరములు దెలియవు. ఆం. సా. ప. ప్రతివిలేఖన కాలము: క్రోధన వైశాఖ బహుళ సప్తమి జయవారము 21-5-1805. కవి యందుకుం గొంత పూర్వుం డగును.

గ్రంథవిషయము: గౌతమీ తీరమునన్న ధర్మపురిక్షేత్రమునకు సంబంధించినగాథ. శైలపురీంద్రునికి ధర్మపురి రామలింగస్వామిదయ వలనం గలిగిన పుత్రుండగు దీర్ఘరాజు ప్రతిష్ఠానపురాధీశుడగు శాలివాహన భూపాలుని పుత్రికయగు చంద్రరేఖను బెండ్లి యుంకువ యగు కలియుగ పొన్నపూలు తెచ్చి పెండ్లాడిన కథ యిది. అవి సాధించుటలో నతం డొనర్చిన సాహసకృత్యములు, నవాంతర వివాహ కథలు నిందు వర్ణితములు. కథాప్రధానమైన దీకృతి. ఇందుం దాళప్రధానములైన దరువులు, ద్విపదలు, వచనము, గొలుసుపద్యములు, కురుచ రేకులు, నడలు సమలఘువులు, ఉత్కళికలు, చిత్రతాళము, రగడ మొ. రచనా విశేషములును గలవు. రచన యొకట పేలవము, దోషజుష్టముగా నున్నను జివరకు పోను పోను చిక్కబడినది.

---

# 38. దొడ్డి నరసింహ కవి

## కరియబంటుని కథ:*

కవి విషయము :- శంకరాచార్యుల శిష్యుఁడు. దొడ్డి లేక దొడ్డకొండయాభట్టుఁ డతని కిష్టదైవము నీకృతిపతియు నైనవాఁడు. గుత్తిరాజ్యమున గోట్లూరి తూర్పున "సదాశివరాయలు తాను అమరంగ జేసిన అగ్రహారం" బగు జంగాల గ్రామమున కధిపతియు, నాశ్వలాయన సూత్రుఁడు, భారద్వాజస గోత్రుఁడు, ఫణియప్ప పుత్రుఁడు నైన పద్మనాభయ గ్రంథాంతద్విపదలోఁ జేర్కొనఁబడినాఁడు. అతఁడే తత్కృతి ప్రోత్సాహకుఁడై యుండును. కవి కాలపు టుత్తరపు మేర మాత్రము నిర్ణయించుట కొక్క యాధారము గన్పట్టుచున్నది. ఈ కృతి ప్రతివిలేఖన కాలము "ప్రమోదూత సంవత్సర చైత్ర బ ౧౦." వార మనుక్తము. దీనినిబట్టి కాల నిర్ణయము కుదురదు. కాని యీ ప్రతివిలేఖకుఁడగు బమ్మహళ్ళి నారాయణప్ప కొడుకు రామప్ప యే అడయారు ది. స. గ్రం. - జి. నం 74862 శతకంఠ రామాయణ యక్షగాన ప్రతి విలేఖకుఁడును. దాని లేఖన కాలము శుక్ల పుష్య ౧౩ శుక్ర వారము. అది క్రీ. శ. 2-3-1810 తేదీకి సరిపోవుచున్నది. కరియ బంటుని కథ ప్రతి విలేఖన సంవత్సరమగు ప్రమోదూత పై శుక్ల తరువాతిదే కావచ్చును. అనఁగా కవి క్రీ. శ. 1810 కొక్కింత ముందు వాఁడు కావచ్చును.

---

* అడయారు ది. స. గ్రంథాలయము — జి. నం. 74880. (కన్నడ మోడి గలది)

గ్రంథ విషయము :- ధారా పురాధిపతి యగు కరియబంటు హాళియ బీడు పురాధిపతి యగు బల్లాలు నాహ్వానమున హాళియబీడు నకుఁ బోవుచుండఁగా త్రోవలోఁ దొండనూరిపురమేలు నొక రక్కసి కూఁతురు పుండరీకాక్షి యనున దతనిని జూచి వలచుట - రక్కసి యతనిని జంపుట - ఆ రక్కసి శాపము దీరి మాలిని యను గంధర్వస్త్రీ యగుట - చివరికి శివుఁడు ప్రత్యక్షమై యతనిని బునర్జీవితు నొన ర్చుట - తదుపరి పుండరీకాక్షితోఁ గరిరాజు కల్యాణము. ఇందలి కథా ప్రధానాంశము లివి. నడుమఁ జక్కని సన్నివేశములు గలవు. ఈ కథ కన్నడ దేశమునఁ గడు ప్రచారము గాంచినట్టిది. (ఈ కథనే 1750 ప్రాంతమున బొమ్మలాట సాంబయ్య కన్నడమున యక్షగాన ముగా రచించి యుండెను. చూ. ప్రా. లి. పు. భాం. డి. నం. 1169 బహుశా దాని కిది యాంధ్రభాషా పరివర్తనమేమో?) ఇందుఁ గరియ బంటుని తల్లికడ కాకాశవాణి కొరవంజి వేషంబు దాల్చి వచ్చినట్లు గల దదియొక విశేషమే. కథాంశము విశేషముగాఁ గల య. గా. లలో నిది యొకటి. ఇందుఁ దాళప్రధానములైన దరువులు, వచనము, ద్విపదలు, పద్యములు, అర్ధచంద్రికలు, రచ్చరేకులు, ధవళ శోభన ములు, గౌరీకళ్యాణమును గలవు. యక్షగానమని పేర్కొనఁబడినది. దరువులలో మాత్ర మక్కడక్కడ రచన చక్కగ సాగినది.

— —

# 39. ఇటికెల తిమ్మయ

## కన్యకా పురాణము:* (లేక చరిత్ర)

కవి విషయము :— ఇతనిది వైశ్యకులము. చంద్రకుల గోత్రము. తాత గురవయ. తండ్రి చన్నమసెట్టి. తల్లి లక్ష్మమ. తాత పేరిటి వాఁడొక సోదరుడు గలడు. కృష్ణమాహ్వయుఁ డీతని దేశికుఁడు. కొన్ని ప్రతులలో (ఆం. సా. ప. 1537) యాజుర్వేదియు, నాపస్తంబ సూత్రుడు, శ్రీవత్సగోత్రుఁడు నైన శివరామయ యీతని గురువుగాఁ జేర్కొనఁ బడినాడు. ఈకవి కాలావధి నిర్ణయించుటకును బ్రతిలేఖన కాలమే శరణ్యమైనది. ప్రా. లి. పు. భాం.- డి. నం. 1843 ప్రతిలేఖన కాలము ప్రమోదూత శ్రావణశుద్ధ ప్రథమా బుధవారము- క్రీ.శ. 1-8-1810. కవి యంతకుఁ బూర్వుఁడని మాత్రము చెప్పనగును. ఇతని యుదంతము గొంత కావలి వెంకటరామయ్యగారి దక్కను కవుల చరిత్రమునఁ బ్రసక్తమైనది. దానిని బట్టియు నీ యూహ సమంజసమైనదని తోఁచును. గ్రంధరచనా వైఖరిని బట్టి 18 వ శతాబ్దికిఁ జెందినవాడనిపించుచున్నది. (ఇప్పటికిది యూహ మాత్రమ)

---

* 1. ప్రా. లి. పు. భాం. – డి. నం. 1843, ఆర్. 977, ఆర్. 1048.

2. ఆం. సా. ప. – నం. 1332 1537, 1617, 1684, 2306. (ఈప్రతులలోఁ బాఠ భేదములు విశేషము)

3. అడయారు ది. స. గ్రం. అర నం. 32 (ఎమ్) 16.

గ్రంథవిషయము:-- ఇది ప్రసిద్ధమగు వైశ్యుల యిలవేల్పు కన్యకా పరమేశ్వరి చరిత్రము. దీనికి మూలము స్కాంద పురాణము.♦ ఇది భాస్కరాచార్యులను నాశ్రయించిన తిమ్మయకు ముందే యాంధ్రమున ఒద్య ద్విపద కావ్యములుగా వెలసినది. [2]ఈకథా మధ్యమునను భాస్కరాచార్యుల పాత్రకుఁ బ్రశక్తిగలదు. తిమ్మయ కృతిలోను భాస్కరాచార్యుల ప్రశంసగలదు. ఆంధ్రకవి తరంగిణిలో నీభాస్కరాచార్యుల యుదంతముగూర్చియు, నీకథా విషయముగూర్చియుఁగొంత చర్చగలదు. చూ. సం 8-పుటలు 206-218)

ఇది వస్తు విస్తృతిగల యొకపెద్ద యక్షగానము. యక్షగానమని పేర్కొనఁబడినది. ప్రదర్శనకుఁ బనికిరాదని చెప్పవచ్చును. ఇం వాశ్వాస విభాగ ముండుట గమనింపఁదగినది. (అశ్వా.౯, రచన యంత ప్రౌఢమునుగాదు, పేలవమునుగాదు. సలక్షణమైన భాషయే నాడబడినది. కాని శోషగహితము గాదు. ఇందు దాళప్రధానములైన దరువులు తఱచు. ద్విపద వచనముల పాలును మిక్కుటమే. పద్యములు సకృత్తు. ఏలలు, త్రిభంగులు, దండక చూర్ణికలును గలవు.

---

♦ సంస్కృత స్కాం. పు. లోని యీ కథా భాగము ప్రతి అం. సా. ప లోఁగలదు. నం. 288.

2. అం. సా. ప. నం. 2297 – భాస్కరాచార్య కృత "వాసవీ మాహాత్మ్యము". అది పొరపాటునఁ బరిషద కారాద్య ముద్రిత గ్రంథ సూచికలో యక్షగానముగాఁ జేర్కొనబడినది. అది పద్యకావ్యము.

# 40. సన్నిధిరాజు జగన్నాథ కవి

## ఏకలకుర వంజి:♦

కవి విషయము:— పేరు జగన్నాథకవి లేక జగ్గకవి. ఇంటి పేరు సన్నిధిరాజు లేక సన్నిధానము. వెలనాటి బ్రాహ్మణుడు. కాశ్యపగోత్రుడు. ఇతని తాత పేరు కూడ జగ్గకవియే. అతనికి సుందరమ్మ యందు నలుగురు పుత్రులు. అందమ్మయగారికీ జగ్గయ, జయ సుందరప్ప, గురులింగము ననువారు పుత్రులు. కవి గురువు శృంగేరీ మఠాధిపతి యగు శంకరాచార్యులవారట. కవి యుప్పాడ (పిఠాపురము దగ్గర నున్నది) పురవాసి. కవి కాలనిర్ణయమున కొకయాధారము గలదు. ఈతని కృతియొక్క ప్రా. లి. పు. భాం. ప్రతి డి. నం. 1884 లేఖన కాలము బహుధాన్య ఫాల్గుణ బ ౧ శుక్రవారము — క్రీ. శ. 19-3-1819. గ్రంథ మంతకుబూర్వము రచింపబడె ననుట నిశ్చయముగదా. ఇతడు క్రీ. శ. 1810 ప్రాంతములవాడని శతక కవుల చరిత్రమున జేర్కొనబడినాడు. అది సత్యముకావచ్చును. దానినుండి తెలిసిన విశేషములు:— కవి యజుశ్శాఖి. తల్లి పేరమ. కృత్యంతరము రాజలింగశతకము. అది వాకతిప్ప రాజశేఖరున కంకి

---

♦ 1. ప్రతులు:— ఆం. సా. ప. – నం. 4543, 1244.

2. ప్రా. లి. పు. భాం. – డి. నం. 1852, 1853, 1883, 1884.

3. రాజమండ్రి గౌతమీ గ్రంథాలయము – నం. 9 (తాళపత్ర గ్రంథములు.)

ఇది ముద్రితము – ఉమా మహేశ్వరప్రెస్, మదరాసు, 1897 (ప్రచురణ కర్త:- పాదర్తి అక్కయ్య దేవర.)

తము. (వారితిప్ప కూడ పిఠాపురము తాలూకాలోనిదే) శ. క. చ. న నీతిని కురవంజి రచనము పేర్కొనఁబడినది.)

గ్రంథ విషయము:— ఇందు జీవోత్పత్తినుండి విదేహ కైవల్య ముక్తి ప్రాప్తివఱకుఁగల తత్త్వ మద్వైతపరముగాఁ బ్రపంచింపఁబడినది. జీవసతికి డకు సుకర్మ మొఱుకతయై వచ్చును. మూల ప్రకృతి సింగఁడాయెను. వారనేక విషయములపై వాద ప్రతివాదములు సలుపుదురు. ఇది జీవయెఱుకల కొఱవంజి యనియు జ్ఞానయెఱుకల కొఱవంజి యనియుఁ గవిచేతనే (యతి ఘటితముగా) పేర్కొనఁబడినది. కురవంజి యనియే కాక యక్షగాన మహాప్రబంధమనియుఁ బేర్కొనఁబడినది. ఇందు హాస్యగాఁడు పాత్రలను బలుకరించుటయుఁ బాత్రలు స్వవిషయమును జెప్పుకొనుటయుఁ గలదు. ఇందసలే గహనమైన విషయమింకను గ్లిష్టముగాఁ గాకుండఁ గొంతవట్టు పరిభాషానిరపేక్షముగా సరళముగాఁ జాలవరకు వచనములో వివరించినాఁడు. కవి పాత్రల నడుమ సంవాదములును గలవు. కాని యిది ప్రదర్శనమున రాణింపదు. ఇందలి భాష సలక్షణమైనది. (సింగని ప్రసంగాది సందర్భములందుఁదప్ప). శయ్య ప్రసన్నమైనది. ప్రసిద్ధ రాగ తాళములలోఁ గొలఁదిపాటి దరువులు గలవు. కొలఁదిపాటి పద్యములును గలవు. ద్విపదలు, వచనములు నెక్కువ. ఏలపద మొకటి, సంస్కృతచూర్ణికలు, దండకములు నొకటి రెండు, శ్లోకము లనేకము గలవు. అమరశ్లోకము లుదాహరింపఁబడినవి. కవి స్వతంత్రముగా వ్రాసినవియుఁ గలవు. శ్లోకములకుఁ దెలుఁగున వ్యాఖ్యానమును గలదు. ఇట్టి కృతులందు కవిత్వపుఁ బాలు నెన్నుట కష్టము.

# 41. బు (జ?) క్క మ సాంబయ్య

**బల్లాణరాజ చరిత్రము:** *

కవి యింటిపేరు బుక్కమో, జక్కమో నిక్కచ్చిగాఁ జెప్ప వలనుపడలేదు. ఇతఁడు వీరశైవుఁడు యోగ విద్యాభ్యాసరతుఁడు. గుహేశ్వరస్వామి భక్తుఁడు. ఇంతకంటె వివరము తెలియరావు. అతని కృతి ప్రా. లి. పు. భాం. ప్రతి డి. నం. 1914 లేఖన కాలము ఆంగిరస మార్గశిర శు ౧౦ ఆదివారము 13-12-1812 కావున నంతకంటెఁ బూర్వుఁడు కావచ్చునని మాత్రమే చెప్పనగును. కాని యించుక ప్రాచీనుని వలెనే కనఁబట్టుచున్నాఁడు.

గ్రంథ విషయము: నారదప్రేరితుఁడై శివుఁడు మిండజంగమై కఠోర వీరశైవవ్రతదీక్షితుఁడగు సింధు కటకాధీశ్వరుని భల్లాణుని బరీక్షింప వచ్చుట - తనకుఁ బన్నిసీజాతి వేశ్యకావలెననుట. అట్టి వేశ్య దొరుకక బల్లాణుఁడు తనభార్యయగు చల్లమాదేవినే యతని కడకుఁ బంపుట—శివుడు శిశురూపము ధరించుట - వారికి మోక్షమిచ్చుట యనున దిండలికథ. (ఇందు బల్లాణుఁడు పూర్వజన్మమునఁ గిరాతుఁడని చెప్పఁబడినది.) రచన శివకవి సామాన్యములైన దోషములుగల దైనను జాలచక్కనిది. ఇందలి దరువులెక్కువగాఁ దాళప్రధానములు. ప్రసిద్ధ కర్ణాటక రాగప్రధానములు గొలఁది గలవు. వచనములు నున్నవి. ఏలలు, జోలలు, త్రిభంగులు, అర్ధచంద్రికలును గలవు. ముఖారి రేకులు విశేషము. ఇదియక్షగాన ప్రబంధమని పేర్కొనఁ బడినది. శ్రవ్యదృశ్యములకు నడిమివాటముగా నడిచినది.

---

* ముద్రితము: పమ్మి త్యాగరాయసెట్టిగారి శ్రీరాజరాజేశ్వరి నికేతన ము. శా మదరాసు, 1904.

# 42. కాటమరాజు వెంకటజోగి

## ముక్తికాంతా విలాసము :

(కురవంజి)

కవి విషయము :– శ్రీవత్స సగోత్రుఁడు. కాటమరాజు కొండమరాజ పౌత్రుఁడు. వెంకమాంబా చెంచపురాజుల పుత్రుఁడు. ఇతని కృతి ఆం. సా. ప. ప్రతి విలేఖనకాలము ప్రజోత్పత్తి మాఘ శుద్ధాష్టమి మంగళవారము – 21-1-1812. కవి యంత కించుక పూర్వుఁడు కావచ్చును.

గ్రంథ విషయము :– ముక్తికాంత యెఱుకతయై వచ్చి మనః కాంతకడ నోంకార ప్రభావము నుగ్గడించి తత్స్వరూపుఁడగు పరబ్రహ్మా యనుసంధానమునకై యాసనములు, ముద్రలు మొదలగునవి వివరించును. ఆపై మనఃకాంత ప్రబోధితయై సాకార పరబ్రహ్మమును సాక్షాత్కరింపఁజేసికొనును. తదుపరి మనోమెకు నోంకారమునకును వివాహము. ఈ గ్రంథమున విషయపటుత్వము లేదు. రచన పేలవమైనది, దోషజుష్టము. సోడిదరువులు, ద్విపదలు, చిన్నవచనములు గలవు. కురవంజి యని పేర్కొనఁబడినది.

---

* 1. ఆం. సా. ప. నం. 4525.

2. శ్రీ వేదునూరి గంగాధరంగారికడ నొక తాటియాకు ప్రతిగలదు.

# 43. భారతి రామరాజు

ఇతఁడు మాగధ వంశీయుఁడు. (భట్టురాజు) భాస్కర పౌత్రుఁడు. మంత్రి (మంచి?) రాజపుత్రుఁడు. (జలక్రీడలు) తన గ్రంథము లన్నియుఁ పొట్లదుర్తి హరి కంకితము చేసినాఁడు. అనఁగా నీతఁడు పొట్లదుర్తి వాస్తవ్యుఁడని తోఁచుచున్నది. పొట్లదుర్తి కడప మండలమునఁ గలదు. కాని యితఁడు నెల్లూరు జిల్లా మాన్యువలులో (పుట 698-99) నెల్లూరు మండల కవి యైనట్లును, క్రీ. శ. 1813 ప్రాంతమున నుండినట్లును బేర్కొనఁబడినాఁడు.

## ఇతని గ్రంథములు:

### 1. జలక్రీడలు:

ముద్రితము :- సరస్వతీ నిలయము. శా. మదరాసు - తృతీయ ముద్రణ, 1883.

గ్రంథాంతమున నిది యానంద మాఘ శుద్ధ హరి వాసరమున రచింపఁబడినట్లు గలదు. అది 1795 సం. కావచ్చును. ఇందు భాగవత దశమస్కంధ పూర్వభాగ కథగలదు. కాని యశోదతో గోపికలు కృష్ణుని యాగడముల గుఱించి చెప్పుట, గోపికా వస్త్రాపహరణ (అదే జలక్రీడలు) మను నీ రెండు విషయములే వివరముగాఁ గలవు. ఇందుఁ బ్రసిద్ధ రాగ తాళములలో దరువులు, ద్విపదలు, పద్యములు, వచనములు (సకృత్తుగా), కందార్థములు, సీసార్థములు రెండు సం. చూర్ణికలును గలవు. చక్కని రచన. గ్రంథకర్త భాగవతము నోంట బట్టించుకొన్న వాఁడే కాని లేనిపోని యనుకరణముల జోలికుఁ బోలేదు. పాత్రల సంవాదములు సమృద్ధిగనే కలవు. కాని కథా వర్ణ

నాదిక శ్రవ్యధోరణియుఁగలదు. కొన్ని వర్ణనములు పాత్రముఖము ననే ప్రవర్తితము లైనవి. గ్రంథకర్తచే నిది చదువుటకును "నటి యింపఁబడుటకు నుద్దేశింపఁబడినది.

## 2. గొల్లభామవేషము:

(ప్రా. లి. పు. భాం. — డి. నం. 1873, 1874, 1876). ఇందు మొదటఁ జల్ల నమ్మవచ్చిన గొల్లభామకు నొక బ్రాహ్మణునకును సంభాషణ — అందు గొల్లభామ తమ నిత్య కృత్యములు, గొల్లవారి కులాచారములు నుగ్గడించును. సముద్ర మథన కథ నుదాహరించి జగమెల్ల గొల్లయనును. ఆబ్రాహ్మణ పాత్రధారి యెవఁడో ప్రదర్శక ముఖ్యుఁడై యుండును. గొల్లభామ యతనిని "మాధవీ" యని సంబోధించుట గలదు. ఆమె "తెరవెళ్ళి" వచ్చుట చెప్పఁబడినది. పిదప ఘట్టమున సుంకరి కొండని రాక, గొల్లభామతోఁ జెయి ముట్టు సరసము, నాపె యత్త వచ్చుటతో నతఁడు చెపాయించుటయుఁ గలవు. ఈ గ్రంథమున రచన గాని కోవఁకుజెందిన నానిలో నది కొంత బాగు గనే యున్నది. కాని హాస్య ప్రసంగములం దసభ్యత యధికమైనది. ఇందు దరువులు, ద్విపద, పద్యములు, వచనము, శ్లోకములు, తద్వ్యాఖ్యానము, ఏలలును గలవు. గ్రంథమంతయు సంభాషణల మయము. ఇందు నక్కలపాటి సంజీవకవి గ్రంథ విషయము కొంత గ్రహింపఁ బడి నది. పోట్లదుర్తి హరితోపాటు రమణక్కపేట హరియు స్మరింపఁబడి నాఁడు. డి. 1873 ముఖపత్రమున నిది "ఆట భాగవతమందు గొల్ల కథ" యనియు నిది యానాము గ్రామమున లభించిన పుస్తకమనియు, 'అటతాళం — సారంగతాళం వల్లనే యీ గొల్లకలాపం యావత్తు వినకరిచేస్తున్నారు.' 'కొందరు ప్రత్యేకం రాగములు పాడుతా' రనియు గలదు.

## 3. బాలింత వేషకథ:

అడయారు ది. స. గ్రం. ప్రతి — జి. సం. 75047. ఇది రామ కవి రచన యనియుఁ బోట్లదుర్తి చెన్నుని కంకిత మనియు మాత్రమ పేర్కొనఁబడినది. పోట్లదుర్తి రామకవియని యుండుటను బట్టి యీ రామకవి భారతి రామరాజగునేమో యనిపించుచున్నది. ఇం దెదుర్కొండ కేశవుఁడును తలంపఁబడినాఁడు. యశోద గర్భవేదన, మంత్రసాని రాక, ప్రసవము నిందలి విషయములు. లాలి పాటతో గ్రంథాంతము. ఇందు దరువులు, పద్యములు, ద్విపదయుఁగలవు. రచన నీరసముగానున్నది.

## 4. పారిజాతము:

ఆం. సా. ప. లో నం. 4120 వివిధ వినోదములను నొక కలగూరగంప గ్రంథ సంపుటమునఁగొలఁది యాకులలో బోట్లదుర్తి చెన్నారాయని ముద్రతో "రుక్మిణీవేషము కథ" యు, నాయికా నాయకునకు "జాబు వ్రాసే ద్విపద" యుఁగలవు. భారతి రామ రాజు తన జలక్రీడలు గ్రంథాంత ద్విపదలో "పారిజాతాది ప్రబంధ కల్పనుఁడ" నని చెప్పుకొని యున్నాఁడు. అతఁడు గొల్లకలాపముతో పాటు భామకలాపమును గూడ రచించి యుండును. పై కలగూర గంపగ్రంథభాగములు ప్రాయికముగా నందలి భాగములే కావచ్చును. సమగ్రగ్రంథము లభింపలేదు. పోట్లదుర్తి జలక్రీడలు, గొల్లకలాపము మాత్రమే విపులప్రచారము గాంచినవి.

# 44. ఆలపాక పెద్ద

## భల్లాణ నాటకము :

కవి విషయము :— శాలివాహన (కుమ్మరి?) వంశ్యుఁడఁట. వీరశైవుఁడు. పంతోష శివజ్ఞానస్వామిశిష్యుఁడు. పాపాంబా వైద్దెప్పలకుఁ బుత్రుఁడు. లింగమాంబా పెద్దనల పౌత్రుఁడు. అతనియూరాలపాక. ఇతనిగ్రంథము బిల్వేశ్వరస్వామి కంకితము. బిల్వపురి కోకిలాంబ కవి కిలువేల్పు. (ఆలపాకయు, బిల్వపురియనఁగా షోలింగరు సమీపమునఁ గల తిరువల మను క్షేత్రమును ఉత్తరార్కాటు జిల్లా వాలాజ తాలూకాలో నున్నవి.) ఈ గ్రంథముయొక్క ప్రా. లి. పు. భాం. ప్రతి డి. నం. 1915 చివరనొక వ్రాఁత గలదు :—

"ధాతువు నాను సం. కార్తీకి నెల 21 తేది బుధవారం పర్వకాలం గ్రహణం పుణ్యకాలం వుదయము యిన పన్నెంకు ఘడియల నరమీఁద పుదుచేరిలో ప్రాంపుకోటి చేసినది" అని. అది 4-12-1816 తేదీకి సరిపోవుచున్నది. ఈ గ్రంథరచన నంతకించుకముందు జరిగి యుండును.

గ్రంథవిషయము :— కథ ప్రసిద్ధము. భల్లాణుఁడు ఖండ జంగము వేషమునఁ దను బరీక్షింపవచ్చిన శివునికడకుఁ దనసతినే సాని వేషమునఁబంపుట — భవుఁడు భల్లాణుని భక్తికి మెచ్చి కైలాస మనుగ్రహించుటయు ననున దీకథ. ఈగ్రంథారంభమునఁ జిత్రమైన ప్రస్తావన కలదు. భల్లాణుని వాకిటికావలి గొల్లఁడు "ఎకసక్కెంబాచి నాయఁడు" నాటకప్రదర్శకులను బలుకరించును. వారు బాచినాయనిపై నెకసక్కెముగాఁ బాటపాడుదురు. బాచినాయఁడు సభవారికి

భల్లాణరాజు రాక తెల్పి ప్రదర్శకులను "కథ ప్రసంగించవోయి" యని హెచ్చరించును. అంత భల్లాణ ప్రశంసాత్మకమగు నొకద్విపదతో గథారంభమగును. గ్రంథమంతయు వ్యావహారికభాషలో నడచినది. తాళ ప్రధానములైన దరువులు, ద్విపదలును గలవు. వచనమునను బాత్రల సంభాషణలు గలవు. కొలఁది హాస్యప్రసంగము లున్నవి. గ్రంథము నాటకమని పేర్కొనఁబడినందులకుఁ దగినట్లున్నది. కాని రచన యొక్క మాదిరి.

---

# 45. గుబ్బము చినకపోదయ్య

## వీరచోడవ్వ చరిత్ర :♦

కవి విషయము :— శివ కవీంద్రుఁడట. శైవ కులజుఁడఁట (జంగమేమో;) తండ్రి గణపతయ్య. తల్లిసోమమ. అన్న పెద కపోదయ్య. తమ్ముఁడు రాచయ్య. ఈ చిన కపోదయ్య గ్రంథాంతరమగు దారుకా వనక్రీడ యను సువాల (ప్రా. లి. పు. భాం. డి. నం. 1887) నుండి యీతని తాత బొలంక నామధేయుఁడనియు నాయనమ్మ పర్వతమ్మయనియుఁ దెలిసినది. ఇతని గ్రంథములు రెండును రొంపిచర్ల శంకరేశ్వరుని కంకితములు. రొంపిచర కడపజిల్లా వాయల్పాడు తాలూకాలోనున్నది. అది యీతని నివాసము గావచ్చును. ఈ వీ. చో. చ. ప్రతి డి. నం. 1941 లేఖనకాలము ఈశ్వర చైత్ర శు 7 జయవారం — 25-3-1817. కవి యంతకుఁ బూర్వుఁడని మాత్రమ చెప్పనగును.

---

♦ ప్రా. లి. పు. భాం.— డి. నం. 1940, 1941.

గ్రంథ విషయము :— దక్షారామమున నన్య (న్న?) చోడను భోగపుఁ జానకుఁ బార్వతీయంశమున వీరచోడు పుట్టుట. భీమనాయకుఁ డామె శీలమును బరీక్షించి మెచ్చి, యాపె యెంగిలికూడుఁగూడఁ గుడిచి యాపె మహిమను లోకమున వెలయించుట, ఆమె కైలాసమున కేఁగుట యనుశైవకథ (పండితారాధ్య చరిత్రమున దీని ప్రసక్తి గలదు) యిందు వర్ణితము. ఇందుఁ బురాతన భక్తచరిత్రములు, కామశాస్త్రాది విషయములను బలుమఱు ప్రసక్తములు. రచనచక్కనిది. సంవాదము లెక్కువగా సాగినవి. దాళప్రధానములగు దరువులు విరివిగాఁగలవు. ద్విపదలు, వచనములు, గొలఁది పద్యములు, అర్ధచంద్రికలు, ఏలలు, జొల్లిరేకులు, జౌళరచ్చలు, పాళిరేకులు, మటిమెరేకులు, అనువులు నడలు, త్రిభంగులు మొ॥ రచనా విశేషములు గలవు. గ్రంథము యక్షగానమని పేర్కొనబడినది.

---

# 46. శ్రీనివాస కవి

## పారిజాతాపహరణము : ♦

కవి విషయము :— ఇంటిపేరు తెలియదు. రామచంద్రపురవాసి. వెలనాటి వైష్ణవుఁడు. ఈతఁడు తన గ్రంథారంభమున నహోబిల మఠపతి యగు రంగనాథస్వామిని దలఁచియున్నాఁడు. అహోబిల మఠాధిపతులలో రంగనాథస్వామి నామధేయులు వల్వురుగలరు.

♦ ఆం. సా. ప. నం. 184.

వారికాలములు వరుసగా, (1) క్రీ. శ 1811 - 182 (2) 1853 - 1856 (3) 1882 - 1888 (4) 1913-23.[1] ఈ గ్రంథమున సత్యభామ ప్రేమలేఖలోఁ బేర్కొనఁబడిన బహుధాన్యవత్సరమును గ్రంథరచనాబ్దమునకు భంగ్యంతరసూచనగా గ్రహింపవచ్చునేని యది మొదటి రంగనాథస్వామి మఠాధిపత్య కాలముననే పడుచున్నది.

గ్రంథ విషయము :—ఇది యొక యుద్గ్రంథము. సత్యాంగసంపూర్ణమైన పారిజాతము. శ్రీరంగేశున కంకితము. అందుచే దీనికి రంగపురి పారిజాతమనియు నామాంతరము. ఇందు బాలకృష్ణకథ, గొల్లకథ, సుంకరికథ, రాధకథ, రుక్మిణీకథ, సత్యభామకథ — అని యిట్లవాంతర కథా విభాగము, ప్రతి కథకుఁ బ్రత్యేకముగాఁ బ్రారంభ పరిసమాప్తుల సూచనయు నున్నవి. ఇందు శ్రీకృష్ణుఁడే సుంకరకొండఁడై వచ్చెనఁట; శారద సత్యభామ కెఱుక చెప్పవచ్చినదఁట; ఇందు పాత్రలు ప్రదర్శన ప్రవర్తకుఁడగు హాస్యగానిచేఁ బ్రచ్ఛింపఁబడి స్వీయోదంతములు జెప్పుటగలదు. ఇందుఁ బ్రసిద్ధ రాగతాళములలో దరువులు, ద్విపదలు, పద్యములు, కందార్థములు, ఏలలు గలవు. రచన మనోజ్ఞమైనది. ఇందలి హిందూస్తానీ బేహాగ్ రాగము, జుల్వా తాళముల వాడకమునుబట్టి చూడ నిది ప్రాచీనరచనగాఁ దోపదు. పై కాలనిర్ణయము సమంజసముగా వచ్చును. కవి దీనిని నాటకమని పేర్కొనెను. పాడుటకు నాడుటకు నుద్దేశించియుండెను.

---

1 చూ. శ్రీ. ఎస్. ఎన్. వెంకటేశయ్యరుగారి అహోబిల మఠచరిత్ర (ఆంగ్ల గ్రంథము.)

# 47. శేషము రంగాచార్యులు

శేషము రంగాచార్య కృతము లొక మూఁడు యక్షగానములు లభించినవి. భావనారాయణ విలాసము[1], రతిమన్మథ విలాసము[2], శివకేశవపారిజాతము[3], మూఁడును నముద్రితములు. శి. కే. పా. న కవిని గుఱించి విశేషము లేమియు లేవు. (ప్రతి యసమగ్రము) భావ నారాయణ రతిమన్మథవిలాసము లందలి గ్రంథాంతగద్య లొక్క తీరుగ నున్నవి. అందు కవి తండ్రి చెన్నుభట్టారకుఁడని యున్నది. భా. నా. వి. న నవతారిక లోపించినట్లున్నది. ర. మ. వి. - అవతారి కలో నితనితల్లి వేంకమాంబిక యనికలదు. రంగాచార్యుని తండ్రి చెన్నుభట్టు అభిమన్యుకల్యాణ[4] మనునొక ద్విపద కావ్యమునకుఁ గర్త. చెన్నుభట్టు పెద్దన్నగారు రఘునాథార్యుఁడు కులశేఖరమహీపాల చరిత్ర[5] మనునొక ప్రబంధమునకుఁ గర్త. పై గ్రంథములవలన రంగాచార్యుని పూర్వుల చరిత్ర కొంత తెలియనగును పితృపితామహ క్రమమున వారు చెన్నుభట్టు, వేంకటార్యుఁడు, భట్టరార్యుఁడు, రామానుజాచార్యుఁడు, అహోబల గురుఁడు. భా. నా. వి. న నది పొన్నూరు భావనారాయణస్వామికి సంబంధించిన దని గలదు. పొన్నూరు గుంటూరు మండలములోనిది. కాఁగా కవి తత్ప్రాంతీయుఁడని చెప్పవచ్చును.

---

1. ప్రా. లి. పు. భాం, డి. నం. 1931.
2. ఆం. సా పు. నం. 3120.
3. ఆం. సా. ప., నం. 3139 (ఈప్రతిపై "లేబిలు" రుక్మిణీ పరిణయమని యున్నది. కాని గ్రంథాంతమున "శేష భట్టరు రంగాచార్య విరచితోయాం శివకేశవ పారిజాతే రుక్మిణీ విరహా...అని యున్నది)
4. ప్రా. లి. పు. భాం. డి. నం. 1026., ఆం. సా. ప., నం. 2631.
5. ఇది యిటీవల ప్రా. లి. పు. భాం. వారిచేఁ బ్రకటితము.

కవికాలము పైనప మేర నిర్ణయించుటకు మాత్ర మొక్క యాధారముగలదు. భా. నా. వి. ప్రతి ప్రతిలేఖనకాలము ‘చిత్రభాను నామసంవత్సర అశ్వీజ శుద్ధ 14 అంగారక వారం’ అది క్రీ. శ. 27-9-1642, 29-10-1822 తేదీలకు సరిపోవుచున్నది. కాని యందు చతుర్దశి యనుటకు మారుగాఁ జేర్కొనఁబడిన మాయరబ్బీ యంకెల వాడకము పద్ధతి మన దేశమున 1642 నాఁటికిఁ గానరాదు. రంగాచార్యులు 1822 సం.కుఁ బూర్వుఁడనుట స్పష్టము. కాని యతని గ్రంథముల రచనా ప్రక్రియనుబట్టి యతఁడు 18 వ శతాబ్దికిఁ బూర్వుఁడు కాఁజాలఁడని చెప్పవచ్చును. అది దిగువ నిరూపింపఁబడును.

## భా వ నా రా య ణ వి లా స ము :

కొండవీటి సీమలో నందూర గూనిగోవిందుఁడను విప్రోత్తముఁడు మహాభక్తుఁడొకఁడు గలఁడు. అతఁడు కారంచేటి కలాగ్రణి యగు నరసింహుఁడను తన మేనమామతోఁ గాశికిఁబోయి విశ్వనాథుని సేవించుచుండును. అటనొక విప్రుఁడు గోవిందునకుఁ దనకూతు నక్కలాంబిక నిత్తుననును. గోవిందుఁడు పెద్దవాఁడును బ్రహ్మచారియు నగు మేనమామ యుండఁగా దనకు మరియాద గాదని యా సంబంధము నతనికిఁ గుదుర్చును. కాని యొకసమయము చేయును — వారిరువురికిఁగల్గిన కూఁతురు తన కీయవలెనని. నరసింహుఁడు సమ్మతించును. కాశీ భావనారాయణస్వామి ప్రభృతు లందులకు సాక్షులు. గోవిందుఁ డత్తమామలను నిజదేశమునకుఁ గొనిపోవును. వారి కొక యాఁడుపిల్ల కలిగి యామె కెనిమిదేండ్లు రాఁగానే గోవిందుఁ డొకపరి మామను బలకరించి చూచును. అతఁ డత్త నడుగుమనును. ఆమె ససేమిరా గూనివాఁడు, ముదుసలియునగు గోవిందునకుఁ బిల్ల నీయననును. ఆమె మాట కిరుగుపొరుగమ్మలక్కలు దోడుపడుదురు. నర

సింహాద్రుడు తన బాసను బ్రోసిపుచ్చును. గోవిందుడు తన సాక్షులను చేర్కొనును. అంతట దత్రత్యులు తగవరులు మాటలాడని సాక్షులసంగతి విని యుపహసింతురు. గోవిందుడు గడువడిగి యాగడువొక తప్పమై యది మఱునాటితోఁ గడతేరు ననఁగా "భావనారాయణస్వామి పలుకవేమి" యని యాక్రోశించును. ఆత్మహత్యకు నుద్యోగించును. స్వామి ప్రత్యక్షమై గోవిందుని వెనుదిరిగిచూడక ముందు పదమని చెప్పి సపరివారముగా బయలుదేఱును. గోవిందుడు వెనుదిరిగి చూచును. స్వామి సపరివారముగా నూరి పొలిమేర నిలిచిపోవును. గోవిందుడు "ఆసరాదగిన యూరవల నుండంగ బోనూర నిలువంగ బోలునే మీ" కనును. స్వామి యక్కడికే యూరిపెద్దలను రప్పించి సాక్ష్యము చెప్పును. గోవిందుని పెండ్లి జరుగును.

ఇది పొన్నూరు క్షేత్ర మాహాత్మ్యమునకు సంబంధించిన గాథ. ఇందు స్వామివారి మహిమమాట యటుండఁ గడమ కథయంతయు నొక సాంసారి కేతివృత్తము. ఆయమ్మలక్కల ప్రసంగములు మొదలగు సందర్భములను జూడనది యంతయు మన తెనుఁగిండ్ల పెండ్లి ముచ్చట కొక చక్కని రూపకల్పనవలె నున్నది. సన్నివేశమునకుఁ దగినరచన సాగినది. ఇది శృంగారనాటకమని వక్కాణించినాఁడు కవి. నాటకీయత యున్నది. కాని శృంగారము స్ఫుటముగాదు.

## రతిమన్మథవిలాసము:

నారదుఁడొక సౌగంధిక ప్రసవము కారణముగా మన్మథుని (ప్రద్యుమ్నుని) దేవేరుల నడుమ సవతి మచ్చరము నెసకొల్పుటయుఁ జిట్టచివర నెల్లరు నేకీభవించుటయు నిందలి ప్రధానవిషయము. పారిజాతకథ చట్టున స్ఫురించును. రచన భామకలాపఫక్కి నడచినది.

కథారంభమున ముఖ్యపాత్ర లొక్కొక్కటే వరుసగా వచ్చి "వినుఁడింక వేడ్కనా వృత్తాంతమెల్ల" - ఇత్యాదిగాఁ దలయొకద్విపదలో స్వవిషయమును జెప్పుకొనుట గలదు. "వచ్చె రుక్మవతీ వధూమణి" ఇత్యాదిగాఁ బాత్ర ప్రావేశిక ధ్రువలును గలవు. పాత్రలు తెర వెడలు ప్రసక్తిగలదు. "రతివేషపు కథ", "మన్మథవేషము" ఇత్యాదిగఁ బ్రత్యేకపు శీర్షికలు గలవు. కాని గ్రంథము "సర్వంబు నేకాశ్వాసము". "మాధవి" బలుకరింతకును బ్రసక్తికల్గినది. ఇదియంతయుఁ జూడ నిది క్రీ. శ. 1672 - 1685 ప్రాంతముల నున్న భామకలాప కర్త సిద్ధేంద్రయోగి కర్వాచీన రచన యని తోఁపక మానదు. గ్రంథాంత గద్యలోఁ గవి దీనిని "శృంగార నాటక గేయ యక్షగాన" మని వ్యవహరించెను. అది సార్థకమైనదే కాని గేయనాటకమనియో, యక్షగానమనియో లేక య. గా. నాటకమనియో వ్యవహరించిన సరిపోవును. అయినను నట్లనుటలోఁ గవి యుద్దేశమిదియైయుండును :- ఆనాఁడు యక్షగానములు గేయరూప కథాఖ్యానమే యుద్దిష్టముగాఁ గొన్నియు, నాట్యప్రయోజనాత్మకములుగాఁ గొన్నియు రచింపఁబడు చుండియుండవచ్చును. రంగాచార్యుఁ డుభయప్రయోజనములను దన కృతిలోఁ బ్రతిష్ఠింపఁదలఁచెనుగాఁబోలు. ఇందలి రచన యపేలవమైన సరళశైలిగలది. నాయికల విప్రలంభ సందర్భములందుఁ బ్రబంధపుఁ బోకడలు గలవు. ఇందలి కథలోఁ గొంత క్రొత్తదనమున్నది. కాని కల్పనలో విశిష్టత కానరాదు.

## 3. శివకేశవపారిజాతము :

గ్రంథనామమునుబట్టి యిది ద్వ్యర్థియా యన్న యనుమానము కలుఁగవచ్చును. కాని కాదు. ఇందు గథాపాత్రములలోనే కాని సన్నివేశ సందర్భములందు భిన్నత్వము లేదు. శివుఁడును గృష్ణుఁడును

నాయకులు. పార్వతియు రుక్మిణియు నాయికలు. ప్రతి నాయికలు గంగ, సత్యభామ. నారదానీత పారిజాత ప్రసవము కారణముగా సత్యా రుక్మిణుల సవతి మచ్చరము ప్రసిద్ధము. ఆసవతి కయ్యపుఁ గథ పట్టునకుఁ గావ్యత్వ ప్రతిష్ఠ తిమ్మనగారి పెట్టుబడి. దానిపై సిద్ధేంద్రుని కలము తునకాలుగాఁ గూచిపూడి భాగవతులు భామ కలాప లాభములను దీసిరి. అనేక యక్షగానముల కదే కథావస్తువో యొకప్రధాన సన్నివేశమో యైనది. అంతటితో సరిపోలేదు. తత్సదృశ కథలకును బారిజాతపువాసన తగిలినది. సత్యా రుక్మిణుల తరువాత సవతికయ్యమునకుఁ బేరుపడ్డ జంట గంగాగౌరులు వారికయ్యమునకు బారిజాతమునే నిమిత్తమొనర్చి కొందఱు కవులు ముచ్చటపడి శివపారిజాతములను సృజించుట విశేషము. రతిమన్మథుల కథయందును భంగ్యంతరమునఁ బారిజాతమును స్ఫురింపఁజేసిన రంగాచార్యులీ కావ్యమునం దుభయకథల నేకత్ర సంఘటించెను. ఇది విశేషములలో విశేషము.

ఇందు నాయికా నాయకులు జంటజంటలుగా రంగముపై ప్రవేశించి మాధవునితో (ఇట నర్మసచివుఁడు) స్వీయ వృత్తాంతముజెప్పుకొందురు. ప్రతి నాయికల విరహవేదనముగూడ నుమ్మడిగనే సాగినది. సత్య చెలికత్తె మాధవికాఁగా గంగ చెలికత్తెశాంభవి యఁట; ఆచెలికత్తెలు శివకేశవుల కడ కేఁగువేళకు నారదుఁడు పారిజాత పుష్పములు గొనివచ్చును. మఱల ప్రతినాయికల విప్రలంభ విజృంభము, చంద్రోపాలంభాదులు. తరువాత నీప్రతిలో గ్రంథము కొఱవడినది. సవతుల కయ్యము, వారు సమాధానపడుటయు నూహ్యాములు. ఇందలి రచన యచటనచటఁ బ్రబంధపు గంధము గుబాళించుచు సరసముగా సాగినది.

ఈ శి. కే. పా. నఁ గలట్టి ప్రక్రియ ప్రాచీన యక్షగానము లందెందును గానరాదు. పుట్టువు పౌలకువలలో భామ కలాపము, పారిజాత తత్సదృశకథేతివృత్తములగు యక్షగానములు, శివపారిజాత ములు శివకేశవ పారిజాతములును గ్రమముగా నొకదాని కొకటి యర్వాచీనము లని యూహించుట సమంజస మనిపించును। ఆధారము లీనాఁ డుపలబ్ధమైనంతలో ప్రకృత గ్రంథము (నామట్టునకు నాకిప్పటికి) 18 శ. ఉత్తరార్ధపు రచనగా దోఁచుచున్నది.

రంగాచార్యుల కృతులలో దరువులు, ద్విపదలు, పద్యములు, లఘువచనములును సామాన్యముగాఁ గన్పించును. ర. మ. వి. న మాత్రము దరువులకు రాగములు పేర్కొనఁబడినవి. అందలి నవరోజు మొదలగు కొన్ని రాగములు ప్రాచీన యక్షగానములలోఁ గన్పింపవు. భా. నా. వి. న శ్లోకములు, చూర్ణిక, మంజరీ ద్విపదలును విశేష ములు. శి. కే. పా. నఁ గందార్థములు విశేషము. మూఁడింటను రచన ప్రౌఢముగా నున్నది. నాటకీయత ప్రస్ఫుటముగా నున్నది.

---

# 48. పాకనాటి గణపతిరెడ్డి

## గోపాల విలాసము: *

కవి విషయము:— కవిగోన బుద్ధారెడ్డి, అనుములగుండ్రము బొమ్మన, తంగెళ్ళ యాచన్న, బాలబ్రహ్మరెడ్డి, చిన్నన్న పెద్దన్న

* ఇది మైదాలు ముద్రణలు గావించినది. అందొకటి:— రాయపురం రత్నా నాయకర్ శ్రీసరస్వతీ ము. శా., మదరాసు, 1886 (ఈప్రతిలో గ్రంథాంతమునఁగవి వంశావతార ద్విపద గలదు. ముఖపత్రమున నిది పాకనాటి గణపతి రెడ్డిగారిచే రచింపఁ బడినదని కలదు)

పిన్నమరెడ్డి యనువారలను తన వంశకర్తలుగా స్మరించియుండెను. కవి పితామహులు పెద్దమండలేంద్రుఁడు, సుజ్ఞానాంబ. వారికి విశ్వనాథుఁడు, కాళపరెడ్డి, పిన్నమరెడ్డి, అంగడిరెడ్డి యనువారు పుత్రులు. అందు పిన్నమరెడ్డికి కామాక్షమ్మయందుఁగల్గిన వాఁడీ గణపతికవి. ఇతనికాలావధి నిర్ణయ విషయమునను నొకప్రతివిలేఖనకాలమే శరణ్యమగుచున్నది. ఆం. సా. ప. నం. 135 తాళ పత్ర ప్రతిలేఖనకాలము చిత్రభాను కార్తిక శుద్ధనవమి శనివారము. అనఁగా క్రీ.శ. 23-11-1822 రచనా రీతిని బట్టి గ్రంథము కొంత ప్రాచీనమైనదిగనే తోఁచును.

గ్రంథ విషయము :-- శ్రీ కృష్ణజననము. బాల్యక్రీడలు యథాభాగవత కథితముగా మధురఫణితి నతిమాత్ర మనోహరముగా వర్ణింపఁబడినవి. ఇందు పోతనగారిపోకడలుగాక పద్యములే కొన్ని యున్న దున్నట్లుగా గ్రహింపఁబడినవి. ఇందుఁ దాళ ప్రధానములగు దరువులు ద్విపదలు, పద్యములు, సంధి వచనములునుగాక అర్ధచంద్రికలు, అల్లోనేరేళ్ళు, ఏలలు, జోలలు, త్రిభంగులు, గొబ్బిళ్ళు, వెన్నెల పదము మొదలగు చవులూరించు చక్కని దేశిరచనలు గలవు. కవి వైవిధ్యమును బ్రదర్శించుటయె కాక యాచ్ఛందస్సులను సందర్భసుందరముగాఁ బ్రయోగించుట గమనింపఁదగినది. గ్రంథము యక్షగానమని పేర్కొనఁబడినది.

---

# 49. ఆత్రేయపురపు తమ్మయ

## గొల్లకలాపము : *

కవి గుఱించి వివరములు తెలియవు. ఇతని కృతులలో దరువు లలోఁ దఱచు ఆత్రేయపురి గోపాలముద్ర కలదు. కవి యింటిపే రాత్రేయపురపువారు. ఇతని గొల్లకలాపపుఁ బ్రతులు కొన్నిట (డి. 1878-79) నిది "ఏడిద భాగవత" మని పేర్కొనఁబడినది. గోదావరిమండలమునందలి యమలాపురముతాలూకాలోని దాత్రేయ పురము, రామచంద్రపురము తాలూకాలోనిది యేడిద. కాఁగా కవి గోదావరీ మండలమువాఁడని నిశ్చయింపనగును. డి. నం. 1878 ప్రతి విలేఖనకాలము విరోధి జ్యేష్ఠ బహుళ షష్ఠి సోమవారము — 22-6-1829. డి. నెం. 1879 ప్ర. వి. కాలము పార్థివ పుష్య బహుళైకాదశీ శుక్రవారము. —3-2-1826 కాఁగా కవి యంతకుబూర్వుఁ డని చెప్పనగును. (కాని యంత పూర్వుఁడుగాఁదోఁపదు.)

---

* ప్రా. లి పు. భాం. - డి. నెం. 1877, 1878, 1879, 1071. ఆర్. నెం, 485. ఇందు డి. 1877. ఆర్ 485 ప్రతులలో గ్రంథకర్త పేరు గాన నగును. ఆత్రేయ పురి గోపాల ప్రశంస యన్నింటను గలదు. అయిదింట నెడ నెడ పాఠభేదము లున్నను సమానముగా నున్న గ్రంథభాగమే యెక్కువ. ఐదు నొక దాని ప్రత్యంతర ములే యనవచ్చును. గాని యైదు నసమగ్రములు డి. 1871 1971 లలో గ్రంథాది భాగముగలదు. డి. 1877 ఆరంభించి, 1971 చూచు కొనుచు పిదప 1878 లోఁ దొమ్మిదవ యాకు మొదటి ప్రక్కనుండి కాని, 1879 లోని యెనిమిదవ యాకు రెండవ ప్రక్కనుండి కాని చివరంటఁ జదివినచో గ్రంథము స్వరూపము తేలఁగలదు.

గమనిక :— ఈ గొల్లకలాపమున కనుబంధ రచన యగు సముద్ర మధన కథ ఆర్. 485 లోను, డి. 1947 లోను గలదు.

గొల్లకలాపమున కనుబంధ కథ సముద్రమథనము. మథనము గొల్లల కులవృత్తి గనుక నది సాకుగా గొల్లజాతి గొప్పదన ముగ్గడించుటకును జగమెల్ల గొల్లయనుటకును గొల్లభామ సముద్రమథన కథాఖ్యానముసేయుట గొల్లకలాపములందుఁ దఱచు కాననగును. తమ్మాయయు సముద్రమథన కథ రచించినాఁడు. ఆమె తర్కప్రాశస్త్యమును దమ కులాచారాదికము నుగ్గడించుట గొ. క. లలో సామాన్య విషయము. తమ్మాయ కృతియందు నదేవిషయము. ఇందలి రచన యొకనోస్తరు. ఇందు ద్విపదలు, దరువులు, కందములు, వచనములు గలవు. అక్కడక్కడ దరువులకు రాగనామములు పేర్కొనఁబడినవి. సముద్రమథన భాగమునఁ జూర్ణికయొకటి కలదు.

ఆం. సా. ప. లో సం. 4474 – వివిధ కవుల భామకలాపముల కలగూర గంప సంపుటమున (12, 16, 53, 110 అంకెలు గల యాకులలో) ఆత్రేయపురి గోపాల ప్రశంస గలదు. ఒకచోఁ దమ్మాయ పేరు గూడ తడవఁబడినది. అనఁగాఁ దమ్మాయ భా. క. ను గూడ రచించియుండును. భా. క., గొ. క. లను రెంటిని రచించిన కవులు మఱికొందఱు గలరు. అది సిద్ధేంద్రునినాఁటినుండి వచ్చిన సంప్రదాయ మేమో!

# 50. అగస్త్యరాజు రామన

## సీతాకల్యాణము :*

కవి అగస్త్యరాజాన్వయుఁడు. అక్కమాంబా చెన్నమంత్రుల పుత్రుఁడు. ఇతని గ్రంథమున పామూరు మదన గోపాలస్వామి ప్రశంస గలదు. అది కవి నివాసము కావచ్చును. (పామూరు నెల్లూరు జిల్లా కనిగిరి తాలూకాలోఁ గలదు.) ఇతని కృతి ప్రతి డి. నం. 1959 లేఖన కాలము :— విరోధి భాద్రపద శు. ౧౧. సౌమ్య వారము — 9—9—1829. కవి యంతకుఁబూర్వుఁడు కావలె. గ్రంథ రచనా రీతి సుగ్రీవ విజయమును బోలినది కాని యంత ప్రాచీనమై యుండదు. 17—18 శతాబ్దుల నడిమి కాలమున రచింపఁబడి యుండ వచ్చును. (ఇప్పటికిది నాయూహ మాత్రమే). ఇందలి కథ ప్రసిద్ధము రచన సలక్షణమైనది, చక్కనిది. ఇందు సీత కడకు శ్రీరాముఁడే యెఱుకతయై వచ్చుట విశేషము. ఇందుఁ దాళప్రధానము లగు దరువులు, ద్విపదలు, సలంతి సంధి వచనములు, గొలసి పద్యములు, అర్ధ చంద్రికలు, ధవళ శోభనములు, సువ్వి, లాలి, జోలపాటలు మొ॥ గలవు. గ్రంథము యక్షగానమని పేర్కొనఁబడినది.

---

* ప్రచురణలు :— 1 వెస్టువార్డు అండుకో, మదరాసు, 1946. 2. ఎన్. వి. గోపాల్ అండుకో మదరాసు, 1950 (ముద్రిత ప్రతులోఁ గవి తండ్రి పేరు మొ. విషయములఁ దప్పులు గలవు. అంనులకు ప్రా. లి. పు. భాం.డి. నం. 1958, 1959 చూచునది).

# 51. బలభద్రదాసి

## కపోతవాక్యము : ♦

కవి సోమయ సోముని (బసువని) భామ మల్లాంబిక పట్టి. పేరును బట్టి గ్రంథము స్త్రీ కృత మనిపించును. అన్ని ప్రతులలో నాపే రట్లనే యున్నది. పట్టియను మాటను బట్టి యేమియుఁ జెప్పఁ జాలము. గ్రంథము కర్పరచెన్నుని కంకితము.

డి. నం. 1844 ప్రతి లేఖన కాలము :— విరోధి మాఘ శు. 15 ఆదివారము — 7–2–1830. డి. నం. 1845 ప్ర. వి. కాలము విరోధి కార్తిక శు. 5 భానువారము. – 1–11–1829. గ్రంథ రచన 1829 సం. కుఁ బూర్వమనుట స్పష్టము. రచనా రీతిని బట్టి ప్రాచీనత క్వాచిత్కము ద్యోతమాన మగును.

గ్రంథ విషయము :— భారతము శాంతి పర్వమునఁ గల పరోపకార పరాయణ ధర్మ ప్రబోధాత్మక మగు కపోత వాక్యోపాఖ్యాన మిందు మనోహరముగఁ బ్రపంచింపఁబడినది. ఇందు విడి విడిగా రాగతాళ ప్రధానములగు దరువులు, ద్విపదలు, కందములు, చౌపదములు జాళిపదాలు, నడలు, రేకులు, అనువులు, అర్ధచంద్రికలు, సువాలమొ. రచనా విశేషములు గలవు. మంచి పలుకుబళ్ళు గల పదగతి, సూనృతమైన భావావేశమును గల రచన. యగా. అని పేర్కొనఁబడినది.

---

♦ ప్రతులు:— 1 తం. స. మ. కే. నం. 474–475,

2 ప్రా. లి. పు. భాం. డి. నం. 1844, 1845, 1846

(కవి విషయమునకు తం. స. మ. ప్రతి గ్రాహ్యము)

# 52. సిరిప్రెగడ సుబ్బారాయుఁడు

ప్రా. లి. పు. భాం. డి. సం. 1956, 1957— సారంగధరనాటకము హారితస గోత్రుఁడు, వెంకట్రామయ్య పుత్రుఁడునైన సుబ్బారాయని కృత మని యున్నది. అంగే డి. సం. 1889, 1890— నలనాటకమున నది శిరు పెగడ (సిరిప్రెగడ సుబ్బరాయ కవి కృత మని యున్నది. కేటలాగు కర్తలు "గ్రంధకర్త పేరిందుఁగానరా" దని వ్రాసిరి. కాని డి. 1890 ప్రతిగల సంపుటము 137 వ పుట రెండవపంక్తిలోఁ గవిపేరు స్పష్టముగాఁగలదు). ఉభయ గ్రంథములు నేకకర్తృకము లనుటకుఁ గథోపక్రమణిక, నిర్వహణ, రచనల యందుఁగల సామ్యమే ప్రబలమైన తార్కాణ. అందులకు రెండింటను గల కోలకేతన కథా ప్రస్తావన, రాజపాత్ర ప్రావేశిక ధ్రువ, రాజుగారి మృగయాసన్నాహము, రాజపురోహిత ప్రావేశికధ్రువ మొదలగు సందర్భములు పోల్చి చూడనగును. రెండును శివాంకితములు.

రెండుగ్రంథములును బ్రసిద్ధేతి వృత్తములు. రెండింట దరువులు ద్విపదలు వచనములు సమపాళముగా నున్నవి. ఏలలు న్నవి. నలచరిత్రలో నదనముగా శోభనపుటులు, గొలఁది పద్యములును గలవు. అందాశ్వాస విభాగముండుట యొకవిశేషము. రెండును నాటకములని పేర్కొనఁబడినవి. సారంగధరనాటకము పాడుటకు, నాడుటకు నుద్దేశింప బడినది. రెండు నొకవిధమగు వ్యావహారికభాషాధోరణిలో సాగినవి. రెండును బ్రౌఢ రచనలుగావు. నల నాటకము బిల్వపురీశున కంకితము. బిల్వపురి యనఁగా ఉత్తరార్కాటు మండలమునందలి తిరువలమను క్షేత్రము. కవి యాప్రాంతపువాఁడు గావచ్చును.

డి. 1957 ప్రతిచివర "విరోధి నామ సంవత్సర శ్రావణ శు. 15 శనివారం పుదుచేరిలో ఈ సారంగ నాటకం సంపూర్ణంగా మాంజేటి సర్వేశలింగం వ్రాసుకొనెను." అని యున్నది. క్రీ. శ. 14–8–1829 విరోధి శ్రావణ శు. 15 అనఁగా బూర్ణిమయే కాని శుక్రవారము. ఆమఱునాఁడఁగదా శనివారము. ఇక్కడ తిథివిష యమున నేదో చిన్న తికమకగలదు. అదియట్లుండ నీ డి. 1957 తాళ పత్రప్రతి, అట్టిచో నది తరువాతి విరోధి (క్రి. శ. 1889, యనుట కా కాలమునకుఁ గాగితములు వచ్చు వచ్చియుండుటచే నది పొసఁగదు కదా. ఈ ప్రతి విలేఖకుఁడగు మాంజేటి సర్వేశలింగమే ప్రా. లి. పు. భాం., నందలి యనేక తాళపత్ర గ్రంథముల ప్రతి విలేఖనములు చేతి మీఁదుగా నడచిన పూర్ణకాయుఁడు. ఆయాప్రతి విలేఖనకాలము లనేకము పరిశీలింపఁగా నతఁడు క్రీ. శ. 18 శతాబ్ది పూర్వార్ధమున నుండినట్లు తెల్లమగుచున్నది. అందుచే నీప్రతి విలేఖన వత్సరమగు విరోధిని 1829 గా గ్రహింపనగు. సుబ్బరాయని కృతులంతకుముందు పుట్టినవనవలెఁ గాని యేమంత ప్రాచీన రచనలుగాఁ దోఁపవు.

# 53. వేలూర్పారి వేంకట కవి

కవి విషయము:— ఆపస్తంబ సూత్రుఁడు, మౌద్గల్యసగోత్రుఁడు, బమ్మాన లేక బాపనామాత్యుని పుత్రుఁడు. గొంగాళ రామశాస్త్రి శిష్యుఁడు. (ఇవి యీయన రామలీల, గౌరీశంకరవిలాసముల నుండి యెఱుకపడిన సంగతులు). ఈయన నివాసము విశాఖమండల విజయ

నగర రాజ్యమందలి రావివలస. కృతులు :— విచిత్రరామాయణ కావ్యము, గౌరీశంకర విలాస నాట్యప్రబంధము,[1] రామలీల[2] యక్షగానము, జానకీరామశతకము, గోవ్యాఘ్ర పరిచయము మొదలగునవి. ఈయన "త్రిషష్టి వర్షముల్ యుర్వరఁ గీర్తినొంది చనె నొప్పుగ స్వర్గము యాగ కర్మరతాఖర్వము శాలివాహన శకంబున వహ్ని నగాద్రి చంద్రులం, బర్వువిరోధి కృన్మహిత వత్సర యాశ్వీన కృష్ణ పంచమిన్" అనఁగా శా. శ 1773-78- క్రీ. శ. 1851 అది యీయన నిధనకాలము. ఈయన 63 సం. లు జీవించినట్లు పై పద్యమునఁ జెప్పఁబడినది. కావున నీయన జననము క్రీ. శ. 1778 అగుచున్నది. వహ్ని శబ్దమునకుఁ త్రేతాగ్నులను గాక పంచాగ్నులను గ్రహించినచో నీయన కాలము క్రీ. శ. 1780 - 1853 అగును. "ఇర్వదినాల్గు హాయనము లింపు దనర్చినకాలమాదిగా" నీయన కృతులు రచించినారఁట. అనఁగా క్రీ. శ. 1804 ప్రాంతమున నీతని యక్షగానముల రచన జరిగినదని యూహింపవచ్చును. (ఈ విషయము లీయన రామలీల గౌ. శం. విలాస ముద్రిత ప్రతి కితని ద్వితీయపుత్రుఁడగు వెంకట రామయ్య సంతరించిన ముఖబంధ పద్యములవలన నెఱుఁగనైనవి. ప్రాముఖ్యముగా నితని కృతులన్నియు విజయనగర సమీపమునఁ గల రామతీర్థ క్షేత్రస్వామి కంకితములు.

## గ్రంథ విషయము

**రామలీల :**

రామాయణ మాఱుకాండలు నిందు సంగ్రహముగా రచింపఁబడినవి. కాండాంత కవి విషయక గద్యలు వినా గ్రంథము నిర్వాచ

(1) (2) రెండును విశాఖపట్టణము శ్రీ శారదా ముకుటము. శా. లో ముద్రితములు., సం. 1900.

నము. ప్రసిద్ధ రాగ తాళములలో దరువులును బద్యములును విరివిగాఁ గలవు. ఎడనెడ ద్విపదలు. ఆఖ్యానశైలి యెక్కువ. రచన చక్కనిది. యక్షగాన కావ్యమని పేర్కొనఁబడినది.

**గౌ రీ శం క ర వి లా స ము :**

గంగా శంకరుల చైత్రరథ వన విహారము — అట శివుని గంధర్వాంగనల పొందు-వారును గంగయు నెట్లో సమాధానపడిరనఁగా గౌరీదేవి యాగమనము — సవతుల కయ్యము — శివుఁడెట్లో సమాధానము గుదుర్చుటయు నిందలివిషయము. ఇది కొంత పట్టు కూర్మనాథకవి మృత్యుంజయ విలాసము ఫక్కిని రచింపఁబడినది. ఇందాశ్వాస విభాగము (3) గలదు. ఇది శృంగార నాటక ప్రబంధమని పేర్కొనఁబడినది. ఇందలి ప్రధాన రసము శృంగారము. పాత్రల సంభాషణలతోఁ గథా ప్రవృత్తి నాటకోచితముగా నున్నది. పుర వనాది వర్ణనములు, మదన చంద్రాద్యుపాలంభములును ప్రబంధోచితముగా నున్నవి. ప్రసిద్ధ రాగ తాళములలో దరువులు, పద్యములు, వచనములు, ద్విపదలును గలవు. రచన చక్కనిది.

---

# 54. చెళ్లపిళ్ల నరస కవి

ఈయన రచించిన యామినీపూర్ణ తిలకావిలాస ప్రబంధము (బందరు శృంగారకావ్య గ్రంథమండలి ప్రచురణ, 1941) నకు కీ. శే. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు పీఠిక వ్రాయుచు నరసకవిగారు తమ

పిన్నముత్తాతగారనియు, వారు గోదావరిమండలమునందలి కడియం గ్రామ వాస్తవ్యులనియు, క్రీ. శ. 1795 - 1840 సం. ల నడుమ నుండి రనియు, వారు అహల్యా సంక్రందన విలాసము, ఏకాంత సేవా కలాపము నను రెండు యక్షగానములు రచించియుండిరనియుఁ, గవి స్వహస్తలిఖితములగు ప్రతులకుఁ దాము స్వయముగాఁ బ్రతులు తయారుచేసికొనియున్నను నవి యంతరించినవనియు వ్రాసియుండిరి. (నరస కవిగారు యా. ప్ర. తి. విలాసమున పిఠాపురము రావు వేంకట నీలాద్రి రాయ నృపతిని పేర్కొనియుండుటచే నా నృపతి "నూఱు సంవత్సరములక్రిందట నుండినవారై నందున నాతనికాలములో నుండిన కవియు దాదాపుగా నూఱు సంవత్సరముల క్రిందటివాఁ" డని శ్రీ వీరేశలింగముగారు ఆం. క. చ. లో నరసకవి చరిత్రమున వ్రాసినారు.)

---

# 55. శివలెంక మల్లనారాధ్యులు

## వీరభద్ర విజయము:

కవి విషయము: ఇతని పితామహుఁడును మల్లనారాధ్యుఁడు. తండ్రి మహాదేవారాధ్యుఁడు. గురువు రామయ్య దేశికుఁడు! గ్రంథ మేలూరు జలాపహారీశ్వరున కంకితము. కాఁగా నితఁ డేలూరు వాస్తవ్యుఁడని యూహింపఁదగియున్నది. ఇతని కాల నిర్ణయమున కొక యాధారముగలదు. ఈ వీ. వి, యొక్క ప్రా. లి. పు. భాం., ఆర్. నం. 614 ప్రతి విలేఖనకాలము శుభ కృత్కార్తిక శు. ౧౧ ఆది వారము — క్రీ. శ. 13-11-1842. గ్రంథరచన యంతకుఁబూర్వమనుట

నిశ్చయము. శ్రీ రాజా మంత్రిప్రగడ భుజంగరావుగారు సంతరించిన ఆధునిక కవి జీవితములను గ్రంథమున (నెం. 134 గా) నున్న శివలెంక నాగభూషణముగారి చరిత్రమున వారి నివాస మేలూరికి సమీపమున నున్న వంగూరనియు, వారు శైవబ్రాహ్మణులు, ఆపస్తంబసూత్రులు, సాలంకాయనగోత్రులు నను విశేషములు దెలియుటతో పాటాయన మల్లనారాధ్యుల పౌత్రులనియు, వారి జనన కాలము క్రీ. శ. 28-4-1872 అనియుఁ దెలియవచ్చినది. అందుచే వారి తాతగారగు మల్లనారాధ్యులు 19 వ శ. పూర్వార్థమున నుండిరట్లు స్పష్టము.

గ్రంథ విషయము :— మూఁడాశ్వాసములుగా విభక్తము. ఇందు వీరభద్ర విజయ కథా ప్రధానమైనది ప్రథమాశ్వాసము మాత్రమే. ద్వితీయమునఁ బార్వతీకల్యాణము, తృతీయమునఁ గుమార సంభవ తారకవధములుప్రధానవిషయములు. గ్రంథనామము పూర్తిగా సార్థకముగాదు. ప్రసిద్ధ కథాసందర్భముల కింతవిరుద్ధముగాఁ కవి యిం దలఁతి యలతిఁ మార్పుల నవధరించి యుండెను. కాని యవి కావ్య గుణాపకర్షకములు గాలేదు. ఇందుఁ బ్రసిద్ధ రాగ తాళములలో దరువులు, ద్విపదలు, పద్యములు, వచనములు, కందార్ధసార్ధములు, సువ్వి, జోలలు, శోభనములును గలవు. రచన చక్కనిది. కూర్మనాథ కవి మృత్యుంజయవిలాస రచనాప్రక్రియతో దీనికిఁ జాల పోలికగలదు. ఎఱుక, పార్వతి యనుతాప ఘట్టములందు రచనలోఁగూడ బోలిక స్పష్టపడినది. ఇదియు మృ. వి. వలె నవతారికలో యక్షగాన మనియు నాశ్వాసాంతగద్యలో శృంగార నాటకి గేయప్రబంధమనియుఁ జేర్కొనఁ బడినది. కాని యిందు శ్రవ్యకావ్యధోరణి యెక్కువ. గర్భకవిత్వ మట నట ప్రదర్శింపఁబడినది. యుద్ధవర్ణన లుదాత్తముగా నడచినవి. ఎఱుక ఘట్టము నేర్పుగాఁ జిత్రింపఁబడినది.

# 56. ముమ్మడిదేవుల తిరుమలకవి

## గీ త ర ఘు న ం ద న ము:*

కవి విషయము:—పరాశర సగోత్రుఁడు. రామచంద్రయతి శిష్యుఁడు. హరిహరాద్వైతి. ఇతని తండ్రి పేరు గూడ తిరుమలా ర్యుఁడే. తల్లిలక్ష్మమ్మ. చిత్తూరు కవి కుటుంబమునకుఁ జిరనివాసమఁట. కాలము: ఈగ్రంథముయొక్క ఆం. సా. ప. ప్రతిలేఖకుని శ్లోక మొకటి గలదు — "గురువాసరేఽక్షయబాహుల బహుళాష్టమ్యాం స సచ్చిదానందః, గీతరఘునందనం నిజ పితృ తిమ్మలరచిత మలిఖ దిదమ్" ఆ యక్షయబాహుల (కార్తిక) బహుళాష్టమి గురువారము క్రీ. శ. 29-11-1866 కి మాత్రము సరిపోయినది. ఆనాఁడా ప్రతిని లిఖించిన సచ్చిదానందుఁడు గ్రంథకర్త కొడుకునని చెప్పియున్నాఁడు. కాఁబట్టి తిరుమలకవి క్రీ. శ. 19వ శతాబ్ది పూర్వార్ధమున నుండి యుండెననుట నిశ్చయము.

గ్రంథ విషయము:— ఇందు రామాయణ మూఁడు కాండల కథయు యథావాల్మీక ప్రణాళికముగాఁ గలదు. దానివలె నిదియు "పాఠ్యేగేయేచ మధుర"మ్మనఁదగినది. వాల్మీకి రామాయణము నను దినము నర్థపరాయణుఁడై పారాయణ మొనర్చిన వాఁడట కవి. కాని యతఁడిందు భోజ చంపువునుగూఁడ బలుకరింపక విడువలేదు. గీత రఘునందన మనఁగానే గీతగోవిందము స్ఫురణకు వచ్చును.

---

* ఆం. సా. ప. — నం. 6

ఇందలి బాలకాండ మాత్రము 1896 లో పసప్పాకం ఆనందాచార్యుల వారిచేఁ బ్రకటితము. (ఈఆనందాచార్యుల వారి పుట్టుక 1843 లో ననియు, వారి తండ్రిగారికి తిరుమలకవి పుత్రుఁడైన సచ్చిదానందముగారు మిత్రులనియు డాక్టరు శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు సెలవిచ్చియున్నారు)

రెంటను గీతిధర్మ ప్రకృష్టములే కాని రెండింటను ప్రధానభేద మొకటి కలదు. గీతగోవిందము భావ ప్రధానమైనది. గీతరఘు నందనము వస్తుప్రధానమైనది. ఇందు సుదీర్ఘ ప్రపంచాగ శైలీ చాతురి, నాటకీయ సన్నివేశ కల్పన శిల్పమును గని చూపియున్నను, పాటపాలెక్కువ యని యాపేరే చెప్పక చెప్పుచున్నది. ఇది ధారా ధోరణీ భాసురము లగు దరువులతో తాళప్రధానములు, గతి గంభీరములగు ద్విపద లతోఁ బరువులెత్తు పదపద్యములతో, ఏలలు, అర్ధచంద్రికలు, లాలి పాట, శోభనములు మొదలగు గేయవిశేషములతో నిర్వచనముగా సంతరింపబడినది. ఇందలి భాష సలక్షణమైనది. రచన నిర్దుష్టమైనది. ప్రబంధమని పేర్కొన బడినందులకుఁ దగినట్లు చక్కని వర్ణనలును గలవు. అన్నిటిని మించిన దిందలి రసప్రసన్నమగు శైలీ లాలిత్యము.

---

# 57. కానుకొలను వెంకటదాసు

## శ్రీకృష్ణనాటకయక్షగానమహాప్రబంధరాసక్రీడావిలాసము*

కవి విషయము:—శ్రీవత్సగోత్రుఁడు. కానుకొలను భావయా మాత్య పుత్రుఁడు. "ఈయనకే నాయనప్పయని నామాంతరము.

---

* కవి శ్రీకృష్ణనాటకమను యక్షగాన మహాప్రబంధము నాశ్వాస బహుళముగా రచించియుండినట్లు దానందుఁ జతుర్థాశ్వాసము రాసక్రీడావిలాస మనియు గ్రంథాంతగద్యవలనఁ దేటపడుచున్నది. ఆ చతుర్థాశ్వాసము మాత్రమే నేఁడు లభించుచున్నది. ... ఆం. సా. ప. తాళపత్రప్రతి నం.2748. ఇది 1926 లో బందరు నేషనల్ ప్రెస్ వారిచేతను, 1948 లో ఏలూరు వెంకట్రామ పవర్ ప్రెస్ నందును ముద్రింపబడినది. ముద్రణప్రోత్సాహకులు గ్రంథకర్తగారి పౌత్రులని రెండిటి ముఖ పత్రములమీఁదను గలదు.

చింతగుంటపాలెపు రామశతకకర్త. ... 1816 వ సం. లోఁ బైకవి 12 వత్సరముల ప్రాయమున నుండఁగా నీశతకము వ్రాసెనట" అనియు నతనిగుఱించి శతకకవులచరిత్రలోఁ గలదు చింతగుంట పాలెము బందరులో నొక పేటయఁట.

గ్రంథవిషయము:—గోపికాకృష్ణుల రాసక్రీడలు. ప్రసిద్ధరాగ తాళములలోఁ గవినామాంకితములగు దరువులు, పద్యములు, శ్లోకము లును గలవు. కవిత్వమెంతయు హృదయంగమము. రాసక్రీడఘట్ట మతిమాత్రమనోజ్ఞము. కవి సంగీతజ్ఞానము వెల్లివిరిసినది. దరువులు సలక్షణములైన చక్కని కృతులవలె నున్నవి.

---

# 58. జ్యోతి రామయ్య

## పారిజాత నాటకము:

పై గ్రంథము ఆం. సా. ప. ప్రతినెం. 1743 అసమగ్రమైనది. ప్రత్యంతరము లభింపలేదు. గ్రంథములోపలఁ గవినామాదులు తెలియుట కవకాశము లేదు. "లేబిలు"పై జ్యోతిరామయ్యపేరు కన్పట్టుచున్నది. ఆతఁడుకాని యేతద్గ్రంథకర్తయై యుండునాయని వట్టియనుమానముమాత్రము. అతఁడే కర్తయగునేని గ్రంథరచనా కాలమును నిర్ణయించుట కొక యాధారముగలదు. జ్యోతిరామన తన కృతి ప్రోత్సాహకులలో నొకఁడని శ్రీధరమల్లె వెంకటస్వామి తన బ్రహ్మోత్తరఖండమునఁ జెప్పియున్నాఁడు. (చూ. ఆం. క. చ. తృతీయభాగము

వేంకటస్వామి "శకవర్గగణనంబు శైలరామమునిందు, పరిమితంబై ధాత్రిబరగుచుయుంసు యువనామ సంవత్సర" మునఁ తనగ్రంథము రచించినట్లు చెప్పియున్నాఁడు. అది శా. శ. 1737 – క్రీ.శ. 1815 అగుచున్నది. జ్యోతిరామసయు నాప్రాంతమువాఁడే యగును. వేంకటస్వామి జ్యోతిరామయ విష్ణువర్ధనగోత్రుఁడైన సుబ్బనకుఁ గొడుకనియు నతనికి లక్ష్మీనారాయణ, చెంగల్వరాయఁడునను సోదరులున్నట్లును జెప్పినాఁడు.

ఈ పారిజాత నాటకము చేజెర్ల చెన్న కేశవ స్వామి కంకితము. (చేజెర్ల గుంటూరు జిల్లా, ఒంగోలు తా॥) గ్రంథమంతయు సత్యభామ స్వగతమువలె నున్నది. ఆమె కృష్ణుని వెదకికొనుచు వచ్చుటయుఁ దనపెండ్లిముచ్చట ముచ్చటించుచుఁ దన వలవంత వెళ్ళఁబోసికొనుటయు నున్నంతలో నిందలి విషయము. ఇందుఁబ్రసద్ధ తాళ ప్రధానములైన దరువులు, ద్విపదలు, పద్యములు గలవు. రచన బాగు లేకపోలేదు.

---

# 59. జందాళ నంజప్ప

## జ్ఞానకురవంజి:*

ఈ నంజప్ప తాను జ్యోతి రామగురుని శిష్యుఁడ ననిమాత్రము చెప్పుకొనినాఁడు. అతఁడు పై జ్యోతి రామయ్యగారే యగునేని నంజప్ప

* ఇది 1867 సం. ననే ముద్రితమైనది. ప్రచురణ వివరములు తెలియవు. రాజమంద్రి గౌతమీ గ్రంథాలయమున నొక ప్రతికలదు. – నెం. 150.

కాలము 19 శ. పూర్వార్ధముగా గ్రహింపవచ్చును. ఇతని జ్ఞాన కురవంజి స్త్రీ కథ, పురుష కథ అని ద్వేధా విభక్తము. మొదటి భాగమున నెవరో మునికాంతకు ముక్తికాంత యెఱుకతయై యద్వైత తత్త్వమును గూర్చి యెఱుక చెప్పుటయు, నపరార్ధమున పరమాత్మ యగు సింగడు సింగిని వెదకుచు వచ్చుటయు వారి సంవాదమును విషయములు. సాంకేతిక పరిభాష యెక్కువ. ఇందుఁ బ్రసిద్ధ రాగతాళములలో దరువు లనేకము, దరువులలో సంవాదములు, కందార్ధములు, ఏలలు, ద్విపదలు, పద్యములు (జాత్యుప జాతులు మాత్రము), వచనములు, సంధి వచనములు, నొక దండకము, నొక చూర్ణికయుఁ గలవు. రచన పేలవము. దోష దోహలము. ఛందోదోషము లనేకము. గణ యతిప్రాసములలో నేదో యొకటి నప్పినఁజాలు నన్న రకము వాఁడు గ్రంథకర్త. గ్రంథము యక్షగానముగాఁ జేర్కొనఁబడినది.

---

# 60. తరిగొండ వేంగమాంబ

ఈమె యింటిపే రసలు తరిగొండవారుకాదు. తరిగొండ కడప మండలము వాయల్పాడు తాలూకాలో నొకగ్రామము. ఈమె పుట్టినింటి వారు కానాలవారు. నందవరీక బ్రాహ్మణులు. వాసిష్ఠ గోత్రులు. ఈమె తండ్రి కృష్ణార్యుఁడు. తల్లి మంగమాంబ. భర్త

ఇంజేటి * వంశ్యుఁడును, శ్రీవత్సగోత్రుఁడు, తిమ్మయార్యుని పుత్రుఁడు నైనవెంకటాచలపతి. కాని యామెకుఁ దరిగొండ వెంగమ యనియే ప్రసిద్ధి గల్గినది. తరిగొండ నరసింహుఁ డామె కులువేల్పు. తిరుపతి వేంకటేశ్వరుఁ డిష్టదైవతము. ఆయిరువురకు నభేదము పాటించి చాల కృతులను సముద్రకముగా నర్పించిన దామె. కొన్నిటిని సుబ్రహ్మణ్యగురున కంకితము చేసినది.

ఈమె 1840 సం. నందు జీవించి యుండినట్లు కీ. శే. సి. పి. బ్రౌను దొరగారు తమనిఘంటువున వ్రాసియున్నారు. కాని యప్పటి కామె వార్ధకదశయందుండెనని యూహింపనగును.

ప్రా.లి.పు.భాం.ఆర్.నం. 1056 పారిజాతాపహరణ నాటకము (వెంగమకృతము) ప్రతి చివర "దుర్ముఖినామ సంవత్సర ఆషాఢశుద్ధ 6 గురువారమునకుసరియయిన 1896 సంవత్సరం జులాయినెల తేదీ 16 న శ్రీతరిగొండ వేంగమ్మ గారికి మునిమనుమనుమ్మా, వేంగమ్మ గారికి కోడలైన చెంగమ్మగారికి మనుమడైన గరిడేను సుమ్మన్న కొమారుడయిన గంగాధరప్ప, గాడంశెట్టి పుల్లయ్య వ్రాసిన అసలు మాతృకనుపట్టి సంపూర్ణముగా గ్రంథంపూర్తిగా వ్రాయడమైనది." అని యున్నది. 1896 నాఁటి కామె పౌత్రులకు దౌహిత్రులున్నారనఁగా నామె 18 వ శతాబ్దిచివరికే పుట్టియుండును. ఆమె గ్రంథరచన - యక్షగాన రచనమైన 19 వ శతాబ్ది ప్రథమపాదమున జరిగియుండును.

*కొన్ని తావుల నింజేటి, నుంజేటి యనియుఁగలదు. అది లేఖకుల పొరపాటై యుండును. ఇంజేటి—అను గ్రామము కర్నూలుజిల్లా కోయిలకుంట్లతాలూకాలో గలదు. దానినిబట్టియే అయింటి పేరేర్పడి యుండును.

వెంగమాంబ విషయ మామె గ్రంథముల నుండియే విశదమగుచున్నది. అందు ద్విపదభాగవతము (ప్రా. లి. పు. భాం., డి. నం. 1013) నుండి యెక్కువసంగతు లెఱుకపడఁగలవు.

వెంగమాంబ "నాచిన్ననాట నోనామాలనైన, నాచార్యులెవరు నాకాన తీలేదు" అని చెప్పినది. కాని పదునైదు కృతులు రచించిన ప్రోడయామె. అవి 1. నరసింహ శతకము, 2. నరసింహ విలాసకథ, 3. శివనాటకము, 4. రాజయోగసారద్విపద, 5. కృష్ణ నాటకము, 6. పారిజాతాపహరణము, 7. రమాపరిణయమను పెండ్లి పాట, 8. చెంచునాటకము, 9. శ్రీకృష్ణమంజరి, 10. రుక్మిణీనాటకము, 11. గోపికానాటకము 12. ద్విపద భాగవతము, 13. వేంకటాచల మాహాత్మ్యము, 14. వాసిష్ఠరామాయణము, 15. ముక్తికాంతా విలాసము. ఇందు శతకములు, పద్యద్విపద కావ్యములు, యక్షగానములు, పాటలును గలవు. ప్రక్రియావైవిధ్యమే కాదామె సాహిత్యమందు భక్తి, శృంగారము, వేదాంతము మున్నగా విషయవైవిధ్యమును గలదు. ఆమె గ్రంథములు పదునొకండు లభించినవి. అందాఱు ముద్రితములు. (4, 8, 13, 14, 15,). పై పట్టికలో యక్షగానము లేడు గలవు. (3, 5, 6, 8, 10, 11, 15). అందు రుక్మిణి నాటక మలబ్ధము. నారసింహ విలాసకథయు యక్షగాన మగునేమో కాని యదియు నలబ్ధము.

## గ్రంథ సమీక్ష

### శివనాటకము[1] :

దీనిని శివనాటకమనియుఁ గవయిత్రి వ్యవహరించినది కాని ప్రతివిలేఖకులు కొందఱొక క్రొత్తపేరు పెట్టినారు - శివపారిజాతమని.

1 ఆం. సా. ప. ప్రతులు :— నం. 2175 - 77 (కాగితము), నం. 1493, నం. 1749 లో నెనిమిదాకు లిందలి యొటుక ఘట్టము. అది పొరపాటున వేంకటేశ్వర కళ్యాణమను య. గా. గాఁ బేర్కొనఁబడినది. (ఆం. సా. ప. అముద్రిత గ్రంథ సూచికలో) అడయారు ప్రతులు :— 32 (ఇ) 19, 32 హెచ్, 8. ఆం. సా. ప. ప్రతిలో మాత్రము వెంకమాంబ తండ్రి శేషార్యుఁడని యున్నది. కాని అడయారు ప్రతులలో నామె కడమగ్రంథములలో కృష్ణార్యుఁడనియే కలదు. అదే గ్రాహ్యము.

పారిజాత ప్రసక్తి యిందెక్కడను గానరాదు. కాని నారదుఁడు పారిజాతము కారణముగా సత్యా రుక్మిణుల మధ్య సవతికయ్యము తెచ్చి పెట్టినట్లే యిందొక రత్నహారముద్వారా గంగా గౌరుల నడుమ నది కల్పించును. సందర్భ సాదృశ్యమునుబట్టి లేఖకుఁడు చేసిన పనియిది. ఇందు లక్ష్మి కొరవంజియై గంగ కెఱుక చెప్పుట, నారాయణుఁడు సింగఁడగుట, సింగీ సింగళ్ళ ప్రసంగము, సవతుల సంవాదము హృదయంగమముగా నాగినవి. అప ప్రయోగము లనేకమున్నను సహృదయ సంభావనమునకుఁ గొదువపడదు. వెంగమ శివకథ యగుటచేఁగాఁబోలు గ్రంథమును రాచవీటి వీరభద్రున కంకితమిచ్చినది.

**బాలకృష్ణనాటకము[2]:**

గోపికాకృష్ణ సంవాదము:— కృష్ణుఁ డదృశ్యుఁడగుట — గోపికల యన్వేషణ — అతఁడు ప్రసన్నుఁడై వారితో జలక్రీడ లాడుట — అంతలో రాధ గోపాలుని పాలికిఁ జెలికత్తెను బుత్తెంచుట — గోపికలా రాధా సఖిపైఁ గోపించుట — కృష్ణుఁడు రాధను బ్రసన్నఁ జేసికొనుట — ఇదీ యిందలి విషయము. రచన యొక మోస్తరు.

**పారిజాతాపహరణము[3]:**

కృష్ణుఁడు పారిజాత వృక్షమును దెచ్చెదనని సత్య ననునయించి సుఖించుచున్న ఘట్టముతో నిందలి కథారంభము. పూర్వకథ సంగ్రహ

2 ఆం. సా. ప. – నం. 1566. వెంగమ తాను కృష్ణనాటకమును, గోపికా నాటకమును రచించినట్లు మాత్రము ద్విపద భాగవతమునఁ జెప్పినది. కాని యీ బాలకృష్ణ నాటకమనునదే నేఁడుపలబ్ధము. అందా పేరట్లనే యున్నది. విషయమును బట్టి యిది పై రెండిట నేదైనను గావచ్చును.

3 ప్రా. లి. పు. భాం., న. విష్ణు పారిజాత మను పేరనున్నది — ఆర్. నం. 1056. శివవిలాసము తప్పుగా శివ పారిజాత మని వ్యవహృతమైనది. తద్భిన్నత గుర్తింపఁబడుట కిది విష్ణు పారిజాతమైనది. (ఇది సుమారు రెండువేల గ్రంథము).

ముగాఁ బ్రస్తావింపఁబడినది. కృష్ణుఁ డొకనాఁ డామెను గురించి కడమ రాణులఁ గలియఁబోవుట — సత్యా విరహము — సత్యాకృష్ణుల సందేశములు, సంవాదములు — సత్య కడకు సరస్వతి కొరవంజియై వచ్చుట — బ్రహ్మ సింగఁ డగుట - సత్య తపస్సు చేసి స్వామిని బ్రసన్నుఁజేసికొనుట — కృష్ణుఁడు స్వర్గమున కేఁగుట కొక నెపము కల్పించుకొనుట — నరకాసురవధ కథ యిచ్చట ననుసంధింపఁబడినది సందర్భోచితమైన మార్పు — తరువాత పారిజాతాప హరణము — ఇంద్రోపేంద్రుల యుద్ధము — దివిజ తరువు సత్యభామ పెరటికిఁ దిగగానే సవతుల కయ్యము — రుక్మిణితీర్పు — సత్య సవతులకుఁ బూలవాయనములిచ్చుట — ఇట్లు పారిజాతకథ బహుధా ప్రపంచింపఁబడినది. శృంగార హాస్య రసములు వెల్లివిరిసినవి. సంభాషణలు చతురముగా, రచన రసోత్తరముగా సాగినవి.

## చెంచునాటకము[4]:

చెంచులక్ష్మి చెల్లెలు తనప్రియుని వెదకికొనుచు బావగారి భవనపుఁ జాయలకు వచ్చును. అట తరిగొండ నరసింహస్వామి ద్వారపాలకులచేఁ బృచ్ఛితయై చెంచెత తనచరిత్ర, తనవారి చరిత్రయావత్తు నేకరువు పెట్టును. తరువాత నామె ప్రియుఁడు చెంచు నాయఁకుడు వచ్చును. అతనితో వాదులాటయైనతరువాత చెంచెతబుడుత నతనికప్పగించి వేటకు బోవును. ఆమె తిరిగి వచ్చు సరికిఁ జెంచు నాయని బెదిరించి యొకపులి యాశిశువు నెత్తుకొని పోవును. చెంచెత యంగలార్చి

---

4 అమెరికన్ డైమండు ము. శా. ప్రచురణ, మదరాసు, 1927, 1929. ఈముద్రణ నిర్దుష్టముగాదు. ఇందలి గ్రంథాంత ద్విపదలో శెంగమాంబ తల్లి గంగమాంబ యనికలదు. కడమ గ్రంథము లందెల్ల మంగమాంబయనియే గలదు. అదియే గ్రాహ్యము.

యార్చి చివరికి శ్రీవెంకటేశునకు మ్రొక్కుకొని శిశువును బడయును. ఇందు చెంచుల కులాచారములు చక్కఁగా వివరింపంబడినవి. చెంచెత పుత్రశోక ఘట్టము హృదయము నుదిలగొను నట్టిది.

ముక్తికాంతా విలాసము[5] :

దీనికి వేదాంత జ్ఞానబోధిని యని నామాంతరము. ఇందలి విషయము వేదాంతమైనను రచన సాంకేతికముగా నొకభామకలాపమువలె నడచినది. జగదీశ్వరుఁడు మాయను వీడి ముక్తికాంతను బొందఁగోరి యామె మందిరమునకు వచ్చుట — (జ్ఞానకాంత చెలికత్తె) తలుపు మూయుట — తలుపుకడ నావలీవల నాయికానాయకుల సంవాదములు —అనంతరము మాయాశక్తి వైరాగ్య జ్ఞాన శక్తులతో వాదించుట — మొ॥ విషయములు, కృష్ణుఁడు సత్యయింటికి వచ్చుట చెలికత్తెలు తలుపులు మూయుట, సత్యా కృష్ణుల సంవాదములు తదుపరి సత్యా రుక్మిణుల సవతికయ్యము మొ॥, సందర్భములను దలఁపున కెలయించును. విషయము క్లిష్టమైన వేదాంతమైనను జెప్పుటలో సాధ్యమైనంత సౌలభ్యము జూపినది, (గ్రంథకర్త). ఇది సుబ్రహ్మణ్య గురున కంకితము.

చెంగమ యక్షగాన కృతులన్నియు మంచి నాటకపువాటము గల్గియుండును. అందలి దరువు లెక్కువగాఁ బ్రసిద్ధ తాళప్రధానములు. అటనట రాగములు పేర్కొనబడినవి. ద్విపదలు, మంజరి, పద్యములు, సీసార్థములు, వచనములు, ఏలలు, గొబ్బిళ్ళు, సువాలలు, ధవళశోభన

5 ఇది క్రీ. శ. 1869 లోనే అచ్చయినది రాజమండ్రి గౌతమీగ్రంథాలయమున నొకప్రతికలదు. నం. 176. అందుండి ముద్రణ ప్రచురణ వివరము తెలిసినది కాదు.

ములు, మంగళహారతులు, చూర్ణికలు, దండకములు మొ॥, పలురక ముల రచనా విశేషములు ననేకములుగలవు. లోకోక్తులు, ప్రయోగ విశేషములు ననేకములుగలవు. ఆమె తన వేంకటాచల మాహాత్మ్య ములో శృంగారమునకును దనకును జుక్కెదురన్నట్లు మాటలాడినది. కాని యామె యక్షగానము లందది సమృద్ధిగాఁ గలదు. అటవిక జాతుల జీవిత విశేషములనుండి గహనములైన యోగశాస్త్ర రహస్య ముల వఱకుఁగల యనేక విషయము లామె కథిగతార్థములు. సవతి కయ్యము ఎఱుక ఘట్టము మొదలగు పట్టులందభినివేశము తోడి నిపుణ నిర్వహణము బ్రకటించినది. ఆమెవలె నిన్ని యక్షగానము లింత సమర్థముగా రచించిన కవయిత్రులులేరు. సరికదా కవులు నరుదు.

---

# 61. శిర్నాడు వెంకటరాయకవి

కవి విషయము :— బ్రాహ్మణుఁడు. విశ్వామిత్ర గోత్రుఁడు. తలిదండ్రులు చెన్నాంబా వేంకటరమణార్యులు. పితామహుఁడు దాసయ్య. ప్రపితామహుఁడు వెంకటయ్య. ( ఇతని పినతండ్రి సంజుం డయ్య. అక్క సాకాంబ, అన్న దాసయ్య. తమ్ముఁడు గుండయ్య ). అహోబిల జోస్యుల యనుఁజుఁడును సింగవరము నివాసియు నగు నరహరి జోస్యు లీతని గురువులు. ఇతని య. గా. నాటకకృతులు మూఁడు.

కృష్ణనాటకము [1] శివనాటకము [2] రామాయణము [3] మొదటిది రెండవదానియందును, నారెంటను మూఁడవదానియందును బేర్కొనఁ బడినవి. మూఁడును లేపాక్షి హరిహరుల కంకితములు. కవి నివాసమది కావచ్చు. (లేపాక్షి అనంతపురమండలమున హిందూపురము తాలూకాలో నున్నది). శివనాటకమున రచనాకాలము చెప్పఁ బడినది. అందు రెండుభాగములు. ప్రథమ భాగాంతమున "శాలివాహశకము వెయ్యిన్ని, యేడునూర్లరవయ్యినొక్కటి యనెడి, ఘన విళంబి"యును, గ్రంథాంతమున "శాలివాహన శకాబ్దముల వెలయుచు నుండెడి వెయిన్నేడు నూర్లనరవయి రెండవ నమరిన వికారి" యును బేర్కొనఁబడినవి. అవి వరుసగా శా. శ. 1761 – 62 అనఁగా క్రీ. శ. 1839 – 1840 అగుచున్నవి. కవి క్రీ. శ. 1840 ప్రాంతము వాఁడనుట నిశ్చయము.

ఈ లేపాక్షి నాటకత్రయము రామునిపేరుతోఁ బ్రదర్శన ప్రతిష్ఠ లెక్కువగా సంపాదించినవి. మూఁడును బ్రసిద్ధేతివృత్తములు. కృష్ణనాటకమునఁ గృష్ణజన్మాదిగా జలక్రీడలవఱకు నున్నది కథ. ఇందు పూతనచే గొల్లభామ, ఎఱుకలసాని వేషములు వేయించినాఁడు కవి. శివనాటకమున దక్షాధ్వరధ్వంసము, పార్వతీకల్యాణకథయుఁ గలవు. ఇందు విదూషకుని హాస్యము, సూత్రధారుఁ డెఱుకలసానినిఁ బల్కరించుటయుఁ గలవు. ఈ రెండిటఁ బ్రథమ ద్వితీయ "విలాసములు"గా గ్రంథవిభాగము కాననగును. రామాయణమున బాలా యోధ్య

1 1931 లో విశాఖపట్టణమున డి. వి. యన్. గుప్తచే, 1947, 1950 సం. లలో మదరాసు శెట్టువార్లు అండుకో వారిచేతను ముద్రితము.

2 ముద్రితము. ప్రచురణ వివరములు తెలియవు. రాజమండ్రి గౌతమీగ్రంథాలయమున నొకప్రతి గలదు. నం. 195.

3 పద్మనాభవిలాసము, శా. లో ముద్రితము. మదరాసు, 1907.

కాండలు "మొదటిరాత్రికథ"గను, అరణ్య కిష్కింధా సుందరకాండలు "రెండవరాత్రి కథ" గను, యుద్ధకాండము "మూడవరాత్రి కథ" గను వింగడింపఁబడినవి. అనఁగా నది మూఁడురాత్రుల ప్రదర్శనమున కుద్దిష్టమన్న మాట. ఈ మూఁడు కృతులందును విడి విడిగాఁ బ్రసిద్ధ రాగ తాళములలో దరువులు, ద్విపదలు, పద్యములు, సంధివచనములు, పాత్ర సంభాషణా ప్రచురములైన వచనములును గలవు. మూఁడింటను నాటకీయత వెల్లివిరిసినది. కాని రచన యొకమోస్తరు. భాషలో వ్యావహారికసరళి కొంత చూపట్టుచున్నది.

---

# 62. మార్జోళ్ల వీరయ్య

## ముగ్ధసంగయ్య కథ:

కవి విషయము:— తండ్రి మార్జోళ్ళ మల్లయ్య. తల్లి లింగమ్మ. కవి తన గ్రంథమును చేబ్రోలి శంభున కంకితముచేసియుండుటచేతను, గ్రంథమునఁ బెద్దాపురము శైవులను బేర్కొనియుండుటచేతను గోదావరీ మండలవాస్తవ్యుఁడనఁ జెల్లును.

ఆం. సా. ప. లో మాత్ర మీతని ముగ్ధ సంగయ్యకథ కొక తాళపత్ర ప్రతిగలదు. నం. 4540. (ఇది అముద్రిత గ్రంథసూచికలోఁ జేరలేదు.) ప్రతివిలేఖనకాలము:— "విశ్వావసు సంవత్సర జేష్ఠ శుద్ధ అష్టమీ శుక్రవారం" అది క్రీ. శ. 12-5-1665, 13-6-1845 తేదీలకు సరిపోవుచున్నది. రచనారీతినిబట్టి రెండవదే గ్రాహ్యము. అట్లనుట కింకొక యూహా యుపబలకముగా నున్నది. ప్రా. లి. పు. భాం. ఆర్.

నం. 59 (ఎ) కూచిమంచి తిమ్మకవి రాజశేఖర విలాసము ప్రతివిలేఖకుఁడైన చాగంటి మల్లయ తాను "శార్వరినామసంవత్సర ఫాల్గున శు 12 గురువారమురోజువరకు మారుజోళ్ళ మల్లయ్య ప్రతిచూచి" వ్రాసికొంటిననియున్నాఁడు. మారుజోళ్ళ వీరయ్య తండ్రిపేరు మల్లయ్యయే. ఆ మల్లయయు నీమల్లయయు నొక్కరేకావచ్చును. పై రా. శే. విలాస ప్రతివిలేఖనకాలము క్రీ. శ. 4-3-1841 తేదీకి సరిగా సరిపోయినది. మల్లయ యీకాలమువాఁడే లేదా యంతకించుక పూర్వుఁడగును. ఎంతపూర్వుఁ డనుకొందమన్నను క్రీ. శ. 1750 ప్రాంతమున నుండిన కూచిమంచితిమ్మకవికిఁ బూర్వుఁడు కాఁడుగదా. ఇతఁడుగాకపోయినను నితని పుత్రుఁడైన వీరయ్యయైన 19 శతాబ్ది పూర్వార్థమున నుండియుండునని యూహించుట లెస్సయనిపించుచున్నది.

గ్రంథ విషయము :— బసవేశ్వరుని సమకాలికుఁడును, అష్టముగ్ధలలో నొకఁడును, సానింటికేఁగి యట ఋశ్యశృంగునివలెఁ బ్రవర్తించినవాఁడును నగు సంగయ్య కథ యిందు వర్ణితము. ఇది బసవ పురాణాద్గృహీతము. (చూ. బ. పు. తృతీయాశ్వాసము). ఇందుఁ దాళ ప్రధానములగు దరువులు, ద్విపదలు, వచనములు, కొలఁదిగాఁ బద్యములు, ఏలలు, అర్ధచంద్రికలు, సం. చూర్ణిక, స్వరజతియుఁ గలవు. య. గా. అని పేర్కొనఁబడినది. కవి యటనట భావప్రౌఢిని గనఁబఱచియుండెను. కాని రచనలో శివకవులును జేయని దోషములు కొన్ని చేసియుండెను. — ఐతే, ఇనుపించె, అనుకూలవేణిరో, నా ప్రాణనాథుణ్ని, లోకతరబడి మొ. ప్రయోగములు; ఎ - యలకు, ఇ - విలకు యతి, ద్విపదలో నింద్రగణములకు బదులు పంచమాత్రాకములైన చంద్రగణముల ప్రయోగము - ఇట్టివి గ్రంథమంత ప్రాచీనము గాదని తోఁపఁజేయును.

ఒకపరి పెద్దాపురమునందలి శైవులందఱును త్రిపురాంతకము మీఁదుగా శ్రీశైలయాత్రకుఁ బోయినారఁట. అక్కడ శిఖరదర్శనము చేసికొని మల్లికార్జునమంటపమునఁ గూర్చున్నవేళ వారిలో బొప్పె బసవన్న వంశ వర్ధనుఁడును, మాచలి శంకరమ్మ యగ్రతనుజుఁడునైన పేరయ్యాచనమల్లు వీరకవి పఠింపఁగా బసవ పురాణము వినుచు నందలి ముగ్ధసంగయ్యకథ "యక్షగానంబైతె మెంతశృంగారముఁగ నుండునో" అని యనఁగా వీరకవియందులకుఁ బూనెనఁట. (ఇందు పేరయ్య రమణిపార్వతమ్మయు స్మరింపఁబడినది).

# 63. పులహరి ఫిరోజి

## సాత్రాజితీయము: ♦

కవి విషయము :— గుంటూరు మండలములోని సత్తెనపల్లిలో స్థిరపడిన యొకమహారాష్ట్రక్షత్రియ కుటుంబమునకుఁ జెందిన వా రీయన. వీరు ఛత్రపతిశివాజీ వంశీయులు. వీరి పితామహులైన సాహాజీ గారును, శివాజీ మనుమలైన సాహాజీగారును సమకాలికులు, బంధువులు నైయుండిరి. వారుక్రీ. శ. 1700 ప్రాంతము నందుండినవారు. ఫిరోజి కవిగారి జీవితకాలము క్రీ. శ. 1829 - 1889. వీరు బహు

♦ 1945 లో గుంటూరు వెంకటేశ్వర అండుకోవారు ప్రచురించిన 'శ్రీఫిరోజి ఋషిగ్రంథావళి' అను సంపుటమున నిదియుఁగలదు. ఆసంపుటమున నుపోద్ఘాతముగా శ్రీమహావాది వెంకటరత్నఁగారు వ్రాసిన గ్రంథకర్త జీవిత సంగ్రహమునుండి విషయమిందు గ్రహింపబడినది.

గ్రంథకర్తలు. వీరి కృతులలో విషయవైవిధ్యము, ప్రక్రియావైవిధ్యమునుగలదు. వీరనేక యక్షగానములును రచించి యుండిరని తెలియుచున్నది కాని యం దిప్పటికి లభించిన దీ సాత్రాజితీయ మొక్కటియే.

గ్రంథవిషయము :— ఇందు శమంతకోపాఖ్యానము, జాంబవతీ సత్యాకాళిందీ నాగ్నజిత్తీ భద్రాలక్షణా పరిణయ కథలు, నరకాసుర సంహారకథయు వర్ణితములు. వస్త్వైక్యము కొఱవడినది. కవి దీనిని "సాత్రాజితీ నాటకంబను యక్షగానంబు" అనిపేర్కొనెను. కాని యిందు నాటకీయత తక్కువ ఆఖ్యానశైలిపాలే యధికమై శ్రవ్యకావ్యమువలెనున్నది. ఇందు ప్రసిద్ధరాగ తాళములలో దరువులు, ద్విపదలు, పద్యములు, కంద గీతసీసార్ధములు గలవు. వచన ప్రయోగము క్వాచిత్కము. రచన చక్కనిది.

# 64. పోడూరి వేంకటరాజు

## సుకుమారీ పరిణయము : *

కవి విషయము :– ఆపస్తంబ సూత్రుఁడు, భారద్వాజ గోత్రుఁడు. శ్రీ రామయామాత్య పౌత్రుఁడు. వెంకటాచలమంత్రి పుత్రుఁడు. బుచ్చిరామయ, రామ మూర్తులకు సోదరుఁడు. ఇతని కృత్యంతరమగు రామలీలా విలాసము [1] నుండి యితఁడు విశాఖమండల విజయ

* ప్రా. లి. పు. భాం., ఆర్. నం. 440

1. ప్రా. లి. పు. భాం., ఆర్. నం. 612.

16

నగరాధి పతియగు విజయరామరాజాశ్రితుఁడనియు నితని నివాస మేనుగవలస (విశాఖ జి. చీపురుపల్లి తా. యనియుఁ దెలిసినది. మఱియు నందీతని వంశావళి విపులముగాఁ గలదు.[2] ఇతఁడు శివ రామాభ్యుదయ కర్తయగు పోడూరి పెదరామామాత్యుని యన్న గారి కోవవాఁడు. రామవిలాసము ప్రా. లి. పు. భాం., ప్రతి కవి స్వహస్త లిఖితము. లేఖన కాలము "ఆనంద నామ సంవత్సర చైత్ర శు. 15 గురువారం" గాఁ బేర్కొనఁబడినది. అది క్రీ. శ. 13-4-1854 తేదీ యగుచున్నది. అదే కవికాలము. సునిశ్చితము. ఆ నాఁటికి విజయనగరమున మూఁడవ విజయరామరాజు రాజ్యము చేయు చున్నాడు.[3]

గ్రంథ విషయము :— నారదుఁడు సృంజయ రాజపుత్రియగు సుకుమారినిఁ బెండ్లియాడిన పురాణకథ యిందలి వస్తువు. ఇదియుఁ గూర్మనాథకవి మృత్యుంజయ విలాసమువలె త్రిధాశ్వాస విభాగము కలిగి యవతారికలో యక్షగాన మనియు, నాశ్వాసాంత గద్యలలో శృంగార నాటకగేయ ప్రబంధమనియుఁ బేర్కొనఁ బడినది. ఇది "జనులు — తగిన వేషంబులన్ ధరియించి సభల సొగసుగాఁ దెలుప" ననువుపడునట్లు రచించితినని యున్నాఁడు కవి. ఇందు పాత్రలు "తెర బయలు దేరే దరువు" లు, "మాగధి యనే పరిహాసక వేషధారి" పాత్రలను బలుకరించుట, పాత్రలు స్వీయోదంతము జెప్పుట, పాత్రలు ప్రవేశింపఁగనే దేవతా స్తోత్రము చేయుటయు విశేషములు. ఒక్కచో హంగుదారుని ప్రసంగము గలదు. ఇందుఁ బ్రసిద్ధ రాగ తాళములలో

2. వివరములకు చూ. ప్రా. లి. పు. భాం., త్రైవార్షిక గ్రంథ దీపిక 4 వ భాగము — పుటలు 1549—54.

3. ఇతని రాజ్య కాలము 1848—1879 అని విశాఖ జిల్లా గెజిటీరులోఁ గలదు.

దరువులు, విరివిగాఁబద్యములు, ద్విపద, వచనము, కందాలంకారము, చూర్ణిక, దండకము మొ॥ రచనా విశేషములు గలవు. ఇందొకటుక ఘట్టము గలదు. సుకుమారీ విరహా వేదన ఘట్టమున మన్మథుని పాదు షాతో సరిపోల్చి ప్రశంసించిన దండక మత్యంతత మనోజ్ఞము. గ్రంథ మున నాటకీయత మిక్కుటము. రచన రసోత్కటము.

---

# 65. మరింగంటి భట్టరు రామానుజాచార్యులు

## శ్రీ రామ నాటకము: *

కవి విషయము :— శ్రీవైష్ణవుఁడు. మౌద్గల్యసగోత్రుఁడు. రామానుజాచార్య పౌత్రుఁడు. తిరుమలాచార్యపుత్రుఁడు. గంజాఁజిల్లా గుజ్జువాడ నివాసి. (చూ. ముద్రితప్రతి) ఈతఁడు దరువూరి అప్పలాచార్యులు, వారణాసి అచ్యుతరామకవి అనువారు తనకిరువురు శిష్యులు

---

* ప్రతులు :— 1 గౌతమీ గ్రంథాలయ తాళపత్ర ప్రతి నం. 98. అసమ గ్రము. శ్రీరామ నాటమను పేర నున్నది. కవిపెట్టిన పేరదే కాని లక్ష్మణుఁడు పునర్జీవితుఁడగుట వినిన రావణుని సంరంభ మిందలివిషయము. 2. ప్రా. లి. పు. భాం. ఆర్. నం. 966 బొమ్మలాట రామాయణమను పేరనున్నది. లక్ష్మణమూర్ఛకుఁ దరువాతికథ యిందుగలదు. 3. లక్ష్మణమూర్ఛయను పేరనిది 1908 లో మదరాసులో ఎద్దనపూడి సంజీవయ్యా అండుసన్సువారిచే మురహరి ము. శా. లో మొదటి కూర్పుగా ముద్రితము. ఇందు గ్రంథపరిష్కర్తల చేర్పులు మార్పులునుగలవు ఇందు విషయము లక్ష్మణమూర్ఛఘట్టమే కాక రామపట్టాభిషేకము వఱకును గలదు.

గలరనియు వారీగ్రంథ రచనలోఁ దనకుఁ దోడ్పడి రనియుఁ జెప్పి యున్నాఁడు. (గౌ. గ్ర. ప్రతి). ఈ వారణాసి అచ్యుతరామకవియే సురతాణీపరిణయ[1] మను ప్రబంధమును యీ రామానుజాచార్యుని ప్రేరణమున రచించెను. (అందీ రామానుజాచార్యుఁడు గుజ్జ్వాడాగ్రహార నివాసి, మ. భ. రామానుజాచార్య పౌత్రుఁడు తిరుమలాచార్య పుత్రుఁడు నని చెప్పఁబడుటయేగాక యీతని వైదుష్యప్రశస్తియు, వంశావళి ప్రశంసయు విపులముగాఁ గలదు. ఆ గ్రంథాంతమునఁ దద్రచనాకాలమిట్లు చెప్పఁబడినది. – "విరచింపంబడె నీప్రబంధము... శాలివాహన శకాబ్దిన్ రసాగక్షమాధర చంద్రాంచిత సంఖ్యకాంతరల సన్మానోన్నతానంద వత్సర సత్కార్తిక శుక్ల సప్తమిని భాస్వత్సౌరి వారంబునన్" అనఁగా శా. శ. 1776 – క్రీ.శ. 1854. మఱి తత్కృతి ప్రేరకుఁడగు నీ మరంగంటి భట్టరు రామానుజాచార్యుఁడా 1854 సం. న నుండెననుట సుస్పష్టము. ఇతఁడు గణచతుర్థ్యుపాఖ్యానాది ప్రబంధము లనేకము రచించినాఁడని సు. ప నఁ గలదు.

ప్రస్తుత గ్రంథవిషయము :– ఇతఁ డీ శ్రీరామనాటక మనుపేర రామాయణము నంతటిని రచించియుండెనో లేదో తెలియదు కాని యుపలబ్ధములగు ప్రతులలో లక్ష్మణమూర్ఛ ఘట్టమునుండి రామ పట్టాభిషేకము వఱకుఁగల యుద్ధకాండకథ యున్నది. వీరరస ప్రధానముంగు నీ గ్రంథసందర్భములకుఁ దగినట్లుయుద్ధసన్నద్ధుఁడగు ధీరోద్ధత నాయకుని గమనగాంభీర్యమును దలపించు ప్రౌఢరచనా పరిపాటి గల పద్యగద్యముల ప్రాచుర్యమిందుఁ గలదు. దరువులు విరళము. ప్రసిద్ధ రాగతాళములలో(హిందుస్తానీవి కూడ) నున్నవి. సంధి వచనములతోపాటు పాత్రల సంవాదాత్మక వచనములును దఱచుగలవు. వచ

1. వేగుజుక్క గ్రంథమాల ప్రచురణ – బరంపురము, 1932.

నములను వ్యాసపాఠాది భాషాసరళి గొంతగనున్నట్టును. అమరశ్లోకము లనేకము చేర్పబడినవి. తెనుగునం గదర్థ వివరణమును గలదు. ద్విపదలు కొన్ని గలవు. ఇందలి భాషయందును భావములందును జక్కని ప్రౌఢిగలదు. కాని దానికిం గొంతవఱకు భాస్కరరామాయణము మూలమైనది. కథకొంత పెంచఁబడినది. సరిక్రొత్త సన్నివేశములును గొన్ని కల్పింపఁబడినవి. ఇందు సూత్రధార ప్రసక్తి గలదు. అతఁడే ప్రస్తావన నడపినాఁడు (ముద్రితప్రతిలోని ప్రస్తావన పరిష్కర్తలచేర్పు). దీని నాథునికరంగస్థల నాటకముగాఁ దీర్చుటకుఁ బరిష్కర్తలు ప్రయత్నించిరి కాని మూలగ్రంథమునలె "సర్వంబు నేకాశ్వాసము" గనే యున్నది. అంకరంగ విభాగములు చేయఁబడ లేదు. ఇందలి సంధివచనము లట్లనే యున్నవి.) ఈ గ్రంథము తోలుబొమ్మలాటల కుపయోగింపఁబడుచుండినట్లు ముద్రితప్రతి పీఠికలోఁ బరిష్కర్తలు వ్రాసియున్నారు. ఇందలి అమరశ్లోకోదాహరణ వివరణము లుండుటఁజూడ నసలిది బొమ్మలాటల కొఱకే వ్రాయఁబడినదా యనిపించును. అది బొమ్మలాటల పరిపాటి.

---

# 66. దరువూరి అప్పలాచార్యులు

## ఐరావణ (త) చరిత్ర: ♦

కవి విషయము:— ఆత్రేయస గోత్రుఁడగు నృసింహార్యునకు శ్రీనివాస, జగన్నాథ, వెంగళ, సుందర నామధేయులు తనయులు. అందు

♦ ప్రా. లి. పు. భాం. ఆర్. నం. 426.

శ్రీనివాసార్యునకు నరసమ్మయందు నరసింహ, రంగ, జగన్నాథ నామధేయులు పుత్రులు, అందు రంగార్యునకు రంగాంబ యందీ అప్పలాచార్యులు, శ్రీనివాస, రంగార్య లక్ష్మణార్యులు పుత్రులు. ఇతఁడీ గ్రంథమునే తేటి పార్వతీశము ప్రోత్సాహమున సింహాద్రిపతి కంకితముగా రచించి యుండెను. దీనికిముందు సంస్కృతాంధ్రములందు మఱికొన్ని కృతులు రచించినాఁడఁట. ఈగ్రంథమునుండి యితని గుఱించి యెఱుఁగనగు విషయ మింతియ. ఇతఁడు శ్రీకాకుళ మండలము వాఁడనియు, శ్రీరామ నాటక కర్తయగు మరింగంటి భట్టరు రామానుజాచార్యుని శిష్యుడనియు, వారణాసి అచ్యుతరామకవి కతని సురతాణీ పరిణయప్రబంధ రచనయందుఁ దోడ్పడె ననియు నతనికి మాఁటట గురువనియు, నతనితో జంటగా లక్ష్మీనారాయణ విలాసమను యక్షగానమును రచించి యుండెననియు నాయాగ్రంథములనుబట్టి తెలియుచున్నది.* సురతాణీ పరిణయ ప్రబంధ రచనాబ్దము క్రీ. శ. 1854 అని మీఁద రామానుజాచార్యుల యుదంతమునఁ జెప్పఁబడినది. మఱి అప్పలాచార్యులు నప్పుడుండెననుట నిశ్చయము. ప్రా. లి. పు. భాం., ఆర్, నం. 437 సురతాణీ పరిణయ ప్రతివిలేఖకుఁడీ దరువూరి అప్పలాచార్యుఁడే. తల్లేఖన కాలము భావ జ్యేష్ఠ శుక్ల ద్వాదశి గురువారము. సు. ప. రచన 1854— ఆనంద సం. ఈభావ తరువాతిది కావలె. అది 1874. సు.ప. రచనలోఁ దోడ్పడునాఁటి కప్పలాచార్యులు సుమారు పాతిక ముప్పది యేండ్లవాఁడైన నై యుండును. అతఁడు క్రీ. శ. 1825-1875 సం.ల నడుమ నుండెనని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

గ్రంథ విషయము :— గాంధారి వ్యాసప్రోక్తమగు నైరావణ వ్రతము (గజ గౌరీవ్రతము) నాచరించి తన యదృష్టమునకు గర్వపడు

* చూ. ఇందలి నం. 65, 67 కవులయుదంతము.

చుండును. అది కుంతికి మనస్తాపహేతువగును. అది తెలిసి యర్జునుఁడు, దుర్యోధనాదులు తమ తల్లి వ్రతమునకు మంటి యేనుఁగునుమాత్రమే "తయారు" చేయించి యుండఁగాఁ దాను మింటియేనుఁగునే తెచ్చి తనతల్లి వ్రతము నెఱవేర్చుట, యిందలి కథ. ఇందు ప్రసిద్ధ రాగ తాళములలో దరువులు, ద్విపదలు, పద్యములును గలవు. గ్రంథాంత గద్య వినా యిది నిర్వచనము. యక్షగానమని పేర్కొనఁబడినది. శ్రవ్యకావ్యధోరణి నున్నది ప్రౌఢరచన కాదు. ఇది బహుశా అప్పలాచార్యుని బాల్యరచనయై యుండును.

---

# 67. దరువూరి అప్పలాచార్యులు వారణాసి అచ్యుతరామకవి

## లక్ష్మీనారాయణ విలాసము :*

కవి విషయము :— ఈ జంట కవులు శ్రీకాకుళ మండల వాస్తవ్యులు. ఆ మండలము నందలి శ్రీ కూర్మక్షేత్రస్వామి కంకిత ముగా, రామానుజాచార్యుని పౌత్రుఁడును, వేంకటలక్ష్మీనరంగార్యుల పుత్రుఁడు నగు కొండుపర్తి అప్పలార్యుని ప్రేరణమునను సాహాయ్య

---

* ప్రతులు : 1. ఆం. సా. ప., నం. 2648 (కాగితము)

2. ప్రా. లి. పు. భాం., ఆర్. నం. 762 (కాగితం)

3. రాజమండ్రి ఆంధ్రేతిహాస పరిశోధకమండలిలో నొక తాళ పత్ర ప్రతిగలదు. (వరద దెబ్బతిన్నది)

మునను బద్మ పురాణోక్త ప్రకారముగా నీ గ్రంథము నిద్దఱును గలిసి రచించిరి. ఇందుఁదమ గురువగు మరింగంటి భట్టరు రామానుజాచార్యుని స్మరించిరి. అతని శ్రీరామ నాటక రచనలోని యిరువురును దోడ్పడి నట్లందుఁగలదు. ఈ ల. నా. విలాసము ందీ కవుల పూర్వ రచన యగు సురతాణీపరిణయ పద్యకావ్య ప్రశంస వచ్చినది. కాని ల. నా. వి. వలె సురతాణీ పరిణయము జంటకవనము గాదు. ఇందలి గద్యలవలె నందలిగద్య లుభయ నామాంకితములు గావు. అది అచ్యుతరామ కవ్యుపజ్ఞముమాత్రమే. అందప్పలాచార్యుఁడు తనకు రెండవ గురువనియు, నా గ్రంథ రచనలోఁ దన కతని తోడ్పాటు గల దనియు మాత్రమే చెప్పినాఁడు.

అప్పలాచార్యుని విషయము పూర్వోక్తము. అచ్యుతరామ కవి గుఱించి యతని సురతాణీ పరిణయము నుండి యెఱుకపడు విశేషములు :— ఇతఁ డాపస్తంబ సూత్రుఁడు. భారద్వాజ గోత్రుఁడు. వారణాసి సాంబన పౌత్రుఁడు. ఎనమండ్ర రామయోగికి దౌహిత్రుఁడు. ఎఱ్ఱమకును నరసింహ కవికిని బుత్రుఁడు. రామయోగియనువాని కగ్రజుఁడు. (ఇతఁడు శ్రీకృష్ణ సుధారస మను నింకొక ప్రబంధమునుగూడ రచించి యుండి నట్లు తెలియుచున్నది.) ఇతని సురతాణీ పరిణయ రచనా కాలము క్రీ. శ. 1854* తదర్వాచీన మీ ల. నా. వి. బహుశా 1860—65 ప్రాంతమున రచింపఁబడియుండును.

గ్రంథ విషయము :— క్షీరసాగర మథన కథయు, లక్ష్మీనారాయణుల వివాహము నిందు వర్ణితములు. ఈ ల. నా. విలాసమున కనేక సందర్భములందు గోగులపాటి కూర్మనాథ కవి మృత్యుంజయ విలాసమే

* చూ. ఇందని మరింగంటి భట్టరు రామానుజాచార్యుల యుదంతము. (నం. 65)

యొరవడి యైనది. కథా ప్రణాళికలోను రచనా ప్రణాళికలోను మృ. వి. నకు సమానాంతరముగాఁ బయనించినది ల. నా. వి. అసలు గౌరీ కల్యాణ కథకును, లక్ష్మీ కల్యాణ కథకును బోలికలు లేవు. కాని యీ కవులు ప్రౌఢులగుటచే గౌరీ కల్యాణ కథకు సన్నిహితముగా లక్ష్మీ కల్యాణకథను ససందర్భముగా మలఁచినారు. ఇందు లక్ష్మియుఁ బార్వతివలెఁ బ్రియుని గూర్చి తపశ్చర్యకుఁ బూనుకొనును. ఆ సందర్భమున మృ. వి. న వర్ష హేమంత గ్రీష్మర్తువులు మూఁడును మూఁడు సీసములలో వర్ణితములు. ఇందును నా మూఁడేమూఁడు, సీసములలోనే వాని ఛాయలుగా వర్ణితములు. అందలి శివుని వలెనే విష్ణువును నిందుఁ గపటవటువగును. అందు భృంగియు శివుఁడు నెఱుకలసాని వేషములు వేయఁగా నిందు నారద నారాయణులు కొత్తెమ సాని వాలకములు దాల్తురు. ఇట్లే యీ కథాసందర్భానుకరణము. రచనలోఁగూడ మృ. వి. నుండి దరువునకు దరువు, సీసమునకు సీసము, ద్విపదకు ద్విపద, వచనమునకు వచనము, శ్లోకమునకు శ్లోకముగా నందలి మంచిపట్టెల్ల విడిచి పెట్టక, యొకప్పుడు వరుసయును దప్పక యందులో ననుకరణము నందులో మార్పునుగా ననుకరించినారీ కవులు. మృ. వి. న "ప్రత్యక్షమయ్యె" నని యున్న నిందు "సాక్షాత్కరించె" నని మార్పు. అంతేకాదు మృ. వి. వలెనే యిదియు మూఁడాశ్వాసములుగా విభాగింపఁబడినది; అవతారికలో యక్షగానమనియు, నాశ్వాసాంతగద్యలలో శృంగార గేయ ప్రబంధమనియుఁ బేర్కొనబడినది. ఇట్టి యను కరణము నీ కవులెందుకు చేయవలసి వచ్చినదో బోధపడదు. (వీరును గూర్మనాథకవియు నొక్కమండలము వారే. కూర్మనాథకవి వీరికి రెండు మూఁడు తరములు పూర్వుఁడు).

రచనావిషయమున మృ. వి. విమర్శయే దీనికిని జాలవఱకు సరిపడును. సలక్షణమైన భాషయుఁ బ్రసన్నమైన శైలియుఁ గలదు.

య. గా. కృతులలో నొక బృహద్గ్రంథము. కథ చతురముగాఁ బ్రపంచింపఁబడినది. శృంగార మంగిరసము, హాస్యమంగము. వర్ణన లనేకము సుదీర్ఘముగ సుందరముగఁ జేయఁబడినవి. చతుర సంవాదములుగలవు. జాతీయములు నన్యభాషా పదప్రయోగ విశేషములు ననేకము గలవు. ఇందుఁ బ్రసిద్ధ రాగ తాళ ధారాళములైన దరువులు (రాగములలో జయంతసేన విశేషము) ద్విపదలు, పద్యములును సమపాళముగా నున్నవి. అప్పగింతలు, సువ్వి, శోభనములు, లక్ష్మీకల్యాణము నను పెండ్లివేడుక పాటలు, శ్లోకములు, దండకచూర్ణికలును గలవు. సగము పద్యము సగము దరువునైన సీసార్ధ కందార్ధములు సీసాలంకార కందాలంకారము లను పేరఁ బ్రయోగింపబడినవి.

---

# 68. నింబాద్రి దాసుఁడు

## భల్లాణ చరిత్ర :*

కవి విషయము :— దాసరికులమువాఁడు. అంగన పౌత్రుఁడు. కమలాంబకుఁ వెంకటనరుసుకుఁ బుత్రుఁడు. కవి తన గ్రంథమున దీవెన నరసింహుని, సింబాద్రి యేగంటి నీలయుని, సింహాచల నరసింహుని స్మరించినాఁడు. ఆం. సా. ప. ప్రతివిలేఖనకాలము "రాక్షసనామ సంవత్సర భాద్రపద బ ౧౦ శుక్రవారం" అనఁగా క్రీ. శ. 5-10-1855

---

* ముద్రితము. ప్రచురణ వివరములు తెలియవు. అముద్రిత ప్రతులు :— 1. ఆం. సా. ప. నం. 3490.

2. ఆంధ్ర విశ్వకళా పరిషత్ప్రతి టి. 123/ఎస్. 71.

లేదీ. గ్రంథరచన మంతకుఁ బూర్వముకాని యెంతో పూర్వమై యుండదు.

గ్రంథ విషయము:— భల్లాణ కథ: పూర్వోక్తము. కాని యొక విశేషము. కవి సురాభాండేశ్వర కథ చెప్పి యందలి యీాడిగ దంపతులే పిదప జన్మమునఁ జల్లమా భల్లాణులైరని చెప్పినాఁడు. ఇందుఁ బ్రసిద్ధ రాగ తాళములలో దరువులు, ద్విపదలు గలవు. పద్యములు కందములు మాత్రము లెక్కకుఁ గలవు. నిర్వచనము. రచన బహుదోషజుష్టము. ఇం దాశ్వాస త్రయ విభాగము గలదు. యక్షగాన మని పేర్కొనఁబడినది.

---

# 69. కోవెల తిరువేంగడ దాసు

## తిరుమంగయాళ్వారు చరిత్ర*

కవి విషయము:— కోవెల వేంకటాచార్యుని పౌత్రుఁడు. నరసింహాచార్యుని నందనుఁడు. శ్రీరంగ తిరుమల శ్రీభట్టరార్యుని శిష్యుఁడు. ఇతని గ్రంథము శోభనాచల నరసింహస్వామి కంకితము. (శోభనాచల మనఁగా మంగళగిరికి సుజియొక పేరేమో; అదినృసింహ క్షేత్రమే. కవి నివాసమది కావచ్చును). ఈగ్రంథమును 'శేష భట్టరు అప్పలదాసుఁడు వ్రేంచేపు చేసుకున్న' దనియున్నది. ఆం. సా. ప. లోని రతిమన్మథవిలాసము ప్రతి (నం. 3120) చివర "శ్రీమాన్ శేషభట్టరు రంగాచార్యులు గారు రచించిన రతిమన్మథ

---

* ఆం. సా. ప. నం. 3019.

విలాసము వారి కుమారుఁడు అప్లాచార్యులు వ్రాసెను. శ్రీ మంగళాచల లక్ష్మీనృసింహార్పణమస్తు" అనియున్నది. ఇతండును పై అప్పలదాసుఁడు నొకఁడే కావచ్చును. అగుచో నా రంగాచార్యులు క్రీ. శ. 1800 ప్రాంత మందుండిన వాఁడుగా నూహింపఁబడినందున * నాతని పుత్రుఁడగు నప్పలాచార్యుఁడు 1830 - 40 సం.ల ప్రాంతమున నుండి యుండును. అతఁడు " వేంచేపు " చేసికొన్న యీతిరుమంగయాళ్వారు చరిత్రరచన మంతకుఁగొంత పూర్వపుది కావలెను. ఇవి యన్నియు నూహాలపై నూహాలు. (ఇవి యథార్థములు కాకపోవచ్చును. కాని భావిపరిశోధన కుపస్కారకములు కావచ్చునని యిట నుటంకింపఁబడినది.) కాని రచనా రీతినిబట్టి చూచినను నిది యంత ప్రాచీనరచనగాఁదోఁపదు. (నామట్టునకు నాకిప్పటికిది క్రీ. శ. 1800 1850 నడుమ రచింపఁబడినదిగాఁ దోఁచును. ఈయూహ నొకరు గ్రహింప నక్కఱ లేదు. నాయూహ తెలుపుకొంటిని. అంతియ).

గ్రంధ విషయము :- పన్నిద్దరాళ్వారులలో నొకఁడగు తిరుమంగయాళ్వారు పూర్వచరిత్ర మిందు వర్ణింపఁబడినది. (అది ఆచార్య సూక్తిముక్తావళి, దివ్యసూరి చరిత్రము, గురుపరంపరా ప్రభావము మొ. గ్రంథము లందుఁగలదు.) ఇందలిది సలక్షణమైన భాష. సరళమైన రచన. గ్రంథము సగపాలు పద్యములే. కడమభాగముప్రసిద్ధ రాగ తాళముల నున్న దరువులు, ద్విపదలు, కొలఁది వచనములును. తమాము, కితాబు మొ. ఉర్దూ పదప్రయోగములు కొద్దిగలవు. మృత్యుంజయ విలాసమువలె నవతారికలో యక్షగానమనియు, నాశ్వాసాంతగద్యలో (సర్వంబునేకాశ్వాసము) 'శృంగార నాటక గేయప్రబంధ' మనియుఁ బేర్కొనఁబడినది.

---

* చూ. ఇందలి నం. 47 కవి చరిత్ర.

# 70. కోవెల రాఘవదాసు

## ప్రణయ కలహ కలాపము: ♦

కవి విషయము :— ఇతఁడీ ముందు వర్ణితుఁడైన కోవెల తిరు వేంగడాచార్యుని కగ్రతనయుఁడు. ఇతని తల్లి రంగమ. గురువు శ్రీ రంగరాజభట్టరు. ఇతఁడును దండ్రివలె శోభనాచల నరసింహ భక్తుఁడే. ఇతని గ్రంథమును శేషభట్టరు అప్పలదాసుఁడు "వేంచేపు" చేసికొన్నదే కావున నితఁడును క్రీ. శ. 1800 - 1850 ప్రాంతమువాఁడై యుండిన నుండవచ్చును.

గ్రంథవిషయము :— ఇది గిన్నెడ మడవారను తిరువాయిముడి నుండి గ్రహింపఁబడినదఁట. శ్రీకాంతుఁడొకనాఁడు శ్రీకాంత నెడఁబాసి భూకాంత కడకేఁగి మగిడి యిందిరామందిరమునకు రాఁగా నామెయతని వాలకము చూచి యలుక చిత్తగించినది. వెన్నుఁడు వెనుదిరిగినాఁడు. అపుడింక నామె విరహావేదన. హరి యామె కడకొక యెఱుకతను బంపెను. ఎఱుకత కోరిక లీడేరునని చెప్పి యరిగినంత హరివచ్చి తరువాయి దీర్చినాఁడు. ఇది యిందలికథ. ఇది కడు చిన్న కృతి. సలక్షణమైన భాషయు సరళమైన రచనయుఁగలది. ఇందు దరువులు, ద్విపదలు, పద్యగద్యములు గలవు. శృంగార నాటక గేయ ప్రబంధ మని పేర్కొనఁబడినది. (ఇందలి ఎఱుకఘట్టమున మృత్యుంజయ విలాస మందలి దరువొకటియిందు యథాతథముగా నున్నది.)

---

♦ ఆం. సా. ప., నం. 3019.

# 71. బోడిచర్ల సుబ్బకవి

కవి విషయము :— ఇతఁడు కర్నూలు మండలకవి. నందవరీక బ్రాహ్మణుఁడు. కుత్సనగోత్రుఁడు. మిక్కిమరి రామాయణము,[1] ప్రహ్లాదనాటకము[2] ననునవి యితనికృతులు. రెండిటను గరుడాచల నరహరి ముద్రలున్నవి. ప్రహ్లాదనాటక గ్రంథాంతద్విపదలో నితఁడు హనుమంతరాయని కప్పయైన లక్ష్మాంబ కగ్రసూనుఁడని మాత్రము తెలియవచ్చినది. లక్షణాపరిణయ య. గా. కర్త మఱియొక సుబ్బకవి గలఁడు — ఇరువురకు నింటిపేరు స్థలకుల గోత్రములును సమానముకాని యతఁడు వేఱు. అతనిపూర్తిపేరు బొడ్డుచర్ల వెంకటసుబ్బయ్య. ఇతఁడు త్తసుబ్బయ్య. అతనితల్లి వెంకమ్మ. ఇతనితల్లి లక్ష్మమ్మ. అతని గ్రంథము భద్రగిరి వాసముద్రగలది. ఇతనిగ్రంథములు గరుడాద్రినరహరి ముద్రగలవి. ఇతరాధారము గన్పట్టు దనుక నిరువురు వేఱని పరిగణించుటయే సమంజసము.

సుబ్బకవి రామాయణమును 1910 లోఁ బ్రచురించిన యతఁడతని పౌత్రుఁడే అనఁగా సుబ్బకవి కాలమంతకు సుమారఱువది యేండ్లు వెనుకకుఁ బోవును. సుబ్బకవి రామాయణమునఁ బూర్వకవి స్తుతిలో "వెంగాంబికను" స్మరించి యుండెను. ఆమె 1840 ప్రాంతమునుండిన తరిగొండ వెంగమాంబయే కావచ్చును. ఇతని ప్రహ్లాద చరిత్రలో శుక్రాచార్యుల పంచాంగప్రసంగమున ఈశ్వరనామసంవత్సరము

---

1. బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు 1910 లో ముద్రితము. ప్రచురణ కర్త:— "గ్రంథకర్తగారి పౌత్రుండగు" బోడిచర్ల వెంకటరావు. (ప్రథమ రాత్రి కథమాత్రమే ప్రచురితము)

2. మదరాసు "కాటేజి ఇండస్ట్రిస్ పబ్లిషింగ్ హౌస్" ప్రచురణ, శ్రీలక్ష్మీ విలాస ము. శా. 1948.

పేర్కొనఁ బడినది. అది 1877 లోఁబడిన ఈశ్వరయే కావచ్చును. సుబ్బకవి 19 వ శతాబ్ధి మూడవ పాదముననుగొంచె మిటునటు నుండె ననుట నిశ్చయము.

## (మిట్టేమరి) రా మా య ణ ము :

మిట్టేమరి పురధాముఁడైన కోదండరామునిఁగూర్చినది. ముద్రిత ప్రతివెనుకనున్న ప్రకాశకుల సూచననుబట్టి సుబ్బకవి రామాయణము నంతటిని నాల్గురాత్రుల ప్రదర్శనమునకుఁ బనికివచ్చునట్లు రచించెనని తెలియవచ్చుచున్నది. అందు "మొదటిరాత్రి కథ" మాత్రమే ప్రచురింపఁబడినది. ఇది బాలకాండ కథ. కవి తానిది "నృత్తగీత కలన" రచించితిననెను. ఇందలి యెత్తుగడచిత్రమైనది. గణపతి సరస్వతులు తమస్తుతుల వెంటవచ్చి యీ "రామనాటక నటనాభిరాము" లగు నటులు నాశీర్వదింతురు. తరువాత నారదుఁడువచ్చి తాను "ఫలానా" అని, బాలకాండ కథాసంగ్రహము చెప్పి భాగవతులను (నటులను) దీవించును. తరువాత "తలారి గురికాఁడు" (కటికవంటిపాత్ర సభ వారికి దశరథాగమనమును హెచ్చరింపవచ్చును. ఇందుఁ బాత్ర ప్రవేశ కథానుసంధాన సూచనలు గలవు. కొన్నిపాత్రలు ప్రవేశింపఁ గనే స్వయముగాఁ దమపరిచయ మొనర్చుకొనుటయుఁ గలదు. సూత్ర ధారుఁడు పాత్రను సంబోధించుట యొక్కచోఁ గలదు. అది మంత్రసానిని బలుకరించిన సందర్భము. ఇందు ప్రసిద్ధరాగతాళములలో దరువులు, ద్విపదలు, పద్యములు, వచనములు, నలుగుపాట, శోభనము గలవు. సంధివచనములు, వచనములందు సంభాషణలును గలవు. రచన చాల నాటకోచితముగ నున్నది. అంత సలక్షణముగ లేకపోయినను, సరస ముగనే యున్నది. కవి దీనిని వాల్మీకిరామాయణమును విని "పామరు

లానంద మంగ, సంగీత సాహిత్య సరసప్రసంగ, సంగతిచే సల్పు సరస నాటక" మని యున్నాఁడు.

## ప్రహ్లాద చరిత్ర:

కథ ప్రసిద్ధము. ప్రహ్లాదుని తల్లి పేరు లీలావతియని భాగవతము. సుశీలయని సుబ్బకవి వ్రాసెను. ఇందు గ్రంథారంభమునఁ గటికవాని రాక గలదు. వాఁడు హిందీ తెలుఁగు కన్నడములలోఁ బ్రసంగించి యుండుట విశేషము. ఇందుఁ బాత్రప్రవేశ సూచనలు, పాత్రలు స్వవిషయమును జెప్పుకొనుటయుఁ గానఁబడును. ప్రసిద్ధ రాగతాళములతో దరువులు, ద్విపదలు (ద్విపదకును నీలాంబరిరాగ ముదాహరింపఁబడినది), పద్యములు పరకీయములు, (పోతనగారివి — కవి చెప్పి గ్రహించినాఁడు) స్వకీయములును, వచనములు, దండకముల మొ. గలవు. సంభాషణ లెక్కువగనే యున్నవి. రచన యొకమోస్తరు. యక్షగానమని పేర్కొనఁబడినది.

---

# 72. పడకండ్ల గురురాజకవి

ఇతఁడు బళ్ళారి మండలకవి యనియు, 1860 ప్రాంతమున నుండినవాఁడనియు, నితఁడు పద్మావతీ పరిణయము, అనిరుద్ధ చరితము నను నాటకములను రచించియుండెనని యీతని శేషధర్మములను గ్రంథమునుండి తెలియుచున్నదనియు ఆంధ్రకవుల చరిత్రమునఁ గలదు. ఆ నాటకములు ప్రాయికముగా యక్షగానములు కాఁదగును. అవి యలభ్యములు.

---

# 73. కాణ్టంబాక కేశవాచార్యులు

కవి విషయము :– హారితసగోత్రుఁడు. కాణ్టంబాక శ్రీ రాఘవాచార్యుని పుత్రుఁడు. ఇతఁడు భూతపురీశుని కంకితముగా రెండు యక్షగానములను రచించియుండెను – రామానుజవిజయము (1), పతి వ్రతా మాహాత్మ్యము (2). మొదటి దానిని కవి తాను హారితస గోత్రుఁడును, అప్పళాచార్య పుత్రుఁడు నైన "చెంగోలం నృసింహార్య మత్సఖుని మతిమంతు నతని యనుమతిం జెప్పినాఁడ" నని యున్నాఁడు. (ఆశ్వాసాంతమున). ఈ గ్రంథము "చంగోలు నరసింహాచార్యుల వారి వర్తమానరత్నాకర మను స్వకీయ ముద్రాక్షరశాలయందు 8-5-1858 న అచ్చువేయించి ప్రకటింపబడియె" నని ముఖపత్రమున నున్నది. రెండవ గ్రంథమున నితని రామానుజ విజయ యక్షగాన రచనయు భార్గవ పురాణాంధ్రీకరణమును బేర్కొనఁబడినవి. అది కవి తన గురువగు సచ్చిదానందేంద్ర యోగీశ్వరు నాదేశమున రచించితి నని యున్నాఁడు. తన్ముఖపత్రమున నది "...కాణ్టంబాక రాఘవాచార్యులుగారి కుమారుఁడైన కేశవాచార్యులవారిచే నూతనముగా రచియింపఁబడి...29-10-1860 తేదీన భువనగిరి రంగయ్యసెట్టిగారి జ్ఞాన సూర్యోదయ మనే స్వకీయ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁ బడియె" నని యున్నది. కాఁగా కవి 1860 ప్రాంతమునం దుండె ననుట సునిశ్చితమైన విషయము.

**రామానుజ విజయము :**

ఇది విశిష్టాద్వైత మత సుప్రతిష్ఠాపకుఁ డగు శ్రీమద్రామానుజాచార్యుని జనన ప్రకారము, యాదవ ప్రకాశునికడ నతని విద్యా

భ్యాసము, యామునాచార్యులతో నతని సమావేశము, నతని సంసారము, సన్న్యాసాశ్రమము, బీబినాంచారితో సుఖించుచున్న యాదవాచలస్వామి రామప్రియుని ఢిల్లీనుండి యాదవాద్రికిఁ దోడ్తెచ్చుటయుఁ దాను శ్రీరంగమున శిలారూపముగా నర్చావతారమై నిజధామమున కేఁగుటయు నను కథలు గలవి. కథా ప్రధానమైన దీయక్షగానము. గ్రంథకర్తకుఁ గథనపుఁబట తెలియదు. అవాంతర కథానుసంధాన చాకచక్యములేదు. రచన యొకమోస్తరు. ఇందు దరువులు తాళ ప్రధానము లెక్కువ. రాగప్రధానములు గొలఁది. ద్విపదలు, జాత్యుపజాతి పద్యములు, కొలఁది సంధివచనములు, శోభనము, తలంటు, నలుగు, లాలిపాటలు, దండకము, అర్ధచంద్రికలు, కందార్థములును గలవు. ఇది రెండాశ్వాసముల కృతి.

## పతివ్రతా మాహాత్మ్యము :

నారదునకు బ్రహ్మ చెప్పినట్లుగా నిందుఁ బతివ్రతా లక్షణములును, లక్షణా, అనసూయ ఫ్రుత్రి సునందిని, నాళ్రిత్రి, దాక్షాయణి, సీత మొదలగు మహాపతివ్రతల చరిత్రములు నిందుఁ బ్రసక్తములు. ఇందు తాళ ప్రధానములగు దరువులు, ద్విపదలు, కందార్థములును గొలఁదిగాఁ బద్యములును గలవు. నిర్వాచనమని చెప్పవచ్చును. ఆఖ్యానశైలీ ప్రచురము. రచనప్రౌఢమునుగాదు. పేలవమునుగాదు. రామానుజ విజయ రచనకంటె మేలుతరము. ఇది మూఁడాశ్వాసములుగా విభక్తము. తన యీ కృతులను రెండింటిని యక్షగానములని పేర్కొనినాఁడు కవి. (పతివ్రతా మాహాత్మ్యము 1922 లో మదరాసు శశిరేఖ ము. శా. లో మఱల ముద్రితమైనది.)

# 74. వేదాల తిరునారాయణాచార్యులు

ఇతఁడు వేదాల వేంకట నృసింహాచార్యుని పౌత్రుఁడు. వేంకటాచార్యుల పుత్రుఁడు. బుక్కపట్టణము తిరువేంగడాచార్యుని శిష్యుఁడు. ఇతని శకుంతలా నాటకము గ్రంథారంభమున "గ్రంథ స్వాతంత్ర్యాధికారినిఁ దెలుపు ద్విపద" యొకటి యేదుష్ణమే గలదు. అందీ గ్రంథ స్వాతంత్ర్యమును గవి తానే స్వయముగ చతురంగ పట్టణము పార్థసారథి యనునాతని కిచ్చివేసినట్లు చెప్పియున్నాడు. ఆ పార్థసారథయ్యయే 6-5-1864 తేదీని సాలవ చిన్నస్వామిరాజుగారి ప్రచండ సూర్యాలోక ముద్రాక్షరశాలయందు ముద్రితమైన యే తద్గ్రంథమునకుఁ బ్రచురణకర్త. అనఁగా, కవియు నప్పటివాఁడే యని బుజువగుచున్నది. ఇతఁడీ శకుంతలా నాటకమునేకాక ప్రహ్లాద నాటకమును గూడ రచించియుండెను. (ప్రచురణ :— 1. ఆది విద్యా తరంగిణి ము. శా., మదరాసు, 1890. 2. శ్రీరంగ విలాస ము. శా. మదరాసు, 1904. ఇందును నీ గ్రంథస్వామ్యము చతురంగ పట్టణము పార్థసారధికిఁ జెందవలెనని కవి వ్రాసిన ద్విపద గలదు.)

రెండింటను గథ ప్రసిద్ధము. శ. నా. కథా ప్రణాళిక కాళిదాసీయము ననుసరించి కాక భారత కథా సంవాదిగా సాగినది. రెండింటను కటికము పాత్ర (ప్ర. నా. న వీఁడు హిందీలోఁ బ్రసంగించుట కాననగును), పాత్రల తెర ద్విపదలు (తెరలోనుండి సభ వారికిఁ బాత్రలు దమ యుదంతముఁదామై తెలియఁజేయు నట్టివి), పాత్రలు తెర వెడలు దరువులు (హంగుదారులు పాత్ర ప్రశంసాత్మకముగాఁబాడు నట్టివి), సంధి వచనములును గలవు. రెండింటను బ్రసిద్ధకర్ణాటక హిందూస్తానీ రాగ తాళములలో దరువులు, ద్విపదలు, పద్యములు, కంద సీసార్ధ

ములు సంధి వచనములే కాక సంధి ద్విపదలు, వచనములలో దరువు లలోఁబాత్రల సంవాదములు, నక్కడక్కడ శ్లోకములు తేవారము లును గలవు. రెండిటను రచన నాతి ప్రౌఢము, నాతి పేలవము. శకుం తలా నాటకము శ్రీకాకుళపురి వల్లభరాయని కంకితము. ప్రహ్లాద నాటకము శేషశైలధాముని కంకితము. రెండిటను, దరువు చివర నాయా దేవరల ముద్రలు గలవు.

---

# 75. చిలకమర్తి నారాయణాచార్యులు

ఇతఁడు భాగవత దశమస్కంధ పూర్వ భాగ యక్షగానమును రచించెనని శతకకవుల చరిత్రవలనఁ దెలియవచ్చినది కాని గ్రంథ మిప్పు డుపలబ్ధము గాదు. ఇతఁడు పిఠాపురమునకుఁ జేరువనున్న కొమర గిరివాసుఁడని తోఁచుచున్న దనియుఁ బల్లేరుమూఁడి వేంకట గురుని కడ నీతఁడనేక విద్యలభ్యసించెననియు, నితఁడు గణోదయ ప్రబంధ, వేణు గోపబాల శతకములకుఁ గర్తయనియు, నీతని శతకరచనా కాలము శా. శ. మాని దంతావళ మానీశకువల - రక్తాక్షి = 1787 - క్రీ. శ. 1865 అనియు శ. క. చ నుండి యితని యుదంత మెఱుఁగ నగును.

---

# 76. నల్లపాటి శేషాచలదాసు

## అవనిజా చరిత్ర :

కవిగుఱించి విశేషములేమియుఁ దెలియవు. ఇతనిగ్రంథము "నే. వెంకటసుబ్బాశాస్త్రులవారి సరస్వతీ ము. శా. యందు బందరు సంకా సుబ్రహ్మణ్యముగారిచే నచ్చువేయించి ప్రచురింపంబడియె". ప్రచురణ తేది 20-9-1869. కవి యానాఁటివాఁడేకాని యంతకించుక పూర్వుఁడుకాని యైయుండును. సీత తన వనవాసాదికముగూర్చి శ్రీరామునితోఁ జెప్పుట యిందలి విషయము. ఇందుఁ బ్రసిద్ధ రాగ తాళములలో దరువులు, పద్యగద్యములును గలవు – రచన మంచిదే.

---

# 77. తిరునగరి అనంతదాసు

## రామనాటకము (కుశలవనాటకము)♦

ఇతఁడు తిరునగరి కేశవార్యుని పుత్త్రుఁడు. పల్లేరుమూడి శింగరాచార్యుల పుత్త్రుఁడైన రామానుజాచార్యునకు శిష్యుఁడు. ఇతనికి సాతాని అనంతయ్యగారని స్థానిక వ్యవహారము. ఇతఁడు నెల్లూరు మండలమునందలి నరసాపురము (నరసింహపురము) వాఁడనియు నతఁడీ రామనాటకమునేకాక హరిశ్చంద్ర ప్రహ్లాద నాటకాదులును రచించి

♦ కోళప్పన్ జేరి లక్ష్మణమొదలారివారి జీవరత్నాకర ముద్రాక్షరశాల, మదరాసు, 1906.

యుండెననియు, సమకాలికులవాఁడుగను 1873 లో ముద్రితమైన నెల్లూరుజిల్లా మాన్యూవలులోఁ (పుట 698 - 701) చేర్పఁబడెను.

ఇతని రామనాటక మొకటే యిపు డుపలబ్ధము. ఇందలి కథ కుశలవుల చరిత్ర. ఇది కుశలవనాటకమను పేర మిగులఁ బ్రసిద్ధివడసినది. ఇది కవిచే నాట్యోద్దిష్టమైనది. చక్కని సంవాదశైలిగలది. రచన చక్కనిది. ఇందుఁ బ్రసిద్ధ రాగ తాళములలో దరువులు, ద్విపదలు, పద్యములు, కంద సీస వృత్తార్థములు, సంధివచనములును గలవు.

## 78. కొండూరి సీతారామకవి

### (మట్టినగర) సావిత్రీనాటకము:*

ఇతఁడు కొండూరు వేంకటేశ్వర వేఁకమాంబల పుత్రుఁడు. ఇతఁడు నెల్లూరు జిల్లా వెంగల్లు వాస్తవ్యుఁడనియు, శివ పారిజాతము, ఇలావతీ చరిత్ర, కృష్ణవిలాసము లతని కృత్యంతరము లనియు నెల్లూరు జిల్లా మాన్యూవలు వలనఁ దెలియుచున్నది. (పుట 698 – 701). ఇవియు య. గా. నాటకములై నఁగావచ్చును గాని యిపుడుపలబ్ధములు గావు.

ఇతని సావిత్రీ నాటకము ఇందూరి నరసింహా రెడ్డి ప్రోత్సాహమున మట్టినగర చెన్నరాయని కంకితముగా రచింపఁబడినది. ఇందుఁ బ్రసిద్ధమగు సావిత్రీ చరిత్రము మూఁడు రాత్రుల ప్రదర్శనమునకుఁ

* ముద్రితము :— అమెరికన్ డైమండు ప్రెస్., మదరాసు. 1928.

గాను విశేషముగఁ బ్రపంచింపఁబడినది. ఇందుఁ బ్రసిద్ధ రాగ తాళము లలో దరువులు, ద్విపదలు, పద్యములు, కందార్థములు, సంధి వచనము లును గలవు. ద్విపదలకును రాగము లుదాహరింపఁబడుటయు, ద్విపదార్థములు, పద్యములలో గోమూత్రికా రథాది బంధములును విశేష ములు. రచన సంవాదశైలీ ప్రచురము. ప్రౌఢము.

# 79. విజయనగరపు చెంగల్వరాయకవి

ఇతఁడు విజయనగరవంశోజ్జ్వలుఁడనియుఁ దిరుమల తాతాచార్య శిష్యుఁడనియు మాత్రము రాయపుర చెన్న ముద్రతోనున్న యితని గొల్లకథ, ఎఱుకల కథ (తం. స. మ. కే. నం. 485, 486) అను గ్రంథముల వలనఁ దెలియుచున్నది. ఇతఁడు మదనగోపాల శతకమును రచించినట్లు శ. క. చ. వలనఁ దెలియుచున్నది. ఆ శతకమున నితఁడు వెంకటగిరి విభుని పుత్రుఁడని తెలియుచున్నది. ఇతని కాలము 1871 ప్రాంతముగా ఆం. వా. సూ. పీఠిక 93 వ పుటలోఁ బేర్కొనఁబడినది. అది యథార్థమన లేము. ఇతఁడింకను గొంత పూర్వుఁడు గాఁదోచును. (శ. క. చ. లో. నితని కాలనిర్ణయము గా లేదు.)

గొల్లకథ :

ఇందుఁ దధ్రకమును విక్రయింపవచ్చిన గొల్లభామ రాయపుర గృహిణులతోఁదమ గొల్లజాతి గొప్పదనమును జల్ల ప్రాశస్త్యము నుగ్గ డించును. తమ కాలము తెగలు నాచారములు నేకరువు పెట్టును.

పిదప ఘట్టమగు సుంకరి కొండడు వచ్చును. నాఁడు సుంకము గాని తత్ప్రత్యామ్నాయముగాఁ జుంబనము గాని యిమ్మని మొత్తిడిచేయును. ఆమె తన యత్తను పిలిచెదనని బెదరింపఁజూచును. వాఁడసాధ్యుఁడు. "గుత్తలోఁగడను మీ యత్తయు" ననును. ఇదే కథ. ఇందు దరువులు, ద్విపదలు, గద్యపద్యములు నెక్కువగాఁ గలవు. సంధి వచనములు కొద్ది. సంవాదము లెక్కువ. కథ జరుగుపాటు తక్కువ. రచన సరసమైనదే.

### ఎఱుకల కథ:

విరహిణి యగు సత్యభామ కడకు వలుప యాంసతి సరస్వతి "కొరవంజి వేషమిమ్ముగా ధరియించి" వచ్చును. ఎఱుకల కులాచారములఁ గూర్చి దీర్ఘముగా నుపన్యసించును. సాముద్రిక శకున శాస్త్ర ప్రసంగము చేయును. తాను తిరిగిన దేశముల, కొలిచిన దేవరల పేర్లేకరువుపెట్టును. సత్య ఖిన్నతకు సన్నిహితమైన నారదానీత పారిజాత వృత్తాంతము నెఱుక చెప్పును. కృష్ణుఁడు వచ్చి యామె కోర్కె నెఱవేర్పనున్నాఁడనియుఁ జెప్పును. ఇందు దరువులు, ద్విపదలు, పద్యములు, శ్లోకములు, చూర్ణికలును గలవు. రచన సరసమైనది.

---

# 80. బెహరా అప్పల నరసింహులు

### ధ్రువోపాఖ్యానము:

ఇతఁడు బెహరా జంపనయ్య మనుమఁడు. వెంకాంబ, ఆదినారాయణలకుఁ బుత్రుఁడు. నివాసము మహేంద్ర పర్వత ప్రాంతమున,

మహేంద్ర తనయానదీ తీరమున శ్రీకాకుళమండలమున మందసా దగ్గరనున్న వేంకటరాయపురము.

ఈ గ్రంథము "కవి యిష్టానుసారంబుగ నిశ్చింత తేవప్పెరుమాళ్ళయ్యగారిచేతఁ బరిష్కరింపించి, తత్తదవసరోచిత ప్రతిమలను జేర్చి పిళ్ళారిసెట్టి రాఘవయ్యనాయని వారి స్వకీయ భారతీ నిలయ ముద్రాక్షరశాలయందు 5–6-1872 తేదీన ముద్రింపించి ప్రకటింపఁబడియె" నని ముద్రితప్రతి ముఖపత్రమునఁగలదు. ఆ 1872 నాఁటి గ్రంథ పరిష్కరణ ముద్రణములు కవి యిష్టానుసారముగా సాగిన వనఁగాఁ గవి యెట్లును నప్పటివాఁడే యగును గదా.

ఇందలి కథ ప్రసిద్ధము. ఇందు జరుగఁబోవు సంఘటనలెల్ల ముందుగనే ప్రత్యేక శీర్షికల ద్వారా సూచింపఁబడినవి. పాత్రలు తెర లోనికి వచ్చుట, తెర బయల్వెడలుట, "మాధవి వేషగాడు" ప్రశ్నలడుగుట, పాత్రలు తమ యుదంతమును జెప్పుట, ఉత్తమ పాత్రలు ప్రవేశించునపుడు తెరలో నుండి దైవస్తుతి చేయుట మొ॥ విశేషములు గలవు. ముఖారి ప్రముఖ రాగములలో దరువులు, ద్విపదలు, సీస గీతములు, సీస కందార్థములు నొకదానికంటె నొకటి యధికతరముగ వాడఁబడినవి. సంధి వాక్యములు పద్యగద్యములు రెంటను గలవు. సంవాదశైలి యెక్కువ. ఇందుఁ జూర్ణికయు 'రాగ వరుస' లో నడిపింపఁబడినది. దరువులలో ముద్రలు గలవు. రచన యొకమోస్తరు. నాటక ప్రబంధమని పేర్కొనఁబడినది.

---

# 81. ఉప్పులూరి వీరరాఘవుఁడు, గంగాధరుఁడు

**భామకలాపము:** ♦

ఈ జంటకవులు "కోటిపల్లి" యొద్దనున్న కొప్పాకపుర వాస్తవ్యులఁట. అది విశాఖమండలమందు సర్వసిద్ధితాలూకాలో వరాహనది యొడ్డున నున్న ఏటికొప్పాక. అందుప్పులూరి వీరరాఘవ కవి తండ్రిగురుమూర్తి, తాతగంగన్న యనియు సిద్ధముఁ బేర్కొనఁ బడినది. ఈ వీరరాఘవులుగారు, గంగాధరంగారును సన్నిహితజ్ఞాతు లనియు, నిప్పటికి సుమారు వందసంవత్సరముల క్రిందటివారనియు— నేటికొప్పాక ప్రాంతమువారిని "వాకబు" చేయఁగాఁ దెలిసినది. ఇప్ప టికిని వీరరాఘవ గంగాధర కవులపౌత్రులు తత్తన్నామధేయులే యా యూర నున్నారఁట. అనఁగా నీజంట కవులు 19 శతాబ్ది యుత్తరా ర్ధమున నుండి యుందురని చెప్పనగును.

గ్రంథ మసమగ్రము. ఉన్నంతలో శ్రీకృష్ణుఁడు నర్మసచివుఁ డైన "మాధవుని" ద్వారా సత్యభామకు లేఖ నంపించుటయుఁ బిమ్మట "రుక్మిణీవేషకలాప" మను నవాంతరశీర్షిక క్రింద కృష్ణాన్వే షిణియై వచ్చిన రుక్మిణి "మాధవి" తో స్వవిషయమును జెప్పుట యుఁగాననగును. ఇందు దరువులు, ద్విపద, మంజరి, పద్యములును గలవు. మంజరిలోఁ బ్రాసయతి పాటింపఁ బడినది. రచనయొక మోస్తరు.

---

♦ ఆం. సా. ప. నం. 4527.

# 82. దూపాటి శేషాచార్యులు

**శాకుంతల నాటకము :** *

లోహితాన్వాయ వైష్ణవుఁడగు పట్టాభి రామాచార్యులకును రాఘవాంబకును వేంకటరత్నమాచార్య, వేంకటాచార్య, కొండమాచార్యులను పుత్రులు గలిగిరి. అందు కొండమాచార్యులకు రంగమ యందు తిరుమల, వరద, నరసింహ, పట్టాభిరామ, శేషాచార్యులను వారు పుత్రులు. ఆకడగొట్టువాఁడే యేతద్గ్రంథకర్త. ఇతఁడు శ్రీశైలాన్వయ సింగరాచార్యుని శిష్యుఁడు. ఈతఁడు 1871 సం. నకుఁ బూర్వుఁడని శ. క. చ. (చూ. పుట 421 – దూపాటి తిరుమలాచార్యుని చరిత్ర). వావిళ్ళవారి ప్రచురణ (1926.) యగు భక్తి శతక సంపుటము ద్వితీయ భాగమునఁగల దూపాటి తిరుమలాచార్యుని ముకుందశతకము నకుఁ బీఠిక వ్రాయుచు శ్రీ శేషాద్రి రమణ కవులు "ఈకవి నివాస స్థానము బాపట్లకుఁ బడిమొళ్ళ దూరమున సముద్రతీరము నందున్న ఓడరేవు. ... ఈయన తన యెనుఁబదవ యేట పరమపదవి చేరెను. ఈకవి సోదరుఁడగు దూపాటి శేషాచార్యకవి ప్రౌఢకవి. ఈయన రంగధామ, నకరికంటి నృసింహాద్రి శతకములు, శకుంతలా ధనంజయ విలాసాదిగేయ ప్రబంధములు వ్రాసినాఁడు. మా పితామహులగు శేషాచార్యులకీ తిరుమలాచార్యకవి యగ్రజాతుఁడగు కతన మేమీ కవిజీవితము నీ విధముగాఁ దెలుపఁ గలిగితిమి. కవి మనుమ లిపుడు ఓడరేవులో నున్నారు. ... ... ఈకవి గతించి యిప్పటికి ముప్పది సంవత్సరములు దాటినవి" అని వ్రాసియున్నారు. ఈ పీఠిక వ్రాయ

---

* ప్రచురితము :– నేలటూరు సుబ్రహ్మణ్యంగారి విద్యావిలాస ముద్రాక్షర శాల. (ఊరు ?). ప్రమోదూత (1930 ?)

బడిన తేదీ 5-2-1925 అప్పటికి ముప్పదియేండ్లక్రిందట దూపాటి తిరుమలాచార్యులు కీ॥ శే॥ యైనట్లు కనబడుచున్నది. అతని జీవితకాలము 1815 - 1895 సం. ల నడిమికాల మగుచున్నది. ఆతని కడగొట్టు సోదరుడగు శేషాచార్యులు 1830 - 1900 సం. ల నడుమ నుండి యుండును. ఇతని ధనంజయ విలాస గేయప్రబంధము శాకుంతల నాటకమువలె యక్షగానమై యుండును గాని లభింపలేదు.

ఈ శాకుంతల నాటకమందలి కథాప్రపంచాలికరు కాళిదాసీయము మూలమునకు దూరము. నాటకమునందలి కథా ప్రణాళికమూలము కాళిదాసీయము మూలముతో నవనవ్యమైన ప్రపంచీకరణము గొంత కనిపించును. ఇది యక్షగానమనియు, నాటకమనియు, గేయప్రబంధమనియుఁ బేర్కొనఁబడినది. మూఁడుల్లాసములుగా విభజింపఁబడినది. ఇందు సూత్రధార ప్రవర్తితమైన ప్రస్తావనగలదు. అందీ నాటకప్రయోగమునుగూర్చిన తౌర్యత్రిక రూపానోప విషయప్రసక్తిగలదు. ఇందుఁ బ్రతిముఖ్యపాత్ర విషయమునను "...... (ఫలానా వేషధారి) తెరలోకి వచ్చి చదువవలసిన ద్విపద", "వేషధారి కైవారము దరువు" అని కలదు. పాత్రల వృత్తాంతములు పాత్రేతరులు జెప్పునట్లుగలదు. హాస్యగాఁడు పాత్రలను బలుకరించుట గలదు. కథాసంధులు (పాత్రాంతర ప్రవేశ సూచకములైన సంధివాక్యములు) గలవు. కొన్ని ప్రదర్శన సూచనలు, విషయ విషయమునకును బ్రత్యేకశీర్షికలును గలవు. ఇందలి హాస్యగాఁడు బ్రాహ్మణుఁడఁట. అతని ప్రసంగములందుఁ జమత్కారముతోఁ బాత్రౌచిత్యము పాటింపఁబడినది. వేట, మొలకల ప్రసంగములు స్వభావోక్తిసుభగములు. నాయిక విరహ వివాహాది సందర్భములందు ప్రబంధఫణితి ప్రాగల్భ్యముగలదు. ఇందలి భాషయు భావములు నతి ప్రౌఢములు. కవికడ నొక ప్రౌఢప్రబంధమును రచించుటకుఁ దగిన సామగ్రి గలదు. ఇందుఁ బ్రసిద్ధ రాగతాళములలో దరువులు,

ద్విపదలు, పలురకముల పద్యములు, కంద సీసార్ధములు, సంధి సంభాషణ వచనములును గలవు.

---

# 83. తిమ్మరాజు లక్ష్మణరావు

## రుక్మిణీ కల్యాణము :

బ్రాహ్మణకులము వాజసనేయశాఖయందుఁ బిట్టలాన్వయమున భూతి తిమ్మయామాత్యుఁడను నతఁడు భాగ్యపురాధిపుని కొలువులోఁ గొన్నాళ్లుండుటచే నతని సంతతివారికిఁ దిమ్మరాజువారని పేరువచ్చినదఁట. ఆ తిమ్మరాజునకు నరసయ, నరసయకు బొల్లయయుఁ గొడుకులు. బొల్లయకు లక్ష్మమయందు గలిగినవాఁడీ గ్రంథకర్త. ఇతనికి మాతులుఁడు, గురువునైనవాఁడు కేతరాజు రామయోగీంద్రుఁడు. గ్రంథకర్త యీ రుక్మిణీకల్యాణ గ్రంథాంత ద్విపదలోఁ దానిదివఱకు "రవి శశికాంతులన్ రాజుల కథను" రచించి దానిని బ్రకటించుటకు ముందు కృష్ణుని పేర నొక కృతి జెప్పవలెనని దీనిని రచించినట్లు చెప్పియున్నాఁడు. దీని ప్రచురణ 1875 సం.లో. కావున నతఁడా 1875 లో నుండెనని చెప్పఁదగియున్నది.

గ్రంథ విషయము :- ప్రసిద్ధము. యక్షగానములలో నిదిచాల మేలిమిగల రచన. వివాహఘట్టము సమ్యగ్వర్ణితము. ఇందుఁ బ్రసిద్ధ తాళ ప్రధానములగు దరువులు, రాగప్రాముఖ్యమును గల నలుగు

---

* ప్రచురణ :— పువ్వాడ వెంకటరావు పంతులుగారి వర్తమాన తరంగిణీ ము. శా., 1875.

బంతులాట, శోభనపుఁ బాటలు, ద్విపదలు, వచనములు, కందార్థ ములు, లాలి, ఏలలు, అర్ధచంద్రికలు, రగడ, లావణి యను నొక పదచ్ఛందో విశేషమును గలవు. యక్షగానమని పేర్కొనఁబడెను.

---

# 84. వరిగంటి శేషగిరిదాసు

## జగన్మోహన శ్రీకృష్ణ విలాసము :

"ఇది నెల్లూరు మూలస్థానీశ్వరుని పేట నివాసులగు వరిగంటి శేషగిరిదాసుగారిచే రచియింపఁబడి వారిచే గ్రంథ స్వాతంత్ర్యమును బొందిన వంగీపురం రామకృష్ణమాచార్యులచే శ్రీసరస్వతీనిలయ ముద్రాక్షరశాలయందు ముద్రింపించి వంగీపురం రంగాచార్యులచేఁ బ్రకటింపఁ బడియె" ననియు, నా ప్రచురణవత్సరము 1876 అనియు గ్రంథముఖ పత్రమున నున్నది. కవి కాలము సులువుగాఁ దెలిసినది. ఇతని కృత్యంతరములు :— సంగ్రహరామాయణము (సంస్కృతము), అష్టపదులు, భాగవత రామాయణాంధ్రీకరణములు, భక్తవత్సల శ్రీరామ సుధాకరము, హరికీర్తనలు, కుచేలోపాఖ్యానము, ధ్రువచరిత్ర, భగవద్గీతా వ్యాఖ్యానము. (చూ. నెల్లూరుజిల్లా మాన్యువలు, పుటలు 698-701). ఈయన రామాయణ య. గా. ను గూడ రచించినట్లు తెలియుచున్నది. (గ్రంథము నా కలభ్యము).

జ. శ్రీ. వి. :— వేణుగాన మాలించి గోపికలు తమ తమ పనులు మాని యత్తల మాట నలక్ష్యము చేసి కృష్ణుఁడున్న యెడకుఁబయన

మగుటయు నాతఁడు వారలతోఁ జాలతడవు సయ్యాట లాడి చివరికిఁ బ్రసన్నుఁడగుటయు నిందలి విషయము. రచన చక్కనిది. ప్రసిద్ధ రాగ తాళములలో దరువులు, డోరాలు, నడుమ నడుమ నలఁతి సంధి వచనములు నక్కడక్కడ గీతములు కందములును గలవు.

---

# 85. ఏనుగుల చూడమ్మగారు

## రుక్మిణీ కల్యాణము:

ఈమె ఎరగుడిపాటి వేంకటాచలము పంతులుగారి పుత్రికయఁట. పంతులుగారు 19శ. ఉత్తరార్ధమున నుండినట్లు వినికిడి. గ్రంథముద్రణ తే. 11–8–1879 న కాకినాడ ముద్రాక్షరశాలయందు జరగినది కావున నీమెకాల మొకవంక సునిశ్చితము. ఈమె రుక్మిణీ కల్యాణము యక్ష గానమని చెప్పఁబడలేదు. కాని యా లక్షణము కొంతపట్టినది. ప్రసిద్ధ రాగతాళములలో దరువులు, సంధివచనములు, జోలలు, లాలి, గొబ్బి, నలుగు, మేలుకొలుపు, మంగళహారతులు మొ॥ పలుపాటలు నిందుఁ గలవు. ఇందు రెండు వంతులు కృష్ణుని బాల్య క్రీడాదికమే వర్ణితము. రుక్మిణీ కల్యాణముతో గ్రంథాంతము. ఆఖ్యానశైలి యెక్కువ. రచన సలక్షణము. సరసము.

---

# 86. భారతుల శ్రీరంగ కవి

భారతులవారిది యజుశ్శాఖ. అందుఁ గవివంశము - పితాపుత్ర క్రమమున :- సరసయ్య - కేశవయ్య - రాఘవయ్య - కేశవయ్య - రంగార్యుఁడు (భార్య ఆదెమ్మాంబ) - ఈ శ్రీరంగకవి. ఇతని కృతులు :- శ్రీకృష్ణ లీలలు, కృష్ణవిలాసము. ఇవి కవి పెట్టిన పేర్లు. కాని వరుసగా శ్రీకృష్ణ జలక్రీడలు, పారిజాతము ననుపేళ్లతో రెండును కంచనపల్లి జగన్నాథరాయునిచే మదరాసు వర్తమాన తరంగిణి ము. శా. లో 1881 లో ముద్రాపితములై ప్రచురింపఁబడినవి. కవి రెండిటను గ్రంథాంత ద్విపదలలోఁ గృతిప్రోత్సాహకుఁడును, ప్రచురణకర్తయు నగు కంచనపల్లి జగన్నాథరాయుని (ఆ మన పలినాటి దేవస్థాన ధర్మకర్త యనుట) ప్రశంసచేసియున్నాఁడు. అది కాక రెండిటను కృతిరచనా కాలము "శాలివాహన శక చంద్ర తారాపథ ద్వీప ధవళ పక్సంఖ్య నహిగాంచిన ప్రమాది" వత్సరముగాఁ జెప్పఁబడినది. అది శా. శ. 1801 – క్రీ. శ. 1879. అందు శ్రీకృష్ణలీలలు ముందు రచింపఁబడినది. రెండును నూచెర్ల చెన్నకేశవాంకితములు. కవి గుంటూరు మండలమువాఁడై యుండును.

## శ్రీకృష్ణలీలలు :

ఇందుఁ గృష్ణ జననము, పూతనాహరణము, కృష్ణుని యాగడములఁగూర్చి యశోదతో గోపికల "పిరియాదు" లు, జలక్రీడలును విషయములు. ఇందలిరచన చక్కనిదే కాని గోపికల "పిరియాదు" ల సందర్భమున హాస్యాలాలసుఁడై కవి యత్యంతవ్యాప్తమగు నసభ్యతకు ననౌచిత్యమునకు నొడిగట్టినాఁడు.

## కృష్ణవిలాసము:

కవి ప్రచురణకర్తృ వంశ ప్రశంస లెక్కువగా దీనినుండియే తెలిసినవి. ఇందుఁ గవి తన గురువగు వ్యాకరణము ఆదినారాయణా ర్యుని, నృసింహ భారతీస్వామి యతీంద్రుని స్తుతించినాఁడు. ఇందలికథా ప్రథమఘట్టము ప్రియురాండ్రతో కృష్ణుని సమాగమము; పిదప ఘట్ట మునఁ బారిజాత కథ పూర్తిగాఁ గలదు. ఇందలి రచన పూర్వపు దానికంటె మేలుతరము. అయినను రెండిటను రచన సలక్షణభాషలో సరళముగా మధురముగాఁ జాలవరకు నిర్దుష్టముగా (వచన సంభాషణ లలోఁదక్క) నున్నది. రెండిటను బ్రసిద్ధ రాగ తాళములలో దరువులు, ద్విపదలు, సంఘవాక్యములు సంభాషణములు గూడఁగలిగిన గద్యపద్య ములు, రగడ, ఏల, శబ్దజతి, శోభనము మొ॥ విశేషరచనలును గలవు. రెండును నాటకములని పేర్కొనఁబడినవి.

---

# 87. కొల్లము సీతారామకవి

ఈతఁడు దేవకీసుతానయన మను యక్షగానమును రచించినాఁ డఁట. కాని గ్రంథ మలబ్ధము. ఇతఁడు నందవరీకుఁడు. కాశ్యప గోత్రుఁడు. లక్ష్మమారామకృష్ణార్యుల పుత్రుఁడు. ఇతఁడు "క్రీ. శ. 1880 సం. ప్రాంతమువాఁడై యుండును". ఇతని కృత్యంతరములు :— యోగాంజనేయస్తవ తారావళి, హరిచరణస్తవరాజము, ఘటికాద్రీశ శతకము, శ్రీరమాకాంతరంగ శతకము, విజయ ప్రతిజ్ఞాపూరణకథ. (ఈవిషయమంతయు శతకకవుల చరిత్రవలనఁ దెలియవచ్చినది.

---

# 88. కొదమగుండ్ల శేషాచార్యులు

కవి కాశ్యప సగోత్రుఁడు. కొదమగుండ్ల అప్పళాచార్యుని పుత్రుఁడు. కవినివాసము వేటపాలెము. (ఇది గుంటూరు మండలము లోనిది కాదగును) ఇతఁడు వరుసగా కృష్ణవిలాసము, వసురాజవిలాసము, పురూరవశ్చక్రవర్తి విలాసము ననుమూఁడు నాటకములను రచించియుండెను. (పూర్వోక్తకృతులు ఉదప కృతులలోఁ బేర్కొనఁబడినవి.) ఇందు మొదటి దిప్పు డుపలబ్ధముగాదు. రెండవది కృతిప్రోత్సాహకుఁడగు కంచనపల్లి జగన్నాథరాయుఁడే ప్రచురణ కర్తగా 12-2-1880 తేదీన మదరాసు వర్తమాన తరంగిణీ ము. శా. లో ముద్రితము. మూఁడవది గ్రంథకర్త తండ్రియే పరిష్కర్తగా, కృతి ప్రోత్సాహకుఁడగు ముమ్మడిసెట్టి వీరాసామినాయుఁడుగారిచేత మచిలీపట్టణములోని వంగిపురం రుక్మిణమ్మ గారి ము. శా. లో 23-1-1885 తేదీన ముద్రితము. కవికాలము సులువుగా గ్రహింపనగును.

## వసురాజవిలాసము :

ఇది రామరాజభూషణుని వసుచరిత్ర ప్రబంధమునకు వీథినాటక రూప పరివర్తనము. కథాప్రణాళిక, వర్ణనలు, రచన, శాబ్దిక చమత్కారము మొదలగు విషయము లందలి యనుకరణమునుబట్టి యిది వసుచరిత్ర కొక మానసపుత్రిక యనవచ్చును. కథారంభమున రాజాగమన సూచకముగా "చోపుదారు" రాక, అతని ఉర్దూప్రసంగము, వసురాజు వనవిహారముహూర్త నిర్ణయము చేయవచ్చిన రాజగురువు పాత్ర, అతని శిష్యుల హాస్య ప్రసంగములు మున్నగునవి యిందలి విశేషములు. ఇందుఁ బ్రసిద్ధరాగ తాళములలో దరువులు, ద్విపదలు, ప్రబంధ ధోరణిబట్టిపోయిన పద్యగద్యములునుగలవు. ఇది

నాటకమనియుఁ గేయప్రబంధమనియు బేర్కొనఁబడినది. మాచెర్ల చెన్నకేశవస్వామి కంకితము.

### పురూరవశ్చక్రవర్తి విలాసము:

ప్రసిద్ధమైన ఊర్వశీ పురూరవుల ప్రణయగాథ యిందు వర్ణితము. నాటకారంభమున సూత్రధారుఁ డొక సంస్కృత ప్రసంగమున గథాసంగ్రహమును జెప్పి విష్వక్సేన స్తుతి చేయును. ఇందది శృంగార రూపకమనియు, వేషభాషా విశిష్ట నాటకమనియుఁ వేఱే గేయ ప్రబంధమనియుఁ బేర్కొనఁబడినది. ఇందుఁబాత్రల "కథాసంధులు" (అనఁగాఁబాత్ర ప్రవేశసూచకముగా తదుదంత మే సూత్రధారప్రాయుని చేతనో ముందుకొంత ప్రస్తావింపఁబడుట) గలవు. ఇందొక కైవారమున నర్థా సంస్కృతముల ప్రయోగముగలదు. కందార్థము లెక్కువ. తరువాత సీసార్థములు, ప్రసిద్ధరాగ తాళములలో దరువులు, ద్విపదలు సంధివచనములు, వచనములలో సంభాషణలు, కొలఁదిపాటి పద్యములు (అందు తురంగప్రయాత మనునది విశేషము), జోల, మంగళ హారతి, తేవారముగలవు. దరువుల చివరఁ గృతిపోత్సాహకుని పేరు వచ్చుచుండును. ఇది శ్రీరంగేశున కంకితము. ఇందలి రచనప్రబంధో చితమైనది. కవి చక్కని వైదుష్యము గలవాఁడే.

---

## 89. ఉపాధ్యాయుల మృత్యుంజయకవి

### వామన చరిత్రము:

కవి ఉంగపుర నివాసి. ఉపాధ్యాయుల కాశీపతి పుత్రుఁడు. పాపన యను నామాంతరము గలవాఁడు. కృతి ప్రోత్సాహకుఁడు

చదుము సుబ్బరాయణి. అతఁడే ప్రచురణ కారకుఁడన్నట్లును దోఁచు చున్నది. గ్రంథ ముద్రణము మదరాసు ఆది సరస్వతీ నిలయము. శా. లో 1880లో నైనది. కవి యపుడున్నట్లతోఁచుచున్నది.

గ్రంథవిషయము ప్రసిద్ధము. ఇది మైసుఖండములుగా విభాగింప బడినది. యక్షగానమని పేర్కొనఁబడినది. దరువుల మయమైనది. దరువులు రాగతాళములతోఁగలిసియు, విడిగాఁ దాళప్రధానములునుగలవు. పద్యములుకొద్ది, ద్విపదయున్నది.(ద్వితీయఖండమంతయు ద్విపదయే). వచనము గ్రంథావతారికలో నొక్కచోఁగలదు. కందార్ధములు, చూర్ణిక, శారదపద్యము, చౌపద్యష్టకము, శోభనము గలవు. ఇందలి ఖండ విభాగ మనావశ్యకము. కథ చెప్పుచున్నట్లుండును, గాని జరుగు చున్నట్లుండదు. కవి సహజముగా నొడుదుడుకులు లేకుండ రచన చేయగలవాడే కాని భాగవత పద్యములను దరువులుగాఁ బరివర్తింప యత్నించినాఁడు గావున సడుమ పేరుబిగింపులుచే రచన కొంచెము పెటుకుగా దయారైనది.

---

# 90. కేశవపట్టణము జియ్యరయ్య

## నలనాటకము:

కవి కేశవపట్టణము రామానుజాంబాభాష్యకారులకుఁ బౌత్రుఁడు. యతి రాజమ్మాన్నాథమునీంద్రులకుఁ బుత్రుఁడు. 37వ "గ్రెనెడియర్సు రెజిమెంటల్" పాఠశాల తెలుఁగు ఉపాధ్యాయుఁడట. కృతిపతి చోడ

వరము జమీందారగు చెన్నాకుల సుబ్బయ. ప్రచురణ కవిరంజనీ ప్రెస్, మదరాసు, 1881. కవి గ్రంథప్రచురణ కాలమునాఁటి వాఁడు గనే తోఁచుచున్నాఁడు.

గ్రంథ విషయము ప్రసిద్ధము. ఘటికుని (కటికము ?) రాకతోఁ గథారంభము. వాని ప్రసంగము హిందీలోఁ గలదు. ఇందుఁబాత్రల "తెరద్విపదలు", పాత్రప్రవేశపు దరువులును గలవు. ఇందలి దరువులు ప్రసిద్ధ రాగ తాళములలోనేగలవు. ఇంగ్లీషు మెట్టొకటి గలదు. ద్విపదలు, పద్యములు, సంధి సంభాషణ వచనములు, సీసార్ధాదులును గలవు. రచన సలక్షణము, సరసమైనది.

---

# 91. బుక్కపట్టణము శఠగోపసూరి

## తారాశశాంక విలాసము :

కవి బుక్కపట్టణము స్వామి జియ్యరువరుఁ బుత్రుఁడు. ఆసూరి వేంకటాచార్యునకు శిష్యుడు. కవికాలము నిర్ణయించుటకుఁ దగిన యాధారములేదు. గ్రంథముద్రణము 1882 సం. (ఆది విద్యావిలాస ము. శా. మదరాసు). కవి యించుమించప్పటి వాఁడుగనే తోఁచును.

గ్రంథవిషయము :— ప్రసిద్ధము. కవి శేషము వెంకటపతి శశాంక విజయమును జూచియుండును గాని యనుకరించుటకుఁ బ్రయత్నింపలేదు. రచనలోఁగొంత విదగ్ధతఁ జూపినాఁడు. కాని రసము కొంచెము ముదురుపాకమునఁ బడినది. ఇందు విదూషక ప్రాయుఁడైన

వికటకలాపుని హాస్యప్రసంగములలోఁ జమత్కారమున్నను సున్నితము తక్కువ. గ్రంథమున వచనమునందును సంభాషణలు గలవు. నాటకీయత యెక్కువ. సక్రమమైన రంగవిభాగము చేయుట కనువుగా నున్నవి సన్నివేశములు. ముఖ్యపాత్రల ప్రవేశసూచనలు, పాత్రలచే స్వవిషయ వివరణములును గలవు. అనేక ప్రసిద్ధ రాగ తాళములలో దరువులు (దరువులందుఁ గరిగిరి వరదముద్ర), పద్యములు, ద్విపదలు, సంధివచనములు, సంధిద్విపదలు, సంధి – అర్ధకందములు, (కందార్ధములు), ఏలలునుగలవు. ఇది నాటకమని పేర్కొనఁబడినది.

---

# 92. మామిళ్లపల్లి వెంకటాచలమయ్య

## (నూతనపురి) ఏ కాం త సే వ:

(ప్రచురణ :– శారదానిలయ ము. శా., 1882)

కవి ఆపస్తంబ సూత్రుఁడు. కౌశిక సగోత్రుఁడు. వెంకటరామయ పౌత్రుఁడు. సుబ్రహ్మణ్య పుత్రుఁడు. కవి నివాసము నూతనపురి. కవికాల నిర్ణయమున కాధారము గన్పట్టదు. గ్రంథ ప్రచురణ వత్సర ప్రాంతమే యైనను గావచ్చునని యూహ మాత్రము.

ఏకాంతసేవ యనఁగా నిత్యార్చన సాగు దేవాయతనములలో ముఖ్యముగా భోగనిలయములగు వైష్ణవాలయములలో రాత్రి గుడి తలుపులు మూయుటకు ముందర్చకు లమ్మవారిని స్వామివారిని యథావిధి నుపచరించి వారి యుత్సవ విగ్రహములను బానుపుపైఁ బవళింపు

చేయఁగా, గుడిచేటులు లాలిపాటలు పాడి ద్వారపాలన నిమిత్త మష్ట దిక్పాలకులకు బహుపరాకులు చెప్పి వెడలిపోఁగా నిఁక నమ్మవారు స్వామివారికిఁ జేయునదిగా నూహింపఁదగిన పర్యంక సపర్య. మధురభక్తి ముదితాత్ములగు కవులు కొంద ఱాసన్ని వేశమును బురస్కరించుకొని దానికిఁ బ్రస్తావనగా నింత కథాంగము గల్పించి నాయకుని వివిధోప చారములకు వివిధగీత ప్రభేదములను బ్రయోగించి యేకాంత సేవా మకుటముతో ననేక మధురగేయ ప్రబంధములను వెలయించిరి. అవి భక్తి శృంగారములకు, సంగీత సాహిత్యములకు నాలవాలములు. అట్టిదే వెంకటాచలకవి గ్రంథమును. అది కవిచే యక్షగాన మని పేర్కొనఁబడినది. ఇందలి నాయికా నాయకులు లక్ష్మీనారాయణులు. ఇందు వారి రాయబారములు, సంవాదములు, సమాగమము, భక్తుల యుపచారములు, ద్వారపాలకుల హెచ్చరికలు, మేలుకొలుపులు, కల్యాణోత్సవము విషయములు. ఇవి కాక యిందు వివిధరాగ తాళ ములలోఁ బదములు, దరువులు, కీర్తనలు, శ్లోకములు, పద్యము, ద్విప దలు, వచనములు, అష్టకములు, ఏలలు, పలురకముల స్త్రీల వేడుక పాటలును గలవు. రచన చక్కఁగనే యున్నది.

# 93. నాదెళ్ల పురుషోత్తమ కవి

## అహల్యా సంక్రందన నాటకము:

(ప్రచురణ:- కేశరాజుసుబ్రహ్మణ్యశాస్త్రి వారి స్వధర్మ ప్రకాశిని ము. శా., 1-3-1883)

కవి హరితసగోత్రుండు. తల్లి సుబ్బమ. తండ్రి రామయ. ఇతని జన్మస్థానము కృష్ణా తీరస్థమగు సీతారామపురాగ్రహారము. జననము 1863. నిర్యాణము 27-11-1938. కృత్యంతరములు:- హరిశ్చంద్ర నాటకము, పారిజాతాపహరణము, సారంగధర నాటకము మొ. (చూ. 'ఆంధ్ర రచయితలు'). ఇవియు యక్షగానము బాణీని నడచినవే కావచ్చును. కాని నే నుపలభ్యమానమగున దీయహల్యా సంక్రందన నాటకము మాత్రమే.

ఇందలి కథ ప్రసిద్ధము. రచన కొంత సరసమైనదే. వేత్రధర పాత్ర ప్రవేశముతో నిందలి కథారంభము. వాడు "వాటీజిట్, కీప్ క్వైట్, కామోష్" అని యీ ప్రకార మాంగ్ల హిందీభాషలలోఁ బ్రసంగించును. హాస్యగాఁడు పాత్రలను బలుకరించుటయు నెకసక్కెపుఁ బ్రసంగములు చేయుటయుఁ గలదు. పాత్ర ప్రవేశ సూచనలు, పాత్రలు తమ వృత్తాంతము జెప్పుకొనుటయుఁ గలవు. ఇది యక్షగానమనియుఁ నాటకమనియుఁ బేర్కొనఁబడినది. ప్రదర్శనకుఁ జూకలి పట్టు దివిటీ ప్రసక్తి వచ్చినది- రచనలో దరువులు మొదలగు యక్షగానపు సజ్జంతయుఁ గలదు.

# 94. బొందుగ యాదవదాసు

ఇతని పితామహుఁడు శేషయ్య, తండ్రి సీతారామయ. నివాసము గజవెల్లి సీమ — (దే. చ.) ఇతని కృతులు దేవయాని చరిత్ర [1] ప్రహ్లాద చరిత్ర [2] రామదాసు చరిత్ర [3] గరుడాచల నాటకము [4] 1882 సం. న మదరాసు ఆదికలానిధ ము. శా. లో ముద్రితమై ప్రకటింపఁబడిన తాడిపర్తి లక్ష్మణదాసుగారి ప్రహ్లాద నాటకములో నీ యాదవదాసుగారి ప్రహ్లాదచరిత్ర పేర్కొనఁబడినది. యాదవదాసు తన దేవయాని చరిత్రను చిత్రభాను భాద్రపదశుక్ల దశమి భృగువాసరమున రచించితినని చెప్పినాఁడు. అది 22-9-1882 తేదీ యైనది. ఇతఁడు 19 శ. ఉత్తరార్ధమున నుండినట్లు నిశ్చయింపవచ్చును.

ఇతని గ్రంథములు నాల్గును ప్రసిద్ధేతివృత్తములు. భద్రాచల రామార్పితములు. నాల్గును నాటకీయతగల రచనలు. అందు దేవయాని, రామదాసు చరిత్రములు యక్షగానములనియు, గరుడాచలము నాటకమనియుఁ బేర్కొనఁబడినవి. నాల్గింటను బాత్రలు తెర వెడలు కీర్తనలు, పదములు, ద్వారపాలకుఁడు లేక ద్వారకుఁడనువాఁడు (కటికము వంటి పాత్ర) పాత్రలను బలుకరించుటయుఁ బాత్రలు స్వ

---

నాల్గును ముద్రితములు :—

1. శెస్టువార్డు అండుకో., మదరాసు, 1949.
2. కొండా శంకరయ్య, చందా నారాయణశ్రేష్ఠి, సికింద్రాబాదు, 1951.
3. శెస్టువార్డు అండుకో., మదరాసు, 1949.
4. కర్రా అచ్చయ్య అండు సన్సు., రాజమండ్రి, 1931.
యన్. వి. గోపాల్ అండుకో., మదరాసు, 1949.

విషయము జెప్పుటయుఁ గలవు. ప్రహ్లాద, గరుడాచలములందుఁ గథారంభమున దేవకాంతలును, నాయకాను చరిత్రమున వారకాంతలును వచ్చి తమ, యా యా కథలందలి రాజప్రశంసలు, నాట్యప్రసంగములను దెలుపుట కానవచ్చును. నాలుగింటను దరువులు, కీర్తనలు, పదములు, పద్యములు, సంధివచనములు, ద్విపదలు, కందార్థములు, ఏలలు మొదలగునవి గలవు. కవి తన కృతులను సలక్షణముగ వ్రాయఁగోరి విలక్షణముగ వ్రాసినాఁడు. కవి యనభిజ్ఞుఁడు. అతనికి భాషాలక్షణాధికార మేమియు నున్నట్లు కానరాదు. ఉత్పల చంపకాది వృత్తములందు గణపరిగణమున మాత్రల మానము ప్రయోగించినాఁడు. కాని యితని నాటకములు పామరజన సుబోధములై కొంత ప్రచారము బొందినవి. ఇతని నాటకము లిప్పటికిని బల్నాటిసీమలో నాడఁబడుచుండునని శ్రీ రావిపాటి లక్ష్మీనారాయణగారు (డి. ము. కోర్టు నాజరు - గురజాల) తే. 30-6-55 న నాకొక లేఖ వ్రాసియున్నారు.

---

## 95. వంకదారి బాలగురవప్ప

### భల్లాణరాజు చరిత్రము:

(ప్రచురణ – గీర్వాణ భాషారత్నాకరము. శా. మదరాసు, 1887.)

కవి భీమునిపాడు (కర్నూలు జి. కోయిలకుంట్ల తా.) వాస్తవ్యుఁడు. వైశ్యుఁడు. ఎల్లయసెట్టికిఁ బ్రపౌత్రుఁడు. సుబ్బయకుఁ

పౌత్రుఁడు. చిన్నగురువయ్యకు లక్ష్మమకుఁ బుత్రుఁడు. ఇతని భ. రా. చరిత్ర రచనాకాలము చిత్రభాను కార్తీకకృష్ణ తదియ విధువారము అనఁగా 27-11-1882 తేది.

భల్లాణరాజు కథపూర్వోక్తము. ఈకవి "మునుపటి నాటకం బులరీతు లరసి, యొనఁగూర్చి నాటక మొనరించి నాఁడ" ననెను. ఇందలి రచన నాటకోచితము. చక్కని దనవచ్చును. ప్రసిద్ధరాగ తాళములలో దరువులు, పాత్రలు తెరవెడలు దరువులు, దరువులలోఁ గృతిపతియగు భీమునిపాడు భీమేశుని ముద్రలు, ద్విపదలు, పద్యములు, సంధివచన ములు, పాత్రలవచనములు (సాధారణముగ సంబుద్ధ్యంతములు, నంత్య ప్రాస ప్రచురములునై యుండును.) ఏలలు, దండకము, శోభనము, కందసీస ద్విపదార్థములును గలవు.

---

# 96. వారణాసి సుబ్బరాయకవి

## అనసూయానాటకము:

(ప్రచురణ :- శ్రీ వాణీనిలయ ము. శా. మదరాసు, 1882.)

కవి తిరుపతివాస్తవ్యుఁడు. మంజువాణిరామకవి శిష్యుఁడు. కృతిప్రోత్సాహకులగు దేవతపుల్లయ, పచ్చిపులుసు కామయ్యసెట్టి యనువారలే ప్రచురణకర్తలునని ముఖచిత్రముపై నున్నది. అనఁగాఁ గవియు నప్పటివాఁడే యనుట నిశ్చయము.

గ్రంథవస్తువు. ప్రసిద్ధము. ఇది నాటకము, ప్రబంధమునని పేర్కొనఁబడినది. ఇందు ప్రసిద్ధరాగతాళములలో దరువులు, పద్యములు, ద్విపదలు, కంద ద్విపదార్ధములు, ఏలలు, సంధవచనములు, సంధిగీతములు, శ్లోకములునుగలవు. ఇందలి దరువుల చివరఁదఱచు పైడిపాటి హరిముద్రగలదు. ఇందు పైడిపాటి నరసనమంత్రి పౌత్రుఁడును, బుచ్చనపుత్రుఁడునునగు నొకకవి (పేరు లేదు) తాను వారణాసి సుబ్బరాయకవి రచించిన కథనుగ్రహించి కొన్ని దరువులు పద్యములును జేర్చితినని చెప్పినాఁడు. (చూ. గ్రంథాది ద్విపద). ఇందలి ద్వివిధమైనరచనలలో నొకటి పేలవము, తప్పులుగలది. రెండవది కొంత మేల్తరము.

---

# 97. గోపాలరామదాసకవి

## సీతాస్వయంవరము :

(ప్రచురణ :— ఏళుమల పిళ్ళగారి వివేకరంజనీ ము. శా., 1884)

కవి గుఱించి వివరము లెవ్వియు నిందు లేవు. "పుణ్యాసీమంతినీ బాలికా ప్రముఖులు చదువుకొనుట కుపయుక్తముగా ఝుంఝామారుత వీర బిరుదాంకిత శ్రీ రామతంవేంకట సుబ్రహ్మణ్య శృంగార కవీంద్రునిచే నవీనముగాఁగొన్ని విషయము" లిందుఁ జేర్పఁబడిన వని ముఖపత్రమునఁగలదు.

ఈకవులు గ్రంథ ప్రచురణమునాఁటివారే యైనను గావచ్చును. ఇది యుత్తయూహా. ఆధారమేమియులేదు.

గ్రంథ విషయము:— ప్రసిద్ధము. ఇందుఁబ్రసిద్ధ రాగతాళము లలో దరువులు, నడుమ జిన్నచిన్న వచనములు, నెడనెడఁబద్యము లును గలవు. లావణి, తోహరాదరువు, గౌరీ కల్యాణము విశేష ములు. ద్విపద లేదు. యక్షగానమని పేర్కొనఁబడినది. రచన సామాన్యముగా నున్నది.

# 98. వెలుగోటి వెంకట రమణయ్య

## వరరుచి విజయము:

(ముద్రణ: చిత్రలిపి ము. శా., బళ్ళారి, 1886)

కవి నివాసము అనంతపురము జి. గుత్తి తా. ఉరవకొండ. దేవాంగ కులమువాఁడు. గౌరీశ్వరుల (?) పుత్రుఁడు. ఇతఁడు స్వకీయ గ్రంథస్వామ్యము చిత్రలిపి ముద్రాక్షరశాల వారికిచ్చినట్లు చేసిన ప్రక టన గ్రంథముపైఁ గన్పట్టును. కాఁగా నితఁడు 1886 లో నుండె ననుట నిశ్చయము.

గ్రంథ విషయము:— బ్రహ్మాండ పురాణోత్తరకాండ మందలి దేవల చరిత్రమునుండి గ్రహింపఁబడినదఁట. భూలోకమున శ్రుతులప శబ్దకలితములైనవని నారదునివలన శివుఁడెఱింగి దేవాంగుని మానుష వేషమునఁ దత్సంస్కరణార్థము బంపుట—అతఁడే వరరుచి—అతఁడు భోజాస్థానికైయె బహుశాస్త్ర పారంగత భట్టాచార్యుఁడను వానిపుత్రిఁ గళావతి యను దానినోడించి యామె నొకమూర్ఖుఁడగు బ్రాహ్మణ

బాలకునకు వివాహ మొనర్చును. అతఁడే పిదపఁ గాళిదాసుగా వ్యవహృతుఁడై నాఁడఁట; ఇదియొక చిత్రమైనకథ. సరస గ్రథనమున సాగిపోయిన దిందు. తాళ ప్రధానములగు దరువులు, ద్విపదలు, పద్యములు, చిన్న వచనములు అర్ధచంద్రికలు గలవు. సంవాదములెక్కువ. ఇది ప్రకటన కర్తలచే యక్షగానమని పేర్కొనఁబడినది.

---

# 99. బాగేపల్లి అనంతరామాచార్యులు

ఈయన 19 శ. ఉత్తరార్ధమున అనంతపుర మండలము హిందూపురము వాస్తవ్యులై, నగరి యను నూరనొక గుమాస్తా యుద్యోగమున నుండినవారై, ఆ ప్రాంతములందు హరికథోపన్యాసకులుగాఁ బ్రసిద్ధి వడసిన వారఁట. వీరు యక్షగాన ప్రాయములైన హరి కథలను గొన్నిటిని రచించియుండిరి. కొన్నిటిని యక్షగానము లనియు వ్యవహరించిరి. వీరికృతులు :—

1. చంద్రహాస చరిత్రము.
2. మూఁడున్నర వజ్రము.
3. అనసూయా చరిత్రము.
4. కుచేలోపాఖ్యానము.
5. సావిత్రీ చరిత్రము.
6. సుభద్రా పరిణయము.
7. శశిరేఖా పరిణయము.
8. ప్రహ్లాద చరిత్రము.
9. రుక్మాంగద చరిత్రము.
10. ఉషా పరిణయము.
11. రామాశ్వమేధము.

ఇవి యన్నియు నముద్రితములు. ఇందుఁజివరి నాల్గు లభించుట లేదు. * కడమ యేఁడింటఁ బైపట్టికలోని 3, 5, 6, 7 నం. ల గ్రంథములు మాత్రము యక్షగానములుగాఁ బేర్కొనఁబడినవి. కాని వానిలో నట్లు పేర్కొనఁబడని వానిలోనుగూడ రచనా ప్రక్రియ యొక్క ఫక్కి-గనే నడచినది. అన్నిట తోహరాలు, సమపాళముగా వివిధ ప్రసిద్ధకర్ణాటక హిందుస్తానీ రాగములు, (గజల్ — ఒకపార్సీ మట్టు; లావణి — ఒకమహారాష్ట్ర పదచ్ఛందము. ఇందవి రాగములుగాఁ బ్రయుక్తములు), ఏకాట త్రిపుట రూపకాది తాళములలోఁ బాటలు (పల్లవి-అనుపల్లవి చరణ విభాగముతో), పద్యములు, గొన్నిట షట్పదులుమాత్రము,కొన్నిట ద్విపదలు, గొన్నిట నవియునివియు, నొంట రెంటఁదక్కఁ దక్కిన యన్నిట వచనములును విరివిగాఁ వాడఁబడినవి. అన్నిటఁ గథా వస్తువులు ప్రసిద్ధమైనవే — ఒక్క మూఁడున్నర వజ్రమునఁదక్క. అందు చరిగొండ ధర్మన చిత్రభారతము నందువలె గయోపాఖ్యాన కథ మూఁదలగా విచిత్ర కల్పన కొంతచేయఁబడినది. అల్ప దోషము లెడ నెడ నున్నను నన్ని గ్రంథములందును భాష సలక్షణమైనది. రచన చక్కనిది. శశిరేఖా పరిణయ రచన యన్నిట నుత్తమ మైనదిగాఁ దోచును. (తద్రచనా కాలము "వ్యయ సంవత్సర వైశాఖ శుక్ల గురు వాసర సంయుత దశమి" అనఁగా 13-5-1886). ఈగ్రంథము లన్నియుఁ గథాఖ్యానమునకు మాత్రమే పనికివచ్చునట్టివి. అస లందుల కే యుద్దిష్టములు.

---

* కడమ యేడింటి వ్రాఁత ప్రతులు శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ గారి కడనున్నవి. వారు దయతో నాకు గ్రంథము లెల్లఁజదువ నిచ్చిరి., కర్తృ సమాచార మెల్లఁదెలిపిరి, వారికిఁగృతజ్ఞుఁడను.

# 100. వారాల కృష్ణయ్య

## సారంగధరచరిత్ర :

1886 సం. న పెనుగొండ చంగయ్య ప్రచురించిన యీ సా.చ. ప్రతిలో గ్రంథకర్త తన గ్రంథ స్వామ్యమును ప్రచురణకర్తకు స్వాయముగా దత్తమొనరించినట్లు చెప్పఁబడినది. దీనినిబట్టి కవియు నా కాలము నందుండిన ట్లే ఋజువగుచున్నది. కవి నివాసము నృసింహపురమఁట. ఇంతకంటెఁ గవిని గుఱించిన వివరములు దెలియుటలేదు.

గ్రంథవిషయము :— ప్రసిద్ధము. ఇందుఁ బాత్రప్రవేశసూచనలు, పాత్రలు పృచ్ఛింపఁబడి స్వవిషయముఁ జెప్పుటయుఁగాననగును. తాళప్రధానములగు పదములు, పద్యములు, ద్విపదలు, సంధివచనములునుగలవు. ప్రధాని మొ॥ పాత్రలపదములు కొన్ని హిందూస్తానీలోఁ గలవు. గ్రంథము సంవాదశైలీప్రచురము. ప్రదర్శనానుకూలము. రచనయొకి మోస్తరు. యతిదోషము లెక్కువ.

---

ప్రచురణలు :— 1. పెనుగొండ చంగయ్య, శైవ సిద్ధాంత ము శా. మదరాసు, 1885.

2. శ్రీ రామానుజ విలాస ము. శా., మదరాసు. 1926

3 వెసు వార్డ అండు కో.. మదరాసు. 1950

# 101. మోక్షగుండము సుబ్బకవి

## సీతాకల్యాణము :

(ప్రచురణ :— చిత్తూరు గురుస్వామి మొదలారివారి కవిరంజనీ ము. శా. 6-7-1886)

కవి భారద్వాజగోత్రుఁడు. సుబ్బమాంబా జయరామయ్యల పౌత్రుఁడు. సుబ్బమా చలమయ్యల పుత్రుఁడు గొప్ప శాస్త్ర పండితుఁడు. కర్నూలుజిల్లా కంభముతాలూకా మోక్షగుండాగ్రహార వాస్తవ్యుఁడు. కాలము గ్రంథప్రచురణ వత్సర ప్రాంతమైనఁ గావచ్చును. ఇది యూహామాత్రము. ఈయూహకుఁగొంత యుపష్టారకము రచనాప్రక్రియ.

గ్రంథము నాటకమని పేర్కొనఁబడెను. రెండురాత్రులకథగా విభక్తము. ఇంచుమించు రామాయణ బాలకాండకథ యంతయు నిందున్నది. ఇందు విరహోత్కయగు సీతకడకు రాముఁడెఱుకతయై వచ్చుటవిశేషము. ముఖ్యపాత్రలనుబట్టి కథలో నొక్కొక్కఘట్టము నకు "దశరథవేషము కథ, బాలింతవేషముకథ, విశ్వామిత్రవేషము కథ" – ఇత్యాదిగాఁ బ్రత్యేకశీర్షికలు గలవు. కొన్నియెడలఁ బాత్ర ప్రావేశికధ్రువలు గలవు. కొన్నియెడలఁ హాస్యగాఁడు తెరలోనున్న పాత్రలను బృచ్ఛించి తద్వృత్తాంతము చెప్పించుట గలదు. ఇందుఁ బ్రసిద్ధరాగతాళములలో, దరువులు, ద్విపదలు, కందసీసార్థములు, పద్యములు, ఆఖ్యాన సంవాదోభయ ప్రయోజనాత్మకములగు వచనములు గలవు. దరువులలో మోక్షగుండము ముక్తీశ్వరుని ముద్ర గలదు. రచన చప్పచప్పగానున్నది. తప్పులు గలవు.

# 102. మైనముపాటి వీరరాఘవయ్య

## బాలగోపాల విలాసము:

(ప్రచురణ:— శ్రీవాణీ వినోదమంజరి ము. శా., మదరాసు, తొలికూర్పు, 1887)

కవి భరద్వాజసగోత్రుఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. తండ్రి అయ్యనకవి. తాతగురుమూర్తి. ముత్తాత అయ్యన. సాంబలక్ష్మణా విలాసకర్తయగు కామకవి కనుజుఁడు. గురువున కగ్రజుఁడు. గ్రంథము నాలకూరపాటి వేణుగోపాలస్వామి కంకితముచేసియుండుటచే నది యాతని నివాసము గావచ్చును. కవి కాలము నిర్ణయించుట కాధారము లేదు. కాని 19 శ. ఉత్తరార్ధము వాఁడనియే తోఁచుచున్నది.

గ్రంథము మూఁడు ప్రకరణములుగా విభక్తము. 1 లోఁ గృష్ణజననము, గోపికలతో గోడిగము, 2 లో గోపికావస్త్రాపహరణము, 3 లో గోపికాగీతలును ప్రధాన విషయములు. రచన యంత సలక్షణమైనది కాదు. కాని కొంత సరసమైనదే. ఇందుఁ బ్రసిద్ధ రాగతాళముల లోఁ గీర్తనలు, ద్విపదలు, పద్యములు (కవి చెప్పి పోతనగారి పద్యములను గొన్నిటిని గ్రహించినాఁడు), కందార్ధములు, చిన్న చిన్న వచనములును గలవు. సంవాదశైలి పాటింపఁబడినది. గ్రంథము యక్షగానమని పేర్కొనఁబడినది.

---

# 103. కోకా వెంకటరామానుజులు నాయుడు

## గజేంద్రాళ్వార చరిత్ర :

(ప్రచురణ :— శ్రీ నికేతన ము. శా., మదరాసు, 1887)

కవి ఆదివెలమ. సీతయ్య రమణాంబల పుత్రుఁడు. కాండూరి తిరువెంగడాచార్యుని శిష్యుఁడు. రక్షకభటశాఖాధికారము నిర్వహించినవారు. 19 శ. ఉ. భా. న నుండినవారు. ఈ విషయము లాతని కృత్యంతరము ఐ భగవద్గీతాగర్భితభావబోధిని (రాజమండ్రి, సరస్వతీ ము. శా. ప్రచరణ 1959) నుండి యెఱుఁగనైనవి. గ్రంథవిషయము గజేంద్రమోక్షణకథ. యక్షగానమని పేరొ్కనఁబడినది కాని హరికథ, కీర్తనలు, ఢోరాలు, తేవారములు, వచనములును దఱచు. అక్కడక్కడ పద్యములు, (పోతనవి కొద్ది యథాతథముగ గ్రహింపఁబడినవి. కొన్ని యనుకరింపఁబడినవి.) జాతిస్వరమట్లు, తంగపాటమట్లు గలవు. రచన చక్కనిది.

---

# 104. యమ్మనూరి వెంకటసుబ్బకవి

ఇతఁడు ములికినాటి బ్రాహ్మణుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. ఇతని ప్రపితామహుఁడు సర్వేశ్వరావధాని. పితామహుఁడు పరమేశ్వరయ్య. తండ్రి నీలకంఠయ. తల్లి పుల్లమ. (ఆమె ఆలూరి వేంకటరామయగారి పుత్రియఁట.) ఇతఁడు వేములపల్లె (కర్నూలు మండలము) వాస్తవ్యుఁడు. రాయలసీమలో వేములపల్లె నాటకములని

ప్రసిద్ధిగాంచిన విశేష నాటకములే. అందు యన్. వి. గోపాల్ అండుకో, మదరాసువారి ప్రచురణ 1946) యగు ద్రౌపదీ కల్యాణము ముఖపత్రము వెనుక గ్రంథకర్త స్వీయగ్రంథ ముద్రణ నిర్ణయాది స్వామ్యమును శా. శ. 1816 అనఁగా క్రీ. శ. 1894 సం. న బయాగు త్యాగరాయశాస్త్రిగారి కిచ్చినట్లు గ్రంథకర్తయే చెప్పిన సీసమాలిక యొకటి గలదు. 1887లో మదరాసు శైవసిద్ధాంత ము. శా. వారు ప్రచురించిన మైరావణ చరిత్ర నాటకమునఁ దద్గ్రంథకర్తయగు బూచుపల్లె కొండయ్యయును సుబ్బకవినిఁ దన గురువుగా స్తుతించియుండెను. అనఁగా సుబ్బకవి 19 శ. ఉ. భా. న నుండెననుట నిశ్చయము.

ఇతని కృతులు:

(1) ఉషా పరిణయము (య. గా. ప్రబంధము)

(2) విరాట పర్వము (నాటకము - రెండు రాత్రుల కథ)

(3) ద్రౌపదీ కల్యాణము ( ,, ,,

(యీ మూఁడును వేములపల్లె వెంకటాచలపతి కంకితములు)

(దరువులలో నా ముద్రలును గలవు)

(4) గయోపాఖ్యానము లేక కృష్ణార్జునసంవాదము | నాటకము. వెంకటాపల్లి (పత్తికొండ తా. కర్నూలు జి.) గోపాలున కంకితము.

* మొదటి మూఁడును 1894 సం. న బయాగు త్యాగరాయశాస్త్రిగారి గీర్వాణ భాషా రత్నాకర ము. శా. యందు ముద్రితములై. నేఁటి వనుక యన్. వి. గోపాల్ అండ్ కో., అమెరికన్ డైమండ్ ప్రెస్ మొదలగు వారిచేఁ బునఃపునర్ముద్రితములగుచు వచ్చుచున్నవి. గయోపాఖ్యానము యన్. వి. గోపాల్ అండ్ కో వారిచే 1934, 1947 సం. లలోఁ బ్రచురితము.

ఈ కృతులన్నిట నితివృత్తము ప్రసిద్ధమైనది. ప్రసిద్ధ రాగ తాళములలో కీర్తనలు, ద్విపదలు, పద్యములు, సంధి వచనములు (సంధి పద్యములుగూడ) వీని లోని రచనా ముఖ్యాంగములు. వచనములలో పాత్రల సంభాషణములునుగలవు. అన్నిట రచన సలక్షణము, సరసము, ప్రదర్శనోచితము నైనది. ఇవి ప్రదర్శనల కెక్కి మిక్కిలి రాణించినవి రాయలసీమ ప్రాంత యక్షగాన కవులెందఱో (అర్వాచీనులే కాక సమకాలికులును సుబ్బకవిని దమ కృతులలోఁ బ్రశంసించి యుండిరి.

# 105. బూచుపల్లె కొండయ్య

## మైరావణ చరిత్ర :

(ప్రచురణ: శైవసిద్ధాంత ము. శా., మదరాసు, 1887)

కవి తనవంశ మొకచో బూచుపల్లె యనియు నింకొకచోఁ బెడకంటి యనియుఁ జెప్పినాఁడు. పెడకంటి గంగిరెడ్డి కొడుకు కొండి రెడ్డికి రామమ్మ యందు గంగిరెడ్డి, ఈ రెండవ గంగిరెడ్డికి నాగమయందీ గ్రంథకర్త యుఁ గొడుకులు. గ్రంథము బూచుపల్లె పురధాముని కంకితము. బూచుపల్లి కడపజిల్లా పులివెందల తాలూకాలోఁ గలదు. అది కవి నివాసము గావచ్చును. కొండయ్య ముల్కినాటి కులీనుఁడు. వేములపల్లె వాస్తవ్యులైన సుబ్బయ కవిని దనగురువుగా స్తుతించి యుండెను. అతఁడే 19 శ. ఉత్తర భాగమున నుండిన యమ్మనూరు వెంకట సుబ్బకవి. (ఇతని యుదంతము సద్యఃపూర్వోక్తము) మఱి కొండయ్య కవియు నప్పటివాఁడే యగును.

గ్రంథవిషయము: ప్రసిద్ధము. ప్రసిద్ధ రాగతాళములలో దరువులు (బూచుపల్లె నౌరి ముద్రలతో), ద్విపదలు (రాగములతో, పద్యములు, సంధివచన పద్యద్విపదలు, గండకము సంభాషణ వచనములును గలవు. రచనలో దోషము లెడనెడఁ గలవు. ప్రదర్శనోద్దిష్టమైనది.

---

# 106. గుండు అద్వైత బ్రహ్మశాస్త్రి

## సత్యభామా పరిణయము:

కపి, కాపిశాయన గోత్రుఁడు. గుండు వేంకట నృసింహుని ప్రపౌత్రుఁడు. సూర్యనారాయణ సోమయాజికిఁ బౌత్రుఁడు. వీరమాంబా ముకుంద స్వాముల పుత్రుఁడు. కారుమూరి (రేపల్లె తాలూకా, గుంటూరుజిల్లా) వాస్తవ్యులైన వర్యం అద్వయ బ్రహ్మయగారి దౌహిత్రుఁడు. బుచ్చమాంబా వల్లభుఁడు. అప్పయ, యజ్ఞనారాయణ లనువార లితని పెదతండ్రులు. సూర్యనారాయణ సోమయాజి, వాసుదేవ పరబ్రహ్మశాస్త్రి యనువార లితని సోదరులు. ఈతని యక్కసెల్లెండ్రలో నొక్కతె వాపిలాలవారి కోడలు రాజ్యలక్ష్మమ్మ. ఆమెయే 1887 సం. లో నన్నగారి గ్రంథమును విశాఖపట్టణము నందలి యిండియన్ లా పబ్లికేషన్ ప్రెస్సులో నచ్చువేయించి ప్రచురించినది. గ్రంథకర్త 1880 ప్రాంతమున నుండెననుట నిశ్చయము.

ఈ గ్రంథమునకు సత్రాజిన్నాటకమనియు నామాంతరము. కథావస్తువు ప్రసిద్ధము. ఇందెచ్చటను సత్యభామ గొంతు వినిపించదు.

గ్రంథారంభమున దండహస్తుఁడను (కటికమువంటి) వాఁడు ప్రవేశించి పాత్రాగమనమును సూచించును. వానిచేఁ బృచ్ఛింపఁబడి పాత్రలు తెరలో నుండి ద్విపదలలోఁ దమ వృత్తాంతము జెప్పుటయు, మఱల నదేవిషయము పాత్రముఖముగాఁ దెరవెడలు దరువులలోఁ బ్రసక్త మగుటయుఁ గలదు. ఒక్కొక పాత్ర ప్రవేశమున కొక్కొక ప్రత్యేక శీర్షిక – "సత్రాజిత్తు వేషం కథ" ఇత్యాదిగా. గ్రంథము నాటకీయతా ప్రకృష్టము. రచన చక్కనిది. ప్రసిద్ధ రాగ తాళములలో సంవాదపు దరువులు, సంధిదరువులు, సంధివచనములు, ద్విపదలు, ఏలలు, కంద సీసార్ధములు, పద్యములు గలవు. ద్రావిడ గీత ప్రబంధవిశేషమగు తేవారము ద్వివారము ప్రయుక్తము. గ్రంథము యక్షగానమని పేర్కొనఁబడినది. మంగళగిరి నృసింహస్వామి కంకితము. (కుసుమ కోమలీ నాటకమొకటి యితని కృతియని గుండు అచ్చమాంబగారి "సంపెగ" అను గ్రంథము అట్టపైఁ గలదు. అది యక్షగానము అగునేమో!)

ఏతద్గ్రంథ పరిష్కర్తయైన ధూళిపాళ కృష్ణకవి ధ్రువనాటకము, కుసుమకోమలినాటకము మొ॥ రచించెనని ముఖపత్రముపైఁ గలదు. ప్రాయికముగా నవి య. గా. లై యుండఁబోలును.



# 107. వరిగంటి వేంకటరమణదాసు

## దండధర విలాసము:

(ప్రచురణ:— గ్రంథకర్తచే ముద్రణవిక్రయాధికారములు పొందిన సరస్వతీ తిరువేంకటాచార్యులచే నెల్లూరు సరస్వతీ నిలయ ముద్రాక్షరశాలయందు 1887 లో ముద్రితము)

కవి నివాసము నెల్లూరుమూలపేట "శ్రీమద్రామాయణ భాగవత జగన్మోహనకృష్ణ విలాస రుక్మిణీ కల్యాణ కుచేలోపాఖ్యాన ధ్రువచరిత్రాజామిళోపాఖ్యానాద్యభిధాన యక్షగాన నిర్మాణప్రవీణుండు, శ్రీవత్సగోత్రోద్భవుండునగు శేషగిరిదాసు పుత్రుం" డితడు. (శేషగిరిదాసు చరిత్ర పూర్వోక్తము - చూ. సం. 84). ఇతని కాలము 1887 ప్రాంతమగుట స్పష్టము.

ఈదండధర విలాసమునకే వికటవాది చరిత్రమని నామాంతరము. ఇది గరుడ పురాణాంతర్గతమైనది. ఇందలి రచన సలక్షణము, చక్కనిది. ఇందు వివిధ రాగతాళములలో దరువులు, డోరాలు, పద్యములు, కందార్థములు, రగడ, వచనములును గలవు. కవి దీనిని ప్రబంధమని మాత్రమే పేర్కొనెను. ప్రకటనకర్తలు యక్షగానమనిరి. కవి తనతండ్రిగారి కృతులను యక్షగానములని పేర్కొనెను. ఇదియు నట్లనేయున్నది. కాని యుభయుల కృతులను హరికథాప్రాయములైన రచనలు.

---

# 108. కేశిరాజుం వెంకట సుబ్బరాయ కవి

**రామదాసు నాటకము :**

(ముద్రణ :— రాజన్ ప్రెస్, రాజమండ్రి, 1927 ప్రచురణ కర్త :- తమిరిశ వేంకట రమణారావు)

కవి ఆపస్తంబ సూత్రుఁడు. హారితసగోత్రుఁడు. ఆర్వేల నియోగి బ్రాహ్మణుఁడు. కేశిరాజు సీతాంబా పట్టాభిరామామాత్యుల పౌత్రుఁడు. కామాంబా పుల్లమరాజుల పుత్రుఁడు. ఆచంట రాజ లింగామాత్య దౌహిత్రుఁడు. లక్ష్మీనుసుబ్బరాయని కనుజుఁడు. కవి నివాసము రాజమహేంద్రవరమున కనతి దూరమున నున్న మలకపల్లి. వృత్తిచే నుపాధ్యాయుడు. ఈయన జననము 1858 సం. ర ప్రాంతము. మరణము 1899 సం. రామదాస నాటక రచన "కలియుగాది నవాష్ట ఖచరాబ్ధి సంఖ్య – 4989." అనగా క్రీ. శ. 1888. ఇతని కృత్యంత రములు :— సర్వేశ్వర వేంకట రమణ శతకము, వేంకటేశ్వర తారావళి, చోర చరిత్రము అను తిరుమంగయాళ్వారు చరిత్ర, భద్రాద్రి రామాయణము, ఏకాదశీ మహిమా సర్వస్వము – (ఈ విషయము లెల్ల గ్రంథావతారికలోని యొక ద్విపద వలనను గ్రంథమునకు గ్రంథ కర్త పుత్రులును, రాజమహేంద్రవర వాస్తవ్యులునైన శ్రీ కేశిరాజు సత్యనారాయణగారు తే. 20–11–1926 న రచించిన పీఠిక వలనను నెఱుఁగనైనది.)

గ్రంథ పీఠికలో నీ రామదాస నాటకము గుఱించి యిట్లున్నది. "ఇది సర్వధారిసంవత్సరమున ననఁగా 1888 వ సంవత్సరములోఁ గవి ముప్పది యొకటవ యేట వ్రాసిన పద పద్యాత్మక మగు యక్షగానము.

ఇది యిప్పటి నాటకములవలె వ్రాయు నభిప్రాయముతోఁ గవి 1889 వ సంవత్సరములో నారంభించి ప్రాఁత నాటకముంకని కొన్ని భాగములు స్వీకరించి కొంతవఱకు రచించు నప్పటికి వ్యాధిగ్రస్తులై పరలోకగతులైరి. ఆ వ్రాసిన కొంత భాగమును అనుబంధముగాఁ జేర్పఁబడినది". ఆ యనుబంధములో నాందీప్రస్తావనలు గలవు. ప్రస్తావనలోఁ బాల్గొన్నవారు సూత్రధార, నైతాళికులు, చోపుదారు. అందు నాయికా నాయక పాత్రల పరిచయమును గలదు. నాట కారంభమున నొక కథాసంగ్రహ సీసము. పిదపఁ జోపుదారు పాత్ర ప్రావేశిక ధ్రువ, "ఖామూష్, సైలెన్సు" ఇత్యాదిగా వాని ప్రసంగమును గలవు. "కట్టియం" (ఆ చోపుదారే ఒక సంధి వచనమున నెవరి చేతనో (బహుశా ప్రేక్షక ముఖ్యుఁడెవడో యై యుండును) పృచ్ఛితుఁడై తాను తానిషా రాకను సభవారి కెచ్చరింప వచ్చితి ననును. తరువాత తానిషా తెరలోనుండియే "వినుఁడు మామక వంశ విస్తారమెల్ల" నని యొక ద్విపద నెత్తుకొనును. త॥ "వెడలి వచ్చె నిదిగో తానిషా భూవిభుఁ" డని దరువు. రామదాసాది పాత్ర ప్రవేశములు నిట్లే. ఇందు రామదాసుతోఁ బ్రసంగించిన ద్వారపాలకుఁడు తంజావూరి కటికము వలెనే ప్రవర్తించును. ఎఱుకలసాని పాత్రకుఁగూడ నిందుఁ బ్రసక్తి గలదు. ప్రసిద్ధ రాగ తాళములలో దరువులు, కందార్ధములు, పద్యములు, నన్నిటికంటె నెక్కువగా వచన భాగము, నందులో నాధునిక నాటకములందలి వాక్యపద్ధతియు నున్నవి. ఈ నాటక మైదంకములుగ విభజింపఁబడియున్నది. అంకము లనేక రంగములుగ విభక్తములు. కాని "ఈ గ్రంథమూలమగు చిత్తు ప్రతియందు అంకరంగ విభజనము గాని, ప్రవేశ నిష్క్రమణములు గాని లే" వని పీఠికాకారు లనియున్నారు. ఇది యంతయుఁజూడ నిది మొదట యక్షగానముగనే రచింపఁబడి, పిమ్మట నాధునిక నాట

కముగాఁ బరివర్తింపఁబడుటకుఁ బ్రయత్నము జరిగిన సనుట స్పష్టము. అది యప్పటి కపుడే తెనుఁగుగడ్డపై డేరావేసిన ధార్వాడ నాటక సమాజము వారి ప్రదర్శనల ప్రభావమును సూచించును.

గ్రంథ విషయము :— ప్రసిద్ధమగు భద్రాచల రామదాసు చరిత్రము. ఇందలిరచన మిక్కిలి చక్కనిది.

—— ——

# 109. కురుచేటి సుబ్బరాయకవి

## గౌరీశంకరవిలాసము :

కవి విశ్వకర్మ వంశ్యుఁడు. సువర్ణగోత్రుఁడు. నాగలింగయ పుత్రుఁడు. అనుమలగిరి శివరామయ శిష్యుఁడు. గ్రంథము "గ్రంథకర్తచే శ్రీరంగనాయకీవిలాస ముద్రాక్షరశాల యందు ముద్రింపించి ప్రచురింపఁబడియె. నెల్లూరు, 1889 సం." అని ముఖపత్రముపై నున్నది. కవి 1889 సం. న నుండినాఁడనుట నిశ్చయము. ఏతత్కృతి ప్రోత్సాహకుఁడు మినగంటి పురవాసి బండిమల వీరరాఘవరెడ్డి.

గ్రంథవిషయము :— శివుని దారుకావన విహారము, నారదుని వలన సంగతి తెలిసి గౌరి యలుకచి త్తగించుట - అక్కడినుండి తలుపు కడ గౌరీశంకరుల సంవాదములు, చివరి కిరువురును సమాధానపడుట., రచనదోష బహుళమైనది. ఇందు శహానా, దర్బారు, కమాసు మొ॥ హిందూస్తానీరాగములలో, అటాదితాళములలో వర్ణమెట్లు (వరుసలు) గల దరువులు, ద్విపదలు, పద్యములు, వచనములు కందార్థములు

ఏలలు, (ఏలలనుమను సంవాదములుండుట విశేషము, జావళి తంగం మొ. రచనా విశేషములును గలవు. సంధి ద్విపదలును గలవు. సంవాదశైలికి ప్రాచుర్యమెక్కువ. యక్షగానమని పేర్కొనఁబడినది.

---

# 110. పడకండ్ల స్వామిరాయకవి

**లక్షణా పరిణయము:**

(ప్రచురణ :— జ్ఞానసూర్యోదయ ప్రెస్., మదరాసు.) (1892)

కవి ప్రథమశాఖ నియోగి. కాశ్యపసగోత్రుఁడు. సరసయ మంత్రి ప్రపౌత్రుఁడు. అన్నమరాజ పౌత్రుఁడు. అక్కరాజు పుత్రుఁడు. తల్లి లక్ష్మమ్మ. పాపరాజు, పెదతిమ్మనాయుఁడు, చిన తిమ్మయ యను వారలితని సోదరులు. వీరదేశికుఁడితని గురువు. పడకండ్ల (నెల్లూరుజిల్లా, ఆత్మకూరు తాలూకా) కరణిక మితని వృత్తి. ఇతఁడీ గ్రంథమును విరోధి సం. చైత్రమున రచించినట్లు చెప్పి యున్నాఁడు. ఈవిరోధి 1889 లోఁ బడిన విరోధియే కావచ్చును.

కవి "పరగలక్షణ కన్యకా పరిణయంబు, నాటకము జేసి యాడించినాఁడ జగతి" నని యున్నాఁడు. అంతేకా దొకవిశేషము— గ్రంథ మధ్యమున (పుటలు 28-29) "యౌవన లక్షణ కన్యక వేషము గట్టిన నాయకి" వక్కాణ యొక టిట్లున్నది.

"గోను దిన్నె రామాయణకులజనైన
బుగ్గసాని యటందురు భువిని జనులు
ఘనత లక్షణ వేషము కవియ నాకు
నాజ్ఞచేయఁగఁ గట్టితి నార్యులార"

అంతేకాక కవి "ఈకృతినొనర్చి నటకులన్ రప్పించి పుత్రవాత్సల్యతం ద్రిమాసంబులు తనగ్రామంబున నిల్పి భోజనక్రియలనొసంగి కథలన్ నేర్పించి వేషంబులకు వలయు గణియంబులను, వస్త్రంబులను నొసంగిన మద్గురు చంద్రునిన్ స్తుతింతు" నన్నది బుగ్గసాని. అట్టిదట కవి యభినివేశము. గ్రంథము నాటకీయతా ప్రకృష్టమని వేఱ చెప్ప నక్కఱలేదు. ఇందును పాత్రప్రవేశసందర్భములందుం దత్పరిశంసాత్మకముగా ద్విపదలును దరువులును గలవు. గాని యవి పాత్రముఖమునం బలింపఁబడునవి కావు. నాటకారంభమున దఫేదారు (కటికమువంటి వాఁడు) హిందీ ప్రసంగములు గలవు. ప్రసిద్ధ రాగతాళములలో దరువులు, జావళులు, ద్విపదలు, పద్యములు, కందగీతార్థములు, సంధివచనములు, వచనములలో సంభాషణలు దండకము మొ. గలవు. కథ ప్రసిద్ధమైనది. రచన సులక్షణము సరసము నైనది.

---

# 111. చదలువాడ సూర్యరామకవి

## గయోపాఖ్యానము:

(ప్రచురణ :— 1889 సం. న. వీరరాఘవ ముద్రాక్షరశాల (నెల్లూరు ?) యందు తచ్ఛాలాధికారులు "సదరు గ్రంథకర్తచే గ్రంథస్వాతంత్ర్యముబొంది" నట్లు ముఖపత్రమునఁగలదు. అనఁగాఁగవి 1889 లో నుండిన వాఁడనుటస్పష్టము). కవి చదలువాడ లక్ష్మమాచ్యుత రామయ్యలకుఁ పౌత్రుఁడు. సుబ్బలక్షమా సుబ్బరామయలకుఁ బుత్రుఁడు. గ్రంథమున అనంతపురవర కవిపురధాముల ముద్రలు గలవు. నెల్లూరుతాలూకాలో "అనంతవరం వరకవిపూడి" యను నొకయూరు గలదు. కవి నివాస మదికావచ్చును.

కవి యీగ్రంథమును గేయప్రబంధ మనియున్నాఁడు. గ్రంథము మూఁడుల్లాసములుగా విభాగింపఁబడినది. మూఁడుల్లాసములును మూఁడు రాత్రులకథలుగాఁ జేర్కొనఁబడినవి. అనగా నిది ప్రదర్శనోద్దిష్టమను టలో సందేహములేదు. ప్రచురణకర్తలు దీనిని నాటక మనియే పేర్కొనిరి.

ఇందుఁ బ్రతిపాత్రయు స్వవిషయము నుగ్గడించుటయు, సూత్రధార పృచ్ఛితమై తెర వెడలుట యుఁ గలదు. పాత్ర సంవాదములు హెచ్చుగనే గలవు. ఇందు ద్విపదలు, ప్రసిద్ధరాగ తాళములలోఁ బల్లవి యుక్తములుగా దరువులు, పద్యములు, అర్ధపద్యములు, సంధి వచనములు, ఏలలు, దండకము మొదలైనయును గలవు. ఇందలికథ ప్రసిద్ధమైనది. రచన సలక్షణమే కాని సామాన్యమైనది. తప్పులు తక్కువకాని ప్రౌఢియుఁ దక్కువ.

---

# 112. ఉప్పులూరి కనకయ్య దాసు శ్రీరాములు

ఈజంటకవులరచన సావిత్రీజితీవిలాసమను భామకలాపము * వీరి దువురు 19శ. ఉ. భా. ని నుండినవారు. ఇరువురును సన్నిహితజ్ఞాతులు. ఇందు దాసు శ్రీరాములుగారు సుప్రసిద్ధులు, దేవీభాగవతాది బహు

---

* 1873 సం.న వ్రాయఁబడిన దీని కాగితపుఁ బ్రతియొకటి యీకవుల సన్నిహితజ్ఞాతులలో నొకరగు శ్రీ బందా కనకయ్యగారి కడ (వీరు నేఁడు గుడివాడలో వకీలు వృత్తియందున్నారు) నున్నది. దయతో నా కాప్రతిఁ జూడనొసంగినవారికిఁ గృతజ్ఞుఁడను.

గ్రంథకర్త. వీరితండ్రికన్నయ్యామంత్రి, అల్లూరి (బందరుతాలూకా) కరణము. (శ్రీ మధునాపంతులవారి ఆంధ్రరచయితలలో వీరిచరితము చూడఁదగును). కనకయ్యగారి తండ్రి మల్లయ్యామంత్రి.

ఈకవుల భామకలాపము రచన కూచిపూడి భా. క. బాణీ నున్నది. రచన మిక్కిలిప్రౌఢము సరసమునైనది. కాని యలసములైన హాస్యప్రసంగములు కొన్ని కావ్యౌచితిని దిగనార్చుచున్నవి.

---

# 113. కడియాల వీపూరిఆచారి

## పోతులూరి వీరబ్రహ్మము నాటకము:

(ముద్రణ :— పమ్మి త్యాగరాయ సెట్టిగారి ఆనందభారతి ము. శా., మదరాసు, 1948. ప్రచురణకర్త:—పరిమి వీరాచార్యులు.)

ఈగ్రంథమును పరిమి వీరాచార్యుల కోరికపై కొండశంకర కవి కొంతయుఁ గడియాల వీపూరి ఆచారి కొంతయునుగా రచించిరఁట. వికృతి సం. న గ్రంథరచన ముగిసినదని యున్నది. గ్రంథప్రచురణ కాలమునకు ముందటి వికృతి 1890—91 సం. లలోఁ బడినది. గ్రంథ రచనాకాలమదే కావచ్చును. వీపూర్యాచారి విశ్వకర్మకులజుఁడు. కశ్యపసగోత్రుఁడు. తలిదండ్రులు మహాలక్ష్మి, మల్లయ. నివాసము వినుకొండసీమలోని పోట్లూరు.

ఇందుఁ బ్రసిద్ధుఁడగు పోతులూరి వీరబ్రహ్మస్వామి నాశ్రయించిన దూదేకుల సిద్ధయచరిత్రము ప్రధానకథాంశము. రచన యొక మోస్తరు. దరువులు మొదలగు యక్షగాన రచన స్వల్పముగలదు. గ్రంథము 'నారాయణదాస సాహిత్య' మను పేరొసఁగఁబడినది.

(ఈ కవి నిజలింగ చిక్కయ్య నాటకమునుగూడ రచించినట్లు "బ్రిటిష్ మ్యూజియమ్ లైబ్రరి కేటలాగు" వలనఁ దెలిసినది. గ్రంథము నాకలభ్యము.)

---

# 114. మద్దిరాల వెంకటరాయకవి

## ఏకాంత సేవా విలాసము:

(ప్రచురణ :— శైవసిద్ధాంత ము. శా., మదరాసు, 1891.)

కవి భారద్వాజసగోత్రుఁడు. వెంకటలక్ష్మీ నాగనార్యుల పుత్రుఁడు, పీఠపురవాసి. 19 శ. ఉ. భా. వాఁడు కావచ్చునని యూహామాత్రము.

ఏకాంతసేవ విషయము పూర్వోక్తము (చూ. ఇందలి 102 వ కవి యుదంతము). ఇందలి నాయికానాయకులు గౌరీ కుక్కుటేశ్వరులు. గంగపాత్రనుగూడ ప్రవేశపెట్టి సవతికయ్యము గల్పించినాఁడు కవి. ఇందు దరువులు, పద్యములు, శ్లోకములు, చూర్ణిక, ద్విపద పలురకముల పాటలును గలవు. నిర్వచనము. రచన ప్రౌఢము, మధురము, మనోహరము. ఇది "మద్దిరాల వెంకటరాయ కవివర్యులచే యక్షగానముగ రచింపఁబడి" నది యని ముఖపత్రమున మాత్రముగలదు. అసలు యక్షగానరచనా ప్రక్రియ కొంత గలదు.

# 115. నగళ్లపాటి సుబ్బదాసు

**యామినీ పూర్ణచంద్రోదయము :**

(ప్రచురణ న్యూట్రల్ ము. శా., బళ్ళారి, 1891.)

కవి తలిదండ్రులు చెంచుమాంబా బుచ్చయ్యలు. నివాసము రాయలసీమలోని జంబులమడుగు కాలము 1891 ప్రాంతము గ్రంథ ముద్రణ ప్రశంస నితఁడు చేసియున్నాఁడు. ముద్రణకాలమున గ్రంథ పరిష్కర్తయు నితఁడే)

బిల్హణకవిచరిత్ర మిందు వర్ణితము. గ్రంథము యామినీ పూర్ణ చంద్రోదయము కాని రచన బహుదోషాకరము. గ్రంథారంభమున గణపతి సరస్వతుల స్తుతులుగాక "విఘ్నేశ్వరుని వేషం రావడం", "సరస్వతి వేషం రావడం", విఘ్నేశ్వరునితో హాస్యగాఁడు ప్రసంగించుట మొ॥ అం. లి విశేషములు.

# 116. కోట వెంకటప్పయ్యశాస్త్రి

**బాణాసుర నాటకము :**

(ప్రచురణ :— ఇండియన్ లా ప్రెస్., మదరాసు, 1894.)

కోట సాంబయ్య కొడుకు వెంకటశాస్త్రి. అతనికి దత్తుఁడు నరసింహమూర్తి. నరసింహమూర్తికిఁ జిట్టివల్లమ్మయందు వెంక

టప్పయ్య, సత్యనారాయణ, సాంబమూర్తి యని ముప్వురుపుత్రులు. అంద గ్రజు డీగ్రంథకర్త. ఇతని నివాసము కాశీపట్టణము (శ్రీకాకుళము జిల్లా. గ్రంథమును "పదియు నెనిమిదినూర్ల తొంబదియు మూడు సంఖ్యగల వత్సరఋనందు సరభసమున మే నెలాదిని వ్రాయగా బూనినాడ" నన్నాడు గ్రంథకర్త. అనగా 1893 సం. గ్రంథరచనా కాలము.

గ్రంథవిషయము ప్రసిద్ధము. కవి "బాణాసుర నాటకమను నీ గేయ ప్రబంధము చర్మ విగ్రహముచే నాడించుటకును, వేషముల ధరించి నాటకమాడుటకును అనుకూలముగ నుండునటుల రచింపుడని నా మిత్రులొక కొందఱు ప్రోత్సాహపరచినందున నేనందుల కియ్యకొంటి" నని యున్నాడు. ఇందలి లొట్టికిత్తడు, రత్నాలు, పోలిగాడు నను పాత్రలు తోలుబొమ్మలాటలోఁ బ్రసిద్ధులైన కేతిగాడు, బంగారక్క, జుట్టుపోలిగాడు నను పాత్రలవంటివి. ఇందుఁ బ్రజిద రాగ తాళములలో దరువులు, ద్విపదలు, పద్యములు, సంధి ద్విపదలు, సంధి వచనములు, వచనములలో సంభాషణలును గలవు. అమర శ్లోకోదాహరణములు గలవు. సమాసభూయిష్ఠము గల వర్ణన పద్యములకు వచన వ్యాఖ్యానములు గలవు. సంవాద శైలీ ప్రచురముగా నాటకీయతా ప్రకృష్టముగా నున్నది. కవి విద్వుడేకాని పామర సామాజికుల నుద్దేశించి రచించినట్లున్న దీగ్రంథము. ఉదాత్త పాత్రల ప్రసంగము లైన నుదాత్తముగా లేవు.

---

# 117. ఓగిరాల పాపయ్య

## రామనాటకము :*

కవి విశ్వకర్మ కులజుఁడు. ఉప్పవేలూరు పురనివాసి. భాస్కర రామాయణానుసారముగా నా షట్కాండలును "నాటక యక్ష గానంబుగా" 1852 సం. న రచించినాఁడఁట. అందు బాలారణ్యకాండలు మాత్రమే ముద్రితములు. రెండును ప్రదర్శన ప్రతిష్ఠలు గాంచినవని తెలియుచున్నది. అందు బాలకాండము నప్పటి మచిలీపట్టణము గార్సన్ జే. పటాలము 42 వ రెజిమెంటువారు పదునాల్గు సం. లు ప్రదర్శించిరనియుఁ బ్రచురణకర్త యిందుఁగొన్ని క్రొత్తవిషయములును, తెర దరువులును జేర్చినట్లును బ్రచురణకర్త పీఠికవలనఁ దెలియుచున్నది. బాలకాండలో విఘ్నేశ్వర వేష ప్రవేశము, ఆస్థాన సంతోషి, మంత్రసాని మొ॥ పాత్రల ప్రసంగములును విశేషములు. అరణ్య కాండమున నాశ్వాస విభాగము విశేషము. రచన యొకమోస్తరు.

---

* బాలకాండ ముద్రణ వివరములు తెలియవు. ప్రచురణకర్త పైడిపాటి సుబ్బారాయడు. గౌతమీ గ్రంథాలయమున నొక 'కాపీ' గలదు.—నం. 181. (గ్రంథ రచనా కాల మిందు పేర్కొనఁబడినది.) ఇందు ప్రక్షిప్తభాగము కొంత గలదు.

అ. కా. ముద్రణ:— హిందూ రత్నాకర ము. శా., మదరాసు. 1895. దీని ముఖ పత్రమున గ్రంథకర్తయే స్వయముగా గ్రంథ స్వామ్యమును శివునూరు వీర మల్లయ అను నతనికిచ్చినట్లు గలదు. గ్రంథాంత ద్విపదలో మద్దాల కాశీపతి ఆచారి యను నతఁడీ గ్రంథప్రచురణకుఁ గారణభూతుఁడని చెప్పినాఁడు కవి.

# 118. శ్రీ రాజా మృత్యుంజయ నిశ్శంక బహాదుర్

"శ్రీమన్నారాయణమూర్తివారి శుభదశావతార లఘునాటక రూపక యక్షగానము."

(ప్రచురణ :— ఆర్షముద్రాశాల, విశాఖపట్టణము, 1897.)

గ్రంథకర్త సంగమువలస (శ్రీకాకుళం జిల్లా పార్వతీపురము తాలూకా) జమీందారు. నిశ్శంక వంశ్యులు (ఓఢ్రక్షత్రియులు). వేంకటభూపాల పౌత్రులు, సన్న్యాసాంబా పెద్దనృపాలపుత్రులు. బహుశ్రుతులు, బహుకృతి ప్రణేత. వీరి రాజ్యకాలము 1850 — 1907. వీరి కృత్యంతరములు :— భూపతిపరిపాలన దర్పణము, శంభు శతకము, గౌరీవివాహము (పదము), "స్త్రీవేషధారు లచ్చెరువడఁ బారిజాత మను భామా కలాపము రచించె" (ఇది లభ్యము కాలేదు). (ఈ విషయములు వీ. సూరాస్థానకవి శిరోమణులగు కీ. శే. తనికెళ్ల ప్రకాశశాస్త్రి గారి నిశ్శంకవంశమను కావ్యమునుండి యెఱుఁగనగును).

వీరిగురువర్యులు ప్రసిద్ధులైన శ్రీ పరవస్తు వేంకటరంగనాథాచార్యులు. వారే గ్రంథప్రచురణకర్తలు. (ఆర్షముద్రాశాల వారిదే).

నిశ్శంక సీతమాంబ రచించిన దశావతార కీర్తనల ననుసంధించి కందగీత పద్యములు, నలంకారము లనుపేరఁ గొన్నిచేర్చి జయవిజయ మహావిష్ణు ప్రశ్నోత్తర ప్రశంసాత్మకముగా నొక్కొక్క యవతారకథ చెప్పినారీ గ్రంథమును మృత్యుంజయప్రభువు. రచన సరళము, సలక్షణము నైనది.

---

# 119. రఘునాయకం రామానుజసూరి

## కన్యకావిజయము:

కవి చెన్నపురివాసి. రఘునాయకం తెన్నరంగసుపొన్నడి పౌత్రుఁడు. అళఘురయ్యకు జియ్యమాంబకుఁ బుత్రుఁడు. కృతి ప్రోత్సాహకుఁడు బరంపురం వాస్తవ్యుఁడగు ఆత్మకూరి చిట్టిరామయ్యశ్రేష్ఠి. (కృతికర్తృ శ్రేష్ఠుల వంశచరిత్రము గ్రంథమున విపులముగాఁగలదు.) ఈ చిట్టిరామయ్యగారి యల్లుఁడగు కల్లేపల్లి కృష్ణమూర్తి గ్రంథ ప్రచురణకర్త. గ్రంథ ముద్రణము విశాఖపట్టణము శ్రీ శారదా ముకుట ము. శా. లో 1898 సం. న జరిగినది. కవి 19 శ. ఉ. భా. న నుండెననుట నిశ్చయము. ఇతఁడు కవి మాత్రుఁడుగాక రాజసభాసన్మానము లందిన గాయకుఁడుఁట. నలచరిత్ర, గజేంద్ర మోక్షము, ధ్రువచరిత్రము నను నింకొక మూఁడు యక్షగానములను రచించెనని యీ గ్రంథావతారికవలనఁ గలదు. కాని యవి లభ్యములు కాలేదు.

ఈ గ్రంథమును ఇటీవల తిమ్మయ కన్యకాచరిత్ర యు. గా. వలె భాస్కరాచార్యోపజ్ఞమైన వైశ్యపురాణము ననుసరించినదే. దానివలె నిదియు నెనిమిది యాశ్వాసములుగా విభజింపఁబడినది. ఇందు దరువులు, పద్యము, అర్ధపద్యములు, ద్విపదలకు సూళు తోహరాలు, గౌరీ కల్యాణము మొ. గలవు. రచన శ్రవ్యధోరణి నున్నది. అల్పదోషము లున్నను ప్రౌఢమైనదే. తిమ్మయకృతిని మించి యున్నది.



# 120. గాయకవాడ పెద్దన

ఇతఁడు మహారాష్ట్రగాయకివాడ వంశజుఁడు. కాశీవసు గోత్రుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు. నాగయామాత్యపుత్రుఁడు. మొట్లవారిపాళెం వాస్తవ్యుఁడు. నలచరిత్ర యను జంగముకథ, నలచక్రవర్తి నాటకాలంకారము, హరిశ్చంద్ర నాటకము ననునవి యితని కృతులు. ఇందు రెండవది 1898 లో మదరాసు పమ్మి అరుణాచల సెట్టిగారి శ్రీ వెంకటేశ్వర ము. శా. యందు ముద్రితము. ముఖపత్రముపై నున్న "కాపీరైటు" ప్రకటనలోఁ బ్రచురణకర్త యీ గ్రంథస్వామ్యమును గ్రంథకర్త నుండియే గ్రహించినట్లు గలదు. అనఁగా పెద్దన 1898 లో నుండె ననుట స్పష్టము. న. చ. నాటకాలంకారము మాల్యాద్రి లక్ష్మీనరసింహునకంకితము. ఇందు దాశ్వాసవిభాగము, గ్రంథాదిని గణపతిని, కథాఖ్యాతశ్రోతలగు బృహదశ్వ ధర్మరాజులను బాత్రలవలెఁ బ్రవేశపెట్టుటయు విశేషములు. హరిశ్చంద్ర నాటకము వెలిగండ్ల (పొదిలి తా. నెల్లూరు జి.) నివాసి తోట రామనాయుని ప్రోత్సాహమున రచింపఁబడినది. (తత్ప్రచురణ :— అమెరికన్ డైమండు ప్రెస్, మదరాసు, 1928). రెంటింటను వస్తువు ప్రసిద్ధము. రచన యొకమోస్తరు. తప్పులు గలవు. య. గా. 'బాణీ' గలదు. వచనములందును సంభాషణలు గలవు.

---

# 121. గొఱ్ఱెముచ్చు అబ్బయదాసు

ఇతఁడు " నెల్లూరు జిల్లా కావలి తాలూకా చింతలదేవి పోష్టు మట్టిగుంట గ్రామ నివాసియగు గొఱ్ఱెముచ్చు రంగదాసు సుతుండగు అబ్బయదాసు " (ఇవి అతఁడు వ్రాసికొన్న గ్రంథాంత గద్యలందున్న ముక్కలే). పంచమకుల వైష్ణవుఁడు. తాను గాయకవాడ పెద్దన శిష్యుఁడనని కంఠోక్తిగాఁ దన గ్రంథములన్నిటఁజెప్పినాఁడు. గాయకవాడ పెద్దన 1898 ప్రాంతమున నుండినట్లు మీఁద నిరూపింపఁబడినది. అతని శిష్యుడీతఁడీ 20 వ శతాబ్ది పూ. భా. (పూర్వభాగమున) న నుండి యుండును.

ఇతని కృతులు :— 1. వీరవిజయ విలాసము (వెలిగండ్ల), 2. శశిరేఖా పరిణయము (మట్టిగుంట), 3. ద్రౌపదీ కల్యాణము (చీమల పంట), 4. సుందర సైంధవ గార్దభ పరాభవ నాటకము (ఆదిమూర్తిపురము). నాల్గును నెల్లూరు మండలమందలి యాయా గ్రామములలోని " కామందు " ల ప్రోత్సాహమున రచింపఁబడినవి. నాల్గును మదరాసు వెష్టు వార్డు వారిచే అమెరికన్ డైమండ్ ము. శా. యందువరుసగా 1937, 1949, 1953, 1953 వ సం.లలో ముద్రితములై ప్రచురింపఁబడినవి. శశిరేఖాపరిణయము 1949 సం. ప్రతి యాఱవ కూర్పు. అనఁగా నీగ్రంథము లంతకుఁజాల సం. లు ముందే ముద్రితములై ప్రతులు చెల్లిపోయినవని యూహింపనగును. ఇతని సు. సై. గా. ప. గ్రంథమున అ. డై. ప్రెస్సు అధికారియగు వేలూరి కుప్పుస్వామి ప్రశంస గలదు. ఈ కృతి చతుష్టయేతి వృత్తములును ప్రసిద్ధములు. నాల్గును నాటకములని పేర్కొనఁబడినవి. కాని సమకాలికపు యక్షగానముల " బాణీ " నున్నవి. రచన బహుదోషములు గలది.

---

# 122. గౌన్నాబత్తుల అమ్మనార్యుడు

## బిల్హణీయ నాటకము:

కవి విశ్వకర్మ కులజుఁడు. మాణిక్యాద గోత్రుఁడు. సన్యాసి పౌత్రుఁడు. చిత్రాంబ వీరనాగలింగ పుత్రుఁడు. శ్రీమ దళహర గౌడవర్తి శోభనాద్రాచార్యుని శిష్యుఁడు. కృతిపతి గానుగుల పెద్దయార్యుఁడు. గ్రంథము "కృతిపతియగు పెద్దనార్యునిచే విశాఖపట్టణంబున శ్రీ శారదామకుట ము. శా. లో ముద్రింపించి ప్రచురింపఁబడియె" నని ముఖపత్రము. ప్రచురణ వత్సరము 1901. కాని విశాఖపట్టణమునఁ గృతిసమర్పణ మహోత్సవము 1884 లో జరిగెనని గ్రంథముచివరనున్న తద్విషయవర్ణన సందర్భమునఁ గలదు.

గ్రంథవస్తువు ప్రసిద్ధము. ఇందు సంస్కృత నాటకములందువలె సక్రమమైన నాందీప్రస్తావనలు గలవు. సూత్రధారప్రసక్తి గ్రంథమధ్యమునను గలదు. సంధివచనములు తఱుచు. సూత్రధారుఁడు కథాకథన మొనర్చుచుండును. అశ్లే శక్కిన రచనాప్రక్రియ యంతయు యక్షగానపుఁ "దరహా"కుఁ జెందినట్టిదే. కవి మంచిపండితుఁడు కండగల రచన చేసినాఁడు.

---

# 123. పెమ్మరాజు వెంకటరాజు

## సుందరకాండము :

(ప్రతులు :– ఆం. సా. ప. నం. 3038, ప్రా. లి. పు. భాం., నం. ఆర్. 1470)

కవి యార్వేలనియోగి. కౌండిన్యసగోత్రుఁడు. బ్రహ్మన్న పుత్రుఁడు. కవి కాలము నిర్ణయించుటకుఁ బ్రబలాధారము లేదు. ఆం. సా. ప. లోని కొర్నిపాటి ప్రతి చివర లేఖకుని వ్రాఁతలో అకలంక రంగాచార్యులు పేర్కొనఁబడినాఁడు. ఆం. క. చ. ప్రకారమప్పటికి "నూఱు నూట యేఁబదియేండ్ల క్రిందట నుండియుండ వచ్చు" నని చెప్పఁబడిన కటికినేని రామయ తా నకలంక రంగాచార్యుని సాహాయ్యమునఁ గువలయానం దానువాదము చేసితినని చెప్పుకొనెను. ఆ రంగాచార్యు లితఁడగునో కాదో ; ఇతఁడు నలుబది యేండ్లక్రిందటి వాఁడని కీ. శే. కొత్తపల్లి సూర్యారావు గారు తయారు చేసిన పరిషత్తాళ పత్ర గ్రంథ పట్టికలో నుదాహరింపఁబడినది. సూర్యారావు గారన్నట్లీతఁడు 19 శ. ఉ. భా. న నుండినవాఁడు గావచ్చును.

ఇందలి కథ ప్రసిద్ధమైనదే. మార్పులు లేవు. భాష సలక్షణమైనది కాని రచన సామాన్యమైనది. గ్రంథము యక్షగాన మని పేర్కొనఁబడినది. కాని మూఁడు వంతుల ముప్పాతిక ద్విపదయే. అటనట నటాది తాళములలోఁగొలఁది దరువులు, కీర్తనలు నొక్కచో ఏలలును గలవు.

---

# 124. ధేనువకొండ వెంకయ్య

## వివాటపర్వము: •

కవి కౌశిక గోత్రుఁడు. ఆర్వేల నియోగి. గౌరమాంబా వెంకనార్యుల పుత్రుఁడగు కంచి నామంత్రికి మహాలక్ష్మమ్మయందు పిచ్చయ, వెంకన్న, రాముఁడు నను పుత్రులు గలిగిరి. అందు పిచ్చయకు కనకమాంబయందు సుబ్బయ, వెంగన, కంచినరదుఁడు వేంకటాచలామాత్యుఁడు, చిన్నయ యను పుత్రులు గలిగిరి. అందు నాల్గవయాతఁడీ గ్రంథకర్త. 1902 సం. పు ముద్రిత ప్రతి ముఖపత్రముపై "ఇది వంగోలు తాలూకా ధేనువకొండ వెంకయ్యగారిచే రచియింపఁబడి వంగోలు కాపురస్థుడు కురుగంటి వెంకటరమణయ్యగారిచే.....ప్రచురింపఁబడినది" అని కలదు కవి 1900 సం. ప్రాంతమువాఁడని యూహింపవచ్చును.*

ఈ గ్రంథము మహా యక్షగానమనియు నాటకమనియుఁ బేర్కొనఁబడినది. ఇందుఁ దిక్కనగారి పద్యము లనేకము యథాతథముగా గ్రహింపఁబడినవి. పలుకోర్కెన్న దరువులుగా మలఁచబడినవి. ఇందలి దరువులీ నాఁటికి నాంధ్రదేశ మన్నెములలో గ్రామసీమల "కామందుల" (కామధేను శబ్దవికృతి?) లోగిళ్లు లందును గంబారుల

• ప్రమాణ:-- పూర్వభాగము మాత్రము సి. యస్. ముద్రాక్షరశాల (మదరాసు) యందు, 1902 లో ముద్రితము. 1903 లో మదరాసు అమెరికన్ డైమండు ము. శా. వారిచే ప్రచురితము. ఇందు కవి వంశాదికము, ఆశ్వాస విభాగము మొ. ఎత్తివేయఁబడినవి. అవి పూర్వప్రచురణమునఁ గలవు.

* శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావుగారల అభిప్రాయము నిదే.

కళ్లములందును వినఁబడుచుండును. కొంత యనుకరణము, కొన్ని దోషములు నున్నను వెంకటస్వామి రచన కడుచక్కనిదని చెప్పవచ్చును. సులభశైలిలో నెంత చురుకైన భావమునైనను చేవగల మాటలతోఁ జెప్పఁగలఁడు. అందులకు యావదాంధ్రమున ననతికాలమున విశేష ప్రచారము గాంచిన "నినుజూచి నా విభుఁడు" "ఎంతా మాటాడితివనూ" అన్న సుధేష్ణా ద్రౌపదుల దరువులే తార్కాణలు. ఇందువచనము నందును పాత్రల సంభాషణలు గలవు. ఇతఁడే విరాటపర్వమునే జంగంకథగాఁ గూడ రచించి యున్నాఁడు. (అదియు ముద్రితమైనది.

---

# 125. గైనేడి వెంకటస్వామి నాయఁడు

## యేసునాధకథామృతము :

(ముద్రణ :— స్కాటిష్ప్రెస్, మదరాసు, 1904)

కవి పైడిపాటి గోత్రుఁడు. అప్పన పౌత్రుఁడు. రంగనాయకుని పుత్రుఁడు. శ్రీకాకుళ మండల వాసి. 1900 సం. ప్రాంతము వాఁడని తోఁచును.

గ్రంథవిషయము:— యేసుక్రీస్తు చరిత్రము. రచన సరళము నవేలకము నైనది. కవి భావనలో భక్త్యావేశము, సత్యాత్మికతయు గోచరించును. యక్షగానమని పేర్కొనఁబడినది. ఇందు దరువులు, తోహరాలు, ద్విపదలు, గద్య పద్యములు మొ. గలవు.

# 126. సందడి నాగదాసు

## పంచాక్షరీ ప్రభావము:

(ముద్రణ :— గీర్వాణభాషా రత్నాకర ము. శా., మదరాసు,
(1907. ప్రచురణ కర్త : అన్న దేవర వీరేశలింగం).

కవి గుఱించి వివరము లిందెలుఁగఁబడవు. గ్రంథ ప్రచురణ కర్తయే కృతి ప్రోత్సాహకుఁడు నని యుండుటచే నితఁడు 1907 సం. ప్రాంతముననుండె ననవలెను. కృతి రచనా కాలము వికృతి మార్గశిర బహుళ దశమి విధువారముగాఁ జేర్కొనఁబడినది. ఈ వికృతి 1890—91 కాఁదగును. ఇం దితని కృత్యంతరములుగాఁ బేర్కొనఁబడి నవి :— లక్ష్మీనారాయణ శతకము, శ్రీపతి శతకము, భగవద్గుణ కీర్తనలు, భజగోవింద కందార్థములు, అచల బోధ సీసార్థములు, శ్రీరామ శతకము, జీవన్ముక్తి విచారము, భగవద్గీత కందార్థములు, స్వర శాస్త్రము, సర్వమత సమత్వ సిద్ధాంతము, సకల తత్త్వార్థ దర్పణము.

ప్రస్తుత గ్రంథ విషయము :— పాశుపతార్థము తపోదీక్ష నున్న యర్జునున కింద్రుఁడు పంచాక్షరీ మంత్రోపదేశము చేయుటయే యిందలి ముఖ్యవిషయము. ఇంద్రార్జున సంవాదమని యీ గ్రంథ నామాంతరము. దీనఁ గథ యేమియులేదు. చివరికి శివుఁడు ప్రసన్నుఁ డగుట చెప్పఁబడినది. గ్రంథము యక్షగానమని పేర్కొనఁబడినది. రచన కొంత ప్రౌఢమైనదే.

---

# 127. కందాళ్ళ రామాచార్యులు

కవి వాధూలసగోత్రుఁడు. లక్ష్మాంబా శేషయార్యుల పుత్రుఁడు. శ్రీరంగం కృష్ణకవికి దౌహిత్రుఁడు, శిష్యుఁడు. కడప మండలము జమ్మలమడుగు తాలూకా పెదుదూరు గ్రామవాస్తవ్యుఁడు. ఇతని కృతులు ద్రౌపదీ వస్త్రాపహరణము [1], హరిశ్చంద్ర [2], కళాపూర్ణోదయము [3]. ఇందు కళాపూర్ణోదయము బరూరివారి ప్రచురణ (1911 సం.) పరిష్కర్తలలో కందాళ్ళ రంగాచార్యు లొకఁడు. ఇతఁడు రామాచార్యుల యనుజుఁడనియు, నా గ్రంథరచనలో నడుమ నన్నగారు చనిపోఁగా నితఁడు పూరించినట్లును సందేగలదు. కాఁగా రామాచార్యులు 1900 స. ప్రాంతమునందుండె ననవచ్చును.

ద్రౌపదీ వస్త్రాపహరణము, హరిశ్చంద్ర నాటకము లందలి వస్తువు పురాణప్రసిద్ధమైనది. కళాపూర్ణోదయ నాటక మందలి కథ సుప్రసిద్ధమైన పింగళి సూరనార్యుని ప్రబంధేతివృత్తము. ఇందు కల భాషిణీవృత్తాంతముమాత్రము పూర్తిగాఁగలదు. కాని కళాపూర్ణోదయ మింకను గానేలేదు గ్రంథము సరి. రామాచార్యుని కృతి నామము సార్థకము గాదు. అయితే అతఁడు గ్రంథరచన పూర్తికాక

---

1 1906 లో మదరాసు జీవరత్నాకర ము. శా. యందును, 1930 లో మద్దాల శేషాచలం సెట్టి (మదరాసు) చేతను ముద్రితము.

2. మొదట బరూరివారి గీర్వాణ భాషా రత్నాకర ము. శా. (మదరాసు) వారి చేతను, 1950 లో మదరాసు యమ్. వి. గోపాల్ అండుకో వారి చేతను ముద్రితము.

3. బరూరివారి గీ. భా. ర. ము. శా. మదరాసు, 1911 (ఇందు మొదటి రెండు కృతులును చేర్పఁబడినవి.)

మునుపే కాలధర్మ మొందినాఁడు. తమ్ముఁడు తరువాయి కొంతవఱకే తీర్చినాఁడు. ఇందలి కథాప్రణాళిక యథా సూరనీయముగా నడచినది. భావములు ననేకము గ్రహింపఁబడినవి, యనుకరింపఁబడినవి. రచన విషయమున రామాచార్యులు స్వతంత్రముగనే వ్యవహరించినాఁడు.

ఇతని గ్రంథములు మూఁడును నాటకములని వ్యవహరింపఁ బడినవి. మూఁడింటను రచన యంత ప్రౌఢిగలది కాదు. కాని సలక్షణము నవేలవమునైనది. ప్రసిద్ధ రాగతాళములలో దరువులు, ద్విపదలు, పద్యములు, వచనములు (అన్నియు సంభాషణ పరములే), చూర్ణికలుఁ మొదలగు రచనాంగములు, సూత్రధార ప్రసక్తి, చోపుదారు పాత్ర మొదలగునవి మూఁడింటను సమానము. హరిశ్చంద్ర కళా పూర్ణోదయములందు గ్రంథారంభమునే నటీనటుల ప్రస్తావన విశేషము. కళాపూర్ణోదయ ప్రస్తావనలో సభా ప్రార్థన, వసంతకీర్తన, గణపతివేషములు, "నృత్యగీత వాద్య స్వర తాళ మేళనంబుగా నాడుట" కుద్దేశింపఁబడినది.

---

# 128. క్రొవ్విడి రామకవి

ఇతఁడు ద్వైల నియోగి. ఆపస్తంబ సూత్రుఁడు. హరితస గోత్రుఁడు. తండ్రి లక్ష్మీనారాయణ. తల్లి నాగాంబ. జననము విభవ శ్రీరామ జయంతి (క్రీ. శ. 1868. భీమవరము తాలూకా ఆరేడు స్వగ్రామము. ఇతని కృతులు చిత్ర కావ్యవాదులు చాల గలవు. అందు యక్షగానములు :— ఇళోపాఖ్యానము, దేవాసురనాటకము,

(కాండ పంచకము), సత్యభామావిలాసము. (చూ. "ఆధునిక కవి జీవితములు", దేవాసురనాటకము సవనకాండ మాత్రమే నేఁ డుపలబ్ధము. (ప్రచురణ — మంజువాణీ ము. శా., ఏలూరు. మొదటి కూర్పు, 1905.) ఇందలి విషయము వామనావతార చరిత్రము. పోతన పద్యము లనేక మిందు గ్రహింపఁబడినవి. దరువులు, అర్ధపద్యములు (ద్విపదార్ధములు విశేషము), సంధి సంవాద వచనములును గలవు. రచన యంత సలక్షణము గాదు.

---

# 129 కెళ్ళ కప్పయ్య

## నలచరిత్ర నాటకము :

(ప్రచురణ :— యన్. వి. గోపాల్ అండుకో, మదరాసు 1949)

కవిపేరు కుప్పయ్య అని గ్రంథమునఁ గొన్నిచోట్లఁ గలదు. గ్రంథము "విజయరామ గజపతి మహారాజ తనూభవ ... శ్రీమదానంద గజపతిరాజ బిడౌజ పరిపాలిత శ్రీమద్వేచలపురనివాస శ్రీసాగినేటి రామచంద్రరాజశేఖరునిపై" జెప్పఁబడినది. ఈఆనంద గజపతి రాజ్యకాలము 1879-1897 (చూ. విశాఖ జి. గెజిటీరు). కాఁబట్టి కవి 19 శ. ఉ. భా. న నున్నవాఁడని చెప్పవచ్చును. గ్రంథవిషయము ప్రసిద్ధము. రచనచక్కనిదే. య. గా. ప్రాయనాటకము. సంధి—సంవాదవచనములు రెండునుగలవు.

---

# 130. నిశ్చింత ఎంబారయ్య

## ప్రహ్లాద విజయము:

ముద్రణ :— కమలానంద ము. శా., మదరాసు, సం. (?)

కవి పరాంకుశసగోత్రుఁడు. రామానుజయ్య పౌత్రుడు. భట్టరార్యుని పుత్రుడు. పచ్చయప్ప కాలేజీలోఁ జేరిన గోవిందప్పనాయుని వారి మిడిల్ స్కూలు 'తెలుఁగు పండితుడు'. ఇతఁడు తన గ్రంధారంభమునఁ జిన్నయ్యసూరిని స్తుతించియుండెను. కనుక నాధునికుఁడనుట స్పష్టము. (19 శ. ఉ. భా. న నుండి యుండును). తన ప్రహ్లాద విజయమును య. గా. అని పేర్కొనినాఁడు. ఇది "బాలికల కత్యంతోపయుక్తమగునట్లు" రచింపఁబడినదఁట. ఇందు తాళప్రధానములైన దరువులు, ద్విపదలు, పద్యములు, సంధివచనాలు, అర్ధచంద్రికలు, ఏలలు, ధవళశోభనములు, సువి., లాలి మొ. గేయ రచనలును గలవు. రచన సలక్షణము, సరసము నైనది.

---

# 131. ముడుంబ నరసింహాచార్యులు

ఈయన శ్రీవైష్ణవుడు, వీరరాఘవాచార్య పుత్రుఁడు. జన్మస్థానము శ్రీకూర్మముదగ్గర అచ్యుతపురి. కాలము క్రీ. శ. 1841-1927. గరుడాచలనాటక మీయనరచన. (చూ. శ్రీ మధునాపంతుల వారి "ఆంధ్రరచయితలు"). గ్రంథము లభ్యముకాలేదు. ఇది యక్షగానమగునేమో !

---

# 132. చతుర్వేదుల వెంకటనరసింహయ్య

ఈయన గుంటూరుజిల్లా నర్సారావుపేటతాలూకా విప్రులపల్లి అగ్రహారం వాస్తవ్యులు. కాలము క్రీ. శ. 1855 - 1915. ద్రౌపదీ వస్త్రాపహరణము, సీమంతినీ పరిణయము, రాధాకృష్ణ సంవాదము మొదలగు యక్షగానము లనేకము రచించి వానిని బొమ్మలాటవారిచేఁ గూడ నాడించుచుండెడివారట. ఆగ్రంథము లలభ్యములు. (ఈవిషయ మంతయు కాకినాడ పి. ఆర్. కళాశాలాంధ్రోపన్యాసకులైన శ్రీచతుర్వేదుల సత్యనారాయణశాస్త్రిగారివలనఁ దెలిసినది).

---

# 133. ద్విభాష్యం పుల్లకవి

కవి నివాసము దుర్గాడ. జననము 8-9-1872. తండ్రి జగన్నాథము. తల్లి వేంకటాంబ. ఆరామద్రావిడులు. వాలఖిల్యసగోత్రులు. శ్రీకృష్ణ గోపీజలక్రీడా భాగవతమను యక్షగానము - వీధి నాటకము నీతఁడు రచించెనఁట. (చూ. ఆధునిక కవిజీవితములు). గ్రంథ మలబ్ధము.

---

# 134. కళ్లేపల్లి వెంకటరమణమ్మ

ఈమె తండ్రి కురవి రామశాస్త్రి. తల్లి కామనాంబ. భర్త శివరామయ్య. బడగలనాటి కరణకమ్మ వైదికులు. భారద్వాజ గోత్రులు. నివాసము గంజాం జిల్లా బరంపురము. ' జననము 1875. వరలక్ష్మీ పూజా విధాన మీమె యక్షగాన కృతియఁట. (చూ. ఆ. క. జీ.). గ్రంధ మలభ్యము.

# 135. నందివాడ జగన్నాధకవి

ఈయన నివాసము ఏలూరు తాలూకా స్వామిపురము. జననము 1878. ఈయన "హరికథా రూపంబుగా యక్షగానంబు" లనేకము రచించిరఁట. (చూ. ఆ. క. జీ.) అవి :—

1. శ్రీకృష్ణుని రాయబారము.
2. శ్రీమద్రామాయణము. (షట్కాండలు)
3. సీతాకల్యాణము
4. హైమవతీ పరిణయము.
5. గయోపాఖ్యానము.
6. హరిశ్చంద్రోపాఖ్యానము.
7. వామన చరిత్రము.
8. కాళీయమర్దనము.
9. చిత్రకేతూపాఖ్యానము.
10. ఇళోపాఖ్యానము.
11. చంద్రహాస చరిత్రము.
12. సానందోపాఖ్యానము.
13. సత్యవతీ చరిత్రము.

ఇందొక్కటియు లభింపలేదు (నాకు).

# 136. త్వరకవి రామకృష్ణయ్య

ఇతఁడు శౌనకసగోత్రుఁడు. సీతమాంబా మంగనామాత్యుల పుత్రుఁడు. నెల్లూరు మండల మందలి విలుకానిపల్లె వాస్తవ్యుఁడు. ఈయన 19 శ. ఉ. భా. నను, నీ శతాబ్ది ప్రథమ పాదమునఁ గొంత కాలము నుండిరనియు, యక్షగాన ప్రదర్శనములు గావింపుచు నందుఁ దానుగూడఁ బాల్గొనుచు నుండెడి వాఁడనియుఁ దెలియుచున్నది.* తాను "నానావిధ యక్షగానములు" రచించితి నని చెప్పినాఁడు. అందు భవానీ శంకర విలాసము[1], వీరభద్రవిజయము[2], నను నవి మాత్రము నేఁడుపలబ్ధములు, భ. శం. వి. గద్యలో నితని కృత్యంతరములు పేర్కొనఁబడినవి. రుక్మిణీ, రతి, ద్రౌపదీ పరిణయములు, ధ్రువోపాఖ్యానము, తులసీ మాహాత్మ్యము, చెన్నకేశవ సంవాదము, రుక్మిణీ సంవాదము, గోపాల మాహాత్మ్యము, గోపాల స్థల పురాణము, గజేంద్ర మోక్షము, సహస్రకంఠ రామాయణము.

ఈతని భవానీశంకరవిలాసము కోరుటూరి వల్మీకనాథస్వామి కంకితము. కృతి ప్రోత్సాహకుఁడు వంటిమిట్ట రామలింగస్వామి నాయుఁడు. ఇది యక్షగానమని పేర్కొనఁబడినది. దారుకావన

---

* ఈవిషయము డాక్టరు శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు మొదలగు నెల్లూరు మండల ప్రముఖుల వలన వింటిని.

1. ఇది 1892 లో నెల్లూరు పకీరయ్యానాయునిచే మదరాసు యన్. కుప్పుస్వామి చెట్టి అండుకో వారి మ్యాక్ ఆఫ్ ఎడింబరో ప్రెస్ నందును, 1909 లో మదరాసు బి. వి. రంగయ్య సెట్టిగారి శ్రీ లక్ష్మీనృసింహవిలాస ప్రెస్‌లోను ముద్రితము.

2. ఉప్పల వీరన్న శ్రేష్ఠిచే 1930 లో మదరాసు చంద్రికా ముద్రణాలయమున ముద్రితము.

కాంతలఁగూడి వచ్చిన వాల్మీకనాథునకును గామాక్షికిని జరిగిన సంవాద మందలి విషయము. వీరభద్రవిజయ మిందు కూరిపేట నివాసి యగు సూరి సుబ్బానాయుని ప్రోత్సాహమున రచితము. ఇందు దక్షాధ్వర ధ్వంసమునుండి గౌరీకల్యాణము వఱకుఁగల కథ వర్ణితము. ఇందలి కథా ప్రణాళిక శివలెంక మల్లనారాధ్యుని వీరభద్ర విజయము నందున్నట్లే యున్నది. అసలు రెండును "వాయు పురాణోక్త ప్రకారంబున" రచింపఁబడిన యక్షగానములు. త్వర వివారి కృతి రెండు భాగములు. గేయ ప్రబంధమని పేర్కొనఁబడినది. ఇందు గ్రంథారంభమున సూత్రధారుఁడు కథోపోద్ఘాతము నుపన్యసించుట గలదు. ఆయన కృతులు రెండిటను రాగ తాళ ధారాళములగు దరువులు, ద్విపదలు, పద్యములు, కందార్ధములు, సంధి వచనములు మొ. గలవు. రెండిటను సంవాదశైలిపా లధికమే గాని యందులకు వచన ముప యుక్తము గాలేదు. రెండిటను రచన సలక్షణము ప్రౌఢియు సారస్యమును గలది.

# 137. గోపాలుని హనుమంతరాయశర్మ

ఈయన నివాసము వినుకొండసీమ ముప్పాళ్ళ. జననము 1888. ఆ. క. జీ. లో నీయన "యక్షగాన ప్రబంధములు" గాఁ బేర్కొనఁబడినవి :—

1. నృగచరిత్ర. 2. సానందోపాఖ్యానము.
3. సత్య హరిశ్చంద్ర 4. చంద్రకాంత.

ఒక్కటియు లభించినదికాదు. (ఈయన గోపాలుని సింగయ మనుమఁడగునో!)

---

# 138. జ్యోతి కోట దాసు

## చిరియాళ మహారాజు నాటకము :

కవి పంచమకులజుఁడు. రేచర్ల గోత్రజుఁడు. తలిదండ్రులు పోలమ, ఓబయ. తిరుపతి, వెంకటప్పల కనుజుఁడు. ఫూరే శేషార్యుల శిష్యుఁడు. తాళ్ళూరు (బళ్ళారిజిల్లా) నివాసి. 1903 సం. న మదరాసు లోని స్వకీయ శ్రీరామవిలాస ము. శా. యందుఁ దనగ్రంథమును ముద్రించిన పెసల నమ్మాళ్వారు సెట్టిని, గ్రంథపరిష్కర్తయైన చీమ కుర్తి వీరరాఘవకవిని దనగ్రంథమున నీతఁడు ప్రశంసించి యున్నాఁడు. గ్రంథరచన ప్లవమాఘమని పేర్కొనినాఁడు. అది 1902 సం.

గ్రంథవిషయము చిఱుతొండనంబి కొడుకగు సిరియాలుని చరిత్ర. ఇందుఁ బ్రసిద్ధరాగతాళములలో దరువులు, ద్విపదలు, పద్యములు అర్ధపద్యములు, ఏలలు మొ॥ గలవు. సంధివచనములు తఱుచుగా నున్నవి. కాని సంవాద వచనములులేవు. చోపుదారి పాత్రగలదు. రచన పామర జనాభిరుచికిఁ దగినట్లున్నది.

# 139. చీమకుర్తి వీరరాఘవ కవి

## చంద్రసేన మహారాజు నాటకము :

(ప్రచురణ :— శ్రీరామ విలాస ము. శా., మదరాసు, 1903)

కవి ఆపస్తంబ సూత్రుఁడు కౌండిన్యసగోత్రుఁడు. వెంకయ్య పౌత్రుఁడు. భద్రమాకోటేశ్వరామాత్యుల పుత్రుఁడు. ఇల్పావులూరి

కోటేశ్వరస్వామి తెనుఁగుపు. ఇతఁడు పై శ్రీరామ విలాస ము. శా. యం దే 1903సం.న ముద్రితమైన జ్యోతి కోటదాసు చిరియాళ మహారాజు నాటకగ్రంథ పరిష్కర్త కాఁబట్టి 1903 లో నుండెననుట నిశ్చయము. తన గ్రంథరచనా కాలము వికారి-ఆశ్వయుజమని చెప్పినాఁడు. అది 1899 సం. ఇతని కృత్యంతరము సావిత్రీ పరిణయము.

గ్రంథ విషయము :— చంద్రసేనుఁడను శకరాజు మృగయా విహారార్థ మడవికరిగి యచటఁ బౌలస్త్యముని యాశ్రమమున నొక నిమిత్తము పెంపఁబడుచుండిన పద్మగంధియను సింధు రాజ పుత్రినిఁజూచి మోహించి గాంధర్వవిధినిఁ బరిణయమాడి నిజరాజధాని కరుగును. పిదపఁ గొన్నాళ్ళ కామె కొడుకునెత్తుకొని రాఁగాఁ దా నామె నెఱుఁగ ననును. పద్మగంధిప్రార్థనపై శివుఁడు ప్రత్యక్షమై చంద్రసేనునిచే దారపుత్రులను స్వీకరింపఁజేయును. ఈకథ శాకుంతల కథకుఁ బ్రతిబింబముగా సృజింపఁబడినది. ఇందానాఁటి యక్షగాన ప్రక్రియ యంతయుఁ గలదు. కాని వచనమున సంవాదము లతివిరళముగా నున్నవి. గ్రంథారంభమున "ఘటికుఁడు" లేక "కట్టియవాఁడు" వచ్చుటయు హిందీలోఁ బ్రసంగించుటయుఁ గానవచ్చును. తెరలోపల నృత్యము సల్పుచున్న నాయిక పాత్రను సూత్రధారుడు బలకరించుటయుఁ బాత్ర స్వవిషయము జెప్పుటయుఁ గలదు. సూత్రధారునకు ద్వారకుండను పర్యాయపదము వాడఁబడినది. గ్రంథము యక్షగానమనియు, నాటకమనియు, గేయప్రబంధమనియు బేర్కొనఁబడినది. రెండాశ్వాసములుగా విభక్తము. రెండాశ్వాసములును రెండురాత్రుల ప్రదర్శనకుద్దేశింపఁ బడినవి. రచన ప్రౌఢమైనదనియే చెప్పవచ్చును.

———

'హరికథా పితామహ'

# 140. శ్రీ మదజ్జాడాదిభట్ల నారాయణదాసు

ఆంధ్ర హరికథా పితామహులు శ్రీ నారాయణదాసుగారు సుప్రసిద్ధులు. వీరు ద్రావిడ బ్రాహ్మణులు. భారద్వాజ సగోత్రులు. ఆదిభట్ల వేంకటచయని లక్ష్మీనరసమ్మల పుత్రులు. బొబ్బిలి తాలూకా అజ్జాడాగ్రహారము వీరి స్వస్థలము. విజయనగరము చిరనివాసము. ఆనందగజపతి మహారాజుచే ననేక ఘనసన్మానము లందినవారు వీరు. బహుభాషా వైదుషీ సంగీత సాహిత్య విశేష శేముషీ ధురంధరులు. పుంభావ సరస్వతులు. వీరి జీవితకాలము 1864 - 1945. (చూ - "ఆంధ్ర రచయితలు").

వీరు "హరికథ" లనేకము రచించి వానినెల్ల యక్షగానము లని వ్యవహరించినారు. రెండును గద్య పద్య గేయాత్మకము లగుటయే వాని ప్రక్రియానాదృశ్యమునకును బర్యాయవ్యవహారమునకును గారణ మైనది. కాని మనవాఙ్మయమున "హరికథలు" 19 శ. ఉత్తరార్ధము నుండియే కన్పించును. యక్షగానములు ప్రాచీనములు.

యక్షగానము లెక్కువగా దృశ్య ప్రయోజనాత్మకములు. హరికథ లేకపాత్రాభినయోపన్యాస ప్రయోజన పరిమితములు. కాని ప్రక్రియలో రెండిట నేదో సాదృశ్యము తోఁచి దాసుగారు, బాగేపల్లి అనంతరామాచార్యులవారు మొదలైన పండితులు హరికథలనే యక్షగానములని వ్యవహరింప నారంభించిరి. ఆ వ్యవహారము పరంపరగా వ్యాప్తినంది హరికథ యనఁగా యక్షగానప్రాయ రచనమనుటకు మాఱు యక్షగానమనఁగా హరికథయే యని కొంద అనుకొనునంత

వఱకు వచ్చినది. కాని దాసుగారివికాని, మాచార్యులవారివికాని తదితరులవి కాని యక్షగానములుగా వ్యవహృతము లైన హరికథ లొక వేళ నందు గొన్ని కొంతవఱకు నాట్యధర్మయుతలే యైనను నేకైక వ్యక్తిచే నేపథ్య రహితముగా సాభినయముగా నుపన్యసింపఁబడుటయే కాని యక్షగానములవలెఁ బాత్ర నేపథ్య బహుళముగా వేసాఁడును ప్రదర్శింపఁబడ లేదు.

దాసుగారి హరికథలు :— అంబరీష ధ్రువ ప్రహ్లాద సావిత్రీ హరిశ్చంద్ర మార్కండేయ భీష్మ చరిత్రములు, గజేంద్రమోక్షము, రుక్మిణీపరిణయము, జానకీ శపథము, యథార్థ రామాయణము, (ఇవి యన్నియు 1929 సం. నకు ముందే బెజవాడ సరస్వతీ బుక్ డిపో వారిచేఁ బ్రచురింపఁబడినవి). ఇవికాక వీరు సారంగధర నాటకమును రచించిరఁట. అదియు యక్షగాన ప్రాయమైన వీధినాటకమై యుండు నేమో ! పై కృతులన్నియుఁ బ్రసిద్ధేతివృత్తములే. అన్నిట రచన యతిమనోజ్ఞమైనది. వానిలో సామాన్యముగాఁ గాననగు రచనా విశేషములు :— వివిధ ప్రసిద్ధ రాగతాళములలోఁ గీర్తనలు, మరాటీ బాణీ హరికథలలోని ఢోరాలకు తోహరాలకును బదులుగా మంజరి (మంజరీ ద్విపదిగాదు), గద్యపద్యములు, నక్కడక్కడ ద్విపదయు, దండకములు మొదలైనవి. యక్షగానములలోవలె నీ హరికథలలో సంధివచనములు, పాత్ర ప్రవేశ సూచనలు, తెర ద్విపదలు మొదలగునవి యుండవు. కొన్నిట వచనము లున్నను నవి సుదీర్ఘములు, వర్ణనాత్మకములు, నాఖ్యానశైలీ ప్రచురములునై యుండును.

అంబరీష చరిత్రోపోద్ఘాతమున నట్టి యక్షగానములగుఱించి దాసుగారిట్లనియున్నారు :— " ఈ యంబరీషోపాఖ్యానము దొట్టి మఱి కొన్ని యక్షగానములను వ్రాసియుంటిని. యక్షగానము లనఁగా స్వర

నియతములగు నక్షర సందర్భములు పద్యములవలె, దద్గీతబంధములం గూడ సమవ్యాకరణచ్ఛందోబంధములుగఁ దెలియునది... ఆంధ్ర యక్షగాన ప్రబంధము లధ్యాత్మ రామాయణ మృత్యుంజయ విలాసములు .....బారశాలలకు వెలికానేల; — యక్షగానములు గూడ వాగ్గేయకార ప్రణీతములైనచోఁ బారశాలల నంగీకరింపఁబడవలసినదే. నేఁదెలిపినమట్లు యక్షగానముల కుదాహరణముగ నిందుతోఁ బది విరచించినాఁడను" — ప్రహ్లాద చరిత్రావతారికలో యక్షగాన ప్రయోగముగూర్చి యది శ్రుతి లయాత్మకమై రాగ వైవిధ్యము జాతిమూర్ఛనయుతమైన స్వరాలాపనయుఁ గలిగిన గానముతో, రసానుకూలమైన నృత్యముతో నొప్పుచుండవలెనని చెప్పినారు దాసుగారు. హరికథా యక్షగానోత్పత్తి పరిణామ చరిత్రను బరిశీలించి చూచినచో యక్షగాన మనఁగా హరికథ యనుట సరిపడదుగాని దానిని హరికథవలెఁగూడఁ బ్రయోగింపవచ్చునన్నచో యక్షగాన విషయమున నదియొక యదనపుఁ బ్రయోజనముమాత్రమే యగును.

---

# 141. పసుమర్తి కృష్ణమూర్తి

## పార్వతీ పరిణయము :

(ప్రచురణ వివరములు తెలియవు. ప్రథమ ముద్రణ, 1922. గౌతమీ గ్రంథాలయమున నొక ప్రతి కలదు — నం. 382)

శ్రీ మదజ్జాడాదిభట్ట నారాయణదాసుగారి శిష్యులీ కృష్ణమూర్తిగారు. తమ పార్వతీ పరిణయమును గురువుగారికే యంకిత మిచ్చినారు. ఈయన యార్వేల నియోగి. నాగభూషణామాత్యుని

పౌత్రుఁడు. రామనాథ మంత్రి పుత్రుఁడు. ఒరంపుర నివాసి. కళ్ళికోట కాలేజీ తెలుగు పండితుఁడు. ఘనసత్కుఁడనుట స్పష్టము. (ఈయన కృత్యంతరము త్యాగరాజు చరిత్ర పద్యకావ్యము.

ఈ గ్రంథకర్త "ఏను మెచ్చి యారలు పార్వతీ పరిణయంబున్ యక్షగానంబుగా, నొనరంజేయుదుగాన నాగరికులు యుద్యోగింతు చేసిప్పుడున్" అని యనియున్నారే కాని యాకథ యిదివఱకే యొకరిచేఁ గాదనేకులచే య. గా. కావ్యవస్తువైనది. ఈయన తన గ్రంథమును యక్షగాన ప్రబంధ మనియున్నారు కాని యది హరికథ. అట్లనుటలో గురువుగారి పరిపాటిఁ బాటించినారు. విశేష మేమనఁగా నిందు త్రిథాశ్వాసవిభాగము గలదు. కథ మార్పులులేక సంగ్రహముగా నాఖ్యానింపఁబడినది. రచనలో నాటకీయ పాటవము లేదు కాని ప్రబంధ ప్రాగల్భ్యము గలదు. ఇందు స్వరపఱుపఁబడిన కీర్తనలు, పద్యములును మెండు. రాగమాలిక, మంజరి (మంజరీ ద్విపద కాదు - సాధారణముగా హరికథలలో నుండు తోహరాలకు, డోరాలకును బ్రత్యామ్నాయముగా వాడఁబడిన గీత ప్రబంధ విశేషము), 'దిండి' యను వృత్తవిశేషమును గలవు.

---

# 142. ధనకుధరం రామానుజాచార్యులు

**బిబ్లియోగ్రఫీ/విజ్ఞాపనీయము :**

కవి హారితసగోత్రుఁడు. పాంచరాత్రవైష్ణవుఁడు. సుభద్రమాంబా రామానుజాచార్యుల పౌత్రుఁడు. నరసమాంబాచ్యుతాచార్యుల పుత్రుఁడు. ఆలపాడు (తెనాలి తాలూకా) వాస్తవ్యుఁడు. ఈయన 1954 సం. నఁ జనిపోయినారని కాకినాడ పి. ఆర్.

కళాశాల ప్రాచ్య భాషా శాఖాధ్యక్షులైన శ్రీమాన్ ఈయుణ్ణి వేంకట వీర రాఘవాచార్యులవారు తెలిపినారు.* ఈ కృతి 1903 సం. న బాపట్ల భారతీ విలాస ము. శా యందు ముద్రితము. రచన యంత కించుకముందే జరిగియుండును. కృతి ప్రోత్సాహకుఁడు పేర్ల వెంకట సుబ్బారావు.

గ్రంథ విషయము :— ప్రసిద్ధము. రచన సలక్షణమైనదే కాని చప్పగా నున్నది. ప్రక్రియలో నొక విశేషమున్నది. ఇందుఁబ్రసిద్ధ రాగతాళములలో 11 దరువులు, 3 కందార్ధములు, 1 సీసము, 1 సీసార్ధము, అయిదారు వృత్తములు, గీత పద్యములును బోను గడమ గ్రంథమంతయు రగడ ప్రచురముగా రచింపఁబడినది. ద్విపద యచ్చునకైన లేదు. కథాగతి యాఖ్యానశైలి ప్రధానముగా సాగినది. ఇది యచ్చు మెచ్చు జంగం కథ "బాణీ". యక్షగానములందు ద్విపద రహితము లతి సకృత్తు. కాని రగడ ప్రచురములు గానరావు. ఆధునిక యుగమునఁ గవులు గేయప్రబంధమని మాత్రము పేర్కొని విడిచిన కొన్ని జంగం కథలను బ్రకటన కర్తలు యక్షగానములని వ్యవహరించిరి. ఉదా :— పుసులూరి సుబ్బరాయ కవి "యక్షప్రశ్నలు"— మదరాసు సుబ్రహ్మణ్య విలాస ము. శా. ముద్రణ, 1915. అందులకుఁగారణము ప్రచురణ కర్తల యనభిజ్ఞత యనవలె. కాని యీ బిల్హణీయమువిషయమున వచ్చిపడిన చిక్కేమనఁగా గ్రంథకర్తయే స్వయముగా స్పష్టముగా దీనిని యక్షగానమని మొత్తుగడలోనే పేర్కొనియున్నాఁడు.

---

* కవిగారి పుత్రులు శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులుగారిప్పు డాలపాడులో నున్నారు. వారు నా కిటీవల నొక లేఖ వ్రాసినారు. వైద్య విద్యా సంస్థాన మను సంస్థ నడుపుచున్నారు. 'రామానుజ కీర్తికౌముది" అను పేర నొక గొప్ప సంచికాపరంపర ప్రకటించుచున్నారు.

# 143. వేలూరి కన్నయదాసు

## మహాభారత విలాసము:

కవి కార్వేటినగర (చిత్తూరుజిల్లా పుత్తూరుతాలూకా) వాస్తవ్యుఁడు. బాలస్వాహంసానంద స్వాములవారి పౌత్రుఁడు. ఇతని మ. భా. విలాసము 1903 సం. న మద్రాసులో "గ్రంథకర్తచే సర్వస్వాతంత్ర్యమును బొందినవారగు వంకాయల కృష్ణస్వామిసెట్టివారిచే స్వకీయ శ్రీరంగవిలాస ము. శా.యందు ముద్రింపించి ప్రకటింపంబడియె". అనఁగా కవి 1903 కో నుండె నన్నమాట. గ్రంథరచన ప్లవకార్తికమున జరిగిన దని చెప్పినాఁడు. అది 1901. ఇందు మహాభారత మూలకథ నంతటిని జెప్పవలెనని కవిపూనిక. ద్రౌపదీ స్వయంవర ద్యూతాది ఘట్టములను బెంచినాఁడు. కడమ ఘట్టములను సంగ్రహించినాఁడు. ధర్మరాజు పట్టాభిషేకముతో గ్రంథాంతము. నడుమ లేని పోని క్రొత్తవిషయములు గొన్ని గ్రహించినాఁడు. ఆంధ్రమహాభారత గద్యపద్యములను గొన్ని గ్రహించినాఁడు. స్వయముగ దరువులు, అర్థపద్యములు, పాటలు, వచనములు, రచించినాఁడు. గ్రంథారంభమున "అస్పాసుపంతులోషి" పాత్ర గలదు. నడుమ నసభ్యహాస్య ప్రసంగములు చాలఁగలవు. రచన నీరసముగానున్నది. తప్పులు కుప్పలు. కవిచే నిది నాటకమని పేర్కొనఁబడినది. ప్రదర్శనోద్దిష్టమైనది. (ఇతఁడు నలచరిత్ర యక్షగానము కూడ రచించినట్లు ఆం. వా. సూ. వలనఁ దెలియుచున్నది. కాని గ్రంథ మలబ్ధము.)

---

## 144. పాలుట్ల లక్ష్మణకవి

ఇతఁడాపస్తంబసూత్రుఁడు. మౌద్గల్యసగోత్రుఁడు. పాపయ మంత్రి పౌత్రుఁడు. వెంకమాంబా పిచ్చయలపుత్రుఁడు. స్వయంప్రకాశ బ్రహ్మానందస్వాములవారి శిష్యుఁడు. కర్నూలుజిల్లా మార్కాపురం తాలూకా దిగువపాలెం కాపరస్థులు", "వినుకొండ గవర్నమెంటు గరల్సుస్కూలు హెడ్మాష్టరు" అని 1904లో మదరాసుజీవ రత్నాకర ము. శా. లోఁ బ్రచురితమైన యీతని కుచేలోపాఖ్యాన యక్షగానముఖపత్రమువలనఁ దెలిసినది అనఁగాఁ గవియు నప్పటివాఁడే యనుటలో సందేహములేదు. ఆ కుచేల యక్షగానమున నితని పూర్వపురచన ధర్మాంగద యక్షగానము పేర్కొనఁబడినది. (ఇదియు మొదట 1904 లో జీ. ర. ము. శా. యందును పిదప 1933 లో మదరాసు చంద్రికా ము. శా. యందును ముద్రితము.)

రెండు గ్రంథము లందును వస్తువు ప్రసిద్ధము. రెండును యక్షగానము లనియు నాటకము లనియుఁ బేర్కొనఁబడినవి. రెండిటను బామరజన మనోజ్ఞములైన హాస్య ప్రసంగములు గలవు. చోపుదారి వాలకము గలదు. రచన యొక మోస్తరు.

---

## 145. పురాణం పిచ్చయ్య

ఇటీవలి నెల్లూరు మండల విద్వత్కవులలోఁ బిచ్చయఁగారొకరు. వీరిది పుదూరు ద్రావిడ శాఖ. తలిదండ్రులు సావిత్రీ లక్ష్మీనృసింహులు. తాత ముత్తాతలు కేశవ కృష్ణార్యులు. గురువు

నేలటూరి వేంకట రామానుజాచార్యులు. ఈయన 1871–1951 సం. ల నడుమ నుండిన వారిని వీరి భాగినేయులును, సుప్రసిద్ధాంధ్ర చరిత్ర వాఙ్మయ పరిశోధకులు నైన డాక్టరు శ్రీ నేలటూరి వేంకట రమణయ్య గారు తెలుపుచున్నారు. వీరయ్యగారు విజయాశ్వ చరిత్రాద్యనేక ప్రౌఢ ప్రబంధములును యక్షగానములును రచించి యున్నారు. వీరి య. గా. కృతులు :– *

1. మైరావణ చరిత్ర.
2. కపట వేశ్యా నాటకము.
3. శశిరేఖా పరిణయము.
4. యక్ష ప్రశ్నలు.
5. అర్జున విజయము. (సైంధవ సంహారకథ)
6. చిత్రాంగీ సారంగ ధరము.
7. గౌరీశంకర సంవాదము.

ఈ కృతులన్నియుఁ బ్రసిద్ధేతివృత్తములు. కపట వేశ్యా నాటకమున మాత్రము కందుకూరు రుద్రకవి నిరంకుశోపాఖ్యాన ప్రబంధ కథ గ్రహింపఁబడినది. కవి తన కృతులను యక్షగానము లనియు, నాటకము లనియు, యక్షగాన నాటకము లనియు వ్యవహరించెను. అన్నిటను రచన సలక్షణము, సరసము నైనది. చక్కని ప్రౌఢిసారస్యములు గలది. అన్నిటను బ్రసిద్ధ కర్ణాటక, హిందూస్థాని రాగ తాళ

---

* ప్రచురణ వివరములు :— 1, 2 — ఉప్పల వీరన్నచే మదరాసు చంద్రికా ము. శా., 1911, 20, 24, 30, 1926, 31.

3, 4. — యస్. వి. గోపాల్ అండుకో., మదరాసు, 1939, 45, 59

5, 6. — ఈశ్వరి అండుకో., మదరాసు, 1949, 1951.

7. — (ఇది 1914 లో ముద్రితము. చూ. ఆం. వా. సూ) ముద్రణ వివరములు తెలియవు. గ్రంథము లభ్యము కాలేదు (వీరి గ్రంథములలో వీరే స్వయముగా రచించిన పీఠికలు, ప్రచురణ కర్తృ ప్రశంసాత్మక పద్యములు, స్వవిషయ ప్రసక్తియుఁ గానవగును).

ములలో దరువులు, ద్విపదలు, పద్యములు, అర్ధపద్యములు మొ॥ గలవు. కపటవేశ్యా నాటకమున పార్శీడోరా గజల్మట్లును, తెర ద్విపదలును జావళీలును గలవు. శశిరేఖా పరిణయము, యక్ష ప్రశ్నలు, అర్జున విజయములందు డోరాలు (అ. వి. న డోరాలతో పాటు రగడలును) తఱుచు. అర్జున విజయమునఁ దప్ప నన్నిటను నాటకీయత సమృద్ధిగనే గలదు కాని సంధి వచనములు దఱుచు. సంవాద వచనము లతి విరళముగాఁ బ్రయుక్తములు. కొన్నిట లేనేలేవు. కపట వేశ్యానాటకము రెండు రాత్రుల కథ. చిత్రాంగి నాటకము రెండు భాగములుగా మాత్రము విభక్తము. అర్జున విజయ మాఖ్యానశైలీ ప్రచురము. దీనిగుఱించి చిత్రాంగి నాటకము చివరఁ బ్రచురణ కర్త వక్కాణ యొకటి గలదు. — "ఈగ్రంథమున జంగములు, దాసరులు, మొదలగువారు గుమ్మెట వాయించుచు వేషములతో నాడుచు గ్రామములలో కథను చెప్పి సంపాదనచేసి జీవించుట కనువుగా నుండునట్లు వ్రాయఁబడినది" అని. ఇది నాటకమనియే కవిచే వ్యవహృతము. అసలాయన తన కృతులన్నిటి నట్లే వ్యవహరించెనుగద. కాని యా డోరాలు, రగడలు నా సంధి వచన ప్రాచుర్యము నా కథా కథన ధోరణి మొ॥ విషయములు జూచినచో నత్యంతాధునికులైన వీరి కృతులపై నాధునిక నాటక ప్రభావమైన పడలేదు కాని హరి కథలు, జంగంకథల ప్రభావము గొంత పడినట్లు దోఁచుచున్నది.

---

# 146. భమిడిపాటి అప్పకవి

## భామకలాపము

కవి విశాఖ మండలములోని గొరపల్లి వాస్తవ్యుఁడు. భమిడి పాటి బుచ్చన్నామాత్యుని పుత్రుఁడు. ఇతని యక్షగానకృతి పారిజాత మను సత్యభామ కలాపము. (ముద్రణ.— ఆర్య ముద్రాశాల, విశాఖ పట్టణము, 1906). ఇందు సత్యభామా సందేశసందర్భమున లెటరు, పెటను, రైలు, సీలు, కవరు మొదలగు నాంగ్లపదములు ప్రయోగింపఁ బడినవి. కవి యాధునికుఁడనుట నిశ్చయము. ఈగ్రంథము విజయ నగరప్రభువును, పూసపాటి ఆనంద గజపతిరాజు పుత్రుఁడునునైన విజయరామరాజు రాజ్యకాలమున గొరపల్లి మిరాశీదారైన కావలి వీర భద్రరావుగారి కంకితమైనదని గ్రంథస్థమైన యాధారము గలదు. విజయనగర ప్రభువులలో విజయరామరాజులు నలుగురుగలరు గాని యానందరాజు లిద్దరే. మొదటి యానందరాజు రాజ్యకాలము క్రీ. శ. 1757–1759. అతని వెనువెంట 1759 నుండి 1794 వఱకు రాజ్యము చేసిన వాఁడు రెండవ విజయరామరాజు కాని యీగ్రంథమునఁ బ్రయోగింపఁబడిన యాంగ్లపదములలో ముఖ్యముగా రైలు మొదలగు నవి యా కాలము నాఁటికి మనదేశమునఁ బొడచూపుట కవకాశమేర్పడ లేదు. రెండవ యానందరాజు రాజ్యకాలము 1879-1897. అటు పిమ్మట నతని దత్తపుత్రుఁడైన నాల్గవ విజయరామరాజు రాజాయెను. (చూ. వైజాగ్ డిస్ట్రిక్టు గెజిటీరు). ఈ గ్రంథము నా విజయరామరాజు రాజ్యారంభవత్సరమగు 1897, గ్రంథప్రచురణ వత్సరమగు 1906 ల నడుమ రచింపఁబడి యుండు ననుటయే సమంజస మగును.

ఈగ్రంథమంతయు భామకలాపము "బాణీ" నున్నది. పారిజాతవృత్తాంతము మాధవితోడి సత్యభామ స్వప్నకథనమును నిమిడిపోయినది. చివర సవతుల కయ్యము గలదు. గ్రంథము యక్షగానమనియుఁ బేర్కొనబడినది. ఇందు దరువులు, పద్యములు, ద్విపదలు, నొకచూర్ణికయుఁ గలవు. సత్యభామ "లెట" రొకటే వచనము. అన్యభాషాపదములపైఁ గవి కెక్కువ మోజు కాని రచన సలక్షణముగా ససారస్యముగా సాగినది.

---

# 147. ఆకెళ్ల అప్పయ

## గొల్లకలాపము:

ఇతఁడొక విశాఖ మండల కవి. ఇంతకు మించి వివరము తెలియఁగరావు. ఇతని కృతి "పూసపాటి వేంకటపతి భూనాయకోత్తమాంకితము". "ఏతత్కృతి నాయకునిచే విశాఖపట్టణంబున శ్రీ శారదా మకుట ముద్రాక్షరశాలలో నచ్చువేయించి ప్రకటింపబడియె" నని ముఖపత్రము. ప్రచురణ వత్సరము 1906. కవి యప్పుడుండినాఁడనుట స్పష్టము.

ఈ గ్రంథము మూఁడు భాగములు:— మొదటి దెలుకల కలాపము. ఇందెలుకత సూత్రధార పృచ్ఛితయై తమ జాతి వృత్తాంతము నుగ్గడించుటయుఁ దదుపరి "చోడిగాడు" (సింగఁడు: రాఁగానతనితో సంవాదము జేయుటయు విషయము — రెండవది గొల్లకలా

పము, గొల్లభామ హాస్యగానసక్తిఁ బ్రచ్ఛితయై చల్ల గొప్ప నుగ్గడించు టకు సముద్ర మథన కథ నాఖ్యానించుట యిందలి విషయము— మూఁడవది కొండయ్య కలాపము. ఇందు సుంకరి కొండయ్య గొల్ల భామల సంవాదము, నామె యత్తగారు వచ్చి కొండయ్య బారిఁబడ్డ కోడలిని విడిపించుకొనఁబోవుటయు విషయములు. ఇందు దరువులు, పద్యములు, ద్విపదలు, వచనములు, కందార్థమును గలవు. రచన చక్కనిది.

# 148. వేదంభట్లు వేంకటరాయ కవి

## జలక్రీడావిలాసము:

ఇతఁడు విశాఖమండల కవి యనుట తక్క నింకేమియు వివరము తెలియరావు. ఇతడుఁను పూసపాటి వేంకటపతి రాజుకే కృతి నిచ్చి నాఁడు. ఈ రాజు రేగులవలస (గజపతినగరము తాలూకా, జమీం దారనియు నతని వంశవృత్తమొక సీస మాలికలో నిందుఁగలదు. (ఇతఁడే ఆకెళ్ళ అప్పయ గొల్లకలాపమునకును కృతిభర్త). ఈ జలక్రీడా విలాసము "ఏతత్కృతి నాయకునిచే విశాఖపట్టణంబున శ్రీ శారదా మకుట ముద్రాక్షరశాలలో నచ్చువేయించి ప్రకటింపబడినది." ప్రచు రణ సం. 1906. కవియు నప్పటివాఁడనుట స్పష్టము.

సూత్రధారుఁడు కృతి నాయకునిఁ బ్రశంసించి కథాక్రమ నిరూ పణము చేయుటతో నిందలి గ్రంథారంభము. త॥ అతడు వినాయకు

నితో సంస్కృతమునుఁ బ్రసంగించును. అతడు పాత్రలను బలుకరించు టయు, సంధివచనములను గథాను సంధాయక పద్యములను బఠించు టయు నిందుఁగాఁ నగును. పాత్రలు "తెర బయలు దేఱు దరువులు" గలవు. అందుఁ బాత్రలు స్వవిషయమును స్వయముగాఁ జెప్పుట కాన నగును. ఇది నాటకమని పేర్కొనఁబడినది. ఇందు దరువులు, ద్విప దలు, పద్యములు, సంధివచనములును గలవు. ఎఱుకత పాత్రకుఁ బ్రసక్తిగలదు. గృష్ణుని జననముఁ బాల్యక్రీడలు, జలక్రీడలును నిందలి విషయములు. రచన చక్కనిదే.

# 149. గరిమెళ్ల వెంకటజోగి

## వేణుగోపాల నాటకము:

కవి గరిమెళ్ల వేంకట మనీషి పుత్రుఁడు. గ్రంథము మారేళ్ళ వేంకటాచలపండిత ప్రభు పరిపాలితమైన కశింకోట (విశాఖమండలము) జమీలోని నరసింగపల్లి వేణుగోపాలున కంకితము. కృతి ప్రోత్సా హకుఁడు నరసింగపల్లి వాస్తవ్యుఁడైన మజ్జి వెంకునాయుడు. అతడే గ్రంథ ప్రచురణకర్త. ముద్రణ విశాఖపట్టణము శ్రీశారదా ముకుట ము. శా. లో 1906 లో జరిగినది. అనగాఁ గవి యప్పటి వాఁడే యగును గదా. ఈ కృతికి భాగవతకలాపము, పారిజాతము నని నామాంతరములు. ప్రణాళికలో రచనలో నిదియొక చక్కని భామకలాపము.

———

## 150. బళ్ళ సీతారామరాజు

### రాధామాధవ నాటకము:

కవి రుక్మాంగదసగోత్రుఁడు. బళ్ళ పేర్రాజుపుత్రుఁడు. వెంక ట్రాజు సోదరుఁడు. పూలపల్లి నివాసి. నరసింగపల్లి మజ్జి వెంకునాయు నకుఁ దృతీయభ్రాతయగు పోతరాజునాయుఁడు కృతి ప్రోత్సాహకుఁడు. వెంకునాయుఁడీ గ్రంథప్రచురణకర్త. ముద్రణ విశాఖ శారదా మకుట ము.శా. యందు 1906 లో జరిగినది. మఱి యీకవియు నప్పటివాఁడే యగును. ఈగ్రంథమున నాయిక పేరు మాఱినది కాని ప్రక్రియ యంతయు భామకలాపమునందలిదే. రచన సరసమైనది.

---

## 151. గరిమెళ్ళ వెంకటేశ్వరకవి

### సముద్ర మథనము:

కవి విశాఖమండలము చోడవరము వాస్తవ్యుఁడు. గరిమెళ్ళ వెంకటజోగికవి (వేణుగోపాలనాటకకర్త) పుత్రుఁడు. ఈసముద్ర మథ నమునందలి దరువులచివర నరసింగపల్లి వేణుగోపాల ముద్రతో పాటు కశింకోట మారేళ్ళ వెంకటాచలప్రభువు, మజ్జి వెంకునాయుఁడు, నతని సోదరులప్రశంస గన్పట్టుచున్నది. ఇదియు 1906 లో మజ్జి వెంకు నాయనిచేతనే విశాఖ శ్రీశారదామకుట ము. శా. లోనే ముద్రాపిత మైనది. కవి తానీగ్రంథమును శార్వరిచైత్రమున రచించితినని చెప్పి

నాఁడు. ఇది క్రీ. శ. 1900 సం. నఁ బడిన శార్వరియనుట నిస్సంశయము. గ్రంథవిషయము సముద్రమథన కథను జల్లనమ్మ వచ్చిన గొల్లభామ యాఖ్యానించినట్లు గలదు. ప్రక్రియ గొల్లకలాపమును బోలినది. రచన చక్కనిది. సత్యభామాకృష్ణసంవాదమను పద్యసంవాదకావ్యము, దశావతార జావళీలు ననునవి వేంకటేశ్వరకవి కృత్యంతరములు.

---

# 152. కీర్తి వెంకటరామకవి

## ఏ ఱు క ల క థ :

కవి నివాసము గొబ్బూరు. (విశాఖ మండలము నందలి అనకాపల్లితాలూకా). ఆపస్తంబ సూత్రుఁడు. కాశ్యపసగోత్రుఁడు. అనంతరామయ, కోదండ రామయ, పాపన యనువార లతని పితృపితామహ. ప్రపితామహులు. గురువు కీర్తి అనంతరామయ (తండ్రి ?). ఈడూరి బ్రహ్మాజి ఛందోగురువఁట. కృతి భర్తయుఁ బ్రచురణ కర్తయు మజ్జి వెంకునాయుఁడు. ప్రచురణ వత్సరము 1906 * కాఁగాఁ గవియు నప్పటి వాఁడనుట నిశ్చయము.

ఇతని గ్రంథము రెండుభాగములు. మొదటిది సుజ్ఞాన బోధిని యను నెఱుకత కథ. ఇందెఱుకత పిండోత్పత్తి లక్షణము నుండి జీవ

---

* ఇందలి 157—160 ఈ నలుగురు కవుల కృతులును మజ్జి వెంకు నాయుని ప్రోత్సాహమున రచింపఁబడి యతని చేతనే మొదట 1906 సం. న విశాఖ పట్టణ మందలి శ్రీ శారదా మకుటము. శా. యందొక్కటే సంపుటముగా ముద్రాపితములై ప్రకటింపఁబడినవి. ఇవి వెంకునాయునిచేఁ బ్రదర్శనకు నెక్కినవని వినుకలి.

బ్రహ్మోపాఖ్యాన సంధానము వఱకుఁ గల తత్త్వరహస్యమును సంగ్రహముగా నుపన్యసించును. కొండవది చోడిగాని (సింగని) కథ. వాఁడు సింగిని వెగళుచు వచ్చును. పిసప వారి సవురి సంవాదము. ఇందు హాస్యాఁగాఁడు పాత్రలను బలుకరించుట కానసగును. ఇది యక్షగానమని పేర్కొనఁబడినది. రచన యొక మోస్తరు. (ఇందు పూర్వకవి స్తుతిలో ముద్రకవి పేరు గలదు.)

# 153. పరాశరం శేషాచార్యులు

## తిరుమంగయాళ్వారు చరిత్ర :

(ప్రచురణ :— టి. చెంగల్వ రాయనాయుని మురహరి ప్రెస్., మదరాసు, 1907)

కవి నివాసము తెనాలి తాలూకా పేరుకలపూడి. వైఖానసుఁడు. భారద్వాజసగోత్రుఁడు. పున్నమాంబా జోగయాచార్యుల పుత్రుఁడు. తమ్మపూడి నివాసి సూర్యదేవర జోగయ యీతని కృతి భర్త. కవి స్వయముగా గ్రంథారంభమునఁ బ్రచురణ కర్తలగు చెంగల్వరాయ ప్రభృతులను బ్రశంసించెను. కావున నితఁడు గ్రంథ ప్రచురణ వత్సరమగు 1907 సం. న నుండెననుట నిశ్చయము.

పన్నిద్దరాళ్వారులలో నొకఁడగు తిరుమంగయాళ్వారు చరిత్ర మిందలి యితివృత్తము. కవిదీనిని యక్షగానమనియు నాటకమనియుఁ బేర్కొనెను. యక్షగానములందువలె నిందు సంధివచనములు తఱచు;

ఒక్కచోఁ దెర ద్విపదయుఁ గలదు. కాని యాధునిక నాటకమువలె నిది పాత్రలవచన సంవాదప్రచురమైన రచన. దరువులు (హిందూస్తానీ రాగముల వాడక మెక్కువ), పద్యములును గలవు. రచన సరళమైనది కాని తప్పులు గలవు. (ఇతఁడు హరిశ్చంద్ర యక్షగానమును గూడ రచించినట్లు ఆంధ్రనాటక కళాపరిషత్తు ప్రకటించిన య. గా. ల పట్టిక వలనఁ దెలియనగును).

---

# 154. మండూరి సుబ్బరాయకవి

## సత్యభామా కల్యాణము :

కవి కర్నూలుజిల్లా నందికొట్కూరు తాలూకా దుద్యాల నివాసి. కంసాలి. కాళికాంబా కాళిదాసుల పుత్రుఁడు. లక్ష్మమా సుబ్బయల పౌత్రుఁడు. పేరమా వెంగయల ప్రపౌత్రుఁడు. ఇతఁడు తన గ్రంథమును 1907 సం. న మదరాసు శ్రీ నికేతన ము. శా. యందు ముద్రించిన మేసలూరి కృష్ణస్వామినిఁ బ్రశంసించినాఁడు. కాన 1907 సం. న నుండెననుట నిశ్చయము. ఇతఁడు తన కృతిని నాటక మనియు, మహాప్రబంధమనియుఁ బేర్కొనినాఁడు. ప్రచురణకర్తలు "యక్షగాన కంపెని డ్రామా" యనిరి. గ్రంథము రెండు రాత్రుల కథగా విభక్తమగుటయు, దరువుల చివరముద్రలు, సంధివచనములు, తెర ద్విపదలు మొదలగువాని యునికియు నిది యక్షగానమనిపించు చున్నవి. వచన సంవాదములు మొ॥ సందర్భము లాధునికనాటక ప్రభావఫలితములు గావచ్చును. రచన మొకమోస్తరు.

---

# 155. వద్ది తాతయ్య

**శశిరేఖా పరిణయము :**

(ప్రచు: నూ దేటి సన్యాసయ్య అండు సన్సు, రాజమండ్రి. 1908, 1936)

ఇతఁడు "గోదావరీ తీరస్థిత కోనాల గ్రామ కాపురస్తుడు. తద్గ్రామ డిస్ట్రిక్టు స్కూలుపాధ్యాయుఁడు," ఇతని ప్రపితామహులు అయ్యన్న, నూకమాంబ. పితామహులు భూపతి సీతమాంబ. తలిదండ్రులు భూపతి వెంకమాంబ. స్వస్థలము ఎర్నగూడెం తాలూకా వనపురము. "పద్మగర్భుని పాదభవుఁడు" ఆపస్తంబ సూత్రుడు. మార్కండేయసగోత్రుఁడు. వంగిపురి వెంకటాచార్యుల శిష్యుఁడు. గ్రంథాది నితఁడు వచనమున నొక విజ్ఞప్తి చేసి యుండుటయు, గ్రంథాంతమున నితఁడు ఎర్నగూడెము తాలూకా తహస్సీల్దారు వైజర్సు అప్పారావుగారికిఁ జెప్పిన పద్యములు, తల్లాప్రగడ సూర్యనారాయణ రావు ప్రభృతులిచ్చిన సమస్యలను బూరించి చెప్పిన పద్యములు జూడ నితఁడాధునికుఁడని తెల్లమగుచున్నది.

తాతయ్య తనగ్రంథమున అప్పప్ప కవి శశిరేఖా పరిణయ ప్రబంధము ననుకరించినాఁడు. అతని స్వాతంత్ర రచనయు సరసమైనది. తన కృతిని నాటకమని పేర్కొనినాఁడు. యక్షగాన ఫక్కినున్నది. దరువులు, పద్యములు, తఱచు ద్విపదలు, ఏలలు, సంధివచనములు, సంవాదవచనములును గలవు. (రుక్మిణీ కల్యాణ య. గా. ఇతని కృత్యంతర మని ఆం. నా. క. పరిషత్తు పట్టిక .

---

# 156. కాలంసెట్టి గురవయ్య

కవి నెల్లూరు వాస్తవ్యుఁడు. బలిజ కులజుఁడు. ఇతని కృతులు చిత్రాంగి నాటకము, పురూరవశ్చక్రవర్తి జనన నాటకము (రెండును మదరాసు పమ్మి త్యాగరాయసెట్టిచే వారి శ్రీరాజరాజేశ్వరీ నికేతన ము. శా. యందు వరుసగా 1908, 1914 సం. లలో ముద్రితములు). చిత్రాంగి నాటకమున గ్రంథకర్త సర్వస్వామ్యములును బ్రచురణకర్త కిచ్చిన ట్లొక ప్రకటన చేసినాఁడు. అనఁగా నీతఁడు 1908 సం. న నుండె ననుట స్పష్టము.

గ్రంథ విషయములు :— ప్రసిద్ధములు. రెండిట దరువులు, ద్విపదలు (ప్రావేశిక ధ్రువలు, తెర ద్విపదలు గూడ), కందార్థములు, పద్యములు, ఏలలు, గొబ్బిపాటలు, సంధి వచనములును గలవు. పు. చ. జ. నాటకమున సంవాద వచనములును సకృత్తుగాఁ గలవు. రెండిట భటపాత్ర ప్రవేశ ధ్రువ, తదుపరి కథానుసంధాయక ద్విపదల తోడను గథారంభమగును. రెండును నాటకములనియే పేర్కొనఁ బడినవి. కాని "బాణీ" యక్షగాన సదృశము, రెండిటను రచన పేలవము, దోషయుతము.

---

# 157. వినుకొండ కాళకవి

## మార్కండేయ విలాసము:

(ప్రచురణలు:- మదరాసు ఉప్పుల వీరన్న శ్రేష్ఠి అండు సన్సు 1922. వెస్ట్రువార్డు అండుకో, 1936)

ఇతఁడు విశ్వకర్మకులజుఁడు. వీరమాంబికా తనయుఁడు. గ్రంథము చోళపుర నరసింహున కంకితము. ఇందుఁ గథారంభమున ఘటికుని (కటికము) మాటలలో 'సైలెన్సు' అను నాంగ్లపదము ప్రయుక్తమైనది. కవి యాధునికుఁడే కావచ్చును. వి. కాళిదాస కృతము మార్కండేయవిలాస మను యక్షగానము 1873 లోఁ బ్రచురితమైనట్లు ఆం. వా. సూ. వలనఁ దెలియనగును. అది యీ కవిదే కావచ్చును. ఇతఁడు 1911 ప్రాంతమున గోనుగుంట వీరబ్రహ్మము రచించిన శివరామ నాటకమునఁ "బూర్వకవుల స్తుతి" కి "ఇప్పటి కవుల స్తుతి" కిఁ బిదపఁగల "మృతకవుల స్తుతి" లోఁ జేర్కొనఁబడినాఁడు. కవి 19 శ. ఉ. భా. నుండినాఁడని చెప్పవచ్చును.

గ్రంథ విషయము ప్రసిద్ధము. ఇందు దరువులు, పద్యములు, ద్విపదలు, వచనములు మొ॥ వానిలో సంధి - సంభాషణలు రెండును గలవు. ఇది నాటకమని చేర్కొనఁబడినది. రచన యొకమోస్తరు. అనుచితములు, జమత్కారావహములు నైన సందర్భములు చాలఁ గలవు.



# 158. కొత్తూరు రంగనాయకమ్మ

## ఆండాళు చరిత్ర :

ఏతద్గ్రంథకర్త్రి యీచంబాటి శ్రీనివాసాచార్యుల శిష్యురాలని మాత్రమే యిందలి కొన్నిపాటలవలన దెలియుచున్నది. వరయూరు జియ్యరు తిరుపతి సంబంధురాలగు రామానుజమ్మ యనునామె రచించిన శ్రీరంగనాథ పంగుణ్యుత్తరోత్సవ యక్షగానముచివర గంగచి దను రంగనాథస్తుతి పరమైన యొకగేయరచన చరమ చరణమునందు "ఈచంబాటి శ్రీనివాసాచార్యకృపను - రంగదాసు రాలినిబ్రోవరా" అనికలదు. రామానుజమ్మ కృతి ప్రచురణకర్త్రి కొత్తూరు రంగనాయకమ్మ. ఆ తంగచిందులోఁ బేర్కొనఁబడిన రంగదాసు లీరంగనాయకమ్మయేగావచ్చును. ఈరంగనాయకమ్మ గురువు, ఆండాళు చరిత్ర కృతికర్త్రి గురువు నొక్కరే కావున నామెయు నీమెయు నొక్కరే కావచ్చునేమోయను నూహ వొడముచున్నది. అగుచో, రామానుజమ్మ కృతిని రంగనాయకమ్మ మదరాసు శ్రీరామానుజ విలాస ము॥ శాయందు 19[illegible]7లో ముద్రిపించి ప్రచురించినది కనుకను, అండాళుచరిత్ర మొదట మదరాసు శ్రీకురుమూర్తి శ్రీనివాస ము. శా. యందు 1907 లో ముద్రితమైనది కనుకను రంగనాయకమ్మ యీశతాబ్దారంభమున నుండెనని చెప్పవచ్చును. ఇప్పటికిది యంతయు నొక యూహామాత్రము.

ఆండాళనఁగా భూదేవి యవతారముగాఁ పెరియాళ్వారగు విష్ణుచిత్తునిపుత్రిగా, చూడికుడుత్త నాంచారు లేక ఆముక్తమాల్యదగాఁ బ్రసిద్ధి వడసిన గోదాదేవి. ఆమెచరిత్ర మిందువర్ణితము. ఇందాళ్వారుల చరిత్రముగూడఁ గొంత చెప్పఁబడినది. కొరవంజి పాత్రకుఁ

ప్రసక్తి కల్గినది. గ్రంథము యక్షగానమని పేర్కొనఁబడినది. అలంతి దోషములున్నను రచన చక్కనిది. ముఖ్యముగా నాండాళ్ళు పెండ్లి వేడుకల పాటలు ముచ్చటగా రచింపఁబడినవి. భక్తిశృంగారములు బాగుగాఁ బోషింపబడినవి.

---

# 159. కొండముది బంగారయ్య

కవికాపురము గుంటూరుజిల్లా నరసరావుపేట తాలూకా కొణిదెన సీవారు రాజుపాలెము. విశ్వబ్రాహ్మణుఁడు, కాశ్యపసగోత్రుఁడు. నాగమాంబా సుబ్బయల పుత్రుఁడు. ఈతని కృతులు వృత్రాసుర మహారాజు నాటకము (గోపాల విలాస ము. శా., మదరాసు, 1908). శశిరేఖా పరిణయము ( దేవానంద ముద్రణాలయము మదరాసు, 1920). రెండింటను నితఁడు ఫణిధపురంగ, కందుకూరు రుద్రకవులను బూర్వకవులుగాస్తుతించెను. వృ. మ. నాటకమున "ఇప్పటి కవులస్తుతి" యనుశీర్షికక్రింద నెల్లటూరు శేషావధానులు, వడ్డెపాటి నిరంజనకవి, యలవర్తి ఆంజనేయశాస్త్రి, శిరికొండ దశరథరామశాస్త్రి, కడియాల వీపూరితిరుగాఖ్యుఁడు, కలగాని వీరయాచార్యుఁడు, అడ్డాడ వీరభద్రుడు - అను వారిని స్తుతించెను. ఇందలి యలవర్తి ఆంజనేయశాస్త్రియే 1908 లో ప్రచురితమైన యీ వృ. మ. నా. గ్రంథపరిష్కర్త. అనగా బంగారయ్యయు నప్పటివాఁడే యనుట నిశ్చయము.

వృ.మ.నాటకము వడ్డేశ్వరపురవాసి మూర్తి(మూర్తి?) రాజు శేఖరార్యుని ప్రోత్సాహమున రచింపఁబడినది. ఇందు వృత్రాసురవిజృంభము,

వధము, మహేంద్రుని ప్రచ్ఛన్నత, నహుషు నింద్రపదవి, అగస్త్య శాపము, దేవేంద్రపునఃప్రతిష్ఠ - అను విషయములు వర్ణితములు. ఇది మూఁడురాత్రుల కథగా విభక్తము. శశిరేఖా పరిణయకృతి ప్రోత్సాహకుఁడు. చందవరవాసి పూసపాటి వేంకటరత్నము. రెండింటను దరువులు, ద్విపదలు, పద్యములు, నర్ధపద్యములు, సంధి వచనములు, సంవాద వచనములును గలవు. వృ. ను. నా. గ్రంథారంభమునఁ జోపుదారు, సూత్రధారుల సంభాషణగలదు. శ. ప. నా. గ్రంథారంభమున వేత్రపాణితో "సభికులు" (సామాజికులు) సంభాషించి నట్లుండుట విశేషము. రెండును నాటకములని పేర్కొనఁబడినవి. రచన బాగుగనే యున్నది.

---

# 160. గోనుగుంట వీరబ్రహ్మము

## శివరామ నాటకము:

ముద్రణ :– దుగ్గిరాల వడ్డెపాటి నిరంజన శాస్త్రిచే - ప్రబోధినీ ము. శా., 1911. పరిష్కర్త :– కొండముది బంగారయ్య.

ఇతఁడు గుంటూరు జిల్లా బాపట్ల తాలూకా పెదపాలెం గ్రామ వాస్తవ్యుఁడు. ఆదెమ, అమ్మయల పౌత్రుఁడు. పిచ్చమ పున్నయల పుత్రుఁడు. మారెళ్ళ సాంబయ శిష్యుఁడు. పూర్వ కవుల స్తుతిలో నీతఁడు బాణాల శరభేంద్రుని, కొమ్మోజి సోమనాథుని, ఫణిభవు సంగ కవిని, కందుకూరి రుద్ర కవిని, గుత్తికొండ జనార్దనుని, విశ్వనాథావధూతను, వేమనను బేర్కొనెను. పోతులూరి వీరబ్రహ్మమును

స్తుతించెను. "మృతకవుల స్తుతి" యను శీర్షిక క్రింద కడియాల వీపూరి యాఖ్యుని, వినుకొండ కాళిదాసుని, కొండ శంకరాచార్యుని స్మరించెను. "ఇప్పటి కవుల స్తుతి" లో అలవర్తి ఆంజనేయశాస్త్రి, వడ్డెపాటి నిరంజనశాస్త్రి, సిరికొండ దశరథరామశాస్త్రి, అడ్డాడ వీరభద్రుడు, కొలగాని వీరయ్య, మచ్చా సుబ్బయాచార్యుడు, వంగవోలు పిచ్చయ, కొండముది బంగారయ్య, చుండూరి సుబ్బయ సూరి మొ॥ వారిని జేర్కొనెను. ఇందలి వడ్డెపాటి నిరంజన శాస్త్రి, కొండముది బంగారయ్య శ్రీ శివరామ నాటకముద్రణ పరిష్కరణ కర్తలు. ప్రకటన సం. 1911. గ్రంథకర్త 1911 సం. న నుండెననుట నిశ్చయము. (ఇతడు 'మృతపండిత స్తుతి' లో మార్గసహాచారి, వెల్లటూరు శేషావధాని, కనపర్తి బసవయ్య, కోడూరి వియ్యన్న, కొర్తుర్తి సర్వయాచార్యులు, కోసూరి పాపయ, పులివర్తి పార్వతీశము, నూతలపాటి సుబ్బయ్య, శ్రీ కట్ల భాష్యకారులు అను వారిని జేర్కొనెను). ఏతత్కృతి ప్రోత్సాహకుడును, ప్రకటనకర్తయు గోనుగుంట కుమారస్వామి.

గ్రంథ విషయము :— క్రి. శ. 1811 ప్రాంతమున నెల్లూరు మండలమున విశ్వబ్రాహ్మణ కులమున జనించి (నారదుడే యిట్లు శాపవశమున జనించెనని కట్టుకథ), ఐహిక విషయవిముఖుడై తలి దండ్రులను విడిచి భైరవకోనలో బసులకాపరి వృత్తిజరించుచు శివుని కృపవలన జ్ఞానియై యాయన యాదేశమువలన గృహస్థాశ్రమము స్వీక రించి వివిధవర్ణములవారికి దత్త్వోపదేశకుడై సర్వశాస్త్ర సమాధాన మను నొక మహాగ్రంథమును రచించి, అనుములకొండయందు సమాధి నందిన శివరామ బ్రహ్మేంద్ర స్వామి చరిత్రమిందు వర్ణితము. ఇందు దరువులు, ద్విపదలు (తెర ద్విపదలుగూడ), పద్యములు, సంధి-సంవాద వచనములు, కందార్థములు, ఏలలు, దండకములు గలవు. గ్రంథా

రంభమునఁ బ్రథమ పాత్ర ప్రవేశము గూర్చి సభవారికిఁ జెప్పవచ్చిన భటుని సూత్రధారుఁడు సలంకరించుట గలదు. ఇందంక విభాగ ముండుట (రెండు) యొక విశేషము. కాని యావిభాగము సమంజసముగ లేదు. గ్రంథకర్తచే నిది నాటకమని పేర్కొనఁబడినది. నాటకోద్దిష్ట మైనది.

ఇందలి రచన :— అతి నికృష్టముగా నున్నది. ఇది భాష, భావ ములు, లక్షణము, శైలి మొదలగు విషయము లన్నింటి నుద్దేశించి యనుచున్న మాట. ఎంతటి సహృదయునకైన నీ గ్రంథమును జదువఁగానే

"నాకవిత్వ మధర్మాయ మృతయే దండనాయచ
కుకవిత్వం పునస్సాక్షాన్మృతి మాహుర్మనీషిణః"

అను శ్లోకార్థము హృదయ గోచర మగును.

(ఆం. సా. క. పరిషత్పత్రికలోని తపతీ పరిణయ య. గా. ఇతనిదే. అది 1913 లో నచ్చయినదఁట. అలభ్యము).

---

# 161. ఎల్లనూరు నరసింహ కవి

కవి కొడిది కాపు కులజుఁడు. పాలాకునగోత్రుఁడు. అశ్వత్థరెడ్డి పౌత్రుఁడు. మంగమాంబా నరిసిరెడ్ల పుత్రుఁడు. ఇతని నివాస మనంతపుర మండలమునఁ దాడిపత్రి తాలూకా ఇగుడూరు.

ఇతని య. గా. నాటక కృతులు*: కృష్ణవిజయము (1), సావిత్రీ నాటకము (2), సైంధవ పరాభవ నాటకము (3), రామనాటకము (4), సూక్ష్మరామాయణము(5). ఇందుఁ జివరి రెండిట నితఁడు వేముల పల్లె యక్షగాన కవి యమ్మనూరి వేంకట సుబ్బయామాత్యుని స్తుతించినాఁడు. సుబ్బకవి 19 శ. ఉ. భా. న నున్నవాఁడు. (చూ. ఇందలి 104 కవి చరిత్ర). నరసింహ కవి గ్రంథములలో మొదటగా కృష్ణవిజయము 1914 లో ప్రచురితమైనదని ఆం. వా. సూ. వలన తెలియుచున్నది. దాని నతఁడు ప్రమాదీచ సంవత్సరమున రచించితి నని చెప్పినాఁడు. ప్రమాదీచ 1914 లోఁబడినది. కాఁగా నరసింహ కవి సుబ్బకవి చివరి దినములలో బాలుఁడై 19 శ. చివరి పాదమునఁ గొంతకాలము నీ శతాబ్ది పూర్వార్ధమున గొంతకాలము నుండెనని యూహింపఁదగి యున్నది.

ఇతని యక్షగాన కృతులలో ఇగుడూరు, చుక్కలూరు, గాండ్లపాటి హారముద్రలు గలవు. ఆ యూళ్లన్నియును గవి యింటిపేరిటి

---

* పై కృతులలో (1) (5) ఇగుడూరి హరి కంకితములుగా సరస వేంకట భొట్లను నాతని ప్రోత్సాహమున రచింపఁబడినవి. (1) ఒక ముద్రణ :— సి. వి. కృష్ణా బుక్ డిపో, మదరాసు, 1949

(2) చుక్కలూరి హరికంకితము. కృతి ప్రోత్సాహకుఁడు గ్రంథ కర్త పెద తండ్రి కొడుకగు ఎల్లనూరు నరసింహారెడ్డి. బరూరి వారి ప్రచురణ, మద్రాసు, 1937.

(3) గాండ్లపాటి హరి కంకితము. కృతి ప్రోత్సాహకులు దబ్బర కొండయ, చేరెడ్డి బాలయ్య, దుబ్బ నాగిరెడ్డి: సి. వి. కృష్ణా బుక్ డిపో ప్రచురణ :— 1954.

(4) మద్రాసులో 1933 లో బరూరి వారిచేతను, 1947లో ఎన్. వి. గోపాల్ అండుకో వారి చేతను బ్రచురితము, (ఇందితఁ డప్పకవిని కంకంటి పాపరాజ కవిని స్మరించి యుండుట విశేషము).

(5) మదరాసు జొడన్ ప్రెస్ ముద్రణ :— 1926 : బరూరి వారి ముద్రణ 1941.

యూరును దాడిపత్రి తాలూకాలోఁ గలవు. నితని కడమ కృతు లన్నియు బేర్కొనఁబడినవి. ఇతఁడీ నాటకములనేకాక మయూరధ్వజ చరిత్ర, సత్యభామా వివాహము, వేంకటేశ్వర భక్తవిజయము నను మూఁడు హరికథలను రామశతకమునుగూడ రచించినట్లందు చెప్పు కొనెను.

నరసింహ కవి నాటకము లన్నియుఁ బ్రసిద్ధేతివృత్తములు. కృష్ణ విజయము నందలి కథ కంస వధము. రామనాటకమందలిది కుశ లవ కథ. సూక్ష్మ రామాయణమున బాలకాండముదక్కఁ గడమ యైదుకాండలు "అంతయు నొకరాత్రి కథ యొనర్చి" రచించినాఁడు. అన్నిటను వివిధ రాగ తాళములలో దరువులు, ద్విపదలు, పద్యములు (సంధికిఁగూడ), సంధివచనములు, వచనప్రచురముగాఁ బాత్రల సంవాదములును గలవు. అన్నిటను రచన సలక్షణమైనది. మిగుల చక్కనిది. అందు క్రమ పరిణతి గోచరించును. అన్నియు నాట్యోద్దిష్టములైనవి. నాటకములని పేర్కొనఁబడినవి. ప్రదర్శనములకెక్కి రాయలసీమలో లేపాక్షి నాటకములు, వేములపల్లె నాటకములవలె ని నరసింహ కవి నాటకములును తాడిపత్రి నాటకములని పేర్వడసినవి.

---

## 162. విహారగండ ఓబుళరాజు

**ఉషా పరిణయము :**

ముద్రణ :— వెస్టు వార్డు అండు కో, మదరాసు 1916 గ్రంథ పరిష్కర్త — ఉపేంద్ర (శ్రీరామరాజు)

కవి నివాసము వెంకటాంపల్లె (అనంతపురము తాలూకా). భార్గవసగోత్రుఁడు. ఓబరాజు పుత్రుఁడు. ఇతఁడు గ్రంథ ప్రచురణము

నకు సాహాయ్యమొనర్చిన నంది గారి రోశన్న సెట్టిని ప్రశంసించినాఁడు. ప్రచురణ సం. 1916 కావున నప్పటివాఁడే. గ్రంథము నాటకమని పేర్కొనఁబడినది. రచన సమకాలిక య. గా. నాటకపు ఫక్కినున్నది. వచన ప్రచురముగాఁ బాత్రల సంభాషణలు గలవు. శైలి నాతి ప్రౌఢము, నాతిపేలవము. శ్రీకృష్ణ శతక మీతని కృత్యంతరము.

# 163. ఉపేంద్ర శ్రీరామరాజు

## రుక్మిణీ పరిణయము:

(ప్రచురణ కర్త :— గ్రంధి విరూపాక్షు సెట్టి, వెంకటాంపల్లె, సం. తెలియదు.)

కవి నివాసము కల్లుమడి (గుత్తి తా. అనంతపురం మండలము. భారద్వాజసగోత్రుఁడు. సుబ్బమాంబా తిప్పరాజుల పౌత్రుఁడు. రామాంబా తిరుపతిరాజుల పుత్రుఁడు. గ్రంథము నచ్చువేయించిన గ్రంధి విరూపాక్షు సెట్టి ప్రశంసను జేసియుండుటచే నితఁ డాధునికుఁ డనుట స్పష్టము. ఇతఁడే పూర్వోక్తమైన మీసరగండ ఓబుళరాజు ఉషాపరిణయము 1916 సం. నాటి ముద్రణమునకుఁ బరిష్కర్త. అందుచే నితఁడు నప్పుడుండినవాఁ డనుట నిశ్చయము. ఇతఁడు కవిస్తుతిలో అప్పకవిని, కంకంటి పాప రాజును, కిడాంబి రాఘవాచార్యుని, యమ్మనూరి వెంకటసుబ్బకవినిగూడఁ జేర్చియుండుట విశేషము. (సుబ్బ కవి ప్రశంసాత్మకముగను, కుకవి నిందాపరముగను నిందున్న రెండుత్పలమాల పద్యములెల్ల నూరు నరసింహకవి రామనాటకము, సూక్ష్మ

రామాయణములందు యథా తథముగఁ గన్పట్టుచున్నవి.) ఓబుళ రాజు ఉషా పరిణయ ముఖపత్రమున నీ శ్రీరామరాజు రుక్మిణీ శకుం తలా పరిణయములను రెండు గ్రంథములను రచించినట్లు గలదు. కాని రుక్మిణీ పరిణయ మొక్కటే లభ్యమైనది.

గ్రంథ విషయము. ప్రసిద్ధము. ఉపోద్ఘాత ద్విపద, నటీనట సంవాద రూప ప్రస్తావన, చోబ్దారి రాకలతోఁ గథారంభము. ఇందు కంఠార్థము లెక్కువ. పదములు, దరువులు, ద్విపదలు, కొలఁది పద్యములును గలవు. సంధివచనములు, కొద్ది సంవాద వచనములు నెక్కువ. గ్రంథము నాటక మని పేర్కొనఁబడినది. నాటకీయత యెక్కువ గలదు. రచన యొకమోస్తరు.

---

# 164. తంగుటూరు వెంకటరామయ్య

## ప ద్మా వ తీ ప రి ణ య ము :

(ప్రచురణ :— అమెరికన్ డైమండు ప్రెస్., మదరాసు 1916. ప్రచురణ కర్త :— వంకదార రోశన్న. పరిష్కర్త కిడాంబి రాఘవాచార్యులు)

కవి అనంతపురం తాలూకా వెంకటంపల్లె నివాసి. వైశ్యుఁడు. వరదాంబా తిప్పయ్యల పుత్రుఁడు. మాల్యవంతం వెంకటాచలమయ్య శిష్యుఁడు. పూర్వోక్తమైన ఉపేంద్ర శ్రీరామరాజు ఉషాపరిణయము

నందుఁ బేర్కొనఁబడెను. కిడాంబి రాఘవాచార్యులు గ్రంథ పరిష్కర్త. శ్రీరామరాజు 1916 ప్రాంతమువాఁడు. ఈ గ్రంథము ప్రచురణ సం. 1916 కావున నితఁడు రాఘవాచార్యులు నప్పటి వాఁడే యగును. (ఈ గ్రంథము చివర పీఠికా వచనములు కొన్ని గలవు. అందుఁ బ్రచురణ కర్త ప్రశంస గలదు. ముమ్మనూరి వెంకటసుబ్బకవి పేరును బ్రసక్తమైనది.)

గ్రంథ విషయము :— వరాహ పురాణోక్త ప్రకారము పద్మావతీ వేంకటేశ్వరుల పరిణయ గాథ. ఇందు పదపద్య ద్విపద కందార్థములు గలవు. సరళమైన వచనములో సంవాద శైలీ ప్రాబల్యము గల గ్రంథమిది. గ్రంథారంభమునఁ జోబ్దారి రాక, పదముల చివర ముద్ర సాధారణ విషయము. నాయకుఁడే నాయిక కడ కేఁగి చెప్పఁబోవుట యొక విశేషము. గ్రంథము యక్షగానమని పేర్కొనఁబడినది. రచన నిరాడంబరము, సరసము నైనది

----

# 165. ముడుంబై అలమేల్మంగతాయారమ్మ

## సుల్తానీ కల్యాణము :

(ముద్రణ :— వాణీ ము. శా. బెజవాడ, 1917)

ఈమె కౌశికగోత్రజ. నరసింహ దేశికుని శిష్యురాలు. గ్రంథాంత ద్విపదలో నీమె పిఠాపుర కుంతిమాధవస్వామిని స్మరించి యుండుటచే గోదావరీ మండలవాసిని యని తోఁచును. గ్రంథారంభమున స్వీయముగా నొక వచన పీఠిక వెలయించి యుండుటచే నీమె యాధునికు రాలని చెప్ప వచ్చును.

సుల్తానీ కల్యాణమనఁగా నిందలి యితివృత్తము వైష్ణవగాథలలో గడుప్రచారమందిన బీబినాంచారికథ. ఈకథ కాకర మాచార్యసూక్తిముక్తావళి. సురతాణి కల్యాణము పేరఁ గర్తృత్వమెఱుఁగఁబడని యింకొక యక్షగానముగలదు. దానిని దాను జూచినట్లు చెప్పినదీమె. ఈమెరచనయే మేల్తరమైనది. ఇది తాళప్రధానములైన దరువులు ప్రచురముగాఁ గలరచన. ఇందు ద్విపదలు, సీసములు, కందములు ఏలలు, లాలి, అర్ధచంద్రికలు, ధవళశోభనములు, సంధి వచనములు, గలవు. యక్షగానమని పేర్కొనఁబడినది.

---

# 166. తిరువీధి చెంచు సుబ్బదాసు

**ఉషాపరిణయము :**

(ప్రచురణ :— వి. వి. నాయుఁడు అండు సన్సు, నెల్లూరు సం. ?)

కవి నివాసము " నెల్లూరుజిల్లా వేంకటగిరి సంస్థానము ఇలాకా కొచ్చెర్లకోట ". తలిదండ్రులు నరలక్ష్మమ్మ వేంకటరామాఖ్యులు. గురువు ముసలయాచారి. కృతిభర్త నెల్లూరుజిల్లా పొదిలితాలూకా వల్లాయపురివాసి పొతకమూరి లక్ష్మీనరసింహాము. ఈకృతియందలి దరువులలో వల్లాయపురి కోదండరాముని ముద్ర యుండుటచే దీనికి వల్లాయపురి ఉషాపరిణయ మనియుఁ బేరు. ఈ కవి నారాయణతత్త్వవిలాసమను నింకొక యక్షగానమును రచించి నట్లును నది 1913 లో ముద్రితమైనట్లును ఆం. వా. సూ. వలనఁ దెలియుచున్నది. అది

యలభ్యము. ఈయుషాపరిణయము పింగళసైశాఖయందు రచింపఁబడి నట్లు ప్రచురణ కర్తలు తెలిపినారు. 1917 పిం గళ. కవి యీశతాబ్ది వాఁడే యైయుండును.

ఉషాపరిణయకథ ప్రసిద్ధమైనది. ఇందు దరువులు, పద్యములు, సర్థపద్యములు, సంధి—సంవాద వచనములునను గలవు. గ్రంథము గేయ ప్రబంధ మనియు, నాటకమనియుఁ బేర్కొనఁబడినది. రచన సరళ గ్రాంధికములోఁ జక్కఁగనే సాగినదన వచ్చును గాని యక్షుంతవ్యములగు దోషము లనేక మున్నవి.

---

# 167. మరుధూరి తాతాచార్యులు

ఇతఁడు గుంటూరు జిల్లా నరసారావుపేట తాలూకా వేమవరప్పాడు గ్రామ వాస్తవ్యుఁడు. భారద్వాజసగోత్రుఁడు. మరుధూరి వేంకటాచార్య పుత్రుఁడు. ఇతని కృతి "పారిజాతం బను శ్రీకృష్ణలీలా విలాస నాటకము". కవి పెట్టిన పేరదే కాని యిది శ్రీ సత్యభామా మనోల్లాస నాటకమనుపేర 1919 లో నరసారావుపేట రాజ్యరమా ము. శా. యందు ముద్రితమైనది. కృతిపతియైన జుజ్జూరి ఆదినారాయణ (వేమవరవాసి) యే ముద్రణ సహాయుఁడని ముఖపత్రము. అనఁగాఁ గవి 1919 సం. ప్రాంతముననున్న వాఁడని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

ఈకృతియందు నంది తిమ్మనగారి పారిజాతాపహరణ ప్రబంధ ప్రణాళికయే పాటింపఁబడినది. రచనలోఁ దదను కరణమును గలదు.

ఇందు దరువులు, ద్విపదలు (పాత్రలు తెరవెడలు సందర్భములందును), పద్యములు, కందార్థములు, సంధివచనములును గలవు. "చోపుదారు" లేక "కట్టియం" పాత్రగలదు. రచన నిర్దుష్టముకాదు గాని యొకింత సరసమైనదే.

---

# 168. వీణె సుబ్బరాజు గారుల పెండ్లూరు శేషగిరిరాజు

## కుశలవ నాటకము:

వీణె సుబ్బరాజు మనుమఁడు శేషగిరిరాజు. వీరు మాగధ కులజులు (భట్రాజులు). సుబ్బరాజు తండ్రి చన్నమరాజు. గురువులు చదలువాడ నృసింహాచార్యుఁడు, రమణాచార్యుఁడు; సుబ్బరాజు సంతవేలూరువాసి. (ఈకృతికి సంతవేలూరు కుశలవ నాటకమనియే పేరు; రామనాటకమని నామాంతరము). శేషగిరిరాజు పెండ్లూరు పురవాసి. ఈ శేషగిరిరాజు మేనల్లుడైన కోడూరు సుబ్బరాజీ గ్రంథ స్వాతంత్ర్యమును కడూరు చెంగల్వరాజుగారికిచ్చినట్లు చెంగల్వరాజు గారు 1922 సం. స ముద్రాసు సరస్వతీ ము. శా. యందు ముద్రింపించి ప్రచురించిన ప్రతిమీఁదను, చెంగల్వరాజుగారి నుండి గ్రంథస్వాతంత్ర్యమునుబొంది 1931 లో మదరాసు వెస్టువార్డువారు ప్రకటించిన ప్రతిమీఁదను గల ముఖపత్రములవలనఁ దెలియుచున్నది. (రెండిటను రెండవ పుటలో నీగ్రంథ స్వామ్యప్రదాన ప్రశంసాత్మక మగు నొక సీస మాలికయుఁ గోడూరు సుబ్బరాజు కృతముగాఁ గన్పట్టును). కాఁగా గ్రంథకర్త లిరువురు నీశతాబ్ద్యారంభమున నుండినటు గ్రహింపవచ్చును.

గ్రంథవిషయము :— ప్రసిద్ధము. ఇందు జైమిని భారతకథా రీతి గ్రహింపఁబడినది. ఇందలి దరువులు, వివిధ ప్రసిద్ధ రాగతాళము లలోనున్నవి కాక తాళప్రధానములును గొన్ని క్రొత్తదరువులును గలవు. ద్విపదలు పద్యములు, కందార్ధములు, కొలదివాటి చిన్నసంధి-సంవాద వచనములు, రేకుమూర్ణకలు, నోక్కోక జావళి, రగడ, గొబ్బ, నలుగు, లాలి, జోలపాటలును గలవు. రచన హృదయంగమముగా నున్నది. ఇది "ఆటపాత్రిళ్ళ నాటకమునకును, బొమ్మలాటకును ఉపయోగముగా" రచింపఁబడినదని ముఖపత్రమునఁ గలదు. గ్రంథారంభమున గటికము పాత్రకుముందు వినాయక తదర్చక పాత్రలను గూడ కవి ప్రవేశ పెట్టియుండుట విశేషము.

---

# 169. కాకరపర్తి నృసింహకవి

## సంగీత సారంగధర నాటకము :

(ప్రచురణ :— ఆర్. సంజీవిరావు అండ్ సన్ వారిచే శ్రీరామా విలాస ము. శా., విజయనగరము, 1927)

కవి గురించి విశేషము లేవియుఁ దెలియవు. కృతిపతి పొట్టా పెదచ్చనార్యుఁడు. ఈగ్రంథ ప్రస్తావనలో విదూషకి ప్రసంగమున "బోయర్సుయుద్ధము" ప్రశక్తివచ్చినది. చరిత్ర ప్రసిద్ధములైన ఆఫ్రికాబోయరు యుద్ధములు క్రీ. శ. 1877 - 1902 సం. ల నడుమజరిగినవి. ఈకృతి ప్రచురణ వత్సరము 1927. కవి 1900 - 1927 నడుమ నుండి యుండును.

గ్రంథవిషయము ప్రసిద్ధము. రచన చక్కనిది. ఇది 'నాటకము యక్షగాన శృంగాటకమ్ము' అని కవిచేఁ బేర్కొనఁ బడినది. ఆశృంగాటక శబ్దము సార్థక మగునట్లే యున్నదిందలి రచనాప్రక్రియ. ప్రారంభమున సూత్రధార విదూషకులచే సలక్షణముగాఁ బ్రవర్తింప బడిన ప్రస్తావనయుఁ గలవు. గ్రంథమధ్యమున విదూషక ప్రసంగము లున్నవి. గ్రంథ మైదంకములుగను నంకములు తిరిగి యనేకరంగములు గను విభాగింపఁబడినది. ఇందు సంధివచనములు లేకుండ ముఖాముఖిగా సరళశైలిలో వచన ప్రచురముగాఁ బాత్రల సంభాషణలు, స్వగతములు, నేపథ్యప్రసంగములు, పాత్రలు సూటిగాఁ బ్రవేశించు పద్ధతి (ఒండు రెండుచోటులఁదక్క)యుఁ బ్రసిద్ధ రాగతాళములలోఁ బాటలు, పద్యములు, వచనములు నొక్కొక్కచో ద్విపదయు రగడయుఁ బ్రయుక్తమైనవి. ఇదియంతయు సంస్కృత పాశ్చాత్య నాటక ఫక్కికలకు నడిమి వాటముగా నడుచుచు ధార్వాడనాటకపుఁ బోకడలుగూడ సంతరించుకొన్న నాఁటి ధర్మవరము కృష్ణమాచార్య ప్రభృతుల నాటకముల రచనాప్రక్రియకు దీటుగా నున్నది. కాని యక్షగాన ప్రక్రియతో నెట్టిపోలికయు గానరాదు. గ్రంథకర్తయే స్వయముగా యక్షగానమనియుఁ బేర్కొనియుండుటచే దీని కిచటఁ బ్రసక్తి కలిగినది.

---

# 170. ఎన్. వెంకటరామయ్య

ఇతఁడు సత్యనారాయణ వ్రతమను యక్షగానమును రచించె ననియు నది బెజవాడ వాణీ ముద్రాక్షర శాలలో ముద్రితమై తేదీ 4-8-1934 న నితని చేతనే ప్రకటితమైన దనియుఁ దెలియుచున్నది. గ్రంథ మలభ్యము. (ఇతని నివాసము చినయనమదలయని తెలియుచున్నది.)

---

# 171. శ్రీ రాజా వేంకటాద్ర్యప్పారావు బహద్దరు

వీరు ఉయ్యూరు సంస్థాన ప్రభువులు, సాహితీ వల్లభులు. వీరు 1918లో కొండపల్లి వీరవెంకయ్య (రాజమండ్రి) సమూహములుగా ప్రచురించిన తమ శ్రీకృష్ణలీలా తరంగిణీ - యాంధ్రానువాద గ్రంథము చివర స్వవిషయము నుటంకించుచు నందు "కాకతి రుద్రాంబకథ యక్షగాన ప్రబంధ శోభిలము అను రచించినాడ" నయున్నారు. శివ తరంగిణీ యను నాటక కాలమునకు "ఐదు నేలును నలుపది యొదవ కలి తారశాబ్దము" గా చెప్పుకొనినారు. అది క్రీ. శ. 1944. కాకతి రుద్రాంబకథ యాంధ్రకవులందే రచింపబడిన దన్నమాట. ఇట్టు చరిత్ర ప్రసిద్ధులగు వ్యక్తుల జీవితాంశములను యక్షగాన కథావస్తువులగుట యొక విశేషము. ఈ రుద్రాంబ య. గా. ముద్రితమైనదట. కాని లభ్యము కాలేదు.

---

# 172. బళ్ళ రామరాజు

## శ్రీ కృష్ణ లీలలు:

(ప్రచురణ: కాళహస్తి తమ్మారావు అండు సన్సు రాజమండ్రి వారిచే ద్వితీయ కూర్పు, 1945)

కవి రుక్మాంగదసగోత్రుడు. రాజమాంబా సీతారామరాజుల పుత్రుడు. బళ్ళ సీతారామరాజు వ్యాలపల్లి రాధామాధవ నాటకకర్త

అతఁడు క్రీ. శ. 1906 సం. న నుండినట్లు నిశ్చితముగా దెలియవచ్చినది. (చూ. ఇంకతని యుదంతము, నం. 150). అతని పుత్రుఁడైన యీతఁడీశతాబ్ది పూర్వార్ధము నందుండెననుటలో విప్రతిపత్తి లేదు.

ఇతని గ్రంథము పలు చిన్న చిన్న రంగములుగా విభాగింపఁబడినది. కృష్ణజననాదిగా నుగ్రసేన పట్టాభిషేకము వఱకుఁగల భాగవతకథలోని ముఖ్యాంశము లొక్కొకరంగమున నొక్కొకటి మిక్కిలిసంగ్రహముగాఁ జెప్పఁబడినవి. ప్రతి సన్నివేశమును బాత్రముఖముగా నాటకీయముగాఁ బ్రవర్తితమైనది. అంతయు సూటియైనపద్ధతి. కీర్తనలు, వచనము, పద్యములు నిందలి రచనాంగములు. అన్నియుఁ బాత్ర సంవాదాత్మకములే. వర్ణనగాని కథనముగాని లేవు. రంగప్రయోగ సూచనలు, పాత్రావస్థాసూచనలు, మొ॥ గలవు. ఇది యాధునిక రంగస్థలనాటకప్రక్రియ కతిసన్నిహితముగా నున్నది. కాని కవి గ్రంథాంత గద్యలో దీనిని 'యక్షగాన ప్రబంధ' మని పేర్కొనియుంటచే నిచటఁ జేర్పవలసి వచ్చినది.

---

# 173. వాడ అప్పలస్వామి

## రామదాసు నాటకము:

( ముద్రణ :— నేషనల్ ప్రిటింగువర్క్సు, యలమంచిలి. )
( 1950 )

ఇతఁడు నాగమళ్ళ గోత్రమువాఁడు. మామిడివాడ శివారు కలవలపల్లి (విశాఖమండలము, యలమంచిలితాలూకా) గ్రామస్థుఁడు.

గొబ్బూరునివాసియగు కీర్తి వెంకటరామయ్యపంతులుగారి శిష్యుఁడు. ఈకీర్తి వెంకటరామయ్య ఎఱుకలకథ అను య. గా. నకుఁ గర్త. ఈయన 1906 సం. న నుండినవాఁడని నిశ్చయింపఁ బడినది. (చూ. ఇందతని యుదంతము సం. 152). అతని శిష్యుఁడగు అప్పలస్వామి తా నీ కృతిని సర్వజిన్నామవత్సరాషాఢమున రచించినట్లు చెప్పినాఁడు. ఇది 1947లోఁ బడిన సర్వజిత్తే కావచ్చును. అప్పలస్వామి యీ శతాబ్ది పూర్వార్ధమున నుండినవాఁడనుట నిశ్చయము. (ఇప్పుడుకూడ నున్నాఁడేమో!)

గ్రంథవిషయము :— ప్రసిద్ధుఁడగు భద్రాచల రామదాసు చరిత్రము. యక్షగానమని పేర్కొనఁ బడినది. ఆ ప్రక్రియ సమృద్ధిగా నున్నది. విశేషములులేవు. రచన 'నా కవిత్వమధర్మాయ...' అను శ్లోకమును జట్టున జ్ఞప్తి కెలయింపఁ గలట్టిది.

---

# 174. నల్లమిల్లి బసివిరెడ్డి

ఈయన జీవత్కవి. జననము 30-9-1897. నివాసము తూర్పు గోదావరిజిల్లా రామచంద్రపురం తాలూకా రామవరము. రెడ్డి కులజులు. సిరిపాలగోత్రజులు. తల్లిదండ్రులు బుల్లెమాంబా బాపిరెడ్డులు. ఈయన ఆంధ్రప్రాంతమున హరికథకులుగా సుప్రసిద్ధులు. హరికథా ఖ్యానమునందే కాక రచనమునందును నిష్ణాతులు. బహు గ్రంథ

కర్తలు.* భారత రామాయణ భాగవతములు మూఁడింటి హరికథా రూప పరివర్తనముల నతిసమర్థముగా ఒక్కచేతి మీఁదుగా నిర్వహించిన నిపుణులు. ఇవికాక భక్తవిజయము, జాతీయభారతము (గాంధి చరిత్ర), శశిరేఖా పరిణయము, వేమన చరిత్ర, గోస్తనీనదీ మాహాత్మ్యము నను హరికథలు, శ్రీకృష్ణశైశవము (కంసవధ), ప్రహ్లాదచరిత్ర, కుశలవ, మైరావణచరిత్ర మొదలగు యక్షగానప్రాయ నాటకములును రచించియుండిరి. వీరి రచనలలో శ్రీమద్రామవర రామాయణము (షట్కాండలు - మూఁడు భాగములు) యక్షగానప్రబంధముగా గ్రంథకర్తచేఁ జేర్కొనబడినది. కాని గ్రంథమంతయుఁ బ్రసిద్ధరాగతాళములలో తోహరాలు, భజన కీర్తనలుగను, నడుమ నడుమ చిటిపొటి వచనములతోను నిండి యున్నది. అయితే ఇందు సంవాదశైలీ ప్రాచుర్యముతో నాటకీయత ప్రస్ఫుటముగ నున్నది ఇది భజన కూటములందు నిరాహార్యకముగనే ఆయా కథాపాత్రముల ప్రాతినిధ్యము వహించిన భక్తులచే నాటకీయముగఁ బలుతడవులు ప్రవర్తితమైనది. (యక్షగాన ప్రదర్శనలందిట్టి వింత సంప్రదాయ మొకటి కన్నడదేశమున నున్నదని సన్నగా వింటిని). ఆంధ్రదేశమునందును నీ యాధునిక కాలముననే యిట్టి గ్రంథములు గొన్ని బయల్వెడలినవి. అవి అన్యత్ర ప్రసక్తములు. యక్షగాన పరిణామ చరిత్రలో నిదియొక

---

* ముఖ్యగ్రంథ ప్రచురణ వివరము ' (1) శ్రీమద్రామవర రామాయణము, 2) శ్రీ మద్భారత వీరచరిత్రను (హరికథ)- రాయవరము మేరీ ముద్రాక్షరశాల, సం. వరుసగా 1926-27; 1940. (3) మైరావణ చరిత్రను, (4) సంగీత భక్తరామదాసు (య. గా. నాటకములు లేక నాటకభజన కీర్తనలు), (5) వేమనయోగి చరిత్రము (హరికథ) — రామచంద్రపురము శ్రీ వాణీ ము. శా. సం. వరుసగా 1928, 1928, 1932. (6) జాతీయభారతము — యు. ఎన్. ము. శా. మారుటేరు, 1950. భాగవతము హరికథ మొ|| కొన్ని అముద్రితములు ).

యాపగార్వ సమ్మతము. ఈవిషయము, ఆదిభట్ల నారాయణదాసాదుల వలె నీయన హరికథలను యక్షగానములుగా వ్యవహరించిన విషయము నసలు యక్షగానోత్పత్తి చరిత్రను బట్టి యంత సమంజసములుగాఁ దోఁచక పోయినను, యక్షగానములకును హరికథలకు నీ భజన నాటకములకును విస్పష్టమగు భావసంబంధము లేకపోయినను, ప్రక్రియలో దానికిని వీనికి నేకొంతయో సాదృశ్యము (సంగీతనాటకీయతల స్థితత్వమునందు) దోఁచి పండితులైన మా పెద్దలట్లు వ్యవహరించి యుండుటను కేవలము గాదనలేము. ఈవిషయమును గూడ బహుముఖ చిత్రమైన యక్షగాన పరిణామచరిత్రలోనొక మెట్టు (బహుశః చివరి మెట్టు)గా (ఇప్పటిమట్టునకైన) గ్రహించుట లెస్స యనుకొందును.

ఈ సందర్భమున శ్రీ బసివిరెడ్డిగారు స్వీయముగ వక్కాణించిన యభిప్రాయము చే నిందుఁ బొందుపఱచుచున్నాను: "సంగీతముతోఁ గూడిన కీర్తనలు, పద్యములు, గద్యములతో నడచునవన్నియును యక్షగాన కావ్యములే యని నా యభిప్రాయము. యక్షగానములలో నాటకములు, హరికథలు, కావ్యములు — అన్నియు చలామణీ యగు చుండును. హరికథలన్నియు యక్షగానకావ్యములే యని చెప్పనగును. ఇంచుమించు నేను వ్రాసినవి ఒక్క డ్రామాలు జయప్రద వగైరాలు తప్ప తక్కిన వన్నియు యక్షగానకావ్యములే. రామాయణము కేవలము కీర్తనలు, ద్విపదలు, వచనములే గాన యక్షగానము లంటిని. యక్షగానములని అన్నను అనకపోయినను కీర్తనలతో నిండినవన్నియు యక్షగాన ప్రబంధములే యని నా యుద్దేశము."

బసివిరెడ్డిగారి రచన బహువిధ గద్యపద్యగేయ భాసురము, సరసము, సలక్షణము, సరళము, చతురమునైనది. ఆయన సహజ పాండిత్యధురీణులు, సహజకవి బిరుదాభిరాములు:

---

# అనుబంధము
# (1)

## 20. శతాబ్ది పల్నాటి యక్షగాన కవులు

### 1. కీ. శే. కన్నెగంటి ప్రభులింగాచారి :

తక్కెళ్లపాడు నివాసి. విశ్వబ్రాహ్మణుఁడు. అష్టావధాని. ఇతని య. గా. కృతులు :— జయప్రద నాటకము, తారా చంద్రము, పాంచాలీ స్వయంవరము, గయోపాఖ్యానము. ఇతని పల్నాటి వీర చరిత్ర నాటకము యక్షగానమగునో కాదో తెలియదు.

### 2. కీ. శే. తంగెడ లక్ష్మీకాంత కవి :

మోర్జంపాడు వాస్తవ్యుఁడు. నియోగి. జగన్మోహినీ నాటకకర్త.

### 3. కీ. శే. మల్లెం సుబ్రహ్మణ్యాచారి :

విశ్వబ్రాహ్మణుఁడు. సావిత్రీ నాటకకర్త.

### 4. కీ. శే. కొండ భవానీ శంకరాచార్యులు :

వేమవరము నివాసి విశ్వబ్రాహ్మణుఁడు. వీర బ్రహ్మ యోగి నాటకకర్త.

### 5. కొండరాజు మల్లయాచారి :

వేమవరము నివాసి. విశ్వబ్రాహ్మణుఁడు. నల నాటకకర్త.

### 6. కూరపాటి కోటమరాజు :

నాగులవరము. భట్రాజు. ఉషా కన్యా పరిణయ కర్త.

### 7. దుగ్గరాజు సీతయ్య :

ఉషాపరిణయ నాటక కర్త.

### 8. బత్తుల లక్ష్మయ్య :

ప్రవరాఖ్య నాటక కర్త.

---

గమనిక :— ఈయనుబంధమున కాధారములు :— శ్రీరావిపాటి లక్ష్మీనారాయణ గారు (గురజాల) రచించిన పల్నాటి చరిత్ర ; వారు నాకు తే. 30—6—55న వ్రాసిన యుత్తరము. పై నాయా కవుల య. గా. కృతులు మాత్రమే పేర్కొనబడినవి. అందొకటియు లభ్యము కాలేదు.

# 1. రఘునాథ నాయకుఁడు

ఇతఁడు సుప్రసిద్ధుఁడగు తంజాపురాంధ్ర నాయకరాజు. అచ్యుతప్ప నాయకునకు మూర్తిమాంబకునుఁ బుత్రుడు. ఇతని రాజ్యకాలము క్రీ. శ. 1600 - 1631. ఇతని యాస్థాన మనేక సంస్కృతాంధ్రకవులకును, కవయిత్రులకును నాశ్రయమై నెగడినది. ఇతఁడే చేమకూర వెంకటకవి విజయవిలాసమునకుఁ గృతిభర్త. కృతిభర్త యగుటయే కాక స్వయముగ కృతు లనేకము రచించినాఁడు. అందు రామాయణము, వాల్మీకి చరిత్రము మొదలగు పద్యకావ్యములు, నలచరిత్రే మొదలగు ద్విపద కావ్యములే గాక (ఈ మూఁడును నేఁ డుపలబ్ధములు) యొండు రెండు యక్షగానములు గుండుట విశేషము. కాని యవి నేఁడలభ్యములు.

## 1. శ్రీ రుక్మిణీ కృష్ణ వివాహ యక్షగానము:

ఇది యీతని కృతిగా సంగీత సుధలోఁ బేర్కొనఁబడినది. (చూ. సం. సు. చరిత్రమ్., శ్లో 63. Published in the journal of the Music Academy, Madras, 1930. Vol. I. Pp. 63) ఈ శ్లోకమే గోవింద దీక్షితుని సాహిత్యసుధలోనిదిగా శ్రీ యస్. కృష్ణస్వామయ్యంగారి Sources of Vijayanagar History 269 వ పుటలో నుదాహృతము.

## 2. జానకీ కల్యాణ చాటుకావ్యము:

ఇది యీతిని కృతియైనట్లీతని కొడుకగు విజయరాఘవుని రఘునాథ నాయకాభ్యుదయము (తం. స. మ. ప్రచురణ, 1951. పుట. 21) వలనఁ దెలియవచ్చినది. ఇది యక్షగానమని పేర్కొనఁబడలేదు. రఘునాథుఁడే పేర్కొనియుండిన దీనిని యక్షగాన మనియే యని యుండెడి వాఁడేమోగాని పేర్కొనినవాఁడు విజయరాఘవుఁడు కావున నతని

తరమునుండి తంజావూరున యక్షగానమున కావేర వ్యవహారము సన్న గిల్లి నాటకము, నాటుకావ్యము నని వ్యవహారము గలిగి నట్లుతని యక్షగాన ప్రాయ రచనలనుండియే (చూ. కాళీయమర్దనము – తం. స. మ. కే. నం. 500, పూతనా హరణము – నం. 554, ప్రహ్లాద చరిత్ర – నం. 541.) యెఱుక పడుచుండుట వలనఁ జాటు కావ్యముగాఁ బేర్కొనఁబడిన యీ జానకీ కల్యాణము యక్షగానము కావచ్చునని యూహ.

ఇంతకును రఘునాథుని యక్షగాన రచన యొక్కటియు స్వరూపము దెలియకుండఁ బోయినది.

---

# 2. కృష్ణాధ్వరి

ఇతఁడు పై రఘునాథ నాయకున కనేక కృతు లంకిత మిచ్చిన వాఁడు. తన నైషధ పారిజాతీయమున (తం. స. మ. నం. 172) నాతని కృతికన్యల యెడ నతని వాల్లభ్యమును బ్రశంసించుచు నొక సీస పాదమున '<u>కల్యాణకౌముదీకందర్ప నాటక</u> కన్యోద్వాహన బద్ధ కంకణుం' డని పేర్కొనెను. ఆ నాటక మలబ్ధము. అది యానాఁడు రఘునాథు నాస్థానముననే వెలసిన కమలినీకలహంసాదులవలె సంస్కృత రూపకమై యుండునని తోఁచును. అది తెలుఁగు గ్రంథమే యై యుండు నెడల మార్గ నాటకములవంటి నాటకము లానాఁటికిఁ దెనుఁగునఁబుట్టినట్లు కానరానందున యక్షగానమై యుండునని యూహ. అంతమాత్రముచేతనే దాని కిట నీపాటి ప్రసక్తి గల్గినది.

---

# 3. విజయరాఘవనాయకుఁడు

ఇతఁడు తంజావూరు రఘునాథ నాయకుని పుత్రుఁడు. అతని తరువాత క్రీ. శ. 1633 – 1673 సం. ల నడుమ తంజావూరి నేలిన వాఁడు. అతనికి సాహిత్య ప్రక్రియ లన్నిట యక్షగాన మనిన నతి మాత్ర ప్రీతి. తద్రచనలో నతి విదగ్ధుఁడు. ఆస్థాన కవులచే ననేక యక్షగానములు రచింపఁజేయుటయే కాక తాను స్వయముగా బహు కృతులు రచించి తన కొలువు నట్టువమేళములచేఁ దఱచు ప్రయోగింపఁ జేసి వినోదించెడివాఁడు. రఘునాథనాయకుని కాలమున రాజ సభా ప్రవేశపురస్కారము లభించిన యక్షగానమునకు విజయ రాఘవుని కాలమున రంగభోగము విస్తరిల్లినది. తత్ప్రక్రియ యొక్క విశిష్టపరిణతి నందినది. తంజావూరు తన్మహనీయస్థితి మూలమై నిలిచినది. నాఁటి నుండి యక్షగానముయొక్క ప్రదర్శన ప్రయోజనము బాగుగా గుర్తింపఁబడి యది కోటలోని రాజుగారికిని పేటలోని ప్రజలకును సమానముగా నాదర పాత్రమై సర్వోపభోగ్యమై యాంధ్రులకు నాటకము లేదన్న లోటు కొంత తీర్చినట్లైనది. నాఁటి నుండి తంజావూరిలో యక్షగానము తన పేరు గోల్పోయినను ప్రతిష్ఠగోల్పోక, చాటు కావ్యముగాఁ బరిగణింపఁబడినను నాటక నామకరణము చేయించుకొని, తత్రాపి మహానాటకమనియుఁ గొందఱిచే వ్యవహృతమైనది. (అట నాటక శబ్దమును వీధి నాటకమునందువలె రూపక సామాన్యవాచిగా గ్రహింపవలెను. మహా నాటకమనుట వట్టి మాటవరుస.)

విజయరాఘవుని ప్రహ్లాద చరిత్ర (తం. స. మ. కే. నం. 541) గ్రంథారంభమున నొక సుదీర్ఘ సీస మాలికలో నతని కృతుల పట్టిక యొకటి కలదు. అందు బహు విధ కావ్యములు పేర్కొనఁబడినవి.

వానిలో యక్షగాన ప్రాయ రచనల పాలే యధికము. నాటక శబ్ద సూచనచేతను, సూచన లేకున్నను నుపలబ్ధము లగుటచేతను వానిలో యక్షగానములని యూహింపఁదగినవి పదుమూఁడు :—

౧. రాజగోపాలవిలాసము, ౨. ఉషాపరిణయము, 3. కాళీయ మర్దనము, ౪. రఘునాథాభ్యుదయము, ౫. మోహినీ విలాసము ౬. ప్రహ్లాదచరిత్రము, ౭. పూతనాహరణము, ౮. ఒకమంజరీ ద్విపద ప్రబంధమునకు నాటక పరివర్తనము (అసలు గ్రంథనామ మేమో!) ౯. విప్రనారాయణ చరిత్ర, ౧౦. సముద్రమథనము, ౧౧. కృష్ణ విలాసము. ౧౨. జానకీ కల్యాణము, ౧3. పుణ్యకవ్రతము.

ప్రహ్లాదచరిత్ర పట్టికలో నాటక శబ్దసూచితము గాకపోయినను, గ్రంథ మలబ్ధమైనను విజయుఁడు రుక్మిణీ కల్యాణమును గూడ నాటకముగా రచించినట్లతని గ్రంథాంతరమగు రఘునాథనాయకాభ్యుదయ ద్విపద కావ్యాశ్వాసాంత గద్యవలనఁ దెలియును. దీనినిబట్టి ప్రహ్లాద చరిత్ర పట్టికలో నాటక శబ్ద సూచితములుగాని మఱికొన్ని గ్రంథములును నాటకములు గావచ్చునని యూహింపఁ దగియున్నది.

ఇందిప్పు డుపలబ్ధములగునని రెండు మాత్రమే. అందు విప్రనారాయణ చరిత్రము, రఘునాథాభ్యుదయము * అనునవి వరుసగా 1950, 51 సం. లలో తం. స. మ. వారిచేఁ బ్రకటింపఁబడినవి. కడమ మూఁడు సముద్రితములు. * అవి :

* ఇది తన్మాతృకా ప్రాయమగు రఘునాథ నాయకాభ్యుదయ ద్విపద కావ్యముతోఁగూడ నొక్క సంపుటముగా డాక్టరు శ్రీ వేలటూరి వెంకటరమణయ్య, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారల విలువ గల విపులము లగు ఆంగ్లాంధ్ర పీఠికలతోఁ బ్రకటింప బడినది. ఇందలి రఘునాథ విజయరాఘవుల కాలముల కవియే ఆధారము.

* ఇవి యిటీవల ఆం. వి. క. ప. వారిచేఁ బ్రచురింపఁ బడినవి.

౧. కాళీయమర్దనము. (తం. స. మ. కే. నం. 500)
పూతనాహరణము. (తం. స. మ. కే. నం. 554)
ప్రహ్లాద చరిత్ర. (తం. స. మ. కే. నం. 541)

విజయరాఘవుఁడు మన్నారుగుడి క్షేత్రస్వామియగు రాజగోపాల దేవుని భక్తుఁడు. మన్నారని స్వామినామాంతరము. మన్నారుదాసని విజయరాఘవుని మాఱుపేరు. ప్రాయికముగా నతని ప్రతికృతియు రాజగోపాలస్వామి కంకితమైనదని చెప్పవచ్చును. ప్రహ్లాద చరిత్రమునఁదప్ప ప్రతిగ్రంథారంభమునను 'భోజకన్యాముఖాంభోజరాజమరాళ' — ఇత్యాదియగు దత్తుస్తుతి సీసమొకటి గలదు. తదుపరి రఘునాథనాయకాభ్యుదయ ద్విపదకావ్య ప్రారంభమునందలి శ్రీరాజగోపాల చిరకీర్తిజాల', 'కలాశాంబునిధి కన్య కల్యాణధన్య' యను ద్విపదలు పూతనాహరణమునఁదక్కఁ గడమ యన్నిట నున్నవి.

సామాన్యముగాఁ బ్రతి కృతియందు నిష్టదేవతా స్తుతికిఁ బిదప నొకవచనమున విజయరాఘవసంబుద్ధులు కొన్ని, యావెనకనే 'పరాకు స్వామివారు హావణించిన......నాటకంబు నటన పటిమ గనుపించ విను పించేము విన నవధరించుండ' యని రూపక ప్రరోచన గనిపించును. ఇది ప్రదర్శకులచే పఠింపఁబడుట కుద్దేశింపఁ బడినట్లు తోఁచును. ఇదియే 'కైవార' మని రఘునాథాభ్యుదయ విప్రనారాయణ చరిత్రములందు జేర్కొనఁబడినది. ప్రతి కృత్యంతమునను గవి స్వవిషయకమగు నొక వచనము, నందు గడమ మూఁడింట మాత్రమే యొక శుభాశంసనమునుగలవు. అదే భరత వాక్యముగాఁ బూతనా హారణమునఁ జేర్కొనఁబడినది. ఆకైవారము, భరతవాక్యము ననునవి కవి యుద్దేశపూర్వకముగనే వ్రాసియుండును. కొన్నిటి ప్రతులలో నామాటలు లోపించి యుండవచ్చును. కా. మ., పూ. హ., ప్ర. చ. మూఁడును

నాటకచాటు కావ్యములని కంఠోక్తిగాఁ జెప్పబడినవి. కడమ రెండును నాటకములని మాత్రము పేర్కొనఁబడినవి. అన్నియుఁ బ్రదర్శనోద్దిష్టములైనవని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. కొన్నిట రంగప్రయోగ సూచనలును గలవు.

## గ్రంథ సమీక్ష

## 1. కాళీయ మర్దనము:

రాజగోపాలస్వామి గోభిల గోత్రపళయులను మునుల సంప్రార్థనముసఁ దపమును నెఱపిన కాళీయ మర్దనకేళి మఱల నొక నాటకము వలె బ్రదర్శించుట యిందలి విషయము. ఇదికడు చిన్న కృతి. కథా శరీరము, నాటకీయతయుఁ దక్కువ. గ్రంథ మంతయు నొక చిన్న వచనము, నొక చిట్టి దరువు చొప్పున సాగిపోవును. దరువులు ఆహిరి, సావేరి, ముఖారి, నాట, వసంత, భైరవి, గుమ్మకాంబోది, కల్యాణి మొదలగు రాగములలో నున్నవి. ఒకసీసము నొకయాట వెలఁదియు నొండు రెండు చోట్ల ద్విపదలును గలవు. రచన యేమంత ప్రౌఢము గాదు; ప్రారంభదశను సూచించును.

ఇందు కవి తన పితృవర్గము మూఁడు తరముల వారినిఁ బేర్కొనెను. వారు చినచెవ్వయాచ్యుత రఘునాథులు.

ఇది యనఁగా, జలక్రీడలు — గోపికా వస్త్రాపహరణ మనఁగా నిట్టి యక్షగానము లానాఁడు రంగమున నెట్లు ప్రదర్శింపఁబడు చుండెడివో!

## 2. రఘునాథాభ్యుదయము:

ఇది విజయరాఘవుని రఘునాథ నాయకాభ్యుదయ ద్విపద కావ్యమునకు యక్షగాన రూపపరివర్తనము. అందలి ద్విపద చరణము

లనేకము గ్రహింపఁబడి నను దరువులు, వచనములు ననుసంధింపఁబడినవి.

ఇందలి యవతారికలో నాయకరాజ వంశ చరిత్ర ప్రశస్తులు, తంజాపుర వర్ణనయును గలవు. ఇది విజయ రాఘవు నెదుటనే ప్రదర్శింపఁబడినట్లు గలదు. అందు స్త్రీలును బాత్రధారణము చేసినట్లు చెప్పఁబడుట విశేషము.

ఈగ్రంథము తాత్కాలికేతి వృత్తమగుట గమనింపఁ దగినది. అయ్యును జారిత్రకమైన విలువగలది. విజయరాఘవుని తండ్రియగు రఘునాథుఁడే యిందలి నాయకుఁడు. ఇందలి కథను ద్వధా విభజింపవచ్చును. పూర్వభాగము చిత్రరేఖయను పౌర (వార) కాంతతో నతని శృంగార కలాపము. పూర్వభాగమున నాఁటి నాయకరాజుల ప్రాభవమెల్లఁ గన్నులకుఁ గట్టును. ఉత్తరభాగముననొక క్రొత్తపోకడగలదు నాయకుఁడు సపరివారముగా స్వారి వెడలుట రాజవీథుల సౌధజాలకముల నుండి పౌరకాంత లతనిఁ జూచుట, అందొక సుందరి చిత్రరేఖ యను నామె యతనిఁ జూడఁగనే మోహపరవశయగుట మొ॥. ఇది 'ఉలా' ప్రబంధపు పెత్తుగడ యని పీఠికా కారులగు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు గుర్తించిరి. తొంబది యాఱు విధములగు తమిళ ప్రబంధములలో 'ఉలా' యొకటి* తంజాపుర

* "ఉలా" లక్షణము వైద్యనాథ దేశికుని 'ఇళక్కణ విళక్కప్పాట్టియల్' అను తమిళలక్షణ గ్రంథమునఁ గలదు. సూత్రములు : 97 — 102, తమిళమున ఉలాకు 'కలివెణ్బ' ఛందో నియమము గలదు తొల్కాప్పియమున ఉలా పేర్కొనఁ బడలేదు. కాని యాలక్షణమునకుఁగొంత ప్రసక్తి యున్నట్లూహింపవచ్చునట. (ఇది నేను గ్రంథములఁగన్న విషయము గాదు. పండితుల వలన విన్నది మాత్రమే).

ప్రభువగు విజయరాఘవుఁడా తమిళ సాహిత్య సంప్రదాయమును గ్రహించుటలో వింతలేదు. తరువాతి దక్షిణాంధ్ర యక్షగాన కవులనేకు లనేకవిధముల విజయరాఘవు ననుకరించుచువచ్చిరి. విజయరాఘవుఁ డిందుత్తరభాగముననే యాంధ్రప్రబంధ ప్రక్రియను గూడ భాగుగాఁ జొప్పించినాఁడు—నాయిక విరహవేదన, చెలుల శిశిరోపచారములు, రతిరాజ పూజ, చంద్రమాస మందానిలోపాలంభాదులేగాక చిలుక రాయబారముగూడ నుండుట యొక విశేషము. ఇందున్నట్లు చిలుకలకు, సత్యే గోపికా వస్త్రాపహరణాది యక్షగానములందు జలక్రీడలాడు మొలబోడి యాఁడువారికిని సంభాషణలు దగిల్చిన యాయాగ్రంథకర్త లవి యెట్లు ప్రదర్శింపఁబడవలెనని యూహించిరో తెలియదు. విజయరాఘవుఁడీ గ్రంథమును నాటకము, ప్రబంధము ననియుఁ బేర్కొని యుండుటచేతఁ బూర్వోత్తర భాగములఁ గ్రమముగా నా రెండింటి లక్షణములును బట్టినవి.

ఇందలి రచన మంచి యొఱుపు గలది. ఇందుఁబద్య మొకటి, పలుతావుల ద్విపదలు, ప్రసిద్ధ రాగ తాళములలో దరువులు, పదములు, సంధి వచనములును గలవు. వచనములలో సంభాషణ కొలఁదిగాఁగలదు. '(ఇక్కడ) సరిపోయిన పదం వినిపించేది' అని యిట్లొకటి రెండు చోట్ల ప్రయోగ సూచనలు గలవు.

ఇందు గ్రంథాంత గద్యలో "రఘునాథ భూపాలుండు...నిజలీలా విలాస శృంగాటకంబుగా నాటకంబు హావణించిన తన ముద్దుపట్టి యగు విజయరాఘవ పట్టభద్రునకుఁ బట్టంబు గట్టి" నట్లు గలదు. అనఁగా రఘునాథుఁ డీగ్రంథరచన నెఱిఁగియున్నట్లు తోఁచును. రఘునాథుని నిధన కాలము క్రీ. శ. 24-1-1631 (చూ. మల్లంపల్లి వారి పీఠిక పుట 27, 28). అందుచే రఘునాథాభ్యుదయ రచన క్రీ. శ. 1630 లో జరిగినట్లూహింప నగుచున్నది.

## 3. పూతనాహరణము :

ఇది నాటకీయతయు జాతీయతయు వెల్లివిరిసిన యక్షగానము. ఇందిది 'యశోదా వాక్యం' ఇది 'చెలికత్తె వాక్యం' అని యిట్లు పాత్ర సంభాషణ సూచనలు గలవు. ద్విపదలు, దరువులు, వచనములును గలవు. సంభాషణలు వచన ప్రచురముగాఁ బాత్రోచిత భాషలో సాగినవి. కవి వచనములను పేర నవి వచనములు గావు. పద్యములే యుదాహరింపఁబడినవి. అవి కథానుసంధాయకములు. అనఁగాఁ గవి వచనమనిన నది పద్యమైనను సంధివచనమన్న మాట. ఇందుఁ గొన్ని రంగప్రయోగ సూచనలు గలవు. ఉదా :—

1. "అవురా యీ రీతిఁజెలి చేతనున్న కుమారునిఁ జేకొని యశోద చెక్కిలినొక్కి యక్కునఁ జేర్చి ముద్దాడి యొక్క దరువు బాడుచుఁజక్కని కోపులు రహికెక్క నటించెనట యెటు వలెను".

2. "పొత్తులలో బాలుని యశోద యెత్తుకొని యప్పుడు తత్తదిగ తోమని తగు కరతాళంబు లొత్తులు నటియించెను".

3. "కొంతసేపు తాముసు సివమాడి యంతట సివము నిల్పేది".

4. "యశోద రంగమధ్యంబున మంగళప్రదంబుగా నటించెనట యెటువలెను".

ఇందు గ్రంథాంతమున భరత వాక్య ముటంకింపఁబడినది.

ఇందలి కథ ప్రసిద్ధమైనది. విగతాసువైనఁ బూతన కళేబర మీడ్చుటకు నందుని యాన వచ్చిన గొల్లల సుద్దులు, వారి పదగోష్ఠి, నందనందనునకు "భూతావేశ జాత భీతి విమోచనంబునకు స్వస్తివాచనం బొనరింప" వచ్చిన పురోహితుల ప్రసంగములును హాస్య ప్రకృష్ట

ములై పాత్రోచిత భాషలో జాతి వార్తాచమత్కార చారువులుగా సాగినవి.

ఇందు పురోహితుల సంకల్పమునఁ జేర్కొనఁబడిన ఖర సంవత్సరమును గ్రంథరచనారంభమున కొక భంగ్యంతర సూచనగా గ్రహించిచో నది విజయరాఘవుని పరిపాలన కాలమున క్రీ శ. 1651 అగుచున్నది.

## 4. విప్రనారాయణ చరిత్ర:

విప్రనారాయణుఁడు ద్రవిడ దేశమున వైష్ణవమత ప్రవర్తకులగు పన్నిద్దరాళ్వారులలో నొకఁడు. అతని కథ రసికలోక ప్రసిద్ధము. అది యితివృత్తముగాఁ దెనుఁగున నొక మూఁడు ప్రబంధములును, నాలుగు యక్షగానములును వెలసినవి. రచనాప్రౌఢిని బట్టి యీ యక్షగానములలో విజయరాఘవ కృతియే మేల్తరమైనది; అసలు నేఁడుపలబ్ధములగు నతని కృతు లన్నిట నదియే మిన్న.

విజయరాఘవుఁడు తనకెంతో ప్రాచీనుఁడైన విప్రనారాయణుని సమకాలికునిగాఁ జిత్రించెను. కథారంగమును శ్రీరంగమునుండి మన్నారుగుడికి మార్చెను. అతఁడు తన యాస్థానముననే విచారింపఁబడినట్లును, దేవదేవి తనయెదుటఁ బదకేళిక వినిపించినట్లును వ్రాసికొనెను. ఇది యసంగతము స్థూలముగాఁ జూచినచో నతని సాహిత్యమంతయు నిట్టే తదహంప్రత్యయ ప్రవణముగా నున్నదని చెప్పవచ్చును.

ఇందు చక్కని హాస్యకుశలతఁ బ్రదర్శించినాఁడు కవి; కాని శృంగారపు నంగిరి యోడినాఁడు. నాయకపాత్ర యందలి యుదాత్తత నించుక చెనకినాఁడు. కాని దేవదేవి, విటకంటకి, విప్రనారాయణ శిష్యుల పాత్రలను దత్తదుచితముగాఁ జిత్రించినాఁడు.

ఇందు దరువులు, పదములు, దీర్ఘవచనములు, ద్విపదలు, పద్యములు, సంస్కృత చూర్ణికలు, తమిళ ప్రసంగములు, అష్టకము, యాల (ఏల) పదము, విన్నపము నను రచనా విశేషములు గలవు. పాత్రల సంభాషణలు నాటక ఫక్కిని చక చక నడచును. అచ్చటచ్చట ముచ్చటైన వర్ణనలును గలవు. ఇందు వచన రచన కంటె దరువు హొరువు, కందము చందమును మేల్తరములు.

ఇందు స్వామి తిరువారాధన సందర్భమున సంకల్ప వ్యాజమునఁ బేర్కొనఁబడిన నందననామ సంవత్సరము విజయరాఘవుని రాజ్యకాలమున క్రీ. శ. 1652. అది యేతత్కృతి రచనాకాలమైనఁ గావచ్చును. కాని, ప్రౌఢినిబట్టి కాక రచనా ప్రక్రియా పరిణతినిబట్టి చూచినచో నిది పూతనా హరణమునకు ముందే రచింపఁ బడినదా యనిపించును.

## 5. ప్రహ్లాద చరిత్రము :

ఒక సుదీర్ఘ సీస మాలికలోఁ గవి స్వీయకృతులన్నిటిని బేర్కొనుటతో గ్రంథారంభము. అందుచే నా కృతులన్నిటికి నిది పిదప రచన యనఁదగును. అందు మన మూహింపఁగల యంతటిలో వి. నా. చ. కడపటిది. తద్రచనాకాలము క్రీ. శ. 1652. అనఁగా నిది యంతకుఁ దరువాతిదని మాత్రము చెప్పనగును.

కథ ప్రసిద్ధము. ఇందలి హిరణ్యకశిపుని కొలువుకూటము నాయకరాజాస్థాన సన్నివేశమునే తలపించును. అర్వాచీన యక్షగానము లనేకమున నొక సాంప్రదాయికపాత్రగా రూపొందిన కటికవాని వాలకము మొదటగా నిందే కన్పట్టును. ఇందు ప్రహ్లాదుని గురువులు, పాములజోగి, జెట్లు, పురోహితులు మొదలగువారి ప్రసంగములలోఁ బాత్రోచిత భాష ప్రయుక్తమైనది. ఇందును :— " ఇక్కడ

విదూషకుండు హాస్యపుమాటలాడేది", "పదం సమయోచితంగా వినిపించేది", ఈ దరువాడి తీరుచున్న హిరణ్యకశిపుని కళేబరం గ్రోసి వేసేది" అని యిట్లు గ్రంథ మధ్యమునఁ బలుతావుల రంగ ప్రయోగ సూచనలు గలవు. "ప్రహ్లాదోఽహ మభివాదయే", "ప్రమొక్కేను ప్రమొక్కేనయ్యాయయ్య" ఈ రెండింటిలో సరిపో యేది చెప్పి ప్రమొక్కేది" అను సూచనలో నిది పండిత పామర సామాజికు లిరువురకు నుద్దేశింపఁబడినదని తోఁచును. గ్రంథాంతమున కేటలాగులో వివరింపఁబడిన విశేష మొకటికలదు. అది "ఈ ప్రహ్లాద చరిత్రకు పాత్ర ప్రవేశాలు వివరం" — "నరసింహాయఁడు (౧), ప్రహ్లాదుఁడు (౧), వానరం (౧), కటికవారు (౨), రంభోర్వసులు (౨), కూడానుజనం (౩౦)." ఇదంతయుఁ జూడ నాఁడీ నాటకములు రాజాస్థానములందుఁ బ్రదర్శింపఁబడిన వనుట నిశ్చయము.

ఈ గ్రంథమునను నాటకీయత వెల్లివిరిసినది. రచనలోఁ బూత నాహరణమునకును దీనికినిఁ జాల సామ్యము గలదు. ఇందును వచన భాగ మెక్కువ. దరువులు చిన్న చిన్నవి, అంత తఱచుగా లేవు. ద్విపద భాగమును దక్కువగనే. ఇందొక "విన్నపము" ను గలదు.

విజయరాఘవుని కృతులను రచనా ప్రౌఢినిబట్టి సమీక్షించి నచోఁ బాత్రోచిత భాషా ప్రసంగాదులందలి వ్యావహారిక ధోరణి బుద్ధిపూర్వకమైనది. కావున నది పరిగణింపకున్నచో నతఁడసలు లక్షణ ప్రతిపత్తిగల కవియనియే చెప్పనగును. అతని రచనలో సారళ్యము లేని పట్టుగాని, సారస్యములేని భావముగాని సాధారణముగ నుండవు. దృశ్యరచన కెట్టి రచన యుపాదేయమో యట్టి రచనమే చేసినాఁ డతఁడు. దరువు, పదము, ద్విపద, గద్యము, పద్యము మొదలగు ప్రతి రచనావిశేషము గతి రహస్యము నతని కధిగతార్థమే. వానిని సంద ర్భానుసారముగాఁ బ్రయోగించుటయందును నిపుణుఁడు.

రచనాప్రక్రియను బట్టి యతని కృతులను సమీక్షిఁచినచో నొక క్రమపరిణతి కనిపించును. అతనికృతు లంతకంతకు గేయధర్మమును దగ్గించుకొని రూపక కళ నెక్కువ సంతరించుకొన్నవి. వానిపై మార్గ నాటక ప్రభావ మించుక పొడసూపినది. విజయరాఘవుఁ డుద్దేశపూర్వకముగ యక్షగానమునకా పేరికిఁ బ్రత్యామ్నాయముగా నాటక నామకరణము చేసినట్లు తోఁచును.

యక్షగాన మన్న నతివేలప్రియత్వము జూపి విదగ్ధతతో నా ప్రక్రియ కొక విశిష్టపరిణతి కల్పించి యర్వాచీన కవులకుఁ గొందఱ కను కార్యుఁడై కొంతకాలము పాటొక విశిష్టరచనా ప్రక్రియగా పరిఢవిల్ల గల సాహిత్య ప్రతిష్ఠ దానికి గడించిపెట్టిన విజయరాఘవుఁడు కడు శ్లాఘనీయుఁడు. యక్షగాన ప్రదర్శన ప్రతిష్ఠ లడుగంటినను దద్వాఙ్మయ చరిత్రలో నతనికీర్తి చిరస్థాయి.

---

# 4. కామరుసు వెంకటపతి సోమయాజి

## విజయరాఘవ చంద్రికా విహారము (లేక విలాసము) : *

కవి తంజావూరు విజయరాఘవ నాయకుని "పట్టంపు కవి" నని పలుమఱు చెప్పుకొనియున్నాఁడు. విజయరాఘవుని రాజ్యకాలము క్రీ. శ. 1633–1673. అగుటచేఁ గవియు నాకాలమువాఁడే యగును.

* అముద్రితము. తం. స. మ. కే. నం. 603. ఇది యిటీవల (1956 సం.) ఆం. వి. క ప. వారిచేఁ బ్రచురితము.

గ్రంథవిషయము :— విజయరాఘవుఁ డొకనాఁటి రేయి పాదచారియై చంద్రికావిహారియై నగరి నాసికాగ్రశాల 'కేరి' (ఉపరిపట్టు) దారిగా రాఁగా నాయనివారి బైటి నాట్యశాలల పడుచైన లీలావతి యాతనిఁ జూచి మోహించెను. ఇదియుఁ గొంచెపట్టు "ఉలా" ప్రబంధఫక్కిఁ బోకడ. తదుపరి యామె విరహ వేదనాదికము ప్రబంధోచితముగా సాగినది. పూర్వ మామెయే యూర్వశియఁట, విజయ రాఘవుఁడే విజయుఁడఁట! అని యామె యొకకల గన్నదఁట! ఊర్వశికిఁ బూర్వసఖి గావున రంభ "కొరవంజి" యై వచ్చి లీలావతిని దీవించినదఁట. లీలావతి చెలికత్తెయగు చకోరికచే నాయనివారికి వలపుచెక్కణ కమ్మ పంపెను. ఆయనయుఁ 'దన చిరంతన వృత్తాంత మెఱుంగును గనుక' నామె మనవి నంగీకరించి యొకవెన్నెలరేయి లీలావతి కేరఁ గరిగి యామె కోరిక నెఱవేర్చెను.

రచన :— గ్రంథారంభమున విజయరాఘవ సంబుద్ధి ప్రచురముగా, కవి కావ్యసంకల్ప విషయికముగా నొకదీర్ఘవచనము గలదు. ప్రాయికముగా నది "కైవారము" కాఁదగును. తదుపరి నాందీ శుభాచారము, దేవతాస్తుతి, నాయకప్రశంసలతోఁ గథారంభము. గ్రంథాంతమున భరతవాక్య మనుపేర కవినామ నాటక నామములతో, నాయక శుభాశంసనముతో గద్యగలదు. కవి తన కృతిని విజయ రాఘవునివలెనే నాటకచాటుకావ్య మని పేర్కొనినాఁడు. "శృంగార రసవర్షావిర్భావంబునకు గర్భోటకంటుగా" నిర్వహించితి నని యున్నాఁడది యథార్థము. ఇందు ప్రసిద్ధ రాగ తాళములలో దరువులు, పదములు, కొలఁది పద్యములు, ద్విపదలు, సంధివచనములు, సువాల, శోభనము గలవు. సంభాషణలు తఱచు దరువులలోను, ద్విపదల లోను నున్నవి. రచన సరసమైనది. వర్ణనలు స్వభావోక్తి సుభగము లైనవి.

ఇందలి పదములు క్షేత్రయ పదఫక్కి మూఁదలగా రచింపఁ బడినవి. అసలు క్షేత్రయ పదమే యొకటి "సుదిన మాయెనే యీ ప్రొద్దు" అనునది యిందు గ్రహింపఁబడినది. (చూ. ఆంధ్ర గాన కళా పరిషత్ప్రచురణ "క్షేత్రయ పదములు" విజయరాఘవముద్ర, నం. 11 రాగతాళములు మాఱినవి కాని యచ్చుముగా నిదే పదము). ఇందు "కొరవంద(జి) దరువు" లొక విశేషము. వానిలోఁ గొరవంజి వేషభాషలు వర్ణితములు. ఇందనేక ప్రయోగ విశేషములును గలవు.

# 5. పసుపులేటి రంగాజమ్మ

## మన్నారు దాస విలాస నాటకము:

ముద్రితము (ఆం. సా ప. ప్రచురణ, 1927.)

రంగాజమ్మ విజయరాఘవ నాయకుని యాస్థాన కవయిత్రి. తండ్రి వెంకటాద్రి. తల్లి మంగమాంబ. ఈమె బహుముఖ వైదుష్యము గలది. మన్నారుదాస విలాసము, ఉషాపరిణయము నను ప్రబంధములు రామాయణ భాగవత భారత కథాసంగ్రహములు మొదలగు ననేక కృతులు రచియించి విజయరాఘవ విరచిత కనకాభిషేకయైనది. (చూ. మ. దా. వి. నాటక గ్రంథాంత గద్య.)

తెలియవచ్చి నంతలో మన్నారుదాస విలాస ప్రబంధ* మామె ప్రథమ కృతి. నాటకమామె చరమకృతి. ఈ నాటక మా ప్రబంధము నకుఁ బరివర్తనమే. రెండిటిని బోల్చి చూడఁగా దేలిన విషయములు :

---

* ఇది ఇంకను నముద్రితముగనే యున్నది. తం స మ. కే. నం. 214 (పొరపాటున కేటలాగులో ముద్రితమని సూచింపఁబడినది.)

రెండిట నితివృత్త మొక్కటియే. ప్రబంధమున దీర్ఘముగా వర్ణితములైన నాయికి వనవిహారాదికము, విప్రలంభము, పెండ్లి వేడుకలు మొ॥ నాటకమున సంగ్రహింపఁబడినవి. అందొక దీర్ఘవచనముననున్న భోజనవర్ణన నాటకమునఁ బరిహరింపబడినది. ప్రబంధమునలేని విద్వద్గోష్ఠి, జోస్యుల "యేషాగాధాలు" ఎఱుక ఘట్టము, గొల్లల ప్రసంగములు, పురోహితుల తగవులాట, ముత్తైదువుల ముచ్చటలు మొ॥ నాటకమునఁ గ్రొత్తగాఁ జేర్చఁబడినవి. నాటకము నందలి పద్యములు చాల ప్రబంధమునందున్నవే. ముఖ్యముగా సీసములు నాటకమునందున్నవన్నియు (ప్రారంభసీసముదక్క) యథాతథముగఁ బ్రబంధమునందున్నవే. ప్రబంధ సీసములు మఱికొన్ని నాటకమున దరువులుగా, ద్విపదలుగాఁ బరివర్తింపఁబడినవి.

మన్నారు దాసనఁగా విజయరాఘవుఁడే. అతని విలాస మనఁగా నతని సభావైభవము, నిష్టదైవతమగు మన్నారుస్వామి కతఁడొనరించు ఫాల్గునోత్సవము, నూరేగింపు, నాస్థాదర్భమునఁ గాంతిమతి యనునొక యువతి విజయరాఘవునిఁజూచి మోహపరవశయగుట, (ఇది 'ఉలా' ప్రబంధపుఁ బోకడ), ఆమెతో నతని వివాహము నిందు వర్ణితములు. ఈగ్రంథమునకు రఘునాథాభ్యుదయముతోఁ గొంత పోలిక గలదు. సమకాలిక జాతీయజీవన ప్రతిబింబన మీగ్రంథమునఁ గల గొప్ప విశేషములలో నొకటి.

రచన :- వరుసగా గ్రంథాద్యంతములందుఁ గైవారము, భరత వాక్యమును గలవు. రెండును గద్యలే. కైవారమున దైవస్తుతి, భరత వాక్యమునఁ గవయిత్రి విషయమును గలవు. కవి వచనము లను పేరఁ బద్యములున్నవి. వేఱ సంధివచనములు గలవు. అవి వచనములే. వరుసగా రెండిటఁగథాఖ్యానానుసంధానము లుద్దిష్టములు. ఇందలి ప్రధాన

రచనా విశేషములు దరువులు, పద్యములు, వచనములు. దరువు లెక్కువగా ముఖారి ప్రముఖ ప్రసిద్ధ రాగములలోఁ గలవు. అందుఁ గాళము కంటె రాగమునకే యధిక ప్రతిపత్తి. కొన్ని యచ్చు మచ్చు జావళీలవలె నున్నవి. పద్యములలో సీస ప్రాచుర్యము గనిపించును. అవి ప్రతిపాద సముతాపాదనముతోఁ జక్కఁగా నున్నవి. వచనములోఁ బాత్రల సంభాషణలును దత్తదుచిత భాషలో నాఁటి తంజాపు రాంధ్ర వ్యవహార సరళిలో నడచినవి. సంధి వచనము లనుప్రాస ప్రచురములు. ఇవికాక శ్లోకములు, చూర్ణికలు, బహువిధ ప్రాకృత తమిళ కన్నడ ప్రసంగములు, ద్విపద, మంజరి, లయగ్రాహి, ధవళ శోభనములు, సువ్వాలలు, జోలలు మొ॥ రచనా విశేషములు గలవు. అచ్చటచ్చట లక్షణచ్యుతి యున్నను జక్కఁగనే సాగినది రచన.

ఇందిది 'ఆచార్యుల మాట,' 'ఇది రాజచంద్రుండు చదివే ద్విపద' అని యిట్లు పాత్రప్రసంగ సూచనలు, నొక్కొక్క సన్నివేశమై పోవునంత "అనంతర కథా సంవిధానం బెటులనెను" అని యిట్టిం(క ప్రాయ సందర్భవిభాగ ప్రయోగ సూచనలును గలవు. ఇందుఁ దంజాపురము, ఊరేగింపు, పెండ్లిము స్తీదు మొ॥ వాని వర్ణనలు గలవు. తంజాపుర వర్ణన ప్రబంధోచితముగా నున్నది. తక్కినవి స్వభావోక్తికిఁ దగియున్నవి. కవయిత్రి తానీ గ్రంథమును శృంగారకరుణహాస్య శాంతాది రసంబులు పొదల 'రచించితి' నన్నది. శృంగారహాస్యములు సమృద్ధిగాఁ గలవు. గాని కడమవాని కసలు ప్రసక్తి లేదు.

ఇందు ఫాల్గునోత్సవ శ్రీముఖమున శుభకృత్ఫాల్గునము పేర్కొనఁబడినది. అది విజయరాఘవుని రాజ్యకాలమున క్రీ. శ. 1663 సం. నఁ బడినది. ఈ గ్రంథ రచన మంత కించుక తరువాత జరిగియుండును.

# 6. పురుషోత్తమ దీక్షితుఁడు

## తంజాపురాన్నదాన మహా నాటకము : *

ఆంధ్ర వాఙ్మయమున నపూర్వము, విలక్షణము నైన కృతి యిది. గ్రంథకర్తయగు పురుషోత్తమ దీక్షితుఁడు విజయ రాఘవు నాస్థానకవి. అతనికే తన కృతి నంకితమిచ్చినాఁడు. సత్ర మరు లని గ్రంథనామాంతరము. తంజావూరిలో నాయక రాజులు నెలకొల్పిన యన్నసత్రములో సకుటుంబముగాఁ 'దడియా' వేసిన పప్పు తిప్పాభట్లను సోమరిపోతు బాపనయ్య యొకఁడు తైతక్కలాడి డబ్బు గుంజుకొనుటకు సత్రమునకు వచ్చిన ఉత్తరాది వెంగసాని, జక్కుల రంగసాని యను వారితోఁ జేసిన విరసములైన శృంగార ప్రసంగము లిందలి ప్రధాన విషయము.

ఇందు గ్రంథాద్యంతములందు గద్యలోఁ గైవారము, భరత వాక్యము, వరుసగాఁ గృతిపతి సంబుద్ధులును, శుభాశంసనము విషయ ములుగా నున్నవి.

ప్రక్రియగా నిది యొక ప్రపరిణత యక్షగానము. రచన ప్రహసన ప్రాయమైనది. గ్రంథమంతయు వచన ప్రచురమైనది. పాత్రల సంభాషణలలో నిందున్న వచనభాగ మింక నే యక్షగానము నందును గన్పట్టదు. అం దఱవయాస వచ్చిపడిననాఁటి తంజాపురాంధ్ర భాషావ్యవహార ఫక్కి పరిశీలింపఁదగినది. కొందఱు సత్రోద్యోగుల సంభాషణలలోఁ గేవల మఱవమే వాడఁబడినది. ఇందలి దరువులు చిన్న చిన్నవి సాధారణముగాఁ బాత్ర ప్రవేశ సందర్భములందుప

---

* తం. స. మ. కే. నం. 529. ఇటీవల ఆం. వి. క. ప. చేఁ బ్రచురితము.

యోగింపఁబడినవి. పద్యము లొక్క కందము నొక శార్దూలమును గలవు. ఇందొక మూఁడు చక్కని పదములు గలవు. అందొకటి విజయరాఘవాంకితము. ఒకటి విజయ రాఘవ కృతియే కాఁదగును.

తాత్కాలికేతి వృత్తములు, హాస్యప్రధానములు నగు నిట్టి కావ్యములు పూర్వాంధ్ర వాఙ్మయమున మిక్కిలి యరుదు. కవి యీ కృతిని శృంగార హాస్యాద్భుత ప్రధానంబుగా హావణించితి నని యన్నాఁడు. కాని శృంగారమున కింను రసస్థితి లేదు. సరికదా యది రసాభాసము మాత్రమే యెసది. ఇందలి హాస్యము మిగుల చమత్కారావహమైనదే కాని యదియు రసస్యంది కాదు. కవి హాస్య వ్యాజమునఁ బలుతావుల ననౌచిత్యమునకుఁ బాల్పడినాఁడు. ఇందద్భుతము పొడ గానరాదు.

సత్రము కరణము తిరుమలకొళంది తమిళప్రసంగమున "కీలక-ఘంగుని" పేర్కొనబడినది. గ్రంథ రచనాకాలమున కదియొక భంగ్యంతర సూచనకావచ్చును. అది విజయ రాఘవుని రాజ్యకాలమున క్రీ. శ. 1669లోఁ బడినది.

---

# 1

## 7. కోనేటి దీక్షితచంద్రుఁడు

### విజయరాఘవ కళ్యాణము :*

ఈ గ్రంథకర్తయు విజయరాఘవు నాస్థానకవియే. ఏతద్గ్రంథాంత భరతవాక్యమును (గద్య) బట్టి యితఁడు రామానుజాచార్య తనయాగ్రగణ్యుఁడు, విజయరాఘవ సన్మానితుఁడు, శతక్రతు శ్రీనివాస దేశిక ప్రతిష్ఠాపితోపాధ్యాయ వైభవధుర్యుఁడును, సోమయాజియు, సంగీత సాహిత్యవిద్యా విశారదుఁడును, వాదనిపుణుఁడు నని తెలియుచున్నది.

రాజగోపాలస్తుతి, విజయరాఘవ కైవారములతో గ్రంథారంభము. తదుపరి తంజాపుర వర్ణనాదికముతోఁ గథారంభము. మృగయావిహారార్థము వనమున కేఁగినాఁడు విజయరాఘవుఁడు. వనవిహారార్థమచటికి వచ్చినది మదనమంజరి యను రాజపుత్రి. వారి కచట తొలిచూపులో వలపు తొలకరించినది. అది వారి కళ్యాణమునఁ బర్యవసించిన కథయే యిందలి యితివృత్తము. ఈకృతి కితివృత్తరచనా ప్రణాళికలయందు రంగాజమ్మ మన్నారు దాసవిలాస నాటకముతోఁ జాలపోలిక గలదు. మృగయాప్రసంగ సందర్భము మాత్ర మొకఁ డెక్కువ. ఇందుఁగల పోలిక యంతయుఁ బ్రణాళికకుఁ జెందినది. రచన స్వతంత్రముగను బ్రౌఢముగను సాగినది.

ఇందు కొలఁదిపద్యములు, ద్విపదలు, కవివచనములు, సంవాద వచనములు, వర్ణనల పట్టున ననుప్రాస ప్రచురములగు దీర్ఘవచనములు,

---

* తం. స. మ. కే. నం. 602. ఇటీవల ఆం వి. క. ప. వారిచేఁ బ్రచురితము.

ప్రసిద్ధరాగములలో దరువులనేకము, బహువిధపదములు, ధవళశోభనములు, సువ్విపాట, లక్ష్మీకల్యాణము, కొరవంజి దరువు, శ్లోకములు, చూర్ణికలును గలవు. సంవాదవచనములలోఁ బాత్రోచిత భాష పాటింపఁబడినది. సన్నివేశములు వాస్తవికముగ నున్నవి. కతిపయ ప్రయోగ సూచనలు గలవు. కవి తన కృతిని నవరసశృంగాటక మగు నాటకరాజమనియు, మహానాటకమనియుఁ బేర్కొనెను. అవి మాటవరుసలు.

విశేషములు :—కృతి నాయకుని తండ్రి తాతల తరము లిందుఁ బేర్కొనఁబడినవి. అతఁడు రామభద్రానుజుఁడని తెలియవచ్చినది. ఇందలి మృగయావిహార సందర్భమునఁ జెంచుల ప్రసంగములు, పదములు నాటవిక జీవిత విశేషములను జక్కఁగా విశదపరచుచున్నవి. ఇందెఱుక ఘట్టము, విద్వద్గోష్ఠి మొ॥ గలవు. ఉలాప్రబంధపుఁ బోకడయుఁ గలదు.

# 8. మన్నారుదేవుఁడు

## హేమాబ్జ నాయికా స్వయంవరము: *

మన్నారుదేవుఁడు తంజావూరు విజయరాఘవ నాయకునకు రాజగోపాలాంబిక యందుఁ గలిగిన తనయుఁడు. ఇతఁడు తంజావూరు గద్దెనెక్కలేదు. క్రీ. 1673 లో మధుర నాయకి రాజులతో సంభవిం

* తం. స. మ. కే. నం. 674. ఇటీవల ఆం. వి. క. ప. ప్రచురితము

చిన యుద్ధమునఁ దండ్రితో పాటితఁడును నిహతుఁడయ్యెను. ♦ కాని హే. స్వ. గ్రంథాంత గద్యలో నీతఁడు కనకతులాది దానములు, నగ్రహార ప్రతిష్ఠాపనములును జేసియుండెనని చెప్పఁబడుట జూడఁ దండ్రి రాజ్యకాలమునఁ దాను యువరాజ పట్టభద్రుఁడై యుండినట్లు తోఁచును. ఆ గద్యవలన నీతఁడు విజయరాఘవాభ్యుదయాది ప్రబంధములు రచించి నట్లు తెలియుచున్నది. కాని యీ హేమాబ్జ నాయికా స్వయంవర మొక్కటే నేఁ డుపలబ్ధము.

క్షీరసాగర మధన కథయు, రాజపుత్రికా స్వయంవర గాథలును బ్రసిద్ధములు. కవి యీ రెండింటిని దనతండ్రి యిష్టదైవతములగు హేమాబ్జనాయికా రాజగోపాలస్వాముల (లక్ష్మీనారాయణుల) కల్యాణకథా చిత్రణవ్యాజమున జోడించినాఁడు. నడుమ ప్రబంధ ఫక్కిగా నాయికా నాయకుల విరహవేదన, రాయబారములు మొదలగునవి ప్రవేశపెట్టెను. ఇందు విజయరాఘవుఁడా వివాహ సంధానకర్త యఁట! ఇది యసంగతము. విజయరాఘవుని యాస్థాన యక్షగానములలోఁ దదుపజ్ఞములు రెండింటియందు, నాస్థాన కవి కృతులలో దీనితోఁ గలిసి నాల్గింటను విజయరాఘవపాత్ర కన్పట్టును. అవి యతని యాస్థానమునఁ బ్రదర్శితములైనటుల తెలియుచున్నది. మఱి యతని పాత్ర నెవ్వ రెట్లభినయించెడివారో, అది యతని కెట్లు ప్రియము గొల్పినదో యూహాతీతమని విషయము.

ఇందలి కథా సంవిధాన మంత లగువు బిగువులు లేనిది. కథ యొక విధముగాఁ బ్రసిద్ధమైనదైనను దచ్చిత్రణమున కవిసమకాలికములగు పరిస్థితుల ప్రభావము బాగుగాఁ బడినది. ఇందలి నాయకుని

♦ Vide., "the Nayak kings of Tanjore," page 153 By Sri Vriddhagirisan.

కొలువు సింగారము, ముత్తైదువలు, పురోహితులు మొదలగువారి ప్రసంగములు — అన్నియు నట్టివే. ఆ ప్రసంగము లతి చతురములు, చమత్కార జనకములును గాని యందు విరసత్వమును గలదు.

మన్నారుదేవుని రచన యొడుదుడుకులు లేనిది చక్కని పలుకుబళ్ళు, సజీవములైన ప్రయోగ విశేషములును బలుతావులం గలవు. కవి కనుప్రాస ప్రియత్వముగలదు. వచన రచనలో నదిహెచ్చు. వచన భాగ మెక్కువగనే యున్నది. వచనములో నలంతి యలంతి పదములతో నర్థవంతముగాం సంభాషణలు నడచును. ద్విపదల నలవోక పలుపోకలు పోయినాఁడు కవి. దరువు లెక్కడి కక్కడం దెంగజెప్పెను. అన్నియుం బ్రసిద్ధరాగ తాళాంకితములే. సువాల, ధవళ శోభనములు మొ॥ పెండ్లిపాటలు గలవు. లక్ష్మీకల్యాణము, సాంగత్య పదమును విశేషములు. గ్రంథారంభమున కైవారగద్య వంటి దొకటి కలదు. గ్రంథాంతమున భరతవాక్యము గలదు.

ఇందు కదలిరాయని కమ్మవక్కణలో సౌమ్య చైత్ర శుద్ధాష్టమి హేమాబ్జనాయికా స్వయంవర ముహూర్తముగాం బేర్కొనంబడినది. అది విజయరాఘవుని రాజ్యకాలమున క్రీ.శ. 29-3-1669 అగుచున్నది. అది గ్రంథరచనా కాలమునకు భంగ్యంతర సూచన కావచ్చును.

# 9. చల్ల సూరయ

## వివేక విజయము :

(అముద్రితము. త. స. మ. కే. సం. 604, 605)

గ్రంథకర్త యగు చల్ల సూరయ పొందవాక వాసియు, సాంగవేదాధ్యయనశాలియు, అద్వైతవాదైకపరుఁడును, ఆపస్తంబ సూత్రుఁడును, కౌండిన్యసగోత్రుఁడు, పాపమా సూరుభట్టార్యుల పౌత్రుఁడును, లక్ష్మమా సూరనార్యుల పుత్రుఁడు నని యవతారికలోఁ గలదు. గ్రంథము దక్షిణద్వారకాధాముఁడగు రాజమన్నారు స్వామి కంకితము. (తంజావూరు మండలమందలి మన్నారుగుడియే దక్షిణద్వారక [1]. కవి నివాస మగు పొందవాక చెంగల్పట్టుమండలము లోనిది [2])

గ్రంథారంభమున శ్రీమత్సదానంద చిన్మయయోగి స్మరింపఁబడినాఁడు. అతఁడీ కవికిఁ దత్త్వోపదేశము చేసిన గురువై యుండును. 16 వ శతాబ్ది చివరనుండిన దత్తాత్రేయయోగి శిష్య పరంపరలో మూఁడవతరమున సదానందుఁడను నొక యవధూత యుండినట్లు, నతఁడు గ్రంథకర్త యనియును దెలియుచున్నది. [3] ఈ సూరయ యతని శిష్యుఁడే యగుచో 17 వ శతాబ్ది నడుమ నుండెనని యూహింప వచ్చును. (ఇప్పటి కిది యూహామాత్రము. నిర్ణయము కాదు.)

---

(1) చూ. కాశికవి రాజగోపాల విలాసము.

(2) Alphabetical list of Villages in the Madras Presidency. 1906.

(3) చూ. ఆంధ్ర కవి తరంగిణి — సంపుటము 10, పుట 183.

గ్రంథ విషయము :- కృష్ణమిశ్రుని ప్రబోధ చంద్రోదయమున కిదియొక మానసపుత్రిక యని చెప్పినఁ జాలును. అది యిదివఱకే యాంధ్రమున నందిమల్లయ ఘంటసింగయలను జంటకవులచే నదే పేరుతోఁ బ్రబంధముగాఁ బరివర్తింపఁబడినది. సూరయ తన కృతిని "నాటకముగ, కూటనాటకాకలన' రచించితి నన్నాఁడు. తత్త్వతః ఇది యక్షగాన ప్రాయమైన రచనయే. ఇందు వివిధ రాగములలో దరువులు, దీర్ఘద్విపదలు, వచనము, పద్యములును గలవు. రచన సలక్షణము, సరళము నైనది. కాని కవికి వేదాంత మతవాదములతోఁ గల పరిచయ మితరములయెడఁ గానరాదు.

---

# 10. పెదకెంపరాయఁడు

## గంగాగౌరీవిలాసము: *

ఈ గ్రంథమును "హిరియకెంపనృపతి" లేక "పెదకెంపరాయఁడు" రచించినట్లు గలదు. "హిరియ" కన్నడ శబ్దము. "పెరియ" అను తమిళ శబ్దమునకును, "పెద్ద" అను తెనుఁగు శబ్దమునకును సమానార్థకము. హిరియ శబ్దపు టునికిని బట్టి కవి కన్నడ దేశవాసియై యుండుననియు, నేతద్గ్రంథ రచనచే నాంధ్ర భాషాభిజ్ఞుఁడు ననియుఁ దెలియవచ్చును. మైసూరు మండలమున శివసముద్ర ప్రాంతమునకు క్రీ. శ. 1418 నుండి 1728 వఱకు కెంపగౌడులను రాచవారేలికలై యుండిరి.[1] అందు హిరియకెంపగౌడ నామధేయు లిరువురు

---

* అముద్రితము. ప్రా. లి. పు. భాం., డి. నం. 1864.

(1) For details Vide., Mythic Society Quarterly Vol. XII' No. 4. (July, 1923) for Mr. B. Puttayya's Paper on the Kempa Gowda Chiefs. (Geneological table appended) – Page 738.

గలరు. మొదటి యతఁడు క్రీ. శ. 1513 – 1569 స. లనడుమ నుండిన వాఁడు. ఇతఁడే బెంగుళూరు నిర్మాత యఁట. రెండవ యాతఁ డతని చిన్న మనుమఁడు. ఇమ్మడి హిరియకెంప నామధేయుఁడు. ఇమ్మడి యనఁగా రెండవ యని యర్థము. అసలు పేరు హిరియకెంపఁ డనియే. ఈతని కాలము పదునేడవ శతాబ్ది యుత్తరార్ధము[2]. ఈ యిరువురిలో నెవ రీ గ్రంథకర్త యన్నది ప్రశ్న. యక్షగానము పుట్టినిల్లనఁదగిన తెనుఁగునాటనే మొదటి హిరియకెంపని కాలము నాఁటి యక్షగానములు లభింపలేదు. దక్షిణదేశమున తెనుఁగు యక్షగానమునకు వ్యాప్తి కల్గిన తర్వాత, నా శతాబ్ది తుది పాదమునఁగాని, కన్నడ విషయమున యక్షగానము లవతరించిన ట్లాధారములు గానరావు. క్రీ. శ. 1682 – 1713 సంవత్సరముల నడుమ మైసూరు పరిపాలకులగు చిక దేవరాఘు కంఠీరవ రాజాస్థానములందు తెనుఁగున యక్షగానములు వెలసినవి. ఆకాలముననే కన్నడ యక్షగానమునకుఁ బ్రారంభదశయై యుండును. ఈ గంగా గౌరీవిలాసము గూడ నాకాలముననే, అనఁగా, 17 వ శతాబ్ది చివర వెలసియుండును. అది రెండవ హిరియకెంపని కాలమునకు సరిపోవును. అదికాక మొదటి హిరియకెంపని కాలమునకీ కెంప గౌడులకుఁ దెలుఁగుతోఁ బరిచయ మేర్పడినట్లు తెలియదు. మఱియొక విషయము — ఈ గ్రంథమున రచనా ప్రక్రియ యంత ప్రాచీనమైనదిగాఁ దోఁపదు. మొదటి హిరియకెంపఁడే గ్రంథకర్త యగునెడల నిది నేఁడు మన కుపలబ్ధములైన యక్షగానములలోఁ గవుల కాలము తెలిసినంతలోఁ బ్రాచీనతమమైన రుద్రకవి

(2) పుట్టయ్యగారిచ్చిన వంశవృక్షమున నితని కాల మిదమిత్థమని పేర్కొనఁబడక పోయినను నితని పెద్దన్నయగు ముమ్మడి కెంపగౌడుఁడు లేక మాలెకెంపరాయఁడను వాని పరిపాలన కాలము క్రీ. శ. 1658 – 78 అని గలదు. అందుచే నతని చిన్న తమ్ముఁడగు నీ రెండవ హిరియకెంపఁడు 17 వ శతాబ్ది చివర నుండినాఁ డనుట సంశయింప నక్కఱలేదు.

సుగ్రీవ విజయము కంటెను బూర్వమైన దనవలెను. అందలి ప్రధాన రచనాంగములు: తాళప్రధానములైన దరువులు, ద్విపద, అర్ధచంద్రికలు, ఏలలు మొదలగు దేశి పదములు, కొలఁది పద్యములు, చిన్న చిన్న సంధి వచనములు. గంగా గౌరీ విలాసములోఁ బ్రసిద్ధ రాగ తాళములలో దరువు లెక్కువగా నున్నవి. సంధి వచనములకు బదులు కందము లెక్కువగా గీత పద్యములు, నక్కడక్కడ నొకటి రెండు సీసములు, వృత్తములును గలవు. దేశికవితా రీతులు గానరావు. దరువులలో రాగ ప్రాధాన్యము యక్షగాన రచనలో నర్వాచీన శైలిని సూచించును. అది కర్ణాటక సంగీతమునకుఁ బ్రచారము కలిగిన తరువాత నేర్పడినది. గంగా గౌరీవిలాసము సుగ్రీవ విజయమున కర్వాచీన రచన యని చెప్పనొప్పును. కనుక రెండవ హిరియకెంపఁడే యేతద్గ్రంథకర్తయనియు, నీగ్రంథము 17 వశతాబ్ది యుత్తరార్ధమున రచింపఁబడినదనియు నూహించుట లెస్స.

గ్రంథ విషయము:— నాయికా నాయకులగు గంగా గౌరీ శంకరుల పరస్పరాన్వేషణము—చెలికత్తెలచే రాయబారములు—వారి సమాగమము. రచన: గ్రంథారంభమునఁ గవి తనుదాఁ బ్రశంసించుకొనినంత పగడఫ్బా లేదు. కాని సరస సంభాషణలతో హృదయంగమముగనే యున్నది.

---

# 11. చికదేవరాయాస్థాన కవి

## చికదేవరాయ విలాసము: *

కన్నడ దేశమునను నందును రాజాస్థానములందును గొన్ని తెలుఁగు యక్షగానములు వెలసి యుండుట కడు ముదావహమైన విషయము. మైసూరి యొడయుండ్రలోఁ జికదేవరాయఁ డొక దొడ్డ ప్రభువు. అతఁడు శ్రీరంగపట్టణము రాజధానిగా క్రీ. శ. 1672-1704 సం. ల నడుమ మైసూరి నేలెను.[1] అతఁ డెంత యాహవ శూరుఁడో యంత సాహిత్య రసాభిజ్ఞుఁడు. స్వయముగ కవి.[2] కవి పండిత పోషకుఁడు నైన వాఁడు. అతని యాస్థానమున ననేక కన్నడ కావ్యములు, కొన్ని సంస్కృతకావ్యాదులు, తెలియవచ్చినంతలోఁ దెలుఁగున నీ యక్షగాన మొకటియు నొక శతకము[3] గొన్ని చాటువులును వెలసినవి. ఆ చాటువుల కర్తయు నీ యక్షగాన కర్తయు నొక్కరే యని యూహింప నగును.[4] కాని యాతని పేరేమో తెలిసినదికాదు. గ్రంథము మైసూరి చికదేవరాయ ప్రశంసాత్మకమై, తదంకితమై యుండుటచే నది క్రీ. శ. 1672–1704 సం. ల నడుమనే రచింపబడి యుండెనని నిశ్చయింపవచ్చును.

---

* అముద్రితము. ప్రా. లి. పు. భాం. డి., నం. 1880.

(1) Vide., Hystory of Mysore By Sri Hayavadana Rao.

(2) గీత గోవింద ఫక్కిని గీత గోపాలమను కన్నడ కృతిని రచించినాఁడు. (ఇది ముద్రితము).

(3) ప్రా. లి. పు. భాం., కన్నడ డి నం. 4—11.

(4) చాటువులు వేటూరివారి చాటుపద్య మణిమంజరిలో నుదాహరింపఁబడినవి. యక్షగాన గ్రంథాది శార్దూలవృత్తము – 'శ్రీ రంగైక విహారి శౌరి' యనునదియుఁ జివరనున్న "కురు విరాట వరాట" ఇత్యాదియగు సీసము చాటుపద్య మణిమంజరిలో గలవు. యక్షగాన రచనా శైలియుఁ జాటువుల శైలియు నొక్కమాదిరిగ నున్నవి.

గ్రంథ విషయము :— దైవ స్తుత్యాదికము చిక దేవరాయ పరముగాఁ బద్యములలో షష్ఠ్యంతములు, అతని తలిదండ్రులగు అమృతమాంబయు దేవరాయలును స్మరింపఁబడిరి. శ్రీరంగపుర వర్ణన — ఆయన విజయము లనేకము ప్రశంసింపఁబడినవి.

కథ :— చిక దేవరాయ లోకనాఁడు వాహ్యాళి వెడలును. చంద్రరేఖ యను పౌరకాంత యతనిఁ జూచి మోహించును. ఆమె విరహవేదన — ప్రబంధపుతంతు — చెలికత్తెచే రాయబారము — నాయకుని సమ్మతి — పల్లకిపై రాచనగరికి నాయిక పయనము — పడకటింటి ముచ్చట — నైతాళీయ గీతములతోఁ జిక దేవరాయల ప్రశంసతో గ్రంథము ముగియును.

ఇందలి చిక దేవరాయ శౌరి కొలువు సింగారము, ఆ యాభరణ విశేషములు, ఆడంగుల పరిచర్య, సభాగోష్ఠి, కథావస్తువు, ఆ ఉలా ప్రబంధపు బెత్తుగడ, రచనా ప్రణాళిక యంతయుఁ తంజావూరు నాయక రాజులనాఁటి వైభవము, నా యక్షగానపు బాణీని స్ఫురణకుఁ దెచ్చుచున్నది. చిక దేవరాయలు గద్దెనెక్కిన రెండేండ్లలోఁ దంజావూరున నాయకరాజ్య మంతరించినది. అపుడు విజయరాఘవ నాయకు నాస్థానాంధ్ర కవి యెవఁడైనఁ జిక దేవరాయల రసికతగూర్చి విని యితని కొలువునకుఁ జేరియుండెనా యనిపించును.

ఇందలి రచన సరసము ప్రౌఢము నగు ప్రబంధ ధోరణి నున్నది. తాళప్రధానములగు దరువులు, ఎక్కువగా అర్ధచంద్రికలు, పద్యములు, ద్విపదలు, సంధి వచనములును గలవు. ఇది యక్షగానమని కవిచేఁ జేర్కొనఁబడినది.

ఈ చిక దేవరాయలనాఁటి నుండి మైసూరు సంస్థానమునను నాంధ్రవాఙ్మయలత కొనలుసాగి నవలెత్తినది.

# 12. కంఠీరవ నరసరాజు

"అగసన వర మేలణ నాటకగళు" అని మైసూరి చిక్కదేవ రాయల పుత్రుఁడైన కంఠీరవరాజు కృతములుగాఁ గొన్ని యక్షగాన ప్రాయములైన చిన్నిపాటి తెనుఁగు రచనలు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని కన్నడ తాళపత్ర గ్రంథ సంచయములో డి. సం. 1128 సంపుటములోఁ గన్నడమోడితోఁ గానవచ్చుచున్నవి. (దీని ప్రతులు మైసూరు ప్రాచ్య గ్రంథ భాండాగారమునఁ గూడ నున్నట్లు తెలిసినది.)

చిక్కదేవరాయల పుత్రుఁడైన యీతని పూర్తిపేరు కంఠీరవ నరసరాజు. ఇతఁడు క్రీ. శ. 1704 - 1713 సం. ల నడుమ శ్రీరంగ పట్టణము రాజధానిగా మైసూరు రాజ్యమును బాలించెను. ఇతఁడు పుట్టుమూఁగి. ఇతనికి మూకరసనియు నామాంతరము [1] అట్టి యీతఁ డెట్లిన్ని కృతుల నదియుఁ దెనుగున రచింపఁగల్గెనా యని యనిపింపక మానదు.

ఈ కృతులందు దెక్కువపాలు కంఠీరవరాజ శృంగార ప్రసంగాత్మకములే, తత్ప్రశంసాభూయిష్ఠములే. అవి కంఠీరవ రాజకృతులేయైన పక్షమున నతఁడట్లు స్వకుచమర్దనము చేసికొనియుండునా యని మఱి యొకశంక. అయితే అన్నిటను నతని కర్తృత్వము నిరూపించునట్టి యాధారములు పొడగట్టును.

---

(1) Vide., History of Mysore, Vol. II., Chap. I.. Pp. 1–17

## గ్రంథసమీక్ష

### 1. కొరవంజికట్టె:

ఈ సంపుటిలోఁ దెలుఁగు కన్నడ తమిళ ప్రాకృత భాషలు నాల్గింటను ని కొరవంజి కట్టె ♦ గలదు. అందుఁ దెనుఁగు కట్టెయందలి విషయము శ్రీరంగేశుని దర్శించి వచ్చుచున్న కంఠీరవ రాజును బాంచాల పతి కూఁతురు కాంచనలత చూచి మోహించుట, తదుపరి యామె వలపు వాపోక, భ్రాంతి దేవి కొరవంజియై వచ్చి యామె కీప్సితావాప్తి కాఁగలదని సోదె చెప్పుట. ఇందొక్క శ్లోకము, గీతము, సీసము, ఏలపదము, కొలఁద దరువులు, ద్విపదలు, చిన్న సంధివచనములును గలవు. దరువులు ప్రసిద్ధ రాగతాళములలోఁ గలవు.

తెనుఁగునఁ గొరవంజులను పేరఁ గొన్ని యక్షగానప్రాయ రచన లీ కాలమునుండియే కన్పట్టుచున్నవి. ఈ కొరవంజియో, కంఠీరవ రాజ సమకాలికుఁడును, శహాజీ యాస్థానకవియునగు గిరిరాజకవి రాజ మోహన కొరవంజియో (దానిగుఱించి ముందు తెలియఁ గలదు) - ఈ రెండిట నేదిముందు పుట్టినదో నిర్ణయించుట కష్టము. కొరవంజి యనఁగాఁ గొరవజాతి స్త్రీ యని యర్థము. ఎఱుక చెప్పు టామె వృత్తి. ఆ పాత్రకుఁ బ్రసక్తిగల యక్షగానములకే యాపేరు గల్గినది. ఇదివఱకే విజయరాఘవాస్థానకవుల కృతులందుఁ గొన్నిట కొరవంజి నామరూపములు స్పష్టపడినవి. కాని యా గ్రంథము లాపేర వ్యవహృతములు గాలేదు. (విశేషములు ప్రకరణాంతమునఁ దెలియనగును.)

♦ కట్టె యనఁగా రచన లేక పద్ధతి లేక నిర్మాణమని యర్థము. (చూ. అందలి తెనుఁగు కట్టె - పరిశోధన పత్రిక జయ హేమంత సంచికలోఁ బ్రకటితము.

## 2. పంచాయుధ కల్లె :

శ్రీరంగేశుని పంచాయుధములును గంఠీరవరాయని రక్షించునుగాక యను శుభాశంసనమే యిందలి విషయము. ఇందాఱు సంస్కృత శ్లోకములు, నాఱు శ్లోకములక్రింద నాఱు ద్విపదలు, నడుమ నాలుగుతావులఁ దాళ దరువులును గలవు.

## 3. లక్ష్మీ విలాసము :

ఇందు నిండుకొలువుండిన కంఠీరవరాజు కడ కతని సామ్రాజ్య లక్ష్మి సపరివారముగా వచ్చి నటియించి యాతని దీవించుట విషయము. ఇందలి రచనావిశేషములు శ్లోకము, ద్విపద, దరువు, సీసము, సంధివచనము.

## 4. కలవాణీ విలాసము :

కంఠీరవరాయని వలచి వచ్చిన కాంభోజరాజపుత్రి వేడికోలిందలి విషయము. ఇందు ప్రసిద్ధ రాగతాళములలో దరువు లెక్కువ. ఒక దీర్ఘద్విపద, శార్దూల వృత్తమున నొక పద్యము (తెలుఁగు), నొక శ్లోకము (సంస్కృతము), నొక సంధివచనమును గలవు.

## 5. నాట్య విద్యా విలాసము :

ఒక నాట్య విద్యా విలాసిని కంఠీరవరాయ సముఖమునఁ బద కేళికలు సలుపుట యిందలి విషయము. ఇందు ప్రసిద్ధ రాగతాళములలోఁ బదములు, ద్విపదయు, నొకరెండు శ్లోకములును గలవు.

## 6. వసంతోత్సవ విలాసము:

ఇందు నాందీ ప్రస్తావన లుండుట విశేషము. కృతికర్తృ విషయము గూర్చి నటి పృచ్ఛింపఁగా సూత్రధారుఁడు కంఠీరవరాజని

కంఠోక్తిగాఁ జెప్పుటయు నింకొక విశేషము. నటి వసంత వర్ణన చేయును. తదుపరి కంఠీరవుఁడు కొలువుదీఱుట. సూత్రధారుఁడీ "నాట్య ప్రబంధ" ప్రయోగమునకై నటిని హెచ్చరించుట, బిరుదు పాత్రలు (స్త్రీలు) కొందరాయన యెదుటికి వచ్చి పదాభినయము పట్టుటయు నిందలి విషయములు. ఇందు దరువులు, ద్విపద, సంధివచనములు, ఒక సీసము, సంస్కృతప్రాకృతముల నొక్కొక్క శ్లోకమును గలవు.

## 7. విభక్తి కాంతావిలాసము :

ఇందును నిది కంఠీరవరాజు కృతియని యున్నది. ఇందుదాహరణ కావ్యములందువలె వరుసగా నాయా విభక్తులలోఁ గలకంఠీకృత కంఠీరవ ప్రశంస సాగినది. ఇది సంస్కృత ప్రచురమైన రచన. సంస్కృతము చూర్ణికా శ్లోకము లందేగాదు, వచనమునందును, దరువులందును గలదు. తెనుఁగునను కొన్ని దరువులు, కందములు, ఎత్తుగీతులు లేని సీసములును గలవు. ఇది ప్రదర్శన కుద్దేశింపఁ బడినట్లు స్పష్టపడినది. నటీ సూత్రధారుల పూర్వరంగ ప్రవర్తకత్వప్రసక్తియు నిందుఁగలదు.

## 8. అష్టదిక్పాలక విలాసము : *

ఇది వాసవి నాటకము, పావకి, వైవస్వతి, నైరుతి, వారుణి, వాయవి, కౌబేరి, ఐశాని నాటకములని యెనిమిదవాంతర విభాగములుగల యొక పెద్ద నాటకము. ఇంద్రుఁ డొకనాఁ డష్టదిక్పాలక సమేతుఁడై నాటకశాలఁ బరీక్షింపరాఁగా నాయా దిక్పాలక ప్రతినిధు

---

* ఇందలి 'ఐశాని' నాటక భాగము మాత్ర ముపలభ్య ప్రతులందెందును గానరాదు.

లటు వాసవీ ప్రభృతులైన మేనమంద్రకు వేల్పు నట్టువకత్తెలు వచ్చి పంతములుపట్టి గజ్జెకట్టి తమ తమ విద్యల తారతమ్యము నిర్ణయింపుమని యాతనిఁ గోరుదురు. ఆవేళ నారదుని యమరేంద్రునితో కంఠీరవరాజు వీరల విద్యల తారతమ్యము నిర్ణయింపఁగలవాఁడని చెప్పెను. అంత దేవేంద్ర నిదేశమునఁ వారు మేళము కట్టుకొని కంఠీరవేంద్రుని సముఖమునకు వచ్చిరఁట. వరుసగా నొక్కొక్కరే తమ తమ నాట్య విద్యానైపుణ్యమును సప్తతాళములందును బదాభినయ పురస్సరముగాఁ బ్రదర్శించిరఁట. ఇందలి విషయ మిది. ఇందింకను శ్లోకములు, పద్యములు, దరువులు, ద్విపదలును గలవు. చిన్న చిన్న సంధివచనములతోఁ బాత్ర ప్రవేశ సూచనలు, యవనికాంతర నిర్గమన ప్రసక్తియు గలవు.

ఈకంఠీరవ కృతులలో రచనలోఁ జక్కని వైవిధ్యము, నైక్యము, మృదుమధుర పదగుంభనమును గలవు. అన్నియుఁ బ్రదర్శనోద్దిష్టములే యనిపించును. అయితే అన్నియుఁ బదచాళికలవంటివి మాత్రమన్నియు స్త్రీ ప్రాయములు. కైశికీవృత్తిపేశలములు. అన్నిటను రాజ ప్రశంసలు, నాట్య సంగీత శృంగార ప్రసంగములే ప్రధానవిషయములుగాని యెందును నొక విస్తృతమైన కథగాని, విశిష్టమైన సన్నివేశముగాని లేవు. అవి నాఁడు కంఠీరవరాయ సముఖము నగరి నట్టువకత్తెలచేఁ బ్రయోగింపఁ బడినట్లే తోఁచును. స్త్రీపాత్ర ప్రయోగమిందు స్పష్టపడినది. కొన్ని యేకపాత్ర ప్రయోగభాజనములుగాఁ గన్పట్టుట యొక విశేషము. కవి యెవఁడైనను కంఠీరవుఁడైనను గాకపోయినను గొప్ప కళాకుశలుఁ డనిమాత్రము స్పష్టము.

---

# 13. శ్రీ నారాయణ తీర్థులు

## పారిజాతాపహరణము: *

శ్రీకృష్ణలీలాతరంగిణీ కృతి ప్రతిష్ఠామహితుఁడగు శ్రీ నారాయణతీర్థపాదుఁడు తెలుఁగునను యక్షగాన ప్రాయమగు నొక కృతిని వెలయించియుండుట యాంధ్రుల యదృష్టము. అయితే అది దక్షిణ దేశముననే పుట్టి యచ్చటనే ప్రచారము సంపాదించినట్లు కన్పించుచున్నది. అచటఁదక్క నన్యత్ర తత్ప్రతులు లభించుటలేదు.

తీర్థుఁ డాంధ్ర బ్రాహ్మణుఁడు. గోదావరిమండలములోని కూచిమంచి-అగ్రహార వాస్తవ్యుఁడు. కాని యెప్పుడో అరవ దేశ మందలి మెరట్టూరునకుఁ జరిగినాఁడు. అచటఁదక్కడే యీపారిజాతనాటకమును రచించినాఁడని శ్రీరాఘవన్‌గారనుచున్నారు. అతనికాలము క్రీ. శ. 1700 ప్రాంతమని డా. ఎమ్. కృష్ణమాచార్యుల వారనిరి.[2]

ఈగ్రంథమునఁ గర్త పేరిదియని ప్రత్యేకముగాఁ జెప్పఁబడలేదు. రచన తరంగిణి ధోరణికి భిన్నముగా నున్నది. అందుచే దీని విషయ

---

* అముద్రితము. తం. స. మ. కే నం 544. మఱియొక ప్రతి మెరట్టూరులోఁ గలదని డాక్టరు శ్రీ వి. రాఘవన్ గారు చెప్పిరి.

చూ. journal of the Madras Music Academy, 1942., Nos. 1 to 4. p. 74. మెరట్టూరు ప్రతి పత్ర సంగ్రహమిం దుదాహరింపఁ బడినది. తంజావూరు మెరట్టూరు ప్రతులు రెండును గలిసిననే సమగ్రప్రతి తయారు కాఁగలదు.

(1) నారాయణతీర్థులవారి గురించి యీ యీ విశేషములకు రాజమండ్రి కొండపల్లి వీరవెంకయ్య ప్రచురణ (1948) శ్రీకృష్ణలీలా తరంగిణికి ముఖబంధములుగా నున్న శ్రీ రాఘవన్ ప్రభృతుల రచనలు చూడనగును.

(2) History of classical Sanskrit literature, p. 345 by Sri M. Krishnamacharya.

మును దీక్షితుల కర్తృత్వము నెవ్వరైన శంకింపవచ్చును. కాని దరువుల చివరc దీర్ఘపాదనిముద్రలు తంజావూరుప్రతిలో నాలు తడవలు మెరట్టూరుప్రతిలో మఱి రెండు తడవ లెక్కువగను గన్పట్టుచున్నవి. తరంగిణిలోని మూcడు కీర్తనలు (1వ తరంగము 16, 17 వ కీర్తనలు, 12 వ త. 3 కీర్తన) యథాతథముగా నిందు గలవు. ఇందు గ్రంథారంభమున సంస్కృతమునc గల కథాసంగ్రహ రచనాపద్ధతి తరంగిణి యవతారికను దలcపించుచున్నది. అందుచే నిది నారాయణతీర్థ కృతమని నిశ్చయింప వచ్చును.

ఇందలి కథ ప్రసిద్ధమైనది. రచన తరంగిణి రచనకుc దీసికట్టైనను యక్షగాన సహజమగు సౌకుమార్యము గలది. గ్రంథ మంతయు దరువు, వచనముచొప్పున సాగిపోవును. అందు సంధి వచనము లెక్కువ. ఒండు రెండుచోట్ల వరుసగా రెండు మూcడేసి దరువులు ప్రయుక్తములు. నడుమ నతి విరళముగా ద్విపదయు శ్లోకములును గలవు. మెరట్టూరు ప్రతినిబట్టి యిందలి దరువులు ప్రసిద్ధరాగ తాళములలో నున్నవని గ్రహింపనగును. ఇందు కటికవాని పాత్రకుc బ్రసక్తి గలదు. ఇది ప్రదర్శనోద్దిష్టమైనట్లుగనే తోcచును.



# 14. శహాజీ

తంజావూరిలో నాంధ్రనాయక రాజ్య మంతరించిన తరువాత మహారాష్ట్ర ప్రభుత నెలకొన్నది. ఆ మహారాష్ట్ర ప్రభువులును బ్రియం పడి నాయకరాజులవలెనే మన భాషావాఙ్మయముల నాదరించుట చరిత్రలో నొక యపూర్వ సన్నివేశము.* వారు యక్షగానము నెడనే యెక్కువ మక్కువ గలవారగుట యింకొక విశేషము. వారు యక్ష గానకవుల నాదరించుటయ కాదు స్వయముగ ననేక యక్షగాన ప్రాయ రచనలుప చరించిరి. అట్టివారిలో ప్రాతః స్మరణీయుఁడు శహాజీ. ఇతఁడు భోసల వంశీయుఁడు. ఛత్రపతి శివాజీ సవతి తమ్ముఁడగు ఏకోజీకి దీపాంబిక యందుఁ గలిగిన తనయుఁడు. క్రీ. శ. 1684–1712 సం.ల నడుమ తంజావూరి నేలినవాఁడు ఇతఁ డపర విజయరాఘవుఁడు. అతని వలె నతిమాత్ర గీతి సాహితీ ప్రీతిగలవాఁడు. నాట్యకళా కోవిదుఁడు. శృంగార శూరుఁడు, హాస్యచతురాస్యుఁడు. అతని సాహిత్య మంతయు నాలక్షణములకుఁ బ్రమాణ భూతముగా నున్నది.

శహాజీపేరఁ దదంకితములు గాక, తదుపజ్ఞములుగా నిఱువదిరెండు యక్షగాన ప్రాయ రచనలు గన్పట్టుచున్నవి. అన్నియు నముద్రిత ములు. తంజావూరు సరస్వతీ మహాలు పుస్తకభాండాగారమున నన్నిటి

---

సూచన:— ఇందుఁ జేర్కొనబడిన తంజావూరు మహారాష్ట్ర ప్రభువుల రాజ్యకాలాదిక చరిత్రాంశముల కాధారము :—

"Maratha Rule in the Carnatic" By Sri C. K. Srinivasan. (Annamalai University Publication, 1945)

* (వివరములకు) చూ. శ్రీ 'మల్లంపల్లి సోమశేఖరశర్మగారి "తంజావూరి మహారాష్ట్ర భూపతులు — ఆంధ్రసాహిత్యము" అను వ్యాసము — భారతి, డిసెంబరు, 1953 జనవరి, 1954.

ప్రతులును గలవు. శహాజీ మహారాష్ట్రుఁ డయ్యు నాంధ్రమున నన్నికృతు లన్యభాష యొూసఁ సోకకుండ వ్రాయుట గమనింపఁ దగినది. అతని యాస్థానమున యక్షగాన రచన చేసిన యాంధ్రకవు లనేకులు గలరు. ఎడ నెడ వారి ప్రశంసయుఁ దఱచు వారి కృత్యవతారికల తీరును శహాజీ కృతులందుఁ గన్పట్టును. అందుచేతను కృతు లన్నియు నొకటి కావనియే యనిపించును. కడమ కృతుల విషయమునను శహాజీ తదాస్థాన కవుల సాహాయ్యమును గ్రహించి యుండును. కాని కొన్ని కృతుల ప్రతి విలేఖన కాలములను బట్టి చూడ శహాజి గ్రంథరచన క్రీ. శ. 1701 ప్రాంతమున జరగియుండినట్లు తోఁచును. అనఁగా నప్పటికి శహాజి సింహాసనమునకు వచ్చి పాతికేండ్లు పైచిలుకైనది. సింహాసనము నెక్కునాఁటికె యుక్త వయస్కుఁడై యుండును. సహజముగా భాషా సాహిత్య ప్రియం భావుకుఁడగు నతని కచట నింకను బ్రచారము నందుండిన యాంధ్ర భాష నభ్యసించుటకా పాతికేండ్ల కాలము చాలకపోదు. ఇఁకఁ దదాస్థానకవి కృత్యవతారికా శ్లోకాదిక గ్రహణ విషయము. శహాజీయే స్వయముగాఁ బ్రియంపడి వానిని గ్రహించియుండవచ్చును. లేక యానాఁటి ప్రతి విలేఖకు లప్పుటప్పుట తదాస్థాన కవులు చెప్పుచు వచ్చిన శ్లోకాదులందుఁ దమకు నచ్చిన వానిని గొన్నిటి నందందు జొప్పించి యుండవచ్చును. ఏదెట్లయినను బైచిలుకు రెండు మాటకేమి గాని కడమ యిఱువదింటను రచనలో శహాజీ భాగస్వామ్య ప్రతిపత్తి యధికముగనే యుండును.

ఆ యిఱువదింటను బదునాఱు నాటకములుగను, నాలుగు ప్రబంధములుగను గ్రంథకర్తచేఁ బేర్కొనఁబడినవి. నాటకములన్నియు "సుదారవేషభాషా భూషితము" లని పేర్కొనఁబడినవి. అవి సంవాద శైలీక వచన ప్రచురములుగను, ప్రబంధములు నాట్యోద్దిష్టగీతి బంధ

ప్రకృష్టములుగను నున్నవి. అవి యన్నియు నాఁడు ప్రదర్శింపబడినట్లే వానిలోగల సూత్రధార వచనములును, గొన్ని ప్రయోగ సూచనలును విశద మొనర్చుచున్నవి.

ఆ గ్రంథములు సాధారణముగా జయేత్యాదియగు నొక "తోడియం" దరువుతోఁ బ్రారంభమగును. స్తుత్యాదికము, పిదప నొక సూత్రధార వచనమున గ్రంథనామ కర్తృనామ నిర్దేశము నాపై నొక ద్విపదలోఁ గథాసంగ్రహము చెప్పఁబడుటయుఁ గలవు. కథాసంగ్రహద్విపద ప్రబంధములందు మాత్రము కానరాదు. ముందే వినాయక స్తుతి యున్నను గథాసంగ్రహ ద్విపదకుఁబిదప నతని యాగమన ప్రసక్తియుండును. అనఁగాఁ బ్రదర్శనవేళ నొక కుఱ్ఱవాఁ డెవఁడో వినాయక నేపథ్యముతో రంగమునఁ బ్రవేశపెట్టఁబడి ప్రదర్శకులైన భాగవతుల పూజ నందుకొని పోవుచుండు టాచారమై యుండును. ఆ పిమ్మట "ఆస్థాన సంతోషి" యగు కటికవాని వాలకము ప్రవేశ ప్రసంగము లుండును. అంతటఁ గథారంభము. గ్రంథాంతమున సాధారణముగా నొక ద్విపదలోఁ గాని గద్యలోఁ గాని కృతిసమర్పణ ముండును. ఆ సమర్పణము తఱచు శహాజీ యిష్టదైవత మగు త్యాగేశ్వర స్వామికై యుండును. ఇది యతని కృతుల యాద్యంతముల సామాన్య స్వరూపము. ఇఁకఁ బ్రత్యేకముగా నాయా గ్రంథ విశేష విషయములు మాత్ర మొక క్రమము ననుసరించి తెలుపఁబడును.

## 1. విఘ్నేశ్వర కల్యాణము: (1)

సిద్ధి బుద్ధి యను బ్రహ్మపుత్రికలతో వినాయకుని వివాహ మిందు వర్ణితము. ఇది విఘ్నేశ్వరకల్యాణమే కాఁబట్టి గ్రంథారంభ

(1) తం. స. మ. కే. నం. 610-616.

మున మఱి వేఱె యతనిపాత్ర ప్రవేశ సూచన లేదు. సరిగా లగ్న సమయమందే యతని పాత్రకుఁబ్రసక్తి. ఇందలి దరువులు ప్రసిద్ధ రాగ తాళములలో నున్నవి. కొన్నిటికఱవ – తెలుఁగు మాతృక లుదాహరింపఁబడినవి. మాతృక లనఁగా నీ దరువుల వరుసలకు నాఁడు ప్రసిద్ధములగు పాటల యొరపడులు.

## 2. శచీపురందరము :[2]

ఇందలి వినాయక పాత్ర ప్రవేశ ఘట్ట మక్కడి కది యొక చిన్న ప్రహసనమువలె నున్నది. శచీంద్రుల వివాహ మిందలి యితివృత్తము. అది శహాజీ యేలు తంజాపురమున జరిగినదఁట. ఇందు వచనము పాలెక్కువ. దరువు లనేకము మాతృకానుసారము రచింపఁబడినవి. ప్రౌఢమైన శ్లోక రచనయుఁ గలదు. హాస్యముకొఱకసభ్య పద ప్రయోగము, ననుచిత సన్నివేశ కల్పన గావించినాఁడు గ్రంథకర్త.

పాత్రల పరిచయ మిందు ద్వివిధముగ నున్నది. సూత్రధారు ననుమతిపై భాగవతులే పాత్రలను బలుకరించుట, పాత్ర ప్రవేశ సమయమున, దత్తద్వేష భాషాదిక వర్తనా రూపమైన దరువుల ద్వారా కావించుట. మఱియు గ్రంథస్థములగు నాధారములను బట్టి యా నాటక ప్రదర్శకులగు భాగవతులలో బ్రాహ్మణులు గలరనియుఁ, గోవెల మణియగాని వంటి వాఁడును సూత్రధారత్వము వహించెడివాఁడనియు, మద్దెల, తాళము, తంబుర, తిత్తి మొదలగునవి నాఁటి ప్రదర్శనపు హంగు వాద్యము లనియు నూహింపనగును. శహాజీ యాస్థానకవి యగు గిరిరాజ పదము లిందు ప్రశంసింపఁబడినవి.

---

(2) త. స మ. కే. నం. 625 – 627.

## 3. వల్లీకల్యాణము:

కేటలాగులో వల్లీ కల్యాణ మని యున్నది. కాని కవి పెట్టిన పేరు కుమారస్వామి కల్యాణము. ఎట్లనుకొన్నను దగవులేదు. వల్లి యను చెంచెతను గుమారస్వామి పెండ్లియాడిన కథ యిది. దక్షిణ దేశమునఁ గను ప్రచార మందిన కథలలో నిది యొకటి. మన చెంచు లక్ష్మిగ లేక గరుడాచలము కథయు నించుమించి ట్టిదే.

ఇందు ద్విపద భాగ మెక్కువ. దరువులును, వచనము గొలఁదిగాఁ గలవు. ఇందు "నాటకశాల భామల" ప్రసక్తి వచ్చినది. గిరిరాజ పదముల ప్రశంసయుఁ గలదు.

## 4. శాంతా కల్యాణము:

కథ ప్రసిద్ధము. వేశ్యలతో ఋశ్యశృంగుని సమావేశ ఘట్ట మిందు రక్తికట్టినది. కాని కులవధువగు శాంత పాత్ర మొక వెల వెలఁది పాత్రవలెఁ జిత్రింపఁబడినది. అట్లే మహర్షు లంతవారు "మామూలు భంగు బైరాగులవలె" జిత్రింపఁబడిరి. ఇందు ద్విపద, దరువులు, వచనములు, శ్లోకములు గలవు.

## 5. ద్రౌపదీ కల్యాణము: [5]

కథ ప్రసిద్ధము. కవి వివరములను విడిచిపెట్టకుండఁగనే సంగ్రహ ముగాఁ దెమల్చివైచినాఁడు. కాని రచన యైతిహాసికస్థాయి నందు

(3) త. స. మ. కే. నం. 590 — 596 నం. 596 ప్రతి విలేఖన కాలము: తారణ – అశ్వయుజ శుక్ల షష్ఠి స్థిరవాసరము క్రీ. శ. 23—9—1704.

(4) త. స. మ. కే. నం. 628 — 630

(5) ,, ,, ,, 535 — 538

కొనలేకపోయినది. ఇందవతారికలో సభానాయక ప్రశంసాత్మకమైన గద్య 'కైవార' మని పేర్కొనఁబడినది. కథాసంగ్రహ ద్విపద లేదు. రాగతాళము లుదాహరింపఁబడని చిన్న చిన్న దరువు లనేకము. ఒక యుత్పలమాలయు, నొక కందము, నాలుగుచోట్ల ద్విపదయుఁ గలవు. గ్రంథము సాబాలు వచనమనియే చెప్పవచ్చును. అందు సూత్రధార వచనము లెక్కువ. రచన సామాన్యమైనది.

## 6. కృష్ణలీలా విలాసము: [6]

కృష్ణ జననము, బాల్యక్రీడలు, సత్యా పరిణయము నిందలి కథావస్తువులు. ఇందలి యవతారిక సరస్వతీ కల్యాణము దానితో సమానముగ నున్నది. ఇందు సూత్ర ధార వచనములు, శోభన గీతా దులును గలవు. గ్రంథాంతమందలి మంగళగీతము శహాజీ జలక్రీడలు, సతీపతిదాన విలాసములందును గలదు.

## 7. జలక్రీడలు: [7]

కథ ప్రసిద్ధము. హాస్యము కొఱకు పప్పు తిమ్మక్క, పాపావధాని యను రెండు పాత్ర లిందుఁ గల్పితములైనవి. ఇది యెట్లు ప్రదర్శ నీయమో యూహకందకున్నది. ఇది 'నవ్యనాటక' మని పేర్కొనఁ బడినది. ఇందు జిన్నచిన్న దరువులు, సూత్రధార, పాత్రవచనములు, ద్విపద, శోభనము గలవు. రచన యొకతీరు.

(6) తం. స. మ. కే. నం. 505 — 506 (ఇది నా కలభ్యమైనది. దీని గురించి పై మాటలు కేటలాగునుబట్టి వ్రాయఁబడినవి.)

(7) త. స. మ. కే నం. 521 — 527.

## 8. సతీపతిదానవిలాసము: [8]

ఇందలికథ కృష్ణతులాభారగాథ, ప్రసిద్ధము. చక్కని హాస్యద్యోతక సందర్భములతో సరసముగా నున్నది. ఇందుఁ జిన్న చిన్న దరువులు, సూత్రధారపాత్రల వచనములు, ద్విపద, శోభనము గలవు.

## 9. సీతాకల్యాణము: [9]

కథప్రసిద్ధము. ఇందలి శహాజీప్రశస్తిగద్య 'కైవారగద్య' గాఁ జేర్కొనఁబడినది. ఇందు దరువులు, ద్విపద, గద్యపద్యములును గలవు. సూత్రధార వచనములున్నవి. రచన చక్కనిదే.

## 10. రామపట్టాభిషేకము: [10]

కథ ప్రసిద్ధము. ఇందు తలవరులు భరతునితోఁ దమిళమునఁ బ్రసంగింతురు. వారి చేతిలోఁ దుపాకులు గలవఁట! (అట్టి తలవరులు నాఁడు మహారాష్ట్ర ప్రభుత్వోద్యోగులై యుందురు) ఇందలి రచనలో విశేషము లేదు. సన్నివేశములేని వస్తువు. చప్పని రచన.

## 11. రతికల్యాణము: [11]

ఇందలి యెత్తుగడ కొంత క్రొత్తది. "నాంది ద్విపద" యొక విశేషము.

---

(8) తం. స. మ. కే. నం. 644 — 650.

(9) ,, ,, ,, ,, 663 — 672.

(10) ,, ,, ,, ,, 572 — 577.

నం. 577 ప్రతి విలేఖన కాలము: తారణ భాద్రపద కృష్ణైకాదశి, సౌమ్య వాసరము క్రీ. శ. 13—9—1704.

(11) తం. స. మ. కే. నం. 561 — 567.

కథ ప్రసిద్ధము. తీర్పు క్రొత్తది. రతిమన్మథుల వివాహము శాహేంద్రుఁడేలు తంజాపురమున జరిగినదఁట, అందలి రచన సరసముగ నున్నది. దరువులలోను సంభాషణలు చక చక నడచినవి.

ఇందాంధ్రపాణిని బిరుదాంచితుఁడైన శేషాచలపతి యను పండితునకు శహాజీ కావించిన సన్మానము, శహాజీపై గిరిరాజ కవి పదములు రచించిన విషయమును ప్రశంసింపఁబడినవి.

## 12. రుక్మిణీ సత్యభామా సంవాదము: [12]

ఇందుఁ గథాసంగ్రహ ద్విపదతోనే గ్రంథారంభము. స్తుత్యాదికము లేదు. కటికము ప్రసక్తి కానరాదు. సవతుల సంవాదము కంటెను సతీపతులది రక్తికట్టినది. సూత్రధార వచనములు, ద్విపదలు నెక్కుడు. ఒక సీసము, నొక కందము, చిన్న చిన్న దరువులును గలవు. సంవాదములందు ప్రశ్నప్రత్యుత్తరపు దరువులు పెద్దవి. గ్రంథము చివర "నృత్తదరు" వను నొక రచనావిశేషము గలదు. చూడఁగా నది సీసపద్యమే దరువుగా మలఁపఁబడినది. కాఁగా దీనిని సీసార్థ మనవచ్చును.

## 13. కిరాత విలాసము: [13]

అవతారికలోఁ గొంత క్రొత్తదనమున్నది. తనతోఁ బగడసాలాడి పందెమున స్వసర్వస్వము నోడి నారదుని "సలహా" ప్రకారము కిరాతవేషమున నడవికేఁగిన శంకరుని భిల్లాంగనా నేపథ్యమునఁ బార్వతి కలిసికొనుట యిందలి విషయము. గ్రంథ మంతయు నొకదరువు, నొక వచనము చొప్పున సాగిపోవును. సూ. వ. లెక్కువ. పాత్రల సంభాషణ వచనములును గలవు. ఇందలి రచన పొల్లుచూట లంతగా లేనిది; నిర్దుష్టము, సరళము నైనది.

---

(12) తం. స. మ. శే. నం. 583 — 586.

(13) తం. స. మ. శే. నం. 501 — 504.

## 14. సతీదానశూరము:[14]

శాహరాజు సాహిత్య వైయాత్యమును పట్టి యిచ్చునట్టి విశిష్ట కృతి యిది. ఇందలి వస్తువు క్రొత్తది. రచన కడు చక్కనిది. మోరో భట్లను బ్రాహ్మణుడు సశిష్యుడై తిరునాళ్ళకని బయలుదేఱి యట మగనాలి యగు నొక మతంగ భామను జూచి కామించుట. ఆపెయు, నతని శిష్యుడును వారింపజూతురు. అదియొక పెద్ద వాగ్వాదము. కాని లాభము లేకపోయెను. పిదప నామె భర్తయే వచ్చి సంగతి గ్రహించి యొక ధర్మోపన్యాసము చేయును. అంతకును బంతులు దారికి రాకుంట చూచి యయ్యవారికి దన దారను ధారవోయుటకు నిశ్చయించును. అప్పు డయ్యవారిలో బరివర్తనము పొడసూపును. చివరకు శివుడు సాక్షాత్కరించి యందఱకును మోక్షముననుగ్రహించును. ఇది యిందలి విషయము.

ఇది సంవాదశైలీ ప్రచురమైన రచన. చమత్కారావహము లైన శృంగారస్వారస్యములు, ప్రశస్యములైన హాస్య ప్రసంగములు నిందు గలవు. రసాభాసమైనను రక్తిగట్టినది శృంగారము. వస్తువిషయమున బ్రసిద్ధమైన సురాభాండేశ్వర కథను, సన్నివేశ రచనా ఫక్కికలలో దంజాపురాన్నదాననాటకము నిది జ్ఞప్తి కెలయింపగలదు.

ఇందు వచనము పాలధికము. దరువులు కొద్ది. సం. శ్లోకములు సుమారు నలువది గలవు. అందు గొన్ని భర్తృహరి సుభాషితము మొ॥ ప్రసిద్ధ గ్రంథాంతరములనుండి గ్రహింపబడినవి. సం. లోకోక్తులు నెక్కువగలవు. ఆ గ్రహించుటలో మంచి సందర్భోచితజ్ఞత బ్రకటించి నాడు కవి. యిందు గ్రంథ మధ్యమున బాత్ర భాగవతులను బల్కరించుట గలదు.

---

(14) తం. స. మ. కే. నం. 638 — 643.

## 15. భక్తవత్సలవిలాసము: [15]

ఈ కృత్యాది స్తుత్యాదికమునఁ గొంత క్రొత్తదన మున్నది.

పరమేశ్వరుని బాణాసుర వర పరిపాలన యొక్కటియే యిందలి భక్తవాత్సల్య ప్రదర్శన ఘట్టము. కాని తద్వ్యాజమున శివ పార్వతులకు విరహము గల్పించి, తన విప్రలంభ శృంగార వర్ణనా వైదగ్ధ్య ప్రకటనమునకై కవి యీ కృతిని రచించినట్లు తోఁచును. ఆ పురాణ దంపతుల స్థాయికిఁ దగినట్లు లేదు గ్రంథము.

ఇందు దరువులు, ద్విపదలు, గద్య పద్యములు గలవు. వృత్త దరువుల పేరిట సీసార్ధము లుదాహరింపఁ బడినవి. పద్యము లనుప్రాస విశిష్టములుగా సమాస ప్రచురములుగాఁ ప్రబంధ ఫక్కిని నడచినవి. వర్ణనలలో వ్యావహారికపు నుడికారముతో సంభాషణలు సరసముగా సాగినవి. రచనలో ననౌచిత్య మున్నను బేలవత్వ మెక్కడను గాన రాదు. ఆ ప్రౌఢి విషయమున శహాజీకృతులలో నిది యొక మేలుబంతి.

## 16 గంగాపార్వతీ సంవాదము. [16]

కలహాభోజనుని కైలాటము మూలముగా గంగా పార్వతులకు సవతికయ్యము తటస్థించుటయు, శివుఁ డర్ధనారీశ్వర గంగాధర సమాఖ్యలు వహించుటతో నా కలహ మంతరించుటయు నిందలి ప్రధాన విషయము. సవతికయ్యము ఘట్టము రక్తికట్టినది. పార్వతికి శకునము జెప్పవచ్చిన నల్లేరు శివుఁడు నతని పెండ్లము చింతపట్టి పోచెక్కయునను రెండు నీచపాత్రల విరస ప్రసంగముల ద్వారమునను, నారద తచ్ఛిష్యుల ప్రసంగముల వలనను విపరీతమైన యసభ్యహాస్య ధోరణిఁ బ్రకటించినాఁడు కవి.

(15) తం. స. మ. కే. నం. 117. ఇది కేటలాగులోఁ జేర్పఁబడలేదు. తత్ప్రతి విలేఖకుఁడు నట్టువ చింతామణి.

(16) తం. స. మ. కే. నం. 513 – 518.

చేయి తిరిగిన రచన, చక్కని తెనుఁగు నుడికారపు సొంపుగులుకు చున్నది. దరువులు సూ. వ. లును ధళచు. అక్కడక్కడ పద్యములు, పాత్రల వచనములును గలవు. సూ. వ. లు శబ్దాలంకార ప్రచురములు. పాత్రలవచనములు వ్యావహారిక ధోరణిలో నున్నవి.

## 17. పంచరత్న ప్రబంధము: [17]

ఇందొక కథగాని సన్నివేశముగాని లేవు. పరమేశ్వరుని కొలువునకు వరుసగా కొందఱు బిరుదు మిటారులు, నవసిద్ధజోగి యను వాఁ డొకఁడు నొకచెంచు, నట్టువోజు, నొక బిరుదుబంటు, గొందఱు "నాదనకాండ్లు" ను వచ్చి నాట్యప్రదర్శనములు చేయుదురు. రత్నములవంటి నట పంచకముయొక్క నృత్యప్రబంధ ప్రదర్శనము వస్తువగుట గ్రంథమున కాపేరు వచ్చియుండును. ఇందాయిత్తం, జతి, మోహారం, గణపతి కవుత్తం, నెలకట్ల, సొల్లుకట్టు మొ॥ నాట్యోపయోగి గీత ప్రబంధ విశేషము లనేకము గలవు. దరువులలోను భాష తక్కువ, స్వరతాళముల గడబిడ యెక్కువ. ఇది 'ఉదార వేష భాషా భూషితంబగు', 'ఘన నాట్య శాస్త్ర వైఖరులను మించు' నని పేర్కొనఁబడినది. నవసిద్ధజోగి ప్రసంగమున మరాటీ భాషలో దరువు లుండుట విశేషము.

## 18. విష్ణుపల్లకి సేవా ప్రబంధము: [18]

విరహ విహ్వాలయైన లక్ష్మి విష్ణుదేవునివాలి కిరువురు చెలికత్తెలను బుత్తెంచును. వారలా దేవుని కొలువును గొనికూడి, స్వామి సముఖము గావించుకొని దేవి మనవిని విన్నవింతురు. స్వామి

---

(17) తం. స. మ. కే. నం. 540.

(18) ,, ,, ,, ,, 618 – 619.

సమ్మతించి సపరివారుఁడై పల్లకిపై బయలుదేఱును. అక్కడ పడుక టింటి వర్ణన - తదుపరి విష్ణుస్తుతి - అవతారవర్ణన - స్వామి కారగింపు పవళింపుసేవలు - మేలుకొలుపు - శోభనపారము. ఇది యిందలి విషయము. రచన యొక మాదిరి. ఇందు దరువులు, ద్విపదలు, పద్యములు, సూ. వ. లే గాక రగడలు (అందు మయూర గతి విశేషము; ప్రసిద్ధము నగు నవవిధ రడగలలోఁ జేరనిది) చూర్ణిక, లయగ్రాహి లాలిపాట, ఆరతులు, అష్టకము, ధవళశోభనములు, మేలు కొలుపును గలవు.

## 19. శంకర పల్లకి సేవా ప్రబంధము: [19]

దీని యవతారిక తీరు వేఱు.

ఒకరితో నొకరు చెప్పుచున్నట్లు శివుని కొలువుచెలువు కొని యాటతోఁ గథారంభము. గౌరీ సఖులు స్వామి సముఖ మెట్లో చేసి కొని తమ దేవి మనవి విన్నవింతురు. శివునియాజ్ఞ యైనట్లే - పల్లకి వచ్చును - తద్వర్ణన - బోయిల కమరుల హెచ్చరికలు - పల్లకి గౌరి నగరి మొగసాల దిగఁగానే నంది యొక చూర్ణిక నందుకొనును. - తదు పరి పడకటింటివర్ణన - అమ్మవారి సింగారింపు - అయ్యవారి యార గింపు — పవళింపుసేవ - చెలికత్తెల యప్పగింతలు - జాము జామునకు వాకిలి కావలివారల హెచ్చరికలు - నాల్గవజాము గడచునంత-మంగళ హారతులు. ఇందలి విషయ మిది. రచన చక్కనిది. ఇందును దరు వులు, ద్విపదలు, పద్యములు, అష్టకములు, చూర్ణిక, మంగళహార తులు మొ॥ రచనా విశేషములు గలవు.

ఈపల్లకి సేవాప్రబంధముల గురించి ప్రత్యేకముగాఁ జెప్పవల సిన దొకమాట కలదు. శహాజీ కృతి సముచ్చయమునందు వీని దొక

(19) తం. స. మ. కే. నం. 620 — 624.

విశిష్టత. ఇవి నిన్న మొన్నటి దనుకఁ దంజాపుర పరిసర దేవాలయ తనము లందుఁగొన్నిట నాయా దేవోత్సవ సందర్భములం దాచార సిద్ధముగాఁ బ్రదర్శింపఁబడుచుండెడివని తెలియుచున్నది. వీని ప్రదర్శన ఫక్కికనుగూర్చి శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారిట్లు సెలవిచ్చి యున్నారు.*

“పల్లకి సేవా ప్రబంధములు చిత్రమైన కల్పనతోఁ గూడిన నాట్యాభిక్య ప్రధానమ్ములైన నాటకములు. శివుని, విష్ణుని పల్లకీ సేవయే యీ నాటకములలోని ప్రధానేతివృత్తము. నాట్యకళా ప్రవీణలైన తరుణీమణులు పల్లకి బోయీల పాత్రలను ధరించి స్వామి పల్లకి సేవ చేయుదురు. ఇందు నిమిత్తము పల్లకి బోయీలలో ముందువారు వెనుకవారు రెండు గుంపులుగ నేర్పడి కథ వినిపింతురు. చిత్రమైన పరికల్పనమిది. కథ యేమియు లేదు. కాని కృతికర్త నాట్యాభినయముల కనుకూలముగ నుండునట్లు కడుచమత్కారముగ రచించెను.”

## 20. త్యాగ వినోద చిత్ర ప్రబంధము: [20]

ఇది యొక చిత్ర ప్రబంధము. ‘శంకరకాళీనటనవాద మహానాటక’ మనియుఁ బేర్కొనఁబడుట విశేషము. ఇది షడంకములుగా వింగడింపఁబడియుండుట యింకొక విశేషము. ప్రత్యంకాంతమందును గ్రంథకర్త గద్య గలదు. ఈగ్రంథము విషయమై యొక ముఖ్యవిశేషము గమనింప వలసియున్నది. ఇం దుపక్రమోప సంహారములందు విపులముగా నచ్చపు సంస్కృత శబ్దబహుళముగా మహారాష్ట్రభాష వాడబడినది. ఎడనెడఁ దెలుఁగునకును బ్రసక్తి గలదు. అందుచేతనే దీనికిటఁ బ్రసక్తి గల్గినది.

* చూ. వారి వ్యాసము భారతి. డిసెంబరు. 1953.

(20) తం. స. మ. కే. నం. 530 — 534. ఆంధ్ర వాఙ్మయ సూచికలో శహాజీ కృతిగా నుదాహృతమైన కాళీ తాండవ నాటకమిదే.

ఆ ప్రసక్తి యెట్టిదనగా: ప్రథమాంకమున గ్రంథము గూర్చి మహారాష్ట్రభాషలో సూత్రధారుఁడు గావించిన ప్రసంగమున కొక ద్విపదలో నొకవచనములో నాంధ్ర వివరణము గలదు. చతుర్థాంకమునఁ దెనుగున 'సవ్యాపసవ్య సమపదలీలాదరు' వనునదొకటి గలదు. షష్ఠాంకమునఁ గవి తన గ్రంథమును దానే యొకసారి సింహావలోకనము చేసికొన్న సందర్భమునం దొక తెలుఁగు దరువు గలదు. అందే తెలుఁగున 'క్రమస ప్తస్వర వర్ణార్థలీలా' పేర నొక్కటే దరువు తోడి, కల్యాణి, ఖాబి, శంకరాభరణములను నాలుగురాగములందుఁ బ్రవర్తింపఁజేయుట కనువైనది గలదు. గ్రంథము చివరిభాగమున 'జక్కిణి దరువు' లను సంకీర్ణ రచనా విశేషము తెలుఁగునఁ గలదు.

గ్రంథము త్యాగేశాంకితము. త్యాగేశుఁడు కవి కిష్టదైవతము. గ్రంథప్రతిపాద్య విషయము తన్మాహాత్మ్యము - అనగా నాట్యనైపుణ్యమునఁ దనయంతవారు లేరని విఱ్ఱవీగెడు భద్రకాళి గర్వ మడఁపఁదలఁచి నారదుఁ డంతులకు నటరాజ మూర్త్యంతరమగు త్యాగేశునిఁ బురికొల్పుట. వార లిద్దఱకు వాదోపవాదములు నడుచుటయు నవి వివిధ నృత్యప్రక్రియలద్వారా ప్రదర్శనరూపము దాల్చుట, తుదకు భద్రకాళి యోడుట, త్యాగేశుఁడు విజయ సూచకముగాఁ దత్పాణిప్రాయమగు కాళీపాణిగ్రహణము సేయుటయు నిందలి విషయము.

గ్రంథముపెద్దది. విషయము స్వల్పము. కాని రచనావైచిత్రి రమణీయము! చమత్కారావహము! ఆశ్చర్యకరము! కవి తనసంగీత సాహిత్య భరత విద్యానిపుణత్వము నిరూపించుకొనుటకు రచించినట్లున్నది. అక్షరములతో నాటలాడినాడు. శబ్దజాలముతో నింద్రజాలము చేసినాఁడు. బహుభాషాభణితులతోఁ, దదర్థగతులతో రాగతాళ సంగతులను తరంగములతో నాచి సాచి బారలువైచి యీదినాఁడు. ఇట్టి చిత్రచిత్ర ప్రక్రియ గలది కనుకనే యిది చిత్ర ప్రబంధమైనది.

గ్రంథము గీత ప్రచురమైనది. అక్కడక్కడ సంస్కృతశ్లోకము లున్నవి. ప్రసిద్ధ రాగ తాళ మేళన మనేకధా ప్రదర్శింపఁబడినది. సంస్కృతమునందును దరువులు రచింపఁబడినవి. తెలుఁగునందు కొద్ది. మరాటీ 'లీలా' దరువు లధికము. సూళాదితాళవిస్తరణ, గౌళరాగ ప్రభేద ప్రస్తారము, ఒక్కదరువులోఁ జతుర్విధ రాగానుకూల్య మిముడ్చుట, భిన్న భాషలు, సందులో శ్లేషలు, శబ్దాలంకారములు, సను లోమాది ప్రక్రియలు మొ॥ గలవు. దరువులకుఁ దఱచుగా స్వర కల్పన (స్వరజతి), తాళక్రమము (స్వరచొల్లుజతి) నుదాహరింపఁబడినవి. సంగీత సాహిత్యములతో శతావధానము చేసినాఁడు శహాజీ. కవి మాత్రుఁ డిట్టి గ్రంథము రచింపలేఁడు. శహాజీ నిస్సందేహముగ మహా విద్వాంసుఁడై యుండునని చెప్పవలెను. అతని కృతులందేకాదు యావద్దక్షిణాంధ్రయుగ వాఙ్మయమునందు నిది యత్యపూర్వము, నపురూపము నైన కృతి. అయితే పూర్తిగాఁ దెలుఁగు కృతి కాకపోయె నన్నదే విచారము.

శహాజీ కృతులందు వస్తువైవిధ్య మనల్పము. ఒండు రెండు తక్క నన్నియు పౌరాణికేతివృత్తములు. కాని యాతఁడు తీర్చిన తీస్పు క్రొంజవిగలది. చురుకైన శృంగారహాస్యప్రసంగములు కొల్లలుఁ కాని వానిలో ననౌచిత్య మత్యధికము. అతని కృతులన్నియుఁ బ్రదర్శనసౌలభ్యము గలవి. కాని యథాతథముగ నన్నియు బ్రదర్శన యోగ్యములు గావు.

యక్షగాన చరిత్రలో శహాజీ కృతులఁ గూర్చి యెన్నఁదగిన విశేషములు: అవతారికలోని కథా సంగ్రహ ద్విపద, వినాయకపాత్ర ప్రవేశము, కటికము వాని నొక సాంప్రదాయిక హాస్యపాత్రగా రూపొందించుట, గ్రంథమున నడుగడుగునను బాత్ర ప్రవేశసూచక

ములు, కథానుసంధానకములు నగు సూత్రధార ప్రసంగములు, ఎడ నెడఁ బ్రదర్శన ప్రవర్తకులైన భాగవతులు పాత్రలను బలుకరించుట మొ॥. అతని ప్రబంధ రచనయు నొక గొప్పవిశేషమే. అందు మార్గ నాటక సంప్రదాయానుసారముగా త్యాగ వినోద చిత్ర ప్రబంధము నందలి యంకవిభాగము, నందందవతారికలు మార్గనాటక నాందీ ప్రస్తావన సందర్భములను దలపింపఁజేయుటయును విశేషములే.

---

# 15. వాసుదేవ కవి

## పార్వతీ పరిణయము: *

ఏతద్గ్రంథావతారికలో నొక సూత్రధార వచనమున శాహరాజ ప్రణీతమని యున్నది. కాని గ్రంథాంతమున శహాజీ పరముగా నున్న మంగళ గీతమున "... శ్రీ వాసుదేవకవి వచస్సంతుష్టాయ మంగళ" మ్మని యుండుటం బట్టియు, మహారాష్ట్రుఁడగు శహాజీ కృతులం దెందును గన్పట్టని యాంధ్ర కవిస్తుతి యిందుండుటను బట్టియు వాసుదేవ నామధేయుఁడగు కవి యొకఁడు శహాజీ యాస్థానమందుండి యుండుననియు, నతఁడే దీనిని రచించి యుండుననియు నూహింప వచ్చును.

ఒక విశేషము:- బాలమనోరమాఖ్య సిద్ధాన్తకౌముదీ వ్యాఖ్య యొక్క చివర గద్యలో నిట్లున్నది.

---

* తం. స. మ. కే. నం. 545 – 553.

గ్రంథము గీత ప్రచురమైనది. అక్కడక్కడ సంస్కృతశ్లోకము లున్నవి. ప్రసిద్ధ రాగ తాళ మేళన మనేకధా ప్రదర్శింపఁబడినది. సంస్కృతమునందును దరువులు రచింపఁబడినవి. తెలుఁగునందు కొద్ది. మరాటీ 'లీలా' దరువు లధికము. సూళాదితాళవిస్తరణ, గౌళరాగ ప్రభేద ప్రస్తారము, ఒక్కదరువులోఁ జతుర్విధ రాగానుకూల్య మిమి డ్చుట, భిన్న భాషలు, సందులో శ్లేషలు, శబ్దాలంకారములు, సను లోమాది ప్రక్రియలు మొ॥ గలవు. దరువులకుఁ దఱచుగా స్వర కల్పన (స్వరజతి), తాళక్రమము (స్వరచొల్లుజతి) నుదాహరింపఁబడినవి. సంగీత సాహిత్యములతో శతావధానము చేసినాఁడు శహాజీ. కవి మాత్రుఁ డిట్టి గ్రంథము రచింపలేఁడు. శహాజీ నిస్సందేహముగ మహా విద్వాంసుఁడై యుండునని చెప్పవలెను. అతని కృతులందే కాదు యావద్దక్షిణాంధ్రయుగ వాఙ్మయమునందు నిది యత్యపూర్వము, నపురూపము నైన కృతి. అయితే పూర్తిగాఁ దెలుఁగు కృతి కాక పోయె నన్నదే విచారము.

శహాజీ కృతులందు వస్తువైవిధ్య మనల్పము. ఒండు రెండు తక్క నన్నియు పౌరాణికేతివృత్తములు. కాని యాతఁడు తీర్చిన తీర్పు క్రొంజవిగలది. చురుకైన శృంగారహాస్యప్రసంగములు కొల్లలుఁ కాని వానిలో ననౌచిత్య మత్యధికము. అతని కృతులన్నియుఁ బ్రదర్శనసౌలభ్యము గలవి. కాని యథాతథముగ నన్నియు ప్రదర్శన యోగ్యములు గావు.

యక్షగాన చరిత్రలో శహాజీ కృతులఁ గూర్చి యెన్నఁదగిన విశేషములు: అవతారికలోని కథా సంగ్రహ ద్విపద, వినాయకపాత్ర ప్రవేశము, కటికము వాని నొక సాంప్రదాయిక హాస్యపాత్రగా రూపొందించుట, గ్రంథమున నడుగడుగునను బాత్ర ప్రవేశసూచక

విదగ్ధుఁడే కాని యుదాత్తతఁ బ్రవర్తించలేకపోయినాఁడు. కోరి యనౌచిత్యమున కొడిగట్టినాఁడు. ఇది పురాణదంపతుల పుణ్యకథ యన్నమాటే మఱచినట్లున్నది. హాస్యముకొఱకసభ్యత నాదరించినాఁడు. మంగళాష్టకములను 'పేరడీ' చేసిన మహాశయుఁ డతఁడు.

ఇందు దరువులు, ద్విపదలు, సీసాది పద్యములు, సంస్కృత శ్లోకములు, వచనమును గలవు. దరువుల నరుసలకు మాతృకలుగూడ నుదాహరింపఁబడినవి. రచన ప్రౌఢము

---

# 16. నివర్తి శేషాచలపతి

శహాజీ యస్థానమున వెలసిన శాహరాజ విలాసము[1], సరస్వతీ కల్యాణము[2] నను రెండు తెలుఁగు యక్షగాన నాటకములు శేషాచల పతియను కవి రచించినవిగాఁ గన్పట్టుచున్నవి. అందు శా. వి. న "శేషాచలపతి" 'అష్టభాషా కవిత్వంబు లమరు సుకృతి' యని మాత్రమే గలదు.

స. క. అవతారికనుబట్టి యీతఁడు నివర్తి వంశ్యుఁడనియు, నీతని సూత్రగోత్రము లాపస్తంబ భారద్వాజార్షము లనియుఁ దెలియుచున్నది. అం దితని తండ్రిపేరు చొక్కనాథ మహామాత్యనాథుఁడని యున్నది. అనఁగా నతఁడు క్రీ. శ. 1659–1682 సం. ల నడుమ

---

(1) తం. స. మ. కే. నం. 632

(2) ,, ,, ,, 651–657

మధుర నేలిన యాంధ్ర నాయక రాజగు చొక్కనాథుని యమా త్యుఁడా, లేక యతనిపేరే చొక్కనాథామాత్యుఁడా యని శంక. శాహజీయమను నొక శృంగారపదముల గ్రంథము♦ చివర నొక పదమున "చొక్కనాథ పాలాశాహేంద్రుండు" అని కలదు. ఆ పదకర్త పేరు చొక్కనాథుఁడగునా? ఆతఁడీ శేషాచలపతి తండ్రి యగునా? యని యింకొక శంక. శహాజీ రాజపుర విద్వత్పరిషత్తున గణనీయుఁడగు రామభద్ర దీక్షితునకు గురుస్థానమైన యతఁడొక చొక్కనాథ దీక్షిత నామధేయుఁడు గలఁడు.* కాని యతనికిని యీ శేషాచలపతికిని పితాపుత్ర సంబంధము గలదో లేదో తెలియదు.

ఇఁక నొక విశేషము: శహాజీ యాస్థానమున నాంధ్రపాణిని బిరుదాంచితుఁడగు నివృత్తి శేషాచలపతి కృతముగా వెలసిన సంస్కృత గ్రంథములు రెండు కన్పట్టుచున్నవి.

అవి ఆంధ్ర వ్యాకరణము [1], భోసల కోసలేంద్ర చరితము [2], రెంటింటను నితని యాంధ్ర పాణిని బిరుదము స్మరింపఁబడినది. భో. కో. చ. న నితఁడు శహాజీచేఁ గనకాభిషేకాది సత్కారములు పొందినట్లును, నితఁడు భారద్వాజ గోత్రుఁడు, నివృత్త్యన్వవాయుఁడు, అక్కదేవీ విభుఁడును నైన వేంకటపత్యమాత్యుని పుత్రుఁ డనియుఁ గలదు. శహాజీ రతి కల్యాణమున నొక ప్రతిలో (తం. స. మ. ప్రతి నం. 541) నితని యాంధ్ర పాణిని బిరుదము, శాహరాజ కృత సన్మానము స్మరింపఁ

---

♦ తం. స. మ. కే నం. 468

* Vide Indian Antiquary, Vol. 33.

(1) తం. స. మ. కే. నం. 773 — 774.

(2) ,, ,, సంస్కృత గ్రంథముల కేటలాగు నం. VIII. నం. 4238.

బడినవి. కామకళానిధి గ్రంథకర్తయైన నెల్లూరు శివరామ కవి యీతని పేరు నింటి పేరు బిరుదు స్మరించి యీతఁడు తన గురువని వక్కాణించినాఁడు.

కాఁగా నీ యాంధ్ర పాణిని శేషాచలపతియు, యక్షగాన నాటకకర్త యగు శేషాచలపతియు నొక్కరా కాదా యనునది ప్రకృత మొదయించు ప్రశ్న. అనేక విషయముల సామ్యము గన్పట్టు చున్నది. కాని కవి పితృనామ విషయమున శంక పొడగట్టుచున్నది. భో. కో. చ. న వేంకటపత్యమాత్యుఁడు శేషాచలపతి తండ్రి యని కలదుగదా, కాని సరస్వతీ కల్యాణమునందుఁ బేర్కొనఁబడిన చొక్క నాథ మహామాత్యనాథుఁ డనఁగా మధుర చొక్కనాథుని మంత్రి యతఁడగునో కాదా, అసలు చొక్కనాథునకు నివర్తి లేక నివృత్తి వేంకటపతి యను మంత్రి యుండెనో లేదో, లేక వేంకటపత్యా మాత్యునకుఁ జొక్కనాథుఁడను నొక సోదరుఁడుండెనేమో, ఆంధ్ర పాణిని బిరుదాంచితుఁడును యక్షగాన కర్తయు నా యన్నదమ్ముల పిల్లలేమో, ఇవి యిప్పటికిఁ దెమలని శంకలే యగుచున్నవి. తెలుఁగు గ్రంథముల విషయమున మాత్రము రెండు నొక్కతీరువి కనుకను, నొక్కదానిలో, గవి గురించి వివరములు లేకపోయినను రెండిట గర్తృనామము, కృతిపతి యగు శహాజీ భవన వర్ణనగల యొక చూర్ణికయు నొక శ్లోకమును సమానముగ నున్నవి కావునను నా రెండింటినైన నేక కర్తృకములుగా గ్రహింపవచ్చును.

## గ్రంథ సమీక్ష

### శాహరాజ విలాసము :

శాహరాజు సేతుయాత్ర చేసికొనివచ్చి తంజాపుర వీధులలో స్వారి వెడలుటతోఁ గథారంభము. అపుడు కాంభోజరాజు పుత్రి లీలా

వతి యగనిఁజూచి మోహించినదఁట. ఇది యులాప్రబంధపు జెత్తుగడ. విరహవేదన, దౌత్యము, ఎఱుకఘట్టము ప్రేయసీ ప్రేయుల సమాగమము తదుపరి ఘట్టములు. కటికము, సింగీ సింగళ్ళు మొ॥ వారందలి యితర పాత్రలు.

రచన : కవి ప్రౌఢపండితుఁడని నిరూపించుచున్నది. "అతఁ డష్ట భాషా కవిత్వంబు లమరు సుకృతి" యఁట. ఇం దష్టభాషా ప్రయోగము లేదు గాని, తెలుఁగున దరువులు, గద్య పద్యములును ధవళశోభనములు నొక వెన్నెల పదమును గాక సంస్కృతమున ననేక శ్లోకములు, వచనములు, అష్టపదులును సలక్షణముగా విరచింపఁబడినవి. తమిళ కన్నడము లందందు రెండు చిన్న ప్రసంగములును గలవు. దరువుల చివర సాధారణముగ శాహరాజపరముగ 'శేషాచల కవినుత' యని యుండును. కవి తన కృతిని నాటకమని పేర్కొనినాఁడు. అవతారికలోఁ గృతిపతి శుభాశంసన శోభనములే షష్ఠ్యంతములుగ నున్నవి. కథాసంగ్రహ మొక సీసములోను శహాజీ వంశావతార మొక దీర్ఘద్విపదలోను జెప్పఁబడినవి. శహాజీ యాస్థానమునం దుండిన త్ర్యంబక పుత్రాదులగు పండితులు, రామకవి ప్రభృతులును బేర్కొనఁబడిరి.

## సరస్వతీ కల్యాణము :

ఏతద్గ్రంథావతారికయే శహాజీ జలక్రీడ, సతీపతిదాన విలాసము మొదలగు ననేక గ్రంథావతారికల కొరవడి యైనది. అవతారికలో నొక సూత్రధారవచనమున నిది "శాహమహారాజ ప్రణీతంబైన" దనికలదు. కాని యావెనువెంటనే యున్న కథాసంగ్రహ ద్విపదలో :

"చిరపుణ్య రసమతి శేషాచలపతి
వరశాహ విభుపేర వహినిదైవార
పరగు సరస్వతీ పరిణయం బనెడు
సరసనాటకము లాస్యముల రాజిల్లి
భావముల్ దగువేషభాషాదు లమరఁ
గావించె భరతులు గాయకుల్ మెచ్చ"

అనియున్నది. దీనిని శేషాచలపతి కృతిగనే పరిగణించుట లెస్స.

సరస్వతీచతుర్ముఖులు పురాణదంపతులే కాని వారి కళ్యాణ కథ యిందుఁ గొన్ని మార్పులందినది. కవి ప్రౌఢుఁడే గాని కథకుఁ బౌరాణికతా ప్రతిపత్తిని గల్పింపలేక పోయినాఁడు. ఇందు ఢామర కుఁడు, మల్లులు, పండితులు మొదలగు వారి ప్రసంగములు కాలప్రభావ మునఁ బోఁగిన కవి హాస్య ప్రవణత్వమును వెల్లడించుచున్నవి.

ఆ పురాణదంపతుల పెండ్లి శాహరాజేలు తంజాపురిలో నైన దఁట. ఇందు ద్విపద లెక్కువ. చిన్న చిన్న దరువులు, సూత్రధార పాత్రధారుల వచనములును గలవు.

అందు నాఁటి తంజావూరు మాండలిక వ్యవహారఫణితి బాగుగాఁ గన్పట్టును. సూత్రధారి పాత్రలను బలుకరించుట గలదు.

ఇందలి స్తోత్రశ్లోకముల రచన యుద్ధసన్నద్ధుఁడగు ధీరోద్ధత నాయకుని గమన గాంభీర్యమును దలఁపించును. గ్రంథము మంచి నాటకపువాటము గలిగియున్నది.

———

# 17. బాలకవి సుబ్బన్న

శహాజీ యాస్థానమున వెలసిన య. గా. నాటకములలో లీలావతీ శాహరాజీయ [1] మనునది బాలకవి సుబ్బన్న కృతమని కలదు. పంచకన్యాపరిణయ [2] మనుదానిలో నది బాలకవి కృతమనిమాత్రము గలదు. ఈ రెండింటి గ్రంథాంతగద్యలు నున్నంతమట్టున నొక్కఫక్కిగా నున్నవి. పం. క. ప. న కొక్కటే ప్రతియున్నది. అందు శైథిల్య మెక్కువ. ఆ శిథిలభాగమున గ్రంథకర్త పేరు జారిపోయి యుండును. శాహమహారాజకల్యాణ [3] మను నింకొక కృతి గలదు. తత్ప్రతి పరిస్థితియు నిట్టిదే. అందు గ్రంథాంత గద్య లోపించినది. కర్తృనామ నిర్దేశమే కాదు, బిరుదప్రసక్తియును లేదు. కాని పం. క. ప. న. గ్రంథాంతగద్యకు ముందున్న 'ఎంతకాలము చంద్రుఁడీశుని మౌళిపైఁ గాంతిమంతుండయి కదలకుండు' నను ఫలశ్రుతి సీసము శా. మ. రా. క. గ్రంథాంతమున నట్లే కలదు. (ఎత్తు గీతి మాత్రము కొఱవడినది.)

ఆ యీ యుపపత్తులనుబట్టియు నింకను గొంత రచనా సామ్యమునుబట్టియు నిప్పటికీ మూఁడును బాలకవి సుబ్బన్న కర్తృకములు గావచ్చునని యూహింపఁబడుచున్నది.

## లీలావతీ శాహరాజీయము :

కాశ్మీర దేశాధీశుఁడగు రాజకంఠీరవుని పుత్రి లీలావతి వెన్నెల బయట విహరించుచు మొగమెత్తి చంద్రునిఁ జూడఁబోయి యొక

---

1. తం. స. మ. కే నం. 588 — 589
2. ,, ,, ,, 539
3. ,, ,, ,, 631

మేడపై నున్న శహాజీ ముఖచంద్రునిఁజూచి మోహించినదఁట. తదుపరి యామె విరహావేదన, చెలికత్తెచే రాయబారము, ఎఱుక ఘట్టము తుద నాయికా నాయకుల సమాగమము.

రచనలో సందర్భశుద్ధి తక్కువ. శయ్యాలాలిత్యము గలదు. కాని భావప్రౌఢి లేదు. శబ్దదోషములును గలవు. బాలకవి రచనవలెనే యున్నది. ఇందు పదములు, ద్విపదలు, మంజరి, పద్యములు, అవతారికలో నొక 'కైవార' గద్యయుఁ గలవు.

## పంచకన్యా పరిణయము:

శ్రీకృష్ణుఁడు కందుకక్రీడ పందెము నెపమున సుదామునిఁ జూడఁబోవ నొకయైదుగురు కన్యలెవరో యతని కెదురుపడుట – అతఁడు వారిని వలచుట – ఒక గోపకుని ద్వారా వారి వర్తన మరయుట – పిదప సుదాముని ద్వారా వారితోఁ జెలిమిచేయుటకుఁ బ్రయత్నించుట – వారు జలక్రీడ లాడుచుండ వస్త్రాపహారణ మొనర్చుట – 'చీరలడుగ వచ్చినను బెదరించి పెండ్లాడుట' – ఇది విషయము.

పంచకన్యల పేళ్లు :— కలకంఠి, కనకాంగి, ఇందువదన, మనోరమ, చిత్రరేఖ.

రచన యొకమోస్తరు. దరువులు, ద్విపదలు, గద్యపద్యములును గలవు. ఇందు ప్రసంగియనఁగా 'దశావతారాలాడే భాగవతుఁడు' (కన్నడమున యక్షగానమునకు 'దశావతార – ఆట' యనియు వ్యవహారము గలదు). కేతినాయని (కటికము) కోరిక నతనిపై పాడిన పదమొకటి విశేషము.

## శాహమహారాజ కల్యాణము:

తంజాపుర సత్ప్రభుధీశ ప్రశంస — శాహరాజు కొలువు — కొలువులో నాట్యగోష్ఠీ వినోదము — తదుపరి శాహరాజు స్వారి — పౌరకాంత లతనిఁ గాంచి మోహపరవశలగుట — అతఁడు నగరికి మగిడినను నతనిపైఁ దగుల్కొనిన మనసు మగుడక యొక రాజకన్యక రూపావతీ నామధేయ విరాళిఁ గుందుట — నారదుఁ డేతెంచుకతమై వచ్చుట, చెలికత్తె దొరవారి సమ్మతి గొనివచ్చుట — ఆ రాత్రియే దొరవారు స్వయముగా రూపావతి యింటికి విచ్చేయుట — విషయము.

ఇందలి, లీలావతీ శాహరాజీయమందలి కథావస్తువులు మునుపు నాఁటి విజయరాఘవ కల్యాణ, విజయరాఘవ చంద్రికా విహారములను గొంత కొంత పోలియున్నవి. ఇందలి రచన సరళముగాఁ జాలవఱకు నిర్దుష్టముగనే యున్నది. పాడిన రాగమ్ము పాడకుండ రాగ బహుళముగా, దరువు లనేకము సరసముగాఁ జెప్పినాఁడు కవి. గ్రంథకర్తకు సంగీతశాస్త్ర పరిచయ మెక్కువగా నుండినట్లున్నది. బాలకవికి రాను రాను బాగుగా చేయితిరిగినట్లున్నది. కొరవంజి దరువొకటి యిందు గలదు. అందు కొరవంజి రాకయే చెప్పబడినది. సువాలలు, ధవళ, మంగళగీతములు నిందుగలవు.

---

# 18. రామకవి

**వాదజయకొరవంజి:** *

ఈ గ్రంథముగూర్చి తం. స. మ. కేటలాగులో నిట్లు గలదు.

"అసమగ్రము, తప్పులు కప్పలు, వ్రాఁత జిలుగు, శైథిల్యము గలదు. గ్రంథనామముగాని తత్కర్తృనామముగాని తెలియ నవకాశము గాన్పింపదు. గ్రంథ ప్రతిపాద్యము గూడఁ దెలియుట కష్టతరము. ముఖ పత్రమున "వాదజయ కొరవంజి నాటకం" అని నిర్దేశింపఁబడెను."

అది కొంతవట్టు నిజము. గ్రంథమందెల్లెడ శాహరాజు ప్రశంస గన్పట్టుచున్నది. అందుచే నిది శదాస్థానకవి యెవఁడో రచించియుండు ననుట నిశ్చయము. గ్రంథమున కొక్కటే ప్రతి లభించినది. అది యసమగ్రము, 160 గ్రంథముల (గ్రంథము = 32 అక్షరములు) పరిమాణము గలది. ఆ యింతగ్రంథములో సుమారేఁబది గ్రంథముల భాగము నాక్రమించిన దొక యఱవదరువు ప్రసంగము. అందు రామకవి పేరొకటి దొరలినది. శేషాచలపతి శాహరాజవిలాస కృత్యవతారిక యందున్న శాహరాజ సభాప్రశంసాత్మకమగు పద్యములో "....సభాసీనుల్ ప్రవీణుల్ కవుల్ రామాదుల్......" అని యున్నది. దీనినిబట్టి శహాజీ యాస్థానమున రామకవి నామధేయుఁ డొకఁడుండినాఁడనుట స్పష్టము. కావునఁ బ్రస్తుత గ్రంథమా రామకవి కృతమని యూహింపవచ్చును. కాని యతఁడు తమిళుఁడై నట్లిందు సూచింపఁబడినది. అయినను ననేకాంధ్రకవులకుఁ బట్టుకొమ్మయగు శహాజీ యాస్థానమున నతఁడెట్లో నాలుగు తెలుఁగుముక్కలు నేర్చి యీ గ్రంథమును గూర్చియుండుననుట యసమంజసముగాదు.

* తం. స. మ. కే. నం. 597.

ఆంధ్ర వాఙ్మయ సూచికలో వాదజయ కొరవంజి నాటక మొకటి శహాజీ కర్తృకముగా నుదాహరింపఁబడినది. అది యిదే యనుకొందును. ఇందలి శాహరాజ ప్రశంసను జూచి యిది తత్కర్తృకమేయని ఆం. వా. సూ. కారులు పొరపడియుందురు.

గ్రంథభాగ ముపలబ్ధమైన యంతలో గ్రంథనామము సార్థకము గాదు. ఇందు వాదజయము * ను లేదు. కొరవంజియును లేదు. శాహరాజును మోహించి యొకకాంత విరహ విహ్వలయై ప్రలపించుటయు, నామె ప్రియసఖి నాయకునితో నాయికాప్రశంస యొనర్చి యామె నేలుకొను నుపాయ ముపదేశించుటయు నున్నంతలో నిందలి విషయముగాఁ దోఁచును. శాహరాజ కృతులన్నియున్నను సందిట్లు తఁడే నాయకుఁడుగా నున్నదొక్కటియుఁ గానరాదు. అందుచే నిది తదితరకృతమే యనుట లెస్స.

గ్రంథము దరువులమయము. రచన చక్కని దే.

---

# 19. దర్భా గిరిరాజు

ఇతఁడు శహాజీ యాస్థానమును దదుపరి శహాజీ యనుజుఁడగు శరభోజీ యాస్థానమును నాశ్రయించి యుండెను. వారిరువురి పేర ననేక యక్షగానములను బదములను వెలయించి యుండెను. శహాజీ రాజ్యారంభవత్సరము క్రీ. శ. 1684, శరభోజి రాజ్యాంత వత్సరము

* తం. స. మ. లో వాదజయ మను నింకొక గ్రంథము (కే. సం. 598 — 601) గలదు. అది గిరిరాజకవి కృతము. దానికిని దీనికిని సంబంధము లేదు.

క్రీ. శ. 1727. గిరిరాజా నడుచు నుండియుండును. అతని గురించిన వివరము లతని గ్రంథముల నుండి యెఱుకపడినవి కావు. కాని యతని యనుజుఁడగు కవి గిరి రచించిన రుక్మాంగదచరిత్ర మను ద్విపద కావ్యావతారికలో నా కవుల విషయము గలదు. * అందు గిరిరాజు దర్భాన్వవాయుఁడు, నాపస్తంబసూత్రుఁడును, లోహితగోత్రుఁడు ననియుఁ జెంగమాంగోపాల మంత్రు లతని పితామహులనియు, నతని తల్లి జానకాంబ యనియుఁ దండ్రి యాభళార్యుఁ డనియు, గిరి రాజునకు గోపన యను నగ్రజుఁడును, వెంగనయుఁ గవిగిరియు నను నవరజు లున్నట్లును విదితము. అతఁడు శహాజీ యాస్థానకవి యనియు స్పష్టపడినది. ఇతఁడు శహాజీ రతికల్యాణము, వల్లీకల్యాణము శచీపురందరములందు పద కర్తగా స్మరింపఁబడినాఁడు. ఆయా కృతి రచనా వ్యాసంగమున నితఁడు శహాజీకిఁ దోడ్పడియుండును. ఇతని పదము లనేకము యక్షగానము లొక యాఱును తం. స. మ. లో గలవు. అన్నియు నముద్రితములు. అన్నియు రాజ సంబంధేతివృత్త ములు — శహాజీపై నైదును, శరభోజిపై నొక్కటి.

## శాహేంద్ర చరితము: [1]

ఈ కృతికిఁ గవి పెట్టినపేరేమో తెలియదు. ప్రతిపాద్య విషయ మును బట్టి తం స.మ. కేటలాగులో శాహేంద్ర చరిత్ర మని పేర్కొనఁ బడినది. ఇందలి విషయము — శాహరాజు స్వారివెడలుట, ఒక సాని కూఁతు రతనిని మోహించుట, వారిసమాగమము. నాఁటి ఒహాయక్ష గాన కృతులందు దది పాడిన పాటయే. ఈకృతి యక్షగానమని కవిచేఁ బేర్కొనఁబడుట విశేషము. తంజావూరు ప్రాంతమున ముందు తరముల

---

* చూ. తం. స. మ. కే. నం. 353., పుట 123 — 124

(1) తం. స. మ. కే. నం. 496.

నుండియు నేతాదృగ్రచనలకు యక్షగానము లను వ్యవహారము పోయి చాటు కావ్యములు, నాటకములు నను వ్యవహారము స్థిరపడిపోయిన కాలమున గిరిరాజు మరలపూర్వ వ్యవహారమును స్మరించుటయుఁబూర్వ య. గా. లవలెఁ దనకృతిని తాళప్రధానములగు దరువుల నింపుదన ముతో నిర్మించుటయు విశేషమే. ఇందు ద్విపదయుఁ గంద, గీత, సీస ములు, వచనములు, సలఁతిగాఁ బ్రయుక్తములు. రచన సరసముగనే యున్నది.

ఇందు నాయిక విరహాఘట్టమున నొక పదమున శాహరాజ సంబుద్ధిగా "నాగేశ్వరకవి సన్నుత" యని యున్నది. అనఁగా శహాజీ యాస్థానమున నాగేశ్వర నామధేయుఁడొక కవి యుండెనా లేక యది నగేశ్వరశబ్దమై గిరిరాజునే సూచించునా యన్నదొక శంక.

## రాజమోహన కొరవంజి : [2]

ఇది యక్షగాన ప్రాయమైన రచనయే. కొరవంజి పాత్ర విశిష్టమై యాపేర వ్యవహృతములై వెలసిన కొలఁది తెలుఁగు కృతులలో నిదియు, మైసూరి కంఠీరవరాజు కొరవంజి కథయు మొట్ట మొదటి తరమునకుఁ జెందునట్టివి.

కొరవంజులలో సాధారణముగా నాయికా నాయకుల విప్రలంభము, నాయిక కామె ప్రియ సమాగమము గూర్చి కొరవంజి సోదె చెప్పుటయుఁ బ్రధానవిషయములు. అందుఁ గొరవంజి వేషభాషలు కొలిచిన దేవతలు మొ. విషయము లనేకము ప్రసక్తము లగును. చివరఁ గొరవంజి ప్రియుఁడు సింగఁడు సింగిని వెదకుకొనుచువచ్చి యామెతో వాదు లాడుటయు నుండును. ఈ రాజమోహన కొరవంజి యచ్చుమచ్చు దే తీరుది. ఇందు శాహరాజే నాయకుఁడు. నాయిక యొక రాజ కన్య.

2. తం. స. మ. కే. నం 509—511, 570

ఇందు దరువులు, పదములు నెక్కువ. ద్విపదయు, సంధిసంభాషణ వచనములును గొలఁదిగాఁ బ్రయుక్తములు. దరువులు కురంజి, సౌరాష్ట్ర, పూరివి, బిజావంతి, పాడి, నీలాంబరి మొ॥ రాగములలోఁ గలవు. దరువులలో శాహరాజ పరముగా 'గిరిరాజనుత' ముద్రగలదు. కతిపయ సూత్రధార వచనములును, రంగప్రయోగ సూచనములును గలవు. రచన చక్కనిది.

## రాజకన్యా పరిణయము: [3]

ఇందుఁ గొరవంజి పాత్ర లేదు. కాని కడమ కథ యంతయు రాజమోహన కొరవంజినిఁ బోలినదే. అలఁతి యలఁతి మార్పులు గలవు. గిరిరాజీ గ్రంథమునే ముందు రచించి పిదపఁ గొరవంజి పాత్రను బ్రవేశ పెట్టిన బాగుగ నుండునని పిదప రా. మో. కొరవంజిని రచించి యుండునని తోఁచెడిని. ఇందు రాగతాళము లుదాహరింపఁ బడని దరువులు, పల్లవితోఁ బదములు, పాత్రల సంభాషణ వచనములు సూత్రధారుని సంధివచనములు, ద్విపదలు, నోకశోభనము, నోకి యుత్సల మాలయుఁ గలవు. దరువుల చివళ్ళ "గిరిరాజనుత" ముద్ర గలదు. రచన 'సాదా' గా నున్నది.

## వాదజయము: [4]

వారవధువు లిరువురకుఁ దమతమ నాట్య విద్యానైపుణ్యము గురించి పంతము పడినది. అందొకతె యప్పుడే శాహరాజు మెప్పు వడసినది. మరియొకతె యతని మెప్పించి, మరుకేళిఁ గలయఁగలనని ప్రతినపట్టినది. అంతపనియుఁ జేసినది. – ఇది యిందలి ప్రధాన విష

(3) తం. స. మ. కే. నం. 568—569.

4. ,, ,, ,, 598—601

యను. ఇందు దరువు లెక్కువ. సూ. ధా. వచనములు నెక్కువే. వారవధూ సంవాదములు వచనములో సాగినవి. ద్విపదయు, నొక దండకము, నొక శోభనము, నొకమంగళగీతమును గలవు. ఇందలి కోలాట ప్రసంగము కవికిఁగల వివిధ తాళజ్ఞానప్రవీణతను దెలియఁ జేయుచున్నది. రచన చక్కనిది. గ్రంథము నాటకమని పేర్కొనఁ బడినది.

## సర్వాంగ సుందరీవిలాసము: [5]

ఏతద్గ్రంథావతారికలో శేషాచలపతి సరస్వతీ కల్యాణమునందలి స్తోత్రశ్లోకములు గన్పట్టును. గ్రంథాంత మంగళగీతము పార్వతీకల్యాణము చివరనున్న వాసుదేవకవి నామాంకితమైనదే యిందును గలదు. కాని యీగ్రంథము శేషాచలపతి కృతమని కాని, వాసుదేవకవి కృతమని కాని యనరాదు. ఇందలి కథాసంగ్రహద్విపదలో ' గరిమతో గిరిరాజకవి రచియించె ' నని స్పష్టముగాఁగలదు. గిరిరాజకవి ముద్రతో నతని యితర కృతులందున్న దరువులు నిందుఁ గలవు. కాఁగా నా స్తోత్రశ్లోకములును, నామంగళగీతము సరస్వతీ పార్వతీ కల్యాణముల ప్రతివిలేఖకుఁడైన వెంకటరంగయ్యయే యీ గ్రంథమునకును బ్రతివిలేఖకుఁడగుటచే నతనిచేతనే యిందుఁ జొప్పింపఁబడి యుండునని యూహింపఁదగియున్నది.

గ్రంథరచనాకాలము కే. నం 660 ప్రతీవిలేఖనకాలము తారణ పుష్యశుద్ధ ప్రతిపద్ - స్థిరవాసరమని యున్నది. అది క్రీ. శ. 16–12–1704 తేదీకి సరిపోవును. గ్రంథరచనాకాల మంత కించుక ముందు జరిగియుండును.

5. తం. సం. మ. కే. నం. 658 — 662

ఒక శివరాత్రినాఁడు శాహరాజు పంచనదేశ్వరస్వామి కోవెల మండపమునఁ గొలువుండును. అపుడచటికి స్వామిని దర్శింపవచ్చిన కుంతలేశ్వరకుమారి సర్వాంగసుందరి శాహరాజును జూచి మోహించును. తదుపరి తండ్రి పెండ్లిమాటలపైఁ గార్యము నెఱవేరును. ఇందలి ప్రధానవిషయ మిది. రచన చక్కనిదే. అటనట ననుచిత సందర్భములు లేకపోలేదు. ఇది "శృంగార వేష భాషాదిభూషితంబగు...నాటకం" బని పేర్కొనబడినది.

**లీలావతీ కల్యాణము:** [6]

ఇది శరభోజి నాయకమైన కృతి. ఈ శరభోజి శహాజీ యనుజుఁడు. క్రీ. శ. 1712–1728 సం.ల నడుమ తంజాపురము నేలినవాఁడు. అతఁడీ గ్రంథమున వర్ణింపఁబడిన తీరు జూడ "కవులకు ముంగిటి కల్పభూజం" బయిన దొడ్డ ప్రభువని తెలియుచున్నది. కాని యతని యాస్థానమున వెలసిన తెలుఁగుకృతి యిది యొక్కటియే కన్పట్టుచున్నది. దీని కర్తృత్వ మిదమిత్థమని లేదు. కాని గ్రంథమున శరభోజి విశేషముగా "గిరిరాజనుత" యనునది నాలుగుపర్యాయములు ప్రయుక్తమైనది.

శరభోజి యాస్థానము నలంకరించిన తెలుఁగు కవులలో నిప్పటికిఁ దెలియవచ్చినది గిరిరాజు పేరొక్కటే. గిరిరాజు శరభోజీపైఁ జెప్పిన పదములా ముద్రతోఁగూడ తం. స. మ. లోఁ గన్పట్టుచున్నవి. కాఁగా గిరిరాజే తద్గ్రంథకర్త యనుట లెస్స.

మహారాష్ట్ర దేశమునఁ గల్యాణపురి పరిపాలకుఁడగు కీర్తిచంద్ర నృపతి తన కూఁతురగు లీలావతి కనుగూప వరునిఁ జూడనొక యోగినిని నియోగించును. ఆమె యీశరభోజి సంబంధము గుదుర్చును. పెండ్లి తంజాపురిలో నగును. ఇందలి విషయమిది.

(6) తం. స. మ. కే నం. 587.

ఇది నిర్వచనము. ద్విపదలు తరచు. అందు ప్రాసయతులు పాటింపఁబడినవి. దరువులు, పద్యములు, శ్లోకములు మంజరి (మంజరీ ద్విపద కాదు. ఒక మహారాష్ట్ర గీతిచ్ఛందస్సు. మన హరికథలు కొన్నిటఁ గానవచ్చును). వెండిరేకు అను రచనా విశేషములు గలవు. రచనలోఁ జక్కని చాకచక్యము గన్పడుచున్నది. ఇందు సూత్రధార ప్రసక్తి లేదు. కాని గిరిరాజు కృతులన్నియు రంగప్రయోగ యోగ్యము లైనవే.

---

# 20. అన్నదానము వేంకటాంబ

## రామాయణము (బాలకాండము) *

గ్రంథారంభమునఁ బ్రకటనకర్త యొక విజ్ఞప్తి చేసి యుండిరి. అందు గ్రంథకర్త్రి గుఱించి "ఇప్పటికి సుమారు రెండువందల సంవత్సరముల క్రిందట సేలంజిల్లా హోసూరుతాలూకా తోగీర అగ్రహారమను శ్రోత్రియ గ్రామమందు నా పూర్వికురాలైన అన్నదానం వెంకటరామావధానుల భార్య వెంకటాంబ ...." అని యున్నది. దీనిని బట్టి గ్రంథకర్త్రి 18వ శతాబ్ది ప్రథమపాదమున నుండెనని చెప్పవచ్చును. వెంకటాంబ గ్రంథాంత ద్విపదలోఁ దనపేరును భర్తపేరును జేర్కొన్నది. అవి సరిపోయినవి. కానియామె నివాసము మాత్రము ప్రకటనకర్త యన్నట్లు కాక కావేరీనదీతీరము వీరరాజమను నగ్రహారమని యున్నది. దానికే తోగీర మఱియొక పేరు కాఁబోలు.

---

* ముద్రితము. చంద్రమౌళీశ్వర ము. శా. కర్నూలు, 1912. ప్రకటనకర్త) అన్నదానము రామలక్ష్మమ్మ.

గ్రంథకర్త్రి తనకృతిని యక్షగానముగా నాడువారు పాడుటకు మాత్రమే యుద్దేశించినది. ప్రకటనకర్త లీగ్రంథమును వ్రాతప్రతుల మూలమునఁగాక పారాయణ పరులగాత్రములనుండి సేకరించిరి. అట్లు నానోట నానోట నానివచ్చుటచేతను, ముద్రాపకుల పరాకు వలనను కొంత గ్రంథకర్త్రి యనభిజ్ఞతవలనను నీగ్రంథ మనేకదోషములం గాకర మైనది. ఇందుఁ బ్రసిద్ధ రాగతాళములలో దరువులు, కీర్తనలు, ద్విపదలు, సీస గీతపద్యములు, వచనము, లాలి, శోభనము, మంగళ హారతి మొ॥ పాటలు గలవు. కథ ప్రసిద్ధమైనది. అంతయు నాఖ్యాన శైలి. అటనట వర్ణనములు గలవు. రాముని బాల్యము, సీతాకళ్యాణ ఘట్టము చక్కఁగా దెనుఁగుదన ముట్టిపడునట్లు వర్ణింపఁబడినవి.

---

# 21. తిరుమల కవి

## చిత్రకూట మాహాత్మ్యము : ♦

మధురాంధ్రనాయక రాజాస్థానమున వెలసి మనకు లభించిన యక్షగాన మిది యొక్కటే. ఇది 'విజయ రంగావనీశ్వర సభార్హముగా, నర్తనయోగ్యముగా' వెలసినది. మధుర విజయరంగచొక్కనాథ నాయకుని రాజ్యకాలము క్రీ. శ. 1706 - 1732. * (అతని యాస్థానము నాశ్రయించిన కుందుర్తి వేంకటాచలపతి కవి తాను "బహు

---

♦ తం. స. మ. కే. నం. 520.

* Vide., History of the Nayaks of Madura By Sri R. Sathyanadha Aiyer.

(Madras University Publication).

నాటకములు" రచించినట్లు తన మిత్రవింద్రాపరిణయ కార్తీక మహాత్మ్య కృతులందుఁ జెప్పుకొనినాఁడు. అవి యెవ్వియు నేఁడుపలబ్ధములు గావు. ఆనాఁటికి మనకు మార్గనాటకములవంటి నాటకములు లేవు. కావునఁ (బ్రాయికముగా నవి యక్షగానములే యైయుండును)

ఈ చి. కూ. మూ. కర్తయగు తిరుమలకవి, (యింటిపేరు తెలియదు) బాలసరస్వతిమఖి పౌత్రుఁ డనియు, వేంకటాధ్వరి పుత్రుఁ డనియు, "సంగీత సాహిత్య చతురుఁడౌ విజయరంగచొక్కావనీ రమణుని కృపను ... ఘనబహుమానముల్ గాంచిన వాఁ" డనియు నీగ్రంథమూలమునఁ దెలియుచున్నది.

చిదంబరక్షేత్రమున విశ్వకర్మనిర్మితమైన కనకసభలో నర్తన కళాప్రావీణ్య విషయమునఁ బోటీపడి యొకరికొకరు తీసిపోని ప్రతిస్పర్థులుగా నిలిచిన కనకసభాపతికిఁ దిల్లాదేవికి (శివ పార్వతులకు) తిల్లగోవిందరాజులు గాంధర్వవివాహమును సంఘటించుటయుఁ దదుపరి వారి వినోద విహారములు నిందలి ప్రధాన విషయములు. (శహాజీ త్యాగవినోద చిత్రప్రబంధము నించుమించిట్టిదే). దీనికి "తిల్లగోవింద రాజనాటక" మనియు నామాంతరము.

ఇందలి కథాసంవిధానము :– 'ఇది మొదటినాటి సంవిధానము - ఇది రెండవనాటి సంవిధానము' అని యిట్లు నాల్గు ఘట్టములుగా విభాగింపఁబడినది. చూడఁగా నిది చతుర్దిన ప్రదర్శనోద్దిష్టమా యనిపించును. కాని గ్రంథపరిమాణ మల్పము (560 గ్రంథములు మాత్రము). ప్రదర్శించుట కొక్కరాత్రి చాలు. అట్టిచో నా విభాగ మంక సంకాశమనుకొనుట లెస్స. (శహాజీ త్యాగ వినోద ప్రబంధమున అంకవిభాగము గలదు. అప్పటికే యక్షగానముపై మార్గనాటక ప్రభావము కొంత పొడసూపినది.) ఆ మొదటినాఁటి, రెండవనాఁటి యను

మాటలు కథా కాలమునకు సంబంధించినవియై యుండును గాని ప్రదర్శనకాలమునకు సంబంధించినవియై యుండవు.

ఇందు ప్రసిద్ధరాగములలో కర్ణాట హిందూస్తానీ బాణీలకుఁ జెందిన దరువులుగలవు. సమపద మను రచనావిశేష మొకటి పలుమఱు ప్రయుక్తము. అష్టకము, ఉత్తర ప్రత్యుత్తర పదమును గలవు. రచన చక్కనిది. అందును వచనరచన. వచనమున సంభాషణలు గలవు. ఇది "స్వామి వాక్యం" - ఇత్యాది పాత్ర సంభాషణ సూచనలు గలవు. సంధివచనములు ప్రసంగము లను పేర వ్యవహరింపఁ బడినవి. గ్రంథ మధ్యమునను జైవారములు 'గలవు. ఒక గుజరాతి కోపు నొక జక్కిణియుఁగలవు. పేరణి, పదచాళికయుఁ బేర్కొనఁ బడినవి.

గ్రంథమున నాటకీయత ప్రస్ఫుటముగ నున్నది. కవి దీనిని మహానాటక మనియెను గాని యది వట్టి మాటవరుస. కథా సంవిధాన చతుర్ధావిభాగమును బట్టి యిది చతురంకిక యని చెప్పవచ్చును. క్షిప్త వృత్తము. కైశికీవృత్తిగలదు. ప్రథమ చరమాంకములందు సచేటి యైన నాయిక వనవిహారాదులు వర్ణితములైనవి. కాన నవి స్త్రీ ప్రాయత్వ విశిష్టములు. కాఁగా నాటికా లక్షణము కొంత పట్టిన దన వచ్చును. ఇది విజయరంగని సభలో "వగకోపుల వైఖ) లమర ఇంచుబోణులు నటించు" భాగ్య మందినదని యూహించుటకవకాశ మున్నది.

---

# 22. తుళజరాజు

తంజావూరి మహారాష్ట్రప్రభువు (క్రీ. శ. 1728—36), ఏకోజీ దీపాంబికల పుత్రుఁడు, శహాజీ శరభోజుల యనుజుఁడు నైన తుళజరాజ కృతములుగా తం. స. మ. లో రెండు తెలుఁగు య. గా. నాటకము లగుపించు చున్నవి.

## శివకామ సుందరీ పరిణయము :[1]

ఇది చిదంబరక్షేత్రగాథ. క్షేత్రస్వామి కనకసభాపతి (శివుఁడు). శివకామసుందరి (పార్వతి) యతని దేవి. వా రిరువురి వివాహమిందలి ప్రధానవిషయము. (తిరుమలకవి చిత్రకూట మాహాత్మ్యమునందు నిదియే ప్రధానవిషయముకాని యాతని తీర్పు వేఱు) ఇందలి రచన యంత ప్రౌఢమైనదికాదు. కథనభాగ మెక్కువ. గ్రంథమంతట సూత్రధారప్రసక్తి కడుహెచ్చు. అవతారికా స్తోత్రశ్లోకపఠనము, గ్రంథాంతమందలి సుదీర్ఘ కల్యాణకథనము, పాత్రప్రవేశ సూచనలు, తద్వర్ణనము సన్నియు నతని పనులే. స్థూలముగా యావద్గ్రంథము నొక దరువు నొక వచనముచొప్పున నడచును. మూఁడు నాల్గు తావుల ద్విపదలు, కందములు, నొక్క ధవళమును గలవు.

## రాజరంజన విద్యా విలాసము :[2]

ఇందలి ప్రధాన విషయమిది :— అరిషడ్వర్గ జనయిత్రి యగు మాయాదేవి గాత్ర పురాధీశుఁ డగు జీవరాజు తన్ను విడనాడె నని

---

1. తం. స. మ. కే. నం. 633 — 635
2. ఇది కేటలాగులోఁ జేర్కొనఁబడలేదు.
తం. స. మ. న. ప్రతి. నం. బి. 13944

పుండరీక పురాధీశుఁడగు నాత్మ మహారాజుతో మొఱబెట్టుకొనుట. ఆత్మ మహారాజు పనుపున మోహాఖ్యుఁడు యతివేషము ధరించి జీవరాజు నెదుట వింతవింత విద్యలు ప్రదర్శించుట - వాని కిటుకు దెలిసి జీవరాజు తపశ్చికీర్షువగుట - ఆత్మరాజు శివ స్వరూపమున సాక్షాత్కరించుట - జీవరాజు ముక్తి నిమ్మనుట - "సంసారములో నున్నప్పటికిన్ని పూస లలో దారమువలె నిస్సంసారివై నిరామయుండవై యుండవోయి" అని శివుని యుపదేశము - తదుపరి మాయాదేవి జీవేశ్వరుల యాధ్వ ర్యమున రతిమన్మథులకు వివాహము జరుగుట.

ఇందలి విషయము తాత్త్వికము. వివేచన సాంకేతికము. జీవన్ముక్తిని గృహస్థాశ్రమమును నద్వైతవాదమును నిది సమర్థించును. ప్రబోధ చంద్రోదయమునకు మానస పుత్రిక వంటిది. ఇందు విష యము పటువైనదైనను రచన సరళమైనది, చక్కనిది. ఇందు దరువులు ద్విపదలు, కందములు, సీసములును గలవు. పద ప్రయోగములలోఁ జక్కని వాడుక నుడికారము గలదు. కొన్ని యన్య దేశ్యములు గలవు. మోహుని రాక మోహనరాగములో, శంకరసాక్షాత్కా రము శంకరాభరణములో నిట్లు చెప్పుటొక చమత్కారముగాఁ బాటింపఁబడినది. రంగముపై నున్న మఱియొక పాత్ర మాటలలోఁ దమ పేరు తడవఁబడఁగానే పాత్రలు ప్రవేశించు టది యొక వైచిత్రి గలదు. భాగవతులు పాత్రలను బల్కరించుట గలదు.

పై కృతులు రెండింటికి నవతారికల తీరులో రచనా ధోరణి లోను జాల పోలికలు గలవు. రెండింట గ్రంథారంభమున నాందీ శుభా చారము, వసంత వర్ణన, సూత్రధార పారి పార్శ్వకులచేఁ బ్రవర్తిత మైన ప్రస్తావనయుఁ గలవు. అది మార్గ నాటక సంప్రదాయానుకర ణము. అంతకు ముందటి య. గా. లలో నిట్టి సక్రమమైన మార్గ

రూపక స్థాపన సదృశమైన ప్రస్తావన లేదు. గ్రంథములు రెండును గర్తచే నాటకములని పేర్కొనఁబడినవి. ప్రదర్శనోద్దిష్టము లైనవి.

---

# 23. ఏకోజీ

## విఘ్నేశ్వర పరిణయము :*

పై తుళువ రాజపుత్రుఁడును, క్రీ. శ. 1736—37 సం. లలోఁ దంజావూరి యేలికయగు రెండవ ఏకోజీ రచించిన దీ గ్రంథము. శహాజీ విఘ్నేశ్వర కల్యాణమునందును నిందును ప్రధాన విషయ మొక్కటే కాని యిందించుక మార్పు గలదు. భారత రచనారంభుఁడగు వ్యాసుఁ డుపాసింపఁగా వినాయకుఁడును, సిద్ధిబుద్ధి కన్యలతో సరస్వతియు వత్తురు. వినాయకుఁ డాకన్యలను జూచి మోహించును. వ్యాసుఁ డతని భారతము వ్రాసిపెట్టుమనఁగా నతఁ డాకన్యలతోఁ దనకుఁ బెండ్లి చేసిపెట్టుమని యొక కట్టడి చేయును. వ్యాసుఁ డెట్లో యూపని నెఱవేర్చును. అతని భారత రచనావ్యాసంగ మవిఘ్నముగాఁ గొనసాగును.

ఇందలి రచన యొక మోస్తరు. నాంది, పారిపార్శ్వకుఁడు లేని ప్రస్తావనయుఁ దరచు సూత్రధార వచనములును గలవు. సంగీత మరంద మను గేయప్రబంధ విశేష మొకటి కలదు. ఈయేకోజీ ద్విపద రామాయణమునుగూడ రచించి యుండెను.

---

* తం. స. మ. కే. నం. 606—609
† ,, ,, ,, 352

# 24. భాస్కర శేషాచలకవి

## నాంచారు పరిణయము :

భాస్కర వేంకటాచలకవి సేతుమాహాత్మ్య కావ్యావతారికలో నతని సోదరుఁడగు శేషాచలకవి నాంచారు పరిణయ మను యక్షగానమును రచించినట్లు గలదనియు, భాస్కరవెంకటాచల కవిని దక్షిణాంధ్ర దేశమున వెలసిన వాఙ్మయమునకు సంబంధించిన వానిగా శ్రీ వారి సేతురామయ్యగారు ఆం. సా. ప. పత్రిక సం. 7. 84-92పుటలలోఁ దాము ప్రకటించిన "చోళపాండ్య దేశాంధ్ర ప్రాబల్యము' అను వ్యాసమునందుఁ దెలిపినారనియు, నం దాకవి కాలము క్రీ. శ. 1731 - 1767 ప్రాంతమని వారి యభిప్రాయ మనియు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు తమ దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయ మను గ్రంథము—475 - 76 పుటలలో నుటంకించినారు. నాంచారు పరిణయము గ్రంథ మలబ్ధము.

---

# 25. ఆలూరి కుప్పన్న

## పార్థసారథి విజయము : *

కుప్పనార్యుఁడు కశ్యపసగోత్రుఁడు, ఆపస్తంబ సూత్రుఁడు, నరసమాంబా వేంకటేశ్వరుల పుత్రుఁడు. కస్తూరిరంగకవి శిష్యుఁడు ననియతని పా. వి. నఁ గలదు. అతని కృత్యంతరమగు ఆచార్యవిజయము వలనఁ దెలిసిన విశేషములు : ఇతఁడు " వేంకటగిరి సుధీపౌత్రుఁడు ",

---

* ప్రా. లి. పు. భాం. డి. నం. 1907 అండ్ ఆర్. నం. 758.

"శ్రీమద్భోసల తుళజ మహారాజ కటాక్ష సముల్లసితుఁడు" — తచ్ఛోళేంద్ర దత్తాంధ్ర కాళిదాస బిరుదాంచితుఁడు, పంచనదస్థల పురాణము, రామాయణ భాగవత యక్షగానములు, పరమ భాగవత చరిత్ర, ఇందుమతీ పరిణయము, హరికథా సుధారసకావ్యము ననునవి యితని కృత్యంతరములు. ఆచార్య విజయము, భాగవత యక్షగానము (ఇదే పార్థసారథివిజయము) మాత్రమే నేఁడుపలబ్ధములు.

పా. వి. కృతిపతి ఆత్రేయ గోత్రుఁడైన చోళపురము వేంకటాచల విభుఁడు. (అతఁడే కుప్పన రామాయణ య. గా. నకును గృతి పతి యని యిందలి యవతారికలోఁ గలదు. అందతని వంశావతారము గలవు). గ్రంథము పేరతఁడుపెట్టినదే. (అతఁడు చెన్నపురి తిరువల్లిక్కేణి పార్థసారథిస్వామి భక్తుండని యూహింపనగును). అతనిని బట్టి కవి కాలము నిర్ణయింప వలనుపడినదికాదు. కవి తాను చోళ (తంజాపురమండల)ప్రభువగు తుళజరాజుచే సన్మానితుఁడ ననియున్నాఁడు కాని యీ తంజావూరు మహారాష్ట్ర ప్రభువులలోఁ దుళజ నామధేయు లిరువురు గలరు. ఒకరి రాజ్యకాలము క్రీ. శ. 1728 - 36. ఇంకొకరి కాలము క్రీ. శ. 1765 - 87. ఇతఁ డీ రెండవ తుళజరాజుకాలముననే యుండినాఁ డనియు, నితని గురువగు కస్తూరిరంగ కవి 1790 సం. ప్రాంతమునఁ దంజావూరి సంస్థానమం దుండినవాఁ డనియు ఆం. క. చ. (పుట 170 - 174). కస్తూరిరంగ కవి యానందరంగపిళ్ళై పేరఁ బ్రసిద్ధమగు రంగరాట్ఛందమును రచియించినవాఁడు. ఆనందరంగపిళ్ళై డూప్లే కడ దుబాసి. డూప్లే క్రీ. శ. 1742 - 55 సం. ల నడుమఁ బుదుచ్చేరిలో ఫ్రెంచి గవర్నరు *. అనఁగా రంగకవియు, నతని శిష్యుఁడైన కుప్పనయు 18 వ శతాబ్ది నడుమ నుండి రనుట నిశ్చయము.

* Vide, pages 12 & 255 of the Maratha Rule in the Carnatic

గ్రంథవిషయము :— కుప్పన తన కృతిలో భాగవత దశమ స్కంధము నంతటి నాపోశనము పట్టినాఁడు. ఇది సుమారు పదివేల గ్రంథము. మన యక్షగానములం దింతటి బృహద్గ్రంథము మఱిలేదు. ఇది రెండుభాగములుగా విభజింపఁబడినది. ప్రతిభాగము చివరను కృతిపతి ప్రశంసాపద్యములు, కవి స్వవిషయము కథానుక్రమణికయుఁ గల గద్యము నున్నవి. కవి దీనిని యక్షగాన ప్రబంధమని పేర్కొనినాఁడు. కాని యక్షగానముయొక్క రూపకప్రయోజన ముపేక్షింపఁబడినది. ప్రబంధముయొక్క కథా సంవిధాన ప్రక్లృప్తత్వమును గానరాదు. కథాకథనవిధానము పురాణధోరణినిబట్టి పోయినది. రచనమాత్రము రాను రాను ప్రబంధోచితముగా రూపొందినది. అతి దీర్ఘవృత్తములు, నాఖ్యానశైలీ ప్రచురములు, వర్ణనా బహుళములు నగు నిట్టి యక్షగానములనుబట్టి యక్షగానము లన్నియుఁ బ్రదర్శన యోగ్యములు కావనియే కాక కొన్ని కవులచేతనే ప్రదర్శనోద్దిష్టములును గావని చెప్పవలెను. ఇందు తాళప్రధానములగు దరువులు, ద్విపదలు, వచనములు, కొలఁది పద్యములు, అర్ధచంద్రికలు, కోలాటవర్ణములు, నలుగుపాట, ఊంజలు, (ఊయెలపాట), దండకము మొదలగునవి గలవు.

దరువులలో సంభాషణలు, ద్విపదవచనములలోఁ గథాకథనమును గలవు. వర్ణనలు మూఁడిటను గలవు. పోతన రచన కనుకరణములును గలవు.

# 26. పిన్నబయలాచార్యులు

## గొడగూచి చరిత్ర: ♦

గ్రంథము "శ్రీ మజ్జగద్గురు నిరంజన చరణకమల సేవా పరాయణ వీరార్యాత్మ సంజాత మాళిగార్య తనూభవ భవ పరాఙ్ముఖ పిన్నయలాచార్య ప్రణీతం" బని యున్నది. గ్రంథారంభమున సుగుణనగర (సుగుటూరు) నిరంజన నృసింహార్య గురువు స్మరింపఁబడినాఁడు. ప్రతిచివర "విరోధికృతు సంవత్సరం చైత్ర శుద్ధ (7 వరకు దేవండపల్లి తాలూకాసుబా, సుగుటూరీశాన్యభాగం వీధింటి నారణప్పగారి కుమారుఁడు శివరామప్ప" యనియు, నిది "శ్రీ శృంగేరీ సచ్చిదానంద భారతీంద్రస్వాముల చరణారవిందములకుఁ బ్రీతిగా వ్రాసిన గొడగూచి చరిత్ర" యనికలదు. దేవండపల్లి తాలూకా బెంగుళూరు జిల్లాలో, శృంగేరి కడూరు జిల్లాలోను గలవు. రెండును మైసూరు రాష్ట్రమునఁగలవు. శృంగేరీ పీఠ గురు పరంపరలో సచ్చిదానంద భారతులు ముగ్గురు గలరు. వారికాలములు వరుసగా— క్రీ. శ. 1633 - 1663, 1705 - 1741, 1770 - 1814 * ఇందు రెండు మూఁడవ వారి కాలమున మాత్రమే విరోధి కృత్తు 1731, 1791 లలోఁ బడుచున్నది.

అడయారు దివ్యజ్ఞానసమాజ గ్రంథాలయములోని జి. నం. 74862 శతకంఠ రామాయణ యక్షగానము ప్రతివిలేఖకుఁడు "బమ్మ్రళ్లి

---

♦ అడయారు దివ్యజ్ఞానసమాజ గ్రంథాలయమున నొక సమగ్రప్రతిగలదు. ఆలమర నం. 32, యఫ్ 33, జి. నం. 74907.

* చూ. మైసూరు గెజటీరు సం. 1 — పుట 307 లోని శృంగేరీ మఠగురుపరంపర.

నారణప్ప కుమారుఁడు రామప్ప". ఈప్రతి విలేఖన కాలము శుక్ల పుష్య బ 13 శుక్రవారము. ఇది క్రీ. శ. 2-2-1810 తేదీకి సరిపోవు చున్నది.

ఈ శ. క. రా., గో. చ. ల ప్రతి విలేఖకులు పితృ నామ సామ్యమునుబట్టి సోదరు లగుదురు. పై శ. క. రా. ప్రతి విలేఖన కాలమును బట్టి యీ సోదరులు 1800 సం. కావల నీవలఁ గొన్నియేండ్లు పాటుండి యుందురని యూహింపనగును. గో. చ. ప్రతి మూఁడవ సచ్చిదానంద భారతి కాలమున 1791 లోఁ బడిన విరోధికృత్సంవత్సర చైత్రమున లిఖింపఁబడియుండును. గ్రంథమంతకు ముందునాఁటిది కావలెను. గ్రంథకర్త నృసింహార్య గురునిఁ బేర్కొనెను. అతఁడు మూఁడవ సచ్చిదానందభారతికి ముందు క్రీ. శ. 1767-1770 సం. ల నడుమ శృంగేరీ మఠాధిపతియగు నరసింహభారతి కావచ్చును. గ్రంథ రచనాకాల మా ప్రాంతమునఁబడుననియు గ్రంథము మైసూరు రాష్ట్రమునకుఁ జెందినదనియు ననవచ్చును.

గ్రంథ విషయము :— శివలింగముచేఁ బాలు ద్రావించిన మహాభక్తురాలగు గొడగూచి కథ యిందు వర్ణితము. గొడగూచి కథ బసవపురాణమునఁగలదు. ఇది వీరశైవ వాఙ్మయ శాఖకుఁ జెందునట్టి రచన. యక్షగాన మని పేర్కొనఁబడినది. ఇందు ప్రసిద్ధ తాళ ప్రధానములగు దరువులతోపాటు రాగప్రధానములును గలవు. ద్విపదలు, వచనములు, పద్యములు, ఏలలు, అర్ధచంద్రికలును గలవు. ఒక్కచో రెండు ముక్కలు కన్నడమును వాడఁబడినది. చేవగల రచన కాదు. శివకవిగ్రంథసామాన్యమైన దోషములు గలవు.

---

# 27. నుదురుపాటి వెంకన

## పార్వతీకల్యాణము: *

ఆం. సా. ప. లో నున్న యీయక్షగానము 'ఉద్దండకవి' లేక 'మహోద్దండ బిరుద ప్రశస్తుండైన వెంకనకవీంద్రుఁడు' రచించినదిగా మాత్రము తెలియుచున్నది. ఇతఁడే పుదుక్కోట ప్రభువగు కోటిరాయ రఘునాథతొండమాన్ ఆస్థానకవియైన నుదురుపాటి వెంకన యని తెలియుచున్నది. ఇతని తండ్రియగు సీతారామార్యుఁడు 'మహోద్దండ కవి బిరుద ప్రశస్తు' డని వెంకన యాంధ్రభాషార్ణవమునుండి యెఱుఁగ నగును. వెంకనయు 'ఉద్దండవిద్వత్కవితాంకనుండు' (చూ. ప్రా. లి. పు. భాం. డి. సం. 1992 - అతని బృహన్నాయికా దండకము) కోటి రాయ రఘునాథ తొండమాన్ రాజ్యకాలము 1769–89, (చూ. డా. నేలటూరి వెంకటరమణయ్యగారి దాక్షిణాత్యాంధ్ర సాహిత్యము—పుట 58). ఈ వెంకనకవి కాలమదే యగును. ఇతఁడు బహుగ్రంథకర్త. అందు ప్రసిద్ధ మాంధ్ర భాషార్ణవము.

ఈ పా. క. గ్రంథవస్తువు సుప్రసిద్ధము, కాని యెలఁతి యెలఁతి మార్పుల నవధరించినాఁడు గ్రంథకర్త. అవి కామదహనఘట్టము పరిహరించుట, శివుఁడు వృద్ధవిప్రుని రూపమునఁ బార్వతినిఁ బరీక్షింప వచ్చుట మొ. ఇందు ప్రసిద్ధరాగతాళములలో ననేక కీర్తనలు గలవు. అన్నిటికిని పల్లవి, అనుపల్లవియు నేర్పరింపఁబడినవి. ద్విపదలు, చిన్న

* ఆం. సా. ప. నం. 166 ఊత్తుక్కాడునుండి సంపాదితమైన దీని గ్రంథ లిపిప్రతి యొకటి డా. వి. రాఘవన్ గారికడఁ గలదు. ఇది యూత్తుక్కాడులోఁ బ్రదర్శింపఁ బడుచుండెడిదని వారు చెప్పినారు.

చిన్న సంధివచనములు, కోలాట దరువులు, సువ్వాల, తలంటము శోభనము, ధవళము, నలుగుపాటలు, జోల, మేలుకొలుపు గలవు. సంస్కృతమునను కొన్ని కీర్తనలు, గొన్ని శ్లోకములు, నొక చూర్ణికయుఁ గలవు. వచనములో సంభాషణలు లేవు కాని సంవాద శైలి యెక్కువగనే పాటింపఁబడినది. ఒక్క సీసము తప్ప మాత్రపద్యములు లేవు. రచన సరళము, సరసము, జాతివార్తా చమత్కార సముపేతము, పాత్రోచిత వ్యాహారములలో నాటి వ్యావహారికపు నుడిగారమునకు నిండుదన మబ్బినది. శృంగారమునకు హాస్యము హంగుచేసినది. కథ రక్తికట్టినది.

ఇది పుదుక్కోట వాఙ్మయమునను య. గా. నకనలే పుట్టుగతులు లేకపోలేదని యెత్తిచూపుచున్నది.

---

# 28. మాతృభూత కవి

## పారిజాతాపహరణము :*

ఇది క్రీ. శ. 1787 - 1798 సం. ల నడుమఁ దంజావూరి నేలిన మహారాష్ట్ర ప్రభువగు అమరసింహున కంకితముగా నతని యమాత్యుఁడగు శివరాయ మంత్రి ప్రేరణమున మాతృభూత కవిచే

---

* తం. స. మ. కే. నం. 543

ఒక సూచన :— మదరాసు ప్రభుత్వ ప్రాచ్య గ్రంథ ప్రచురణ నం. IX అయిన అభినయ దర్పణ మను గ్రంథమునకుఁ గర్తయగు లింగమగుంట మాతృభూతనయు నీతఁడు నొక్కరే యని యా గ్రంథ పీఠికాకారులు వక్కాణించియున్నారు. అది యవిచారమూలకము. అ. ద. కర్త కాశ్యపగోత్రుఁడు. అతని తండ్రి మృత్యుంజయుఁడు. ఈ మాతృభూతన గోత్ర పితృ నామములు వేఱు. వివరములకు చూ. తం. స. మ. కే. పుట 223.

రచింపఁబడినది. ఇతని గోత్రము శాండిల్యము, తండ్రి రంగార్యుఁడు, ఇతఁడు త్రిశిరగిరి మాతృభూతేశ్వరస్వామి భక్తుఁడు.

గ్రంథ విషయము :— కడు పెద్దది. మొదట వరుసగా వినాయకుఁడు, కటికము, దాష్టిక పండితుఁడు నను పాత్రల ప్రవేశము. తరువాత పార్వతీ పరమేశ్వరుల ప్రసంగము ఈ పాత్రలకు గాని తత్ప్రసంగములకుఁగాని ప్రధాన కథతో నెట్టిసంబంధమును లేదు. అట్టివే యాతరువాత నున్న లీలావతి యను భోజకన్యావృత్తాంతము[1], భాషాదేవి గొల్ల కలాపమును. ఇవి యీ పారిజాత కథకు ముఖబంధములుగా నెందుకు రచింపఁబడినవో దురూహము ![2] పారిజాతాపహరణ ఘట్టమునకుఁ బిదప నిందున్న జలక్రీడలు-గోపికావస్త్రాపహరణ కథయు నట్టివే. దాని కిటఁ బ్రకరణము లేదు. పారిజాత కథతోఁ బ్రసక్తిలేని రాధ పాత్ర కిందు బ్రసక్తి గలదు. ఆ కథ కనుబంధప్రాయమైన పుణ్యక వ్రతకథ కిందు ప్రసక్తి లేదు. సవతి కయ్యము, సింగీ సింగళ్ళ ప్రసంగము లిందు గలవు. కాని యే కథలోనైన రక్తికట్టవలసిన పట్టు లవి యిందు రక్తికట్ట లేదు. భావములను, పద బంధములను, పద్య పాదములకుఁ బాదములనే తిమ్మనగారి పారిజాతాపహరణము నుండి గ్రహించిన మాతృభూతన యాయన సత్యభామ యలుక చిత్రించిన ఘట్టమును నాల్గు పుటలలో నడిపించియుండగా దాను ముప్పది పుటలుగా సాగఁదీసినాఁడు. తిమ్మనార్యునకు మూఁడాశ్వాసముల పై చిలుకు పట్టిన పారిజాతాపహరణ ఘట్టము నొక్కముక్కలోఁ దెమల్చివైచినాఁడు మాతృభూతన. ఈమార్పులు యక్షగానప్రాయ రచనలో సముచితము

---

1. ఇది ప్రా. లి. పు. భాం. డి. నం. 1886 దాదినీ వేష కథ యను నీలావతి విజయమును బోలియున్నది

2. ఇవి బహుశా ప్రతి విలేఖకుఁడు వ్రాసికొ యేవో గ్రంథాంతరముల భాగము లేమో.

లనియే చెప్పవచ్చును. కాని మొత్తముపైఁ గథను సమ్యక్సంవిధాన ముతో నాటకోచితముగా మలఁచలేకపోయినాఁడు కవి.

ఇది నాటక మని పలు తావులఁ బేర్కొనఁబడినది. ఏడంకము లుగా విభాగింపఁబడియుండుట విశేషము. కాని యంతమాత్రమే సంస్కృత నాటకానుకరణము. మఱి సూత్రధార ప్రసక్తియైనను లేదు. తక్కినదంతయు యక్షగాన ఫక్కికయే. సాధారణముగా ముందు పాత్ర ప్రశంసయుఁ దనుపరి పాత్ర ప్రవేశము దరువు నుండును. పాత్రల తెర మఱుఁగు ప్రసంగములు, మాధవి పలుకరింపులు, సవతి కయ్యము మొదలగునవి భామకలాపపు "బాణీ" నిఁ దలఁపింపఁ జేయును. సింగీ సింగళ్ల ప్రసంగములు కొరవంజి కోవను జ్ఞప్తికెలయించును. ప్రథమాంకాదియందును కృతిపతి నుద్దేశించియున్న 'అవధరింపు' మను నెత్తుగడయుఁ బ్రత్యంకాంతమందును గల గద్యలు, మధ్యనున్న సుదీర్ఘ వర్ణనలును ప్రబంధ ఫక్కిని దలఁపించును.

ఇందు సంస్కృతమున సుమారు పాతిక శ్లోకములు, నాలుగైదు చూర్ణికలు, గొలఁది తమిళ కన్నడ మహారాష్ట్ర భాషా ప్రసంగము లును గలవు. తెలుఁగున వచనములు తఱచు ద్విపదలు, దరువులు ('ఉత్తరాది దరువులు' గూడ - దరువులలోఁ గృష్ణుఁ డుద్దిష్టుఁడుగాఁ ద్రిశిరగిరి నిలయ సఖముద్ర తఱచు గన్పట్టును), పద్యములును గలవు. సీసములు సుమా రొక శతమానమున్నవి. అందు ప్రతిపాద సమతా పాదనముతోడి తూగు బాగుగ నున్నది. తలుపు పాట, నలుగు పాట, శోభనములు, గౌరీ కల్యాణము మొదలగునవి కలవు. రచన ప్రసిద్ధ పదములతో (కతి పయ ప్రయోగవిశేషములు గలవు), నాటకోచిత ముగా సరళమై యున్నది. భావము లా వృత్తియైనను నొక్కపట్టు ననే యొక్కపెట్టున సుళువుగా, ధారాళముగా, ఛందస్సుందర ముగాఁ బద్యములను గుప్పింపఁ గలఁడు కవి.

---

# 29. మెరట్టూరు వెంకటరామశాస్త్రి

ఆంధ్రులనాట్యకళా ప్రతిష్ఠకుఁ గూచిపూడి యెట్టిదో యటువలకు మెరట్టూరు (లేక మెలట్టూరు - అది తంజావూరికి సుమా రామడ దూరము) అట్టిది. మెలట్టూరు భాగవతమేళ నాటకములకుఁ బెట్టినది పేరు. భామకలాపాదుల విషయమునఁ గూచిపూడివారికిఁ గులపతి సిద్ధేంద్రయోగి. భాగవతమేళ నాటకముల విషయమున మెలట్టూరు వారికి వేంకటరామశాస్త్రి యట్టివాఁడు. ఈయన వెలనాఁటి తెలుఁగు బ్రాహ్మణుఁడు. ఇంటిపేరు తెలియదు. మెలట్టూరు వెంకటరామశాస్త్రి యని వ్యవహరించుటే పరిపాటి యైనది. ఈయన శ్రీవత్సగోత్రుఁడు, గోపాలకృష్ణార్యుని పౌత్రుఁడు, లక్ష్మణార్యుని శిష్యుఁడు, దేవీ నృసింహోపాసనములు చేసిన మహాభక్తుఁడు, నాట్య సంగీత సాహిత్య విద్యావిశారదుఁడు నని యాతని గ్రంథముల వలనను, స్థలజ్ఞులగు పెద్దల వలనను, అన్నికుడిగ్రామము (తంజావూరుజిల్లా, కుంభకోణము తా.) నందలి యాయన బంధువర్గమువారి వలనను దెలియవచ్చినది. ఆయన తన వార్ధకమున బ్రసిద్ధుఁడగు త్యాగరాజునకు సమకాలికుఁడైనట్లు ఆచార్య శ్రీ పి. సాంబమూర్తి, డాక్టరు వి. రాఘవన్ మొదలగు తమిళ దేశపుఁ బండితు లనేకు లనుచున్నారు. త్యాగరాజు కాలము క్రీ. శ. 1759 - 1847.* అనఁగా వెంకటరామశాస్త్రి 18 శ. నడుమను జివరను గూడ నుండి యుండునని యూహింప నగును. శ్రీ సుబ్బరామదీక్షితారుగారి 'సంగీతసంప్రదాయ ప్రదర్శిని' నిఁ బట్టి యితని కాలమింకను వెనుకకుఁబోవును. అందితఁడు తంజావూరి మహారాష్ట్రప్రభువులు, రెండవ

---

* చూ. శ్రీమాన్ వింజమూరి నరసింహాచార్యులవారి శ్రీ త్యాగరాజు చరిత్ర ఆంధ్రగ్రంథమాల ప్రచురణ, మదరాసు, 1934.

శరభోజి, శివాజీల కాలమున నుండినట్లు గ౦దు. ఆరాజుల రాజ్యకాలములు వరుసగా క్రీ. శ. 1798-1833, 1833-55 దీనినిబట్టి వెంకటరామశాస్త్రి 19 శ. పూర్వార్ధమునను నుండినట్లు చెప్పవలెను.

## వెంకటరామశాస్త్రి కృతులు :

ఇతని నాటక కృతులుగాఁ జెప్పఁబడునవి పండ్రెండు :-

1. ప్రహ్లాద చరిత్ర.
2. రుక్మాంగద చరిత్ర.
3. మార్కండేయ చరిత్ర.
4. ఉషాపరిణయము.
5. హరిశ్చంద్ర.
6. సీతాకల్యాణము.
7. రుక్మిణీ కల్యాణము.
8. కంస వధ.
9. శివరాత్రి నాటకము.
10. సత్సంగరాజు నాటకము.
11. అసత్సంగరాజు నాటకము.
12. జగల్లీలా నాటకము.

ఇవియన్నియుఁ దెలుఁగున రచింపఁబడినవేనట. మొదటి యాఱును దెనుఁగువే యని చూచి తెలిసికొంటిని. కడమ యాఱింటిలో నన్నియు నితని కృతులగునోకావో, వానిప్రతులసలు దొరకుచున్నవో లేవో సరిగాఁ దెలియదు. అవి యంతగాఁ బ్రదర్శనలకెక్కి రాణించినట్లును దోఁపదు. ఈ గ్రంథము లన్నియు నముద్రితములు. కొన్నిటి ప్రతులు విడి విడిగా శ్రీ వి. రాఘవన్ గారివంటి వాఙ్మయ పరిశోధకుల యొద్దను, శ్రీ ఆర్. కల్యాణ రామయ్యర్ బి. ఏ., (మదరాసు) గారి యొద్దను గలవు.

తంజావూరు మండలమున మెలట్టూరు, శూలమంగళము ఊత్తుక్కాడు మొదలగు గ్రామముల చుట్టుపట్లను గొన్నిటి ప్రతులు లభింపఁగల వను నాశ గలదు. శూల మంగళము భాగవతులలో నొక

రును, ప్రస్తుతము మదరాసువాసులు నగు శ్రీ కల్యాణ రామయ్యా గారియొద్దఁ బై పట్టికలోని మొదటి యాఱింటి గ్రంథ లిపిప్రతులు గలవు. (అందలి ప్రహ్లాదచరిత్ర, ఉషాపరిణయములకు మాత్రము నేను మదరాసు ప్రా. లి. పు. భాం. లిపి పండితులచేఁ దెలుఁగు లిపిప్రతులు తయారుచేయించుకొంటిని. ఆ యఱవ దేశము ప్రతులు తప్పులతడకలు; తెలుఁగు శబ్దముల స్వరూపములే మారిపోయినవి. ప్రక్షిప్తములు హెచ్చు). సీతాకల్యాణము రుక్మాంగద చరిత్రల యసమగ్ర ప్రతులు మాత్రము తం. స. మ. నకుఁ జేరినవి. (కే. నం. 673, 582) ఆ సీ. క. గురించి కేటలాగులో 'కర్త తెలియదు' అనియున్నది గాని గ్రంథమునం దవతారికలోనే యిది '...లక్ష్మణాఖ్యాని కృపవల్ల...గోపాల కృష్ణయ్య కొమరుఁడై నట్టి వెంకటరాముండు...విరచించె' నని కలదు. రుక్మాంగదము ప్రతిలో గ్రంథకర్తృనామము గానరాదు కాని కల్యాణ రామయ్యరుగారు మెలట్టూరు వెంకటరామశాస్త్రి కృతియని చూపించిన రుక్మాంగద చరిత్రము ప్రతియు నసమగ్రమగు తం. స. మ. ప్రతియు నున్నంతమట్టున కొక్కటీరుగనే యున్నవి. తం. స. మ. లో నున్న "నానావిధ నాటకములు" అను రెండు కలగూరగంప సంపుటములలోఁ (కే. సం. 802, 803) బై పట్టికలోని మొదటి యాఱింటి పేళ్లను గల గ్రంథభాగములు చెదరుగా నున్నవి. అందుకొన్ని మె. వేం. రా. శాస్త్రి గ్రంథభాగములే. ఇవికాక తం. స. మ. లో "నాటకపాత్రలు" అను నింకొక గ్రంథము (కే. సం. 799) గలదు. అందు "రామాపండితుల నాటకాలు" అని పదమూఁడు నాటకముల పట్టిక యొకటి కలదు. ఆ రామాపండితుఁడే వేం. రామశాస్త్రి యగునో కాదో కాని యా పట్టికలో వేం. రా. శాస్త్రి నాటకముల పేళ్లుమాత్ర మైదు (రుక్మాంగదము, ఉషా రుక్మిణీ సీతా కల్యాణములు, శివరాత్రి నాటకము) కన్పడుచున్నవి.

వేంకటరామశాస్త్రి కృతులెల్లను నాటకములని పేర్కొనఁ బడినవి. అన్నియుఁ బ్రదర్శనయోగ్యములు. అందెక్కువగాఁ బ్రదర్శనల కెక్కి రాణించినవి. ప్రహ్లాద, రుక్మాంగద, మార్కండేయ చరిత్రములు, ఉషాపరిణయము, ఇటీవల హరిశ్చంద్ర. అందు ప్రదర్శనవిషయమునఁ బ్రహ్లాద చరిత్రము, రచనావిషయమున నుషాపరిణయమును గొప్పవందురు. ఇక్కడ ప్రతిగ్రంథమును బ్రత్యేకముగా విమర్శింపఁ బనిలేదు. అన్నియుఁ బ్రసిద్ధేతివృత్తములు. అన్నిట రచనాప్రక్రియయు నించుమించు చొక్క మాదిరిగనే యుండును. స్థూలముగాఁ దత్స్వరూపమిట నిరూపింపఁబడును.

ప్రతి గ్రంథారంభమునను గ్రంథనామ నిర్దేశకమగు కంద మొకటియుఁ బిమ్మటఁ గథాసంగ్రహము, కవి స్వవిషయము నుటంకించు ద్విపదయు నుండును. కథారంభమునకు ముందు గణపతిస్తుతి మాత్రమేకాక పాత్రప్రవేశ సందర్భముగూడ నుండును. సాధారణముగఁ బ్రతి పాత్రప్రవేశమునకును సూచనగా నొక సంధివచనము, పాత్రప్రవేశమునకును సూచనగా నొక సంధివచనము, పాత్రవర్ణన ద్విపద, ప్రావేశిక ధ్రువయు నుండును. కథా సంవిధానము తఱచు సంధివచనములద్వారా సూచింపఁబడును. సంధివచనాలేకాక పాత్రల సంభాషణవచనములు గూడ నక్కడక్కడ నున్నవి. కాని సంభాషణలు తఱచు దరువులు, దీర్ఘద్విపదలలోనే జరుగును. గ్రంథాంతమున మంగళము, ఫలశ్రుతియు నుండును. గ్రంథమున ద్విపదభాగము, దరువులు నెక్కువ. పద్యాలు ప్రసిద్ధవృత్తాలు, జాత్యుపజాతులు, తదర్థపద్యాలనఁగాఁ గందార్థాలు, కొలఁది సంస్కృత శ్లోకములు చూర్ణికయుఁ బ్రయుక్తములైనవి. దరువులు ప్రసిద్ధ రాగతాళముల లోనే కలవు. రాగాలు ఆహిరి, ముఖారి, ఉసేని, బిలహరి, మోహన, పున్నాగ వరాళి, పంతువరాళి, కల్యాణి, దేవగాంధారి, మధ్య

మావతి, సురటి, మొ॥. తాళాలు ఆది, చాపు, రూపకము మొ॥. ఆది తాళము వాడక మెక్కువ. సంగీతశాస్త్ర దృష్టితోఁ జూచినచో వేం. రా. శాస్త్రి కృతులలో గొప్ప విశిష్టత గోచరించును. అపురూపములగు రక్తిరాగము లెన్నింటికో చక్కని లక్ష్యములు రచించినాఁ డతఁడు. ముఖ్యముగా నాహిరినో ముఖారినో యెత్తుకొనెనా యొక్క రాగమునే విభిన్న సంచారములతో వివిధరసోత్పత్తి కుపయోగింపఁగలఁడు. అదొక గొప్ప నేర్పు. ఉశేని స్వరజతి నీతని ప్రతిభకొక తార్కాణముగాఁ జేకొందురు పెద్దలు. వెంకటరామశాస్త్రి కృతులన్నిట రచన రూపకోచితమైన సరళశైలిలో సాగిపోవును. నాఁటి తంజావూరు తెలుఁగువాడుక నుడికారపు సొంపులు నట నటఁ జిల్కరింపఁబడినవి వెం. రా. శాస్త్రి ప్రహ్లాదాది నాటకములు నేఁటికి నేఁటఁ బ్రదర్శింపఁబడుచున్నవి. తత్ప్రదర్శన ప్రక్రియ యొక విశిష్ట సంప్రదాయమునకుఁ జెందినది. (అది స్థలాంతరమందుఁ బ్రసక్తము).

---

# 30. కాకర్ల త్యాగరాజు.

త్యాగరాజ కృతు లనుసరి కతని భగవత్కీర్తనలే స్ఫురించును. అతని వ్యక్తిత్వము భక్తి, సంగీతము నను రెండు మహాప్రవాహముల సంగమక్షేత్రము. కాని యందుఁ గవితయు నంతర్వాహినిగాఁ బ్రవహించుచుండును. అతఁడు భగవన్నామకీర్తనలే కాదు తన్మహిమా ప్రతిపాదకములు, దత్కీర్తనసాధములు నగు కావ్యములుగూడ నొక మూఁడు రచించినాఁడు. అవి యక్షగానములని పేర్కొనఁబడలేదు

కానవాని రచనాప్రక్రియ యక్షగానప్రాయమైనదే. ఆయనవంటి ప్రశస్త వాగ్గేయకారుల సాహిత్య సృష్టికిఁ దగిన దాఁచనయే. కాని యతని కీర్తనల కున్న ప్రసిద్ధి యీ కావ్యముల కింకను రాలేదు. అవి సీతారామ విజయము, నౌకాచరిత్ర, ప్రహ్లాద భక్తివిజయము ననునవి.

త్యాగయ కృతులనుబట్టి యతని గుఱించి తెలియవచ్చు విశేషములు గృహ గురు పితృనామ నివాసములు మాత్రమే. ఇతరాధారములను బట్టి యతని చరిత్రమును దెలుపు గ్రంథములు మనకున్నానిలో ముఖ్యములైనవి: 1. శ్రీమాన్ వింజమూరి నరసింహాచార్యులు గారి శ్రీ త్యాగరాజు చరిత్ర 2. ఆచార్య శ్రీ విస్సా అప్పారావు గారి సంపాదకత్వమున వెలువడిన త్యాగరాజస్వామి శతవార్షికోత్సవ సంచిక, 3. శ్రీ పి. సాంబమూర్తిగారి 'Great Musical Composers of S. India'. వానినిబట్టి తెలియవచ్చిన విశేషములలో ముఖ్యమైనవి: త్యాగయ యింటి పేరు కాకర్లవారు. ఈ కాకర్లవారు ములికినాటి బ్రాహ్మణులు. భారద్వాజసగోత్రులు. త్యాగయ పితామహుఁడు గిరిరాజబ్రహ్మము. తండ్రి రామబ్రహ్మము. తల్లి శాంతమ. (సీతాంబ యని వాలాజీపేట చరిత్రలోఁ గలదని త్యా. శ. వా. సంచిక) త్యాగయ సంగీత గురువుగాఁ బ్రసిద్ధుఁడైనవాఁడు సొంఠి వేంకట రమణయ్య కాని త్యాగయ నౌకాచరిత్రమున శ్రీరామకృష్ణమోదాఖ్యునిఁ బురుషార్థదాయకుఁడగు తన దేశిక వరునిగా స్మరించియుండెను. అతఁడు త్యాగయకుఁ దత్త్వోపదేశము చేసిన గురువై యుండును. త్యాగయ నివాసము తంజావూరు మండలములోని తిరువయ్యారు. (అదే పంచనదము. త్యాగేశ్వరస్వామి క్షేత్రము.) జీవితకాలము. క్రీ. శ. 1759–1847.

## గ్రంథవిషయము

### సీతారామవిజయము:

ఇది వెనుక నెప్పుడో వాలాజ నగర్ లోక్ నారాయణశాస్త్రి గారిచేఁ బరిష్కృతమై ముద్రితమైనదని త్యా. శ. వా. సంచిక వలనఁ దెలియవచ్చినది. కాని నేఁడచ్చు ప్రతులుగాని, లిఖిత ప్రతులుగాని లభించుటలేదు. మదరాసు విశ్వవిద్యాలయ సంగీతశాఖాచార్యులు శ్రీ పి. సాంబమూర్తిగారది కడుహృదయంగమమైన కృతియని సెల విచ్చినారు.

### నౌకాచరిత్రము: [1]

గోపికావస్త్రాపహరణ మిందలి ప్రధానవిషయము. కాని కథా రంగము మారినది. నిమిత్తమును గ్రొత్తది. గోపికాకృష్ణులు యమునలో నౌకా విహారము సల్పుదురు. గోపికల గర్వభంగము నిమిత్తము కృష్ణుఁడు సంకల్పింపఁగాఁ దుపాను వచ్చును. నౌక కొక రంధ్ర మేర్ప డును. నాయకునకు వస్త్రాపహరణ దోషము తగులకుండఁగనే సంకల్ప సిద్ధి యగును. అదియొక యౌచిత్యము. గోపికల కిష్టము లేకున్నను గోకలు విడచుట తప్పనిసరియైనది. అదియొక చమత్కారము. మార్పు మనోజ్ఞము.

---

(1) దీని లిఖిత ప్రతులు ఆం. సా ప. (నం. 3807)' తం. స. మ. కే. నం. 483), ప్రాలి. పు. భా. (డి. నం. 1896), లగో గలవు. అసలిది యాఱు తడవలు ముద్రితమైనది. 1873 లో మంజూరపట్టు రామచంద్రశాస్త్రిగారిచే, 1885 లో సెవరో శేషాచలశాస్త్రిగారిచే, 1892 లో జ్యోతిష్మతీ ముద్రణాలయమున కీ. శే. వేదము వెంకటరాయ శాస్త్రులవారిచే, 1930 లో మదరాసు అమెరికన్ డైమండు ము. శా. వారిచే, 1949 లో మదరాసు సంగీత సభవారి పక్షమున శ్రీ పి సాంబమూర్తిగారి చేతను, అదే సం. న మదరాసు ఆది అంకుకోవారి చేతను బ్రచురింపఁ బడినది.

ఇందు పల్లవి, అనుపల్లవి. చరణముల వింగడింపుతోఁ గవి నామాంకిత ముద్రలతోఁ బ్రసిద్ధరాగ తాళములలోఁ జక్కని కృతులు, నలఁతి యలఁతి సంధివచన ప్రాయములైన గద్యపంక్తులును మెండు. ద్విపదలు, నక్కడక్కడ పద్యములునుగల వందులో శార్దూలముల వాడక మెక్కువ. అటనటఁ జిటిపొటి నెరసు లున్నను మిక్కిలి సరస మైనది రచన. త్యాగయ దీనిని బ్రదర్శన కుద్దేశించి యుండె ననుట సందిగ్ధము.

## ప్రహ్లాద భక్తి విజయము: [2]

ఇందలి వస్తువు ప్రహ్లాదునికథ. కాని యిందు హిరణ్యకశిపుఁడు, లీలావతి, చండామార్కులు మొదలగువారి పాత్రలకుఁ బ్రసక్తిలేదు. చివరికి నరసింహావతార ప్రసక్తియును లేదు. హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదుని బాధ పెట్టిన విషయము మాత్రము గ్రంథాది నించుక చెప్పఁబడినది. అంతే గ్రంథము గ్రంథ మంతయు హరినిఁ గూర్చిన ప్రహ్లాదుని గాఢమైన తపనయు భక్తి భావావేశమును గృతార్థతయు మాత్రమే ప్రధాన విషయముగా సాగినది. ప్రహ్లాదచరిత్ర నీరీతిగాఁ బాత్రైక ప్రధానముగా, బాహిరసన్నివేశముకంటెఁ బాత్రయొక్క యంతః ప్రవృత్తి తత్త్వోన్మీలనము ప్రధానముగా నిదివర కెవరును రచించియుండి నట్లు గానరాదు. త్యాగయ యాత్మీయతను బట్టియిచ్చు గ్రంథమిది. ఇందు ప్రహ్లాదపాత్రతోఁ దాదాత్మ్యమందిన త్యాగయభక్తి రసస్థితి నందుకొన్నది. ఆప్రహ్లాదచరిత్రము నతిమాత్ర మనోజ్ఞముగా రచించిన ప్రథమాంధ్ర మహాకవి భాగవత కర్త బమ్మెరపోతన. పోతరాజు పోకడలు త్యాగరాజునకుఁ దప్పని సరియైనవి.

2. ఇది 1868 విద్వన్మోద తరంగణీ ము. శా. లో, 1949 లో మదరాసు ఆది అందుకో వారిచేతను ముద్రితమై ప్రకటింపఁబడినది.

త్యాగయ గ్రంథ ప్రారంభమున దీనిని ప్రబంధమని పేర్కొని యున్నను దత్తాప పలుతడవలు నాటకమనియే వక్కాణించెను. ఇది "రాగతాళమృదంగ రవళిచే మిగులఁ నాగరికం బభినయముచేఁ జెలఁగు" నని ముందుగనే చెప్పియున్నాఁడు. గ్రంథ మైదంకములుగా విభాగింపఁ బడి యుండుట విశేషము. (గంథారంభము నందలి యిష్టదేవతాభి వందనాదికమే నాంది. దౌవారిక సూత్రధారుల ప్రసంగమే ప్రస్తావన, ఫలశ్రుతియే భరతవాక్యము ననుకొన్నచో దీన నాటకలక్షణము కొంత పట్టిన దనవచ్చును. అయితే యదిమార్గ నాటకప్రభావమును మాత్రమే సూచించును గాని నిక్కచ్చిగా నాఫక్కి కుపలక్ష్యభూతముగాదు. ఇందలి గణపతి ప్రార్థనమాత్రమే కాక పాత్రప్రవేశము, (దౌవారికుని కటికము వానివంటి) వాలకము, తెరవెడలు దరువు వంటి పాత్రప్రశంసాత్మక కీర్తనలు మొ. నాఁటి తంజావూరు య. గా. న నాటకములలోఁ గన్పట్టును. అంకవిభాగాది విశేషములు గూడ నందందు గానవచ్చును. కాని సంధి వచనముల నాశ్రయించు యక్షగానమున కంకవిభాగము సహజముకాదా యవసరమును లేదు. ఇందు నా యంకవిభాగము సార్థకముగాదు, సంధ్యంగోచితముగా లేదు. అర్థప్రకృతులకుఁ గార్యావస్థలకును సమన్వయము కుదురలేదు. కుదురుట కవకాశమే లేని యితివృత్త మైనది. ఇది త్యాగయచేఁ బ్రదర్శనోద్దిష్ట మైనదని విశదమైనది; సంవాద ప్రచుర మైనదే కాని సన్నివేశబలము చాలమి ప్రదర్శనమున రక్తికట్టదు.

ఇందు దరువులు, ద్విపదలు, గద్యపద్యములును గలవు. ఆ దరువులను గృతులనుట లెస్స. ఆ లక్షణము చక్కఁగాఁ బట్టినది. పది సం. శ్లోకములు, నొక చూర్ణికయుఁ దెలుఁగున నొక దండకమును గలవు. అనేక ప్రయోగ విశేషములు గలవు. కృతి యతిరసవంత మైనది.

# 31. శివాజీ

## అన్నపూర్ణా పరిణయము: *

తంజావూరి మహారాష్ట్ర ప్రభువులలోఁ జివరివాఁడును రెండవ శరభోజికొడుకు నగు శివాజీ కృతియిది. అతని రాజ్యకాలము క్రీ.శ. 1833 - 1855. గ్రంథము ప్రతి చివర నది జయనామ సంవత్సరము భాద్రపదమున లిఖింపఁబడినట్లు గలదు. అది శివాజీ రాజ్యకాలమున 1834వ సం. అగుచున్నది. శివాజీ సింహాసనస్థుఁడై యుండిన కాలముననే యీగ్రంథము రచింపఁబడినట్లు గలదు. అనఁగా నీగ్రంథ రచన క్రీ. 1833 - 34 సం. ల నడుమనే జరిగి యుండును.

తంజాపురమున సిద్ధపుష్కరిణి చెంతఁ దప మొనర్చిన కొంకణ సిద్ధుని కోర్కెపై శివుఁడటఁ గొంకణేశ్వరుఁడను పేర వెలసెను. సిద్ధ మిత్రుఁడగు సుశర్మయను వైశ్యునకు శివుని వరప్రసాదముగా సిద్ధపుష్కరిణిలో నొక కమలకర్ణికలో నొకయాఁడుశిశువు లభించును. ఆమెయే అన్నపూర్ణ. ఇది పూర్వకథ - సూత్రధారప్రోక్తము. ఇఁక నీ నాటక కథ లోని ముఖ్యవిషయము: ఆమె పెంపకము, తపస్సు, కొంకణేశ్వరునితోఁ బెండ్లి.

గ్రంథము నాటకమని పలు తడవలు పేర్కొనఁబడినది. నాంది, సూత్రధారపారిపార్శ్వకుల ప్రస్తావన, వసంత ప్రసక్తి, అంకవిభాగము (రెండు), భరతవాక్యప్రాయమైన రంగనాథ కవీశ్వరుని (శివాజీ ఆస్థాన కవికాబోలు) యాశీర్వాదము మొ॥ విషయములు ముందటి తంజావూరు నాటకములలోకంటె నిం దెక్కువగా మార్గనాటక ప్రభావమును

---

* తం. స. మ. కే. నం. 499.

ప్రస్ఫుట మొనర్చుచున్నవి. కాని మార్గనాటకములందు సూత్రధార ప్రసంగములు, ప్రస్తావన యందుఁ దక్క మధ్య మెతి కన్పింపవు. తంజాపూరి నాటకములు సాధారణముగా నడుగడుగున నతని కథానుసంధానక ప్రసంగములు లేనిదే నడువవు. అందును నీగ్రంథ మంతయు సూత్రధారుని ప్రలాపము వలె నున్నది కాని నాట్యకళా కలాపమిందంతగా లేదు. అయినను నిది ప్రదర్శనోద్దిష్టమైనదే. ఏలన "రంగభూమియందు నటింప జేస్తూన్నాము" అని దీని యెత్తుగడ. విఘ్నేశ్వర పాత్రె "ప్రత్యక్షంబుగా" ప్రవేశపెట్టబడినది. గ్రంథాంతమున నీనాటకపు వేషాల "నావనీసు" (Dramatics Personae) గలదు.* ప్రతివిలేఖకుని వ్రాతలో నగరిలో నొక భాగవతమేళ ముండినటును, నా మేళపు "సబనీసు" (Accountant) కడ నీ గ్రంథ మూల ప్రతి యుండినట్లును గలదు.

రచన :— గ్రంథము పెద్దది. సరుకు తక్కువ. ద్వితీయాంకము వివిధ స్తోత్రములు గలిగి విసువెత్తించుచున్నది. రచన పేలవము. తప్పులు కుప్పలు. దరువులు, కోలాట, గొబ్బి, చెండ్లాట, నలుగు, సువ్విపాటలు, కందార్ధ సీసార్ధములు, సుమారు 40 సం. శ్లోకములు, కొలది చూర్ణికలును గలవు. అన్యదేశ్యములు కొన్ని ప్రయోగింపఁబడినవి.

విశేషములు :— ప్రస్తావనలో శివాజీ ప్రశంస, వంశావతారమును గలవు. యతని యమాత్య దండనాయకులగు సదాశివరాయు

* ఇందీ నాటకమునవచ్చు పాత్రలు, నానాఁ డది ప్రదర్శింపబడినప్పు డాయా పాత్రలఁ ధరించినవారి పేళ్ళును గలవు. ఇది మన్మథ సంవత్సరము – ఆవణి నెలలోఁ, దయార్లైన ట్లిందు గలదు. అనఁగా నీనాటకము 1835 లోఁ ప్రదర్శితమైనదన్న మాట.

మంత్రి కృష్ణరాయుఁడు వరహేంద్రుఁడును ప్రశంసింపఁబడిరి. ఈ శివాజీ ప్రశంసాత్మకముగా నాల్గు సీసపద్య గ్రంథసంపుటములు తం. స. మ. లో నున్నవి. (కే. నం. 811 - 814)

# 32. వెంకటకృష్ణా జెట్టి

## శివపారిజాతము :

ఈగ్రంథము తంజావూరి మహారాష్ట్రప్రభువగు శివాజీ యాస్థానమున రచింపఁబడినది. గ్రంథరచనాకాలము శివాజీ రాజ్యకాలమగు క్రీ. శ. 1833 - 55 సం. ల నడుమఁబడుచున్నది. గ్రంథాంతగద్యలో సిది "శివాజీమహీపాలుని తెనుఁగుకవి వెంకటకృష్ణాజెట్టి కనకాజెట్టి చేసిన కవిత్వ" మని యున్నది. కాని యీగద్యకు ముందున్న మంగళములో "శ్రీ వెంకటుడ నే" నని చెప్పుకొనినాఁడు కవి. గ్రంథారంభమున నొకసీసములోఁదాను "కనకయ్య పుత్రుఁడ" నని చెప్పుకొనినాఁడు. కాఁగా "వెంకటకృష్ణాజెట్టి కనకాజెట్టి చేసినకవిత్వ" మనునది పొరపాటునఁ దారుమారై యుండునని యూహింపఁదగి యున్నది.

భగీరథునికోర్కెఁ జొప్పున శివుఁడు గంగను విడనాడెనని యాపె సోదరుఁడగు కపిలవిష్ణువు కోపించి శివునికిఁ బారిజాతముద్వారా గుణపారము నేర్పవలెనని సంకల్పించి నారదు నందులకు నియోగించును. చివరకు శివుఁ డామె నుపలాలించును. అది యిందలి ప్రధానవిషయము.

* తం. స. మ. కే. నం. 636—637

పారిజాత సన్ని వేశ ప్రధానమైనది కృష్ణకథ. పారిజాత కథలోఁ బ్రధాన సన్ని వేశము సవతికయ్యము. శివకథలోఁగూడ నా సన్ని వేశమున కవకాశ ముండుటచేతఁ బారిజాత వాసన దానికిని దగిలినది. కాని యిందు కవి సవతికయ్యపు సన్ని వేశమును గల్పింపలేదు సరికదా యున్నకథయందైనను సంవిధానమును జక్కఁగ దిద్దలేక పోయినాఁడు. రచన పేలవము, నీరసము, బహుదోషజుష్టమునై యున్నది. టప్పా దరువు, గీతార్థకందార్థాదు లిందలి రచనా విశేషములు.

---

# 33. ఎల్లయకవి

## చంద్రతారా విలాసము: *

సేలము మండలమున నుద్దండ మల్లసముద్ర మనుగ్రామమున నుండిన యాంధ్రవిప్రుఁడు, నాత్రేయ గోత్రజుఁడునైన రామభద్రుఁడను నాతనికి మల్లన, విశ్వనాథుఁడు నను నిరువురు పుత్రులనియు నందు విశ్వనాథునికిఁగాఁబోలు వేంకటాంబయందు దీ యెల్లయకవి కలిగినాఁడనియు గ్రంథారంభమునఁగలదు. కోలా శేషాచలకవి నీలగిరియాత్రలో (చూ. మదరాసు ప్రభుత్వప్రాచ్య గ్రంథమాలా ప్రచురణ నం. 29, పుట 20-21) నీయెల్లయ 'యీరోడు' నివాసి యనియు, నితఁ డొక సంత్రస్థాపకుఁడును వ్యాపార వ్యవహర్తయు నై యుండెననియు, 'సంగీతసాహిత్య

---

* ప్రతులు: (1) ప్రా, లి. పు. భాం. ఆర్. నం. 130- (2) డిటో డిటో నం. 204 (3) 171. (తారాశశాంక మనుపేర నున్నది) ఇందు 2, 3 ప్రతులలో గర్తపేరు కానరాదు. కానియవి యీకృతి ప్రత్యంతరములే.

విద్యాప్రవీణుండు గావునఁ దారా శశాంక ప్రభృతి కతిపయనాటక ప్రబంధంబులు శృంగారాది రసానుబంధంబులుగ రచియించి యున్నా వాఁడనియుఁగలదు. శేషాచలకవి నీలగిరియాత్ర 1846 – 47 సం. ల నడుమ జరిగినది. ఈ కావ్యమంత కించుక ముందు రచింపఁబడియుండును.

ఇందలి యితివృత్తము ప్రసిద్ధము. సుప్రసిద్ధమగు శేషము వెంకటపతి శశాంక విజయప్రబంధ సంవాదిగనే సాగిన దిందలి కథా రచనా ప్రణాళిక (అలతి మార్పు లొండు రెండుచోట్లఁ గలవు). అందలి రుచిమంతము లైన పద్యము లెన్నో మిక్కిలిగా ననుకరింపఁబడినవి. రచన సామాన్య మైనది. దోషము లధికము. సరసరచన గల పట్టులున్న వన్న నది శేషము వాని ప్రభావము. ఇందు ప్రసిద్ధ రాగ తాళములలో దరువులు, ద్విపదలు, గద్యపద్యములు, కందార్ధములు, సీసార్ధములు, ద్విపదార్ధములు, వృత్తార్ధములు, (వృత్తదరువులు) ఏలపదము, శోభనమును గలవు. అమరము, భర్తృహరి సుభాషితాదుల నుండి శ్లోకములు గ్రహింపబడినవి. గ్రంథము యక్షగానమని పేర్కొనఁబడినది.

---

# 34. మారుపెద్ది చెంగల్వరాయశాస్త్రి

## సుందరేశ్వర విలాసము:

ఈయన చెంగల్పట్టు మండలమున స్థిరపడిన యొక వెలనాటి తెలుఁగు కుటుంబమునకుఁ జెందిన వాఁడు. కౌశికసగోత్రుఁడు. తిరుమల రాయ పౌత్రుఁడు, వేంకటరాయ పుత్రుఁడు. క్రీ. శ. 1810 ప్రాంత

---

* Published By Prof. P. Samba Moorthy, The Indian Music Publishing House, Madras 1952.

మున మరకాణము సమీపమునమన్న పెరుంపేడు గ్రామమున జన్మించి నాఁడు. సంస్కృతాంధ్రములందును, భరత గాంధర్వము లందును గాకలు తీరిన పండితుఁడై చెయ్యారు జమీందారుల యాస్థాన సన్మానముల నందెను. అక్కడుండిన కాలముననే యాతఁడు వైద్యనాథుఁడను జమీందారు కోరికపై నీ సుందరేశ్వరవిలాస నాటకమును రచించెను. ఇతని రాకకుముందే చెయ్యారులోఁ గందస్వామి దేవాలయమున వల్లీనాటకము (తెలుఁగు రచన. అది యంతకుముందు తిరుప్పోరూరులోఁ బ్రదర్శింపఁ బడుచుండెడిది) ప్రదర్శింపఁ బడుచుండెనఁట; అది కూడ నీతని సుం. వి. నాటక రచనకుఁగొంత ప్రోత్సాహకమై యుండును. ఈయన తేది 28—2—1900న కాలధర్మము నొందెను. సుం. వి. అక్షయ వత్సరచైత్రమున రచింపఁబడినట్లు గలదు. చెంగల్వరాయశాస్త్రి జీవిత కాలమున (1810—1900) అక్షయ 1826 అగుచున్నది. అది చెయ్యారులో బ్రహ్మోత్సవసమయమునఁ బ్రదర్శింపఁ బడుచుండెడిది. *

మధురమీనాక్షి సుందరేశ్వరుల వివాహమిందు వర్ణితము. ఇందు ప్రసిద్ధరాగ తాళములలో దరువులు, కీర్తనలు ద్విపదలు, గద్య పద్యములును గలవు. గ్రంథమధ్యమునను సూత్రధార ప్రసంగములు (పద్యములలోఁగూడ) గలవు. పాత్రల సంభాషణలు తఱచు, నాటక మని పేర్కొనఁబడినది. నాటకీయత ప్రస్ఫుటముగానున్నది. రచన సలక్షణమైనది, చక్కనిదే.

---

* ఈవిషయములు సుం. వి నుండియు, దానికి శ్రీ పి. సాంబమూర్తిగారి యుపోద్ఘాతమునుండియు, చెంగల్వరాయశాస్త్రి కృత్యంతర మగు చారులీలావిలాసము (ప్రా. లి. పు. భాం. ఆర్. నం. 1052) నుండియు గ్రహింపబడినవి.

# 35. చల్ల నారాయణ కవి

## (వాయలూరి) పారిజాతము : *

కవిది యజుశ్శాఖ. కౌండిన్య గోత్రము. అతని పితామహుఁడు నారాయణప్పయ్య. తండ్రి రామయ. భార్య శేషమాంబ. చెన్నపుర ప్రళయకావేరిమధ్యమునఁ గల పంచవన్నె యగ్రహార మొకటి పేర్కొనఁబడినది. అది కవి నివాసము కావచ్చు. గ్రంథము పొన్నేరి సీమలోని (చెంగల్పట్టుజిల్లా) వాయలూరు జాగీర్దారు ప్రోత్సాహమున నాయూరి జనార్దనుని పేర రచింపఁబడినట్లున్నది. కవి తన విద్యాగురునిగా మాకు జెట్టి తిరుమలరాయనిఁ బేర్కొనెను. అతఁడు మాకుజెట్టికాక మాకు పెద్ది తిరుమలరాయఁడగుచో సుందరేశ్వర విలాసకర్తయగు చెంగల్వ రాయశాస్త్రి తండ్రియగును. చెంగల్వరాయశాస్త్రికాలము క్రీ. శ. 1810-1900 అని మీఁదఁ బేర్కొనఁబడినది. అగుచో నీ రచన 19 శ. పూర్వార్థమున జరగియుండు ననవచ్చును. రచనాధోరణినిబట్టిచూడ నిది 19 శ. పూర్వభాగ రచనవలెనే తోఁచుచున్నది. ఇప్పటి కిదియొక యూహా మాత్రము.

గ్రంథము "పారిజాత నాటకాలంకార కావ్య శృంగార ప్రబంధ" మని పేర్కొనఁబడినది. రెండాశ్వాసములుగా విభాగింపఁబడినది. ప్రథమాశ్వాసమునఁ బ్రధానవిషయము రాధా మాధవుల సరసము. అష్ట మహిషులును కృష్ణుని వెదకికొనుచు నొకరి తరువాత నొకరుగా వచ్చి ప్రసంగించుట, తదుపరి నారదుఁడు పారిజాతమును దెచ్చుట మొ॥ ద్వితీయాశ్వాస విషయము. పాత్రల ప్రవేశమునకు

* ఆం. సా. ప. నం. 1650. అసమగ్రము.

ముందు ప్రావేశిక ధ్రువాగాన మిందుఁగలదు. మాధవి పాత్రలను బలుకరించుటయు వారి యుదంతము చెప్పించుటయుఁ గలదు. ఇది భామకలాపము "బాణీ". ఆశ్వాస విభాగము, నాశ్వాసాంతగద్యయు ప్రబంధ ఫక్కిని సూచించుచున్నవి. ఇందు ద్విపదపాలెక్కువ, పద్యము లక్కడక్కడఁగలవు. దరువులెక్కువగా నాదితాళములోఁ గలవు. దరువులందు వాయలూరి గోపాలముద్రగలదు. అక్కడక్కడ సం. శ్లోకములు నొక్కచోఁ జూర్ణికయుఁగలవు. రచన యొకమోస్తరు. దోషములు బోలెడు.

---

# 36. నెడాదూరు వేంకటాచార్యకవి

## సమగ్ర రామనాటకము :*

కవిది శ్రీవాత్స గోత్రము. తండ్రిపేరుగూడ వేంకటాచార్యుఁడే. నివాసము తిరుచునాపల్లి జిల్లా యాగపురము. (కులిత్తలై తాలూకా).

ఈతని గ్రంథమున రామాయణము షట్కాండలును బ్రతివిషయము ననవసరమైన పెంపుడు లేకుండా సంగ్రహముగాఁ జెప్పఁబడినది. కథాకథనమునఁగాని రచనలోఁగాని కసయును లేదు; పసయును లేదు. సంవాదాఖ్యానశైలు లిరుగు పొరుగుగా నడచును. ఇది నాటక మహా ప్రబంధమని పేర్కొనఁబడినది. వివిధ ప్రసిద్ధ రాగతాళములలో బల్లవి — అనుపల్లవులతో దరువులు, ప్రాసవచనములను నొక రచనా విశేషము—ఈ రెండిఁటి తోడనే గ్రంథమంతయు సాగినది. ఇది పురాణ గోష్ఠికిఁ దగియున్న రచన.

---

* ప్రచురణ: నే. వెంకట సుబ్బాశాస్త్రులవారి సరస్వతీ విలాస ము. శా. మదరాసు, 18—10—1876

# అనుబంధము

## ( 2 )

1. తం. స. మ. కే. నం. 799 "నాటకపాత్రలు" అను గ్రంథ సంపుటమునఁగొన్ని నాటకముల పట్టిక, పాత్రలు, పాత్రధారుల పేళ్లు నుదాహరింపఁబడి యున్నవి. అందు —

### (అ) రామాపండితుల నాటకాలు

1. ప్రబోధ చంద్రోదయము.
2. ప్రభావతీ ప్రద్యుమ్నము.
3. సీతా కల్యాణము.
4. పార్వతీ కల్యాణము.
5. రుక్మిణీ కల్యాణము.
6. ఉషా కల్యాణము.
7. రుక్మాంగద చరిత్ర.
8. యయాతి చరిత్ర.
9. ధ్రువ చరిత్ర.
10. శమంతకోపాఖ్యానము.
11. అనసూయోపాఖ్యానము.
12. శివరాత్రి కథ.
13. జానకీసుఖోల్లాస కొరవంజి

### (ఆ) దొరవారి నాటకాలు

1. మాయావతీ పరిణయము.
2. మిత్రవిందా పరిణయము.
3. సుభద్రా కల్యాణము.
4. శాకుంతలము.
5 పారిజాతాపహరణము.
6. కృష్ణ జననము.
7. కృష్ణ దాన చరిత్రము.
8. ప్రతాప రామ కొరవంజి.
9. మోహినీ మహేశ్వర నాటకము.

ఈ రామా పండితుఁడెవ్వరో, యీ దొరగారెవ్వరో, యిద మిత్థమని తెలియవచ్చినది కాదు. (అ) పట్టికలో మెలట్టూరు వెంకట రామశాస్త్రి నాటకముల పేళ్లు కొన్ని కన్నట్టుచున్నవి. అందలి ప్రబోధ చంద్రోదయాదుల పాత్రధారుల పట్టికలలోఁ గానవచ్చు గురువయ్యా కృష్ణుఁడు, శుప్పు, సుందరం మొ॥ వారి పేళ్లు తం. స. మ. కే. నం. 499 - శివాజీ అన్నపూర్ణా పరిణయ నాటకము వేషాల "నావసీను" లో గూడఁ గన్పట్టుచున్నవి. అనఁగా నీ దొరగారు 1833 - 55 సం. లలో తంజావూరు మహారాష్ట్ర ప్రభువగు శివాజీ యగునేమో యనియు, నా రామా పండితుఁడు శివాజీ కించుక పూర్వుఁడో సమకాలికుఁడో యైయుండిన మెలట్టూరు వెంకటరామ శాస్త్రి యగునేమో యనియు ననుమానము తోఁచుచున్నది.

విశేషములు :— పై పట్టికలలో ప్రబోధ చంద్రోదయము, సీతాకల్యాణము, ఉషా కల్యాణము నను వానికి మాత్రము పాత్రధారి నామోదాహరణము గలదు. అందు స్త్రీపాత్రల కెదురుగఁ బురుష నామములే గలవు. ప్రబోధచంద్రోదయమునందు 6 అంకాలు, 124 వేషాలు. ప్రభావతీ ప్రద్యుమ్నము మూఁడు దినముల సంవిధానముగా వింగడింపఁబడినది. యయాతి చరిత్ర రెండు. మోహినీ మహేశ్వర నాటకము నాలుగంకములది. పై పట్టికలలో రెండు కొరవంజు లుండుట గమనింపఁదగినది. ఇందలి భిన్న భిన్నేతి వృత్తములు గల గ్రంథములలోఁగూడ సామాన్యముగాఁ గనిపించు పాత్రలు గలవు. అవి విఘ్నేశ్వరుఁడు, ప్రమథ గణాలు, మణియం, కురుక్కళ్ళు, పరిచారకుఁడు, బిక్కాజి నాయఁడు, మహల్దారులు, సుయిణి, బురద వేషం, కైకాదినీ వేషం జోసి మొదలైన పై పాత్రలలోఁ గొన్నింటి స్వరూప మీనాఁడు మనయూహ కందదు. మన కలభ్యములగు నానాఁటి య. గా. నాటక గ్రంథములందుఁ గన్పింపవు. ఆయా పాత్రలు కొన్ని గ్రంథ

గతములు గాక ప్రదర్శన వేళ మాత్రమే ప్రవేశపెట్టఁబడున వని యూహింపఁదగి యున్నది. మీఁద బేర్కొనఁబడిన వానిలోఁ మొదటి నాలుగైదు పాత్రలు నాటక పూర్వరంగ ప్రవర్తన కుపయోగపడునవి. అందు "మణియం" అనఁగా మఠ దేవాయతనాద్యధికారి, కురుక్క- ళనఁగాఁ బూజారి లేక పురోహితుఁడని యర్థము. (ఆ రెంకును తమిళ శబ్దములు). ఈ రెండు పాత్రలు నీ యిఱువది నాటకములలోను గన్పిం చును. బిక్కాజినాయని పాత్ర తొమ్మిదింట గన్పించును. ఆ బిక్కాజి శబ్దమున కర్థ మేమోగాని కటికమువంటి పాత్రయై యుండు నేమోయని యూహ వొడముచున్నది.

2 – తం. స. మ. కే. నం. 802, 803 - నానావిధనాటక ములు :— ఇది యొక పెద్ద కలగూరగంప సంపుటము. ఇందు తలయుఁ దోకయు లేక, యున్నదైనను నొక పొందికలేని యందదుకుల వివిధ నాటకభాగములు గలది. అవి ప్రహ్లాద, హరిశ్చంద్ర, మార్కండేయ, రుక్మాంగద, పారిజాతము, కృష్ణలీలా విలాసము, సీతా కల్యాణము, పార్వతీ కల్యాణము, ఉషా పరిణయము. తం. స. మ. కేటలాగులో నుదాహరింపఁబడిన గ్రంథభాగములే కొన్ని. వానిసంబంధ మీ దిగువ సూచింపఁబడును.

ఇందలి రుక్మాంగదము — కే. నం. 578, 579, 582.
,, సీతా కల్యాణము- ,, ,, 673.
,, కృష్ణాలీలా విలాసము ,, ,, 507, 508.

ఇందు చెదురుగా నున్న పారిజాత గ్రంథ భాగములకు కే. నం. 543 మాతృభూతన పారిజాతముతో భావ బాంధవ్యము చాలఁగలదు. చెదురుగాఁ గాక యొక్కచో నొక క్రమము ననుసరించి యున్న 150 గ్రంథముల పరిమాణము గల పారిజాతాము నారాయణ

తీర్థుల కృతి. ఇందలి సీతాకల్యాణ, రుక్మాంగదములను మెలట్టూరు వెంకటరామశాస్త్రి గ్రంధభాగములుగా గుర్తింపసగును. హరిశ్చంద్ర మార్కండేయాది గ్రంధ భాగములును గొన్ని యతనివే కావచ్చును.

3. ఆంధ్ర వాఙ్మయ సూచికలోఁ గల తం. స. మ. యొక్క యముద్రిత యక్షగానముల పట్టికలో నుదాహరింపఁబడినవానిలో నేఁ డుపలబ్ధములుగానివి, కేటలాగులోఁ జేర్పఁబడనివి :—

1. అనసూయోపాఖ్యానము.
2. కుశలవ కథ.
3. కొరవంజి — (ముద్దుకవి)
4. గంగావిశ్వేశ్వర పరిణయము.
5. గణేశ కల్యాణము.
6. గణేశ లీలార్ణవము.
7. గణేశవిలాసార్ణవము (కొరవంజి)
8. జలక్రీడ — (లింగోజీ)
9. జానకీ సుఖోల్లాస కొరవంజి. *
10. ధ్రువచరిత్రము.
11. నటేశ విలాసము.
12. నారద గర్వభంగము.
13. ప్రభావతీ పరిణయము.
14. మీనాక్షీ పరిణయము.
15. రత్నకేతూదయము.
16. రుక్మిణీ సత్యభామా సంవాదము. (లింగోజి)
17. విరాట్పురుష నాటకము.
18. శివరాత్ర్యుపాఖ్యానము.
19. శ్రీప్రతాపరామ కొరవంజి.*

ఇందు (*) గుర్తులతోఁ జూపఁబడినవి "నాటకపాత్రలు" సంపుటమున నుదాహరింపఁబడినవే. ఇందలి నారద గర్వభంగ మనునది ప్రతి విలేఖకునిచేఁ బొరపాటుగా "నారద గర్వభంగం నాటకం" అని పేర్కొనఁబడిన తం. స. మ. లోని కే. నం. 678 నారద గర్వభంగ వచన గ్రంథమే కాఁదగును. గణేశ కల్యాణ మనునది శహాజీదో, ఏకోజీదో యైన విఘ్నేశ్వర కల్యాణము కాఁదగును. (ప్రతి విలేఖకులొక గ్రంథమునకే తమ యిచ్చవొప్పున సదృశనామాంతరము

లను దగిలించుట గలదు. అనభిజ్ఞు లింకను నెన్నియో పొరపాటులకు బాల్పడుదురు). కే. నం. 542—పాంకవాజ్ఞాతవాసము ప్రతి ముఖపత్ర మున "విరాట్పురుష నాటకం" అని యున్నది.

4. తం. స. మ. కే. నం. 598 — వాద జయము ప్రతిలో "సత్యభామా కొరవంజి" యను గ్రంథముగూడ గలదని కేటలాగులో నుదాహరింపఁబడినది. అది తం. స. మ. కే. సం. 486 — ఎఱుకల కథ కాఁదగును. అందు సత్యభామకు కొరవంజి సోదె చెప్పుటయే విషయము.

5. తం. స. మ. కే. నం. 528 — జీవనాటకము. ఇది జీవనాట కము కాదు. జీవములేని నాటకము. ఇందొక సన్నివేశముగాని, పాత్రల సంభాషణగాని దరువులుగాని ద్విపదలుగాని కానరావు. ఆఖ్యాన శైలిలో వచనప్రచురముగా నడచిన రచన. ఎడనెడ సం. శ్లోకములు, వాని దిగువ వచనమునఁ దద్వ్యాఖ్యానమును గలవు. విషయము తత్త్వము. కర్తపే రిందు గానరాదు. మోక్షకాంత కల్యాణమని దీని నామాంతరము.

(కే. నం. 557, 558 ముక్తికాంతా పరిణయము వేఱు).

# 1. (ధర్మపురి) శేషాచలకవి

## (ధర్మపురి) రామాయణము:

(ప్రచురణ: వెస్టువార్డు, మదరాసు, 1934, కొండా శంకరయ్య, సికింద్రాబాదు, 1949

ఇతని నివాసము కరీంనగరు జిల్లా ధర్మపురి. కాలము క్రీ. శ. 1780 ప్రాంతము. కృత్యంతరములు నరసింహ నరహరి శతకములు. (చూ. గోలకొండ కవుల సంచిక. పూర్వకవి పరిచయము.) ఇతని రామాయణ యక్షగానము షట్కాండలును గలిగి ధర్మపురి రామాయణమను పేర తెలంగాణముననే కాక యావదాంధ్రమునను విశేష ప్రసిద్ధి వహించినది. అయితే అది యథాతథముగాఁ బ్రదర్శింపఁబడినట్లు మాత్రము గానరాదు. ఆంధ్ర దేశ రామాయణ వీథి నాటక ప్రదర్శనములం దిందలి దరువులు మాత్రము తఱచుగా గ్రహింపఁబడుట కద్దు. అది యెక్కువగా శ్రవ్యధోరణిని సాగిన రచన. అందు ద్విపద, పద్యములు, వచనము, ఏలలు మొదలగునవి గలవు గాని ప్రసిద్ధ రాగ తాళములలో సాగిన దరువుల పా లధికము. అందుఁ బాత్రల సంవాద సందర్భము లందున్నవి కొన్ని మిక్కిలి మనోహరములు. రచన సలక్షణము నిరాడంబర సుందరమునైనది.

---

## 2. రాపాక శ్రీరామకవి

ఇతఁడు పరకాల నివాసి యనియు, 1780 ప్రాంతము వాఁడనియు, అధ్యాత్మ రామాయణ కర్తయనియు గో. క. సం వలనఁ దెలియనగును. ఆంధ్రసాహిత్య పరిషత్తువారి పట్టికలో నం. 3549 గ్రంథ మధ్యాత్మ రామాయణమను యక్షగాన మనియు నది రాపాక లింగన పుత్రుఁడైన శ్రీరామకవిచే నూచర్ల రామామాత్యుని కోరికపై ఇల్లిందకుంట దేవుని కంకితముగా రచింపఁబడిన దనియుఁ గలదు. ఆపట్టికలో నం. 3429 గ్రంథము ఇల్లిందకుంట రామాయణ యక్షగానమని యున్నది. అది పైగ్రంథమునకే ప్రత్యంతరము గావచ్చును. కాని పరిషత్తులోఁ బట్టికలోఁగాక బీరువాలలోనే ప్రతియు లభింపక పోవుట శోచనీయము.

---

## 3. కానూరి వీరభద్ర కవి

**బసవ మహిమామృత విలాసము :** *

కవి విషయము :— కవి తనకు వియ్యాన యని నామాంతరము గలదని చెప్పినాఁడు. ఇతని తల్లిపేరు అక్కనాగమ్మ. తండ్రిపేరు తెలియదు. ఇతనికిష్ట లింగాదిక జ్ఞానోపదేశముచేసిన గురుఁడు గుడ్డద మారెయ్య. కృతి ప్రోత్సాహకుడు కొలనుపాక సోమేశ్వరస్వామి భక్తుడగు సీతారామశాస్త్రి. ఆస్వామికే యీకృతి అంకితము. కొలిపాక (కొలనుపాక నల్లగొండజిల్లాలో భువనగిరి తా. లో నున్నది.) కవి నివాసము.

---

* ప్రతి వివరము :— ప్రా. లి. పు. భాం. డి. నం. 1911

ఇతఁడిందుఁ బురాతన భక్తులను, బాల్కురికి సోమనాథాదులను బేర్కొ నిన తరువాత "మాకు స్నేహితులైన భక్తమాహేశ్వరులను సంస్తుతించితి నెఱుఁగవలెను" అని తన సమకాలికులను గొందఱిని బేర్కొని యుండెను. అందు ముఖ్యులు కందుకూరి మల్లికార్జునుని పుత్రుఁడైన బసవరాజు, బుద్ధిరాజు వీరేశు, కొమ్మరాజు శంకరుఁడు. అత్తలూరి పాపకవి తన చెప్పిన బసవపురాణమునఁ గందుకూరి మల్లికార్జున మంత్రిని, నతనిపుత్రుఁడైన బసవరాణ్మంత్రిని, బుద్ధిరాజు వీరనను తన కృతిపతి యగు కందుకూరి అమృతలింగముగారి వంశావతార సందర్భమునఁ బ్రశంసించి యుండెను. పాపకవికాలము "నూఱు సంవత్సరములకుఁ బూర్వమని చెప్పవచ్చు" నని ఆంధ్రకవుల చరిత్రమునఁ గలదు. కొమ్మరాజు శంకరుఁడు సుప్రసిద్ధులైన కొమ్మరాజు లక్ష్మణరావుగారి పెదతాతయు, శ్రీగిరి మల్లేశ వీరభద్ర శతకాది గ్రంథకర్తయు నగు రామలింగ కవికిఁ దాతయనియు నతఁడు క్రీ. శ. 1800 ప్రాంతమువాఁడు కావచ్చుననియు శతకకవుల చరిత్ర తెలుపుచున్నది. పై విషయములను బట్టి కానూరి వీరభద్రకవి 18 శతాబ్ది యుత్తరార్ధమున నుండెనను కొనుట సమంజస మనిపించుచున్నది.

ఈగ్రంథమున మొదట బలదేవ దండనాథపుత్రియైన గంగమను, దదుపరి బిజ్జలు నాస్థానమున దండనాథుఁడైన పిదప రాజసోదరి యగు నీలను బసవేశ్వరుఁడు వివాహమాడుట ప్రధాన విషయము. అతని మహిమయు నౌదార్యమును బ్రకటితములైన రెండు సన్నివేశములు గలవు. చివర శివైక్యసిద్ధి చెప్పఁబడినది. ఇది సంగీత ప్రబంధమని పేర్కొనినాఁడు కవి. ఇందు ద్విపద, దరువులు (కొన్నిటికి రాగము లుదాహరింపఁ బడినను గొన్ని తాళప్రధానములును గలవు), లాలి, సువ్వి, అల్కు, దండెయాడింపుఁ బాటలు, పద్యములు, వచనములును గలవు. రచన యొకమోస్తరు. నిర్దుష్టము గాదు.

# 4. చెల్వూరు సన్యాసి

## బసవ కల్యాణము: *

ఇతఁడు లావేరు శైవమఠమునకుఁ జెందినవాఁడు. గిరి మఠ మళియభగిచంద్రశేఖరుని శిష్యుఁడు. "తాను కానూరు వియ్యన్నగారి సత్కృతి, మానుగా బసవనామామృత విలాస, కథలలో బసవని కల్యాణమొప్పు, విధమంత చదువంగ విని సంతసించి" యాని యను మతిపై నీకృతి ఘటించినట్లు చెప్పినాఁడు. కానూరు వియ్యన - యనఁగా వీరభద్ర కవి కాలము 18 శ. ఉత్తరార్ధమని మీఁదఁ జెప్పబడినది. సన్యాసి యతని గ్రంథము నతని కొడుకు ద్వారన విని నాఁడనఁగా నప్పటికి వీరభద్ర కవి గతించి కొద్దికాలమై యుండును. అనఁగా సన్యాసి 1810 ఆప్రాంతమున నుండి యుండును.

సన్యాసి కవి వియ్యన కృతి జూచియే గ్రంథము రచించినను, రెండిటను ప్రధాన విషయ మొకటే యైనను బోలికలు లేవు. వియ్యన కృతిలో గంగమ వివాహము విపులముగా వర్ణితమై నీలమ పెండ్లి విషయము సంగ్రహింపఁబడినది. సన్యాసి కృతిలో నీలమ కల్యాణకాండయే యతి విపులముగా వర్ణితమైనది. ఇది యక్షగాన ప్రబంధమని పేర్కొనబడినది. ఇందు దరువులు, ద్విపద, పద్యములు, లయగ్రాహి, రెండేసి రగడలు, చూర్ణికలు, దండకములు, కొట్నములపాట, నివాళిపాట, శోభనము మొ॥ గలవు. రచన పేలవము దోషభూయిష్ఠము నైనది.

* ప్రా. లి. పు. భాం., ఆర్. నం. 464. కెటలాగులో నితఁడు "అనుమోద సన్యాసి" గా నమోదైనాఁడు. అది తప్పు. గ్రంథాంత గద్యలో "......కరుణాకటాక్ష వీక్షణ-అనుమోద-సన్యాసి నామ్న ప్రణీతంబైన ..." అను విసంధి లేఖనము జూచి తప్పుడువిరుపు విరిచి యదే కవి యింటిపేరని యపోహ పడినారు. కాని యతనిది చెల్వూరన్వయమని యవతారికలోఁ గలదు.

## 5. పరశురామపంతుల రామమూర్తి

కవి నివాసము వరంగల్లు సమీపముననున్న మట్టెవాడ. కాలము 1814 ప్రాంతమఁట. ఇతఁడు సీతారామాంజనేయ మను యక్షగానమును రచించెనఁట. (చూ. గో. క. సం.) గ్రంథ మలబ్ధము. ఈయన ప్రసిద్ధ వేదాంత గ్రంథమగు సీతారామాంజనేయ సంవాదమును రచించిన లింగమూర్తికవికిఁ గొడుకఁట. తండ్రిది పద్యకృతి. దాని కిది సంగ్రహమైన యక్షగాన రూప పరివర్తనము కాఁబోలు. ఇతని కృత్యంతరములు గురుచరిత్రము, వివేక సారము, అధ్యాత్మ రామాయణము.

---

## 6. యామిజాల శేషాచలపతి

ఇతని నివాసము మధిర తాలూకా నాగవరప్పాడు. కాలము 1814 ప్రాంతము. ఇతని యక్షగానకృతి రామాయణము. అముద్రితము. ప్రతి కంభము మెట్టులోఁ గవి వంశజులకడఁ గలదట. ఇతని కృత్యంతరము వసిష్ఠ జనక సంవాదము. (చూ. — గో. క. సం.)

---

## 7. ముద్దయ కవి

ఇతని నివాసము మంథెన. కాలము 1834 ప్రాంతము. మంథెన రామాయణమనునది యితని యక్షగానకృతి. అముద్రితము. ప్రతి మంథెనలో లభింపఁగలదఁట. ఆ ప్రాంతమునందుఁ బలువురు దీనిని గంఠస్థముచేసి పాడుచుందురఁట. (చూ. — గో. క. సం.)

---

## 8. మరింగంటి వేంకట నరసింహాచార్యులు

నివాసము నల్లగొండజిల్లా కనగల్లు. కాలము 1842 ప్రాంతము. ఇందిరాలభాగవత మనునది యితని యక్షగాన కృతి యఁట. తాలాంక నందినీ పరిణయము కృత్యంతరము. రెండు నముద్రితములు. ప్రతులు హైదరాబాదు లక్ష్మణరాయ పరిశోధకమండలిలోఁ గలవఁట. (చూ. — గో. క. సం.)

---

## 9. పండరి రామానుజరావు

నివాసము సిద్ధిపేటతాలూకా రామాయమ్మపేట. జననము 1830. మరణము 1908. ఇతఁడు గాంగేయచరిత్రమను యక్షగానమును రచించెనఁట. (అముద్రితము. ఇదియ నాకలబ్ధము) ఇతని కృత్యంతరములు: అహల్యా సంక్రందనవిలాసము, హనుమద్దశ తారమండలి. (చూ. — గో. క. సం.)

---

## 10. రూష్ఠానుపేట రత్నమ్మగారు

ఈమె రెడ్డికులజ. జన్మస్థానము ఇప్పటూరు. నివాసము పర్గి తాలూకా రూష్ఠానుపేట. కాలము 1847 - 1929. ఈమె శివకురువంజి

యను కృతిని రచించినదఁట. అది ముద్రితము నైనదఁట (కాని ప్రతి నాకలభ్యము) అది యక్షగానప్రాయ రచనమే యైయుండును. యీమె కృత్యంతరములు వేంకటరమణ శ్రీనివాస శతకములు, బాలబోధ, దశావతార వర్ణన. (చూ. — గో. క. సం.)

---

# 11. దీక్షితుల పాపాశాస్త్రి

ఈతనికాలము 1852 - 1892. ఇతని కృతి చెంచునాటకము. చూ. — గో. క. సం.) అలభ్యము. అది ప్రాయికముగా యక్షగానమై యుండును.

---

# 12. రామదాస కవి

రామదాస కవికృతములుగా, కురుమూర్తి వేంకటేశాంకితములుగా రెండు యక్షగానములు గన్పట్టుచున్నవి. — (1) తారాశాంకము (చంద్రా నారాయణశ్రేష్ఠి ప్రచురణ, సికింద్రాబాదు, 933) (2) భీమసేన విలాసము (వెస్టువార్డు ప్రచురణ, మదరాసు, 936). రెండిటను గవి తాను శ్రీ రాజా బలవంత సవ్వాయి ముక్కర రామభూపాలరావు బహద్దరుగారి పుత్రుఁడైన సీతారామ భూపాలు నాశ్రితుఁడ నని చెప్పుకొనెను. ఈ ముక్కర సీతారామ భూపాలుఁడు

నైజాం రాష్ట్రములోని ఆత్మకూరు సంస్థానాధిపతి. ఇతని జీవితకాలము క్రీ. శ. 1851 - 1905. (చూ. — గో. క. సం. లోని ఆత్మకూరు సంస్థాన చరిత్ర) కనుక నీ రామదాస కవి 19 శ. ఉత్తరార్ధమునం దుండెనని నిశ్చయముగాఁ జెప్పనగును.

ఇతని కృతులు రెండును ప్రసిద్ధేతివృత్తములు. భీమసేన విలాస మనఁగాఁ గీచకవధ కథ. తారా శశాంకమున నితఁడు శేషము వెంకటపతి పద్యములను గ్రహించినాఁడు. రెండును యక్షగానములని పేర్కొనఁబడినవి. రెండిటను చిటిపొటి దరువులు, వచనములు పాత్ర సంవాద ప్రచురములుగా నున్నవి. అక్కడక్కడ ద్విపదలు పద్యము "సభాకైవారము", సూత్రధారుఁడు పాత్రలను విచారించుటయుఁ గలవు. రచన యొకమోస్తరు.

(ఈ రెండు గ్రంథములందును గ్రంథ ముద్రణకుఁ దోడ్పడిన బుక్కా లక్ష్మయ్య పుత్ర ప్రశంసగలదు.)

---

# 13. గోవర్ధనం వెంకట నృసింహాచార్యులు

ఈయన జన్మస్థానము నల్లగొండజిల్లా మిర్యాలగూడ తాలూకా విభురామపేట. 1934 నాఁటి కీయన వయస్సు 80 సం. లు. (చూ. — గో. క. సం.) ఇతని యక్షగానప్రాయ రచనలు: అజామిళోపాఖ్యానము (ముద్రితము — శ్రీ సుజనరంజనీ ము. శా., కాకినాడ, 1898); గొల్లకలాపము (అముద్రితము — ఆం. సా. ప., నం. 3760). అజా

మిళోపాఖ్యానము నుండి యీయనగుఱించి తెలియనగు విశేషములు :-
శ్రీవత్ససగోత్రుఁడు. రామానుజాచార్య పుత్రుఁడు. ప్రతాపగిరి రాణ్మాహాత్మ్యము, జాంబవతీ చరిత్రము, శంకరగురూపాఖ్యానము, అంబరీష రసాభృద్విజయములు (?).

అజామిళోపాఖ్యానము జమలాపురపు వేంకటరావు, వలదు తిరుమలరావు దేశపాండ్యా పటువారీల (మధిరహాబు పేష్కారు తాలూకా, జడచర్ల జిల్లా మహబూబునగరు) ప్రోత్సాహమున రచింపఁబడినది. ఇందలి యితివృత్తము ప్రసిద్ధమగు భాగవతమునందలి యజామిళుని కథయే. గ్రంథము యక్షగానమని పేర్కొనఁబడినది. రచన చక్కనిది. ఇదుఁ బ్రసిద్ధ రాగతాళములందు దరువులు, పద్యములు, ద్విపదలు, చిన్న చిన్న వచనములు, అర్ధచంద్రికలు, కంద సీసార్ధములు, ఏకపది (మంజరి) యనునవి గలవు.

ఆం. సా. ప., నం. 3766 గ్రంథము గొల్లకలాపము కర్త "సుంకరి కొండయ్య" అని పరిషత్తువారి పట్టికలో నున్నదికాని యది పొరపాటు. సుంకరికొండయ్య గొల్లకలాపములందు సామాన్యముగాఁ గన్పించు నొకపాత్రమాత్రము. పై పరిషత్ప్రతిలోఁ గొండయ్యపేరు గల భాగమిపుడుత్సన్నమై యున్నది. కాని యందు 28 వ యాకు రెండవప్రక్క గ్రంథకర్త గోవర్ధనము వేంకట నృసింహాచార్యుఁడనియే యున్నది. కృతిపతి పాలకుర్తి నరసింహస్వామి. గొల్లభామ చల్లనమ్మ వచ్చి కృష్ణప్రశంస, రేపల్లెపురవర్ణనము జేసి, తర్క్రపాశస్త్యము, దమ కులాచారములు నుగ్గడించి జగమెల్ల గొల్ల యనుటకు సముద్రమథన కథను వివరించుట యిందలి విషయము. ఇందు దరువులు, వృత్తములు, ద్విపదలు, వచనములు, ఏలపదము, అమరశ్లోకోదాహరణములును గలవు. రచన సరసమైనది.

---

## 14. రంగరాజు కేశవరావు

కాలము 1858 – 1904. ఈయన య. గా. కృతి హనుమద్విజయము. (అముద్రితము. డా. శ్రీ బి. రామరాజుగారికడ నొక వ్రాత ప్రతిగలదు). విషయము ప్రసిద్ధము. రచన ప్రశస్తమైనది.

## 15. శ్రీరామకవచం కృష్ణయ్య

ఇతని జన్మస్థానము నల్లగొండజిల్లా నారాయణపుర సంస్థానము. కాలము 1863–1926. ఇతని యక్షగానకృతి భానుమతీ పరిణయము. అముద్రితము. అలబ్ధము (చూ.– గో. క. సం.).

---

## 16. మరింగంటి వేంకట నృసింహాచార్యులు

ఈయన ప్రసిద్ధుఁడగు మరింగంటి సింగరాచార్యుల వంశమువాఁడఁట. ఇందిరాల భాగవత యక్షగాన కర్తయగు వేంకట నరసింహాచార్యుల పౌత్రుఁడు కావచ్చును. ఇతని నివాసము కనగల్లు, కాలము 1884 ప్రాంతము, యక్షగానరచన అనిరుద్ధవిలాసము. (నాకలబ్ధము) (చూ.– గో. క. సం)

---

## 17. తాడిపర్తి లక్ష్మణదాసు

ప్రహ్లాద నాటకము:

ఇతనికి రజా అల్లి లక్ష్మణరాయుఁడని నామాంతరముగలదు. ఇతఁడు హైదరాబాదు రాష్ట్రమునందలి దేవరకొండ సీమ

కొండూరు పరగణా షాహబాదగ్రామసమీపమున నున్న సీతారామపురాగ్రహారవాసి. గాలి సూర్యనారాయణదాసుని శిష్యుఁడు. ఇతని కృత్యంతరములు తిరుమంగయాళ్వారు చరితము, వేంకటేశ్వర చరితము, నృసింహశతకము. ఇతఁడు తన ప్రహ్లాద చరితమున నీకథనే తనవలె యక్షగానముగా రచించిన తిరునారాయణాచార్యులను, యాదవదాసును బేర్కొని యుండెను. తిరునారాయణాచార్యులు 19 శ. మధ్యమునను, యాదవదాసు 19 శ. ఉత్తరార్ధమునను నుండిన వారు. (ఈ యిరువుర యుదంతమును ఆంధ్ర దేశ య. గా. కవుల ప్రకరణమునఁ జూచునది — పుటలు 139; 161). లక్ష్మణదాసు ప్రహ్లాద నాటకము 1882 లో మదరాసు ఆదికళానిధి ము. శా. యందు ముద్రితమైనది. కాఁగా నతఁడప్పటి వాఁడే యగును.

ఇతని ప్రహ్లాద చరితము యక్షగానమని పేర్కొనఁబడినది. ఇందు గ్రంథారంభమున నొక బైరాగి హిందుస్తానీ దరువు, "గంధర్వస్త్రీల వేషం కథ" యుఁ గలవు. పాత్రల తెరలోపలి దరువులు, తెర వెడలు దరువులు, హాస్యగాని పృచ్ఛలు, పాత్రలు స్వవిషయము జెప్పుట, సంధివచనములు, రంగప్రయోగ సూచనలును (ఉదా :— "వెడలె నరసింహదేవుఁడు — పెడబొబ్బ లిడుచు" అను దరువు "అంగున వుండే వారు చదువవలసినది" అని సూచన) గలవు. గ్రంథము సంవాద శైలీ ప్రచురమై నాటకీయతాప్రకృష్టమై యున్నది. కాని రచన ప్రౌఢమైనది కాదు. పోతరాజ భాగవతానుకరణ మిందు సమృద్ధిగనే యున్నది. ప్రసిద్ధ రాగతాళములలో దరువులు, పద్యములు, ద్విపదలు, వచనములలో సంధి-సంభాషణలు, తేవారములు, కందార్థములు, చూర్ణిక మొదలగునవి యిందలి రచనాంగములు.

## 18. కావూరి వెంకటరామకవి

**సత్యనారాయణ కథా సుధాలహరి :**

ఇతఁడు సుబా యిలాకా అశ్వారావుపేట నివాసి. లోహిత సగోత్రుఁడు. కావూరి బ్రహ్మసూరి పుత్రుఁడు. ఇతని కవితా గురువు కృష్ణ విజయ కర్తయైన చెఱుకుపల్లి గాంగేయ మహాకవియఁట. ఈ వెంకటరామకవి యార్యక్షత్రియుఁడు, నిమిషాంబా శతకకర్తయు, 19 శ. ననున్న యాధునికుఁ డనియు శతక కవుల చరిత్రవలనఁ దెలియు చున్నది. ఇతని స. నా. క. సు. లహరి 1885 లో మదరాసు వర్తమాన తరంగిణీ ము. శా. యందు ముద్రితమైనది. ప్రచురణ కర్త కొండపల్లి వేంకట శివయ్య గారు. ఈతనిని వెంకటరామ కవి స. నా. క. సు. ల. యందుఁ బ్రశంసించినాఁడు. కాఁగా వెంకటరామ కవి 1885 ప్రాంతమున నుండినాఁ డనుట నిశ్చయము.

గ్రంథ విషయము :- ప్రసిద్ధ మగు సత్యనారాయణ వ్రతకథ. కథలో సారము లేదు గాని రచన చక్కఁగనే యున్నది. ఇందు దరువులు, ద్విపదలు, శోహారాలు, పద్యములు, ఏలలు, రగడ, దండకము, చూర్ణిక, తేవారములు, కందార్థములు, సంధివచనములును గలవు. కవి దీనిని గేయప్రబంధ మని మాత్రమే పేర్కొనెను. కాని ప్రచురణ కర్తలచే నిది “సరస జనాంతఃకరణ సంచారణోచిత నృత్త గీత తాళాభినయ చతుష్టయ శృంగారంబుగ రచియింపఁబడిన యక్షగాన” మని పేర్కొనఁబడినది.

## 19. తిరునగరు పాపకవి

### హరిశ్చంద్ర మహారాజు చరిత్ర:

(ముద్రణ :— శ్రీ లక్ష్మీనృసింహ విలాస ము. శా., మదరాసు, సం. తెలియదు. వెస్టువార్డు, మదరాసు, 1941).

కవి నివాసము పట్టెము లేక వట్టెము. (మహబూబునగరుజిల్లా నాగర కర్నూలు తాలూకా). ఇతనిని పట్టెము పాపకవి యనియు వ్యవహరింతురు. ఇతని తండ్రి నరసింహ కవి. ఇతని కవితా గురువు చింతలపల్లి నృసింహ కవి. ఇతని కాలము 1873 - 1916 అనియు, తులాభార నాటకము, తిమ్మాజిపేట హరిశ్చంద్ర నాటకము, ఆనంద రామాయణము, సీతారామాంజనేయ శ్రీరామశతకము లనునవి యితని కృతులనియు గో. క. సం. వలనఁ దెలిసినది. ఇందు మొదటి రెండును య. గా. ప్రాయ రచనలు. రెండవది మాత్రమే లభించినది. ఏతత్కృతి ప్రోత్సాహకులు తిమ్మాజిపేట మిడిజిల్లి మల్లయ సెట్టి, బుక్కా లక్ష్మయ్య. గ్రంథవిషయము ప్రసిద్ధము. దరువులు, వచనములు నెక్కువ. సంభాషణలు ప్రచురముగా సాగినవి. సంధి వచనములు, పద్యములును గొలఁదిగాఁ గలవు. రచన బాగుగనేయున్నది. గ్రంథారంభమున రంభోర్వసుల రాక, సూత్రధారుని "సభా కైవారము", అతఁడు పాత్రలను బలుకరించుట, పాత్రలు స్వవిషయము జెప్పుట మొ. విశేషములు గలవు. కవి తన కృతిని శృంగార నాటకమని మాత్రము పేర్కొనియుండెను. ప్రకటన కర్తలు యక్షగానమనిరి.

# 20. పండరి విఠల రాయకవి

ఇతఁడు పండరి రామానుజరావుగారి పుత్రుఁడు. నివాసము రామాయమ్మపేట. (అది తండ్రి కాలమున. తదుపరి తిమ్మపురి కితఁడు మాఱినట్లున్నది గ్రంథములఁజూడ). జననము 1874, మరణము 1914 ఇతని రచనలు :— గజగౌరీ వ్రతము, శ్రీరామ విజయము, కౌసల్యా పరిణయము. ఈ మూఁడును యక్షగానములు, ముద్రితములు, తదితరము లముద్రితము లనేకమున్నవి. (చూ. — గో. క. సం.)

ఇతని య. గా. కృతులలో గజ గౌరీ వ్రతము, శ్రీరామ విజయము మాత్రమే లభించినవి. (మొదటిది కొండా శంకరయ్య ప్రచురణ, సికింద్రాబాదు, 1928. రెండవది చందా నారాయణ శ్రేష్ఠి ప్రచురణ, సికింద్రాబాదు, 1949). గజగౌరీ వ్రతమున గాంధారి మృద్గజ ప్రతిమతోఁ జేసిన వ్రతమునకే మురియుచుండ నర్జునుఁ డైరావతమును దెప్పించి కుంతిచే గజ గౌరీ వ్రతము చేయించిన కథ వర్ణితము. శ్రీరామ విజయముసందలి విషయము :— విశ్వామిత్రుఁడు తనకుఁ బ్రత్యేకముగా నమస్కరింప నేమఱిన యయాతిని జంపుమని శ్రీరామునిఁ బ్రోత్సహించుట — యయాతి నారదు నుపదేశమున నాంజనేయుని శరణుజొచ్చుట — హనుమద్రామ సంగ్రామము అది జగద్విలయ హేతువగుట — విశ్వామిత్రుఁడు విషణ్ణుడగుట — కౌసల్యాంజనీ దేవుల యాగమనముతో యుద్ధ విరమణము. గజగౌరీ వ్రతము తిమ్మపురి శౌరి కంకితము. శ్రీరామ విజయము రావూరి హరి కంకితము. శ్రీ. రా. వి. కృతి ప్రోత్సాహకుఁడు పొన్నగంటి గోపాలరావు. రెండిట దరువులు, పద్యములు, సంధి వచనములు, ముఖ్యరచనాంగములు; ద్విపద లతివిరళముగాఁ బ్రయుక్తములు, రెండిట

గ్రంథారంభమున రంభోర్వశుల రాకలు, పాత్రల తెరదరువులు మొ. గలవు. రచన రెండిటఁ బ్రదర్శనోచితముగ నున్నది. కాని నిర్దుష్టము గాదు.

---

# 21. శేషభట్టరు కృష్ణమాచార్యుఁడు

**రంభా నలకూబర విలాసము:**

(ముద్రణ: శ్రీరంగ విలాస ము. శా., మదరాసు, 1891,
ప్రచురణకర్త: అయితా వెంకయసెట్టి, సికింద్రాబాదు

కవి నివాసము నల్లగొండజిల్లా దేవులపల్లి తా. అడవి దేవులపల్లి. తండ్రి సింగరార్యుఁడు. కృతిప్రోత్సాహకుఁడు ధర్మాజీపేట నివాసి సిరిపురం రాజేశ్వర రాయుఁడు. గ్రంథకర్తయే స్వయముగాఁ బ్రచురణకర్తకు గ్రంథముద్రణ విక్రయాధికారము నిచ్చునట్లు చివర యట్టపై నొక ప్రకటన పద్యము గలదు. అనఁగా కవి గ్రంథప్రచురణ వత్సరమగు 1891 ప్రాంతమున నుండినాఁడనుట స్పష్టము.

గ్రంథవిషయము:— నలకూబర జననము—అతఁడు పెద్దవాఁడైన పిదప నొకనాఁడు నందనవనమున రంభను దారసిల్లుట—వారొకరి నొకరు వలచుట— విరహవేదన—సమాగమము. గ్రంథము యక్షగానమని పేర్కొనఁబడినది. ఇందు దరువులు (తెరదరువులుగూడ), ద్విపదలు, పద్యములు, విరళముగా సంధివచనములు, అచ్చటచ్చట 'ముచ్చట

అను పేరమూఁడు ముక్కల వచనమున బ్రాత్రల మాటలును గలవు. ద్వారపాలకుని పృచ్ఛలు, పాత్రల స్వవిషయోద్ఘాటనములును గలవు. రచన ప్రదర్శనోచితమైనది. నాతిప్రౌఢము. నాతిపేలవము.

---

## 22. గడ్డం రామదాసు

రామదాస కవి కృతములుగా, మిట్టదొడ్డిశౌరి కంకితములుగా నొక మూఁడు యక్షగానములు గన్పట్టు చున్నవి — కాళింగ (కాళీయ) మర్దనము [1], విప్రనారాయణ చరిత్రము [2], ప్రభావతీ విలాసము [3]. కాళీయమర్దన గద్యలో నీతఁడు కౌండిన్యసగోత్రుఁడు. బిచుకన పౌత్రుఁడు, రామాంబా చూచనల పుత్రుఁడు నని యున్నది. నో. క. సం. కవి పరిచయమును బట్టి యీ మూఁడు కృతులకును గర్త గడ్డం రామదాసని తెలియుచున్నది. అం దితని జన్మస్థానము సిద్ధిపేటయనియు (నివాసము మిట్టదొడ్డి కావచ్చును), నితఁడు పద్మశాలి కులజుఁడనియు, నాశుకవిరత్న బిరుదాంచితుఁడనియు ననేక కృతులు (23 పేర్కొనఁబడినవి) రచించినాఁడనియు, నితని కాలము 1878–1930 అనియుఁ గలదు.

ఇతని కాళీయమర్దన విప్రనారాయణ చరిత్రములు ప్రసిద్ధేతి వృత్తములు. ప్రభావతీ విలాసము నందలి కథ జైమిని భారతమునుండి

(1), (2) — మదరాసు వెస్టువార్డు వారిచే వరుసగా 1935, 1950 సం. లలోఁ బ్రచురితములైనవి.

(3) – చందా నారాయణశ్రేష్ఠి ప్రచురణ, సికింద్రాబాదు, 1950.

గ్రహింపఁబడినది. (ధర్మజుని యాగాశ్వమును బట్టి యర్జునునితోఁ బోరికిఁదలపడిన హంసధ్వజ మహారాజు పుత్రుఁడగు సుధన్వుని పత్ని ప్రభావతి). ఈ మూఁడు గ్రంథములందును గరువులు, కీర్తనలు, పద్యములు, అర్ధపద్యములు, ద్విపదలు, సంధివచనములు గలవు. తెరలోని పాత్రలు పృచ్ఛింపఁబడి స్వవిషయము నుగ్గడించుట, తెర వెడలుదరువులు మొదలగునవి యున్నవి. మూఁడింటను శైలి పాత్రసంవాద ప్రచురమైనది. ప్రసన్నమైనది. రచన ప్రదర్శనోచితమైనది. సలక్షణమైనది.

---

# 23. మద్దాల కాశీపతి

కవి విశ్వకర్మ కులజుఁడు. కాశ్యపసగోత్రుఁడు. కనకమాంబా నరసింహాచార్యుల పౌత్రుఁడు. కనకమాంబికా శాస్త్ర్యాచార్యుల పుత్రుఁడు. వీపూరి వెంకటార్యుని శిష్యుఁడు. ఇతని య. గా. ప్రాయ నాటక రచనలు :- శతకంఠ రామాయణము. (సికింద్రాబాదు కొండా శంకరయ ప్రచురణ), మైరావణ (లేక) హనుమద్విజయము, గయనాటకము (1891 లో ముద్రితమని ఆం. వా. సూ.). మొదటిది మాత్రమే లభించినది. కడమ రెండిటి ప్రతులును బ్రిటీషు మ్యూజియమ్ లైబ్రరీలో నున్నవి. ఇతని శతకంఠరామాయణమున దరువులలోఁ దరచు సికింద్రాబాదు సంగమేశ్వర ముద్రగలదు. ఆ సంగమేశ్వరుఁ డేతత్కృతిప్రోత్సాహకుఁడైన రాజారామయ శ్రేష్ఠి క్లిష్టదేవతము. రామయ్యశ్రేష్ఠి సికింద్రాబాదు నివాసియని యున్నది. 1895 లో చెన్నపురి హిందూ రత్నాకర ము. శా. యందు ముద్రితమైన ఓగిరాల పాపయ్య రామనాట

కము అరణ్యకాండ గ్రంథాంతమున పాపయ్య తన రామనాటక బాలారణ్యకాండలను సికింద్రాపుర బోవేరునందున్న నాటకపరుల ప్రోత్సాహముచే మద్దాల కాశీపతిసూరాచారి ముద్రించి ప్రచురించెనని చెప్పినాఁడు. కాఁగా నీ కాశీపతి సికింద్రాబాదు ప్రాంతమువాఁడును, 19 శ. ఉత్తరార్ధమువాఁడు ననుట స్పష్టము.

శతకంఠ రామాయణ కథ వాసిష్ఠ రామాయణమునఁ గలదు. కథ యంతయు యుద్ధసందర్భ బంధురమైనను కాశీపతి తన గ్రంథమునఁ జక్కని సంవాద శైలి పాటించి కథను నిపుణముగా నిర్వహించినాఁడు. ఇందు దరువులు, ద్విపదలు, ద్విపదార్ధములు, కందార్ధములు, పద్యములు, సంధివచనములు గలవు. రచన నాతిప్రౌఢము, నాతి పేలవము. ఇం దితఁడు రుద్రకవిని స్తుతించినాఁడు.

---

# 24. గవురహరాజు లక్ష్మీపతిరాయుఁడు

## నలచక్రవర్తి చరిత్రము

ఇతఁడు ఋగ్వేది. మునిగస్సుని (?) సగోత్రుఁడు. వెంకమాంబా లక్ష్మీపతుల ప్రపౌత్రుఁడు. రామాంబా తిరుమలన్నల పౌత్రుఁడు. అంజమాంబా హరిరాయణ పుత్రుఁడు. ఇతని న. చ. చ. గ్రంథము ముఖపత్రముపై "అంబటి అనుమంతు ప్రేరేపణ చేత పై గ్రంథకర్తచే సర్వస్వాతంత్ర్యముపొంది సికింద్రాబాదు నివాసుండగు శివనూరు వీరమల్లయ్య గారిచే హిందూ రత్నాకరము. శా. యందు

ముద్రింపించి ప్రచురింపఁబడియె – చెన్నపట్నము, 1897 సం." అని యున్నది. కాఁగాఁ గవి 1897 ప్రాంతము వాఁడనుట స్పష్టము.

గ్రంథము యక్షగానమని పేర్కొనఁబడినది. ఇందు తాళప్రధానములైన దరువులు, ద్విపదలు, పద్యములు, వచనములు, కందార్థములును గలవు. గ్రంథారంభమున రంభోర్వశుల రాక, హాస్యగాని మాటలు, పాత్రల తెరలోపలి దరువులు, తెరవెడలు దరువులు మొ. గలవు. గ్రంథమున నాటకీయతయున్నది కాని రచన మిక్కిలి పేలవమైనది.

---

# 25. గవండ్ల రాజలింగకవి

ఇతఁడు మెదకు జిల్లా నారసింహాపేట నివాసి. మనుకులరాజయాఖ్యమల్లమాంబా తనూజుఁడు. ఘట్టుపల్లి కుమారస్వామి శిష్యుఁడు. ఇతఁడు 19 శ. ఉత్తరార్థము వాఁడని తోఁచుచున్నది. ఇతని యక్షగాన కృతులు :- 1. హరిశ్చంద్రమహారాజు చరిత్రము ('సికింద్రాబాదు నివాసులగు "కంభంపాటి ఉదయాచలం గారిచే... శ్రీ వెంకటేశ్వర ము. శా. యందు ముద్రింపఁబడియె. చెన్నపురి, 1902) 2. పుణ్యాంగద చరిత్ర (వెస్టువార్డు ప్రచురణ, మదరాసు, 1953.) మొదటిదాని కథ ప్రసిద్ధము. గౌరనకృతి యనుకరింపఁబడినది. రెండవది చోళదేశరాజ పుత్రుఁడైన పుణ్యాంగుని రథము క్రిందపడి యొక గోవత్సము మడియుటయు నందుపై రాజు పుత్రునికి మరణశిక్ష విధించుటయుఁ బుణ్యాంగ పత్ని పతివ్రత చంద్రావతి ప్రార్థనపై శివుఁడు ప్రత్యక్షమై వారెల్లరకుఁ

కైలాస మనుగ్రహించుటయు ననుకథ గలది. రెండిటను దరువులు (తెరదరువులుకూడ), ద్విపదలు, పద్యములు, అతి విరళముగాఁ బ్రయుక్తములైన యల్లంతి యల్లంతి సంధివచనములును గలవు. హరిశ్చంద్ర చరిత్రమున "ఆస్థాన సంతోషి" పాత్రగలదు. రెంటను నాటకీయత యెక్కువ. కాని రచన పేలవము, దోషబహుళము నైనది.

---

# 26. రాయభట్టు లక్ష్మణకవి

## మాంధాత చరిత్రము:

(ముద్రణ :— ఉమామహేశ్వర ము. శా., మదరాసు, 1902.)

ప్రచురణకర్త: కంభంపాటి ఉదయాచలము, సికింద్రాబాదు)

ఇతఁడు మన్నెవారి కొండాపురము ప్రభువైన జోగరాయుని పుత్రులు సుదర్శన రాయుఁడు, బాలకృష్ణరాయుఁడు ననువారి కొలువులో నుండిన రాయభట్టు. పాపయార్యుని శిష్యుఁడు, ఆధునికుఁడు కావచ్చును.

మాంధాత గర్వియై విధిని దూషించి రాజ్యమును దార పుత్రులను గోల్పోయి పలుపాట్లుపడి చివరికి శివానుగ్రహమును బొందుట యితని గ్రంథము నందలి యితివృత్తము. ఇందుఁ దాళ ప్రధానములైన దరువులు, ద్విపదలు, పద్యములు, అర్ధపద్యములు, ఏలలు, సంధి వచనములును గలవు. రచన దోషభూయిష్ఠము. ఇది యక్షగాన మని ముఖపత్రమున మాత్రమున్నది. ఇందు గ్రంథారంభమున రంభోర్వ

శులరాక, తెరలోని పాత్రలు పృచ్ఛింపఁబడి స్వీయవృత్తాంతము జెప్పు టయుఁ గలదు.

---

# 27. కంభంపాటి ఉదయాచలము

ఇతఁ డహల్యా సంక్రందనము, కలియుగ విప్రనారాయణ చరిత్రము నను రెండు యక్షగానములను రచించినట్లు నవి వరుసగా 1890, 1905 సం. లలో ముద్రితము లైనట్లును ఆం. వా. సూ. లోఁ గలదు. ఆగ్రంథము లలభ్యములు. ఇతఁడు సికింద్రాబాదు నివాసి యనియు, 1902 సం. ప్రాంతమున ననేక యక్షగాన నాటకములకుఁ బ్రచురణ కర్తయైనట్లును దెలియుచున్నది. (చూ. నం. 24, 25 కవుల యుదంతములు)

---

# 28. తిరునగరి వెంకటదాసు

## కపిల దేవహూతిసంవాదము :

ముద్రణ :— హిందూ రత్నాకరము. శా., మదరాసు, 1894)

ములుకుదురు లక్ష్మణాచార్యులు, తత్పుత్రుఁడు శ్రీనివాస రాఘవాచార్యుఁడు, పౌత్రుఁడు వీరరాఘవాచార్యుఁడు నను వారు గురుపరంపరగా వర్ధిల్లుచున్న తిరునగరు చాత్తాని వైష్ణవ వంశమందు నమ్మయ వెంకాంబలకు వెంకయ్య, వెంకయ్యకు నాంచారమ్మయందు

నమ్మయాళ్వారు, నమ్మయాళ్వారునకు రంగమాంబయం దీగ్రంథకర్త వెంకటదాసును గలిగిరి. ఇతఁడానందశైల శ్రీనివాస భక్తుఁడగు చంద్రమౌళిగురుని శిష్యుఁడు. ఇతని గ్రంథమునందు దేవహూతి కడకు నారదుఁడెఱుకతయై వచ్చిన పట్టున నెఱుకల దేవతలలో వేగండ్ల తల్లి, గంగపురి చెన్నుఁడు, మన్నెముగి సామి, గుణిగానిపల్లె సంజీవ రాయఁడు, కొమ్ములఘట్టు శ్రీనివాసుఁడు, కురుమతీశుఁడు, పాంబండ రాముఁడు, మొ. వారు పేర్కొనఁబడిరి. ఆయూళ్ళు తెలంగాణము లోనివి. గ్రంథ ప్రచురణకర్త అయితా వెంకయ్య సికింద్రాబాదు వాసియనియు, బ్రచురణ ప్రేరకుఁడగు వెంకటనరసు నాగరకందనూలు వాసి యనియు ముఖపత్రమునఁగలదు. కాఁగా గవి తెలంగాణము వాఁడన వచ్చును. గో. క. సం. లో 250 సం. ల క్రిందట హనుమ కొండలో నుండిన వాఁడని పేర్కొనఁబడిన యతిరాజశతకకర్తయగు తిరునగరి వేంకటాచార్యుఁడే యీకవి యనలేము. ఈగ్రంథము మంత్రి మాటలలోఁ బ్రయుక్తమైన హిందీనిబట్టి, అసలు గ్రంథరచనా ధోరణిని బట్టిచూడ నితఁ డాధునికుఁ డనిపించును.

ఈగ్రంథము కర్దమ ప్రజాపతి స్వాయంభువ పుత్రియైన దేవ హూతినిఁ బెండ్లియాడుట, దేవహూతికిఁ గపిలమహర్షి పుట్టుట, అతఁడు తల్లికిఁ దత్త్వముపదేశించుటయు నను భాగవతేతివృత్తము గలది. ఇందు యక్షగానోచితముగాఁ బురోహితుఁడు, మంత్రసాని, యెఱుకత మొద లగు పాత్రలు కొన్ని చేర్పఁబడినవి. ఇది యక్షగాన మనియు, నాటక మనియుఁ బేర్కొనఁబడినది. ఇందు ప్రసిద్ధరాగతాళములలో దరు వులు, ద్విపదలు, పద్యములు, వచనములు, సువ్వి, అప్పగింతపాటలు గలవు. పాత్రల యవనికాభ్యంతర ప్రసంగములు గలవు. పాత్రల సంభాషణలెక్కువ. అవి సాగిన వచనములు "ముచ్చట" లను

పేర వ్యవహరింపఁబడినవి. ఇందలి హాస్యప్రసంగములం దసభ్యత గలదు. రచన యొకమాదిరిగ బాగుగనే యున్నదనవచ్చును.

---

# 29. వరాదిరాజు వెంకట్రామదాసు

## కుచేలోపాఖ్యానము:

(ముద్రణ :— వాణీ ప్రెస్, బెజవాడ, 1910)

కవి కౌండిన్యసగోత్రుఁడు. తలిదండ్రులు కోటమ, అప్పయ. నివాసము 'మధిర తాలూకాలో మడుపల్లి శివారు — అల్లినగరంబు'. గ్రంథరచనాధోరణి యీతఁ డాధునికుఁ డనుటకుఁ దగియున్నది. రచన పేలవము. దోషజుష్టము. ఇందు కీర్తనలు, ద్విపద, వచనము, పద్యములు, శ్లోకములును గలవు. ఇది నాటకమనియు యక్షగానమనియుఁ బేర్కొనఁబడినది.

---

# 30. ప్రబంధము అనంతయ

## (మన్నెంకొండ) విజయవిలాసము:

(వెస్టువార్డు ప్రచురణ — మదరాసు, 1936, 38)

గ్రంథము మన్నెంకొండ శౌరి కంకితము. కవి నివాసము మన్నెంకొండ కావచ్చును. కొన్ని దరువుల చివర హనుమద్దాసను పేరు గన్పడు

చున్నది. కవిపే రసలు హనుమంతయ్యే యేమో యని యనుమానము గలుగుచున్నది. ఇతని తలిదండ్రులు మేసుమాంబ, జగ్గయ్య. అగ్రజుఁడు కృష్ణదాసితని కవితాగురువు. ఇతఁడు వైష్ణవుఁడఁట. గ్రంథమధ్యమున నితఁడు మొట్టమొదటఁ దన గ్రంథము నచ్చు వేయించిన లక్ష్మయ్య (బుక్కా) పుత్రుఁడగు సిద్ధాంతిని స్మరించి యుండుట జూడ నాధునికుఁడని స్పష్టపడుచున్నది. ఇతఁడా ప్రచురణ సం. ను గూడ సౌమ్య యని పేర్కొనెను. అది క్రీ. శ. 1909 - 10 లోఁ బడిన సౌమ్య కాఁదగును.

గ్రంథ విషయ మర్జునున కులూచీ చిత్రాంగదలతో వివాహమైన కథ. ఇందు గ్రంథారంభమున రంభాగమనము, పాత్రలు స్వవిషయము నుగ్గడించుట, హిందీ ప్రసంగములును గాననగును. దరువులు, ద్విపదలు, పద్యములు, చిన్న చిన్న వచనములు (తఱచుగా, సంభాషణ ప్రచురముగా) నున్నవి. గ్రంథము యక్షగానమని పేర్కొనఁబడినది. రచన "ససేమిరా" బాగుగ లేదు.

---

# 31. చెర్వీరాల భాగయ్య

ఈయన మషీరాబాదు నివాసి. వైశ్యుఁడు. పుచిగెశిల గోత్రజుఁడు. తలిదండ్రులు రాజమాంబ, వీరన్న. గురువర్గము: బసవయ్య, శంకరస్వామి, హనుమదాచార్యులు, మాలె పల్లయాచార్యులు. ఈయన గ్రంథము లనేక మిటీవలనే యనఁగా 1950 ప్రాంతమున సికింద్రాబాదు గ్రంథ విక్రేతలును బ్రచురణకర్తలు నగు కొండా

శంకరయ్య, చందా నారాయణశ్రేష్ఠిగారలచేఁ బ్రకటింపఁబడినవి. అందనేకముపై గ్రంథ ప్రచురణకర్తకో కృతి ప్రోత్సాహకునికో ముద్రణ విక్రయాది స్వామ్యము లిచ్చుచు గ్రంథకర్తయే స్వయముగాఁ జేసిన ప్రకటనలు గలవు. (చూ :— కనకతార, కాంభోజరాజు కథ, నాగార్జున చరిత్ర, మాధవచరిత్ర, మార్కండేయ విలాసము, విక్రమార్క చరిత్ర, శ్రీకృష్ణ రాయబారము మొ॥). అందు మార్కండేయ విలాసముపై గ్రంథకర్త చేసిన ప్రకటన సం. 1947. మాధవ చరిత్రముపై గల గ్రంథకర్త ప్రకటన తేది 1-2-48. ఈయన గ్రంథప్రస్తావనలందును బ్రచురణకర్తను బ్రశంసించిన సందర్భములు గలవు. 1954లోఁ బ్రచురిత మైన యీతని పెదబొబ్బిలిరాజు కథ గ్రంథప్రస్తావనలోఁ దత్ప్రచురణ కర్తయగు చందా నారాయణశ్రేష్ఠి ప్రశంస గలదు. అనఁగా నీయన యెంత యాధునికుఁడో తేటతెల్లమగుచున్నది. (ఈయన నేఁడు సజీవు లని తెలిసికొంటిని). భాగయ్యగారు బహుశ్రుతులు, శతాధిక గ్రంథకర్త. ఈయన 34 (ముప్పదినాల్గు) యక్షగానములను రచించెను. అన్నియు ముద్రితములు. ఉపలభ్యమానములు 31. ఇన్ని యక్షగానములను రచించిన కవి మఱియొకఁ డింతవఱకుఁ బుట్టలేదు.

ఈయన గ్రంథములు కొన్నిటి రచనాకాలము మాత్రమే సూచింపఁబడినది. అందుచే నీ దిగువ నవి ఆకారాది క్రమమునఁ బేర్కొనఁబడును. ఏ గ్రంథమున కా గ్రంథముకడ విషయ సంగ్రహమును, జివర గ్రంథ సమవాయరచనా సమీక్షా సంగ్రహము నుటంకింపఁబడును. (ఈయన గ్రంథము లనేకము తెలంగాణములోని వివిధ గ్రామవాసులగు సంపన్నుల ప్రోత్సాహమున నాయా గ్రామదైవముల పేర రచింపఁబడినవి. ఆయా గ్రంథములకడ నాయా గ్రామనామ

ములు, వానితోపాటు గ్రంథ ప్రచురణ కర్తృకాల సూచనలును గుండలీకరణములలో నుటంకింపఁబడును).

**1. అల్లీ–అర్జున చరిత్రము:** (గుమ్మిడిదల. చందా 1954)

ఇది విచిత్ర భారతాంతర్గతమైన కథ యఁట. తీర్థయాత్రాపరుఁడైన యర్జునుఁడు మధురాపురమునేలు అల్లీరాణిని వివాహ మాడఁగోరును. ఆమె పురుషద్వేషిణి. అర్జునునితోఁ గయ్యమాడఁబోయి వియ్యమందును. ఇది జైమినిభారతమునందలి ప్రమీల కథ నెక్కువ పోలియున్నది. వీరశృంగారాత్మక మీకథ.

**2. ఆరెమరాటీల చరిత్ర:** (పెద్దమాధాపురము. కొండా, 1951)

సోమోజీ, సుబంధోజీ, పీరోజీ అను ఆరెమరాటీసోదరులు కరిణెకల్లు పరిపాలకులు. వారి పినతండ్రి బడేగాం పరిపాలకుఁడగు సిద్ధోజీ భార్య రుక్కుంబాయి దుర్బోధలవలన వారిని రాజ్యభ్రష్టులను గావించును. సోమోజీని జంపించును. సుబంధపీరోజీలను బంధించును. సోమోజీభార్య అతుంబాయి రుక్కుంబాయియుఁ దాను నొక్క రేవులో ముండమోయవలె నని శపథము చేసి పురుషవేషమునఁ బోయి సిద్ధోజీతోఁ బోరి యతనిని దన కొడుకగు తులేరావుచేఁ బొడిపించును. తులేరావు బడేగాంప్రభువగును. ఇదీ ఇంచలికథ. ఆరెమరాటీల వీరగాథ యొకపదముగా నిదివరకే ప్రచారమున నున్నది.

**3. కనకతార:** (పడ్డేపల్లి. కొండా, 1950)

పాండ్యరాజగు నుదయసేనుని తనయుఁడు కనకసేనుఁడు. కూఁతురు తార. ఉదయసేనుని సోదరుఁడగు క్రూరసేనుఁ డన్నను రాజ్యాశచే సంహరించి యతని కుటుంబమును బలుసిలుగుల పాలు

చేయును.తుదకుఁ గష్టములెల్ల గట్టెక్కి కనకసేనుఁడు పట్టాభిషిక్తుఁడగును. కరుణరసప్రసిద్ధమగు నీకథ మొదట ధార్వాడ నాటకసమాజమువారిచేఁ గాఁబోలాంధ్ర దేశమునకుఁ బరిచితమైనది. అటుపిమ్మట భాగయ్యగారి యక్షగాన రచనకు ముందే రంగస్థలనాటకముగాఁ దెలుగున వెలసినది.

## 4. కాంతామతి: (వడ్డేపల్లి, కొండా, 1946)

కాంతామతి కుంతలరాజపుత్రి. ప్రతాపసేనుఁ డను కాశ్మీర ప్రభువుయొక్క పత్ని. కాంచనమాల యను వేశ్య వలలోఁ దగుల్కొనిన మగనిచే నిలు వెడలఁగొట్టఁబడి పలుపాట్లు పడిపడి చివరికి మగనిచే స్వీకృత యగును. ఇది కాశీమజిలీ కథాసరళిని నడచిన కథ. కరుణాద్భుత రసాత్మకమైనది.

## 5. కాంభోజరాజు చరిత్రము: (మహబూబాబాదు, కొండా, 1950)

కాంభోజరాజున కేడుగురు భార్యలు. చివరిభార్య మాణిక్యాల దేవికొడుకు రాజు కాఁగలఁడని రాజగురువువలన విని కడమభార్య లొక మిషపై రాజుతోఁ గొండెములుచెప్పి గర్భవతియగు నామె నిలువెడలఁ గొట్టించిరి. అడవులుబట్టిపోయిన యామెను శివపార్వతులు భిల్లవేష మున వచ్చి రక్షించిరి. ఆమెకు శరబంది యను పుత్రుఁడు గలిగెను. అతఁడుపెద్దవాఁడై యొకపరి వ్యాధిగ్రస్తుఁడైయున్న తండ్రినిఁ జూడఁ బోయెను. ఒక కీలుగుఱ్ఱము సాయమున సప్తసాగరములు దాటి యొంటి స్తంభము మేడనున్న యోజనగంధి యను యక్షకన్య కొప్పులోని సంజీవినిదెచ్చి రాజును బ్రదికించెను. రాజు శరబందిని గుర్తించి యతనికి రాజ్యమిచ్చును. ఈకథయు నిదివఱకుఁ బదరూపమునఁ బ్రచారమున నున్నదే.

**6. కిరాతార్జున చరిత్రము :** (ముత్రాజుపల్లె, చందా, 1953)

ఇందలి కథ ప్రసిద్ధమైనది.

**7. కుశలవ నాటకము :** (రాజంపేట, చందా, 1951)

కథ ప్రసిద్ధము.

**8. కృష్ణగారడి నాటకము :** (ముచ్చుగూరు, చందా, 1951)

గ్రంథ రచనాబ్దము 1947. ఇందొక నిమిత్తమునఁ గృష్ణుఁడు భీమార్జునులకు గర్వభంగము చేసిన కథ వర్ణితము. ఇది యపూర్వాలకము. కవి స్వకపోల కల్పితమువలెఁ గానవచ్చుచున్నది.

**9. శ్రీకృష్ణ పారిజాతము:** (మహబూబాబాదు, చందా, 1954)

కథ ప్రసిద్ధము.

**10. శ్రీకృష్ణ తులాభారము :** (మహబూబాబాదు, కొండా, 1951)

రచన 1951. కథ ప్రసిద్ధము.

**11. శ్రీకృష్ణరాయబారము :** వడ్డేపల్లి, కొండా, 1951)

కథ ప్రసిద్ధము.

**12. తారాకాసురవధ :** (గుమ్మడిదల, కొండా, 1951)

గ్రంథ విషయము ప్రసిద్ధము.

**13. నలమహారాజు చరిత్రము :** (రాజంపేట, కొండా, 1952)

కథ ప్రసిద్ధము.

**14. నాగార్జున చరిత్రము :** (బీగంగూడెం, కొండా, 1953)

అర్జునున కులూచి యందుఁ గలిగిన పుత్రుఁడఁట నాగార్జునుఁడు.

ఒకమృగము నిమిత్త మతనికి నర్జునునకును దత్రాపి శివ శ్రీకృష్ణులకును యుద్ధము జరిగిన కథ యిందు వర్ణితము. ఈకథ మహాలింగపురాణము నుండి గ్రహింపఁబడినదఁట.

**15. పుండరీక చరిత్రము:** (చింతలచెరువు, కొండా, 1950)

మహాభక్తవిజయ మండలి పుండరీక చరిత్రమిందు గ్రహింపఁబడినది.

**16. పెదబొబ్బిలి చరిత్రము:** (మశూరాబాదు, చందా,1954)

పెదబొబ్బిలిరాజు కథ యనుపేర నొకపదము ప్రచారములో నున్నది. దానిని బట్టి యిది రచింపఁబడినది. క్రీ. శ. 1757 లో జరిగిన చరిత్ర ప్రసిద్ధమగు బొబ్బిలి యుద్ధము కథ యిందు వర్ణితము.

**17. బభ్రువాహన చరిత్రము:** (ఆంధ్రగ్రంథ మండలి., సికింద్రాబాదు, 1950)

అర్జునపుత్రుఁడగు బభ్రువాహనుని చరిత్ర మిందు వర్ణితము. ఈకథ జైమిని భారతమునందు గలదు.

**18. బాలనాగమ్మ చరిత్ర:** (మశూరాబాదు, చందా, 1954)

బాల నాగమ్మకథ పదరూపమున నిదివఱకున్నది. ఆంధ్రదేశమున మిక్కిలి ప్రచారము బొందినది. అదే యిందు గ్రహింపఁబడినది. ఇందలి కథా రంగములగు పానుగల్లు, నాగళ్ళపూడి, గండికోటయు తెలంగాణా రాయల సీమలకుఁ జెందిన వగుట గమనింపఁదగినది.

**19. భద్రసేన విలాసము:** (వేములవాడ, చందా, 1949)

భద్రసేనుఁడను రాకొమరునకును, సుశీల యను రాకొమార్తెకును బెండ్లిముహూర్తము నిశ్చితమగును. కాని యతని నొక యప్స

రసయు నామెనొక యైంద్రజాలికుఁడు నెత్తుకొనిపోవుదురు. భద్రసేనుఁడచ్చర చెప్పిన యుపాయమును బట్టి యైంద్రజాలికుని కూఁతునాశ్రయించి యతనిఁజంపి యతనికూఁతును, సుశీలను వివాహమాడును. ఇది పండ్రెండు రాజుల కథలు, పదునాఱురాజుల కథలు మొదలగు వాని వరుసలో నడచిన కథ.

**20. (చిరుతల) భాగవతము :** (చండా, 1954)

శ్రీకృష్ణ జననాదిగాఁ గంసవధము వఱకుఁ గల భాగవతకథ యిందు వర్ణితము.

**21. మాధవ చరిత్రము :** (వడ్డేపల్లి, కొండా, 1948)

ఆత్మానందస్వామి శిష్యుఁడు మాధవుఁ డనువాఁడు గురుబోధను బూర్తిగా విశ్వసింపమిఁ బెక్కుశ్రమలు గుడిచి తుదకు వివేకము దెచ్చుకొనుట యిందలి ప్రధానవిషయము. ఇందు సరళమైన వేదాంతార్థ ప్రసంగములు గలవు.

**22. మాయా సుభద్రా విలాసము :** (అడ్డగట్ల, చండా, 1955)

సుభద్రార్జునులనడుమ శ్రీకృష్ణుఁడే మాయాసుభద్రయై వారినిఁ బరీక్షించి యర్జునుని గర్వ మడిచిన కథ యిందు వర్ణితము. ఇదియొక యమూలకమగు చమత్కారావహమైన కథ.

**23. మార్కండేయ విలాసము :** (గుమ్మడిదల, కొండా, 1954)

కథ ప్రసిద్ధము. రచన 1947.

**24. విక్రమార్క చరిత్ర :** (కొంపల్లి, కొండా వీరయ్య, సికింద్రాబాదు, 1938)

ఇందు విక్రమార్కుఁడను రాజు తన్ను నిందించిన చంద్రకళ యను బ్రాహ్మణయువతిని గోరి పెండ్లాడి యామెను జెఱవెట్టుటయు, నామె యొక ప్రతిన వట్టి యతఁడు గుర్తింపకుండ నతనికే యొక కొడుకును గని కొడుకుచే నతని గొట్టించినంత పని చేసిన కథ వర్ణింపఁబడినది. ఇది తమిళ దేశమున ప్రచారముననున్న మంగమ్మశపథమను కథను జాలవఱకుఁ బోలియున్నది. ఈగ్రంథమే స్త్రీ సాహసమను పేర కొండా వీరయ్యగారిచే 1954 లోఁ బునర్ముద్రితమైనది.

**25. సతీ తులసీ చరిత్రము:** (భానూరు. కొండా, 1952)

తులసిగా వెలసిన పరమ పతివ్రతయగు బృందాదేవి ప్రసిద్ధ చరిత్రమిందు వర్ణితము.

**26. సత్యభామా పరిణయము:** (వడ్డేపల్లి, కొండా, 194?)

కథ ప్రసిద్ధము.

**27. సత్య హరిశ్చంద్ర:** (మహీరాబాదు, కొండా, 1953)

కథ ప్రసిద్ధము.

**28. సారంగధర చరిత్ర:** (మహీరాబాదు, ఆంధ్ర గ్రంథ మండలి, సికింద్రాబాదు, 1951)

కథ ప్రసిద్ధము.

**29. సీతా స్వయంవరము:** (భ్రమరంపేట, చందా, 1950)

కథ ప్రసిద్ధము.

**30. సుగ్రీవ విజయము:** (మహూరాబాద, కొండా, 1926? వెస్టువార్డువారి ప్రచురణ, మదరాసు, 1943)

ఇందలికథ ప్రసిద్ధము. ప్రకవి సుగ్రీవ విజయమును భాగయ్య గారు చూచియుండవచ్చును గాని దానికిని దీనికిని సంబంధములేదు. రెండిటఁ గథాప్రణాళిక తీరే వేఱు. దీనిగుఱించి 1946 లోఁ బ్రచురితమైన యితని సత్యభామాపరిణయము వెనుకటియట్టపై యితఁడే చేసిన ప్రకటనలో, "నాపిన్నవయసున ప్రథమమున రచించిన సుగ్రీవవిజయము-యక్షగానము అను పుస్తక మిప్పటికి సుమారు 20 సంవత్సరములనుండి యీ నిజాంరాష్ట్రమంతటను ప్రసిద్ధి వహించి, ఇప్పటికి లక్షకు పైగా సెలవయ్యెను" అనియున్నది.

**31. సైంధవ పరాభవము :** (మాధవపురము. ఆంధ్రగ్రంథ మండలి, సికింద్రాబాదు, 1950)

కథ ప్రసిద్ధము.

**32. గయోపాఖ్యానము :** (కొండావారిప్రచురణ. అలబ్ధము)

**33. జయంత జయపాలము :** (కొండా ప్రచురణ. అలబ్ధము)

**34. మదాలసా పరిణయము :** (చందావారిప్రచురణ. అలబ్ధము)

## సమీక్ష

భాగయ్యగారు పైఁ బేర్కొనఁబడిన కృతుల నించుమించన్నిటిని యక్షగానము లని వ్యవహరించినారు. కొన్నిట (ఉదా :— బభ్రువాహన చరిత్ర) భాగవతము, యక్షగానము, నాటకము అను పదములను పర్యాయములుగా ననఁగా సమానార్థకములుగా వాడినారు. అన్నియు నాటకీయతా ప్రకృష్టములు; కవిచేఁ బ్రదర్శనోద్దిష్టములు నైనవి. ఇందు కొన్నిట గ్రంథారంభమున "గణపతి సరస్వతుల వేషము రాకడ", రంభోర్వశుల రాకయుఁ గలవు. బహుకృతి సామా

న్యముగాఁ బృచ్ఛకుఁడు (ఒక్కొకదానియందు ద్వారకుఁడు, సేవకుఁడు, ప్రధాని, హాస్యగాఁడు, సూత్రధారుఁడు – అని వివిధములుగా వ్యవహృతుఁడు), పాత్రలు స్వీయోదంతములు చెప్పుటయుఁ గృతి కర్తృభర్తృ (ప్రచురణకర్తృ) ప్రశంసాత్మకముగా నాటకపాత్రలచేఁ బ్రవర్తితమైన ప్రస్తావనయుఁ గన్పట్టును. ఆ ప్రస్తావన తఱచు ప్రధాని, హాస్యగాఁడు నను నిరువుర నడుమ హిందీభాషలో జరుగును. ఒకప్పుడు ద్రౌపది మొదలగు నాటక పాత్రలచేతనే ప్రవర్తితమగును. కృష్ణగారడి నాటకమున మార్గనాటకము లందువలె నాంది, నాంద్యంతమున నటీసూత్రధారులచే సలక్షణమైన ప్రస్తావనయుఁ గలవు.

భాగయగారి కృతులలో వస్తువైవిధ్య మొకటి గమనింపఁదగినది. పౌరాణిక గాథలు నందుఁ బ్రసిద్ధములు నెక్కువ. కాని అల్లీరాణి కథ, నాగార్జున చరిత్రము మొదలగు నప్రసిద్ధగాథలును గలవు. కృష్ణగారడి, మాయాసుభద్ర మొ॥ గ్రంథములందు పౌరాణిక గాథలే కవి స్వకపోల కల్పనలతో జిత్రములైన మార్పు లందినది. ఆరెమరాటీలు, కాంభోజరాజు, బాలనాగమ్మ చరిత్రలందు పదరూపమునఁ బ్రచారమున నున్న జానపదగాథలు గ్రహింపఁబడినవి. పెదబొబ్బిలి చరిత్రమందలిది చారిత్రకేతివృత్తము, నది యాంధ్ర జాతీయ వీరగాథయగుటయు విశేషము. కాంతామతి, భద్రసేనవిలాసము మొదలగునవి కాశీమజిలీ, పంద్రెండు రాజుల కథల బాణీని నడచిన కట్టుకథలు – అందు గొన్ని కవి స్వకపోల కల్పితములే కావచ్చును. ఈ కథలు వివిధరసముల కాకరములు. అట్లే పాత్ర వైవిధ్యమును గలదు. రాజమహిషీ మంత్రిపాత్ర లెక్కువ. ఎఱుకలసాని, దొమ్మరిసాని, చాకలి, జాలరి, కోమటి, దొంగ మొదలగు వివిధ కులవృత్తులకు సంబంధించిన పాత్రలును గలవు. రాజపాత్రాదుల చిత్రణమునఁ దగిన సమాజత్వము,

నుదాత్తతయుఁ గొఱవడినను నీచపాత్రలే నిసర్గ మనోజ్ఞముగాఁ జిత్రింపఁబడినవి. ఆయాపాత్రల సంభాషణలలోని తెలంగాణా తెలుగు వ్యవహారము నుడికారము గమనింపఁదగినది.

ఈ కృతులన్నిట సామాన్యముగాఁ గనిపించు రచనావిశేషములు :— తాళప్రధానములైన దరువులు, ద్విపదలు, పద్యములు, వచనము, కొన్నిట కందార్థములు, ఏలలు, తోహరాలు మొదలగునవియుఁ గలవు. దరువులలో బాత్రలు తెరవెడలు దరువులునున్నవి. సంధివచనములేకాక సూటియైన సంవాదాత్మక వచనములును సమృద్ధిగాఁ గలవు. కొన్ని గ్రంథాంతములందు కవిగద్య గలదు. అన్నిట రచన సాధ్యమైనంతమట్టునకు సలక్షణముగనే సాగినది. లేక సలక్షణముగా రచించుటయే కవి లక్ష్యమనవచ్చును. కాని సామాన్య సామాజికుల నుద్దేశమునందుంచుకొని కాఁబోలు కవి సరళశైలిఁ బాటించెను. అది పేలవత్వము కాని సారళ్యము. వీనిలోఁ దప్పులేరి చూపుట కవకాశ మున్నను తెలంగాణమంతట వీరి యక్షగానములకు గొప్ప "చలామణీ" గలదు. అన్ని యక్షగానముల నింత వైవిధ్యముతో రచించిన భాగయగారికి యావత్తెలంగాణా యక్షగాన కవులలో నొక విశిష్టస్థాన మేర్పడఁగలదు.

---

# 32. మహమ్మదు అబ్దుల్లా

## హనుమద్రామ సంగ్రామము :

(చందా వారి ప్రచురణ, 1954.)

కవి ఏకుల సోమవరగ్రామ వాస్తవ్యుఁడు. చెర్విరాల భాగయ్యగారి ప్రియశిష్యుఁడు. గ్రంథ విషయము ప్రసిద్ధము. శ్రీరామ విజయ

మనియుఁ బేర్కొనఁబడిన దిది. విశ్వామిత్రునకుఁ బ్రత్యేకముగా నమస్కరింప నేమఱిన యయాతి నిమిత్తము రామాంజనేయులకు యుద్ధము జరుగుట యిందలి కథ. కవి దీనిని యక్షగాన మని పేర్కొనినాఁడు. గురువుగారి గ్రంథముల ఫక్కిని నడిపినాఁడు రచన. తప్పులున్నవి. కాని తెనుఁగు మాతృభాషయైన కవి రచించినట్లే రచించియుండుట విశేషము. అసలొక మహమ్మదీయుఁడు తెనుఁగున యక్షగాన రచన మొనరించి యుండుటే విశేషము.

---

# 33. శ్రీ పెరుంబూదూరి వెంకట నరసయ్య

ఈయనకు అయ్యావారు వెంకటనరసయ్య యనియు వ్యవహారము గలదు. ఈతని తండ్రి వటపత్రశాయి. తమ్ముడు వెంకటకవి. వీరి నివాసము బూరుగుపల్లి. వీ రిరువురను బూరుగుపల్లి సోదరకవు లందురు. ఇరువురును వేర్వేఱ తెలంగాణలో వివిధ గ్రామవాసులగు సంపన్నుల ప్రోత్సాహమున ననేక యక్షగాన ప్రాయనాటకములను రచించినారు. ఇరువురును జీవత్కవులని వినికిడి.

## అందు వెంకట నరసయ్య కృతులు :

### 1. అనసూయా నాటకము :

(వరదవెల్లి దత్తాత్రేయస్వామి కంకితముగాఁ జెప్పినది. ప్రచురణ, కొండా శంకరయ్య, సికింద్రాబాదు, 1939)

రచనాబ్దము శ్రీముఖ యఁట. ఇది 1933 కావచ్చును. ఇందలి వస్తువు ప్రసిద్ధము. ఇందు సుమతీ చరిత్రము గూడఁగలదు.

**2. కనకతార :** (చౌలమద్ది. కొండా, 1950)

దీనిపై గ్రంథకర్త గ్రంథసర్వాధికారములు ప్రచురణకర్త కిచ్చుచు నొక ప్రకటన చేసి యుండెను. గ్రంథవిషయము ప్రసిద్ధము. రచన విక్రమ – 1940 కావచ్చు.

**3. కిష్కింధా కాండ నాటకము :**

(హనుమాజి పేట. కొండా – 1938) రచన ఈశ్వర – 1937 కావచ్చు.

ప్రసిద్ధేతి వృత్తము.

**4. చంద్రగుప్తనాటకము :** (శేక్కిళ్లపల్లి. కొండా, 1939)

రచన :— బహుధాన్య – 1938. ఇందలి చంద్రగుప్తుఁడు మగధేశ్వర పుత్రుఁడే కాని మౌర్యచంద్రగుప్తుఁడు గాఁడు. ఇతఁడు మీనాంక రాజపుత్రిని భ్రమరవేణినిఁ బెండ్లియుంకువ యగు హిమాలయస్థమణి నొకదానిని దానిని గాపాడు రాక్షసిని సంహరించి తెచ్చి వివాహమాడిన కథ యిందు వర్ణితము. ఈకథ శ్రీకృష్ణబోధామృతమునుండి గ్రహింపఁ బడిన దఁట. (ఇందు కవి గ్రంథప్రచురణ కర్తృప్రశంస చేసియుండెను).

**5. డాంగేయోపాఖ్యానము :** (బన్నాజిపేట, చందా నారాయణ శ్రేష్ఠి, సికింద్రాబాదు, 1950. దీనిపై "గ్రంథకర్తవలన కాపీరైటు హక్కులనుపొందియున్నా" మను ప్రకాశకుల ప్రకటన గలదు).

గ్రంథనామము చిత్రమైనది. ఇతివృత్తము చిత్రమైనది. దుర్వాస శ్శాపమున హయమైన రంభ నిమిత్తముగా, నారదుని కైలాటము కారణముగా డాంగేయుఁడను రాజునకు శ్రీకృష్ణునకును బట్టుపంతములు గల్గినవి. డాంగేయుఁడర్జునుని శరణు జొచ్చును. కృష్ణుఁ డొక

వంక నొకవంకఁ బాండవపక్షమున హనుమద్భీమ దుర్యోధనులును హాయమునకై పెనుగులాడఁగా నది రంభ యగును. మూఁడున్న అవ్రజములు ముట్టినంత శాపముదీఱునని దుర్వాసునివాక్కు. బలసంపదలోఁ గృష్ణ హనుమద్భీములు వ్రజముల వంటివారు. దుర్యోధనుఁడఅవ్రజము. ఈకథయే యలఁతిమార్పుతో బాగేపల్లి అనంతరామాచార్యులచే హరికథగా రచింపఁబడినది. గయోపాఖ్యాన చిత్రభారత కథ లీ కథోపస్థితికి మూల భూతములైనట్లు తోఁచును.

**6. మార్కండేయోపాఖ్యానము:** (గరిశకుర్తి. కొండా, 1950)

ఇందు మార్కండేయుఁడు శంకరునిచేఁ జిరంజీవత్వ వరమును బొందుటయేకాక పిదపఁ బెండ్లిలేకయే యజ్ఞముచేసి హోమకుండము నుండి పుత్రులను బడయుటయు, వారియుదంతమును గొంత గలదు.

**7. శశిరేఖా పరిణయము:** (మానాలపురి కొండా, 1954)

కథ ప్రసిద్ధము.

**8. శ్రీకృష్ణ తులాభారము:** (స్తంభంపల్లి, కొండా, 1949)

కథ ప్రసిద్ధము.

**9. సతీ సావిత్రీ పరిణయము:** (మర్లపేట. కొండా, 1950)

కథ ప్రసిద్ధము. రచన :— 1949.

**10. సుగుణవతీ నాటకము:** (గోపాలరావుపేట, కొండా, 1954)

రచన 1932. గురునిచేఁ గోరఁబడి, పతిచే ననుమానింపఁబడి, యడవిఁబట్టి యొకచోరుని బారినుండి తప్పించుకొని, పురుషవేషము

దాల్చి యొక దేశమున కేలికయై యొక సత్రశాలకడఁ దనచిత్రపటము పెట్టి యాముఖ్వురిని సంఘటితపఱచి నిండుసభలోఁ దన నిర్దోషత్వము నిరూపించి పతిచే స్వీకృతయైన పతివ్రత సుగుణావతియను రాజపుత్రి చరిత్ర మిందు వర్ణితము. ఇది చెరిఁలాల భాగయగారి కాంతామతి కథను బోలినది.

పైకృతులన్నియు నాటకములని మాత్రమే పేర్కొనఁబడినవి. ప్రతికృతి ప్రారంభమునను దేవతాస్తుత్యనంతరము నటీసూత్రధారులచే సక్రమమైన ప్రస్తావన కలదు. అంత మాత్రమే సంస్కృత నాటకాను కరణము. ఆధునిక నాటకములందువలె సంధివచన విరహితముగా (కుండలీ కృతసూచనలతో), సూటిగా, వచనప్రశస్తముగాఁ బాత్రల సంభాషణలు సాగినవి. కాని యదియు నొకపాటి యనుకరణము మాత్రమే. వీనిలో నంకరంగవిభాగము లేదు. ముఖ్యపాత్రలు ప్రవే శింపఁగనే స్వవిషయము నుగ్గడించుట గలదు. ప్రతిపాత్రయు సంభాష ణలో ముందొక చిన్నదరువు నెత్తుకొని, వెంటనే యందలి యర్థమునే యొక చిన్నవచనమున విశదీకరించుట యీనాటకముల ప్రక్రియలోని ముఖ్యలక్షణము. ఒకపాటి పెద్ద దరువులందెల్ల చివర ముద్రయుండును. వెంకట నరసయ్యావారి నాటకములను బ్రపరిణతవీధి నాటకము లనఁ జెల్లును. అందు కనకతారా శశిరేఖాది నాటకములు "స్వదేశీ" నాట కములని పేర్కొనఁబడి యుండుట జూడ నాయభిప్రాయము సమంజస మనిపించును. ఇతని కృతులలో ముఖ్యములైన రచనాంగములు దరు వులు, వచనములు, పద్యములు, కవి తనకుఁదెలిసినంతలో సలక్షణ ముగనే రచింపఁబ్రయత్నించెను, గాని దోష బహుళముగా నున్నవి కృతులు. అయినను నన్నియు బ్రదర్శనోచిత ప్రక్రియా ప్రశస్తము లుగ నున్నవి.

---

# 34. శ్రీ పేరంబుదూరి వెంకటకవి

ఇతఁడు మీఁదఁ బేర్కొనబడిన వెంకటనరసయ్యావారి సోద రుఁడు. ఇతని కృతులు :—

1. **రుక్మాంగద నాటకము** (చిట్టాపురి, చందా, 1934)
2. **పుత్రకామేష్టియాగము** (మ్యాడంపల్లి, కొండా, 1936)
3. **ధాన్యమాలినీ చరిత్రము** (నామాపురి, కొండా, 1950)
4. **సుందర కాండము** (తక్కెళ్ళపురి, కొండా, 1953)
5. **ప్రహ్లాద నాటకము** (బూరుగుపల్లి, కొండా, 1955)

ఇవి యన్నియుఁబ్రసిద్ధ పౌరాణికేతివృత్తములు. వీని ప్రక్రియ వెంకటనరసయ్య గ్రంథములకు మిక్కిలి సన్నిహితముగా నున్నది. అన్నగారి రచన కంటె తమ్మునిదే మేల్తరమైనది.

---

# 35. కాసాల బలరామయ్య

**నళినీదేవి ప్రభావము:** (మణూరు. చందా, 1950)

కవి విశ్వబ్రాహ్మణుఁడు. శ్రీముఖ గోత్రజుఁడు. బ్రహ్మానందా చార్య శిష్యుఁడు. రాగమాంబా రాజయాచార్యుల పుత్రుఁడు. మెదకు జిల్లా చూచనపల్లి నివాసి. గ్రంథరచనాకాలము విభవవైశాఖ శు. 5. గురువారము. ఈ విభవ 1928 కావచ్చును. గ్రంథ విషయము

మాఙ్గల్యమునిపత్నియు మహా పతివ్రతయు నగు నళినీదేవి చరిత్రము. ఇందు దరువులు, పద్యములు, ద్విపద, సంధివచనములు గలవు. సంవాద ప్రాచుర్యము గలదు. పాత్రలు స్తోత్రపూర్వకముగా స్వవిషయో ద్ఘాటనముతోఁ దెరవెడలు దరువుతో ప్రవేశించుట చెప్పఁబడినది. గ్రంథము యక్షగానమని పేర్కొనఁబడినది. రచన నీరసమైనది.

---

# 36. జిల్లా వెంకటదాసు

వెంకటరావుపేట నివాసి. మార్కండేయసగోత్రుఁడు. నరుస మాంబా రాజయల పుత్రుఁడు. కోదండరామయ్య శిష్యుఁడు. ఇతఁడు 1939 లో చందా నారాయణ సెట్టి ప్రచురించిన గాజుల స్వామిదాసు స్వరోచ్యుపాఖ్యాన వీధి నాటకమునకుఁబరిష్కర్త. ఆధునికుఁడనుట స్పష్టము. ఇతని కృతులు :— మురనరకాసుర వధ, కంసమర్దనము (రెండును కొండా వీరయ ప్రచురణలు (1950, 1952). రెండును యక్ష గానములని పేర్కొనఁబడినవి. చందా వారి ప్రచురణ (సం. 1949) యగు వెంకటరావుపేట చిరుతొండ నాటకము, శ్రీ రామలింగప్రతిష్ఠ అను వీధి నాటకముగూడ నితనివే. నాల్గింటఁ గీర్తనలు, ద్విపదలు, పద్యములు, సంధివచనములు, పాత్రల తెరవెడలు కీర్తనలు, స్వవిష యోద్ఘాటనములు, సంవాదములును గలవు. రచన నిర్దుష్టముగాకపోయి నను నీరసమైనది కాదు.

---

# 37. అణ్ణనాచార్యులు

## మండోదరీపరిణయము:

ఆపస్తంబ సూత్రుఁడు. శ్రీవత్ససగోత్రుఁడు. కృష్ణయజుశ్శాఖి. తల్లి రంగనాయకమ్మ. తండ్రి చిటిగిద్దెమరం తెన్నరంగంపొన్నడి. ఇతని యక్షగానకృతి మండోదరీ పరిణయము. (చందా నారాయణ సెట్టి ప్రచురణ, సం. తెలియదు). కిచ్చనపల్లి వెంకటేశ్వరున కంకితము. కృతి ప్రోత్సాహకులు మెదకుజిల్లా అందోలుతాలూకా చింతకుంటగ్రామ వాస్తవ్యులు (పదునెనమండ్ర పేళ్ళు గలవు). గ్రంథ రచన సం. సర్వధారి. ఇది 1948 కావచ్చును. గ్రంథ విషయము గోకర్ణక్షేత్ర మాహాత్మ్యాంతర్గతమైన మండోదరీ రావణుల పరిణయ కథ. ఇందు తెం దరువులు, సంవాదపు దరువులు, ద్విపదలు, ద్విపదార్ధములు, పద్యములు, అర్ధ పద్యములు, సంధి వచనములు గలవు. రచన యొకింత చక్కనిదే.

---

# 38. అంబేద రాజపీరప్ప

దుందిగల్ జిల్లా రాయగీరు తాలూకా గౌరాయపల్లి నివాసి. చండికాంబా శరభలింగముల పుత్రుఁడు. ఇతఁడు కేదారేశ్వర వ్రతము, భీష్మ విజయము, గజేంద్ర మోక్షము, మదన శేఖర విలాసము, భక్తసానంద, మార్కండేయ వస్త్రకల్పన, సత్యనారాయణ వ్రతము, బ్రహ్మంగారి చరిత్రము, మల్లన్న చరిత్రము – అను తొమ్మిది యక్షగానములు రచించినట్లు 1949 లో కొండా శంకరయ్య

ప్రచురించిన యీతని మల్లన చరిత్ర వెనుకట్టపైఁగల పట్టికవలనఁ దెలియుచున్నది. అందు కృతి ప్రోత్సాహకులు నీతఁడును దీయించు కొన్న ఛాయా చిత్రము గూడ ముద్రితమైయున్నది. దీనినిబట్టి కవి యాధునికుఁడనుట స్పష్టము. ఇపు డీయన మల్లన చరిత్రము మాత్రమే లభ్యమైనది. ఇం దీశ్వరాంశసంభూతుఁడైన కొల్లాపురి మల్లన శివ కంచికిఁ బ్రభువైన యొక జానపద గాథ వర్ణితము. ఇందు దరువులు, తెర దరువులు, ద్విపదలు, పద్యములు, అర్ధపద్యములు, సంధి వచనములు మొ. గలవు. రచన దోషజుష్టము. నీరసము.



# 39. అవధూత మల్లయ్య

**సత్యనారాయణ వ్రతము:** (ముద్రణ: వాణీ ము. శా., 1949)

కవి పద్మశాలి. రాఘవయ్యపుత్రుఁడు. లింగయార్యుని శిష్యుఁడు. మేడిచల్ తాలూకా కానుకుంట వాస్తవ్యుఁడు. ఈతని గ్రంథమున "ఈయక్షగానమును గ్రంథకర్తగారి అనుమతి లిఖిత పూర్వంగా పొందనిది పునర్ముద్రణము చేయించువారు మేము తీసు కొను చర్యలకు బాధ్యులగుదురు" అని యొక ప్రకటన గలదు. అందుచే నితఁ డాధునికుఁ డనుట స్పష్టము. గ్రంథవిషయము ప్రసిద్ధమైన స. నా. వ్రతకథ. ఇది యైదధ్యాయములుగా విభజింపఁబడి యుండుట విశేషము. ఇందు దరువులెక్కువ. తెరదరువులును గలవు. కొలది పద్యములు, నర్ధపద్యములు నున్నవి. సంధి సంవాద వచనములు గలవు. రచన యొక మోస్తరు.

# 40. మఱాటుకోడూరు గోపయాచారి

**పాలన చోళమహారాజు చరిత్ర:** (చందా, 1949)

కవి చుంచనకోట పురవాసి. మణిభద్ర బ్రహ్మర్షి గోత్రజుఁడు. కాత్యాయన సూత్రుఁడు. వెంకమాంబా రామదాసాచార్యుల పుత్రుఁడు. ఇతని గ్రంథరచనాధోరణి యాధునికముగా నున్నది. రచనాబ్దమును సర్వధారిఫాల్గుణముగాఁ జేర్కొనెను. అది 1949 కావచ్చు.

గ్రంథవిషయము:— పాలన చోళమహారాజపత్నికిఁ బుత్రిక కలుగునని రాజగురువు చెప్పెను. పుత్రుఁడని మంత్రి వాదించును. మంత్రసాని పాయమునఁ బురుటింటి రాచ యాఁడుబిడ్డనుగొనిపోయి యొక యొడ్డెన్ల మగబిడ్డనుంచును. కొంత కాలమునకు రాజు వానికిఁ బట్టాభిషేకముచేసి విశ్వబ్రాహ్మణులను రాజ్యసంరక్షులుగానుంచి మేరుగిరియాత్రకుఁ బోవును. కలుషాత్ముఁడగు మంత్రిమాటలు విని చిన్న రాజు విశ్వబ్రాహ్మణులను జిత్రహింసలు పెట్టును. వారు పెద్దరాజు కడకుఁబోయి మొఱబెట్టుకొనిరి. అతఁడు వారినొక 'బహురూపుల' మేళముగా "బనాయించి" వచ్చి రాజపత్ని కోరికపైఁ బాలనచోళ రాజు బాలకము తానే ధరించి చిన్నరాజును, మంత్రినిఁ దెగటార్చి మఱల రాచటికము స్వీకరించును. ఇది యిందలి కథ. గ్రంథము యక్షగానమని పేర్కొనఁబడినది. ఇందు దరువులు, పాత్రలు తెర వెడలు దరువులు, సంధి—సంభాషణ వచనములు కొలఁది పద్యములు, కందార్థములు, ద్విపదయుఁగలవు. గ్రంథారంభమున రంభోర్వశుల రాకగలదు. రచన యొక మోస్తరు.

---

# 41. పనుస హనుమద్దాసు

ఈయన నిజామాబాదుజిల్లా మానికబండారం నివాసి. నాభిళ్ళగోత్రోద్భవుఁడును, ఇమ్మడిసెట్టి కులభూషణుఁడు నగు లక్ష్మయ్య పుత్రుఁడు బందలింగంపల్లి అబుల్ కరీందాసుని శిష్యుఁడు 1950 లో కొండావీరయ్య (సికింద్రాబాదు) ప్రకటించిన యీతని బాలనాగమ్మ నాటకముపై గ్రంథస్వామ్యమును బ్రకటనకర్త కిచ్చుచు నితఁడు చేసిన ప్రకటన ముద్రితము. ఈతఁడాధునికుఁడనుట స్పష్టము.

ఇతని కృతులు :—

## 1. మదనసేన నాటకము: (నగరపురి. చందా, 1945)

రచన చిత్రభాను - 1942. చంపకయను కులట మదనసేనుఁడను రాజునకు వలపుకత్తెయై తనభర్తను దానేజంపి, రాజకుటుంబమును దురవస్థ పాలుచేయుటయు, నామెభర్త భూతమై యామె ప్రయత్నముల కడ్డుదగులుటయు, రాజకుటుంబము స్వస్థత బొందుటయు నను కథ యిందు వర్ణితము.

## 2. బాలనాగమ్మ నాటకము: రచన స్వభాను - 1943.

## 3. హనుమద్రామ సంగ్రామము: రచన తారణ - 1944.

## 4. (పోతులూరి) వీరబ్రహ్మంగారినాటకము: (నూకలూరు)

2, 3, 4 — కొండా వీరయచే వరుసగా 1950, 51, 52 సం. లలోఁ బ్రచురితములు. మూఁడును బ్రసిద్ధేతివృత్తములు. హనుమద్దాసు కృతులన్నిటఁ బ్రారంభమున నటీసూత్రధారుల ప్రస్తావన గలదు. ఆధు

నిక రంగస్థలనాటకానుకరణమును సమృద్ధిగాఁ గలదు. యవనికావ తరణరంగ ప్రయోగ సూచనలు గలవు. అయితే కొన్ని పాత్రలు ప్రవేశించినంత స్వవిషయమును జెప్పుట, దరువుల ప్రాచుర్యము వానిలో ముద్రలుండుట మొ. వానినిఁబట్టి వీనిలో మౌలికమైన వీధినాటకము స్వరూపము గొంత తేటపడఁగలదు. రచన దోషభూయిష్ఠము.

---

# 42. పట్వారి వీరప్ప

ఇతఁడు గుల్బర్గా జిల్లా సంగారెడ్డితాలూకా పోట్టిపల్లి మాలీపతన్‌దారు బక్కప్పరాయుని పుత్రుఁడు. ఇతని కృతులు మన్మథ సంహారము, క్రోధాపురి రైతు విజయము. (రెండును 1953 లో చందా నారాయణ సెట్టి (సికింద్రాబాదు) చేఁ బ్రచురితములు). రెండవ దానిలోఁ బ్రారంభమున మహాత్మగాంధీ, భారత మాతృస్తుతులు గలవు కవి యాధునికుఁడనుట స్పష్టము. దాని గద్యలో నది వికృతి సం. న రచింపఁబడినట్లు గలదు. అది 1950 సం. కావలెను.

మన్మథ సంహారమున నితివృత్తము ప్రసిద్ధమైనది. అది యక్షగానమనియు వీధి భాగవత మనియుఁ బేర్కొనఁబడినది. రెండవ దానిలో గ్రంథ నామమే సూచించుచున్నట్లితివృత్త మత్యంతాధునిక మైనది. క్రోధాపురిరైతగు కోటారెడ్డి కుటుంబము నొక జమీందారు, షాహుకారు తుదముట్టింప యత్నించి తుదకు వారే గతించి రైతుకే విజయము లభించిన కథ యది. ఇది వీధి నాటకమని పేర్కొనఁబడుటయు, నందు నటీ సూత్రధారుల ప్రస్తావనయు, అంక

రంగ విభాగము నుండుట విశేషము. రెండు గ్రంథములందును బాత్రలు ప్రవేశించునపుడు స్వవిషయమును జెప్పుకొనుటయు, సంధి వచనములు, సంవాదవచనములు, ముద్రలతో దరువులు, పాటలు, కందార్థములు, పద్యములును గలవు. రచన దోష బహుళమే కాని దాని ధోరణిలో నది బాగుగనే యున్నదనవచ్చును.

---

# 43. ఆడెపు గోపాల్ దాసు

కవి నివాసము మెదక్ జిల్లా గజవెల్లి తాలూకా అమదీపురము. ఇతని హరిశ్చంద్ర కృతి ప్రోత్సాహకుఁడు మేరుగు దుర్గయ్య. దుర్గయ శిష్యుఁడగు మంచాల నర్సయ్య ముద్రణ ప్రోత్సాహకుఁడు. కొండా శంకరయ్య 1953 లోఁ బ్రచురించిన యీ గ్రంథమున గురు శిష్యుల ఛాయాచిత్రము గలదు. కవి యాధునికుఁడనుట స్పష్టము. పై కృతిలో హరిశ్చంద్ర చంద్రమతీ పరిణయము స్కాంద పురాణోక్త ప్రకారము రచింపఁబడినది. ఇది నాటకమని పేర్కొనఁబడినది. ఇందు నటీ సూత్రధారుల గ్రంథ ప్రస్తావన గలదు. ఇతనిదే "సతీ తులసి యక్షగాన" మను నింకొక కృతి గలదు. (సికింద్రాబాదాంధ్ర గ్రంథమండలి ప్రచురణ, 1951). రెండిటను బాత్రల స్వవిషయోద్ఘాటనము, సంధి వచనములు, దరువుల ప్రాచుర్యము మొదలగు య. గా. లక్షణములు గలవు. రచన యొకమోస్తరు. ప్రయోగ సౌలభ్యము గలది.

---

# 44. ఆడెపు నారాయణ దాసు

## సుగ్రీవ విజయము.

ఇతఁడాదిలాబాదు వాస్తవ్యుఁడు. ఇతని సుగ్రీవ విజయము య. గా. కృతి ప్రోత్సాహకుఁడగు చందా నారాయణ శ్రేష్ఠియే దీనిని 1953 లోఁ బ్రచురించెను. కవి యాధునికుఁ డనుట స్పష్టము. ఇందు గ్రంథారంభమున గణపతి సరస్వతులును బాత్రలవలెఁ బ్రవేశించి స్వవిషయమును జెప్పుకొనుట గలదు. దరువులు, ద్విపదలు, పద్యములు, సంధి - సంభాషణ వచనములు గలవు. రచన యొకమోస్తరు. ఇది వేములవాడ రాజరాజేశ్వరున కంకితము.

---

# 45. వానమామల నరసింహ దాసు

## బలిచక్రవర్తి చరిత్రము :

ఇతఁడు నర్సపూర్ తా. పెదగొట్టిముక్కుల నివాసి. వైష్ణవుఁడు. మంగమాంబా కృష్ణయ్యల పుత్రుఁడు. ఇతని యక్షగాన కృతి బలిచక్రవర్తి చరిత్రము. 1955 లో దానిని బ్రచురించిన చందా నారాయణ శ్రేష్ఠియే కృతి ప్రోత్సాహకుఁడు నైనట్లిందతని ప్రశంస గలదు. (చూ. పు. 7, కవి యత్యంతాధునికుఁడనుట స్పష్టము. ఇందు తెర - సంవాదపు దరువులు, సంధి - సంభాషణ వచనములు, ద్విపదలు, కొలఁది పద్యములు గలవు. రచన యొకమోస్తరు.

---

## 46. గడిగె కృష్ణదాసు

### శంబరాసుర వధ:

ఇతఁడు శంబరాసురవధ యను య. గా. ప్రబంధమును రచించెను. 1951 లో దీనిని ప్రకటించిన కొండా శంకరయ్య గ్రంథస్వామ్యమును గ్రంథకర్త వలనఁ బొందిన ట్లొక ప్రకటన గ్రంథమునఁ గలదు. ఇందు దరువులు, పద్యములు, అర్ధపద్యములు, సంధి వచనములు గలవు. గ్రంథారంభమున గణపతివేషము, రంభోర్వశులరాక, ద్వారపాలకుని పృచ్ఛలు, పాత్రల తెర లోపలి దరువులు, తెర వెడలు దరువులు, సంవాదములును గలవు. రచన యొకమోస్తరు.

## 47. మోర మల్లేశము

### అల్లీరాణి చరిత్రము:

ఇతనిది గట్లమల్యాల. ఇతని య. గా. కృతి అల్లీరాణి చరిత్రము - కొండా శంకరయ్య ప్రచురణ, సం. 1955. గ్రంథకర్త గ్రంథమును "అచ్చు వేయించిన" మెదక్ జిల్లా అంకిరెడ్డిపల్లె సుదర్శనము వస్త్ర వ్యాపారిని ప్రశంసించి యున్నాఁడు (పుట 11). ఇతఁ డాధునికుఁడనుట స్పష్టము. చెర్విరాల భాగయగారి గ్రంథ పరిష్కర్త. ఆయన రచించిన అల్లీ అర్జున చరిత్ర య. గా. కథయే యిందును గలదు. ఇందలి ప్రక్రియ యుపరిగ్రంథమును బోలినది. అక్కడక్కడ వచనములోను పాత్రల సంభాషణలు గలవు. రచన యొకమోస్తరు.

# అనుబంధము
# (3)
## తెలంగాణా యక్షగానములు

ఈ క్రిందఁ జేర్కొనఁబడిన గ్రంథముల రచనా కాలము నిర్ధరించి చెప్పుట కాధారములు గన్పట్టుట లేదు. కాని రచనా ధోరణిని బట్టి యివియన్నియు నర్వాచీనకాలికము లై యుండునని తోఁచుచున్నది.

(అ) యక్షగాన నామాంకితములు — తత్కర్తృ విషయము :—

**1. మైరావణ చరిత్ర** :- (ప్రచురణ:- అ. డై. ప్రెస్సు. 1924, చందా, 1951.)

కర్త కొల్తూరు పురుషోత్తమ కవి. విష్ణువర్ధన గోత్రజుఁడు. ప్యాగావరము. ఇందు ద్వారపాలకుని పృచ్ఛలు, పాత్రల తెరద్విపదలు, తెరవెడలు దరువులు, సంధివచనములు పద్యములు మొ॥ గలవు. అప్రశస్త రచన.

**2. కాళీయమర్దనము :** (కొండా, 1932)

**3. సావిత్రీపరిణయము** : (కొండా, 1950)

**4. లక్షణాపరిణయము** : (చందా, సం. ?)

చుక్కాపురి నరహరి ముద్రగలవి.

కర్త :— వేల్పూరి నరసింహ కవి.

ఇందు సావిత్రి, లక్షణ (దుర్యోధన పుత్రి) పరిణయ గ్రంథారంభములందు "గంధర్వస్త్రీల రాకడ" గలదు. మూఁడింటఁ బాత్రలు

తెరవెడలు దరువులు, తెర ద్విపదలు, సంధి వచనములు, పద్యములు మొ. గలవు. రచన యొకమోస్తరు.

## 5. మాయా ప్రకృతి పురుష లీల : (చంద్రా, 1933)

కర్త నాగన్నగారి భౌమనార్యుఁడు మెదక్ జిల్లా చెన్నగణపురవాసి. కౌండిన్యసగోత్రుఁడు. రామచంద్ర గోవర్ధన శిష్యుఁడు. వెంకటరాజయోగిని, పరవసు తిరువేంగళ దేశికుని స్మరించినాఁడు. గ్రంథవిషయము వైదాంతికము. ప్రబోధ చంద్రోదయాదుల ఛాయ నడచినట్టిది. ప్రక్రియ పై గ్రంథములఁ బోలినది నాటక మనియుఁ జెప్పఁబడినది. అంత ప్రశస్తరచన కాదు. ఈ భౌమనార్యుఁడు తారా శశాంక విజయమును య. గా. ను కూడ రచించెనఁట. అది యలభ్యము.

## 6. భద్రాయూపాఖ్యానము : (చంద్రా, 1943)

కర్త :— కృష్ణకవి. కనుసానిపల్లి. శైవబ్రాహ్మణుల సంజాతుఁడు. తలిదండ్రులు రామమ్మ, అంకయ్య. ఈతని భద్రాయూపాఖ్యాన కథ బ్రహ్మోత్తరఖండము నుండి గ్రహింపఁబడినది. ప్రక్రియ పై గ్రంథములను బోలినది రచన అప్రశస్తమైనది.

## 7. బభ్రువాహన చరిత్ర : (కాల్వపల్లి, చంద్రా, 1950)

కర్త :— పరవస్తు రంగయ్య, కూనున్గిరి నివాసి. పొన్నమాంబా లక్ష్మయ్యల పుత్త్రుఁడు. మయూరగిరి శఠగోపాచార్యుల శిష్యుఁడు. గ్రంథ విషయము జైమిని భారతాశ్వమేధ పర్వమునుండి గ్రహింపఁబడినది. గ్రంథారంభమున రంభోర్వశుల రాక చెప్పఁబడినది. ప్రక్రియ పై గ్రంథములను బోలినది. రచన యొకమోస్తరు.

**8. అంబరీషోపాఖ్యానము:** (చందా, 1951)

కర్త:— గుండో బాదాసు. గుడికెందుల పురము. ప్రక్రియ ఉపరి గ్రంథవత్. ప్రశస్త రచనకాదు.

**9. కుమారస్వామి వివాహము:** (చందా, 1951)

గ్రంథకర్తపేరు పైని తొండుపునూరి విఠోబాయనియు లోపల మక్తారాజ లింగకవి యనియుఁగలదు. రాజలింగకవియే గ్రంథకర్తయై యుండును. ఇతఁడు మెదక్ జిల్లా చంద్రపేట నివాసి. రాజమాంబా రామలింగేశ్వరుల పుత్రుఁడు. గ్రంథారంభమున రంభోర్వశుల రాక చెప్పఁబడలేదు గాని కడమ ప్రక్రియ యుపరి గ్రంథములను బోలినది. రచన యప్రశస్తమైనది.

**10. బాలనాగమ్మ చరిత్ర:** (కొండా వీరయ్య, 1953)

పోచవరపురీశున కంకితము. గ్రంథకర్తపేరు తెలియదు. ఇందలి పాత్రల హిందీ ప్రసంగములను బట్టి యాధునికుఁడని యూహింపఁ దగును. ప్రక్రియ పై గ్రంథములను బోలినదే. సంధివచనములే కాక సంభాషణ వచనములును గలవు. గ్రంథారంభమున రంభోర్వశుల రాక చెప్పఁబడినది. రచన యొక మోస్తరు. (కొండా శంకరయ్య ప్రచురణ యొక బాలనాగమ్మ చరిత్ర య. గా. గలదఁట. అది ఎఱ్ఱంబుచ్చి దాస కృత మఁట. అదియు నిదియు నొకటో కాదో తెలియదు).

**11. చంద్రహాస చరిత్ర:** ( చందా, 1953 )

వేముల రాజేశ్వరున కంకితము. గ్రంథకర్తపేరు తెలియదు. 1953 సం. న నున్న ఆడెపు నారాయణదాసు తన సుగ్రీవ విజయ

య. గా. ను వేములవాడ రాజేశ్వరునకే యంకిత మిచ్చెను. ఈచంద్ర హాస చరిత్రము నతనికృతియే యగునా? ఆంధ్రనాటక కళాపరిషత్తు వారిపట్టికవలన సికింద్రాబాదు నివాసి రాజవీరయ్యయను నాతఁడు చంద్రహాస య. గా. ను రచించినట్లును, నది 1907 లోఁ బ్రచురిత మైనట్లును దెలియుచున్నది. అది యిదియేయగునా? ఇందలి రచనా ప్రక్రియ ఆధునికముగనే కన్పట్టుచున్నది. రచన ప్రశస్తమైనది కాదు. చంద్రహాసకథ జైమిని భారతాశ్వమేధ పర్వమునఁ గలదు.

## 12. చెన్నకృష్ణవిలాసము:

కర్త:— గడ్డం రాజ బంగరురెడ్డి. (అముద్రితము. డా. శ్రీ. బి. రామరాజుగారికడ నొక ప్రతిగలదు).

## 13. కురవంజి:

కర్త:— నరసింహదాసుఁడు (గడ్డం నరసింహారెడ్డి యగునేమొ. అముద్రితము. దీనిప్రతియు డా. శ్రీ బి. రా. రా. గారి కడఁగలదు).

## 14. సౌందర్య వీర నాటకము:

కర్త:— కళేవరపు వీరభద్రయ్య. ముద్రితము (ప్రచురణ కర్తలు బచ్చువీరన్న, చిలుకా బాల్ రెడ్డి అండుకో, సికింద్రాబాదు, 1911)

## 15. వేదాంత జీవచంద్రమహారాజు నాటకము:

కర్త:— రామరాజు రాజయోగి. ముద్రితము. (బాలాత్రిపుర సుందరీ ప్రెస్, వరంగల్, 1937).

ఆ. యక్షగానములని కవులచేఁ బేర్కొనఁబడక పోయినను నాధునిక తెలంగాణా యక్షగాన లక్షణములు సమృద్ధిగాఁ గలిగి యట్లు వ్యవహృతములగుచున్న గ్రంథములు.

**1. నల చరిత్ర :** ( దామరవంచ, చందా, 1935 )

**2. కూచకొండ రామాయణము :** (కొండా, 1943

( సుందరకాండ ) కర్త : గుజ్జరి యెల్లదాసు. వైశ్యుఁడు. అంత ప్రశస్తరచన కాకపోయినను గొంత ప్రచారముపొందినట్టిది. బ్రిటిషు మ్యూజియమ్ లైబ్రరీ కేటలాగులో ఎల్లదాసు యుద్ధకాండ మను య. గా. కలదు. అదియు నీతనిదే యగునేమో!

**3. అనసూయా చరిత్రము :** (చందా, 1936, కొండా1938)

బీబీపేట గోపాలాంకితము. గ్రంథకర్త పేరు తెలియదు. నాటక మని పేర్కొనఁబడినది. రచన యొకమోస్తరు.

**4. హనుమద్విజయము :** ( చందా, 1949 )

నసుకంటి పురీశాంకితము. కర్త : పరాంకుశదాసు. హనుమంతుఁడు బలరామ గరుత్మంతులకు గర్వభంగము చేయుట యిందలి ప్రధానేతి వృత్తము. రచనయొక మోస్తరు.

**5. పోతులూరి వీరబ్రహ్మంగారి చరిత్ర :** (ఆంధ్ర గ్రంథ మండలి, 1950)

కర్త :- నార సత్తెయ్య. వాసాలమర్రి గ్రామవాసి. కృతి ప్రోత్సాహకుఁడు దత్తాయపల్లి వడ్ల సిద్ధయ. ఇది భాగవత మనియు, నాటక మనియుఁ బేర్కొనఁబడినది. రచన దాని ధోరణి నది సరసము) గనే యున్నదని చెప్పవచ్చు.

**6. గయోపాఖ్యానము:** (చందా, 1954)

తారానగ శశాంకితము. కర్త శీలు సంగన. సంగన పుత్రుండు. వైశ్యుండు. రచన యొకింత సరసముగనే యున్నది.

**7. చిరుతల లవకుశ నాటకము:** (చందా, 1955)

కర్త:- నిజామాబాదు జిల్లా కామారెడ్డి తాలూకా, సదాశివ నగిరి నివాసియగు శిష్ట్ల వేంకటేశము. రచన యంతప్రశస్తమైనదికాదు. (ఈ చిరుతల నాటకములనునవి చిరుతల నాట్యమండలి యను నొక నాట్యమండలి వారి ప్రదర్శనముల కొఱకై రచింపబడినవి).

ఇవికాక యక్షగాన ప్రక్రియ (పాత్రల స్వవిషయోద్ఘాటనము మొ॥) రవంత గలిగి నాటకములని వ్యవహృతములై తెలంగాణాలో నిటీవల వెలసిన రచనలు కొన్ని గలవు. ఉదా: కథలాపురం గంగాధర కవి చిరుతొండ నాటకము, శివకుమార నాటకము, రాజక్కపేట మానధారి నాటకము, వేముగంటి శ్రీనివాస కవి సత్యహరిచంద్ర, ఈరబత్తిని నరసింహులు మదనవిజయము, గాజుల స్వామిదాస స్వరోచ్యుపాఖ్యానము మొదలగునవి (ఇవి యన్నియు కొండావారిచేతను, చందావారి చేతను, బ్రచురితములైనవి). వీని రచనా ప్రక్రియ పనుస హనుమద్దాసు, బూరుగుపల్లి సోదరకవుల నాటక కృతుల ప్రక్రియ కతిసన్నిహితముగా నుండును. ఈయాటింటను నటీ సూత్రధారుల ప్రస్తావన, ప్రయోగ సూచనలు, సంధివచన విరహితముగా వచనములోఁగూడ సూటిగా సంభాషణలు మొదలగు విషయములు సమానము. స్వరోచ్యుపాఖ్యానము వీథినాటకమని పేర్కొనబడుటయు నంకవిభాగ ముండుటయు విశేషములు. ఈకలగాపులగపుఁ బ్రాచ్య పాశ్చాత్య ప్రాచీనాధునాతన రంగస్థల వీథినాటక ప్రక్రియలో యక్షగానపుఁబాలు నెన్నవలసిన పనిలేదు.

# పరిశిష్టము

## (1)

### కాలము తెలని యక్షగాన కవులు – కావ్యములు

### 1. అక్కనామాత్యుడు:

బ్రాహ్మణుఁడు. భారద్వాజసగోత్రుఁడు. సరబాద లింగోజీ పుత్రుఁడు. ఇతని కృతి బాలకృష్ణలీలా విలాసము. (తం.స.మ.–కే. సం. 555) సత్యా రుక్మిణుల సవతి మచ్చర మిందలి ప్రధాన విషయము. రచన యొకమోస్తరు. నాటకమని పేర్కొనఁబడినది. యక్షగాన ప్రక్రియ సమృద్ధిగాఁ గలదు. ప్రదర్శనోద్దిష్టమైనది.

### 2. అక్కయకవి:

శ్రీరామమంత్రిపౌత్రుఁడు. తిమ్మయ దండనాథ పుత్రుఁడు. ఇతనికృతులు :– (1) భీమసేన విజయము (తం. స. మ. - సం 489-93 రాజమండ్రి ఆంధ్రేతిహాస పరిశోధనమండలిలో నొక యసమగ్ర ప్రతి గలదు) (2) కృష్ణవిలాసము (తం. స. మ., సం, 478. ప్రా. లి. పు. భాం. కన్నడ డి. నం. 1330 – పుట 7 లో గ్రంథాంత ద్విపదమాత్రము గలదు.) భీ. సే. వి. కథ – కీచకవధము. ఇందు తిక్కన రచన యనుకరింపఁ బడినది. కృ వి. న గోపికలతోఁ గృష్ణుని పోకిళ్ళు ప్రధాన విషయము. రెండును గడు ప్రశస్తరచనగల యక్షగానములు. తాళప్రధానములగు దరువులతో దేశీయగీతి బంధ బహుళముగా నున్నవి. ప్రాచీనయక్షగాన ఫక్కిఁ దలఁపించు చున్నవి. కృ వి. న రచ్చతాళము, లఘుశేఖరము నను తాళవిశేష

ములు, అర్ధచంద్రికలు, ధవళములు, రచ్చ్రేకులు, జంపె రేకులునుగలవు. భీ. సీ. వి. స సలలు, అనువులు, త్రిస్తుకలును విశేషములు.

## 3. అనుమ కొండపుర పోత్తముఁడు:

ఆత్రేయసగోత్రుఁడు. ఆదిశుక్లయజుశ్శాఖీయుఁడు. నివాసము చనుగొండ్లాపురము (కర్నూలు జి. రామల్లకోట తా.) ఇతని పితరుల తరములు:- భాసయ, ఓబమ - రంగయ, వెంగమ - చినవెంగన - వెంగమ - కవి. ఇతని కృతి అంగజవిజయము. (ఆం. సా. ప. 34) సృష్టికాండమందు మన్మథునకుఁ గల ప్రాముఖ్యమిందు వివరింపఁ బడినది. ఇం దర్ధచంద్రికలు, హెచ్చు. దరువులు తాళప్రధానములు. రచనయొక మోస్తరు.

## 4. అమనచర్ల కోదండరామయ్య:

ఇతనికృతి విజయవిలాసము. (శ్రీనికేతన ము. శా., మదరాసు, 1870) ఇందలి కథాప్రణాళికకుఁ జేమకూర ప్రబంధ మొరవడి. కాని రచనలోఁ బ్రయత్నపూర్వకమైన యనుకరణము లేదు. ఇందు కొరవంజిపాత్ర విశేషము. కొరవంజి శబ్దమిం దెఱుకతచెప్పు' సోదెకుఁ బర్యాయముగాఁ బ్రయుక్తమగుట యింకొక విశేషము. ఇందుఁ దాళప్రధానములగు దరువులు, అర్ధచంద్రికలు, నెక్కువ. రచన సరసమైనది.

## 5. అయ్యగారి పీరకవి:

కౌండిన్యసగోత్రుఁడు. ఉమ్మనామాత్య పుత్రుఁడు. వీరన పౌత్రుఁడు. వెంకట శివన్న కగ్రజుఁడు. ఇతనికి వెంకటుఁడను పితృవ్యుఁడు గలఁడు. ఇతని కృతి చిత్రాంగద విలాసము లేక ధర్మాంగద చరిత్రము (పా. లి. పు. భాం., ఆర్. నం. 417), మదరాసు విశ్వవిద్యాలయ ప్రతులు: 531, 699) ఈగ్రంథమున మల్కాపుర విశ్వే

శుఁడు, కూర్మనాథుఁడు స్తుతింపఁబడిరి. వేగావతి నది ప్రసక్తియొకచో గలదు. ఆయూరు నానది శ్రీకూర్మక్షేత్రము విశాఖ మండలమునఁ గలవు. ప్రా. లి. పు. భాం. ప్రతి విశాఖమండలమునుండి సంపాదింపఁ బడినది. కవి విశాఖ మండలమువాఁడు గావచ్చు. గ్రంథ విషయము ప్రసిద్ధమగు పాముపాట జానపదగాథ. గ్రంథము మూఁడాశ్వాసము లుగా విభక్తము. కవి "యక్షగాన మొనరింతు వేషముల్గట్టి జనులు పాడి వినుపింప" అని వక్కాణించినాఁడు. ఇందు పాత్రప్రవేశ రంగ ప్రయోగసూచనలు, పాత్రల స్వవిషయ నివేదనము గలవు. 1800–1850 ప్రాంతపు రచనగాఁ దోఁచుచున్నది. రచన యొకింత రసవంత మైనదే.

## 6. ఏనుగలూరి పాపరాజు:

వేఁగినాటి బ్రాహ్మణుఁడు. కాశ్యపసగోత్రుఁడు. గంగాచల మంత్రి పుత్రుఁడు. తొండూరు (కడప జి. పులివెందల తా.) ఇతని కృతి రుక్మాంగద చరిత్రము (వెస్టువార్డు ప్రచురణ, మద్రాసు, 1937) ప్రకటన కర్తలు మాత్రమే యక్షగానమని పేర్కొనిరి. ఆ ప్రక్రియ యంతయుఁగలదు. గ్రంథారంభము నందలి "చోపుదారి వేషకథ", వచన సంభాషణలు మొ... విషయములు జూడ నాధునిక రచన యని తోఁచును. రచనాకాలము నళవత్సరముగాఁ బేర్కొనఁబడినది. అది 1856 కాని 1916 కాని కావచ్చును. రచన చక్కనిదే.

## 7. కత్తి వీరాస్వామి:

వాల్మీకి గోత్రజుఁడు. రామస్వామి పుత్రుఁడు. ఇతని కృతి హరిశ్చంద్ర నాటకము (జీవరత్నాకర ము. శా., మదరాసు, 1906, అ. డై. ప్రెస్సు, మదరాసు, 1924) ఇం దాస్థాన సంతోషి తెరలోని

పాత్రలను బఱ్కరించుట, పాత్రలు వచనమున సంభాషించుటయుఁ గలవు. ఆధునిక రచన యనవచ్చును. గౌరన శంకర కవుల ద్విపదలు పద్యములును గ్రహింపఁబడినవి. ఈకవి రచనయుఁ గొంతసరసమైనదే. గ్రంథము తిరువళ్లూరు వీరరాఘవున కంకితము.

## 8. కీర్తి మల్లప్ప:

ఇతని కృతి తులాభారమను పుణ్యక వ్రతము (వేణుగాన ము. శా., మదరాసు, 1928). బూదూరి కేశవాంకితము. ఇందలి ముత్తైదువుల ముచ్చటలు గ్రంథముయొక్క యాధునికతను స్ఫురింపఁ జేయును. రచన యొక మోస్తరు. ఇది యక్షగానముగా స్త్రీలపాటగాఁ బేర్కొనబడినది.

## 9. కూరపాటి అమరలింగామాత్యుఁడు:

వీపూరి వీరభద్రేశ భక్తుఁడు. గూడూరి సిద్ధలింగయ శిష్యుఁడు. ఇతని పితామహులు అమర లింగయ్య, వీరమ్మ. తలిదండ్రులు శరభమ, పెదరామ లింగయ్య. చిన రామలింగయ, వీరయ్య, మల్లయ్య, వీర భద్రయ్య యనువార లితని పితృవ్యులు అనుజుఁడు వీరయ్య. ఇతని కృతి పార్వతీ కల్యాణము (ప్రా. లి. పు. భా, డి. 1909). 3 ఆశ్వాసములు. ఇందు రగడ, సడలు, లఘువులు, అర్ధచంద్రికలు, రచ్చరేకులు మట్టె రేకులు మొ॥ దేశి రచనలు గలవు. కపోతకమను వృత్తవిశేషము గలదు శైలి చక్కనిదే కాని శివకవి సామాన్యములగు ఛందో వ్యాకరణ దోషము లనేకము గలవు.

## 10. కొత్తూరు రామలింగార్యుఁడు:

నాకనాడు కులజుఁడు, సదాశివ గోత్రజుడు. తల్లిదండ్రులు గోవిందాంబ, గంగిరెడ్డి. కృతి మహాభారతనాటకము. (సి. వి. కృష్ణా

బుక్ డిపోవారి ప్రచురణ మదరాసు. 1949) ఆది పర్వము నుండి శల్య పర్వము వఱకుఁగల తొమ్మిది పర్వములు, గదాపర్వము (భీమ దుర్యోధనుల యుద్ధము) నిందు గలవు. (అచ్చులో సుమారు 300 పుటల గ్రంథము) ఇదంతయుఁ బ్రదర్శనోద్దిష్టమై యక్షగానపు "బాణీ" నున్న రచన. ఇందు ప్రసిద్ధరాగములలో దరువులు, పద్యములు, కందార్థములు, ద్విపదలు, సంధి ద్విపదలు, సంధి పద్యములు, సంధివచనములు, సంభాషణ వచనములును గలవు. చోపుదారి ప్రసంగములున్నవి. రచన ప్రశస్తమైనదే.

## 11. కోటపేటు రాఘవరెడ్డి:

నా(పా?)కనాడు కులజుఁడు. అచ్యుతగోత్రజుఁడు. తలిదండ్రులు పాపను, వెంకటరెడ్డి. కృతి ధర్మాంగద నాటకము (శ్రీరామానుజ విలాసము. శా. మదరాసు, 1925) వెంకటపురీశున కంకితము. రచన యాధునిక మని యనిపించుచున్నను సలక్షణము. సరళమైనది.

## 12. కోసూరి గంగాధరకవి:

యజుశ్శాఖి. హారితస గోత్రుఁడు. గంగరాజపౌత్రుఁడు. పాపమాంబా పుల్లమ్మరాజుల పుత్రుఁడు. కృతి యొక కురువంజి (ప్రా. లి. పు. భాం. డి. సం. 1857) ముక్తికాంత మనఃకాంత కెఱుక చెప్పాటయిందలి విషయము. రచన సరళమైనది నిర్దుష్టము గాదు.

## 13. గుడిపాటి రామదాసు:

కాశ్యపసగోత్రుఁడు. వెంకట రత్నామాత్య పుత్రుఁడు. రామయ పౌత్రుఁడు. ఇతని నివాసము వడాలి (కృష్ణా జి. గుడివాడ తా॥) కృతి కాళిందీ విలాసము (ఆం. సా. ప., సం. 905) నాటకాలంకార కావ్య ప్రబంధమని పేర్కొనఁబడినది. కాని భామకలాపపు

"బాణీ" నున్నది. రచన యలంతి దోషములు గలదైనను సరసభావ సమృద్ధము. ఇందు పాత్రలు "తెరలోకి వచ్చుట", తెరవెళ్ళి వచ్చుట, తెరలో నుండియే ప్రసంగించుటయుఁ గలదు. సంవాద సందర్భము లందలి వచనములు ముచ్చట లని పేర్కొనబడినవి.

## 14. గుడిమెట్లరామయ:

గురునాథసూరి పుత్త్రుఁడు. ఇతని కృతి సత్యభామా కృష్ణసంవాదము లేక భామా కలాపము (ఆంధ్రేతిహాస పరిశోధక మండలి ప్రతి నం. 13) కృతి ప్రోత్సాహకుఁడు "బొబ్బిలి నృపాలపాలిత దేశాంత రాళ విలసిత గోళవలసాగ్రహార (పాలకొండ తాలూకా) నివాస భూసురాగ్రేసర దూసికులీన సూరయాభిధానుఁడు" (కౌండిన్యస గోత్రుడు. సుబ్బమా పద్మనాభుల పుత్త్రుఁడు) ఇదియొక చక్కని ప్రౌఢి సారస్యములుగల భామా కలాపము.

## 15. గురుసిద్ధలింగము:

ఇతని కృతి శ్రీగిరి కురవంజి. (డి. నం. 1856) శివ పార్వతుల వివాహకథ యిందు వర్ణితము. ఇందలి కురవంజి మాయాశక్తి. ఇది శ్రీ శైలేశున కంకితము. ఇందు నివాళి పదములు, గౌరీ కల్యాణము మొ...పద విశేషములు గలవు. రచన సరళమైనది. నిర్దుష్టముగాదు.

## 16. (ఘట్టు) రామకవి:

ఇతని కృతి ఎఱుకల కల్లి. (ఆం. సా. పం., నం. 1513) ఎదురుకొండ నరహరి ముద్రగలది. పార్వతి కొరవంజియై సత్యభామ కెఱుక చెప్పుట యిందలి విషయము. రచన యొక మోస్తరు. ఎదురు కొండ కేశవాంకితమైన గొల్లకలాప మొకటి (ఆం. సా. ప. 3807)

యితని రచన కావచ్చును. ప్రా. లి. పు. భాం. ఆర్. 172 పట్టాభి రామాయణమునఁ దత్కర్త ఘట్టు వేంకటరామకృష్ణకవి "తాళాది రాగ సందర్భ నాటక వేషజాతీయ విధములు సల్పినాఁడ" నని చెప్పు కొనెను. ఆతఁడు నీతఁడు నొక్కరే యగుదురేమో!

## 17. చింతలపల్లి లచ్చిరాజు:

ఇతఁడు ప్రా. లి. పు. భాం., రూపవతీ చరిత్ర య. గా. కృతి కర్తయని ఆం. వా. సూ. లోఁ గలదు. దాని మూలప్రతి డి. 132. దానిని బట్టి తయారైన కాగితపుఁ బ్రతి ఆర్. 1469, మూలప్రతి నే డేలనో మృగ్యమైనది. అందు గ్రంథకర్త పేరుండి యుండును. ఆం. వా. సూ. కర్తలది చూచి యుందురు. ఆర్. 1469 లోఁ గర్త పేరు గాన రాదు. కృతి నాయకుఁడైన జన్నియ ముసల భూపతియే యిందలి కథానాయకుఁడును, అతని మంత్రివర్గమునఁ జింతలపల్లి రామనమంత్రి యొకడు పేర్కొనబడినాఁడు. లచ్చిరాజతని తమ్ముఁ డగునేమో! ఈ ముసల భూపతి వంశాను చరిత మిట్లు పేర్కొనఁబడినది: పితా పుత్ర క్రమము జన్నియ నరస - కరియ - సిద్ధ - తిమ్మ - వేమ ముసల (1)- పెదవేమ (భార్య సిరియమాంబ)-ముసల (2) భూపతులు, ఈ రెండవ ముసల భూపతియే కృతిభర్త. ఇతఁడు గడియంకభీమ, వడ్డియ దళవిభాళ, శలగోల బిరుదాంకుఁడు. ఇందతని భార్యలు బంధు మంత్రి వర్గమును జాలమంది పేర్కొనఁబడిరి. కాని యితఁ డేయూరి ప్రభువో, ఏపాటి ప్రభువో, ఏనాటివాఁడో తెలియుటలేదు. గ్రంథ విషయము:- ముసలభూపతి సపరివారముగా స్వారివెడలి యుత్తర పినాకినీ పరీవాహప్రాంత విపినమున వేటలాడి పెన్నయహోబలక్షేత్ర మునకేఁగి యఁట శఠగోప జియ్యరు శిష్యుఁడైన కిడాంబి రామానుజా చార్యుని పుత్రత్రయము వెంకట తిరువెంగళ రామాచార్యులనువారిలో

నగ్రజునిచే శంఖచక్రాంకితుఁడై స్వామికి గరుడోత్సవము జరిపి పురోన్ముఖుఁడాయెను. అపుడు రూపవతియను వారవనిత యతనిఁ జూచి మోహించినది. అంత నామె విరహవేదన - చెలికత్తెచే రాయబారము - నాయకుని సమ్మతి - నాయికా నాయక సమాగమము. ఇది తంజావూరు నాటకములలోని యులా ప్రబంధ ఫక్కినిఁ దలపించుచున్నది. రచన నిర్దుష్టముకాదు గాని సరసముగనే యున్నది. ఇందర్ధ చంద్రికలు, ఏలలు, ధవళ శోభనములు, రగడ, కోలాట పాటలు, మొ ... దేశి రచనలు గలవు.

## 18. చిగుళ్ళేపు కృష్ణమార్యుఁడు :

ఇతని పితృ పితామహులు శ్రీనివాసానందాచార్యులు కృతి పద్మినీ విలాసము. (ఆర్. నం. 900) తిరువళ్ళూరు వీరరాఘవస్వామి కంకితము. రాయ చౌహత్తమల్లుఁడను రాజు కూఁతురు పద్మినిని శ్రీరంగ పతి వివాహమాడుట యిందలి కథ. ఈపద్మినినే ఒరయూరు నాంచారందురు. ఇందలి దరువులు తాళప్రధానములు. ఇందు ధవళ శోభనములు, కళికలు గలవు. రచన యొక మోస్తరు.

## 19 చెన్నయ్య :

ఇతని య. గా. కృతి ఉషా పరిణయము - ఆర్. 753 - ఈ సంపుటమునందేగల చెన్నయ కృతమగు యయాతి చరిత్ర ప్రబంధ గద్యనుండి యితఁ డాపస్తంబ సూత్రుఁడు, నాత్రేయసగోత్రుఁడు కృష్ణయ పుత్రుఁడునని తెలియుచున్నది. ఉషాపరిణయమునఁ దాళ ప్రధానములగు దరువులు నొకరెండు దేశిరచనలును గలవు. రచన యప్రౌఢము.

## 20. చౌదరి రామదాసు :

కమ్మకులజుఁడు. కొలుచునూళ్ళ గోత్రజుఁడు. ప్రపితామహులు వెంకమాంబా ముత్తనలు. పితామహులు గంగమాంబ, నాయఁడు. తలిదండ్రులు కోనమాంబా గురువప్పలు. అగ్రజుఁడు రాయప్ప. ఇతని కృతి రుక్మిణీకల్యాణము. (ఆం. సా. ప. 3750. ఆర్. 458) సరస రచన. సింగీ సింగళ్ళ ఘట్టము మనోజ్ఞమైనది. సింగడు కోతి నాడించిన పాట చక్కఁగా నున్నది. ఇం దర్ధచంద్రికలు, ఏలలు, అల్లో నేరేళ్ళు, శోభనము, సువ్వి, లాలి, మట్టె మొ... దేశి గేయములు గలవు. గ్రంథమధ్యమున "మారకపురీ శ్రీ చెన్నరాయాధిపా" అను మకుటముతో నాల్గుపద్యములు కలవు.

## 21. జిల్లేళ్ళమూడి వెంకటరామామాత్యుఁడు :

ఇతని కృతి జాంబవతీ విలాసము (ఆం. సా. ప. 3066) తంగటూరి చెన్న కేశవాంకితము. భామ కలాపము "బాణీ"ని సాగిన జాంబవతీ ప్రణయకథ యిందలి ప్రధాన విషయము. ఇది శృంగార నాటకమని పేర్కొనఁబడినది. ఇందు పదపద్యములు, ద్విపదలు, తాళ ప్రధానములగు దరువులు, ఏలపదములు, సంస్కృత శ్లోకములును (కొన్ని అమరము, గీతలనుండి గృహీతములు) దేనుగునఁ దద్వ్యాఖ్యానమును గలవు. గ్రంథ "మభినయ శాస్త్రపద్ధతిని" రచించితినని యున్నాఁడు కవి. రచన సలక్షణము, సరళమునైనది. చక్కని జాతీయత గలది.

## 22. జోగరాజు భార్గవకవి :

కౌశిక సగోత్రుఁడు. చిదంబరార్యుని పౌత్రుడు. సంజమాంబా లక్ష్మీనరసాఖ్యుల పుత్రుడు. ఇతని కృతి గయోపాఖ్యాన నాటకము.

(వెస్టువార్డు ప్రచురణ, మదరాసు, 1954) కృతి ప్రోత్సాహకుఁడు పెద చింతకుంట పురవాసి కుందూరు శేషారెడ్డి. ఇందు కర్ణాటక హిందూస్తానీ రాగ తాళములలో దరువులు, జావళ్లు, ద్విపదలు, పద్యములు, ఏలలు, కందార్థములు, సంధి - సంభాషణ వచనములు, పాత్రప్రవేశ ద్విపదలు, దరువులు, గ్రంథారంభమున "ద్వారకుని వేషపుకథ" తుదకములో వాని ప్రసంగము, వాఁడు పాత్రలను బృచ్ఛించుటయుఁ గలవు. రచన యంతప్రశస్తమైనది కాదు. గేయనాట్యప్రయోజనోద్దిష్టమైనది. ఆధునిక కృతి యని తోఁచును.

## 23 ఏకుమళ్ళ మృత్యుంజయుఁడు :

ఆపస్తంబ సూత్రుఁడు, వాధూలసగోత్రుఁడు. చెంచమ్మ సుబ్బాశాస్త్రిల పౌత్రుఁడు. లక్ష్మాంబాకృష్ణార్యుల పుత్రుఁడు. తలమంచి (నెల్లూరు తాలూకా) పురనివాసి. ఇతనికృతి గౌరీశంకర విలాసము. కుడితిపాళెము (నెల్లూరు తా.) వాసి అల్లూరి ఆదినారాయణ కృతి ప్రోత్సాహకుఁడు. "అలకలదోపు యక్షగాన" మని దీనికి నామాంతరము. శివుని దారుకావన క్రీడలఁగూర్చి నారదునివలన విని గౌరి యలుక చిత్తగించుటయు, నయ్యవారమ్మ వారినిఁ దియ్యారించుటయు నిందలి ప్రధానవిషయము. ఇందువర్ణమెట్లు, కందార్థములు నెక్కువ. రచన చక్కనిది.

## 24. తూము సీతారామదాసు:

ఆధునికుఁడని వినికిడి. ఇతని కృతి శ్రీమద్భగవద్గీతాసారము (రాజన్ ప్రెస్, రాజమండ్రి. ద్వితీయ ముద్రణ—1933) ఇది కవిచేతనే యక్షగానమని పేర్కొనఁబడి యున్నను నిందు భగవద్గీత 18 అధ్యాయములు నొక్కొక్క టొక్కొక్క రాగైకము దాళైకమునగు కీర్త

ఎగాసాగినది. ఇదియక్షగానమగు నెడల యక్షగానమింక గేయప్రబంధ సోపానాగ్రిమాచి యనవచ్చును. ఇందలి రచన చక్కనిది.

## 25. తేరులపురి నారాయణకవి :

శ్రీవత్సస గోత్రుఁడు. కిచ్చయప్రపౌత్రుడు చలమయ పౌత్రుఁడు. మూర్త్యంబా శేషయార్యుల పుత్రుఁడు. ఇతనికృతి నల చరిత నాటకము (చామరాజ ప్రెస్, మూలై, మదరాసు, 10-9-1903) తేరులపురి శౌరి కంకితము ఇందాశ్వాస విభాగము విశేషము. రచన సలక్షణము సరసము నైనది.

## 26. దుర్గరాజు చిదంబరము :

భారద్వాజస గోత్రుఁడు. ఆర్వేల నియోగి. శాణప్పపౌత్రుఁడు. జానకీదేవి వెంకట రాముల పుత్రుఁడు. రెండుచింతల పురవాసి. అగ్నంకి తిరుమలార్యుని శిష్యుఁడు. గొట్టిపోళ్ళ వేంకట తిరుమలార్యుడు కృతి ప్రోత్సాహకుఁడు. ఇతని కృతి అనిరుద్ధ నాటకము. (శ్రీరంగ విలాస ము. శా., మదరాసు, 1930, వెస్టువార్డు, 1953) ఉషానిరుద్ధుల వివాహకథ యిందు వర్ణితము. గ్రంథారంభమున "ద్వారకాని"రాక (దౌవారి యనియు నిందు వ్యవహృతుఁడు.) వాఁడు తెరకమునుఁ బ్రసంగించుట, పాత్రలను బలకరించుట, పాత్రప్రవేశపు దరువులు తెరద్విపదలును, సంధి – సంభాషణ వచనములు గలవు. రచన యాధునిక మైనదని పించును. సలక్షణము సరసమునైనదే.

## 27. దేవర శ్రీనివాసకవి :

మాధ్వుఁడు. ఆశ్వలాయన సూత్రుఁడు. కాశ్యపస గోత్రుఁడు. తలిదండ్రులు లక్ష్మమ, నారాయణమూర్తి. గురువు పెళ్ళపాలెపూరి

వెంకటరాయుఁడు. ఇతని కృతి అనిరుద్ధ చరిత్రము లేక ఉషా పరిణయము. (ప్రా. లి. పు. భాం, డి. సం. 1968, ఆం. సా. ప., 2397, 3388. అసమగ్రములు ఆం. సా. ప., ప్రతులలోఁ గవి పేరే లేదు. ప్రా. లి. పు. భాం, ప్రతిలోఁ బేరితోపాటు పై విశేషములును తెలిసినవి. మూఁడు ప్రతులను సరిపోల్చిచూచి యొక గ్రంథముయొక్క ప్రత్యంతరములే యని కనుగొంటిని). ఇది నాటకమని పేర్కొనఁబడినది. యక్షగాన ప్రక్రియా ప్రకృష్టమైనది. ఇందలి రచన నిర్దుష్టముగాదు గాని కొండలను కొన్నట్లు నీరసమునుగాదు. కొన్ని కొన్ని పట్టుల మిక్కిలి సరసమైనది.

## 28. నందవరము సింగన :

బుక్కపట్టణ నివాసి. ఓబళ మంత్రిపౌత్రుఁడు నారాయణుని పుత్రుఁడు. ఇతని కృతి పారిజాతము (డి 1901, 1902). కంభము కృష్ణున కంకితము. ప్రశస్తరచన కాదు. అంత ప్రాచీనమైనదిగాఁ దోఁపదు.

## 29. నాగాన్వయ అప్పయ :

ధర్మాఖ్యుని శిష్యుఁడు ఇతని కృతి చంద్రశేఖర విజయము (ఆం. సా. ప. 1622). శివుని త్రిపుర విజయకథ యిందు వర్ణితము. ఇది నాటక కావ్యమనియు నాటక ప్రబంధ మనియుఁ బేర్కొనఁబడినది. ఇందు కందార్థములు తఱచు. రచన యపేలవమైనది.

## 30. పట్టాభి రామయ్య :

సూర్యనారాయణసోమయాజి పుత్రుఁడు. ఇతని కృతి సుందర కాండము (ఆం. సా. ప. నం. 181, 275. రెండవదానిలోఁ గవిపేరు

కాసరాదు. కాని యది 181 కిఁ (బత్యంతరమే). ఇందలి యవతారికలో తంజావూరు రఘునాథ రాయ రామాయణములోని "శ్రీసీతాలలితాంగీత్యాదియగు పద్యముండుట విశేషము. ఇది గేయ ప్రబంధమని పేర్కొనబడినది. రచన సలక్షణము, సరమునైనది.

## 31. పాతూరి తిరుపతి :

నూతక్కి (గుంటూరు తా.) కరణము. ఆపస్తంబ సూత్రుఁడు. శ్రీవత్ససగోత్రుఁడు. పేరయపౌత్రుఁడు. అమ్మయకు నెల్లమాంబకుఁ బుత్రుఁడు. ఇతని కృతి సుందరకాండము (ఆర్. 870) తుమ్మపూడి (తెనాలి తాలూకా) హనుమంతునకుఁ గృతి. ఇదియక్షగానమని పేర్కొనఁబడక పోయినను నిందు కీర్తనలు, ద్విపదలు, పద్యములు, వచనములును గలవు. కవి కథను నాటకీయముగ నడిపించినాఁడు. కాని రచనలోఁ బట్టుతక్కువ, తప్పులెక్కువ. తుమ్మపూడి హనుమంతునకుఁ గృతులగు హనుమద్విజయములేక మైరావణ చరిత్ర ఆర్. 451, ఆర్. 939, డి. 1928, డి 1929), రామాయణము (ఆం. సా. ప. 2986) నితని కృతులే కావచ్చును.

## 32. పాల వెంకరి బోడిమల్ల భూపాలుఁడు :

గురిగింజ గుంట (జి. కడప, తా. రాయచోటి) పురాధిపతి. అప్ప భూపతికిఁపౌత్రుఁడు. ఎల్లమాంబా బొజ్జమల్ల భూపతులపుత్రుఁడు. ఇతని తమ్ముఁడొక అప్పభూపతి గలఁడు. ఇతని కృతి జానకీపరిణయము (ఆంధ్రేతి హాసపరిశోధక మండలి (ప్రతి నం 31, ఆం. సా. ప. 354, తం. స. మ. 481—482— ఇందుకర్త పేరు కనిపింపదు కాని పైకృతి ప్రత్యంతరమే యని గుర్తించితిని). ఇది అల్లో నేరేళ్ళు, త్రిభంగులు, రచ్చరేకులు, తుమ్మెద పదము, ఏలలు, అర్ధచంద్రికలు ,ధవళ

శోభనములు మొ... దేశి గీత ప్రబంధము లనేకముగల యక్షగానము. దోపల్లె కంభము రామభద్రుని కంకితము.

## 33. శ్రీపెరుంబూదూరి తిరువెంగళామాత్యుడు :

యతీంద్ర గోత్రుడు. రామబాన్నార్య పుత్రుడు. ఇతని కృతి సింహాచల విలాసము. (ఆంధ్రేతిహాస పరిశోధక మండలి — నం. 395, 49) ఎవరో యక్కా సెలెద్రిపురు సెలాని క్షేత్రమును దర్శించి క్షేత్ర దైవతముల ప్రశంస చేయుట యిందలి ప్రధాన విషయము. ఇది య. గా. ప్రబంధమని పేర్కొనబడినది. పంచాశ్వాస విభాగము గలదు. కవి బంధగర్భ కవితా నైపుణిని ప్రదర్శించెను. రచన చక్కనిది.

## 34. పోలుగంటి వెంకట కృష్ణయ్య :

నరసమాంబా చిట్టయ మంత్రుల పుత్రుడు. కేశవ గురు శిష్యుడు. ఇతని కృతి శారదకురవంజి కట్టడ (కీ. 1942). కృష్ణుని తోడి వివాహము గూర్చి తలపోయుచున్న లక్ష్మికి కడకు సరస్వతి కురవంజియైవచ్చి యెఱుక చెప్పుట యిందలి విషయము. రచనయొక మోస్తరు. నిర్దుష్టము గాదు.

## 35. ప్రసంగి రంగప్ప :

ఇతని కృతి రుక్మాంగద చరిత్ర (తం. స. మ. కే. నం. 580-81) నాటకమని పేర్కొనబడినది కాని రచన ప్రబంధోచితము. ఇందు ప్రౌఢకవిమల్లన రుక్మాంగదచరిత్ర పద్యములెక్కువ గ్రహింపబడినవి. హారవిలాసము, శృంగార శాకుంతలము, కాళహస్తీశ్వర మాహాత్మ్యము, వాల్మీకి చరిత్రము, విజయ విలాసము మొదలగు ప్రబంధములనుండి గ్రహింపబడినవియు గొన్ని గలవు

## 36. భృగుబండ లింగకవి :

పోలనపుత్రుఁడు. ఇతని కృతి లక్ష్మణ ప్రాణరక్షణము. (డి. 1938) పవని గోపాలస్వామి కంకితము. రచన నిర్దుష్టముగాదు. నీరసమైనది.

## 37. బేతపూడి పరబ్రహ్మకవి :

శ్రీవత్సగోత్రుఁడు. లక్ష్మీనారాయణామాత్యపుత్రుఁడు. ఇతని కృతి శ్రీయాళ (సిరియాల) నాటకము. (ప్రచురణ రంగా వెంకటరత్నము, గ్రంథ విక్రేత, బెజవాడ. సం. తెలియదు). భటుని హిందీ ప్రసంగము, పాత్రల తెరద్విపదలు, వచన ప్రసంగములు, గ్రంథమధ్యమున సూత్రధారుఁడు పాత్రలతో సంభాషించుటయుఁ గలవు. రచన సరసమైనది. ఆధునికతా ముద్రగలది.

## 38. బొడ్డుచర్ల సుబ్బకవి :

సంగ వరీకుఁడు. శ్రీవత్సగోత్రుఁడు సుబ్బమ జ్వాలయామాత్యుల పౌత్రుఁడు. వెంకమాంబా బాచయల పుత్రుఁడు. ఇతనికిఁ గృష్ణయ యను పినతండ్రి; పేరమాంబయను మేనత్త, శేషాద్రి, జ్వాలాపతి పిచ్చమాంబయను ననుజులును గలరు. బండివారి నాగులవరమితని నివాసము. మేడవరము సూరావధాని, చింతలపల్లి శివరామయ్యాయు నితని గురువులు. ఇతనికృతి లక్షణా పరిణయము (వంకాయల కృష్ణస్వామి అండు సన్ వారి పచురణ, మదరాసు. 1915) కృతి ప్రోత్సాహకులు, మేడవరము తిరుమలయ్య, మార్కాపురవాసి దడికమళ్ల వెంకటప్పయ. గ్రంథవిషయము: కృష్ణునియష్ట మహిషులలో నొకతె యగు లక్ష్మణ పెండ్లికథ. నాటకమని పేర్కొనఁబడినది. రచన సరసమైనది. ఆధునికమైన దనిపించును. ఇందు సంధ్యార్థములవలె

వృత్తార్థములును, సంభాషణ వచనములును గలవు. (ప్రహ్లాద చరిత్ర, మిట్టమరి రామాయణ యక్షగానముల కర్త మఱియొక బొడ్డుచర్ల సుబ్బకవి గలడు).

## 39. మూళగిరి కవి :

వావిలపాడు నివాసి. ఇతని కృతి ఉషాపరిణయము. (ఆం. సా. ప. 1319) రచన యొక్క గాస్తరు. ఇందలి దరువులు తాళ ప్రధానములు కొద్దిదేశి రచనలు గలవు.

## 40. మేరికపూడి కృష్ణయ :

భారద్వాజస గోత్రుండు. ఇతని ప్రపితామహుండు వేంకటనారాయణ. పితామహుండు పేరయ ఇతని సోదరులు వెంకయ, రంగయ తలి దండ్రులు సీతమాంబా లక్ష్మీనృసింహులు. పెదతండ్రి వెంకట నారాయణ. పినతండ్రి రామయ. అగ్రజుండు హనుమత్కవి. ఇతని కృతి రంభారావణ సంవాదము (భైరవ ము. శా.' బందరు, 1895) ఎవరో వేపారి కులజులు కృష్ణరావు, హనుమంతరావు, నాగేశ్వరరావు అనువారు కృతి ప్రోత్సాహకులు. రచన నిర్దుష్టము శయ్యాలాలిత్యముగలది. ఆధునిక కృతి యనిపించుచున్నది.

## 41. రామకృష్ణారెడ్డి :

భానుపురి నివాసి. ఇతని కృతి తారాచంద్ర విలాసము. (వేంకటేశ్వర ము. శా. మదరాసు 1914) గ్రంథారంభమున రంభోర్వశులరాక గలదు. పాత్రల సంభాషణలు వచనములోఁగూడ సాగినవి. ఆధునిక రచన యని తోఁచును. ప్రశస్తకృతిగాదు.

## 42. రామలింగదాసు :

ఇతని కృతి శ్రీనివాస విలాసము (ఆర్. 457 గ్రంథము యొక్క రెండసమగ్రప్రతులు కలిసియున్న సంపుటమిది. గ్రంథమధ్యమున నొకచూర్ణికలో — 11 వ యాకు రెండవ ప్రక్కను, 29 వ ఆకు రెండవ ప్రక్కను మాత్రమే కవిపేరు కన్పించును). శేషాచలేశుఁడు చెంచెతను బెండ్లి యాడిన కథ యిందు వర్ణితము. ప్రౌఢబంధము గోడి ప్రబంధోచిత రచన. ఇందు చెంచుల యుదంతము హృదయంగమముగా వర్ణింపఁబడినది ఇందు మాధవి పాత్రకు బహ్వాసక్తి గల్గినది

## 43. రామలింగ దాసు :

పై రామలింగదాసుఁడు నితఁడు నొకరో కాదో తెలియదు ఇతఁడు పూరి పట్టణ నివాసి. ఇతని కృతి భాగవతము. (ఆం. సా. ప., 4310) కృష్ణజననము, బాల్యము, రుక్మిణీ కల్యాణము, నిందు వర్ణితములు. రచన సలక్షణమైనది. ఇక్కిలి చక్కనిది.

## 44. రామానుజమ్మ :

వరయూరు జియ్యరు తిరువడి సంబంధురాలు ఈమె కృతి శ్రీరంగనాథ పంగున్యుత్తరోత్సవ యక్షగానము (1927 లో శ్రీరామానుజ విలాస ము. శా. లో ముద్రితమై, కొత్తూరు రంగనాయకమ్మచే ప్రచురితము), దీనికి సంబెరు మాళ్లు చరిత మనియుఁ బేరు. ఇది పది నాళ్ళ రంగనాథస్వామి ఫాల్గుణోత్సవపు వేడుకలు ముచ్చటింపఁబడిన గ్రంథము స్వామిరంగనాంచారితో జెప్పకుండ వరయూరి నాంచారి కడ కేఁగుట — నారదుని కైలాటము — రంగనాచారు అలక — నమ్మాళ్వారి తియ్యారింపు — నాయికా నాయకుల

నలుపు కృష్ణసంవాదమును — తదుపరి సమాగమము మొదలగు విషయములు గలవు. ఇందు ద్విపదార్ధకందార్థ వృత్తార్ధములును, బలువిధముల పాటలునుగలవు. రచన యాధునికమైనదిగాఁ దోఁచును రకరకముల దోషముల కాకర మీ గ్రంథము. గ్రామ్యకావ్య ధోరణి హెచ్చు.

## 45. రాయపురి చెన్నయార్యుఁడు :

ఆత్రేయసగోత్రుఁడు. తిమ్మయజ్వ పౌత్రుఁడు వేంకమాంబా గిరిభట్టుల పుత్రుఁడు. వనిపెంట పురవాసి. ఇతనికృతి మల్లికా కల్యాణము. (ఆం. సా. ప 2043) కృష్ణాతీరస్థ శ్రీచంద్రపురాధిపుఁడగు చంద్రగుప్తుని తపఃఫలితముగా నతనిసతి చంద్రిక పార్వతీదేవినే శిశువుగాఁ బడయుట. ఆమెయే యాగంటి మల్లిక. ఆమె కల్యాణకథ యిందు వర్ణితము. ఇది యాగంటి క్షేత్రకథయై యుండును. రచన చక్కనిది.

## 46. లాలా కన్నయ .

కాయస్థ కులజుఁడు కాశ్యపసగోత్రుఁడు చెంచుగోపాల్ దాసు పౌత్రుఁడు. తిరుపతి పురవాసి. కన్నయ్యలాలనియని నామాంతరము. ఇతని కృతులు :— (1) సుంకరికొండని కథ. ( శ్రీరామానంద ము. శా. మదరాసు, 1906, ఆ డై. ప్రెస్, మదరాసు, 1925, 1950). సుంకరి కొండడు గొల్లకలాపములందు సాంప్రదాయికపాత్ర. ఇందు శ్రీకృష్ణుఁడే సుంకరి కొండఁడై నట్లు గలదు. గ్రంథమంతయు గొల్లభామకు సుంకరికొండయకు సంవాదముగా నడచినది చివర స్వామి నిజస్వరూపము జూపును. ఇది తిరుపతి గంగజాతర వినోద కాలక్షేపమునకై రచింపఁబడిన నాటకమని కవి యన్నాఁడు. ఇందలి భాష సలక్షణమైనది కాకపోయినను రచన సరసమైనదే. హాస్య ప్రకృష్టముగ నున్నది. భాషలో విలక్షణత గలదు. భావములలో

చిరసత్త్వము నున్నది. ఇందలి యుద్ధాపదములు, 'సీమ చీటీ రవికె గుడ్డ' మొదలగు ప్రయోగములనుబట్టి యిది యాధునికరచన యనవచ్చును. దరువులలోఁ దిరుపతి నరహరి ముద్ర గలదు. (2) శ్రీవెంకటేశ్వర పద్మావతీ పరిణయనాటకము. (ఎస్. వి ఎస్. ప్రెస్, తిరుపతి, 1909) ఏతత్కృతి ప్రోత్సాహకుఁడు తిరుపతి నివాసి జగన్నాధసింగు కొడుకు తులసీ రాంసింగు. ఇది వైదుర్మాత్రుల కధగ వింగడింప బడినది. ఇందు గ్రంధారంభమున "విఘ్నేశ్వరవేషఁ రాక" తెర ద్విపద, తెర వెడలు దరువు, పృచ్ఛక వాక్యములు, కంద సీసార్ధములు, సంధి వచనములతో పాటు సంభాషణవచనములును గలవు. రచన యాధునికమైనదని చెప్పవచ్చును. తప్పు లధికముగాని కొంతకుఁ గొంత సారస్యము లేకపోలేదు.

## 47. లింగన :

వావిలిపాటి నివాసి, వెలమకన్నె కులజుఁడు. వెన్నయ పౌత్రుఁడు. రామార్యుని పుత్రుఁడు. ఇతనికృతి వావిలిపాటి కొరవంజ నాటకము (అడయారు ది. స. గ్రంధాలయప్రతి జి. సం. 74874) పుత్రకామేష్టిచేయుచున్న దశరథుని సతులకడకు శివుఁ డెఱుకతయై పోయి వారికి సంతానముగూర్చి యెఱుకిచెప్పుట యిందలి విషయము. రచన పేలవమైనది.

## 48. లోకేరావు సోమన :

ఇతని బలభద్ర విజయ ద్విపదకావ్యము (తం. స. మ. కే. సం 306) నుండి యితఁడు లక్ష్మణాదేవీకల్యాణము, శుకరంభా సంవాదమునను రెండు యక్షగానములను రచించినట్లు తెలియుచున్నది కాని గ్రంథము లలభ్యములు.

## 49. వాలె కోటయ్య:

బుచ్చయ్యపౌత్రుఁడు. లింగమాంబా రాచయ్యల పుత్రుఁడు. నాగలింగయ్య, చెన్నమల్లయ, ముసలయ్య అను వారల కనుజుఁడు. మహాదేవికి సోదరుఁడు బీబిపేట ఘంటామరస్థిత మహాదేవర శిష్యుఁడు. పచ్చకాంత భగినీపుత్రుఁడును తోట మరబోధ పుర నివాసియునైన మంచికంటి నాగలింగయ్య కృతి ప్రోత్సాహకుఁడు. కృతి చిఱుతొండ భక్తకథానిధానము ( ఆర్. నం. 497). కథ ప్రసిద్ధము. బసవ పురాణోక్తము. ఇందు శివకవి కృతిసహజములైన దోషములు గలవుగాని యక్కడక్కడ రచన సరసముగనే యున్నది. ( ఇది తెలంగాణము నకుఁ జెందినకృతియని తోఁచును.)

## 50. వాసిలి సుబ్బయ:

విశ్వబ్రాహ్మణుఁడు వీరబ్రహ్మఖ్యునిపౌత్రుఁడు. కామాంబా వేమయాచార్యుల పుత్రుఁడు. అరికట్ల సోమయాచార్యుని శిష్యుఁడు. ఇతనికృతి రాజయోగసార నాటకము ( వంకాయలకృష్ణస్వామి సెట్టి ప్రచురణ, మదరాసు, సం. 1910 కాఁబోలు ) ఇందలి విషయము కపిల దేవ హూతీ సంవాదము తాత్త్వికము. భాగవతము నుండి గ్రహింపఁబడినది. రచనప్రశస్తమైనదికాదు. ఆధునిక మనిపించు చున్నది. కృతి మహిమలూరి వేణుగోపాలున కంకితము.

## 51. వీరభద్ర కవి :

"మరకాణ భూమీశ వరలబ్ధ కవితాదురంధరుఁ" డఁట. అతని తలిదండ్రులు కాశమాంబా లింగనాఖ్యులు. కవి పితామహుఁడు నీలకంఠయ దేవీకీర్తనలు రచించినాఁడఁట. కవి ముత్తాత ( పేగు

తెలియదు.) కన్నప్ప చరిత్రమను కావ్యమును సంతరించెనట. ఇతని కృతి సీమంతినీ చరిత్రము (డి. 1960). కృతిప్రేరకుఁడు గ్రంథకర్తకు మేనమామ కొడుకు, నాకాంశీకా వల్లభుఁడునైన శాంతయ. కృతిపతి ఆరణీపురము చంపకేశ్వరస్వామి. గ్రంథవిషయము సోమవార వ్రత మాహాత్మ్యకథ. ప్రదర్శనోపయోగి కాకున్నను రచన చాల చక్కనిది.

## 52. వీరభద్ర కవి :

ఇతనికృతి శివభాగవతము ( ఆర్. 800. కేటలాగులో నితని పేరు గుర్తింపఁబడలేదు ). ఇందు కవిచేఁ బ్రాదర్తి లక్ష్మణేశ్వరస్వామి వెల్లపూడి మల్లేశ్వరస్వామి, మాలెకొండ నృసింహస్వామియు స్మరింపఁ బడిరి గ్రంథవిషయము :– విప్రలబ్ధయగు పార్వతికడకుఁ గొరవంజి వచ్చుట – సింగి సింగళ్ళసంవాదము – శివపార్వతుల సమాగము – నారదుఁడొక దివ్యకదంబ పుష్పము నర్పింపఁగా శివుఁడది పార్వతికిచ్చుట –గంగ చెలికత్తె యా సంగతి నామెకుఁదెల్పుట మొ॥ ఈగ్రంథము కొరవంజియని పేర్కొనఁబడినది. భామకలాపపుఫక్కి యెక్కువగాఁ గలది. ఇది శివకథ యగుటచే సఖిపాత్ర పేర మాధవికి బదులు శాంభవి యైనది. రచన బాగులేకపోలేదు.

## 53. వృద్ధదాసు :

ఇతఁడు శ్రీమందానంద శైలవాసియైన శ్రీచంద్రమౌళి సద్గురుని శిష్యుఁడు. ( కపిల దేవహూతి నాటకమును రచించిన తిరునగరి వెంకటదాసుగూడ నాతని శిష్యుఁడే ) గోలిపురవాసి. ఇతనికృతి పంచ పాండవులనాటకము ( అ. డై. ప్రెస్, మదరాసు, 1928 ) గ్రంథముపై విరాటపర్వమనియు, భీమసేనవిలాసమనియు గీచకునివధమనియు ముద్రితమైయున్నది. కాని గ్రంథకర్త పలుతావులఁ బంచపాండవుల నాటక

మనియే పేర్కొనినారు. ఇది యక్షగానమనియు ప్రబంధమనియు బేర్కొనబడినది. ఇందలి విషయము విరాటపర్వకథయందు భీముడు కీచకుని ద్రుంతునని ద్రౌపది కభయమిచ్చువఱకును గలదు. ఇందు ద్వారపాలకునిచే బృచ్ఛింపబడి పాత్రలు స్వవిషయమును జెప్పుట గలదు. సంవాదశైలియొక్క రచన దోషభూయిష్ఠమైనది. ఆధునిక కృతిగా దోచును. ఇందు గురుమూర్తిహరి పలుమఱు స్మరింపబడి నాడు. ఇది తెలంగాణమును జెందినది కావచ్చును.

## 54. వెంకటదాసు :

గంగ రాజేంద్రపురవాసి. వైష్ణవుడు. సింగరదాస పౌత్రుడు. నారాయణాంబా గోవిందదాసుల పుత్రుడు. ఇతనికృతి ధర్మాంగద నాటకము. (ఆర్. 1368). ఇందలి చోప్దారికథ, మంత్రసానిపాత్ర. తెర ద్విపదలు మొదలగువాని యునికినిబట్టి చూడనిది 19 శ.రచనగా దోచును. రచన యప్రౌఢమైనది.

## 55. వెంకటదాసు :

ఇతనికృతి కోటగిరి లేక మోటపురి ధర్మాంగద చరిత్ర. (సుబ్రహ్మణ్యవిలాస ము. శా. మదరాసు, 1917, చందా నారాయణశ్రేష్ఠి సికింద్రాబాదు,1952. మీదబేర్కొనబడిన వెంకటదాసకృతి వేఱు, ఇదివేఱు, ఆకవులే వేర్వేరు.) ఇందు గ్రంధారంభమున రంభోర్వశుల రాక చెప్పబడినది. ద్వారపాలకుని పృచ్ఛలు, పాత్రల స్వవిషయోద్ఘాటనము, తెరవెడలు కీర్తనలు, దరువులలో కోటగిరీశ, పెద్దపురీశ, నింబగిరి నారసింహా ముద్రలు గలవు. రచన యాధునికమైనదని యనిపించుచున్నది. అతి పేలవమైనది.

## 56. వెంకటదాసు :

మీఁద పేర్కొనఁబడిన వెంకటదాసులు నితఁడును వేర్వేఱయి యుందురేమో ; ఇతని కృతి గొల్ల కలాపము ( ఆర్. 487 ) ఇందు గొల్లభామ సముద్రమథన కథ నాఖ్యానించుట ప్రధాన విషయము. రచన యొక్కింత చక్కనిదే. ఇందు బొండపల్లిరామలింగ సఖుఁడు ( దేవుఁడు) పేర్కొనఁబడినాఁడు.

## 57. వేంకటపతి కవి :

నవ (నర) సింహాపురి కరణము. ఇతనికృతి కాళింగ (కాళీయ) మర్దనము. (డి. 1847. 48, అ. డై. ప్రెస్. మదరాసు 1925, 29). తిరునల్లికేణి పార్థసారథి కంకితము. ఇందు దరువులు తాళప్రధానములు కతిపయ దేశి రచనలు గలవు. ఒక్కింత ప్రాచీనమైనదిగాఁ దోఁచును.

## 58. వేంకటసూరి :

ఇతఁడు నారాయణసూరి పుత్రుఁడు ఇంతకంటె నితని గూర్చి విశేషములు తెలియవచ్చుటలేదు. ఇతనికృతి 'గరుడాచల విలాసంబు నృసింహనాటకంబు' ( ఆర్ 1571 ) ప్రసిద్ధమైన చెంచులక్ష్మి కథ యిందు వర్ణితము వర్ణనాబహుళమయ్యు సంవాద శైలీప్రచురము రచనయొక మోస్తరు.

## 59. వెంకటాద్రి :

శ్రీవత్ససగోత్రుఁడు వైష్ణవుఁడు. ఎఱ్ఱాజమంత్రికిఁ బౌత్రుఁడు. తిమ్మాజికిఁ బుత్రుఁడు. ఇతనికృతి సుభద్రావివాహము ( డి. 1967 ) ఇందలి దరువులును దాళప్రధానములే. రచనయొక మోస్తరు.

## 60. వెలువలి పెద్దయామాత్యుఁడు :

ఇతనికృతి భద్రకాళీకల్యాణము. (డి. 1913). ఇందు ముచి మళ్ళ పురమున వెలసిన భద్రకాళీ వీరేశులపరముగాఁ బార్వతీపరమేశ్వ రుల కల్యాణకథ వర్ణితమైనది. ఇందలి దరువులు తాళప్రధాన ములు భాష గ్రాంథికమేగాని నిర్దిష్టముగాదు. రచన పేలవమైనది.

## 61. శేషాచలదాసుఁడు :

కృష్ణరాయపురి కృష్ణాపట్టణము నివాసి. బోధాయన శేఖర సూత్రుఁడు. భారద్వాజసగోత్రుఁడు. శేషము రఘునాథార్యుని (శైల శేఖరమహీపాల చరిత్ర ప్రబంధకర్త యితఁడగునా?) పుత్రుఁడైన తిరువేంగనార్యుఁ డీతని గురువు. ఇతని కృతి గొల్లకథ (సముద్రమథన మనుపేర 1906 లో మదరాసు మురహరి ము. శా. లో ముద్రితము) అనఁగా గొల్లకలాపము. చల్లనమ్మవచ్చిన గొల్లభామ సముద్రమథన కథ నాఖ్యానించుట యిందలి ప్రధాన విషయము. ఇందు సుంకరి కొండయకు బదులు శ్రీకృష్ణుఁడే గొల్లభామను బట్టవచ్చును. ఇది నాటకమని పేర్కొనఁబడినది. రచన యొకమోస్తరు.

## 62. శేషాంబ :

ఈమె నివాసము కర్నూలుజిల్లా కోయిలకుంట్ల తాలూకా నందిపాటి గ్రామము. ఈమె కానాలవారి యాఁడుపడుచు. కానాల రంగయగారి పుత్రపంచకమునఁ గనిష్ఠుఁడు, నాశ్వలాయన సూత్రుఁడు, వసిష్ఠసగోత్రుఁడు, నందవరీకియు నగు మల్లయగారికి దత్తపుత్రుఁడైన రామస్వామి యీమె తండ్రి. తల్లి నిట్టు రప్పయ్యగారి పుత్రి రంగ మాంబ. ఈమె తన తమ్ముఁడు శేషయ్య ప్రోత్సాహమున మిత్ర

వింధాపరిణయ నాటకమును (1919 లో అనంతపురము బాలభారతీ ముద్రాలయము ముద్రితము) నందిపాటి కృష్ణమ్మ దత్తో రచించినది. మిత్రవింద శ్రీకృష్ణుని యష్టమహిషులలో నొకతె. భాగవతమున నస్థిపంజరముగానున్న యామె పరిణయకథను నపూర్వపాత్ర చిత్రణము తోడను, సరస సంభాషణలతోడను, సన్నివేశములతోడను మాంస లముగాఁ దీర్చి మనోజ్ఞనాటక ఫక్కికను రచించినది శేషాంబ. గ్రంథా రంభమునఁ జోపుగారి మొదలు ముఖ్యపాత్ర లన్నిటికిని ప్రావేశిక ధ్రువా గానముతోడనే రంగప్రసక్తి. తరంగములను పేర నున్న తాళ వృతు లిందలి రచనావిశేషములలో నొకటి. ఇది యాధునిక కృతియై యుండును.

## 63. శ్రీరామపుత్రి :

ఈమె తనపేరు చెప్పుట కిష్టపడక తండ్రి పేరు చెప్పినది. కాని తండ్రిది కౌశికగోత్ర మనియుఁ దనది శౌనక గోత్రమనియుఁ జెప్పి నది. ఈమె తల్లి విశాలాక్షమ్మ. ఈమె కృతి సీమంతినీ చరిత్రము. (1907 లో మదరాసు శ్రీ రాజరాజేశ్వరీనికేతన ము. శా. యందు ముద్రితము) సోమవార మాహాత్మ్యకథ యిందలి యితివృత్తము. రచన కడు చక్కనిది. ఇందలి దరువులు తాళప్రధానములు "ఓడం" అను రచనా విశేషమొకటి యిందుఁగలదు.

## 64. సిద్ధనగౌడు :

ఇతఁడు తట్రకల్లు (గుత్తి తాలూకా, అనంతపురము జి.) నివాసి. ఇతని తలిదండ్రులు గౌరి, సింగన. ఇతని కృతి సారంగధర చరిత్రము (ప్రచురణ, ఎన్. వి. గోపాల్ అండు కో మదరాసు, 1935, 1949). ఇది నాటకమని పేర్కొనఁబడినది. ఇందు గ్రంథా

రంభమునఁ గథాసంగ్రహ ద్విపదయుఁ జోఘదారి రాకయుఁగలవు. రచన యొకమోస్తరు

## 65. సూర్యనారాయణశాస్త్రి సుత :

ఈమె పేరేమో తెలియదు. ఈమె కృతి శుక చరిత్రము. (దీనిగ్రాఁతప్రతి యొకటి తే. 20 - 12 - 1900 న వ్రాయఁ బడినది. శ్రీ నేదునూరి గంగాధరం గారు తూ. గో. జిల్లా చొప్పెల్ల గ్రామ వాస్తవ్యులైన శ్రీ వాడ్రేవు శేషగిరిరాయకవి గారినుండి సంపాదించి దయతో నాకొసంగిరి. ఆకవిగారు దీని నెవరో పాడఁగా వ్రాసికొనిరఁట) ఇది సరికొల్లాపాట (పేట) వేణుగోపాలున కంకితము. జనక మహా రాజునకుఁ బ్రజ్ఞాంగన యందాంతరంగిక యజ్ఞఫలముగా ముక్తికాంత పుట్టుటయు నామెకు శ్రీశుకునితో వివాహ మగుటయు నిందలి విష యము. రచన యొకమోస్తరు. ఇందలి సాంకేతిక సంవిధానము సమఁ జసముగ నున్నది.

# పరిశిష్టము

# (2)

## కర్తృత్వము తేలని యక్షగానములు

### 1. అంబా వివాహము :

(ఆం. సా. ప. సం. 253). పార్వతీ వివాహమిందు వర్ణితము. ఇది కొరవంజి నాటకమని పేర్కొనఁబడినది. ఇందుశివుఁడే కొరవంజియై

విరహోత్కయగు పార్వతీదేవిని సముదాయింపఁ జొచ్చును. ప్రహ్లా పంగఁడగును. దీని "ద్వాధ్యానసంతోషి" పాత్ర గలదు. రచన యొకింత చక్కనిదే.

## 2. అలమేలు మంగా విలాసము :

( డి. 1835, తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయము నందలి ప్రతిగలదు. నం. 7109 ) ఇది వెంకటాచలపతి దేవుని కంకితము. కృతికర్త మూర్తిగిరి మంత్రి. ఆర్వేల నియోగి, భారద్వాజ గోత్రుండు, నాగన్నమంత్రి కుమారుండగు తేజమంత్రి కిరువురు భార్యలు. అందు రుక్మాంబకు రామమంత్రియు, సుబ్బాంబకు వెంకటరాయఁడు, మూర్తిగిరి మంత్రియుఁ బుత్రులు. ఈ మూర్తిగిరియే కృతికర్త. ఇతఁడు కవిని సత్కార గ్రామవాసములు, నూఱు వరహాలు, గోపు నెల్లలునిచ్చి సత్కరించెనట. మూర్తిగిరి మంత్రికి సుబ్బమయను భార్యయు, శ్రీనివాసుఁడను పుత్రుండును గలరు. ఇతనియింటిపేరు బండి, ఒంటి, బద్ది — ఈమూఁడింట నొకటి కానగును. తేజమంత్రి మొల్లాగొండ పురము నివాసి యఁట. గ్రంథమునఁ గామగిరి రామేశ్వర దేవుఁడు స్మరింపఁబడినాఁడు. అలమేలు మంగకు లక్ష్మీదేవికని సవతిమచ్చర ముండు వర్ణితము. రచన బిగిచక్కన. ఛందోదోషము లెక్కువ.

## 3. ఉషా పరిణయము :

( తం. స. మ. కే. నం. 473 ) చంద్రభాను చరిత్ర, విజయ విలాసము మొదలగు ప్రబంధములనుండి పద్యములు గ్రహింపఁబడినవి.

## 4. ఎఱుకలవేష కథ :

( డి. 1839 - 41 ) ఇందు విరహిణియగు సత్యభామ కెఱుకత యెఱుక చెప్పుట. సింగితో సింగని సంవాదమును గలదు. ఎఱుక

వంతములు ముచ్చటించుట - అష్టమహిషుల రాకలు - కృష్ణుని సవారి సౌందర్యమును వర్ణించి రాధ గుణించి యుగళపాటను ప్రకటించుట - మాధవుని హాస్యప్రసంగములు - రాధ రాక - రాధాకృష్ణుల సంవాదము. రచన యొకవిధముగా సరసమైనదే. క్రి. 1861 ప్రతి ముఖపత్రమందు ఇట్లున్నది :- " ఆట భాగవతమందు కృష్ణకథ. కొందరు యీ కలాపము అంతా కేదారగౌళరాగం చేత వినుపిస్తున్నారు. కొందరు ఏకరాగంమీద రాగాన్పుండెనని ప్రత్యేకం రాగాలు పాడి వినుపిస్తారు. ఈసంగతి విశదపరచుటకై వ్రాయబడ్డది. "

## 9. కృష్ణ జననము :

(క్రి. 1859). దేవకి పురిటినొప్పులు, మంత్రసాని బిలిపింపవలెననుట, ఆ మోరాక చెప్పఁబడనేలేదు, పుట్టుకవచ్చును - ఇవియుందలి విషయములు. రచన యొక మోస్తరు.

## 10. కృష్ణ వేషము :

(ఆ. సా. ప. 3061. పరిషద్గ్రంథపట్టికలో నిందలి విషయములు " ఎలుక మొదలైనవి " అని వ్రాయఁబడి యున్నది. కాని యిందెలుక ప్రసక్తి లేదు. క్రమసంఖ్యలతో నిందున్న మొదటియాటాకలు నీ కృష్ణవేషము. పిదప రెండు మూడు పిడియూసులోని గొల్ల కలాపమునకు సంబంధించినవి గలవు. అందాంధ్రేయపుర నెమ్మికంటి సురధాములు స్మరింపఁబడిరి) ఈకృష్ణవేషముకథ యెత్తుగడలోఁ పై కృష్ణవేషమును బోలినదే. పిదప రాధారుక్మిణులతోఁ గృష్ణుఁడు కూర్చుండగా నారదుఁడు పారిజాతమును బట్టుకొని వచ్చుటయు, సత్యభామాగమన సూచనయుఁ గలవు. కవిత్వ మొకింత సరసమైనదే. తిమ్మనాదుల పద్యములు కొన్ని గ్రహింపఁ బడినవి.

ము. వారిని బలిపించుటయు నెమకి పరితాపిని పర్కిని యను నొక రచనా విశేషము (సం. 816 క్రింద కేటలాగులో నవ్యాఖ్యానం) గలవు. ఈగ్రంథ మొక తెప్పలతెపాట. ఇందు తెలుగు మాటలును మరాటీ ప్రసంగములు నున్నవి. ఇది తంజావూరు మండలమునఁ బుట్టిన రచనగాఁ దోఁచును. ఇందుఁ దాక్షిణాత్యవారి సంకీర్తనల ప్రసక్తి వచ్చినది.

## 17. జలక్రీడ :

(డి. 1881-2. కేటలాగులో రెండును ప్రత్యేకగ్రంథములుగా నుదాహరింపఁబడినవి. కాని రెంటికి భేదము స్వల్పము. రెంటను బందపుర, ఉత్తమూరి, తిరువళ్ళూరు స్వాముల ముద్రలున్నవి). కృష్ణుని గోపికావస్త్రాపహరణ మిందలి విషయము. రచన యొక మోస్తరు. (డి. 1882 లో జలక్రీడ తరువాత విజయరామునేలిన భుజగశయనుని కంకితమైన యొక భామకలాప భాగమున్నది. అందును మన్నారుపురీశుఁడు స్మరింపఁబడినాఁడు).

## 18. నారదకొరవంజి కట్టణ :

(డి. 1943 - ఇది శారద కురవంజియని కేటలాగు. అది సరి కాదు) సూళూరిచెన్నకేశవాంకితము, ఇందలి విషయము :- కంస నిర్బంధమున నున్న దేవకీదేవికడకు నారదుఁడు కొరవంజియై పోయి కృష్ణజననము గూర్చి యెఱుక చెప్పుట. ఆ ప్రసంగమునఁ గన్నడము కొద్దిగాఁ బ్రయుక్తము. రచన దోషయుతము.

## 19. లీలావతీ విజయము :

(డి. 1866 — కేటలాగులో నిది దాసినీవేష కథ యని పేర్కొనఁబడినది. దాదినీవేష మన్నది గడ్డిపాడు భాగవతుల పగటి

వేషములలో నొకటి. కవి దీనిని "లీలావతీపరిణయంబను నాటక" మని మాత్రము పేర్కొనెను. పగటిచుక్క యను నొక దొంగవాని పాత్ర గలదు. ఆ పగటిచుక్క వేషము దాదిసివేషముగా పరిగణింపఁబడిన దగునేమో తెలియదు. ఏతన్మాత్రగ్రంథమే తం. స., కే. సం. 543 సంపుటమునను గలదు). గ్రంథవిషయము :— ఉజ్జయిని భోజరాజపుత్రి లీలావతి జాతకము గొప్పదని చెప్పి యామెను బెండ్లాడుమని యొక పురోహితుఁడు మగధరాజును ప్రోత్సహించును. భోజరాజు సమ్మతింపఁడు. మగధేశుఁ డెవఁడైన నామె నొడిఁగొనివచ్చు వాని కర్ధరాజ్య మిత్తు నని ప్రకటన గావించును. అంతఁ బగటిచుక్క యను దొంగ యందులకుఁ బూనుకొని భోజాంతఃపురము చొచ్చి రాజపుత్రిని మంచముతోఁగొని పోవుచుండును. ఆమె దారిలో మెలఁకువ గలిగి యాక్రోశించును. అచట దాపసమీపమున మృగయావిహారానంతర విశ్రాంతుఁడై యున్న మాళవరాజామె మొఱవిని చోరునిఁ దఱిమి యామె నుజ్జయినిఁ జేర్చును. భోజరాజామెను మాళవపతికే యిచ్చి వివాహ మొనరించును. ఇందలి కథాసన్నివేశము చిన్నది. రచన యొక మోస్తరు. దరువులలో అర్కపురపాటీశ్వరుఁడు, అగస్త్యేశ్వరుఁడును స్మరింపఁబడిరి.

## 20. పాండవాజ్ఞాతవాసము :

(తం. స. మ., కే. సం. 542). దీని ముఖపత్రమున విరాట్పురుష నాటకమని యున్నది. గ్రంథనామము పాండవాజ్ఞాతవాసమైనను భారతకథ యంతయు సంగ్రహింపఁబడినది. అజ్ఞాతవాసకథలో నొక ముఖ్యఘట్టమైన సైరంధ్రీకీచకమే గ్రంథమంతటి నావరించినది. ఉత్తర దక్షిణ గోగ్రహణముల యూసే లేదు. ఇందుఁ దిక్కనగారి భావములు, పదబంధములు, విజయవిలాసకవి కర్ణరసాయనములందలి

పద్యములు, అక్కయ భీమసేనవిజయ య. గా. నుండి దరువులు నెఱవు తెచ్చుకొనఁబడినవి. పూర్వసంస్కృతగ్రంథము లందలి ప్రసిద్ధ శ్లోకములును గొన్ని గ్రహింపఁబడినవి. ఆయా శ్లోకములకు కొన్నిటికిఁ దెనుఁగున వచన వ్యాఖ్యానము గలదు. ఏ ప్రాముఖ్యమును బట్టి చేసినాఁడో కాని యీకవి స్వతంత్రించి పనయుఁ జక్కఁగఁ జేయుచున్నాఁడు.

## 21. పారిజాతము :

( డి. 1903, 1904 ). కృష్ణుని రాణులు, రాధికయుఁ దమ తమ వృత్తాంతములు జెప్పుటతో గ్రంథారంభము. నడుమ పారిజాతపుట్టుక. రచన చక్కనిదే. తిమ్మన పోతనల పద్యములు గ్రహింపఁబడినవి. ఇందు రావికొండపేట చెన్నరాయుఁడు, రామతీర్థపురి, సత్యాదేవి గోపాలుఁడును స్మరింపఁబడిరి.

## 22. పారిజాతాపహరణము :

( డి. 1905 ) వేంకటేశ్వరాంకితము. తిమ్మన ప్రబంధానుసరణము లెక్కువ గలదు. తాళప్రధానములైన దరువులును గొలఁదిపాటి దేశిరచనలును గలిగి రచన బాగుగనే యున్నది. అష్టచంద్రికలు పలుతాళములలోఁ బ్రస్తరింపఁబడుట యొక విశేషము.

## 23. పారిజాతము లేక భామా కలాపము :

( ఆం. సా. ప. 173 ) ఇదియొక సంకలితగ్రంథ సంపుటము. ఇందు నటుకూరి నారాయణకవి, భారతి రామరాజు, మాతృభూతయ్య మొదలగువారి పారిజాత యక్షగానములనుండి దరువులు, కలువాయి శతకమునుండి పద్యములును గ్రహింపఁబడినవి. అతుకులు హత్తుకొని యున్నవి.

## 24. పెరుంకూరత్తాళ్వారు చరిత్రము :

(ఆం. సా. ప. 175) ధన్విపురీశున కంకితము. దక్షిణదేశమున వైష్ణవ మతప్రవర్తకులగు పన్నిద్దరాళ్వారులలోఁ గూరత్తాళ్వారొకఁడు. ఆళ్వారుల చరిత్ర మాచార్యసూక్తిముక్తావళి మొదలగు గ్రంథములలోఁ గలదు. కూరత్తాళ్వారు చరిత్రమున గాండ్లసతి వైకుంఠమున కేఁగిన కథయు సదృశ్యచోరుని కథయు నిందు వర్ణితములు. ఇందలి భాష సలక్షణమైనదే కాని రచన యొకమోస్తరు.

## 25. ప్రహ్లాదవిజయము లేక చరిత్ర.

(ప్రచురణ :- మంగు వెంకటరంగనాథరావు. ముద్రణ :- శ్రీరామానంద ము. శా., మదరాసు 1905). ఇందలి దరువులలోఁ గలచు రామానుజపురి విహారుని ముద్రగలదు. అచటచటఁ బండసింగొండ నరసింహుఁడు స్మరింపఁబడినాఁడు. రచన యొకమోస్తరు.

## 26. బాలింత కథ :

(తం. స. మ. కే. నం. 484). దేవకీ వసుదేవుల తిపస్సు, దేవకి వేవిళ్లు, బలరామకృష్ణుల జననము నిందలి విషయములు (బలరాముఁడు రోహిణేయుఁడు గాని దేవకీతనయుఁడుగాఁడు). రచన పేలవమైనది. దోషజుష్టము.

## 27. భాగవతము :

(అడయారు ది. స. గ్రం. జ. నం. 74790). కృష్ణజననాదిగాఁ గంసవధము వఱకుగలఁ దశమస్కంధ కథ యిందు వర్ణితము. సత్యపుర వేణుగోపాలున కంకితము. రచన చక్కనిదే.

## 28. భామకలాపము :

(ఆర్. 481) రాయఘుడ వల్లభనారాయణస్వామి ముద్ర గలది. రాయఘుడ ఓఢ్రదేశములోనిది. కథాప్రణాళికలోఁ గ్రొత్త దనమేమియు లేదుగాని రచన స్వతంత్రమైనది. రచన కొంత చక్కనిదే. (ఇది గొల్లకలాపమని కేటలాగులోఁ దప్పుగాఁ బేర్కొనఁ బడినది.)

## 29. భామకలాపము :

(డి. 1919). "ధరసింహాసనమై నభంబు గొడుగై" అను ప్రసిద్ధమగు దసరా పద్యముతో దీని యారంభము. ఇం దెలుకఘట్టము విశేషము. కవి తన యాకృతిని జక్కిణియని పేర్కొనుట విశేషము లలో విశేషము. రచన చక్కనిదే.

## 30. భామకలాపము :

(ఆర్. 429, డి. 1916–18) ఇదియొక కలగూరగంప సంపుటము. ఇందలి దరువులలోఁ గొడవల్లూరు, పిప్పర, కలువాయి, తరిగొండ, ఆతేయపురి, మొగలతుర్తి దేవర పేళ్లు గన్పట్టుచున్నవి ఆయాయూళ్ల వెలసిన భామకలాపములనుండి కొన్నికొన్ని దరువుల నేర్చి యెవఁడో యీగ్రంథమును సంకలించినట్లు తోఁచును. ఇందు సిద్ధేంద్రుని గ్రంథభాగములును గలవు. (ఈ సంపుటము మంగువారి ప్రచురణ యగు భామకలాపముతోఁ గొంత పోలికగలది.)

## 31. భారతము :

(డి. 1920). గ్రంథవిషయము విరాటపర్వ కథ. ఇందు దేశి రచన లనేకములు గలవు. రచన చక్కనిది.

## 32. ముక్తికాంతా కల్యాణము :

( చింతామణిపేట ) ( ఇది ముద్రితము. ప్రచురణ వివరములు తెలియవు. నేఁజూచిన ప్రతి కిన్నెర సంపాదకులగు శ్రీ పందిరి మల్లి కార్జునరావుగారి దగ్గరిది. దాని యట్ట లిరువైపులఁ జిరిగిపోయినవి.) గ్రంథ మద్వైతవేదాంత విషయికమైనది. ప్రబోధచంద్రోదయము వలె సాంకేతికపద్ధతి గలది. ముక్తికాంతకును జీవునికిని వివాహ మిందలి విషయము. రచనయు విషయావిష్కరణమును బాగులేవు. గ్రంథము చివర మంగళగీతములోఁ, జింతామణిపేట హనుమన్నా యుఁడు స్మరింపఁబడినాఁడు.

## 33. రాధవేష కథ :

( డి. 1933 ) గ్రంథవిషయము, రాధ కృష్ణుని వెదుకవచ్చును. తరువాత మిత్రవింద రాక. త. అర్ధనారీశ్వరవేషము, తద్వర్ణన, గౌరి శివుని, శివుఁడు గౌరిని వెదకుచు వచ్చుట. త. లక్షణా రుక్మిణుల రాకలు, కృష్ణునిరాక. గోపికావస్త్రాపహరణ కథ. త. రాధాకృష్ణ ప్రణయప్రసంగము. కథావిషయము కలగపులగముగా నున్నది. రచన సరసమైనదే. ఇం దంతర్వేది నృసింహస్వామి వీరవెల్లిపాలెము రంగ నాథస్వామియుఁ దలఁపఁబడిరి.

## 34. రాధవేష కథ :

( డి. 1934 ). రాధ కృష్ణునిజాడ గూర్చి మాధవి నడుగు టయుఁ దనవలపుసొద వెడలఁబోసి కొనుటయు నిందలి విషయములు. ఇది యేదో యక్షగానములోని భాగము మాత్రము.

## 35. రాధామాధవ విలాసము

(డి. 1932) చీరాల వేణుగోపాలస్వామి కంకితము. ఇందు గ్రంథారంభమునఁ బద్మసాలెల పట్టుసాలెల ప్రశంస యున్నది. కవి సాలెకులమువాఁడై యుండునోపును. చీరాలయే కథారంగముగాఁ గృష్ణజననము, రాధ పెంపకము, కృష్ణుని బాల్యక్రీడలు, యశోదానందము, రాధాకృష్ణుల శృంగారప్రసంగములు నిందలి విషయములు. గ్రంథము తాళప్రధానములైన దరువుల మయము. అల్పదోషము లటనట నున్నను రచన చవిగొల్పునట్టిది.

## 36. రామనాటకము :

(ఇది కుశలవ నాటకమను పేర ముద్రితమైనది. మదరాసు వెస్టువార్డు ప్రచురణ—1953) సింహాద్రి నృసింహస్వామి కంకితము. అటనట దరువులలో ధర్మపురీశ ముద్రలు గలవు. గ్రంథాంత మంగళగీతమున సదాశివపేట — ఆదిమపుర నివాసముద్ర గలదు. ఉత్తర రామాయణకథ యిందలి యితివృత్తము. ఇందు శాంతపాత్ర యునికి విశేషము. గ్రంథారంభమున రంభోర్వశుల రాక, పాత్ర ప్రవేశ సూచనలు. తెరవెళ్లు దరువులును గలవు. ఒకచో అల్లా, ఖుదా శబ్దములకుఁ బ్రశక్తి గలదు. ఇది యాధునికకృతివలెఁ దోఁచును. రచన యొకమోస్తరుగాఁ జక్కనిదే.

## 37. రాములవారి యెఱుక :

(ముద్రణలు - 1. శ్రీలక్ష్మీనృసింహావిలాసప్రెస్, మదరాసు, 1913, అ. డై. ప్రెస్, మదరాసు, 1929). శివధనుర్భంగము జరుగక ముందే తను జూచి మరులుగొన్న సీతకడకు రాముఁడెఱుకత వేషము

దాల్చిపోయి యవశ్యంభావులగు విషయములను జెప్పుట యిందలి విషయము. రచన యొకమోస్తరు.

## 38. రుక్మాంగద (చరిత్ర) :

(ఆర్. 205, డి. 1935). కథ ప్రసిద్ధము. రచన యల్పదోషములున్నను బాగుగనే యున్నది. ఇందు గ్రంథారంభమునఁ గటికము రాక గలదు. ఇందొక తుమ్మెద పదమున్నది.

## 39. రుక్మిణీవేష కథ :

( డి. 1936, 1937 ). క్రమముగా రుక్మిణియుఁ గృష్ణుఁడునువచ్చి తమ తమ వృత్తాంతములు చెప్పి వలపుసొదలు వెళ్లబోసికొనుట యిందలి ముఖ్యవిషయము, రచన యొకమోస్తరు.

## 40. లక్షణాకల్యాణము :

( రాజమండ్రి ఆంధ్రేతిహాస పరిశోధకమండలి. ప్రతి నం తెలియదు ) కృష్ణమహిషియగు లక్షణపెండ్లి కథ యిందు వర్ణితము. ఇందు తాళప్రధానములగు దరువు లెక్కువ. చందమామ పదము, అర్ధచంద్రికలు, అర్ధరేకులు, ఏలలు మొ. దేశిరచనలు గలవు. కవి రాచికుఁడు. లలిత లలితములగు పదబంధములతో సరసముగా రచన సాగించినాఁడు. దక్షిణలకొఱకు బ్రాహ్మణుల తగవులాట మొ. ఘట్టములు నిసర్గసుందరముగా నున్నవి.

## 41. లక్ష్మీకల్యాణము :

( గ్రంథమలబ్ధము ; క్రీ. శ. 1500 ప్రాంతమందుండిన వెల్లంకి తాతంభట్టు కవి చింతామణి యను లక్షణగ్రంథమున (ఆ. స. మ., కే. నం. 779–780 ) భాషాలక్షణాధికారమున లక్ష్మీకల్యాణము

లోని రేకులనుపేర "నీరజోదరు రాణి నీలవేణికిని" అను నుదాహరణ మిచ్చెను. రేకులను దేశిరచనా విశేషమిప్పుడు యక్షగానములందు మాత్రమే యటనటఁ గన్పట్టుచున్నవి. కావున నాలక్ష్మీకల్యాణము యక్షగాన మగునని కొందఱూహాగాన మొనర్చిరి. అది యథార్థమే కావచ్చును కాని యీ యుదాహరణము ద్విపదపాదమగుట గమనింపఁ దగినది. ఇట గమనింపఁదగినది మఱియొక విషయమును గలదు. గౌరీ కల్యాణమువలెనే లక్ష్మీకల్యాణ మనుపేర నొక పెండ్లిపాటయుఁ గలదు. (చూ. తం. స. మ. కే. నం. 674—మన్నారుదేవుని హేమాబ్జ నాయికా స్వయంవరము. అందలి యచ్చముగా ద్విపదపాదములలో నుంపుట గమనింపఁగగినది.)

## 42. శతకంఠరామాయణము :

(అడయూరు డి. స. గ్రం. జి. సం. 74862). తన జ్ఞాతియగు దశకంఠునిఁ జంపిన రామునిపైఁ బగసాధింప నెంచిన మాయాపుర రాక్షసపతి శతకంఠుఁడను వానిపై రాముఁడు సతీసమేతముగా దండెత్తుటయు, సీత శతకంఠుని సంహరించుటయు నిందలి ప్రధాన విషయము. ఈ చిత్రకథ కాకరము వాసిష్ఠరామాయణము. ఈ య. గా. రచన పేలవము, దోషజుష్టము నైనది. గ్రంథప్రతి విలేఖన కాలము శుక్ల పుష్య బ ౧౩ శుక్రవారము-క్రీ. శ. 2-2-1810. లేఖకుఁడు బమ్మళ్లి నారప్ప కుమారుఁడు రామప్ప.

## 43. శివరాత్రి మాహాత్మ్యము :

(ఆం. సా. ప. 3802) గ్రంథము మట్టెవాడ పురీశున కంకితము. మట్టెవాడ ఒరంగల్లు చెంతనున్నది: దీనిని తెలంగాణ య. గా. గా గణింపవచ్చును. గ్రంథకర్త రామమూర్తి గురుమూర్తి

శిష్యుఁడఁట. ఈ రామమూర్తి గో. క. సం. లో క్రీ శ. 1814 ప్రాంతమున మట్టివాడలో నుండినవాఁడని యుదాహరింపఁబడిన పరశు రామపంతుల రామమూర్తి కవి యగునేమో; గ్రంథ ప్రతిపాదిత విషయము భారతాది పర్వమందలి కల్మాషపాద కథ. రచన సలక్షణ భాషలో నున్నది కాని సామాన్యమైనది. ఇం దధ్యాత్మలనుపేర నొక ధ్రువా విశేషమున్నది.

## 44. సవతివాదము :

( డి. 1951, 1952 - రెంటికిని స్వల్ప భేదము ). పారిజాతము కారణముగా రుక్మిణీ సత్యభామల సవతికయ్య మిందు వర్ణితము. రచన సరసమైనది. (డి. 1951 లో దీవికొండ, విడియాపురి చెన్న కృష్ణులును, 1952 తరువాతి గ్రంథభాగమునఁ గేశవరపు గోపాలుఁడు, పొట్లదుర్తి చెన్నరాయుఁడును స్మరింపఁబడిరి. అసలివి యన్నియు భామకలాపముల భాగములవలె నున్నవి. )

## 45. సముద్రమథనము :

( డి. 1946-సమగ్రము, డి. 1948 - అంత్యభాగము లుప్తము. డి. 1950 - నడుమను జివరను గొంత లుప్తము ) తాడిపర్తి గోపాల ముద్రగలది. పోతన భాగవత క్షీరసాగరమథన కథాసందర్భమునందలి పద్యములు, ఆత్రేయపురి గొల్లకలాపమునందలి దరువులు ననేకము గ్రహింపఁబడినది. కవి స్వంత మతిస్వల్పము.అదియు నేమంత ప్రౌఢ మైనదికాదు.

## 46. సాంబశివ విలాసము :

( డి. 1953, 1954 ) గ్రంథారంభమున పట్టిసె వీరభద్రస్వామి ప్రశంసగలదు. గోదావరి పాయ యగు వసిష్ఠసాగర సంగమస్థలమున

వెలసిన లక్ష్మణేశ్వరుని పరముగా గంగా వివాహము, నారదుని కైలాటము కారణముగా గంగా గౌరీ వివాదము నిందలి విషయములు. రచన సరసముగనే యున్నది. ప్రదర్శనయోగ్యత బాగుగాఁ గలది. కవి దీనిని సంగీతప్రబంధమని పేర్కొని యుండెను. గ్రంథ కర్త గోదావరీ మండలవాసి.

## 47. సాత్రాజితీ పరిణయము :

( డి. 1955 ). దీని యసలు పేరిది కాదు. ఇది యొక భామ కలాపభాగము. మాధవితో సత్యభామ స్వకీయ వృత్తాంతము చెప్పుటతో గ్రంథారంభము. ఇందలి కొన్ని దరువులు, ద్విపదలు, పద్యములు నితర భామకలాప సామాన్యములైనవే. ఇందొకచో సిద్ధేంద్ర యోగి కవితా రచనయని కలదు. గ్రంథ మసమగ్రము.

## 48. సురతాణి కల్యాణము :

( ప్రచురణ - కర్రా అచ్చయ్య అండు సన్సు వారిచే చింతామణి ము. శా. రాజమండ్రి, 1925). అచ్యుత విజయరంగని కంకితము. శ్రీరంగనాథుని ప్రియురాండ్రలో నొకతెయగు బీబినాంచారి కథ యిందు వర్ణితము. రచన దోషభూయిష్ఠమైనది. క్రీ. శ. 1854 ప్రాంత మందుండిన వారణాసి అచ్యుతరామకవి ( చూ. ఆంధ్ర దేశ య. గా. కవుల ప్రకరణము ) సురతాణిపరిణయ ప్రబంధమున నంతకుముందా కథ యక్షగాన రూపమున నున్నదని చెప్పబడినది. ఆ. సు. ప. య. గా. ఇదే యగునేమో !

---

# అనుబంధము

# (4)

## (అ) కొన్ని భామ కలాపములు

1. మంజువాణీ ము. శా. ప్రచురణ, ఏలూరు. మొదటి కూర్పు, 1906 :- ఇది వివిధ భాగవతుల ఫణితులు గలది. ఇందు మొదటి తొమ్మిది పుటలును వేణీ ప్రబంధము (భామ వేషము తెర లోనికి వచ్చి తెరపై జడవైచుట-తత్ప్రశంస) గ్రంథకర్త నరసింహా దేవర వెంకటశాస్త్రి. ఇతఁ డాపస్తంబ సూత్రుఁడు. శ్రీ వత్సపగోత్రుఁడు. బ్రహ్మాయ్య పౌత్రుఁడు. ఉమామహేశ్వర సూరికిని సీతమాంబకును బుత్రుఁడు. ఇతని రచన చక్కనిదే. ఇందు రావికొండపాక చెన్నా రాయఁ డొకచో స్మరింపఁబడె. వేణీప్రబంధమునకుఁ బిదప నొక మూఁడాకులు సిద్ధేంద్ర యోగి రచన గలదు. తనుపరి 59వ పుట వఱకు నకరకంటి నృకేసరి కంకితమైన కందాళ సింగరాచార్యుని "పారిజాత ప్రబంధంబు నందు - శ్రీకృష్ణచిద్విలాసంబను యక్షగానము"-సత్యా మాధవ విలాస మనియుఁ దన్నామాంతరము. ఇది నాటకమనియుఁ జెప్పఁబడినది. ఇందు కలువాయి శతకములోని పద్యమొకటి గ్రహింపఁ బడినది - సత్యభామ వాయబారము సందర్భమున ఇందు సత్యభామ కృష్ణునికి వ్రాసిన జాబులు రెండున్నవి. రెండును ప్రబంధోచిత వచన రచనా విలసితములు. మొదటిదానిలో నకరకంటి లక్ష్మీనరసింహుఁడును, రెండవ దానిలో వెత్సలపురి విశ్వనాథమూర్తి ప్రియ సఖుఁడగు ద్వారకాపురవాసుఁడును స్మరింపఁబడిరి. రెండవ దానిలోఁ జివర "కిర్లకప్పయ్య దాసపోషా" అను ముక్క యొకటి కనఁబడుచున్నది. రెండవ యుత్తరమొక దోపుడుపుల్లవలెఁ గన్పడు

చున్నది. రెండుత్తరము లందును "ఫలాని తారీఖు" అను నొక ప్రయోగ విశేషము గలదు. తరువాత, సత్యభామ విరహ వేదన సందర్భమున మృత్యుంజయ విలాసములోని "ఉదయాద్రి కరిమీఁద హురుముంజిచోడోలు" మొ ..పద్యము లుద్ధరింపఁబడినవి. త॥సత్యా కృష్ణుల సంవాదము సందర్భమున "సరస దరహాస ద్వారకాపుర నివాస మదన గోపాల రాధికాహృదయలోల" యను మకుటముతో నేడు పద్యములు గలవు; తరిగొండాధిప ముద్రతో నొక దండకము దరువు గలదు. త॥ సవతుల కయ్యము ఘట్టము - చక్కని జాతీయములతో సాగినది. రాధయుఁ బాల్గొనినది. సవతుల సమాధాన ముతో గ్రంథాంతము. గ్రంథమున నారదా గమనము చెప్పఁ బడ లేదు కాని పారిజాత ప్రసక్తి మాత్రము వచ్చినది. వేణీ ప్రబంధ మున రెండు దరువులు, నిఱువది పద్యములు, మూఁడు ముచ్చటలును గలవు. కాని సింగరార్యుని కృతిలో దరువులు జాలఁగలవు. ద్విప దలు, పద్యములు నెక్కువయే. వచనములు కొద్ది. సం. చూర్ణిక యొకటి. సందర్భాను సారముగ సం. శ్లోకములు కొన్ని యుదాహ రింపఁబడినవి. రచన చాల చక్కనిది. కాని చక్కని దంతయు నీ కవిది కాదు. గ్రంథము చివరి భాగము కొంత కలగా పులగమైనది.

2. మంగు వెంకట రంగనాథరావు గారి ప్రచురణ, కాకినాడ, మొదటి కూర్పు, 1913:-

గ్రంథముపై నిది శ్రీమంగు జగన్నాథరావు పంతులు ( ప్రచు రణ కర్తకుఁ దండ్రి కాఁబోలు) గారిచే రచింపబడిన దని గలదు. గ్రం థాంత గద్య – "శ్రీమదుభయకవి రచిత - అభినవ పారిజాతనవర సాలంకార శోభిత శ్రీమద్భారద్వాజసగోత్ర తిమ్మయ్యనామసత్పుత్ర వాధూలాన్వయ గోత్ర శ్రీమత్కందాళ వేంకటాచార్య కటాక్షాంచిత

శిష్యవర్గ మంగు కులోద్భవ శ్రీజగన్నాథ నామధేయ శ్రీమన్మహాకవి సిద్ధేంద్ర యోగికరుణాకటాక్ష వీక్షితంబైన శ్రీసత్యభామా విలాసంబను పారిజాత గ్రంథం" బని యున్నది. ఇందు సిద్ధేంద్రుని భామకలాప భాగము గొంత, తిమ్మన్నగారి పారిజాతాపహరణము, వసుచరిత్ర, మృత్యుంజయ విలాసము మొ॥ పూర్వకావ్యము లందలి రచన కొంత యథాతథముగను ననుకరణ పూర్వకముగను జేరినది. ఇందలి విరహ భాగమున నిది యాకుపీటి పురనివాసి యైన జగన్నాథ పండితుని ప్రేర ణమున వీరేశలింగ మను నతఁడు రచించినట్లు గలదు. ఆవెంట నున్న జడవర్ణన వెంకటశాస్త్రి వేణీ ప్రబంధమే. ఈ గ్రంథమున వల్లూరు, ఆకువీడు, కేశవరము, పోటగుప్పి, పిప్పర, కుందపురి, కొడవళ్యూరు నెలి మర్ల హరి ముద్రలతో దరువులు గలవు. 'సరసదరహాస ద్వారకాపుర నివాస బాలగోపాల రాధికా ప్రణయ లోల' అను మకుటముతో నైదు సీస పద్యములు సత్యాకృష్ణ సంవాద భాగమున నున్నవి. ప్రా. లి. పు. భాం. లోని ఆర్. నం. 429 భామకలాపము నందలి దరువులు, పద్యములును గొన్ని దీనఁ గన్పట్టుచున్నవి. ఇందలి మూర్ఛావస్థ భాగమున దశావతారముల జతులు గలవు. అందు పదు నొకండవదగు నొక విడి జతి భోసల శరభోజి రాజాంకితముగానున్నది. (ఈతఁడు తంజావూరి మహారాష్ట్రప్రభువు). కాఁగా నీగ్రంథ సంపుట మొక కలగూరగంపయై యున్నది. ఇట్లు వివిధ కవుల రచనా విన్యా సములు గల్గియు నిది యొక యానుపూర్విగలిగి, యా రచనా విన్యా సములు పొందు పొసఁగి యొక సమగ్ర సుందరమైన భామకలాపముగా రూపొందినది. గ్రంథము ప్రస్తావ, విరహ, దూతికా సంవాద, స్వప్నా వస్థ, అవధి, భామాసంవాద, మన్మథోపాలంభ, చంద్రోపాలంభ వాయూపాలంభ, మూర్ఛావస్థా, సపత్నీ కలహము లను పదునొకండు భాగములుగా విఙగడింపఁబడినది. ప్రతిభాగాంత గద్యయందును నాయా

భాగములందలి విషయ సంగ్రహ ముదాహృతము. ఇందుఁ బ్రసిద్ధ రాగ తాళములలో దరువులు, ద్విపదలు, పద్యములు, సంస్కృతశ్లోక చూర్ణికలు, కందువలు ముచ్చటలునను పేరఁ బాత్ర ముఖమునగాఁ బ్రయుక్తము లైన వచనములను గలవు. దశావతారముల జతులు, రాసక్రీడాష్టకము విశేషములు. ఏకాదశ భావములు, సప్తతాళ ములు, అష్టాదశరాగములు, చతుర్దశ పదాభినయ పద్ధతులు, దశవిధ తిరికలును గలిగి యలంకారశాస్త్రమునకు సంగీతాభినయ శాస్త్రము లకును నికషప్రాయముగా నున్నదీ గ్రంథరాజము. ఇది సంవాద శైలీప్రచురమైనది. సంవాదము లెక్కువగా రెండుపాత్రల నడుమనే జరుగును. మాధవి పాత్రయు, నాత్మాశ్రయ ఫక్కియుఁ, బ్రదర్శన యోగ్యతయుఁ గలవు.

3 ఆం సా. ప., సం. 4474 – భామ కలాపముల సంపుటము

ఇందు పలునాల్గు ముద్రలు గల భామకలాపము గ్రంథ భాగ ములు సంకలింపఁ బడినవి. విషయానుపూర్వి లోపించి గ్రంథము కలగాపులగముగా నున్నది. ప్రతిచివర లేఖకుని వ్రాఁత యిట్లున్నది :–

"ఖర సం. అధిక వయిశాఖ శు ౧౦ కాదంబరి సత్రాజు వ్రాసి్న ప్రతిని బొల్లాప్రగడ బ్రహ్మన్న భామవేష కలాపం సంపూర్ణంగా వ్రాసెను". ఇందలి ముద్రలలోఁ జేర్కొనఁబడిన దేవరలు : కొప్పాక పురి విహారుఁడు (ఇది ఉప్పలూరిజంటకవుల కలాపము భాగము), నరు కూరు కేశవస్వామి, (నరుకూరు నారాయణకవిపారిజాతము భాగము), ఆత్రేయ పురపు గోపాలుఁడు (ఆత్రేయ పురపు తమ్మయ్య కృతి—దీనిని బట్టి తమ్మయ గొల్లకలాపమునే గాక భామ కలాపమును గూడ రచించెనని తెలియ నగును). అర్తమూరు గోపాలుఁడు, కట్లమురి

వాసుఁడు, యానాము పురిరాయఁడు, కొండవలూరి గోపాలుఁడు, భద్రగిరివాసుఁడు, కేశవరపు గోపాలుఁడు, ద్వారకా పురవాసుఁడు, సత్యవరపు గోపాలుఁడు, ఆకువీటి మదన గోపాలుఁడు, అరకట్లరామ చంద్రుడు, మొగలతుర్తి బాలగోపాలుడు. ఇందుఁ బేర్కొనఁబడిన కవులు :- తమ్మయ్య, (ఆత్రేయపురి), కొప్పర్తివెంకట దాసు, ఫుల్ల కవి, ఉప్పులూరి జంట కవులు, (వీరరాఘవుఁడు, గంగాధరుఁడు). ఈ గ్రంథమును బట్టి యాంధ్రదేశమునఁ బలుతావుల భామకలాపములు వెలసిన వనియు, భామ కలాపమునకు ప్రజాదర మధికముగా నుండెడి దనియు నూహింప నగును.

4. <u>అం. సా. ప., సం. 4120</u> 'వివిధ వినోదము'లను నొకసంకీర్ణ గ్రంథమునఁ గొన్ని భామ కలాపముల భాగములుగలవు. అవి అయిన వరము భామకలాపము, ధర్మపురి భా. క., దివ్వెలపురి వల్లభరాయాంకిత భా. క. (ఎవరో లక్ష్మీవర దాసుఁడు దీని కర్తయఁట), పాలగిరి చెన్నకేశవాంకిత భామకలాపము, వేదాచల నరసింహాంకితము, తిరుపతి వేంకటేశ్వరాంకితము ; ఇవి కాక కాళహస్తి శివపారిజాతము, ఊటుకూరి వారి గొల్లకలాపము, సుబ్బకవి కృతమైన తాడిపత్రి కృష్ణ చరిత్ర (హిందీభాషా ప్రచురమైనది) యను గ్రంథములును గలవు

* 19 శ. ఉ. భా., 20 శ. పూ. భా. విశాఖ మండల భాగవతులందు భామ వేషము వేయుటలో మిక్కిలి ప్రతిష్ఠ గడించినవారు (1) కందాళ చిదంబరం (కశ్శపల్లి) (2) మంథా కామప్ప (కశ్శేపల్లి). (3) వంకాయల బలరామభుక్త (బొబ్బిలి ప్రాంతము), (4) కాలుగుంటి వెంకటస్వామి (బొబ్బిలిప్రాంతము) (5) వరదా నారాయణ (రామవరం) మొ॥వారు. 1860-1912 ప్రాంతమున గజపతి నగరము దగ్గర లోగీశాగ్రహార వాస్తవ్యులు, చీకటి సంస్థానాస్థానపండితులు ైన పప్పు అప్పల నరసింహశాస్త్రిగారును భామకలాప గ్రంథరచనా ప్రదర్శనములు గావించిరని శ్రీ పప్పు పేరయ్య శాస్త్రిగారు చెప్పినారు. (ఆగ్రంథ మలభ్యము) ఈ ప్రాంత

## (ఆ) మఱికొన్ని యక్షగానములు

1. పద్మినీ పరిణయము : ప్రా. లి. పు. భాం. ప్రతి డి నెం. 1897. కర్త వెంకటపతికవి. వైష్ణవుఁడు. ఆదికేశవనాధస్వామి భక్తుడు. భట్టరాచార్య శిష్యుఁడు. రామాయణనంబి పౌత్రుడు. వెంకటనంబి పుత్రుఁడు. కాలము తెలియదు. కృతి రంగధామున కంకితము. యక్ష గానమని పేర్కొనఁబడినది. ఒరయూరి నాంచారికథ యితివృత్తము. రచన చక్కనిది. తఱచు జంపె, కుఱుచజంపె, త్రిపుట, అటాది తాళ ప్రధానములగు రేకులు, జాత్యుపజాతి వృత్తములు, సమ లఘు సర్వతః ప్రాససీసములు, అర్ధచంద్రికలు, ఏలలు, నడలు, ధవళము, ద్విపద, వచనములును గలవు. కొంత ప్రాచీనమైన రచనగాఁ దోఁచును. రాజు గారి సుస్తాబు, నగరాలంకరణ మొ॥ విషయములందు నాయకరాజుల నాటి తంజావూరి తీరు కొంత కన్పించును.

2. ప్రహ్లాద నాటకము : వెట్టువార్డు అండుకో ప్రచురణ. మదరాసు, 1953. ఈకృతికర్త తాను-

'శ్రీకి ధామంబయి చెలఁగు నద్దంకి తా
తాచార్య శిష్యప్రధాను డనఁగ
వన్నె కెక్కిన తిరు వలికేణి వంశాబి
సోముఁ డా నరసయ సూరికిఁ బ్రియ
సుతుఁడు వేంకటరామ సోదర గురుచంద్ర
సుతుఁడు రామానుజ సుకవి వరుఁడ.

---

మండలి నరసింగపల్లి కలాపములు, భమిడిపాటి అప్పకవి, ఉప్పులూరి వీరరాఘవులు, మృత్యుంజయ నిశ్శంక బహద్దరు, గుడిమెట్లరామయ మొ॥ వారి కలాపముల ప్రసక్తి మీఁద వచ్చినది. దీనివి బట్టి నాఁడు విశాఖమండలమున భామ కలాపమునకు గల వ్యాప్తి యెట్టిదో తెల్లమగును. ఇట్లాంధ్రదేశమున వివిధమండలములలో ఈ భామకలాప వ్యాప్తికి ముందు నాఁట కూచిపూడి మేళముల వారు చేసిన పర్యటనయే కారణ మనుకొందును.

నని చెప్పుకొనియున్నాఁడు. కవికాలము తెలియదు కాని గ్రంథమందలి ద్వారపాలకుని ఉర్దూ ప్రసంగము మొ॥ విషయములవలన ఆధునికుఁడని యూహింపవచ్చును. గ్రంథము రామానుజ పురధామున కంకితము. దరువులలో నాస్వామి ముద్రలు గలవు. (ఆముద్ర గలిగిన మంగువారి ప్రచురణ ప్రహ్లాదవిజయము వేఱు ఇదివేఱు).* నాటకమని పేర్కొనఁ బడినది. 19 శ. ఉ. భా. య. గా. బాణీనున్నది. ప్రసిద్ధ రాగతాళ ములలో దరువులు, ద్విపద, పద్యములు, అర్ధపద్యములు, శ్లోకములు, సంధివచనములును, సంభాషణవచనములును గలిగి మంచి నాటకపు వాటము గలిగియున్నది. రచన కొంత చక్కనిదే.

౩. <u>చిరుతలరామాయణము</u>: చందా నారాయణశ్రేష్ఠి ప్రచురణ సికిందరాబాదు, 1954. కర్త కల్పకూరు కృష్ణదాసు. ఇదియొక తెలం గాణా య.గా. ఆధునిక మైనదిగా దోఁచును. దరువులు ( పాత్ర ప్ర వేశ, సంవాద సందర్భములందును గలవు) మిక్కిలిగా, సంధివచనములు పద్యములు నక్కడక్కడగా, వచన సంవాద ప్రాచుర్యము గలిగి యున్నది. రచన యొక మోస్తరు.

* * *

(ఇ) వెనుక పేర్కొనఁబడిన కవులలోఁ గొందఱి కాలముగూర్చి యీక్రింది విషయములు గమనింప వేడెదను.

1. <u>కాకునూరి అప్పకవి</u>: (పుట ద్వి.భా. 29) అప్ప కవీయమునఁ దద్రచనారంభవత్సరము 'శాలివాహన నామ శకమున గజశైల శర సుధా కిరణుల సంఖ్య'గాఁ బేర్కొనఁ బడినది. ఆమట్టున నది క్రీ. శ. 1656 అగును. కాని యాసీసము క్రింది యెత్తుగీతియందే అతనికిఁ గల వచ్చిన దినము 'అంగజాబ్దంబునను దక్షిణాయనమున జలధరర్తువు

మొదలి మాసంబునందు బహుళమున దేవకికిఁ జక్రపాణి పుట్టినట్టి యష్టమి యని పేర్కొనఁ బడినది. ఆ మన్మథ శ్రావణ బ. ౮ (కృష్ణాష్టమి) ఇండియన్ ఎఫిమెరసు ప్రకారము క్రీ. శ. 14-8-1955 అగుచున్నది. గ్రంథరచనారంభ దినము ఆ 'దశమీాసురగురు వాసరము' గా పేర్కొనఁ బడినది. అది 16-8-1655 అగును. కాఁగా మీఁద శకవత్సరము పేర్కొనఁబడినచోట 'గజ' శబ్దము కడ నేదో చిన్న గడత యుండి యుండును.

2. పురిజాల లక్ష్మీనారాయణ : (పుట ద్వి. భా. 68) : ఈతని పారిజాతము కృతి ప్రోత్సాహకుఁడగు పాలకొండ రామభద్ర నృపతి కాలము తెలియ వచ్చుట లేదంటిని. కాని అడిదము సూరకవి చాటువులలో నొక పద్యమున (చూ. వేటూరి వారి చాటు పద్య మణిమంజరి ద్వి. భా. పుట. 130) పాలకొండ రామభద్ర నృపతి ప్రసక్తి వచ్చినది. సూరకవి కాలము క్రీ. శ. 1720-1785 ప్రాంతము (శ. క. చ. పుట 336). రామభద్ర నృపతియు నప్పటివాఁడే యగును. కాఁగా ల. నా. కవి కాలము 1799 ప్రాంతమని నేను చేసిన యూహ సమంజసము కావచ్చును.

3. సిద్ధేంద్రయోగి : (పుట ద్వి. భా. 30) ఈయన కాలముగూర్చి యిటీవల భారతిలోఁ గొంత చర్చ జరిగినది. కాని యది నిర్ధారకముగా లేదు. కొందఱన్నట్లు 16 శ. ఆరంభముననే కూచిపూడిభాగవతులు ప్రసిద్ధులు కాని సిద్ధేంద్రయోగి కాఁడు. సిద్ధేంద్రయోగి యానాఁటి వాఁడనుట కాధార మేమియు లేదు. ఆయనతోడనే కూచిపూడివారి నాటక ప్రదర్శన వ్యాసంగము మొదలైనదని చెప్పుటకు వీలు లేదు. కూచిపూడి కులపతులలో సిద్ధేంద్రుడు సుప్రసిద్ధుడగునే కాని యతడే ఆద్యుడనుటకు వీలులేదు. వారి గురుపరంపరలో నడుమ

నీతఁడొక తరమునకుఁ జెందినవాఁడు. అయితే ఆ తరమున నతని భామకలాపము సృష్టితో కూచిపూడి భాగవతుల ప్రతిష్ఠ పరాకాష్ఠ నందిన దని చెప్పవచ్చును. పదునాఱవ శతాబ్దినాఁటికి భామకలాపము తెలుఁగుమాగాణముపై వెలసిన జాడ గానరాదు. ప్రబలములైన ఆధారాంతరములు గనుపట్టువఱకును గడచిన తరము పండితులు దలఁచినట్లు సిద్ధేంద్రుఁడు 17 శ. ఉ. భా. న నుండెననుకొనుటయే సమంజసముగాఁ దోఁచును.

౧

# అలభ్య యక్షగానములు

## (అ) ముద్రితములు

1. ఆంధ్ర వాఙ్మయ సూచికలో నుదాహరింపఁబడినవి :—

| గ్రంథ నామము | గ్రంథకర్త | ప్రచురణ సం. |
|---|---|---|
| 1. ఇంద్రాహల్యా విలాసము | సుబ్రహ్మణ్యకవి | 1898 |
| 2. ఉషా పరిణయము | కూర్మనాథ కవి | 1893 |
| 3 ఉషాపరిణయ నాటకము | ఆనంద దాసు | 1873 |
| 4. కుచేలోపాఖ్యానము | తిరుమల రాఘవాచారి | ... |
| 5. కౌసల్యా నాటకము | నింబగిరిదాసు | ... |
| 6 గోపాల విలాసము | శ్రీనివాసాచారి | 1865 |
| 7. గోపికా వస్త్రాపహరణము | అంబటిపూడి ఆనందయ్య | 1908 |
| 8. గౌరీ విలాసము | రామన్నకవి | ... |
| 9. తారా శశాంక విజయము | యమ్ వెంకటదాసు | ... |
| 10. ,, ,, | ఎమ్. యన్. వెంకటవరదాచారి | 1880 |
| 11 ధర్మాంగద చరిత్ర | తిమ్మరాజు పాపయ్య | 1809 |
| 12. నంది నాటకము | కోదండ రామకవి | 1869 |
| 13 నల చరిత్ర | వీరమల్లయ్య | 1891 |
| 14. ,, | కన్నయదాసు | 1898 |
| 15. ,, | శేషాచల దాసు | ... |
| 16. బాణాసుర యుద్ధము | ఆకెళ్ళ సత్యనారాయణ | 1915 |
| 17. భాగవత కలాపము | నండూరి కనకయ్య | 1912 |
| 18. మీనాక్షీ కల్యాణము | కన్నయ్య దాసు | 1916 |
| 19. రామజనన నాటకము | నాగినేని వెంకటప్ప | 1909 |
| 20. శశిరేఖా పరిణయము | గంగాచార్యులు | 1889 |
| 21. ఏకాంత సేవ | కుందుర్తి ఆదినారాయణశర్మ | 1921—25 |
| 22. గజానన విజయము | రామబ్రహ్మదాసు | ,, |

| | | |
|---|---|---|
| 23. కొల్వేపల్లి శశిరేఖా పరిణయము | వల్లభనేని చౌదరి | 1921—25 |
| 24. చంద్రకాంత నాటకము | చింతా వీరభద్రయ్య | ,, |
| 25. రంభా రావణ సంవాదము | వి. బ్రహ్మచారి | ,, |
| 26. వేంకటేశ్వర విలాసము | నవుమూరి జగన్నాథశాస్త్రి | ,, |
| 27. సీమంతినీ ప్రభావము | మంద బాలకృష్ణమూర్తి | ,, |

| గ్రంథనామము. | గ్రంథకర్త. | ప్రచురణ సం. |
|---|---|---|
| 28. సుందరాపుర మల్లేశ్వర స్వామి సేవాకలాపము | ఆరవిల్లి శేషప్ప | 1921—25 |
| 29. ద్రౌపదీవస్త్రాపహరణము | పాలుని హనుమంత రామశాస్త్రి. | 1926-27 |
| 30. శ్రీకృష్ణ తులాభారము | ,, ,, | 1927 |
| 31. శ్రీరామనామ మాహాత్మ్యము | బుద్ధాల నాగయ్యదాసు, | ,, |
| 32. హనుమజ్జనన నాటకము. | విశ్వబ్రహ్మ లక్ష్మణార్య | ,, |

2. ఆంధ్రనాటక కళా పరిషత్తు (మచిలీపట్టణము) కార్యదర్శి పురాణం సూరిశాస్త్రిగారు ప్రకటించిన పట్టిక లోనివి :-

| గ్రంథము:— | గ్రంథకర్త - ఊరు. | ప్రచురణ సం. |
|---|---|---|
| 1. ఉషా కల్యాణము. | నాగినేని వెంకటప్ప (అమ్మనబ్రోలు) | 1915 |
| 2. కీచక వధ | టి. వి. నరసింహారావు నాయుడు (మదరాసు) | 1914 |
| 3. కుశలవ నాటకము | కోడూరు సుబ్బారావు | 1913 |
| 4. గయనాటకము | వల్లభనేని రామకృష్ణయ్య (గాజులపల్లి) | 1911 |
| 5. కృష్ణ లీలా నాటకము | నాగినేని వెంకటప్ప | 1914 |
| 6. చంద్రమతీ పరిణయము | డి. పాచార్యులు (మదరాసు) | 1915 |
| 7 చంద్రరేఖ | తిరుమల శేషాచారి (మదరాసు) | 1910 |
| 8 చంద్రహాస | ,, ,, | |
| 9. చంద్రాంగద నాటకము | నంబూరు వెంకట శేషాచారి (బాపట్ల) | 1914 |

| గ్రంథము | గ్రంథకర్త-ఊరు | ప్రచురణ సం. |
|---|---|---|
| 10. చిత్ర సారంగధర | నాగినేని వెంకటప్ప | 1915 |
| 11 దేసింగు మహారాజు చరిత్ర | గుండు చంద్రమౌళి | 1914 |
| 12. ద్రౌపదీ వస్త్రాపహరణము | బి వెంకట నరసింహము (బాపట్ల) | 1904 |
| 13 ప్రహ్లాద చరిత్ర | తిరుమల శేషాచారి (మదరాసు) | 1910 |
| 14 మార్కండేయ జననము | తిరునగరి వెంకటరామానుజాచారి | ,, |
| 15. మైరావణ నాటకము | పోతుకూరి సుబ్బయ్య (కావలి) | 1915 |
| 16. రంభారామా విలాసము | ములుమూడి అక్కన్న (నెల్లూరు) | 1905 |
| 17. రామలీలా నాటకము | నాగినేని వెంకటప్ప | 1914 |
| 18 రామాయణము | నీలి వీరరాఘవదాసు (ఒంగోలు) | 1913 |
| 19. రుక్మాంగద | కొండమూరు రామచంద్రరాజు (రామేశ్వరం) | 1914 |
| 20. రుక్మాంగద | గోలి గురుస్వామి | 1904 |
| 21. విజయరాఘవ నాటకము | కర్నూలు తాయన్న | 1906 |
| 22 శాంత సారంగధర | చెమికల చెన్నారెడ్డి (పొర్లపాడు | 1915 |
| 23. సంగీత హరిశ్చంద్ర | ,, ,, | ,, |
| 24. శాకుంతల నాటకము | ముదికొండ మల్లికార్జునకవి (బెజవాడ) | 1909 |
| 25. శ్రీకృష్ణ పారిజాతాపహరణము | కంతేటి రాఘవయ్య (చెన్నపురి) | 1903 |
| 26. శ్రీకృష్ణ బాలక్రీడా విలాసము | వి వెంకట నారాయణకవి | 1901 |
| 27. సత్యవతీ పరిణయ నాటకము | నారాయణ అనంతాచారి | 1913 |
| 28. సత్యా ద్రౌపదీ నాటకము | ఎ. వెంకట శివరావు (గుత్తి) | 1914 |
| 29. సారంగధర | పూళ్ల అప్పలనరసయ్య (విజయనగరం) | 1907 |
| 30. సీతాకల్యాణము | యాగళ్ళ జానకీరామయ్య (పాతటెక్కలి) | 1911 |
| 31. హనుమదభ్యుదయము | దేవినేని సూరయ్య (చల్లపల్లి) | 1913 |
| 32. హరిశ్చంద్ర | పరశురామ శేషాచార్యులు | 1907 |
| 33. ,, | తుళ్ళూరి పిచ్చయ్య (గుంటూరు) | 1912 |
| 34. ,, | నాగినేని వెంకటప్ప | 1909 |

3. ఆంధ్రపత్రిక 12 వ సంవత్సరాది (దుర్మతి–1921) సంచికలో పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు ప్రకటించిన పట్టికలోనివి :—

| గ్రంథము | గ్రంథకర్త |
|---|---|
| 1. ఉషా పరిణయము | అనంతకవి |
| 2 కుచేలోపాఖ్యానము | సుబ్బు లింగాచారి |
| 3. ధర్మాంగద చరిత్రము | నరసింహకవి |
| 4. నల చరిత్రము | రా. అప్పాజీకవి |
| 5. నృసింహ చరిత్రము | కోదండ రామకవి |
| 6 పరతత్వ సుధానిధి | సోమసుందర మొదలి |
| 7. బాణాసుర విజయము | వీరనారాయణకవి |
| 8. యతిరాజ విలాసము | సుందరనాయనార్ శేషాచలదాసు |
| 9. రంగనాథ విలాసము | లింగం వెంకటరాయమంత్రి |
| 10. రామ నాటకము | శరగోపాచార్యులు |
| 11. రుక్మిణీ కల్యాణము | రాజా లక్ష్మాజీ |
| 12. వల్లవీ పల్లవము | సింగరాచార్యులు |
| 13. వెంకటేశ్వర విలాసము | సూర్యకవి |
| 14. శర్మిష్ఠా విలాసము | వెంకటదాసు |
| 15. సీతాకల్యాణము | చిత్రకూటం వెంకటశేషయ్య |
| 16. సుధాస్వాదనము | వెటకట దాసు |
| 17. సుభద్రా పరిణయము | రాఘవాచార్యులు |
| 18. హంసక విలాసము | పరమానందకవి |

-♦ ఈ పట్టికలో కర్తల పేర్లు పేర్కొనఁబడనివి ♦-

1. అంబరీష మహారాజు నాటకము
2 నందుల కాటమరాజు నాటకము
3 నృగమహారాజు నాటకము
4. పట్టాభిరామాయణము
5. ప్రద్యుమ్న నాటకము
6. ప్రద్యుమ్నానంద నాటకము

7. భవానీశ్వర పరిణయము
8. రంగనాథ శశిరేఖాపరిణయము
9 శర్వరీ విజయము
10 శశాంక విలాసము
11 శ్రీరంగమాహాత్మ్యము
12. సత్యవతీ విలాసనాటకము
13 సాందోపాఖ్యానము
14. సీతాపహరణము
15. హనుమద్విజయము
16. హాలహాల పానము

4. బ్రిటిషు మ్యూజియమ్ లైబ్రరీ తెలుగు పుస్తకములు కేటలాగు (లండను 1912) లోనివి :-

| గ్రంథము | గ్రంథకర్త |
|---|---|
| 1 అహల్యా సంక్రందన విలాసము | సిరగంగ్ల రాముడు |
| 2 ఉషాపరిణయము | కె ఎల్ వీరమల్లయ్య |
| 3. కన్యకా చరితము | కె. ఎల్. వీరమల్లయ్య |
| 4. కుశలవ నాటకము | సుబ్రహ్మణ్యేశ్వరము |
| 5. జాలారి కన్నె నాటకము (గంగా వివాహము) | నాగభూషణుడు |
| 6 నిజలింగ చిక్కయ్య నాటకము | పి. కె. వరదయాచార్యులు |
| 7. పారిజాతాపహరణము | కే. ఎస్. సూర్యనారాయణ సూరి |
| 8 పార్వతీపరిణయ నాటకము | గోపాల కృష్ణుడు |
| 9. శశిరేఖోత్తర పరిణయము | ఆర్. సీతారామకవి |
| 10. శ్రీకృష్ణ జలక్రీడా నాటకము | గరికిపాటి సూర్యనారాయణశాస్త్రి |
| 11 హరిశ్చంద్ర విలాసము | దేవ పెరుమాళ్ళయ |

5. ఇంకను మదరాసు ప్రభుత్వపు బుస్తకముల రిజిస్ట్రారువారి ఆఫీసు కేటలాగు మొ॥ వానిలో నుదాహరింపబడినవి కొన్ని గలవు.

| గ్రంథము | గ్రంథకర్త |
|---|---|
| 1 ఇంద్రకీల నాటకము | కే రంగనాయకులు |
| *2. ఉషాపరిణయము | (కథలాపురం) గంగాధరకవి |
| *3 చంద్రకళా విలాసము | గాథి హనుమత్కవి |
| *4. చంద్రహాస | రాజ వీరయ్య |
| 5. తిరుపతి గంగజాతరకథ | కె. పొట్టయ్య |
| *6. బాలనాగమ్మ చరిత్ర | ఎఱ్ఱం బుచ్చిదాసు |

*7. మండోదరీ స్వయంవరము — వేముగంటి శ్రీనివాసకవి
8. వసుగిరికా పరిణయము — లింగము వేంకటరాయమంత్రి
9 వినుకొండ రామాయణము — వి. జగన్నాథాచారి
10 సారంగధర (కట్టుబడి పురము)
*11. సీతాస్వయంవరము — వేముగంటి శ్రీనివాసకవి

[పైపట్టికలలోఁ జేర్కొనఁబడిన వన్నియు యక్షగానములై యుండవు. కొన్ని కేవల వీధినాటకములు, కొన్ని హరికధలు నున్నట్లు తోఁచును. తెలియవచ్చినంత మట్టునకు హరికధల పేర్లు పరిహరింపఁ బడినవి. ముద్రితములైన మన యక్షగానములలో నాధునిక కృతుల పాలే యధికమగుట గమనింపఁ దగినది. ఒక తరము క్రిందట అచ్చు పడినవే యిన్ని గ్రంధము లీనాఁడుపలబ్ధము గాకుండుట శోచనీయము]

* ఈ గుర్తుగలవి తెలంగాణము యక్షగానములు

## (ఆ) అముద్రితములు

| గ్రంధము | గ్రంధకర్త | ప్రతి వివరము |
|---|---|---|
| 1 రామనరపాల చరితము | పెద్దనామాత్యుడు | ఆ సా ప. 4028 |
| 2 రామాయణము | మాచిరాజు లక్ష్మయ మనుమడు | ” 3948 |
| 3 రామ నాటకము | తు రామానుజాచారి | గొ. గ్రం. 98 |
| 4. ఎఱుకల కురవంజి | మదరాసు విశ్వవిద్యాలయ ప్రతి | 389 |
| 5. గయ కథ | ” | 540 |
| 6. గొల్లకలాపము | ” | 401 |
| 7. భామ కలాపము | ” | 274 |
| 8. వీర రాఘవస్వామి య. గా. | ” | 536బి. |
| 9. సానందచరిత్రము | ” | 158 |

(మదరాసు విశ్వవిద్యాలయ ప్రతు లిపుడు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున నున్నవి కాని భాండాగార గ్రంధములవలె వాని కింకను నొక క్రమమైన యేర్పాటు లేకపోవుటచే జదువుట కీఁబడలేదు.

ఒక పట్టికను బట్టి మాత్రమా గ్రంథ సంచయ మండలి తెనుఁగు య. గా. ల పేళ్ళు గనఁబడినది.)

10. సీతా కల్యాణము - గొట్టిముక్కల కృష్ణమరాజు (గొట్టి ముక్కల శాసనుఁడు. ధనంజయ గోత్రుడు. తల్లి వెంక మాంబ. శేషభూపతి వరదనృపతి అని పితృనామములు రెండు పేర్కొనఁ బడినవి. అందొకరు కన్నతండ్రియు, నొకరు పెంచుకొన్న తండ్రియునై యుందురు. ఇతనికి వెంకటరాజను నొక యన్న గలడు. దశావతార చరిత్ర అను ద్విపద కావ్య మితని కృత్యంతరము)

11. పారిజాతాపహరణము - గొ. సింగరాజు (పై కృష్ణమ రాజునకు పెద్దమాంబ వలనఁ గలిగిన తనయుఁడు).

12. సావిత్రి య. గా. - గొ. కుమార పెద్దిరాజు (పై కృష్ణమరాజునకు రంగాంబ వలనఁ గలిగిన తనయుఁడు).

13. నాంచారు పరిణయము - సుందవరపు శేషాచలమంత్రి (ఇతఁడ్డీ ద్వితీయ భాగమున సరిగా ఏతన్నామక య. గా. కర్తగా 326వ పుటలో నుదాహరింపఁబడిన భాస్కర శేషాచల కవి యగునా ?)

14. కూరత్తాళ్వారు చరిత్ర - తిరు మెక్కళ తిరువెంగళాచార్యుఁడు (ఇది ఆం. సా. ప. ప్రతి నెం. 175 ధన్విపురీశున కంకితమైన పెరుంకూరత్తాళ్వారు చరిత్ర య గా. ?)

15. సుందరకాండము - కవిపేరు తెలియదు. (సుందర కాండ య. గా ఆర్. 870. కర్త పాతూరి. తిరుపతి యని యొకాయన గలఁడు. ఆతఁ డీతఁడగునో కాదో.!)

[ నెం. 10-15 ఈ యాఁటు య. గా. ల తాళపత్ర ప్రతులు దక్షిణ దేశమున రాజపాళయం ( తెలుఁగు రాజుల వలస) గాంధీ కళా మందిరమునఁ గలవని నాకు మా తమిళోపాధ్యాయులు శ్రీ ఎస్. కుమారస్వామి రాజా, ఎమ్.ఏ. గారి వలనఁ దెలిసినది. వారికిఁ గృతజ్ఞుఁడను. వారు దయతో నాకుఁజూడ నొసఁగిన విషయమును బట్టి రాజపాళయం య. గా. లు నాఁటి దక్షిణ దేశపు య. గా. ల కంటె విలక్షణమై ద్విపద వచనములతో పాటు తాళ ప్రధానములైన రేకులు గలిగి ఆంధ్ర దేశపు యక్షగానపు బాణీకి సన్నిహితముగా నున్నట్లు దోఁచును]

16. శ్రీ రుక్మిణి కురవంజి – రామానుజాచార్యుడు. (ఇది ప్రా. లి. పు. బాం. డి. సం. 1854 కుండినపుర గోపాలాంకిత మైన కురవంజి యగునో (చూ. ద్వి. భా. పుట 442)

17. సారంగధర య. గా. – కవిపేరు తెలియదు. ‘సహజ విక్రమ కీర్తి సర్వజ్ఞమూర్తి, బహుమాన పురుషుడు పద్మనాయకుడు’ అని మాత్ర మితనిఁ గూర్చి గ్రంథమునఁ గలదఁట. అయితే యిది పద్మనాయకుడు, సర్వజ్ఞమూర్తి అని యున్నదిగదా యని తొందఱపడి పద్మనాయక వెలమ కులజుఁడు సర్వజ్ఞ బిరుదాంచితుఁడు నైన సింగభూపాలుని కృతి యని నిర్ణయము చేయరాదు. నిదానించ వలసి యున్నది,

[ఈ 16–17 నం. గ్రంథముల ప్రతులు డాక్టరు శ్రీ బి. రామరాజు, ఎమ్. ఏ., పిహెచ్. డి. గారి కడ నున్నవఁట. ఇట్లింక నెన్ని యక్షగానము లెక్కడెక్కడ నెవ్వరెవ్వరి కడ అసూర్యంపశ్యములై పడియున్నవో !]

గమనిక : ఇవి కాక యీ ద్వి. భా. న నిదివఱకే కర్తృ ప్రసక్తి వచ్చిన అలభ్య యక్షగానములు మఱికొన్ని గలవు. వానిపట్టిక అకారాది క్రమముగా వేఱే యీ ద్వి. భా. 4వ అనుబంధమునఁ జేర్పఁబడినది.

౨

## యక్షగానాభాసములు

యక్షగానములు గాక పోయినను నా ఫక్కి నంతంత మాత్రముగా నడచిన కొన్ని రచనలు :–

1. కంచిభొట్ల సీతారామ కవి చందన మహారాజు చరిత్ర లేక ఇంద్ర సభా నాటకము (రామానంద ము. శా., మదరాసు, 1901).
2. ఇందూరు కోనయ మాయలమల్లి నాటకము (అ. డై. ప్రెస్, మదరాసు, 1918)
3. బ్రాహ్మణ పల్లె చంద్రహాస నాటకము ఎ. పి. కవి అండుకో, అనంత పురము. 1920)
4. ఆరవెల్లి చంద్రయ్య విప్రపురాణము (ఆం. సా. ప. ప్రతి)
   ఇంకను నిట్టి వనేకము గలవు. కొన్ని పొరపాటున కేటలాగు కర్తలచేతను ప్రకటన కర్తలచేతను యక్షగానములుగాఁ బేర్కొనఁబడినవి. అట్టివి కొన్ని :–

1. యోగ ప్రభావము ఆం. సా. ప. 3819).
2. గుత్తెనదీవి రామాయణము (అం. సా. ప. 2970),
3. జె. సుబ్బరామదాసు చెంచునామయోగి చరిత్రము (అ. డై. ప్రెస్, మదరాసు, 1918),
4. రామకృష్ణ దాసుని మానసబోధ (సరస్వతీ నిలయ ము. శా., నెల్లూరు, 1887),
5. కురుమద్దాలి వేంకటాచలకవి భాగవత సప్తమ స్కంధము (డైమండు జూబిలీ ప్రెస్, నరసపూర్, 1897, దశమ స్కంధము కాకినాడ, ము. శా., 1879),
5 శ్రీ శాయిబాబా చరిత్రము – విద్వాన్ ధూళిపాళ వేంకట సుబ్రహ్మణ్యము, చిలకలూరి పేట. ప్రకాశకులు: సుందరరాం అండ్ సన్సు, తెనాలి 1950 (ఇది హరికథ వంటిది)
7. యతిరాజ విజయము – శ్రీమాన్ గుదిమెళ్ల రామానుజాచార్య స్వామి ముక్తిపల్లి రేపల్లె తా. గుంటూరు జి.) ముద్రణ: శ్రీ వెంకటాచలపతి ప్రింటింగ్ వర్క్సు, రాజమండ్రి. (ఇది అచ్చముగా నొక బుఱ్ఱకథ).

౩

# క వి నా మ సూ చి

## [అ]

[ ద్వితీయభాగమునకుఁ బరిమితము. పరిశిష్టానుబంధములందుఁ బ్రసక్తమైనవారి పేరులు ప్రత్యేకము 'ఆ' పట్టికలోఁ జేర్పఁబడినవి. ]

[ఆ]

(పరిశిష్టాను బంధములందు పేర్కొనఁబడినవారు)

# గ్రంథసూచి

## [అ

## లభ్యములైన యక్షగానముల పేర్లు

ప్రక్కనున్నది ద్వి. భా. పుటాంకము

# [ఆ]

(వివిధానుబంధములు-౧లో పేర్కొనబడినవి కాక యీ గ్రంథ ద్వి. భా. న. ఇతరత్ర పేర్కొనబడిన అలభ్య యక్షగానముల పేర్లు)

(గమనిక : ఇందలి పేర్లు కొన్ని 'అ' పట్టికలోని వాని వంటివే కాని కర్తృత్వములు వేఱు వేఱు).

# సంకేతములు

అ. డై. ప్రెస్ – అమెరికన్ డైమండు ప్రెస్ (వెసువార్థు & కో, చాకలిపేట, మదరాసు)

అధ్యా – అధ్యాయము

ఆం. క. చ. – ఆంధ్రకవులచరిత్ర (కందుకూరి వీరేశలింగముగారిది)

ఆం. క. త. – ఆంధ్రకవి తరంగిణి (చాగంటి శేషయ్యగారిది)

ఆం. నా. క. ప, – ఆంధ్ర నాటకకళాపరిషత్తు

ఆం. ప. మం. – ఆంధ్రేతిహాస పరిశోధక మండలి (రాజమండ్రి)

ఆం. ప. సం సం:– ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక

ఆం. ర. – ఆంధ్రరచయితలు (మధునా పంతుల వారిది)

ఆం. వా, సూ. – ఆంధ్రవాఙ్మయసూచిక (కాశీనాథుని వారిది)

ఆం. వి. క. ప – ఆంధ్ర విశ్వ కళాపరిషత్తు

ఆం. వి. వి. – ఆంధ్రవిశ్వ విద్యాలయము

ఆం. సా. ప. – ఆంధ్రసాహిత్య పరిషత్తు

ఆ. క. జీ. – ఆధునిక కవిజీవితములు (మం. భుజంగరావుగారిది)

ఆర్. నం. – ప్రా. లి. పు. భాం. ట్రయెనియల్ కేటలాగులోని నంబరు

ఆశ్వా. – ఆశ్వాసము

ఉ. భా. – ఉత్తరభాగము

కే. నం. – కేటలాగు నంబరు

క్రీ. శ. — క్రీస్తుశకము

గో. క. సం. – గోలకొండ కవుల సంచిక (సురవరం ప్రతాపరెడ్డిగారిది)

గౌ. గ్రం. – గౌతమీ గ్రంథాలయము

గ్రం. – గ్రంథము, గ్రంథాలయము

చూ. – చూడుఁడు.

డి. నం. ప్రా. లి. పు. భాం. డిస్క్రిప్టివ్ కేటలాగు లోని నంబరు

తం. స. మ. తంజావూరు సరస్వతీ మహలు

త. — తరువాత

ది. స. గ్రం. – దివ్యజ్ఞాన సమాజగ్రంథాలయము, అడయారు

ద్వి. భా. – ద్వితీయ భాగము

నం. – నంబరు నెం. – నెంబరు

ప. — పద్యము పు–పుట

పూ. భా. – పూర్వభాగము

ప్రా. లి. పు. భాం. — ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము. మదరాసు.

ము. శా. – ముద్రాక్షరశాల

మొ. — మొదలగు

య. గా. — యక్షగానము

శ. — శతాబ్ది

శ. క. చ. – శతకవుల చరిత్ర (వంగూరి వారిది)

శా. శ – శాలివాహన శకము

శ్లో. – శ్లోకము

సం. – (సందర్భమును బట్టి) సంపుటము లేక సంవత్సరము

సూ. రా. ని. — సూర్యరాయాంధ్ర నిఘంటువు

A.I.O.C.– All India Oriental Conference.

A.O.R.– Annals of Oriental Research

J.O.I.– Journal of the Oriental Institute.

౬

# ఉపజీవ్య గ్రంథములు - వ్యాసములు

1. ప్రా. లి. పు. భాం., తం. స. మ., ఆం. వి. క. ప. ఆం. సా. ప., ఆం. ప. మం., ది. స. గ్ర., గౌ. గ్రం., (ఈ సంకేత ములకుఁ గడచిన పుట జూచునది), తిరుపతి వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయము, మదరాసు రిజిస్ట్రారు ఆఫ్ బుక్స్‌వారి ఆఫీసు మొదలగు వివిధ గ్రంథాలయము లందలి ముద్రితాముద్రిత యక్షగానములు.

2. కొందఱు కొందఱు యక్షగాన కవుల కాలనిర్ణయ విషయమున ఆంధ్రకవులచరిత్ర, ఆంధ్రకవి తరంగిణి (ఇప్పటికిఁ బ్రచురణమైన 11 వ సంపుటము వఱకు మాత్రము), శతక కవుల చరిత్ర, గోలకొండ కవుల సంచిక, ఆధునిక కవి జీవితములు, ఆంధ్ర రచయితలు అను గ్రంథములు కొంత కొంత యుపకరించినవి.

3. భరతనాట్యశాస్త్రము, బృహద్దేశి, సంగీత రత్నాకరము, సంగీతదర్పణము, దశరూపకము, భావప్రకాశము, సాహిత్యదర్పణము, సంకీర్తన లక్షణము, ఛందోదర్పణము, లక్షణసార సంగ్రహము, అప్పకవీయము, లక్షణదీపిక, లక్షణ శిరోమణి, రంగరాట్ఛందము మొ॥ సంస్కృతాంధ్ర నాట్యసంగీతచ్ఛందోలంకార లక్షణశాస్త్ర గ్రంథములు.

4. వాచస్పత్యము, మోనియర్ విలియమ్సు, భరతకోశము, శబ్దరత్నాకరము, సూ. రా. నిఘంటువు, బ్రౌణ్యము, కిట్టెలు, మదరాసు విశ్వవిద్యాలయ తమిళ భాషా నిఘంటువు మొ॥ సంస్కృతాంధ్ర కన్నడ తమిళ నిఘంటువులు.

5. కవిరాజమార్గము, ఛందోంబుధి, కావ్యావలోకనము, మల్లినాథపురాణము, చంద్రప్రభాపురాణము, భరతేశ వైభవము మొ. కన్నడ లక్షణగ్రంథములు, కావ్యములు, ఇలక్కణ విళక్కమ్, పన్నిరు ప్పాట్టియల్ మొ॥ తమిళ లక్షణ గ్రంథములు. ప్రా. లి. పు. భాం., నందలి కొన్ని తమిళ కన్నడ యక్షగానములు. కొరవంజులు.

6. పండితారాధ్య చరిత్ర, క్రీడాభిరామము, భీమఖండము మొ॥ యక్షగాన సంబంధి విషయ ప్రసక్తి వచ్చిన ప్రాచీనాంధ్ర కావ్యములు.

7. శ్రీహాసణగి రామచంద్రభట్టరు కన్నడ 'యక్షనాటకగళు'

8. డా. డీ. యన్. కర్కిగారి 'కన్నడఛందోవికాస'

9. ఆంధ్రపత్రిక ఉగాది సంచికలు, భారతి మొ॥ పత్రికలు మొ॥

1. Indian Ephimeris – By Sri Swamikannu Pillai.

2. Castes and Tribes – By E. Thurston

3. The Yakshas – By Dr. A. Coomaraswami.

4. The Music of the Nrtya natakas of South-India – By Smt. K. Gomati, (M. Lit. Thesis of the Madras University).

5. The Theatre of the People – By Sri R. K. Yajnik.

6. World Drama – By Prof. Allardyce Nicoll

7. History of the Reddi Kingdoms – By Sri M. S. Sarma (Chap. VII. Music and Dance).

8. Telugu literature outside the Telugu country – By Sri K. Rama Krishnayya.

9. History of the classical Sanskrit literature – By Dr. M Krishnamacharya (Authority for the dates of the Skt authors and works mentioned in this thesis).

10. The Silappadikaram (Tamil Classic) – English Translation by Dr. V R. S Dikshitar.

11 Yakshagana – Pp by Dr. V. Raghavan, (Triven Vol VII No. 2).

12. The Bhagavata Plays in Mysore – By Sri L. Narasimhacharya, A.I.O.C Mysore Vol VIII, 1935.

13. Yakshagana in Karnataka – By Sri M Govinda Rao, A. O. R of Madras University, Vol. X, Part II, 1952–53

14. A list of the Villages in the Madras Presidency.

15. Tirupati Devasthanam Inscriptions.

16. South Indian Inscriptions.

17. Topographical list of Inscriptions of the Madras Presidency – By Sri V. Rangachari.

18. Journal of the Music Academy, Madras.

19. District Gazetteers and Manuals of different districts in Andhra, Tamilnad and Karnataka.

20. The Puppet Book. Edtd. by L. V Wall.

గమనిక : నా కుపయుక్తములైన గ్రంథములు, వ్యాసములును మఱికొన్ని గలవు అవి యన్నియు గ్రంథ మధ్యమున ఆ యా సందర్భములందు కుండలింపులలోను, అధోజ్ఞాపికలలోను పేర్కొనఁబడినవి. ఈగ్రంథవ్యాసకర్త లందఱికి నా నమోవాకములు. య. గా. గుఱించి మఱికొందఱు ప్రచురించిన వ్యాసములను జాలవఱకుఁ జూచితిని. అన్నిటిని వినియోగించుకొనుట కవకాశము చాలమి విచారించితిని. ఆవ్యాసకర్తలకుఁ గూడ నా నమోవాకములు.

౭

# స్వీ య వ్యా స ము లు

(యస్వీయములు — య. గా. విషయకములు)

| వ్యా స ము పే రు | ప్ర చు ర ణ వి వ ర ము |
|---|---|
| 1. మన్నారుదాస విలాస నాటకము — | కృష్ణాపత్రిక, 5-12-53 |
| 2. గీతరఘు నందనము | ఆం. సా. ప. వార్షిక సంచిక, 1954 |
| 3. పార్వతీ కల్యాణము — | (ఉద్దండకవి) - కృ. ప., 3-7-54 |
| 4. రాజరంజన విద్యా విలాసము — | పరిశోధన. |
| 5. యక్షగానములలో సాంప్రదాయిక పాత్రలు. (రేడియో ప్రసంగము, విజయవాడ) (11-10-54) | భారతి. డిసెంబరు, 1954 |
| 6. పార్థసారథి విజయము — | సంస్కృతి. జనవరి, 1955. |
| 7. య. గా. దేశిత్వము. వైశిష్ట్యము - కిన్నెర, | సంక్రాంతిసంచిక, 1955 |
| 8. య. గా. కవులు — ఒక విమర్శ — | భారతి. ఏప్రిలు, 1955 |
| 9. ఏకాంత సేవ. — | కృ. ప. 30-4-955 |
| 10. భక్తవత్సల విలాసము — | కృ. ప. 21-5-1955 |
| 11. బొమ్మలాట హాస్య నాటకము. — | త్రిలింగ 23-5-55 |
| 12. జలక్రీడా విలాసము — | కృ. ప. 4-6-55 |
| 13. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము య. గా. విషయ | పరామర్శ భారతి, జూన్ 1955 |
| 14. వీరభద్ర విజయము (శివలెంక) ఆం. ప. సారస్వతాను | బంధము, 19-6-55 |

| వ్యాసము పేరు | ప్రచురణ వివరము |
|---|---|
| 15. పారిజాతాపహరణము(తీర్థులు) ఆ.ప. సారస్వతానుబంధము | 3-7-55 |
| 16. యక్షగాన కవయిత్రులు – భారతి, | జూలై, 55 |
| 17. శేషము రంగాచార్య య. గా. లు - సంస్కృతి. జూలై | ఆగష్టు, 55 |
| 18. బొమ్మలాట – యక్షగానము – భారతి, ఆగష్టు. | 1955 |
| 19. పారిజాతాపహరణము (వెంగమ) - ఆంధ్రమహిళ. | ఆగష్టు, 55. |
| 20. శివ విలాసము (వెంగమ) – గృహలక్ష్మి. | ,, ,, ,, |
| 21. విష్ణుమాయా విలాసము (పాపరాజు) ఆం. ప. సా. అ. | 7-8-55. |
| 22. చిత్రకూట మాహాత్మ్యము. – కృ. ప. | 20-8-55 |
| 23. విప్రనారాయణ చరిత్ర (చక్రపురి) – ఆం. ప. సా. అ. | 21-8-55. |
| 24. మెలట్టూరు భాగవత మేళ నాటకములు – భారతి. | సెప్టెంబరు, 55. |
| 25. యక్షగానము - హరికథ. అనంతరామాచార్య కృతులు | ఆం. సా. ప. 44 - 2 |
| 26. త్యాగరాజు య. గా. కృతులు ఆం. ప. సా. ఆ. | 11-9-55. |
| 27. తంజాపురాన్నదాన నాటకము – ,, ,, | 18-9-55. |
| 28. సతీదాన శూరము – ,, ,, | 25-9-55. |
| 29. హేమాబ్జనాయికా స్వయంవరము – ,, ,, | 11-12-55. |

## అనుబంధము

వ్యాసము పేరు — ప్రచురణ పత్రిక, కాలము

30. విజయరాఘవ చంద్రికావిహారము — ఆం. ప. సా. అ. 18-12-55.

31. విజయరాఘవ కళ్యాణము — ,, ,, 25-12-55.

32. పారిజాతము (పు. ల. నా. కవి) ,, ,, 8-1-56.

33. పార్వతీ పరిణయము (వాసుదేవకవి) ,, ,, 15-4 56.

34. గిరిరాజ కవి యక్ష. గా. లు - ,, ,, 13-5-56.

35. శహాజీ ప్రబంధములు - భారతి, జులై, 1956

36. తంజావూరు (యక్ష. గా.) పదవాఙ్మయము. సంస్కృతి.
జూలై, ఆగ, 56.

37. మన్నారుదాసవిలాసము (ప్రబంధము - నాటకము)
ఆంధ్రమహిళ - సెప్టెం. 56

38. ఆంధ్రసారస్వత శాఖలలో యక్ష. గా. ప్రత్యేకత -
కృ. ప. 19-10-57

39. యక్షగానములలోని లోకరీతి - (రేడియో ప్రసంగము - విజయవాడ కేంద్ర ప్రసారితము 6-2-1956) } తెలుగు విద్యార్థి, మే, 59.

40. నివర్తి శేషాచలపతి (అముద్రిత యక్ష. గా. రచనలు)
ఆం. సా. ప. పత్రిక 46-3.

41. విజయరాఘవుని యక్షగానములు — సారంగి 1-1-60.

42. తెలుగు యక్షగానము — (ఉత్పత్తి - పరిణామము) } తెలుగు భాషాసమితివారి విజ్ఞాన సర్వస్వము, సం. 3.

43. దాక్షిణాత్యాంధ్ర సాహిత్యము

| వ్యాసము పేరు | ప్రచురణ వివరము |
| --- | --- |

44. సప్తతంతువు - ప్రచురణ: ఎమ్. ఎస్. ఆర్. మూర్తిఅండ్ కో., విశాఖపట్టణము, 1959.

(త్యాగరాజు య. గా. కృతులు, మెలట్టూరు భాగవత మేళనాటకములు, నాటకకళ - ప్రపంచమున వివిధ ప్రదేశములలో తదుత్పత్తి వికాసములు మొ॥ నా వ్యాస సప్తకము సంపుటీకృతమైన గ్రంథమిది).

45 **The Kalaapam — Triveni**

Silver Jabilee Spl. November, 1955.

| | |
| --- | --- |
| 46. A Note on the Yaksha gana Mss in the Andhra Historical Research Society, Rajahmundry | Society's Journal, Vol. XXI, 1955. |
| 47 The Tyagavinoda Chitra Prabandha, the magnum opus of Sahaji, the Maratha Ruler of Tanjore. | Poona Orientalist Vol. XX Nos. 1 to 4 1955. |